# పరిశోధనవధూటి

రాజరాజనరేంద్రరాజాంకితమనుచు
        నన్నయ్య కృతిని నిర్ణయము చేసె
రంగనాథుడు కృతి వ్రాయలేదు ప్రసిద్ధి
        కల ప్రదర్శకుడని వెలికి తీసె
పండ్రెండు స్కంధాల భాగవతము **పోత**
        నయె వన్నెనని కారణములు వ్రాసె
నిగ్గు తేలని అష్టదిగ్గజకవులను
        భాషల కొలతతో వంచివేసె
ఏమి సత్యసృష్టి ! ఏమి విమర్శన
దృష్టి ! ఏమి వాక్యసృజనపుష్టి !
అన్ని పూర్వ చర్చ లటక కెక్కించెగా
తీర్చి **తెలుగు సాహితీచరిత్ర.**

ప్రాత పాతర త్రవ్వి బైటపెట్టి నిజమ్ము
        శాతవాహను లాంధ్రసంతతి యని
వెలివుచ్చె శ్రీనాథు భీమేశ్వరపురాణ
        మునకు మూలము వట్టి బూటకమని
తత్త్వసూక్ష్మము తెల్పె తరచి తరతరాలు
        యోగివేమన నాథయోగి యనుచు
శోధించి యనె నన్నెచోడకుమారసం
        భవకృతి నవ్య ప్రబంధమనుచు
విప్పి చిక్కుల చక్కగా చెప్పినట్టి
వున్న వెన్నియో అన్నియు నెన్న తరమె
సత్యసురభిళవీటి శాస్త్రగుణశాటి
**కొర్లపాటి** సంశోధనకులవధూటి

# తెలుగు సాహిత్యచరిత్ర

## పంచమభాగము



ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్
విశ్రాంతాచార్యులు, తెలుగు శాఖ
ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు.

రమణశ్రీ ప్రచురణ
విశాఖపట్టణము

ప్రథమముద్రణ:
బహుధాన్య , 1998
వేయి ప్రతులు
వెల రూ . 99/-



ప్రతులకు:
శ్రీమతి కె. వి. రమణ
6-13-2, చినవాల్తేరు
విశాఖపట్టణము - 530 017.





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-7-435 బేంక్ స్ట్రీట్
హైదరాబాదు - 500 001
మరియు అన్ని బ్రాంచీలు.

నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ్ మందిర్ ఎదుటి వీధి
కాచిగూడ × రోడ్స్
హైదరాబాదు - 500 027.

డి. టి. పి. :
సాయిసత్య కంప్యూటర్స్
రామ్‌నగర్
ఫోన్ నెం. 0891-61137
విశాఖపట్టణము - 530 003.

# అంకితము

శ్రీవిజ్ఞానవిభాసుభాషితశుభాశీర్వాదమోదమ్ముతో
శ్రీవాల్మీకివచోవిధేయరచనాశ్రేయోభిలాషమ్ముతో
నీవృన్నిశ్చలనీతికౌముదికళాస్నేహార్ద్రభావమ్ముతో
దైవానుగ్రహదత్తమైనయది మత్సాహిత్యచారిత్రమున్, ౧

అలఁతి వెలితిగా మూఁడుశతాబ్దులందు
వేల కొలఁదిగా వెలసిన వివిధకృతుల
మూఁడు వందల కావ్యముల్ మూదలించు
సరణి పంచమభాగము సద్గురునకు - ౨

ఆనందవనావాసికి
వానప్రస్థాశ్రమప్రవాసికి యోగ
ధ్యానపరాయణమౌనికి
జ్ఞానికి సమదర్శనాదిసద్గుణఖనికిన్ - ౩

ఇహపరసుఖకాంక్షాయుత
బహుదేశాగతజనసులభశరణ్యునకున్
మహదాశీర్వాదాను
గ్రహమాత్రకృతార్థశిష్యగణగణ్యునకున్ - ౪

ఏకాంతాధ్యాత్మికవా
ణీకేంద్రవిరాజమాననిగ్రహమతికిన్
**శ్రీ కందుకూరి**గృహసం
జ్ఞాక **శివానందమూర్తి**నామకయతికిన్ - ౫

# కృతిస్వీకర్త

## సద్గురు శ్రీ కందుకూరి శివానందమూర్తి

జననము : 21-12-1928. విభవనామసంవత్సరమార్గశిరశుద్ధనవమి.
జన్మస్థలము : రాజమహేంద్రవరము.
జననీజనకులు : సర్వమంగళాంబ (1900-1979) వీరబసవరాజు (21-3-1892-4-2-1996) యౌవనదశను జమీందారు, సంస్థానాధిపతి.

జీవితవిశేషములు : అసాధారణసంపన్నులైన, సంప్రదాయశైవులైన జమీందారుల యింట జననము. బాహ్యాడంబరము, భోగభాగ్యములు, దానధర్మాదులు కల బాల్యదశ. జ్ఞాతివైరముచేత నిత్యసంక్షోభము, విపత్తు. పదవయేట 1938 లో భగవాన్ శ్రీరమణుల దివ్యదర్శనము. ఆత్మానుభూతి. అంతర్యామిప్రబోధము. తదాది తాత్త్వికచింతనకు బీజావాపము.

విజయనగరము మహారాజకళాశాలలో 1949 లో పట్టభద్రత. వంశపారంపర్యముగా వచ్చిన సంపదలను వదలి, స్వతంత్రజీవనార్థము నైజాము రాష్ట్రమునందు సామాన్యోద్యోగస్వీకారము. 17-5-1951 వ తేదీని గంగాదేవితో వివాహము. ఇరువురు కుమారులు, ఇరువురు కుమార్తెలు సంతానము.

1972 నుండి 1980 వఱకు ఓరుగల్లులో యోగోపనిషత్తుల, భగవద్గీతాదిగ్రంథముల ప్రవచనము. 1982 లో ఐచ్ఛికముగ ఉద్యోగవిరమణ. 1984 లో సహధర్మచారిణి గంగాదేవి లోకాంతరప్రాప్తి. తదాది భీమునిపట్టణమునందు ఏకాంతవాసము, వానప్రస్థము. సంఘముతో తావన్మాత్రసంబంధము. బాల్యమునుండి అంతరంగమునందు మౌనసాధనము. వైదిక, తాత్త్విక, పురాణవాఙ్మయారాధనము. మంత్ర, యోగ, వాస్తుశాస్త్రములందు ప్రవేశము, అనుభవము.

అభిమానవిషయములు : సంగీతము, సాహిత్యము, ఇతరలలితకళలు, భారతదేశ చరిత్ర, ఉపనిషద్బోధన, యోగసాధన.

జీవనపథము : యోగము.

రచనలు : 1. శివానందలహరి (ఆంధ్రభూమిదినపత్రికలో ధారావాహికముగా 110 వారములు ప్రచురితమైన వ్యాసపరంపర.)

2. కఠోపనిషత్ప్రసంగములు. (పూర్వపక్షసిద్ధాంతాదిపూర్వ విధానమున గాక, యౌగికార్థమును ప్రతిపాదించిన ఉపన్యాసములు. ఇందు ప్రప్రథమముగా "కఠ"శబ్దము నిర్వచింపఁబడినది.)

# ఆశీస్సు

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధము నాటికి ఆంధ్రవాఙ్మయాన్ని గురించి కొంత పరిశోధన జరిగిన నేపథ్యంలో మొదటిసారిగా కందుకూరి వీరేశలింగం పంతులుగారు కవుల చరిత్రను వ్రాసి ప్రకటించారు. ఆ నాటికి ఇప్పుడు వలె ఇంతగా గ్రంథముద్రణాదులు, శాసనప్రమాణాల పరిశీలనాదులు జరుగలేదు. తాళపత్రప్రతులు పరిశీలించి, మాతృకలకు ప్రతికలు వ్రాయించి, అప్పటికి దొరికిన సాధనకలాపాలతో పంతులుగారు కవుల చరిత్రను రచించారు. తరువాతికాలంలో గత 60-70 సంవత్సరాల కాలంలో అనేకమంది కవులూ పండితులూ తెలుగు సాహిత్యచరిత్రను రచించారు. వంగూరి సుబ్బారావుగారు, కల్లూరి వేంకట నారాయణరావుగారు (కవిత్వవేది), పింగళి లక్ష్మీకాంతముగారు, ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఇంకా అనేకులు ఆంధ్రవాఙ్మయచరిత్రలు రచించారు. కృతికర్తృత్వాదుల గురించీ, కవికాలాదుల గురించీ పండితుల మధ్య అనేక అభిప్రాయభేదాలున్నాయి. అయితే రోజురోజుకీ అత్యంతవేగంగా, సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతున్న చారిత్రక, సారస్వతరంగాల్లోని పరిశోధనల ద్వారా నిత్యం నూతన చారిత్రకాంశాలు, శాసనాధారాలు వెల్లడి అవుతున్నవి. ఈ నేపథ్యంలో నూతనంగా మరల సాహిత్యచరిత్ర వ్రాయవలసిన ఆవశ్యకత ఎదురవుతూనే ఉన్నది. కాబట్టి పూర్వ రచయితలు కృషి చేసి పరిశోధించి వ్రాసిన అంశాలలోనూ మార్పులూ వివరణలూ చోటు చేసుకుంటున్నాయి. సాహిత్యచరిత్ర అనగానే కవి కాలాదులు, కృతుల పౌర్వాపర్యం, వాటి విశిష్టత, శైలీరీతుల సమీక్ష, ఛందోవ్యాకరణవివరణ, యుగసమన్వయము మొదలైన ఎన్నో విషయాలు వివరించవలసి ఉంటుంది. ప్రాఙ్నన్నయయుగం నుండి నేటి ఆధునికయుగం వరకూ వెలువడిన సాహిత్యపరమైన గ్రంథాలనూ, నూతనచారిత్రకాంశాలనూ, శాసనప్రమాణా లనూ, తెలుగు వాఙ్మయరంగంలో నేటివరకూ జరిగిన చర్చలనూ నిశితంగా పరిశీలించి, ఇంచుమించు పాతికసంవత్సరముల అనుభవమూ కృషీ పెట్టుబడిగా స్నాతకోత్తరతరగతి స్థాయిలో తెలుగుసాహిత్యచరిత్రను రచించి ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తిగారు ఆంధ్రపాఠకలోకానికి మహోపకారం చేశారు. సమగ్రమైన పరిశీలన అనంతరం సాగిన రచన కావడం వలన, ఈ తెలుగుసాహిత్యచరిత్ర ఆధికారికమూ, సప్రమాణికమూ అయిందనడంలో ఎట్టి సందేహం కానీ, అతిశయోక్తి కానీ లేవు. శ్రీ శ్రీరామమూర్తిగారు సాహిత్యచరిత్రను విభజించడంలో పింగళివారి అభిప్రాయంతో ఏకీభవిస్తూ మహాకవుల పరంగానే యుగవిభజన కావించి, మహాకవుల కాలనిర్ణయాదులు, కవుల ప్రాశస్త్యం, కృతుల సమీక్ష కూలంకషవిషయవివరణములతో ఉచితరీతిని గ్రంథరచన కావించారు. విమర్శకులు, పండితులు కవికాలాదుల గురించి చేసిన నిర్ణయాలు, కృతులు పౌర్వాపర్యం గురించి, పరిశోధన గావించిన పిమ్మటనే వీరు గ్రంథరచనకు పూనుకున్నారని సవిమర్శక మైన వారి సమీక్షనుబట్టి, సప్రమాణనిరూపణ

మునుబట్టి అవగతమవుతుంది. సాధికారికమూ, సప్రమాణీకమూ అయిన శ్రీ శ్రీరామమూర్తిగారి సాహిత్యచరిత్ర సమగ్ర రచన కాబోవడంచేత, ఇకపై తెలుగులో సాహిత్యచరిత్రలు వెలువడవలసిన అవసరం ఉండకపోవచ్చునని నా నమ్మిక.

ఆచార్య శ్రీరామమూర్తిగారి ప్రతిభావ్యుత్పత్తులు కడు ప్రశంసనీయం. సందర్భానుసారంగా, వ్యాకరణవిశేషాలను వివరిస్తూ, అర్థాన్ని విడమరిచి చెపుతూ, పాఠకులకు కవిహృదయం బోధపడేలాగున గంభీరమైన శైలిలో వీరి రచన సాగింది. వీరి తెలుగుసాహిత్యచరిత్ర విద్యార్థులకూ, కవిపండితులకూ మాత్రమేగాక, సామాన్యపాఠకులకు కూడా ఆసక్తిని కలిగించి విజ్ఞానాన్ని ప్రసాదించగలిగిన ప్రసాద గుణాన్ని నిండుగా కలిగిఉంది.

ఇట్టి విశిష్టరచన చేసిన శ్రీ శ్రీరామమూర్తిగారికి ఈశ్వరుడు ఆయుర్భాగ్యములు అనుగ్రహించి, కర్మయోగపుష్టి కలిగిన దశాబ్దులను ప్రసాదించును గాక!

-కందుకూరి శివానందమూర్తి
ఆనందవనం
భీముని పట్టణం
విశాఖ జిల్లా

# అభినందన

ఈ తెలుగుసాహిత్యచరిత్రలో ప్రతియుగానికీ అవసరమైనంత చారిత్రభూమిక కాలక్రమాన్ని అనుసరించి ఆ యా కవులు చరిత్రలు, వారి కృతుల పౌర్వాపర్యం, వాటి సమీక్ష, వాటి వైశిష్ట్యం, మూల్యాంకనం, మహాకవుల ఆత్మీయత, యుగసమన్వయం మొదలైన అంశాలు చాలా సమగ్రంగా సాకల్యంగా నిర్దుష్టంగా నిష్పక్షపాతంగా ఉన్నవి. . . . . .

ఈ సాహిత్యచరిత్ర ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 25 ఏండ్ల అధ్యయన అధ్యాపన పరిశోధనల ఫలం. సర్వజనాస్వాదనీయంగా ఇది వెలువడటానికి ఆయన సమగ్రదర్శనం, సరియైన మూల్యాంకనం, సహృదయకావ్యవిమర్శ, దురభిమానరాహిత్యం కారణాలు. ఇది ముఖ్యంగా స్నాతకోత్తరవిద్యార్థులను దృష్టిలో పెట్టుకొని రచించిన సాహిత్య చరిత్రం. సర్వీసుకమిషన్ పోటీ పరీక్షలు వ్రాసేవారికి కొంగుబంగారం. సాహిత్యచరిత్ర జిజ్ఞాసువులకు పరమోపాదేయమైన గ్రంథం. విద్యార్థులు కాని ఇతరజిజ్ఞాసువులకు ఇతోధిక సాహిత్యాధ్యయనానికీ పరిశోధనకూ దోహదం చేసే రచన యిది . . . . . .

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి శైలి చాలా విశిష్టమైనది. ఆయన గొప్ప పరిశోధకుడే కాదు. గొప్ప రచయిత. పరిశోధన మెంతో పాండిత్యమంత. పాండిత్య మెంతో సృజనాత్మకత అంత. ఆయన అనేక కథలు, నవలలు, నాటకాలు, ఖండకావ్యాలు రచించి తెలుగు సరస్వతిని అలంకరించినారు. సృజనాత్మకశక్తి కలవారు పరిశోధనరంగం లోనికి దిగితే, వారి పరిశోధనలకు కూడా సాహిత్యపువిలువ సమకూరుతుంది. సిద్ధాంత గ్రంథాలు కూడా సాహిత్యశైలిని సంతరించుకుంటాయి . . . . . . కొర్లపాటి వారి పరిశోధనకు, విమర్శకు సృజనాత్మకశైలి అలవడింది. ఈ తెలుగుసాహిత్యచరిత్ర సమతలంలో గంభీరంగా పారే గంగానదీసదృశమైన గంభీరశైలిని సంతరించుకున్నది. . . . .

ఇంత గొప్ప తెలుగుసాహిత్యచరిత్ర తెలుగు సరస్వతికి కైసేసిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారిని అగ్గిస్తూ అభినందనచందనం అందిస్తున్నాను.

-ఆచార్య బి.రామరాజు<br>
జాతీయపరిశోధనాచార్యులు<br>
హైదరాబాదు

# ప్రతిస్పందన

సలక్షణమైన భాషలో విలక్షణంగా సంతరించబడిన ఉద్గ్రంథం తెలుగుసాహిత్య చరిత్ర. స్నాతకోత్తరతరగతి విద్యార్థుల్ని ఉద్దేశించి వ్రాయబడినా, సాహిత్యజిజ్ఞాసువులందరికీ ఉపాదేయం ఈ చరిత్రం. కథలూ కాకరకాయలుగా కాక ప్రమాణసహితంగా నేడు సాహిత్యాధ్యయనం చేసే విద్యార్థులే రేపు ఉత్తమబోధకులు కాగలుగుతారు. కనుక పాఠప్రవచన, పరిశోధనానుభవాల ఫలంగా వెలసిన యీ రచన తెలుగువారికి ప్రామాణికమైన సాహిత్యచరిత్రగ్రంథం లేదనే అభిప్రాయాన్ని పరాస్తం చేసి పుణ్యం మూట కట్టుకుంది. ఈ ప్రతిష్ఠ మిత్రులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి దక్కడం ముదావహం.

చారిత్రకవిశేషాలు శాసనాధారాలూ కొత్తవి లభ్యమవుతున్న యీనాళ్లలో సాహిత్యచరిత్రనిర్మాణం అనుకున్నంత సులభం కాదనడం నిర్వివాదం. వాటికే తప్ప స్వాభిప్రాయ ప్రకటనకో ఊహలకో పెద్దపీట వేయడం అభిలషణీయం కాదు. చారిత్రికాధారం, శాసనప్రమాణం, ఆంతరంగికసాక్ష్యం ముప్పిరి గొన్న యీ రచన విశ్వసనీయతను సంతరించుకోవడంలో ఆశ్చర్యం లేదు. ఏది చెప్పినా సందేహానికి తావు లేకుండా చెప్పడం కొర్లపాటి వారి స్వభావం. దానికి పరిశోధనాపాటవం తోడు కావడం పసిడికి పరిమళం అబ్బినట్టే అవుతుంది.

సందర్భానుసారంగా వ్యాకరణవిశేషాలను కూడా తెలపడం కొర్లపాటివారి పాఠప్రవచనానుభవఫలితమని భావిస్తున్నాను. అర్థవివరణ కూడా కొన్ని చోట్ల చేశారు . . . . కవిహృదయాన్ని అర్థం చేసుకోవడానికి అర్థగ్రహణం చాలా అవసరం . . . . .

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తలపెట్టిన యీ బృహత్కార్యం అందరినీ అలరించగలదనే నా నమ్మకం.

-ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ
విశ్రాంతాచార్యులు
మదురై

# భూమిక

పవనాందోళితనారికేళకదళీపత్రావళీనృత్యకో
నవనాంతవ్యవసాయజీవనవిధానప్రాప్తి చెట్టెక్కి, స
త్కవనోద్దీపితనారికేళకదళీద్రాక్షాపరీపాకవ
ర్ణవితానవ్యవసాయజీవనవిధానధ్యాస సంప్రాప్తమై. ౧

వరగురువాక్సుధారసము వాకలు కట్ట నిసర్గలాలసాం
కురమును ప్రోది చేసి నునుక్రొంజిగురా కిడ పాదుకొల్పి పం
దిరిపయి నిల్పుకొంటి మది తీవలు సాగిన సాహితీలతన్
పరిణతపత్రపుష్పఫలభారగభీరసముజ్జ్వలాకృతిన్ ౨

కన్నుల నిప్పులైన వడగాల్పుల ధాటికి వాడకుండఁగా
వన్నెల చిన్నెలైన జడివానల దాడికి వీడకుండఁగా
మిన్నుల మ్రోఁతలైన మిడిమేలపు పిడ్గుల మాడకుండఁగా
సన్నుతసాహితీలత వసంతవికాసము చెందు నిత్యమున్ ౩

ప్రాకృతసంస్కృతాదిబహుభాషల భానుమయూఖమాలికల్
సాకిన్నైన యీ తెలుఁగు శారద శారదచంద్రచంద్రికల్
వాకున కందరాని వగు స్వాదురసామృతపూరసారశ
య్యాకమనీయముల్ సహృదయప్రకరానుభవైకవేద్యముల్ ౪

సాహిత్యార్ణవమంథనోత్థచరితాంశస్వచ్ఛకావ్యామృత
గ్రాహిగ్రంథము వాంఛనీయమని పూర్వగ్రంథసంధానముల్
సాహాయ్యమ్ముగ నూతనాంశముల తోడన్ తథ్యమిథ్యావివ
క్షాహృద్యమ్ముగ సంఘటింతును యథాశక్తిన్ తదాసక్తినై ౫

# స్వగతము

సరిగా పాతిక సంవ
త్సరములు ఏం.ఏ కు తెలుఁగు సాహిత్యచరి
త్ర రమణ పాఠము చెప్పిన
పరిపాటిమెయిన్ రచింతు పరమార్థముగా. ౧

ఆంధ్రవిశ్వకళాసంసదాంధ్రశాఖ
శిష్యమిత్రసహవ్రతుల్ చేసినట్టి
మామకపదవీవిరమణామంత్రణసభ
వ్రాసెదననిన ప్రకటన వాస్తవముగ. ౨

విశ్వవిద్యాలయసహాయవిత్తసంఘ
మున్నతతమవిద్యార్హత, ఉజ్జ్వలపరి
శోధనము, ప్రచురణములు చూచి యిడిన
సార్థగౌరవపదవియు సార్థకముగ. ౩

సంగ్రహములు సర్వస్వముల్ సకలవిషయ
కలితసిద్ధాంతగ్రంథముల్ కలవుగాని
స్నాతకోత్తరతరగతిస్థాయి పాఠ్య
గ్రంథమగు చరిత్రము లేని కారణమున ౪

సహజము ప్రమాదపతితము
ప్రహసనసదృశము ప్రమాణరహిత ముపేక్షా
సహము కువిమర్శ కావున
సహృదయసముచితసమీక్ష సాపేక్షముగా. ౫

# పీఠిక

తెలుగు స్నాతకోత్తరతరగతి పాఠ్యప్రణాళికను తెలుగు సాహిత్యచరిత్ర విధాయకాంశము. అది ప్రాఙ్నన్నయయుగము మొదలు రాయలయుగము కడవఱకు ప్రేమపాత్రము. క్షీణదక్షిణాంధ్రయుగములు నామమాత్రము. అందు దక్షిణాంధ్రయుగము కాదాచిత్కముగనైన ప్రత్యేకాంశమైనది. కడమ క్షీణయుగము నిర్లక్ష్యాంశమైనది. సాహిత్యచరిత్రగ్రంథములందును అంతే. కారణము ముద్రిత గ్రంథముల దర్శనభాగ్యము కష్టము. అముద్రితగ్రంథముల ముద్రణభాగ్యము అదృష్టము.

పదునేడు, పదునెనిమిది, 1875 వఱకు పందొమ్మిది శతాబ్దులందు తెలుగు కవిత్వము క్షీణించినదను అభిప్రాయము 1925వ సంవత్సరము నాటికే కలదు. అయినను క్షీణయుగము కాదను ప్రత్యభిప్రాయము 1960వ సంవత్సరము నాటికే కలదు. కాని ఈ యుగమునందు కవుల ప్రతిభ నిద్రాణమైనది. భావనాశక్తి దరిద్రాణమైనది. అనుకరణమే అభ్యస్తవిద్య అయినది. అంతేకాదు. శబ్దజాలముల ఇంద్రజాలములు, శ్లేషాలంకారముల ఆశ్లేషాహంకారములు, చిత్రకవితల చిత్రవిచిత్ర గతులు, బంధకవిత్వముల దిగ్బంధనములు, గర్భకవిత్వముల దర్భముళ్లు, అచ్చ తెనుగు గచ్చపొదలు పెచ్చుపెరిగినవి. శృంగారము శ్రుతి మించినది. పారదారిక శృంగారము పారాయణమైనది. అశ్లీలము, అసభ్యత, అనౌచిత్యము అందలమెక్కినవి. వర్ణనలు అతివేలము లయినవి. ప్రభుభక్తిపరాయణత, ప్రభుదాస్యపరకాష్ఠదశ ప్రబలమైనవి. జగద్ధితము జర్జరితమైనది. ఏవంవిధమైన యుగము క్షీణయుగముకాక, పూర్ణయుగము కాఁజాలదు. బహుళపక్షమునందు వెన్నెల వెలసినను, అది బహుళపక్షమే.

క్షీణయుగమునందు కవుల, కృతుల సంఖ్యాబలము సమృద్ధిప్రాయము. స్థాయిఫలము సకృన్మాత్రము. ఇందు రెండువందల నలుబది మంది కవుల విషయము కలదు. అందు సుమారు నూటడెబ్బది ముద్రితకావ్యముల సమీక్ష కలదు. కతిపయముద్రితకావ్యములు దుర్లభములు. సుమారు నూట పాతిక అముద్రిత కావ్యముల ప్రసక్తి కలదు. ఇంకను అముద్రితకావ్యములు-సమగ్రములు, అసమగ్ర ములు-ఇతోధికముగ కలవు. అవి క్రిమికీటకదష్టములు కాకుండ పరిశోధకమృష్టములగుట అభిలషణీయము. ఇందలి కవులు ప్రాధాన్యవివక్షను పద్యగద్యోభయ కావ్యకర్తలు. ఇతరప్రక్రియాకర్తలైన కవులు ఇతోధికముగ కలరు. ముద్రితాముద్రితములైన ద్విపదకావ్యములు, శతకములు, దండకములు, వచనములు, తత్త్వములు, వీరగాథలు, యక్షగానములు, జానపదగేయములు మొదలైనవి పరశ్శతములుగ కలవు. వానికి ప్రక్రియాపరముగ ప్రత్యేకచరిత్రగ్రంథములు కలవు.

లక్షణగ్రంథములందు, సంకలనగ్రంథములందు కతిపయపద్యములు మాత్రమే ఉదాహృతములై, ఉపలబ్ధములు కాని కృతులును కలవు. వానికిని ప్రత్యేక గ్రంథములు కలవు. పునరుద్ధరణము పూరణమాత్రప్రయోజని.

"అనుక్త మన్యతో గ్రాహ్యమ్"

అడిగిన పుస్తకములు అందిచ్చిన కళాప్రపూర్ణ డాక్టర్ గణపతిరాజు అచ్యుత రామరాజు, ఆచార్య దేవళ్ల చిన్ని కృష్ణయ్య, ఆచార్య కె. సర్వోత్తమరావు, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి, డాక్టర్ యం. జయదేవ్, డాక్టర్ పర్వతనేని సుబ్బారావు, డాక్టర్ సజ్జా మోహనరావు, డాక్టర్ రాపాక రామసత్యనారాయణ, డాక్టర్ బి.వి. రమణమూర్తి, డాక్టర్ కాళిదాసు పురుషోత్తము, డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ, డాక్టర్ ఎ.శంకరరెడ్డి, డాక్టర్ వెలుదండ నిత్యానందరావు, డాక్టర్ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి, శ్రీ కపిలవాయి లింగమూర్తి, శ్రీ జెన్నాభట్ల వీరేశ్వరశాస్త్రి, శ్రీయస్. మల్లేశ్వరరావు, శ్రీ టి. మురళీకృష్ణ, శ్రీ చలసాని ప్రసాద్, చి॥ టి. గోవిందనాయుడు ప్రభృతులకు --

అరుదైన పుస్తకములు అందఁజేసిన ఆంధ్రవిశ్వకళాపరిషత్-తెలుగుశాఖ గ్రంథాలయము, వాల్తేరు; ఆంధ్రా యూనివర్సిటీ లైబ్రరీ, విశాఖ; శారదా గ్రంథాలయము, అనకాపల్లి; గౌతమీగ్రంథాలయము, రాజమహేంద్రవరము; జిల్లా ఉపగ్రంథా లయము, ఆలమూరు (తూ.గో.జి); శ్రీ వీరేశలింగకవిసమాజ గ్రంథాలయము, కుముదవల్లి (ప.గో.జి); స్వామి అయ్యప్ప సంస్కృతగ్రంథాలయము, గుంటూరు; సారస్వతనికేతనము, వేటపాలెము; ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము, మద్రాసు మొదలైన గ్రంథాలయముల నిర్వాహకులకు --

ముద్రణదోషములు సవరించిన ఆచార్య కోలవెన్ను మలయవాసిని, డాక్టర్ సజ్జా మోహనరావులకు --

ఈ భాగము వెలుగు చూచుటకు అనేక విధముల సహకరించిన శ్రీ చెఱువు ఆంజనేయులు గారికి--

కృతజ్ఞతలు

- ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

# విషయసూచిక

## కృతజ్ఞతలు

ఆర్థికసహకారమును అందఁజేసిన
శ్రీ సద్గురు కందుకూరి శివానందమూర్తి, శ్రీ పి.వి. రమణయ్య రాజా,
శ్రీ యం.వి.వి.యస్. మూర్తి, శ్రీ యం.వి. జగన్నాథము మహోదయులకు

# క్షీణయుగము

## చారిత్రికనైపథ్యము

విజయనగరసామ్రాజ్యము విశీర్ణమేఖల అయినది. రెండవ వేంకటపతి దేవరాయల రాజ్యకాలమునందు (1586-1614) రాయలసీమ అంతర్యుద్ధ రంగస్థలము[1]. తీరాంధ్ర దేశము గోలకొండ సుల్తానుల అధీనము. పాశ్చాత్యుల తాకిడి ఏర్పడినది. రెండవ శ్రీరంగదేవరాయల రాజ్యకాలమునందును(1614-19) అంతర్యుద్ధమే[2]. తోపూరు యుద్ధము (1616) ప్రసిద్ధము. రామదేవరాయల రాజ్యకాలమునందు (1619-30) అంతర్యుద్ధమేగాక, బాహిరమైన యుద్ధము కలదు[3]. పశ్చిమాంధ్రదేశము బీజపూరు సుల్తాను అధీనమైనది. మూడవ వేంకటపతిదేవరాయల రాజ్యకాలమునందును (1630-42) అంతర్యుద్ధము[4]. మూడవ శ్రీరంగదేవరాయల రాజ్యకాలము నందు (1642-72/78?) అంతర్యుద్ధముతోపాటు బాహిరమైన యుద్ధము కలదు[5]. తమిళదేశము బీజపూరు సుల్తానుకు, తెలుగుదేశము గోలకొండ సుల్తానుకు అధీనమైనవి. విజయనగర సామ్రాజ్యము విధ్వస్తము.

గోలకొండ సుల్తానులలో ఇబ్రహీము ఉరపు మల్కిభరాముడు (1550-80) తర్వాత మహమ్మద్ కులీకుల్బ్షా రాజ్యకాలమునందు (1580-1612), సుల్తాను మహమ్మద్ కుల్బ్షా రాజ్యకాలమునందు (1612-1616) గోలకొండ రాజ్యము శాంతి సంపదలకు నెలవు[6]. అబ్దుల్లా కుల్బ్షా రాజ్యకాలమునందు (1626-72) గోలకొండ రాజ్యము పతనోన్ముఖమైనది[7]. అబుల్ హసన్ కుల్బ్షా రాజ్యకాలమునందు (1672-82) పతనమైనది[8]. గోలకొండరాజ్యము 1687 వ సంవత్సరమునందు మొగలాయీ సామ్రాజ్యమునందు విలీనము.

మొగలాయీ చక్రవర్తి ఔరంగజేబు. అతని రాజ్యకాలమునందే ఆంధ్రదేశములోని సామంతరాజ్యములు సన్నగిల్లినవి. సంస్థానములు బలపడినవి. పాశ్చాత్యుల ప్రమేయము ప్రారంభమైనది.

ఆంధ్రసంస్థానములందు పెద్దాపురము, జటప్రోలు, పుంగనూరు, విజయ నగరము, వేంకటగిరి, గద్వాల, బోరవెల్లి, దోమకొండ, కార్వేటినగరము, పిఠాపురము, ఆనెగొంది, బొబ్బిలి, కాళహస్తి, చల్లపల్లి, గోడే, నరసరావుపేట, కురుపాము, ఆత్మకూరు, నూజివీడు, పాలకొండ, సురపురము, అమరావతి, వనపర్తి, రాచూరు, ముక్త్యాల, మేరంగి, సాలూరు, వల్లూరు, సంగమవలస, బనగానపల్లి, మొదలైనవి ముఖ్యసంస్థానములు[9].

1724 వ సంవత్సరమునందు నిజాంరాజ్యము నెలకొన్నది[10]. 1754 వ సంవత్స రమునందు శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, ఏలూరు, కొండపల్లి -ఉత్తరసర్కారులు- ఫ్రెంచివారి సొంత జాగీరులయినవి[11]. అవి 1758 వ సంవత్సరము నందు ఇంగ్లీషువారి అధీనములైనవి[12]. 1781 వ సంవత్సరమునందు నెల్లూరు జిల్లా కూడ అధీనమైనది[13]. 1788 వ సంత్సరమునందు గుంటూరు సర్కారు అధీనమైనది[14]. 1800 వ సంవత్సరము

నందు తెలంగాణము విధేయమైనది. రాయలసీమ దత్తమైనది[15]. పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమునకు యావదాంధ్రము పరాధీనము.

ఈ కాలమునందు (1601- 1875) తెలుగు సాహిత్యమునకు సామ్రాజ్యాధిపతుల సమాదరము సకృన్మాత్రము- సామంతరాజ్యాధిపతుల సహకారము కించిన్మాత్రము. సంస్థానాధిపతుల సమారాధనము సమృద్ధిప్రాయము- పాశ్చాత్యుల వాఙ్మయకృషి ప్రత్యేకవిశేషము. మొత్తము మీద కవుల సంఖ్య పెరిగినది. కవిత స్థాయి తరిగినది. అనుకరణము అలంకరణమైనది. అది క్షీణలక్షణము. అందువలన ఇది క్షీణయుగము.

# మట్లి అనంతభూపాలుడు

ఇతని కృతి కకుత్స్థవిజయము. తండ్రి ఎల్లమరాజునకు అంకితము. అంకిత సందర్భమునందు ఎల్లమరాజు నిండు పేరోలగమున్నవాడు. (7వచ. 1ఆ.) ఆ కాలము నందు అనంతభూపాలుని కుమారుడు తిరువేంగళభూనాథుడు మాత్రమే గాక,ఆతని జ్యేష్ఠుడుకుమారానంతభూపాలుడు దయాశౌర్యదానసత్యవిభవసంగీతసాహిత్యవిలసితు నిగ (28ప. 1ఆ.), కనిష్ఠుడు ఎల్లరాజు శత్రుభయంకరునిగ (29ప. 1ఆ.) కలరు. ఇది పేరోలగ మున్న తండ్రి, కొడుకు, మనుమడు, ప్రయోజకులైన మునిమనుమలు నాలుగు తరముల అరుదైన సంపుటి. ఎల్లమరాజు సిద్దవటసీమ సామంతరాజు. అనంతభూపాలుని శాసనము కలదు[16]. అది సిద్దవటశాసనము. కాలము 1606 వ సంవత్సరము. అందు మట్లి అనంతభూపాలుడు "విబుధస్తుతకకుత్స్థవిజయప్రబంధాదికావ్యనిబంధన" గ్రంథకర్త అని కలదు. కకుత్స్థవిజయము రచనాకాలము తత్పూర్వమగుట తథ్యము. కాబట్టి కకుత్స్థవిజయము రచనాకాలము 1601 ప్రాంతము కావచ్చును.

ఇది పేరునకు కకుత్స్థవిజయము తీరునకు ఇక్ష్వాకు, వికుక్షి, కకుత్స్థవిజయ త్రయము. అయిదాశ్వాసముల కావ్యమునందు మొదటి మూడు ఆశ్వాసములును ఇక్ష్వాకు విజయము. చతుర్థాశ్వాసము వికుక్షివిజయము. పంచమాశ్వాసము కకుత్స్థవిజయము. మనువంశీయులైన ఇక్ష్వాకు, వికుక్షి, కకుత్స్థుల విజయములకు, మట్లి వంశీయులైన ఎల్లమ, అనంత, తిరువేంగళరాజుల విజయములు కారణములు ప్రేరణములు కావచ్చును. ఇక్ష్వాకువిజయమునకు మూలము మృగ్యము. వికుక్షివృత్తాంతము విష్ణు, భాగవతపురాణములందు కలదుగాని, ఇది తద్భిన్నము. తన్మూలము మృగ్యము. కకుత్స్థవిజయమునకు మూలము విష్ణు,భాగవతపురాణములలోని కకుత్స్థవిజయమే.

ఇక్ష్వాకువిజయమునందు విలక్షణమైన విషయము కలదు. నారదుడు ఇక్ష్వాకునికి లోకవార్తల తోపాటు బ్రహ్మ తపస్సు చేసి, ప్రత్యక్షమైన రంగధాముని ఇలవేల్పుగ పూజించుచనని చెప్పును. పరమభాగవతుడైన ఇక్ష్వాకువు "ఎచట దపమాచరింతు నే నెపుడు గాంతు బద్మజాడు గన్న నిధిని" అని ప్రశ్నించును. నారదుని సఖుడైన పర్వతుడు బదరీవనమునందు తపస్సు చేసిన, "కోరిక కోటిగుణితమై ఫలించు"నని చెప్పును. ఇక్ష్వాకువు బదరీవనమునందు తపస్సు చేయును. రంగధాముడు ప్రత్యక్షమగును. ఇక్ష్వాకుడు రంగపతిని పూజించి, మౌళిపై ధరించి, తీసికొనివచ్చి, విశ్వకర్మచేత అయోధ్యలో దేవాలయము కట్టించును.

ఇది పురాణప్రసిద్ధము కాదు. సరికదా చరిత్రవిరుద్ధము. శ్రీరంగక్షేత్రదైవమైన రంగపతి బ్రహ్మ ఇలవేల్పునుట, వైవస్వతమనువు పుత్రుడైన ఇక్ష్వాకువు అయోధ్యలో రంగనాథాలయము కట్టించెననుట అభూతకల్పనలు. ఇక్ష్వాకువు కాలమునందేకాదు; శ్రీరాముని కాలమునందును అయోధ్యలో ఆలయము లేదు. ఇందుకు వాల్మీకి రామాయణములోని అయోధ్యావర్ణనమే పరమనిదర్శనము. అందు వధూనాటకశాల ప్రసక్తి కలదుగాని, దేవాలయప్రసక్తి లేదు. మట్లి అనంతరాజు ఇక్ష్వాకువంశీయుడు (34ప. 1ఆ.) "నారాయణచరణవలిననమ్రనిటాలుడు" (228ప. 1ఆ.) "తిరుమలతోలప్పా

చార్యచరణతోయజసేవాలోలుడు." (196ప. 5ఆ.) అతడు సిద్ధవటసీమయందు రంగనాథాలయము కట్టించుట సంభవము. అది ఇక్ష్వాకుపరముగ ఆపాదితమగుట సంభావ్యము.

ఎల్లమరాజా, అనంతరాజా కలిసి యుద్ధము చేసినట్లు, ఇక్ష్వాకువు, సుకుమారు డనబడిన వికుక్షి కలిసి యుద్ధము చేసినట్లు కకుత్స్థవిజయమునందు కలదు.

"జనకుండు దుమికి కచునిఁ గీటడంచినఁ
    దనయుండు పృథురోము తల యదల్చె
గురుడు భేకగ్రీవు కుత్తుక దునిమిన
    సుతుఁడు రోహితుని జీవితముఁ గొనియెఁ
దండ్రి యధ్వరవిఘాతకు బారి సమరినఁ
    గొడుకు శంఖనఖాఖ్యుఁ గోలు మసఁగె
నయ్య రాజీవబాహాసురుఁ బొలిఁగొన్న
    బిడ్డండు కునఖునిఁ బిలుకు మార్చె
దివిజరాజాది దిక్పాలదేవతాక
విశిఖముల నిట్లు దైతేయవిశసనంబు
సలిపి రిక్ష్వాకు సుకుమారు లలయ కెలమిఁ
గొంతవడి వంతువడి మరుత్కోటి వొగడ." 119 ప. 2 ఆ.

కర్పూరతిలక ఇక్ష్వాకునకు తపోభంగము కలిగింపలేక, జన్మాంతరమునందైనను అతనికి మోహపుదేవి కాఁగోరి కణ్వమహర్షిని ఆశ్రయించును. అది నాటకమని కణ్వమహర్షి కర్పూరతిలకను "అవనిఁ బుట్టుమని శపిం"చును. శాపము వరముగా కర్పూరతిలక కర్పూరతరువాటికను పుట్టును. ఆమె విరహమును నారదుడు ఇక్ష్వాకునికి వివరించి, వివాహమాడుట ఉచితమని చెప్పును. ఇక్ష్వాకువు జ్యేష్ఠపుత్త్రుడు వికుక్షి తల్లి అనుజ్ఞను వివాహ మాడును. ఇది కూడ కల్పితమే. ఎల్లమరాజానకు నలుగురు భార్యలు. నలుగురు కొడుకులు. జ్యేష్ఠుని తల్లి అనుజ్ఞను ఒకరిని వివాహమాడుట నిమిత్తము కావచ్చును.

కర్పూరతిలక విరహావర్ణనము కట్టలు త్రెంచుకొనలేదు. కాని నారదుడు వివరించుట పాత్రోచితము కాదు. కర్పూరతిలకేక్ష్వాకువుల సంభోగశృంగారమును శ్రుతి మించలేదు. ఒక్క సీసపద్యమునందు కలదు.

"అధరాధరామృతం బాస్వాదనము సేయు
    మోహమందఁగఁజేసి ముద్దుఁబెట్టు
దరహాస మాననాంబురుహసీమ ఘటించు
    మునిపంట నొయ్యన మోవి నొక్కు
నెడనెడఁ గీల్గంటు సడలిన ముడి గొల్పుఁ
    జేలాంచలంబునఁ జెమరు తుడుచు
నసదు లేఁబల్కులఁ గొసరి పేరునఁ బిల్పుఁ
    గనుదోయి సౌఖ్యసంక్రమముఁ దేల్పు
గబ్బి గుబ్బల నెద నాటఁ గౌఁగిలించుఁ
బారువములకు గళరవాభ్యాస మొసఁగుఁ
జేరి కొనగోట మక్కువఁ జెక్కు నొక్కు

యువతిసురతంబుఁ జల్పు నయ్యుత్పలాక్షి." 18ప. 4ఆ.

ఇక్ష్వాకువు, వికుక్షి గగనకాసారరాక్షసుని; కకుత్స్థుడు మృగరూపరాక్షసులను, దీపధ్వజుని సంహరించుట విజయవృత్తాంతములు.

అనంతరాజా కవిత్వమునందు ఉక్తివైచిత్రి ఉజ్జ్వలము.

"అతఁడు తపంబుసేయఁగ భయంపడి యింద్రుఁడు దివ్యభామలం
బ్రతిమధుమాసముం బనుచుఁ బంచిన వా రరుదెంచి తత్తప:
ప్రతిభకు దృష్టిదోషములు వాయఁగఁ గమ్మని లేఁతనవ్వులుం
బతురకటాక్షచంద్రికలుఁ జల్లుదు రింతియ మాటిమాటికిన్." 165ప. 1ఆ.)

సోముని వెన్నెల తోపులు
నాముని క్రొవ్విరులుఁ బూజ లటులైయుండెం
గాముని పస లా ముని దెస
భూమిని హరిభక్తు లఖిల పూజ్యులు కారే." 183ప. 1ఆ.

"ఒక రథాంగంబు కొంచక చంచుపుటి నొక్క
పూబోడి వలిగుబ్బవాడిచి పోయె
నొక బేడస వికస్వరోల్లసగతి నొక్క
కలికి కన్నుల వెంట బెళుకు మనియె
నొక కచ్ఛపకిశోర మొరసి టెక్కుల నొక్క
తొయ్యలి మీఁగాలు ద్రొక్కి పోయె
నొక మిండతుమ్మెద యురికి యుక్కున నొక్క
తరుణి ధమ్మిల్లంబు తన్ని పోయె
పోవు గాకేమి యీసుల పొంతఁ బోక
యెఱల నేమేమి పుట్టునో మఱియు ననక
విభులఁ బురికొల్పుదురు కాని వెడలరైరి
మెలఁత లౌరౌర జలకేళి మీఁది బాళి." 89ప. 2ఆ.

ఇందు జలక్రీడలాడు అప్సరసల సౌందర్యము వ్యజ్యమానము.

సహజత్వముట్టిపడు రచనమును సముజ్జ్వలము-

"శిరసున నొక చాయ జిలుగు రుమాలులో
జీరణం బొక చెంపఁ జిక్కఁ జెక్కి
చికిలి నిగ్గులు చిమ్ము చిన్నారి క్రొవ్వాడి
చేబాడిద భుజాగ్రసీమఁ జేర్చి
పసిఁడి కట్టులఁ బొల్పు పవడంపుఁబిడితోడి
యులి దట్టి పొర వెంట మొల నమర్చి
పదను దప్పక లోహపాషాణములఁ బట్టు
చిత్రికపల్లు డాచేతఁబూని
నిగనిగని కెంపుముక్కును నీలనయన
కాంతులును బచ్చరెక్కల కైపు గల్గు
కృతకకీరంబు వలకేల నతిశయిల్ల
వచ్చె వడ్రంగి యొకఁడు భూవరుని కడకు." 23ప. 2ఆ.

భూవరుని కడకు వచ్చిన వడ్రంగి దేవశిల్పి. కనుక పసిడికట్టులు, పవడపుపిడులు

సహజములే.

"కుంచియదోయి మూఁపులకుఁ గోపులకు న్నెతిచూపబోటి జో
డంచు లలంకరింప గుఱులైన కిరీటము వెట్టి జక్కిణీ
సంచున కబ్జగంధి జలజాతసుగంధి మణీమయక్రియల్
గాంచిన బుట్టఁ బుట్టెఁ డెఱుక ల్నెఱపెం గొఱవంజి యాటలన్ 86ప. 3ఆ.

ఇందు కొఱవంజి ఆటలు కలవు. కొఱవు=కురవజాతి. వంజి=స్త్రీ. కొఱవవంజి-కొఱవంజి=ఎఱుకత. కొఱవంజి ఆట సోదె. ఎఱుకత సోదె ఘట్టము పోతన వీరభద్రవిజయమునందు కలదుగాని, అది సందిగ్ధవిషయమని పూర్వోక్తము[17]. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయమునందు ఇట్లు కలదు.

"అణునిభమధ్య లా క్రియలు నా పరిభాషలు నొప్పఁ జిందు జ
క్కిణి కొఱవంజి మేళములఁ జీలిక సల్పిరి దేవతానటీ
మణులకు బొమ్మవెట్టు క్రియ మర్దళతాళనినాదపద్ధతిన్
రణదురురత్ననూపురఝుణంఝుణముల్ మెఱయం బదాహతిన్ 131ప. 2ఆ.

ఇందు కొఱవంజి మేళములు కలవు. మేళములకు తాళములు కలవు. అవి కొఱవంజి ఆటలే. జక్కిణి మేళములు, కొఱవంజి మేళములు కలిసి యక్షగానములు కావచ్చును.

కకుత్స్థవిజయమునందు ముద్రాలంకారము క్రాంతముద్రాకముగ కలదు.

వనమయూరము - నృపతపోవనమయూరుల్. 218ప. 1ఆ.
మధురగతిరగడ - దూఱిరి మధురగతుల జడదాల్పులు. 223ప. 1ఆ.
భాస్కరవిలసితము - భాస్కరవిలసిత మెలమి రహించెన్. 153ప. 2ఆ.
పద్మనాభవృత్తము - పద్మనాభావతారాశ్రయంబై. 31ప. 3ఆ.
కవిరాజవిరాజితము - కవిరాజవిరాజితభూరివియత్ 54ప. 3ఆ.
తరళము - తరళము ల్తమప్రాణముల్ 57ప. 3ఆ.
మాలిని - తనుభయమాలిన్యాశయంబు 130ప. 3ఆ.
మానిని - మానినికిం జేపడ. 137ప. 3ఆ.
తరళము - తరళాభిధానకు. 138ప. 4ఆ.
సుగంధి - ఆ సుగంధి కేలికావనంబుఁ జేరి. 178ప. 4ఆ
మానిని - మానినిఁజేటుఁగఁ జేసిన 13ప. 5ఆ.
త్వరితపదగతి - త్వరితపదగతి నరుగుదేఱన్. 15ప. 5ఆ.
బంధుర - బంధురదుందుభినాదములున్. 25ప. 5ఆ.
ప్రహరణకలిక - పరిభటభయదప్రహరణకలికా. 104ప. 5ఆ.
పణవవృత్తము - పణవక్ష్వేడానాదవ్రాతము. 146ప. 5ఆ.
రథోద్ధతవృత్తము - తద్రథోద్ధతాభీలభీల- 147ప. 5ఆ.

కకుత్స్థవిజయమునందు పుర (111-143ప. 1ఆ.) ఆశ్రమ (150-151ప. 1ఆ.) తటాక (81ప. 2ఆ.) జలకేళి (89ప. 2ఆ.) వనవిహార (91-92ప. 3ఆ.) సూర్యాస్తమయ (98-99ప. 3ఆ.) అంధకార (100, 101ప. 3ఆ.) చంద్రోదయ (102ప. 3ఆ.) విరహ (108-125ప. 3ఆ.) వివాహ (147-163ప. 3ఆ.) రతి (15-21ప. 4ఆ.) కుమారోదయ

(34, 35ప. 4ఆ.) నాయక (41-48ప. 4ఆ.) వేట (66-67ప. 4ఆ.) యుద్ధ (109-155ప. 2ఆ. ; 98-117ప. 4ఆ. ; 25-185ప. 5ఆ.) వర్ణనములు కలవు. వేట వర్ణన సుదీర్ఘము. యుద్ధవర్ణన మహాదీర్ఘము. కారణము విజయత్రయకావ్యము వీర రసప్రధాన మగుటయే.

ఒక పద్యమునందు మొదటి పాదము శార్దూలపాదము, మూడు పాదములు మత్తేభపాదములు కలవని, ప్రాసనియమము లేదని ఒక అభిప్రాయము కలదు[18]. అది లేఖకదోషములు సవరింపకపోవుట వలని అనర్థకము. సవరించిన పద్యమిది:

"అవురా (ఔరా) యక్కృతినాదులం గలయరానైతేనియుం దానవ
స్థవిరా (స్థలిరా) వేడుక రేచి తీ విటులు పెల్పన్వచ్చి యిక్కోలకుం
జవిరా నీవిఁక జెట్టగాక దివిషజ్జాలంబుతోఁ బోరు కేం
జివురా నీదగు జాతి కంచొకట నేసెన్వాని మూర్ఛంబడన్." (55ప. 5ఆ.)

ఇది సలక్షణమైన మత్తేభవృత్తము. ఇందు శార్దూలము లేదు. ప్రాసనియమము కలదు.

అనంతరాజు వంశవర్ణనమునందు అతిసామాన్యములైన కోడిగ్రుడ్లు, ఆవుపాలు, కప్పలు, కవితామయములైనవి.

"నిమిషార్థవిచ్ఛిన్ననీరంధ్రవిద్విష
ద్ధుగ్రుశిరస్త్రాణముల్ కోడిగ్రుడ్లు
లభియాతితనుధావదస్సృగాపగాకోటి
యహరహంబును ద్రావు నావుపాలు
కదనాహితామితగంధదంతావళ
గాత్రకాండంబులు కప్ప గములు
పరిపంథిభూధవప్రాణసందోహంబు
లనిశంబు భుజియించు ననిలసమితి
గాఁగ నిరతంబుఁ బోషించుఁ గయ్యములను
జిన్న తిమ్మనరేంద్రుఁడు చిరయశుండు
దాయపైఁబడి నాలుక ల్గోయునట్టి
జిష్ణు బాహార్గళకృపాణకృష్ణఫణిని." 89ప. 1ఆ.

# క్షేత్రయ్య

అసలు పేరు మొవ్వ వరదయ్య[19]. క్షేత్రసంచారమువలన క్షేత్రయ్య. ఇతని కృతులు పదములు. అవి ద్వివిధము. 1. రాజపరము. 2. దైవపరము. రాజపరమైనవి రాజనామ ముద్రాంకితములు. దైవపరమైనవి. మువ్వగోపాలముద్రాంకితములు. క్షేత్రయ్య రఘునాథ నాయకుని సందర్శించినట్లు కలదని పూర్వోక్తము. విజయరాఘవముద్ర, తుపాకుల వేంకటకృష్ణముద్ర కల పదములు కలవు. అంతేకాదు. తంజావూరు విజయరాఘవ నాయకుని, మధుర తిరుమలనాయకుని, గోలకొండ పాదుషా కొలువులందు వేలకొలది పదములు వెలయించినట్లు ఒక పదమే కలదు[20].

"వేడుకతో నడచుకొన్న - విటరాయడే
ఏడు మూడు తరాల నుండి - యెందునా గాని యెవతె
కూడుకొని మువ్వగోపాలుడు - కృప గల్గి నా విభుడు ॥ వేడుక ॥
మధుర తిరుమలేంద్రుడు - మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండుమని - యెన్నిక యిమ్మనెనే
యిదిగో రెండు వేల పదము - లిపుడెంచు కొమ్మనిన
చదురు మీద నున్న సామికి - సంతోష మింతంత గాదె ॥ వేడుక ॥
ఆళి మీర తంజాపురి నెలకొన్న - విజయరాఘవుని
వెలయ మనుజాల వెంబడి - వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ - చక్కగ వేయిపదముల
పలుకరించుకోగానె - బహుమానమిచ్చె నా వేళ ॥ వేడుక ॥
బలవంతుడై గోలకొండ - పాదుషా బహుమానమిచ్చి
తులసి మూర్తితో వాదు - దలచె నా వేళ
వెలయ మువ్వగోపాలుడు - వెయ్యిన్నూరుపదములు
నలువది దినములలోన - నన్ను గలిసి వినుపించేనే!" ॥ వేడుక ॥

ఇందు "ఆళి మీర" అను అపపాఠమునకు "అళుకుదీరి" అను అపపాఠాంతరమ కలదు. "విలువ మీర" కవిపాఠము కావలయును. "వెయ్యిన్నూరు" అను పాఠమునకి "వెయ్యిన్నేనూరు" అను పాఠాంతరము కలదు. గోలకొండ పాదుషా అబ్దుల్లా కుత్బ్‌షా అగును. రఘునాథనాయకుని రాజ్యకాలము 1601-30. విజయరాఘవనాయకుని రాజ్యకాలము 1633-73. తిరుమలనాయకుని రాజ్యకాలము 1623-59. అబ్దుల్లా కుత్బ్‌షా రాజ్యకాలము 1626-72. కాబట్టి క్షేత్రయ్య జీవితకాలము 1601-80 కావచ్చును. అయిన పదరచనాకాలము 1620-80 అగును.

తిరుమలనాయకుని కొలువునందు 2000, విజయరాఘవనాయకుని కొలువునం 1000, అబ్దుల్లా కుత్బ్‌షా కొలువునందు 1100 లేక 1500 మొత్తము 4100 లేక 450. ఇతరత్ర 500 ఉండవచ్చును. మొత్తము క్షేత్రయ్య పదములు 5000 కావచ్చును. కని లభించినవి 314+12+3+3=332 మాత్రమే. ఇందు విజయరాఘవముద్ర కవి 12+1=13, తుపాకులవేంకటకృష్ణముద్ర కలవి 3; మన్నారు గుడి, చిదంబరము, హేరణ్యము, కంచి, మధుర, శ్రీరంగము, తిరువళ్లూరు, కోవళ్లూరు, సత్యపురి, యదుగిరి,

ఇనపురి, పాలగిరి, చలువచక్కెరపురి, చెవ్వంది, తిరుపతి, కడప, హేమాద్రి, శ్రీశైలము అను పదునెన్మిది క్షేత్రములకు సంబంధించినవి[21] 44 మొత్తము 60 కాక 332-60=272 పదములు మువ్వపురికి సంబంధించినవి కావచ్చును.

"మువ్వపురి ధాముడు" (13) "మువ్వపురి విభుడైన గోపాలుడు" (58)మువ్వపురి సామి (174) "మువ్వపురిని నన్నేలిన వాసుదేవుడు (305) అని క్షేత్రయ్యపదములందు కలదు. కాని 'మువ్వపురి' కానరాదు. ఒక పదమునందు (289) "మరునికేళిలో నన్ను మవ్వగోపాలుడు" అని కలదు. "మువ్వ" అపపాఠము. "మవ్వ" కవిపాఠము. కానిచో అక్షరమైత్రికి భంగకరము. ఆద్యక్షరమైత్రి లేదా ప్రాసాక్షరమైత్రి క్షేత్రయ్య పదలక్షణము. మవ్వపురి అనియే పఠితము[22]. మవ్వపురి అన మవ్వ అను గ్రామము. మవ్వ మొవ్వ అగును. అగును కాదు; అయినది. కృష్ణాజిల్లా దివితాలూకా కూచిపూడి సమీపమునందు మొవ్వ అను గ్రామము కలదు. అచట గోపాలస్వామి ఆలయము కలదు. ఆలయములోని ఉత్సవవిగ్రహము మీద వెనుకవైపు క్రింద "మవ్వ" అని చెక్కబడినది[23]. అది ప్రాచీనగ్రామనామము. మవ్వ మూలరూపము. మొవ్వ పరిణతరూపము. రెండు పేర్లు ఒక కాలమునందు ఉండును. మగడు, మొగుడు వలె. "మతి లేని మగడు గతిలేని బతుకు", "మొగుణ్ణి కొట్టి మొగసాల కెక్కింది." అను మాటలు వ్యవహారప్రసిద్ధములు. మొప్పె ముప్పి వలె మొవ్వ మువ్వ అగును. మొగము, ముగము కూడ గమనార్హము. మొవ్వయందు క్షేత్రయ్య వంశీయులు కలరు[24]. వారి ఇంటిపేరు మొవ్వ. కాబట్టి కృష్ణాజిల్లా దివితాలూకా కూచిపూడి సమీపమునందలి మొవ్వగ్రామమే మువ్వపురి అగును. మొవ్వ గోపాలుడే మువ్వ గోపాలుడు.

క్షేత్రయ్య పదములు శృంగారపదములు. పచ్చి శృంగారమని ప్రసిద్ధి. అయినను "క్షేత్రయ్య పదములు పచ్చి అనుట పచ్చి" అని ఒక అభిప్రాయము కలదు[25]. శృంగారభక్తి లేక మధురభక్తి పదములని మఱొక అభిప్రాయము[26]. "It is dontful whether we are spiritualising, sex or sexualising spirit" అని వేఱొక అభిప్రాయము[27]. క్షేత్రయ్య పదములు శృంగారభృంగారువులే. రాజముద్రాంకితములైన పదములు శ్రుతి మించిన శృంగారమునకు శృంగగ్రాహికలు. దైవముద్రాంకితములైన పదములును మోతాదు మించిన మోహపరవశమునకు మూలకందములు.

"కలికిరో! అచ్యుతవిజయరాఘవేంద్రుడు తాను నేను
గంతుకేళి గూడగ
పలుమారు గిలుకల కోళ్ల పట్టిమంచము
ఘలు ఘలు మంటేను
మెలతరో! ఆ సద్దు ఆపె వినేనంట
మెల్లనే నను కూడెనే ఓ చెలియా!" ॥ ఇటువంటి వాడు రానేలే ॥ 2.
"మనుసు కరుగ నా మర్మము లంటుచు
పెనగొని తమకంబునను
గినిసి తుపాకుల కృష్ణునితోనే
దనివి తీరలేదని పలికితినట" ॥ నేరమా? కొమ్మా! ॥ 3

ఇవి విజయరాఘవనాయకుని ఆస్థానకవులకు, మహారాష్ట్రపాలకుల ఆస్థానకవులకు

మార్గదర్శకములైనవి.

ముప్వగోపాలముద్రాంకితపదములు ముప్విధము. 1. మధురభక్తిపదములు. 2. సరసశృంగారపదములు. 3. పచ్చి శృంగారపదములు.

"ఎంత చక్కని వాడే నా సామి వీ - డెంత చక్కని వాడే
ఇంతి ముప్వగోపాలుడు - సంతతము నా మదికి
సంతోషము చేసెనే ॥ ఎంత ॥
మొలక నవ్వుల వాడె - ముద్దు మాటల వాడె
తళుకారు చెక్కుట - ద్దముల వాడే
తలిరాకు జిగి దెగడ - దగు మోవి గల వాడె
తెలిదమ్మి రేకు క- న్నుల నమరు వాడే ॥ ఎంత ॥
చిరుత ప్రాయము వాడె - చెలువొందు విదియచం
దురు గేరు నొసలచే - మెరయు వాడే
మెరుగు చామనచాయ - మే నమరు వాడే ॥ ఎంత ॥
పాదలు కెందామరల పెం - పొదవు పదముల వాడే
కొదమ సింగపు నడుము - కొమ రమరు వాడే
మదకరి కరముల - మరువు చేతులవాడే
సుదతి! ముప్వగోపాలు డెంత సొగసు గల వాడే." ॥ ఎంత ॥ 78.

ఇట్టి పదములు మధురభక్తిపదములు. ప్రతిజీవాత్మ స్త్రీ. పరమాత్మ యొక్కడే పురుషుడు. జీవాత్మలన్నియును పరమాత్మను పొందుటకు నాయికాసదృశములు. పరమాత్మయే నాయకుడు. ఆ నాయికాయకుల ఐక్యమే మధురభక్తితత్త్వము. అదే మధురభావము. తదారోపమైన, అలౌకికమైన, ఆధ్యాత్మికమైన శృంగారము మధురభక్తి[28]. (తాళ్లపాక అన్నమాచార్యుల శృంగారసంకీర్తనములును మధురభక్తిపదములే.)

"ఏర ముప్వగోపాల! యీ చల మేలరా?
విరహము నే దాళరా మదనుని కిపుడే
వేళరా! ని న్నెడ బాయజాలరా! ॥ ఏర ॥
నెనరున నిను ఘనమని నమ్మితి నన్నె మేరా!
మ్రొక్కేర! నీ చను వీరా!
కౌగిలించవద్దన మేరా కోపమేల
గ్రక్కున రారా ॥ ఏర ॥
అందు నిందు న - న్నందకత్తెను గాదందురా
ఆ చెలి మాటలు విందురా?
ఇప్పుడు నా మన సందురా!
ఇందుకు నేనే మందురా? ॥ ఏర ॥
బలు చెలిమిని నిను - గలసితి నంటే
పలుకవు మునుపటి వలెనే
అలుకవు కస్తూరి నాపై - జిలుకవు
మాటలకైన పలుకవు" ॥ ఏర ॥ 137

ఇట్టి పదములు సరసశృంగారపదములు. మఱి,



"ఆరు నెలలైనను అతడు నే నొక చోట - హాయిగా గూడియుంటిమా?
మరుకేళికి నెంతో వెతజెందితిగాని
మనసు మనసొక్కటై యుంటిమా?
దూరుకు లోనైతిగాని గడెసేపైనను
తొడ తొడ సోకి యుంటిమా?
పేరు చెప్పి మాటల నొక్క నాడైనను
ప్రేమతో బిలుచుకొంటిమా? ఓ చెలియారో." ॥ ఇంతలోనె అల్లవాని ॥ 41.

"మిసమిసలాడు నా - నొసలిపై తిలకము
పొసగ దిద్దుచు వాడు - బొందుగ నలదాని
కుసుమాస్త్ర గృహముపై - గొసరి చే వేయగానే
కసరి నే నడిగితే - గారమాడెనే. " ॥ ఇన్నాళ్లవలె గాదమ్మా ॥ 63

"పచ్చియొడలి దానరా!
పచ్చియొడలిదాన పాపడు నిలువడు
వచ్చిగూడుటకు వేళగాదు
వచ్చె తాళవోయి వదలను నీ పొందు
మచ్చిక నొయ్యారి మా మువ్వగోపాల!" ॥ పచ్చి ॥ 231



వెతకి తీరా పోయి - వేరువెల్లంకి
హితనైన చెలులిక - నెవరు వద్దను లేరు ॥ వెతకి ॥
ఒట్టు పెట్టిన గాని - యోరి వినవైతివి
తిట్టిన తిట్లెల్ల - దీవెన లంటివి
పట్టుకొంటివిరా నన్ను - బలిమి గూడితివి
ముట్టు నెల దప్పెను - మొగవా డూరను లేడు" ॥ వెతకి ॥ 296

ఇట్టి పదములు పచ్చి శృంగారపదములు. చుక్కలు పొడిచిన 76, 84, 119, 259 పదములు ఇంతకంటె పచ్చిశృంగారపదములు. చుక్కలు అశ్లీలములకు ఆనవాళ్లు.

"మగువ తన కేళికా-మందిరము వెడలెన్
వగకాడ మా కంచి - వరద తెల్లవారె ననుచు ॥ మగువ ॥
విడజారు గొజ్జంగి - విరిదండజడతోను
కడు చిక్కుబడి పెనగు - కంటసరితోను
నిడుద కన్నులదేరు - నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున - దడబడెడు నడతోను ॥ మగువ ॥
సొగసి సొగయని వలపు - సొలపు జూపులతోను
వగవగల ఘనసార - వాసనలతోను
జిగి మించు కెమ్మోవి - చిగురుకెంపులతోను
సగము కుచముల విదియ - చందురులతోను ॥ మగువ ॥
తరితీపు సేయు సమ - సురతి బడలికతోను
యిరుగడలపై కైదండ లిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగోపాల తెల్లవారె ననుచు ॥ మగువ ॥



ఇది ప్రసిద్ధమైన క్షేత్రయ్య పదము. కంచి వరదరాజస్వామి సంబుద్ధమైన పదము. పరమాత్మ ప్రసక్తమైన పదము. మువ్వగోపాలముద్రాంకితమైన పదము. క్షేత్రయ్య కంచి

వరదరాజస్వామి పవ్వళింపుసేవను పరికించి, కేళీమందిరములోని అమ్మవారి, అయ్యవారి అలౌకికశృంగారరసానుభవభావనలో లీనమై, గుడిలోనే నిదురించి, తెల్లవారుజామున మెలకువ వచ్చి, కన్నులు విచ్చి, మెట్లు దిగి వెడలివచ్చు అమ్మవారిని చూచి, ఈ పదము పాడెనని ఒక కథ. క్షేత్రయ్య రాత్రి పదములు రచించి, విజయరాఘవనాయకునికి వినిపించుటకై, తెల్లవారుజామున కోటలోనికి వెళ్లి, విజయరాఘవనాయకుని పట్టపుదేవి కేళీమందిరమునుండి మెట్లు దిగి వెడలివచ్చుట చూచి, ఈ పదమును రచించి, విజయరాఘవనాయకునికి వినిపించెనని మఱొక కథ. ఒక్క పదమునకు రెండు కథలు[29]! మొదటి కథ అలౌకికము. రెండవ కథ అతిలౌకికము. పదమునందు కంచి వరదరాజస్వామి ప్రసక్తి కలదు. విజయరాఘవనాయకుని ప్రసక్తి లేదు. కనుక మొదటి కథయే నిజము కావచ్చును. అయిన లౌకికశృంగారము కాదు. అలౌకికశృంగారమే. అయినను పదము నందు అలౌకిక శృంగారమును కబళించు లౌకికశృంగారమే కలదు. అలౌకికశృంగారము ఆంతరంగికము, లౌకికశృంగారము బాహిరము.

శృంగారరసమంజరి అని అలంకారశాస్త్రగ్రంథము కలదు[30]. అది భానుదత్తుని రసమంజరికి అనువాదము. కర్తృనిర్దేశము లేదు. అందు నాయికాలక్షణములు కలవు. మూలములోని లక్ష్యశ్లోకములకు, తెలుగుపద్యములు కలవు. అంతేకాదు. క్షేత్రయ్య పదములు 219 లక్ష్యములుగ కలవు. అందు మూడు పదములు లభింపలేదు.

**నవోఢాలక్ష్యము :**

ch. కరమునఁ గట్టినం గుసుమకల్పితతల్పమునందు జేర్చినం
దరముగఁ గౌఁగిలించినను దత్తరమందును బైలుదేరఁగా
నిరవుకొనంగఁ బాదరసమెవ్వఁడు చేతను నిల్పు వానికిం
దరమగుగా నవోఢ నెదఁదార్పఁగఁ జిందులు ద్రొక్కుచుండగన్

1. స్వీయ - ముగ్ధ. అందు నవోఢ. ఎట్లనిన - తొలినాడు శయ్యాగృహమందు నాయకుడు బలాత్కారము చేసినందువలనన్ను మర్నాడు శయ్యకు బోనోపనని సఖీజనులతో దెలియజేసుకొనినందువల్లనున్ను యీ నాయిక నవోఢయని సిద్ధోత్కారముగా వ్రాయబడెను. ఇందుల కుదాహరణము "క్షేత్రయ్య పదములు".

"నన్నేటికి బొమ్మనేరె? - వాని వద్దికి
మిన్నక వాని వద్దికి - మీరే పోరే చెలులార! ॥ నన్నేటికి ॥
పడతి! నే నందు బోను - పలుమారు దన నోటి
మడుపందు నయము చేసి చేపట్టి నన్ను
పడకింటికి రమ్మనెనే నే రానంటె
కడు వెరపించి హుమ్మనెనే అమ్మ! నే వెరతు ॥ నన్నేటికి ॥
మచ్చకంటి! యిపుడిపుడు వచ్చిన లేతచన్నులను
నొచ్చె ననగా బట్టెనే! వద్దంటే వినక
మచ్చరాన గోరు బెట్టెనే! వచ్చెద నంటే
మచ్చువగల దోవ గట్టెనే అమ్మ! నే వెరతు ॥ నన్నేటికి ॥
నెలత! నమ్మిక లిచ్చి యల మువ్వగోపాలుడు
చెలిమితో నను దీసెనే! కుయ్యకుమని
బలిమి నోరు మూసెనే! పరవశనై
తెలియనైతి నేమేమో జేసెనే అమ్మ! నే వెరతు ॥ నన్నేటికి ॥ 206

విప్రలబ్ధనవోఢాలక్ష్యము :

ච. కరమున నూరువుల్ బెనిచి కమ్మక నీవియు బట్టి యన్యమౌ
కరమున గుబ్బలం బొదివి కాంత నిమీలితలోచనాంతయై
వరుని సమీపభాగమున వైఖరి గాఁగ నవోఢ నందుచున్
నిరుపమలీల మీఱ శయనీయమునం బవళించు వేగమున్.

2. స్వీయ - ముగ్ధ. అందు విప్రలబ్ధనవోఢ. ఎట్లనిన - సఖీజనుల వాక్యము నంగీకరించినందువల్లనున్ను, నాయకుని అనుభవము తెలిసి కొనినందు వల్లనున్ను

"చిన్నదాన నే నేమెఱుగ - సిగ్గయ్యీనమ్మా!
కన్నెవెల్ల కంచివరదుని - కౌగిట నుండుమనేరు ॥ చిన్న ॥
వద్దికి బొమ్మని చాల - సుద్దులు చెప్పేరు
ముద్దు బెట్ట బొమ్మనేరు - ముదముతో లాలించుమనేరు ॥ చిన్న ॥
మదనశాస్త్రము నేను - జదివిన దాన గాను
సదయుడని వానితోను - సరసము లాడుమనేరు ॥ చిన్న ॥
మల్లెపూల పాన్పుపైని - మనసు నెమ్మదితోను
ఉల్లము రంజిల్లజేసి - ఒమ్మికతో నన్నుండమనేరు ॥ చిన్న ॥
పల్లవాధరి ! వినవే! - పణతు లందఱు నన్ను
వల్లభు డా మువ్వగో - పాలునితో గూడుమనేరు" ॥ చిన్న ॥ 173

ఇట్లు క్షేత్రయ్య పదములు శృంగారనాయికాలక్షణలక్షితములు. భానుదత్తుని రసమంజరిలోని లక్ష్యశ్లోకముల కంటె, అజ్ఞాతకర్తకమైన శృంగారసమంజరిలోని క్షేత్రయ్య పదములు రసవత్తరములు.

క్షేత్రయ్య పదములు అలంకారశాస్త్రానుగుణములు మాత్రమే కాదు. నాట్యసంగీత శాస్త్రానుగుణములు కూడ. సంగీతసభలందు కంటె నాట్యప్రదర్శనరంగములందు క్షేత్రయ్య పదముల సమగ్రస్వరూపము సాక్షాత్కరించును. అవి రాగయుక్తముల వలె అభినయగర్భితములు[31]. ఇది అన్నమయ్య సంకీర్తనముల కంటె, రామదాసు కీర్తనల కంటె, త్యాగయ్య కృతుల కంటె క్షేత్రయ్య పదముల ప్రత్యేకత. ప్రతి క్షేత్రయ్య పదము నృత్యసంగీతసాహిత్యరసత్రివేణి.

క్షేత్రయ్యశైలి మృదులాతిమృదులము. మధురాతిమధురము. సహజాతిసహజము. తెనుగుదనము తేనెపానకము. భాష సరళగ్రాంథికము. వ్యావహారికభాషాసన్నిహితము. క్రియాపదములు వ్యవహారసరణిని, వ్యాకరణయుక్తముగను కలవు.

"ఇంతకంటె దా నన్నేమి చేసీవి" 33
"పలు వేదనతో బొరలీనా" 82
"ఈ వగలు వింటేన" 122
"ఇంతలో సొమ్మసిల్లేవు" 169
నన్ను నీవు దలచేది" 205
"అలిగితి వెందుకు" 22
" ఏ రీతి మది నెడసియుందు" 70
"ఎన్ని తలచుకొందు నమ్మా" 100
"ఏల వచ్చితివే సామి నెడబాసి" 142

"దినము లిటువలె వచ్చెను" 202

పలుకు నుడికారముల కులుకు సింగారములు కొల్లలు. అవి కోటీరమణిద్యుతులు. మొప్పె వగలు (1) కన్నీరు కావేరి కాలువ (7) జోగి వలె బోయె నా బ్రతుకు (13) మచ్చుమందులమారి ముదిత (19) అరసొంపుమాటలు (23) రాతిమనసుదానవే (36)మీరేమైన నార్చేరో తీర్చేరో (43) ఉడుకుచున్న మనసు (46) ఈనిన పులి వంటి కోపము (47) దిక్కు మాలిన మోహము (53) నమలిన చెఱుకు పిప్పి (61) ఇన్నాళ్లు మల్లాడినది (65) వానకాలము నాటి గరిక (72) ఎన్ని మందులిడితివో (85) గోరంతైన లేదాయె (91) ఎదపై మల్లెపూవు వలె మంచుకొన్న (100) వెన్నెల కాకలు (123) చక్కెర బొమ్మలు (127) తలిరు పదును కత్తులు (147) చూడని గూడని నిందలు (174) చిటి పాటి పదములు (177) శానా చదివిన సర్వజ్ఞుడు (182) కోపము ముక్కున నున్నది (190) తిన్నగ మాట లాడర (191) తోటకూరదొంగ (216) వట్టి వెతలు (226) అల్లి బిల్లి సుద్దులు (227) పచ్చి యొడలు (231) కంచము పొత్తువారము (232) ఇదెక్కడి జోలి (233) మేను పులిపులియైనది (237) చల్లనైన చందమామ (263) మరు లూరియున్నదిర (272) వచ్చే మనసో రాని మనసో (282) వ్రతము చెడిన సుఖము (295) ఉట్టి పడ్డట్టు వచ్చి (296) కోపాలా మువ్వగోపాలా (299) నిండుకుండ వలె (303) సొక్కుపొడి చల్లినట్లాయె (308) జబ్బు మాట లాడెనె (పుట 209) కడలేని విరహాన కాగి కరగి (పుట 220) మొదలైనవి.

కవి జీవితచరిత్ర కలదను పదము లివి[32]:

"పెలువనంపె నన్నీవేళ - ప్రేమ మీరగా నిపుడు
చెలియ మువ్వగోపాలుడు - చిత్తము రంజిల్ల నేడు ॥ పిలువ ॥
విరిబోణిరో రమ్మని - విరుల జడను జుట్టి
పరువమయిన నాటికి - పైడి యిదే ననుచు
మరువకు మీ మాట - మన కిద్దరికీ పూట
చెరుకువిల్తుడే సాక్షి - చెలి యనిన నా సామి॥ పిలువ ॥
ఎమ్మెకాడు నేను - నెనసిన చిన్ననాడే
సమ్మతిగా నొకచోట - జదువుచుండగ
పమ్మిన వేడుకతో - భామ నీవు ప్రౌఢవైతే
కమ్మవిల్తుని కేళి - గలసేమన్నది నిజమై ॥ పిలువ ॥
ఎలమావితోటలో - నింపొంద నొకనాడు
యెలమి గౌరిపూజ - సలుపుచుండగా
అల మువ్వగోపాలు - డగు వేంకటేశుడు
కలువల శయ్యపై - గలసేమన్నది నిజమై ॥ పిలువ ॥ 236

"నన్నే పెండ్లాడుసుమీ! - నా యాన మువ్వగోపాలా!
అనున్న మావారు వరా - లడుగకుండ జేసేగాని ॥ నన్నే ॥
చన్నులు రాక మునుపే - సరసము లాడుచు నీవు
యెన్నరాని మోహమున - నా కిచ్చిన బాసలు దలచి ॥ నన్నే ॥
ఎంతెంతో నను లాలించి - యింటికి దోడుకపోయి

వింతసేయక నా మోవి - విందారగించిన సొగసున ॥ నన్నే ॥
తెలియనైతి చిన్ననాడే - తేలించి మువ్వగోపాల ॥ నన్నే ॥
అలరు విల్తునికేళిన - న్నలవాటు చేసిన సామి!" ॥ నన్నే ॥ 207.

ఇందు విరిబోణి వేశ్య కావచ్చును. పూర్వోదాహృతమైన "వేడుకతో నడచుకొన్న విటరాయడే" అను పదములోని విటరాయడు క్షేత్రయ్య కావచ్చును. విరిబోణి, విటరాయడు మువ్వపురిని కలిసి చదువుకొనుట, ఒకరి కొకరు మనస్సు పడుట, వయసు వచ్చిన తర్వాత ఒక్కరగుట నిజము కావచ్చును.

# సురభి మాధవరాయలు

ఇతని కృతి చంద్రికాపరిణయము. మదనగోపాలస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు జటప్రోలు సంస్థానాధిపతి. రామరాజు వలన 1000 ఫసలీలో అనగా 1580 వ సంత్సవరమునందు జటప్రోలుసంస్థానమును పడసినట్లు సన్నదు కలదు[33]. రామరాజు అళియరామరాయలు కాడు. ఆ కాలమునందు అళియరామ రాయలు లేడు. సురభి వారి వంశచరిత్రములోని సన్నదున ఫసలీసంఖ్య లేదు[34]. అందు "ప్రౌఢదేవ రాయల సాంప్రదాయకులైన అచ్యుతరాయకృష్ణరాయల సాంప్రదాయకులైన రామరాజు మహారాజుగారు" అని కలదు. అతడు రామదేవమహారాయలు అగును. అతని రాజ్య కాలము 1619-30 సన్నదు ప్రత్యంతరములోని ఫసలీసంఖ్య 1040 కావచ్చును. తెలుగు నాలుగు అంకెపైన త్రుటితమైన సున్న అగును. 1040 ఫసలీ అనగా 1620 సంవత్సరము. అది రామదేవమహారాయల రాజ్యకాలమే కాఁబట్టి చంద్రికాపరిణయము రచనా కాలము 1630 ప్రాంతము కావచ్చును.

ఇందు సుచంద్రుడను రాజు చంద్రిక అను రాజకుమారిని వివాహమాడుట ఇతి వృత్తము. సుచంద్రుని జైత్రయాత్ర ప్రథమాశ్వాసము. చంద్రిక జన్మవృత్తాంతము ద్వితీయాశ్వాసము. చంద్రికాసుచంద్రుల ప్రథమసమావేశము తృతీయాశ్వాసము. చంద్రిక విరహము చతుర్థాశ్వాసము. చంద్రిక స్వయంవరము పంచమాశ్వాసము. చంద్రికాసు చంద్రుల వివాహము షష్ఠాశ్వాసము. స్వయంవరము నైషధప్రభావము. ఇతరమెల్ల వసు చరిత్రస్వభావము. చంద్రిక జన్మవృత్తాంతమే ఇంచుక కథపట్టు. అది గిరిక జన్మవృత్తాంత మునకు ప్రత్యామ్నాయకల్పనము. ఇతివృత్తనిర్వహణమే కాదు; పద్యరచనము కూడ భట్టుమూర్తి పద్యరచనమునకు ప్రతిబింబప్రాయము. వసుచరిత్రమునందు వలె శ్లేషాశ్లేషము కలదు. వర్ణనాభూయిష్ఠత కలదు. సంగీత సాహిత్యనామకవిద్యాయుగళము మృగ్యము గాని, సంగీతప్రసంగము కలదు. గిరికావసురాజుల సంభోగాంతసౌఖ్యము బ్రహ్మానందానుభవము. చంద్రికాసుచంద్రుల సంభోగాంతసౌఖ్యము పరబ్రహ్మసాయుజ్యము. వసుచరిత్రము జాతిరత్నము. చంద్రికాపరిణయము కృత్రిమరత్నము. అంతే కాదు. చంద్రికాపరిణయము పిల్ల వసుచరిత్రములందు పెద్ద పిల్ల వసుచరిత్రము. పిల్ల వసుచరిత్రములందు చంద్రికాపరిణయము పెద్దది మాత్రమే కాదు; దొడ్డది కూడ.

గిరిక జన్మవృత్తాంతమున శుక్తిమతీకోలాహలవృత్తాంతము. చంద్రిక జన్మవృత్తాంతమున కుముదశాపవృత్తాంతము. సుచంద్రుడు. హేమకూటపర్వతమును విలోకించు నెడ,విఱుచుకొని పడిన సింహమును వధించును. ఒక పురుషుడు అవతరించును. అతడు కుముదుడు. కిన్నరుడు. అతని శాపవృత్తాంతమునందు చంద్రిక జన్మవృత్తాంతము అంతర్గతము. పారిజాతారణ్యమునందు వసంతుడను ముని బ్రహ్మత్వమును కోరి, మనుమంత్రమును జపించుచు తపస్సు చేయును. తపోభంగము కలిగించుటకు బ్రహ్మ తలపెట్టును. చిత్రరేఖ తనంతట ముందునకు వచ్చును. బ్రహ్మ మన్మథుని తోడిచ్చి పంపును. వసంతముని సన్నిధిని చిత్రరేఖ ఎంత సంగీతసభ చేసినను, వసంతముని చలింపలేదు. చిత్రరేఖ అతని పాదములు తాకి సేవింపవచ్చితినని ప్రాధేయపడును.

ముని అఆకంట చూచి, వెంటనే కన్నులు మూసి, ధ్యాననిమగ్నుడగును. చిత్రరేఖ నవ్వుచు నవోక్తిచాతురిని శృంగార మొలకబోయును. ముని నిశ్చలత అంగీకారముగా భావించి, అతని హస్తము పట్టుకొని లాగును. ముని ఆగ్రహోదగ్రుడై మనుజవనితవై జన్మించి, మధుపాయి భార్యవు కమ్మని శపించును. చిత్రరేఖ అతని కాళ్లమీదపడి గోలపెట్టును. ముని జాలిపడి, సుచంద్రుని భార్యవు కమ్మని శాపమును మార్చును. చిత్రరేఖ చంద్రికగా జన్మించును. ఆమెకు సంగీతము నేర్పుటకు బ్రహ్మ కుముదుని నియోగించును. అతడు నేర్పుచుండును. ఒకనాడు కుముదుడు సరస్వతి తెలిపిన సరిక్రొత్తరాగములు చంద్రికకు నేర్పుటకు వచ్చునెడ, హేమకూటాద్రిదరిని ఒక మునికాంతను చూచి మోహించును. మునికాంతుని మోసము సేయబోవును. అత డది గ్రహించి సింహముగ పుట్టుమని శపించును. ఇది చంద్రిక జన్మవృత్తాంతము అంతర్గతమైన కుముదశాపవృత్తాంతము.

చంద్రికాపరిణయములోని సుచంద్రుడు, చంద్రిక, కుముదుడు, వసంతుడు, శ్యామ, క్షణదోదయుడు, చిత్రరేఖ, తమిస్రుడు అను పేరులు అన్యోన్యసంబంధము కలవి. ఇందేమైన అర్థవాదము కలదేమో అన్వేషణీయము.

చిత్రరేఖ గానకౌశలము :

"సరసత్వంబునఁ గేల నూని యల యోషామౌళి చక్కన్ రిరి
మ్మరిగా మారి యటంచు రిప్పని మగా మామ్మారి యంచున్ విభా
స్వరనానానవరక్తిఁ దానతతి మించన్ గౌళి వాయించి ని
బ్బరపున్ వేడుకఁజేయు పంతువిధముల్ పల్కించె నప్పట్టునన్" 96ప. 2ఆ.

చిత్రరేఖ నాట్యవైవిధ్యము :

"బళిరే మైసిరి తీరు నిల్కడలు సేబాసయ్యారే పేరణీ
కలనం బౌర పదాళికాభినయనైఖర్యంబు మజ్జారె కో
పుల నైచిత్రి యహో వినిర్మలకరాంభోజాతవిన్యాసమం
చలివేణుల్ వినుతింప సల్పె నటనం బా కొమ్మ తత్సన్నిధిన్." 97ప. 2ఆ.

చంద్రిక సంగీతసామర్థ్యము :

"తాన చాతురి కద్భుతముఁ దాల్చు పోలిక
వరమణిపుత్రికల్ శిరము లూప
ఘనగానసుధఁ గ్రోలి తనివొంది బయలూన్చు
గతి శిలాతతి జలౌఘమ్ముఁ గురియ
యతిలయశ్రుతుల విస్మృతి తత్త్వమూనిన
చాయ నాళులు వినిశ్చలతఁ దాల్ప
బలు రక్తిలో నుండి పట్టఁజాలక వెలు
వడు దారి వల్లికల్ కడుఁ జిగుర్ప
హారివసుపీఠికాసీనయై విపంచిఁ
గలసి గానము సేయు భూకాంతపుత్రిఁ
గరకనిభగాత్రిఁ గాంచి యయ్యినకులుండు
చాల నాశ్చర్యజలరాశిఁ దేలె నపుడు" 44ప. 3ఆ.

చంద్రిక వసుపీఠికాసీనయే కాదు; సన్నివేశమును వసుపీఠికాసీనము. వసుచరిత్రములోని సుప్రసిద్ధమైన, సుమనోహరమైన "లలనాజనాపాంగవలనావసదనంగ" అను

సీసపద్యమునకు మూసపోసిన పద్యము:

"బాలాంబుజతమాల మాలాభినవజాల
జాలామృతోల్లోలషట్పదౌఘ
రాగాదిపరమాగమాగాంతసుపరాగ
రాగావరణభాగరాళిపవన
కేళీగృహన్మాళిమాళిస్థితపికాళి
కాలీనరవలోలితాఢ్యగాత్మ
రాజీవశరవాజివాజీననిరతాజి
తాజీజనకరాజితామ్రఫలిక
భవ్యబుతుకాంతకాంతతాత్పర్యసృష్ట
ఘనవిషమబాణబాణసంఘాతకలిత
తిలకమధుగంధగంధసంచులుకితాశ
కనదచిరధామ యివ్వనిక గంటె" 53ప. 4ఆ.

ఇందు "లలనాజనాపాంగ" పద్యములోని లయ, తాళము, రాగము లేదు. మాధు ర్యము లేదు. రామణీయకము లేదు. విఫలమైన అనుకరణమే కలదు. అది సానపట్టిన వజ్రము. ఇది మూస కట్టిన సీసము.

శ్లేష వసుచరిత్రమునందు అప్రయత్నసిద్ధము. సుకుమారము. చంద్రికాపరి ణయము నందు సప్రయత్నబద్ధము. కఠినము.

"యతికులచంద్ర సత్కువలయప్రియమై తగు నీదు రాక మ
ద్వితతమనస్సంతాపగతి వేగ యలంపఁ గలంప సంతతో
ద్ధతతరపంకజాతములఁ దావకపాదనిషేవణాసమా
దృతి మను నా శుభాళిఁ గనునే ధరఁ దక్కిన రాజచక్రముల్." 128ప. 1ఆ.

ఇందు శాండిల్యుని, పరముగ, చంద్రుని పరముగ అర్థద్వయము కలదు. యతికుల చంద్ర = మునికులమునకు శ్రేష్ఠుడవైన శాండిల్య!, మునికులమునకు చెందిన చంద్ర!; సత్కువలయప్రియమై = మంచి భూవలయమునకు ఇష్టమై, మంచి కలువపువ్వులకు ఇష్టమై; మద్వితతమనస్సంతాపగతిన్ = నా మనస్సునందున్న అధికమైన సంతాపమును, వేడిని; సంతతోద్ధతతరపంకజాతముల = నిత్యము మిక్కిలి ఉద్ధమైన పాపసంఘము లను, పద్మములను; తావకపాదనిషేవణాసమాదృతిన్ = నీ చరణసేవాసమాదరమున, నీ కిరణసేవాసమాదరమున; రాజచక్రముల్ = రాజులసమూహములు, శ్రేష్ఠములైన చక్ర వాకములు.

చంద్రికాపరిణయమునందు పుర (85-112ప. 1ఆ.) నాయక (113-127ప. 1ఆ.) ప్రయాణ (151-165ప. 1ఆ.) నగ (3-18ప. 2ఆ.) వన (19-20ప. 2ఆ.) నాయిక (3-30ప. 3ఆ.) నాయకవిరహ (91-96ప. 3ఆ.; 3-25ప. 4ఆ.) యుద్ధ (106-147ప. 3ఆ.) వసంతర్తు (26-45ప. 4ఆ.) నాయికావిరహ (46-49ప. 4ఆ.) వనవిహార (50 63ప. 4ఆ.) మన్మథపూజ (64-65, 78-91ప. 4ఆ.) జలకేళి (66-77ప. 4ఆ.) సూర్యాస్తమయ (92-97ప. 4ఆ.) అంధకార (98-99ప. 4ఆ.) నక్షత్ర (100ప. 4ఆ) చంద్రోదయ (101-106ప. 4ఆ.) చంద్రికావిహార (107వచ. 4ఆ.) చంద్రమన్మథ

సమీరోపాలంభ (108-122ప. 4ఆ.) శిశిరోపచార (123-126వచ. 4ఆ.) చంద్రాస్తమయ (127ప. 4ఆ.) ప్రభాత (129-133ప. 4ఆ.) సూర్యోదయ (136ప. 4ఆ.) స్వయంవర (3-144ప. 5ఆ.) వివాహ (2-138ప. 6ఆ.) వర్ణనములు కలవు.

# ఎలకూచి బాలసరస్వతి

అసలు పేరు ఎలకూచి వేంకటకృష్ణయ్య. బాలసరస్వతి బిరుదనామము. ఇతని కృతులు 1. కార్తికేయాభ్యుదయము 2. ఆంధ్రశబ్దచింతామణీటీక 3. వామనపురాణము 4. బాహటప్రబంధము 5. సుభాషితరత్నావళి 6. షడ్భాషావివరణశాస్త్రము 7. రంగకౌముదీనాటకము 8. చంద్రికాపరిణయము 9. యాదవరాఘవపాండవీయము 10. భ్రామరగీతప్రబంధము. ఇందు ఆంధ్రశబ్దచింతామణీటీక, సుభాషితరత్నావళి, చంద్రికాపరిణయము, యాదవరాఘవపాండవీయము, నాలుగుకృతులు మాత్రమే ఉపలబ్ధములు, మొదటి రెండు ముద్రితములు. కడమ రెండును అముద్రితములు.

చంద్రికాపరిణయమునందు కార్తికేయాభ్యుదయము, ఆంధ్రశబ్దచింతామణీటీక, వామనపురాణము, బాహటప్రబంధము, షడ్భాషావివరణశాస్త్రము పేర్కొనబడినవి. బాహటప్రబంధము ప్రసక్తి తర్వాత సీసపాదము లుప్తమయినది. అందు సుభాషితరత్నావళి ఉండవచ్చును. యాదవరాఘవపాండవీయమునందు రంగకౌముదీనాటకము, చంద్రికాపరిణయము, ఆంధ్రశబ్దచింతామణీటీక పేర్కొనఁబడినవి[35]. ఆంధ్రశబ చింతామణీటీకయందు రంగకౌముదీనాటకము, షడ్భాషావివరణశాస్త్రము, బాహట ప్రబంధము చంద్రికాపరిణయము, వామనపురాణము, భ్రామరగీతప్రబంధము, యాదవ రాఘవపాండవీయము పేర్కొనఁబడినవి. ఇది చిట్టచివఱ చేర్చిన దగును. కనుక పై క్రమము.

ఆంధ్రశబ్దచింతామణి బాలసరస్వతికి కీలకనామసంవత్సరమునందు లభించినట్లు అప్పకవీయమునందు కలదు. (50ప. పీ.) అప్పకవీయము 1656 వ సంవత్సరమునందు రచించినట్లు అప్పకవీయమునందే కలదు. (33ప. పీ.) 1656 వ సంవత్సరమునకు పూర్వము కీలకనామసంవత్సరము 1608 వ సంవత్సరము. కాఁబట్టి బాలసరస్వతి కృతుల రచనాకాలములు 1. కార్తికేయాభ్యుదయము 1605 ప్రాంతము, 2. ఆంధ్రశబ్ద చింతామణీటీక 1610 ప్రాంతము, 3. వామనపురాణము 1615 ప్రాంతము, 4. బాహటప్రబంధము 1620 ప్రాంతము, 5. సుభాషితరత్నావళి 1625 ప్రాంతము, 6. షడ్భాషావివరణశాస్త్రము 1630 ప్రాంతము, 7. చంద్రికాపరిణయము 1635 ప్రాంతము, 8. రంగకౌముదీనాటకము 1640 ప్రాంతము, 9. యాదవరాఘవపాండవీయము 1645 ప్రాంతము, 10. భ్రామరగీతప్రబంధము 1650 ప్రాంతము కావచ్చును.

సుభాషితరత్నావళి జటప్రోలు సంస్థానాధిపతి మల్లభూపాలునికి అంకితము. నరాంకితము. చంద్రికాపరిణయము పర్తియాల సంస్థానాధిపతి జూపల్లి వెంకటాద్రి ప్రేరణమున సరస్వతీదేవికి అంకితము. దైవాంకితము. యాదవరాఘవపాండవీయము వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. మల్లభూపాలుడు సురభి మాధవరాయల తండ్రి. మాధవరాయలు బాలసరస్వతి చేత భర్తృహరి సుభాషితరత్నావళిని తెలుగు చేయించి, రెండు వేల దీనారము లిచ్చి, తండ్రికి అంకిత మిప్పించినట్లు ప్రతీతి కలదు[36]. అది వాస్తవము కావచ్చును. అంతేకాదు. రామదేవరాయలు సురభి మాధవరాయలకు సన్నదు ఇచ్చిన కాలము 1620 వ సంవత్సరమని పూర్వోక్తము. కాఁబట్టి సుభాషితరత్నావళి

రచనాకాలము 1625 ప్రాంతమగుట సుసంగతము.

ఆంధ్రశబ్దచింతామణీటీక వ్యాకరణశాస్త్రవ్యాఖ్యానము. అది శాస్త్రవాఙ్మయచరిత్రకు విషయము.

సుభాషితరత్నావళి భర్తృహరి సుభాషితరత్నావళికి తెనుగుసేత. భర్తృహరి నాథుడు[37]. సుభాషితరత్నావళి నాథసంప్రదాయమునకు చెందిన కృతి. శతకత్రయము కాదు. త్రిశతి. నీతిశతకము, శృంగారశతకము, వైరాగ్యశతకము అనుట స్థూలనిర్దేశము. త్రిశతి అనుట సూక్ష్మనిర్దేశము. నీతిశతకమునందు పది దశకములు కలవు. మొదటి ఎనిమిది లౌకికములు. చివటి రెండు - దైవపద్ధతి, కర్మపద్ధతి - అలౌకికములు. శృంగారశతకమునందు అయిదు వింశతులు కలవు. మొదటి రెండు లౌకికములు. తర్వాతి మూడు - కామినీ గర్హణము, సువిరక్తపద్ధతి, దుర్విరక్తపద్ధతి - అలౌకికములు. వైరాగ్యశతకమునందు పది దశకములు కలవు. మొదటి అయిదు లౌకికములు. తర్వాతి అయిదు - యతినృపతి సంవాదము, మనస్సంబోధననియమనము, నిత్యానిత్యవస్తువిచారము, శివార్చనము, అవధూతచర్య - అలౌకికములు. లౌకికా లౌకికసమ్మేళనము నాథసంప్రదాయసరణి. నాథసంప్రదాయము తెలుగు దేశమునందు, తెలుగు సాహిత్యమునందు పంద్రెండవ శతాబ్దినుండి పదునాఱవశతాబ్దివఱకు కలదు[38]. పదునేడవశతాబ్దిని భర్తృహరినాథుని సుభాషితరత్నావళి ఎలకూచి బాలసరస్వతి మాత్రమేగాక, పుష్పగిరి తిమ్మన, పదునెన్మి దవశతాబ్దిని ఏనుగు లక్ష్మణకవి కూడ తెనుగు సేయుట విశేషము.

ఎలకూచి బాలసరస్వతి త్రిశతి లభించినది. పుష్పగిరి తిమ్మన నీతిశతకము మాత్రమే లభించినది. ఏనుగు లక్ష్మణకవి త్రిశతి లభించినది. బాలసరస్వతి తెనుగుసేత కంటె, తిమ్మన తెనుగుసేత మేలని, తిమ్మన తెనుగుసేత కంటె బాలసరస్వతి తెనుగుసేత మేలని, అభిప్రాయభేదములు కలవు. ఇద్దఱి తెనుగుసేతల కంటె ఏనుగు లక్ష్మణకవి తెనుగుసేత మేలని ఏకాభిప్రాయము.

బాలసరస్వతి నీతిశతకమునకు సురభిమల్లా! నీతివాచస్పతీ! అని, శృంగార శతకమునకు సురభిమల్లా! మానినీమన్మథా! అని, వైరాగ్యశతకమునకు సురభిమల్లా! వైదుషీభూషణా! అని మకుటములు కలవు. అవి సురభి మల్లభూపాలునికి అంకితము సేయుట వలన అపరిహార్యములు కావచ్చును. కాని, మకుటములనుబట్టి మత్తేభ, శార్దులములే శరణ్యములు. అందువలన శ్లోకమునుబట్టి పద్యమును ఎన్నుకొను స్వాతంత్ర్యము లేకుండపోయినది. చిన్న శ్లోకమునకు పెద్ద పద్యము రచించుటవలన తెనుగుసేత తేలిపోయినది.

"బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః
అబోధోపహతాశ్చాన్యే జీర్ణమఙ్గే సుభాషితమ్."

"సతతంబు న్మది మత్సరాఢ్యులు పరిజ్ఞాను ల్మహీనాథు లా
తతసంపన్మదదుష్టచిత్తు లితరు ల్తర్కింప నజ్ఞానదూ
షితభావు ల్వినువార లేరి యొడలన్ జీర్ణంబులౌ<గాక యా
ర్యతతు ల్సేర్చిన సూక్తము ల్సురభిమల్లా! నీతివాచస్పతీ! 2 నీ. శ.

పరిజ్ఞానులు మత్సరాఢ్యులు, మహీనాథులు మదచిత్తులు, ఇతరులు అజ్ఞానదూషితులు, సూక్తములు ఒడలన్ జీర్ణములు - అను శ్లోకభావములకు, సతతంబున్మది.

ఆతతసంపత్... దుష్ట, తర్కింప, ఆర్యతతుల్నేర్చిన అనునవి పద్యపూరణార్థములు. వినువారు లేరను శ్లోకములోని వ్యంగ్యము, పద్యమునందు వాచ్యము. స్మయదూషితులు మదదుష్టచిత్తులు కారు. గర్వదూషితులు. అభేదోపహతులు స్వయంకృతాపరాధులు కారు. అజ్ఞానదూషితభావులు స్వయంకృతాపరాధులు. జీర్ణమే భూతార్థకము. ౦ొంగాక తద్ధర్మాద్యర్థకము. శ్లోకార్థము కంటె భిన్నము. అంతేకాదు. సూటిదనము, ధాటీగతి శ్లోకమునందు జీవలక్షణము. అది పద్యమునకు అందని ఫలము. శ్లోకము సజీవము. పద్యము నిర్జీవము. తిమ్మన తెనుగుసేత ఉత్పలమాల. అది కూడ నిర్జీవము. ఏనుగు లక్ష్మణకవి తెనుగుసేత తేటగీతి. సజీవము.

శార్దూలశ్లోకమును శార్దూలపద్యముగ రచించునెడ కూడ బాలసరస్వతి తెనుగుసేత పేలవము.

"ఉద్వృత్తః స్తనభార ఏష తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదం కుర్వన్తు నామ వ్యథామ్,
సౌభాగ్యాక్షరపఙ్క్తి, కేన లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాపి కరోతి తాపమధికం రోమావళిః కేన సా." 15 శృం. శ.

"భ్రూరేఖ ల్చలము ల్స్వభావచపలంబు ల్నేత్రము ల్మోవి యెం
తే రాగాస్పద మింతి చన్మొఁగవ యుద్వృత్తంబు పెల్లేమఁబో
మారాక్షప్రశుభాక్షరాళిసమమై మధ్యస్థత న్బొల్చు నూ
గా రెట్లేచు విచిత్రమో సురభిమల్లా! మానినీమన్మథా! 14 శృ. శ.

తరళశబ్దము చాపల్యముతోపాటు సౌందర్యమును వ్యక్తము సేయును. పద్యమునందు చాపల్యమేగాని సౌందర్యము లేదు. రాగాధిష్ఠిత - ఓష్ఠపల్లవము శబ్దసౌందర్యము, అర్థగౌరవము కలది. పద్యమునందు శబ్దసౌందర్యము లేదు. అర్థగౌరవమును లేదు. సౌభాగ్యాక్షరపంక్తి స్పష్టము. అక్షప్రశుభాక్షరాళి క్లిష్టము. అధికతాపమును కలిగించునని శ్లోకార్థము. ఎట్లేచు అని పద్యప్రశ్న. "పెల్లేచు" కు "ఎట్లేచు" అనుప్రాసము కావచ్చునుగాని, శ్లోకార్థము రాదు. శ్లోకమునందు లేని విచిత్రము పద్యమునందు కలదు. అది గణ మాత్రయోజని. తిమ్మన తెనుగుసేత లభింపలేదు. ఏనుగు లక్ష్మణకవి తెనుగుసేత ఎంతో మెఱుగు. శబ్దసౌందర్యము లేకపోయినను, అర్థగౌరవము కలదు.

పెద్ద శ్లోకమును చిన్నపద్యముగ రచించునెడ సహితము బాలసరస్వతి తెనుగుసేత న్యూనాతిరిక్తము.

"కిం కన్దాః కందరేభ్యః ప్రళయ ముపగతా నిర్ఝరా వా గిరిభ్యః
ప్రధ్వస్తా వా తరుభ్యః సరసఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః
వీక్ష్యన్తే యన్ముఖాని ప్రసభ మపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖాప్తస్వల్పవిత్తస్మయపవనవశావర్తిభ్రూలతాని." 25 వై. శ.

ద్రుమశాఖోద్భవవల్కలప్రకర మబ్బ ల్పొచ్చెనే శైలజా
లములందున్ ఫలమూలకందజలము ల్వాడయ్యెనే కృచ్ఛ్రల
బ్ధమనాగ్వృత్తమదానిలాప్తి బొమ లుత్కంపించు మన్నీలఁ గొ
ల్వ మదం బేమి జనాళికి న్సురభిమల్లా! వైదుషీభూషణా." 25వ. వై. శ.

వినయము బొత్తిగా లేని నీచుల ఏడుపుతో లభించిన స్వల్పధనమువలని గర్వమనెడు గాలికి కదలాడు బొమతీవలు కల మొగములు చూచుచుండుటకు - గుహలలో

కందమూలములు, కొండలలో సెలయేళ్లు నాశనమైపోయెనాయేమి? చెట్ల మధురమైన ఫలములు. నారచీరలు ఒసగు కొమ్మలు విఱిగి పోయెనాయేమి? అని శ్లోకార్థము. అది పద్యమునందు అస్తవ్యస్తము. శ్లోకములోని " దుఃఖాప్తస్వల్పవిత్తస్మయ" సమాసము సరళము. పద్యములోని "కృచ్ఛ్రలబ్ధమనాగ్విత్తమద" సమాసము కఠినము. "వీక్ష్యన్తే యన్ముఖాని" వ్యంగ్యవాసన కలది. "కొల్వ ముదం బేమి?" వాచ్యతాదోషము పొరయునది. శ్లోకము ముని విషయము. "జనాళి" విషయము కాదు. అంతేకాదు. పద్యమునందు చెట్ల కొమ్మల పుట్టు నారచీరల సముదాయము సముద్రములలో ప్రవేశించెనా? అనుట, ఫలమూలకందములు పర్వతసమూహములందు పాడయ్యెనా అనుట సహజము కాదు. కృతకము. పుష్పగిరి తిమ్మన తెనుగుసేత లభింపలేదు. ఏనుగు లక్ష్మణకవి తెనుగుసేత సహజసుందరము.

చంద్రికాపరిణయము సురభి మాధవరాయల చంద్రికాపరిణయము కంటె భిన్నము. మాధవరాయల చంద్రికాపరిణయము వసుచరిత్రమునకు వంతపాట అయినను, వసుచరిత్రము వలె ప్రఖ్యాతేతివృత్తము కలది కాదు. కల్పితేతివృత్తము కలది. అందుకు ప్రఖ్యాతేతివృత్తమైన చంద్రికాపరిణయము రచించుట బాలసరస్వతి ఆశయము కావచ్చును. భట్టుమూర్తి వసుచరిత్రము భారతప్రోక్తము. బాలసరస్వతి చంద్రికాపరిణయమును భారతప్రోక్తము[39].

"పరికించి కంటి భీముఁడు
భరత. . . . . . . కాశిపతికన్య స్వయం
వరలబ్ధ వేడ్కఁ జేకొని
పరిణయమైనట్టి యాదిపర్వకథఁ దగన్.
ప్రకటముగఁ గల్పనాకథ
లొకకొన్ని యమర్చి యది ప్రయోగార్హపదా
ది. . . . . . . . . . . . కృతియై
ప్రకృష్టవర్ణనల మెఱయఁ బరికల్పింతున్."

యాదవరాఘవపాండవీయము త్ర్యర్థికావ్యము. భారత, భాగవత, రామాయణము పరముగ అర్థత్రయము. ద్వ్యర్థికావ్యము కంటె త్ర్యర్థికావ్యము చిత్రకావ్యము.

బాలసరస్వతి అభిప్రాయమిది [40]:

"ప్రజ్ఞకును సాక్షి యరయఁ గబ్బంబ కాన
నద్భుతంబైన నా ప్రజ్ఞ కనుగుణంబు
గా నితరదుష్కరంబైన కబ్బ మెద్ది
సేయువాఁడనొ యంచు యోజించి మదిని.
మెండైనట్టి విచిత్రవైఖరులచే మీఁదౌ మహాకావ్యముల్
దండిం దొల్లియ చేసి రాదిములు తత్కావ్యాధికశ్లాఘమై
నుండన్ రాఘవకృష్ణపాండవకథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యం బలరార శ్లేషరచనైకప్రౌఢి నేఁ జేసెదన్.
ఖ్యాతికై కొంద ఱేమేమొ త్ర్యర్థికృతులు
చేసితి మటందు రది కల్లసేయ నేల?
సరసులకు ప్రతిపద్యవిస్మయ మొసంగు

నాదు కబ్బంబునకు సాటి లేదు గాన
ప్రకృతి కథాశ్రితయశ్లే
షకావ్యమిది యిందు నిజము శబ్దశ్లేషా
ధికవిరచన యర్థశ్లే
షక్ఌప్తి యొక్కొక్కయెడల జతయై మెఱయున్."

ప్రజ్ఞాప్రదర్శనమునకు, వాక్పాండిత్యప్రకర్షకు, ప్రతిపద్యవిస్మయప్రతిష్ఠాపనమునకు, త్ర్యర్థికావ్యము సాముగరిడీయే.

# సవరము చిననారాయణనాయకుడు

ఇతని కృతి కువలయాశ్వచరిత్రము. పినతండ్రి, దత్తత తండ్రి అయిన పెదనారాయణనాయకునికి అంకితము. అతడు "వయిఖందుఖానుపై . . . విజయశాలి." (16ప. 1ఆ.) "శ్రీరంగరాజకుమారవీరవేంకటరాయభుజాబలసహాయబహువిధోపాయధురీణు'డు. (17ప. 1ఆ.) "వీరవెంకటరాయభూవిభుని కరుణఁ బరఁగు" వాడు. (59ప. 1ఆ.) "తన కీర్తి మట్ల్యనంతనృపాలముఖ్యగోత్రామరేంద్రులు కొనియాడ ...... వెలయు" వాడు. (60ప. 1ఆ.) "వీరవెంకటనృపాలశ్రీమహారాయదత్తక్ష్మామండలమండనాయితయశోదామాభిరామాంశవీరక్ష్మావర్తను"డు (165ప. 3ఆ.) అనగా మట్లి అనంతరాజుతోపాటు సవరము పెదనారాయణవీరవెంకటమహారాయల సామంతరాజని అవగాహనమగును. శ్రీరంగరాజకుమారుడైన వీరవేంకటమహారాయలు మూడవ వెంకటపతిదేవరాయలు. (1630-42) మట్లి అనంతరాజు సిద్దవటశాసనకాలము 1606 వ సంవత్సరమని పూర్వోక్తము. ఇతడు కొనియాడిన, అతడు క్ష్మామండల మొసగిన సవరము పెదనారాయణ ప్రాభవకాలము 1610-40 అగును. కాఁబట్టి చిననారాయణ కువలయాశ్వచరిత్రము రచనాకాలము 1630 ప్రాంతము కావచ్చును.

కువలయాశ్వుని చరిత్రము. కువలయాశ్వచరిత్రము. కువలయాశ్వుడు బిరుద నామము. అసలు పేరు ఋతధ్వజుడు. చిననారాయణ కువలయాశ్వచరిత్రమునకు మూలము మార్కండేయపురాణములోని అలర్కచరిత్రమునందలి కువలయాశ్వుని వృత్తాంతము. అది నిమిత్తమాత్రమైన ఆధారముగ ఇది స్వతంత్రకావ్యము. మూలమునందు కువలయాశ్వుడు పాతాళకేతుడను రాక్షసుని సంహరింపకముందే, మదాలసాకువలయాశ్వుల వివాహము జరుగును. మదాలస ప్రాణసఖి కుండల తపస్సు చేసి దివ్యగతి కేగును. పాతాళకేతుని సోదరుడు తాళకేతుని మాయ వలన మదాలస మరణించును. అశ్వతరుడు సరస్వతీవరప్రసాదమైన సంగీతవిద్యచేత శివుని మెప్పించి, మదాలసను తనయగా బడసి, కులయాశ్వునికి ఒసగును. అతడు మదాలస పుత్త్రులకు తత్త్వోపదేశము సేయును. అలర్కుడను మదాలసపుత్త్రునికి కర్మమార్గమును ఉపదేశించును. కువలయాశ్వచరిత్రమునందు కువలయాశ్వుడు పాతాళకేతుని సంహరించిన తర్వాత మదాలసాకువలయాశ్వుల వివాహము జరుగును. కుండల మదాలసతోనే ఉండును. తాళకేతుడు మదాలసను, కుండలను అపహరించును. అశ్వతరుడు శివుని మెప్పించి, మదాలసను రప్పించి, కువలయాశ్వునికి ఒసగును. గంగాగౌరీసంవాదము కలదు. జయంత, నలకూబరులు తాళకేతుని సంహరింతురు. తారాజయంత, తారానలకూబరశృంగారవృత్తాంతములు కలవు. ఇవి అమూలకములు.

ప్రథమాశ్వాసమునందు కథానాయకుని పరిచయము కలదు. ద్వితీయాశ్వాసమునందు ప్రతినాయకుని పరిచయము, నాయకప్రతినాయకుల 'యుద్ధము కలదు. అది కొలదిగ తృతీయాశ్వాసమునందు కొనసాగినది. అది పూర్వకాలికయుద్ధము కాదు. సమకాలికయుద్ధము.

"ఈ రీతి సైన్యమంతయుఁ
జేరిన, నొక బయలు రాజసింహము భటులన్
డేరిజ వేయం బనిచి, గు
డారము లెత్తించి, యంతట న్రవి గ్రుంకన్." 85ప. 2ఆ.

"బొంగులు నిల్పి యుబ్బుగఁ బైఁడిఁవ్రాత బొ
మ్మల గుడారంబు లమర్చువారుఁ
గొయ్యలు నాటి యాకులతోఁడి రెమ్మల
వాటంపు గుడిసెలు వైచువారుఁ
బొక్కళ్లవలెఁ గుంతములు ,చేర్చి యామీఁద
గడితంపుఁబచ్చడా ల్గప్పువారుఁ
బచ్చిక ల్చెక్కుడు పాఱలఁజెక్కి పూఁ
బొదరిండ్ల మున్నుగాఁ గదియువారు
నచ్చముగ నీటి కందువ లరయువారుఁ
బురుగుపుత్రలు బెడద నుబ్బుచును నొక్క
పరిగ నవ్వుచుఁ జప్పట్లు చఱచువారు
నైరి తద్వేళఁ బాళెంబు వార లెల్ల." 107ప. 2ఆ.

"ఒకపరి యొడ్లలోని రిపు లుగ్రత వైచు తుపాకిమందు గుం
డ్లకు వెనుదీయ కాగి యచటంబడు నొప్పులఁ గోలుగొట్ట నీ
య కనిఁ బెనంగి యంత దరియంబడి, యచ్చటివారలం గకా
పికలుగఁ దోలి యొడ్లు విడిపించిరి చేరువకాంద్రు మెచ్చఁగన్." 134ప. 2ఆ.

తుపాకీమందు తోపాటు నల్లమందును కువలయాశ్వచరిత్రమునందు కలదు. (115ప. 2ఆ.) "ఉక్కళపు నల్లమందుల యొంటికాంద్రు."

తృతీయాశ్వాసమునందు మదాలసాకువలయాశ్వుల ప్రణయము, విరహము, సవివరముగ కలవు. కుండల మదాలస సౌందర్యమును కువలయాశ్వునికి తెలిపిన తీరు ప్రత్యంగవర్ణనము కాదు. ప్రత్యేకతాప్రకటనము.

"ఏటికి మాటలు? నాఁటికి
నేఁటికి మగవాఁడు వలచునే కద! విను మా
బోటి తటాలునఁ జూచిన
నాఁటది వలచున్ మనోంబుజాగ్రమునందున్ " 70ప. 3ఆ.

"కొలువునకు నేఁగు రంభ నిచ్చలము గాఁగ
నగరులోపలఁ జొచ్చి, మా నాఁతి చక్క
దనము వీక్షించి, యామె నిద్దంపుఁజెక్కు
నొక్క ముద్దిడుకొని పోవు నొక్కవేళ." 71ప. 3ఆ.

చతుర్థాశ్వాసమునందు నాయికాపహరణము, నాయకవిరహము, అశ్వతర వృత్తాంతము, కువలయాశ్వుని నాగపురప్రవేశము, మదాలసావీక్షణము, తారాజయంత నలకూబరవృత్తాంతము కలవు. జయంతుని విలాసము, నలకూబరుని విలాసము సమకాలికవిటవిటవికారములే.

"తారావధూటి బందాకోరుగాఁ జేసె
మన జయంతుఁడె జాణయనెడు వారు

నదిగాక మోహింప దతని బంటుగా నేలు
కొనుటకై యట్లున్నదనెడు వారు
దీని కేమాయెనే? వావిఁగాక మతెవ్వ
రిని బిల్వరఁట చూడు మనెడు వారు
నది యింత వాని మాయలకు లోఁగునె యెంద
తినిఁ జిక్కఁబెట్టునో యనెడు వారు
నగుచు నచ్చర నెచ్చెలు లాడుకొంద్రు
నిగళముతోడ మదహస్తి నిగుడు పగిది
వెంటఁగావలి మాష్టీలు వేగిరింప
భూదరారాతి నగరికిఁ బోవు వేళ." 184ప. 4ఆ.

పంచమాశ్వాసమునందు తారానలకూబరవిలాసము, రంభావిరహము, నారదా గమనము, జయంతనలకూబరసంఘర్షణము, తాళకేతుసంహారము, మదాలసాకువల యాశ్వవివాహము కలవు. నాయికానాయకసంభోగశృంగారము సూచనప్రాయము. "విభుఁడు చిఱునవ్వొలయన్"

"లేచి నిలువుననే కౌఁగిలించుకొనుచు
విరుల పాన్పున నుంచి, పెన్నెరులు దువ్వి,
కప్పురపుఁదావి గుప్పు బాగా లొసంగి,
పాదలి తమకంబు రెట్టింప బుజ్జగించి. 109ప. 5ఆ.

అలరు లానిన తుమ్మెదలొ? నిక్కపున్ రంగొ?
తరుణి! చూత మటంచుఁ గురులు దువ్వి
కమ్మబంగరు నిగ్గొ? కలిగిన పలుడాలొ?
చెలువ! చూత మటంచుఁ జెక్కు నొక్కి
ముక్కఱ ముత్తియంపు మెఱుంగొ? లేనవ్వొ!
ముదిత! చూత మటంచు మోవి పుడికి,
కుంకుమ జిగియొ? నెక్కొను గుంపుదండయో?
కొమ్మ! చూత మటంచు గుబ్బ లంటి
తెలివియై మీఱు నూగారు దీప్తియొక్కొ?
మేలి మొలనూలి నీలమో? మెఱుఁగుబోఁడి!
చూతమని పోకముడి విప్పి, సుదతిఁ గరఁచి
యించువిలుకాని సామ్రాజ్య మేలె విభుఁడు." 110ప. 5ఆ.

ఇంతకు మిక్కిలి, వివరము లేకపోవుట విశేషము.

నవరము చిననారాయణనాయకుడు "జాతివార్తాకవిజనామోదసంధాయకు"డని ఆశ్వాసాంతగద్యను కలదు. జాతి అన స్వభావోక్తి, వార్త అన సామెత అని పూర్వోక్తము. జాతివార్తలు చమత్కారమునకు ఉపలక్షణము. కువలయాశ్వచరిత్రమునందు స్వభా వోక్తులు బహుళము సామెతలు విరళము చమత్కారము సకృన్మాత్రము.

"కలకల నవ్వు మోము పురి గట్టిన నెమ్మియి నూఁగునూఁగుమీ
సలు, నవరంజిడా లెగుభుజంబులు, చక్కని ముక్కు తేటక
న్నులు నిడుసోగకన్బొమలు నొక్కినఁ గ్రక్కునఁ బాలుగాఱు చె

క్కులు నిసుమంత కొను తలుకుందొడ లా నృపమౌళికే తగున్.'' 113ప. 3ఆ.

ఇది జాతి. ఇక వార్త :

"పదరకుమన్న మౌనికులపావన! 'కుమ్మరి కొక్కయేడునుం
గుదియకు నొక్కపెట్టు' నని కోవిదు లాడరె? ఘోరసాధనా
భ్యుదితతపోబలం బటులయో! యొక రక్కసుపాలు చేతురే?
మది మది నుండి మే మెఱుఁగమా మఱి వీని ఖరాపరాధముల్.'' 38ప. 2ఆ.

మఱి చమత్కారము :

" పండ దినంబులం బడగ లించుక నీడఁగఁ బట్టి మౌనులం
గొండొక సేదదీర్చు ఫణికోటులఁ జేరి 'యిదేటి కార్య, మౌ
లెండు మతేమి మే మిచట లేమె?' యటంచు మరల్చి చెల్వుమై
నిండ, మయూరికల్ చికిలినిద్దపు తెక్కల వీచు నక్కడన్.'' 66ప. 2ఆ.

కువలయాశ్వచరిత్రమునందు జాతియములు కొల్లలు. అందు కొన్ని:

తెక్క ముక్కాడనీయక (59ప. 1ఆ.) గొరిజదాటు (95ప. 1ఆ.) తూచి కైకొను (103ప. 1ఆ.) ఉట్టిపడిన సరణిన్ (26ప. 2ఆ.) దయ్యముతోడి జాగరము (79ప. 2ఆ.) విడెము మీఁద వీడియము (89ప. 2ఆ.) పిల్వని పేరంటము (86ప. 3ఆ.) పగవారికైన వలదు (100ప. 3ఆ.) గుండెలో గాలము (26ప. 4ఆ.) పొట్టక్రొవ్వు గాక (65ప. 4ఆ.) "ముక్కు మొకముఁ జూడక'' (164ప. 4ఆ.) గురువులకు బొమ్మవెట్టుట (45ప. 5ఆ.) వెళ్లియెత్తిన రీతి వెచ్చపెట్టు (58ప. 5ఆ.) అన్నియుఁ దెలిసిన వన్నెలాడి (106ప. 5ఆ)

వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు ఓరుగల్లులోని కోళ్ల పోరు కలదుగాని, చిన నారాయణ కువలయాశ్వచరిత్రమునందు దేవలోకములోని కోళ్ల పోరు కలదు. కోడి పందెము కోడి పడవ అని కలదు. నలకూబరుడు తోడి యక్షకుమారులతోడి కోడి పడవ గొడవల బడి, గౌడ పైల శలాయత్తు కాకి వన్నెలకోళ్లు తెచ్చి, ఎదుటివానిని కోడిని విడువుమని కోళ్ల పోరు సాగించును. కుక్కుటయుద్ధము క్రీడాభిరామమునందు వలె, కువలయాశ్వచరిత్రమునందు ఒక వచనమునందు కలదు. (210వచ. 4ఆ.) అది స్వభావోక్తిసుభగము.

సుకుమారశ్లేషయును కువలయాశ్వచరిత్రమునందు కలదు.

"కాదంబరి స్వాదించియు,
మోదంబునఁ గౌముదీసమున్మేషము సం
పాదించియుఁ దబ్బిబ్బుగ
వాదింతురు రేలు వారవనితలు వీటన్.'' 87ప. 1ఆ.

వారవనితలు మదిరాపానము చేసి, వెన్నెల వికాసము నంది తబ్బిబ్బుగ వాదింతురని, కాదంబరీకావ్యరసాస్వాదనము చేసి, కౌముదీవ్యాకరణపరిజ్ఞానము నంది తబ్బిబ్బుగ వాదింతురని అర్థద్వయము. వారవనిత లన వేశ్యలని, మధుపాత్రలు కల వనితలని అర్థద్వయము. కాదంబరీ కావ్యపరిశీలితలైనను, కౌముదీవ్యాకరణపరిజ్ఞానకలితలైనను మధు పాత్ర మహిమను తబ్బిబ్బుగ వాదించుట సహజము. ఇది భంగ్యంతరముగ స్త్రీల సంస్కృతపాండిత్యమునకు నిదర్శనము. సమకాలికసమాచారము.

కువలయాశ్వచరిత్రమునందు పుర (69-88ప. 1ఆ; 136-138ప. 4ఆ.) నాయక (89-93ప. 1ఆ.) గ్రీష్మర్తు (94-105ప. 1ఆ.) ఘూర్యోదయ (51ప. 2ఆ.) ప్రయాణ (142-58ప. 2ఆ.) ఆశ్రమ (59-72ప. 2ఆ.) యుద్ధ (54-153ప. 2ఆ.; 3-14ప. 3ఆ.) విటీవిట (111-116ప. 2ఆ.) నాయికావిరహ (25-48, 78-86, 99-117ప. 3ఆ.) వసంతర్తు (87-98ప. 3ఆ.) వనవిహార (110-130ప. 3ఆ.) జలకేళి (133-144ప. 3ఆ.) మన్మథపూజ (145-154ప. 3ఆ.) శిశిరోపచార (134-144ప. 3ఆ.) సాయంసంధ్య (5-11ప. 4ఆ.) అంధకార (12-18ప. 4ఆ.) చంద్రమన్మథోపాలంభ (19-32ప. 4ఆ.) పుష్పాపచయ (139-143ప. 4ఆ.) నాయకవిరహ (190-192ప. 4ఆ.) కోడిపడవ (207-211ప. 4ఆ.) వివాహ (84-101ప. 5ఆ.) వర్ణనలు కలవు.

# కంకంటి పాపరాజు

ఇతని కృతులు 1. విష్ణుమాయావిలాసము. యక్షగానము 2. ఉత్తరరామాయణము- మొదటిది మదనగోపాలునికి అంకితము. రెండవది కృష్ణునికి అంకితము. రెండును దైవాంకితములు. ఒక అతిశిథిలమైన, ప్రాచీనమైన ఉత్తరరామాయణము తాళపత్ర గ్రంథము తుదిని, "ప్రజోత్పత్తినామసంవత్సరపుష్యబహుళేకాదశిలుమందవారం వరకు మునగాల తిరువెంగళయ్య వ్రాసిన ఉత్తరరామాయణము సంపూర్ణము." అని కలదు[41]. అది 7.1.1632 వ తేదీ. కాఁబట్టి విష్ణుమాయావిలాసము రచనాకాలము 1625 ప్రాంతము ఉత్తరరామాయణము రచనాకాలము 1630 ప్రాంతము కావచ్చును.

**విష్ణుమాయావిలాసము** : ఇది కందుకూరి రుద్రయ సుగ్రీవవిజయము వలె గేయప్రధానమైన యక్షగానము. ప్రారంభదశాలక్షణలక్షితము. ఇందు "కవి తిమ్మనార్య ప్రముఖులు' కంకంటి పాపరాజును వినుతించునట్లు కలదు (పుటలు 3-4) కవి తిమ్మన అన పుష్పగిరి తిమ్మన అగును. "వినుతించు"నట్లు వినా "తోడైనయట్టులు" లేదు. మదన గోపాలుని "కటాక్షప్రభావసంకలితసాహిత్యశాలి" (పుట 72) కంకంటి పాపరాజు రచించినట్లు కలదు. ఇందు చింతలపూడి ఎల్లనార్యుని విష్ణుమాయావిలాసనాటకములోని ఒక నాటకము ఇతివృత్తము. నారదుడు - శివుడు కాలకూటమును కంఠనిక్షిప్తము కావించి, నిష్క్రమించిన తర్వాత, విష్ణువు జగన్మోహినియై అమృతము పంచిపెట్టిన సంగతి చెప్పి,

"ఆ వెలంది నైఖరులకు
నసురవరులు వలచుటెంత
భావజారి, నీవు గన్న
భ్రమసిపోదు వింతయేల" పుట 19

అని జగన్మోహినిని వర్ణించిన, శివుడు పార్వతితో -

"వింటివే కలకంఠి, యీ ముని వీరి వారి ననియెడి
దంటతనమున నన్ను నెంచక తాకనాడెన్
రమణి యగు హరిఁ జూచి లోకులు భ్రమయునటులు నేనును
భ్రమలఁ జిక్కుదునఁట యదెక్కడి పలుకు చెపుమ
కలహముని నా వద్ద నూరక కల్లలాడెను నేఁజని
నలిననాభునిఁ దెలిసి చూడక నమ్మరాదు." పుట 19

అని పార్వతి వారించినను వైకుంఠమునకు వచ్చి, విష్ణువును జగన్మోహినీరూపము ధరింపుమని కోరును. విష్ణువు జగన్మోహిని అగును. శివుడు మోహవిభ్రాంతుడగును. వైకుంఠసభ శృంగారవనమగును. జగన్మోహిని అదృశ్యమగును. శివుడు విరహోన్మత్తుడగును. కడకు శివుడు కనిపించిన జగన్మోహినిని కౌగిలించును. పారవశ్యము పటాపంచలమగును. శివుడు కన్నులు విచ్చి చూచును. శృంగారవనము వైకుంఠసభయై కనిపించును. జగన్మోహినీరూపము త్యజించి విష్ణువు సభాస్థలి నుండును. బ్రహ్మజ్ఞానభానుడు పాదల శివుడు విష్ణుమాయను గ్రహించును. సరస్వతి ధవళము, నారదుడు శోభనము, దిక్పాలకసతులు మంగళము పాడుదురు. విష్ణుమాయ అవిలంఘ్యమని ఫలశ్రుతి.

**ఉత్తరరామాయణము** : ఇది పుష్పగిరి తిమ్మన రచించినట్లు వాదము కలదు[42].

అందుకు హేతువులు 1. ప్రతీతి 2. ప్రాంతీయమైన ప్రాఁత వ్రాఁత పుస్తకము గ్రంథాంత గద్యమునందు పాపరాజప్రమోదనార్థము తిమ్మకవి రచించినట్లు ఉండుట. 3. ఉత్తరరామాయణమునకు పుష్పగిరి తిమ్మన సమీరకుమారవిజయమునకు పదైక్యము పద్యైక్యము ఉండుట. కాని, పుష్పగిరి తిమ్మన రచింపలేదని, కంకంటి పాపరాజే రచించెనని ప్రతివాదము కలదు[43]. అందుకు హేతువు శైలీభేదము. ప్రతీతి పరమప్రమాణము కాదు. ప్రాత వ్రాత పుస్తకములోని వ్రాత ప్రతీతి ఫలితము కావచ్చును. పదైక్యము, పద్యైక్యము కూడ పరమనిర్ధారకసాధనములు కావు. శైలీసామ్యము కంటె శైలీభేదము గమనార్హమైనది. అంతేకాదు. పాపరాజు ఉత్తరరామాయణమునందు ఇట్లు కలదు.

"హనుమద్దివ్యపదారవిందమకరందానందనేందిందిరా
త్ము ననేకాంధ్రకృతిప్రకల్పనసమర్థుం బుష్పగిర్యప్పనా
ర్యుని సత్పుత్త్రునిఁ దిమ్మకవిచంద్రున్ మత్సహశ్రోతఁ బ్రొ
ద్దున నేఁ బిల్వఁగఁ బంచి కన్న కల సంతోషంబునం దెల్పినన్. 24
అతఁడానందముఁ జెంది, నన్నుగని యన్నా! జాళువాపైఁడికిం
గృతవర్ణాంచితరత్నమబ్బినటులయ్యెన్, నీవు వాక్ప్రౌఢిమన్
గృతి సేయంగఁ దొడంగు రామకథకుం గృష్ణుండు రాజౌటఁ బ్ర
స్తుతి గావింపఁగ మాకు శక్యమె భవత్పుణ్యప్రతాపోన్నతుల్. 25

అని కిరీటికి శౌరి తోడైనయట్టు
లమ్మహాకవి సాహాయ మాచరింప
గతి నొనర్పఁగఁ బూనిన యేను మొదట
నెంతు మద్వంశవిధ: మదియెట్టు లనిన." 26ప. పీ.

ఇది చాలును ప్రతీతి ప్రభవించుటకు! ప్రతీతి లేకపోయినను వాదము ప్రభవించుటకును చాలును. "పాకశాసనికి .... నారాయణునట్లు ..... నారాయణభట్టు ..... సహాధ్యాయుడునైన వాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్" అను నన్నయ పద్యమునుబట్టి, నారాయణభట్టు "మహాభారతసంహితారచనబంధురుఁడయ్యె" నను వాదము పుట్టినది. గిట్టినది. "కిరీటికి శౌరి తోడైన యట్లు" అను పాపరాజు పద్యమునుబట్టి, తిమ్మన ఉత్తర రామాయణము రచించెననువాదము పుట్టును. గిట్టును. పాపరాజు పద్యములలోని "అతఁడు", "అన్నా!", "నీవు", "ఏను", "మద్వంశవిధము" అనుమాటలు అర్థరహితములు కావు. తిమ్మనయే ఉత్తరరామాయణమును రచించిన, పాపరాజు వంశమును "మద్వంశ" మనుట అసంగతము. అసంభవము. అంతేకాదు. తిమ్మన "అనేకాంధ్రకృతి ప్రకల్పన సమర్థు"డు, "మహాకవి" అని కలదుగాని, సమీరకుమారవిజయకర్త అని లేదు. ఇది గమనార్హమైన అంశము.

పుష్పగిరి తిమ్మన వంశీయుల దగ్గఱ తిమ్మన వంశవృక్షము కలదు. అది ప్రకటితము[44]. వంశవృక్షము నొసగిన పుష్పగిరి వెంకటకృష్ణయ్య జీవితకాలము 1912-77. అతని తండ్రి దక్షిణామూర్తి జీవితకాలము 1877-1947. ఇతనికి తిమ్మనకు నడుమ ఆరు తరములు కలవు. తరమునకు అసాధారణపద్ధతిని నలుబదియైదు సంవత్సరములు పరిగణించినను, తిమ్మన జీవితకాలము 1877-1947 - 45×6=270=1607-1677. ఇంతకంటె పూర్వమగుట దుర్ఘటము. పుష్పగిరి తిమ్మన జీవితకాలము 1607-77 కాఁబట్టి,

సమీరకుమారవిజయము రచనాకాలము 1640 ప్రాంతము కావచ్చును. కనుక ఉత్తరరామాయణములోని "అనేకాంధ్రకృతులు" తత్పూర్వకృతులగును. "మహాకవి" అనుట సహస్రోత్ప్రశంస అగును. ఉత్తరరామాయణము రచనాకాలము 1630 వ సంవత్సరము కావున, కంకంటి పాపరాజు జీవితకాలము స్థూలముగ 1590-1660 కావలయును. ఇది తిమ్మన, పాపరాజును 'అన్నా!' అని సంబోధించుటకు అనుకూలము. ఉత్తరరామాయణరచనాకాలము 1630 వ సంవత్సరము, సమీరకుమార విజయరచనా కాలము 1640 ప్రాంతము కాఁబట్టి; పదైక్యము, పద్యైక్యము, పద్యసంవాదము- పుష్పగిరి తిమ్మన కావించిన, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణములోని కవితాచర్వణమగును.

తిక్కన ఉత్తరరామాయణము రచించిన తర్వాత, పాపరాజు మఱల ఉత్తర రామాయణము రచించుటకు తెలిపిన హేతువులు సవినయనివేదనములు.

"వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై తగం జేసె ను
త్తరరామాయణ; మందునన్ మఱి ప్రబంధం బూని నిర్మించుటే
సరసత్వంబని ప్రాజ్ఞులార! నిరసింపంబోకుఁడీ! రాఘవే
శ్వరు చారిత్రము నెంద ఱెన్ని గతులన్ వర్ణించినం గ్రాలదే? 14
మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుడు చారుకవిత్వము నేర్చి, జానకీ
జాని కథల్ రచింపక యసత్కథ లెన్ని రచించెనేనియున్
వాని వివేకమేమిటికి? వాని కవిత్వమహత్త్వమేటికిన్? 15
శ్రీకరరామమంత్రజపసిద్ధిఁ బ్రసిద్ధి వహించి, వెన్క వా
ల్మీకి రఘుప్రవీరు కథలే రచియించి గదా చెలంగె? ము
ల్లోకములందు నెల్లమునులుం గొనియాడఁగ; నట్టి దౌటఁ బు
ణ్యాకరమైన రామకథ హైన్యము మాన్పదె యెట్టివారికిన్? 16
ఆ వాల్మీకిమనీషివర్యమతిమంథాహార్యసంశోభితం
బై, విశ్వాతిగకామితార్థఫలదంబై, శ్రీపదంబై, సుశ
బ్దావాసంబయి, మాధురిం దనరు రామాంచత్కథాక్షీరపా
రావారంబు సమాశ్రయింతుఁ గవితాప్రఖ్యాతికర్ణంబుగన్." 17పే.

ఇవి భట్టమురారి అనర్ఘరాఘవమును రచించుటకు తెలిపిన హేతువును ఉపజీవించునవి.

"యది క్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్యచరితం
గుణై రేతావద్భి ర్జగతి పునరన్యో జయతి కః ?
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధు
స్ఫురద్వాగ్బ్రహ్మణః కథ ముపకరిష్యన్తి కవయః 9 శ్లో. 1అం.

పూర్వకవులు నలగగొట్టిరని రాముని చరితమును వదలివైచిన, ఇంతలేసి సద్గుణములతో మఱొకడు జగత్తులో ఎవడు జన్మించును? ఆ యా గుణముల గొప్ప దనముతో గంభీరముగ, మధురముగ స్ఫురించుచున్న వాక్కులకు బ్రహ్మలైన కవులు తమ్ము తాము ఎట్లు రక్షించుకొందురు? అని అర్థము.

తిక్కన ఉత్తరరామాయణము కంటె పాపరాజు ఉత్తరరామాయణము రసవత్తరము. కారణము ప్రపంచీకరణము.

తిక్కన పూర్వరామాయణకథ ఇరువది రెండు పద్యములందు కలదు. (64-85ప. 1ఆ.) పాపరాజు పూర్వరామాయణకథ అరువది మూడు పద్యగద్యములందు కలదు. (24-86ప. 1ఆ.) తిక్కన పూర్వకథను శ్రీరామపట్టాభిషేకము వర్ణనము లేదు. "జననాథుఁడు పూజ్యరాజ్య సంపదనందెన్" అని మాత్రమే కలదు. పాపరాజు పూర్వకథను శ్రీరామపట్టాభిషేకవర్ణనము మూడు పద్యములందు కలదు. అందు రెండు సీసపద్యములు. ఒక సీసపద్యమిది:

"కమనీయరత్నోర్మికలఁ బూని సితఫేన
చందనాంగకుఁడయ్యె సాగరుండు
పైరుపచ్చల తాళి మీఱు మొల్కల గగు
ర్పాటుఁగంచుక మూనె రత్నగర్భ
వినుఁగెంపుఁబతకంబు గనిపింప సురదీర్ఘి
కాచేలయై మించె గగనలక్ష్మి
విమలకోరకమౌక్తికములతోఁ జిగురుఁగెం
బట్టుఁబుట్టముఁ గట్టె బహువనాళి
కుంభికుంభాగ్రశోణమృత్కుంకుమంబు
దంతరుచివజ్రహారముల్ దాల్చె దిశలు
సీతతోఁగూడి సరిలేని చెలువు పూని
శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁడైన." 85ప. 1ఆ.

వేదవతి వృత్తాంతము తిక్కన ఉత్తరరామాయణమునందు ఇరువది పద్యములందు కలదు. (4-20ప. 5ఆ.) పాపరాజు ఉత్తరరామాయణమునందు పాతికపద్యములందు కలదు. (103-129ప. 3ఆ.) వేదవతి "రోషమహానలజ్వాలనమూర్తి యగుచు" రావణునితో,

"బన్నము లిట్లు నీవు వఱుపంబడి మేను దొఱంగుచుండి యే
నిన్ను శపించినట్లయిన నిర్మలనిత్యమహాతపః ప్రభా
వోన్నతి చేటు గాదె పునరుద్భవమయ్యెద నీకు మృత్యువై
సన్నుతపుణ్యజాత యనఁజాలి యయోనిజమూర్తిఁ దాల్చెదన్ 19
ఈ పరిభవంబు బడియుం
దీపే ప్రాణంబు లనుచు దిగ్గన ననలం
బాపాదించి దశానను
నేపడఁగన్ విష్ణు నాత్మ నిడి సొరఁ జొచ్చెన్." 20ప 5ఆ.

అని తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు. ఇది పాపరాజు ఉత్తరరామాయణమునందు ఇట్లు కలదు. వేదవతి,

"ప్రళయాగ్నిజ్వలితేక్షణప్రభల నప్పౌలస్త్యునిన్ గాల్చు న
ట్టుల వీక్షించి," దురాత్మ! నిన్నపుడె దుష్టుండంచుఁ జింతించియున్
దెలివిన్ విశ్రవసుం దలంచుకొని యాతిథ్యంబు గావించి, మా
ర్పలుకుల్ వల్కిన నింతయుం గలిగె; నోర్వన్ గూడునే యింకిటన్. 124
ఘోరస్ఫారమదీయకోపదహనక్రూరార్చులన్ నీఱుగా
నీ రూపంబు దహింపకోర్చితిఁ దపోనిష్ఠార్థలోభంబుచే;
నోరీ! నీ విపు డంటుకొన్న మెయి నేనొల్లన్ జ్వలద్వహ్నిలో

సీత్రై. నిన్ దునిమించు పూనికను జన్మింతున్ ధరన్ గ్రమ్మఱన్. 125

అని మహోగ్రతఁ బలికి క్రోధాగ్నితోడ
నచట యోగాగ్నియును మండునటుల చేసి
యయ్యెదుట నిల్చి, శ్రీహరి నాత్మ నునిచి
యేపు సెడి దైత్యుఁడు వినఁగ నిట్టు లనియె. 126

"ఏను నిజంబుగా హరిపయిన్ మది గల్గిన దాననేని, నా
పై నలినాక్షుఁ డాత్మయిడి పత్నిఁగఁ జేకొను మాట తథ్యమౌ
నేని, నయోనిజత్వమున నిద్దరఁ బుట్టి, దశాస్యుఁ బుత్రమి
త్రానుజయుక్తిఁ ద్రుంప నెపమయ్యెదగా"కని వహ్నిఁ జొచ్చినన్. 127

"వేదవతి మాట నిజమగు
వేదము వలె ననుచు మ్రోసె వినువీథి; మహా
మోదమునఁ గుసుమవర్షము
లాదిత్యులు గురిసి రప్పు డవనీనాథా!" (128ప. 3ఆ.)

తిక్కన రచనమున " దిగ్గన ననలంబాపొందిం"చుట సంశయము కలిగించును. పాపరాజు రచనమున "క్రోధాగ్నితోడ నచట యోగాగ్నియును మండునటులచే"యుట సంశయము కలిగింపదు. అంతేకాదు. తిక్కన రచన పుండరీకముకుళము. పాపరాజు రచన సంపుల్ల సరసీరుహము.

రంభారావణసంవాదము తిక్కన ఉత్తరరామాయణమునందు పందొమ్మిది పద్యములందు కలదు. (58-76ప. 6ఆ.) పాపరాజు ఉత్తరరామాయణమునందు ఏబదియేడు పద్యగద్యములందు కలదు. (175-221ప. 4ఆ.) ఇందు రఘునాథనాయకుని వాల్మీకిచరిత్రము, తిక్కన భారతము, పెద్దన మనుచరిత్రము, తిక్కన ఉత్తరరామాయణముల ప్రభావము కలదు. రఘునాథనాయకుని వాల్మీకి చరిత్రమునందు రంభోర్వశులు ప్రయాణమగునపుడు,

"సారిదిఁ జనుదెంచు యజ్వలఁ జూచి నవ్వి
యవ్విబుధకామినులు వారి ననిచి యచట" 86ప. 3ఆ.

అని కలదు. ఉత్తరరామాయణమునందు రంభ నలకూబరుని మేడకు బయలుదేరు నపుడు,

"ఇదుగో మీ విడిదల కేనె వచ్చెద నంచుఁ
దమకించి యజ్వలఁ దాళఁ బలికి" 175ప, 4ఆ.

అని కలదు తిక్కన కీచకవధ ఘట్టమునందు కీచకుడు ద్రౌపది గుఱించి తలపోసి నట్లు (45-47, 67, 83-86,292,310ప. 2ఆ. వి. ప.) పాపరాజు ఉత్తరరామాయణము నందు రావణుడు రంభ గుఱించి తలపోసినట్లు కలదు. (189-194ప. 4ఆ.)

"కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు
మాటలఁ దగు మఱుమాట లార్తుఁ
గుచము లురంబునఁ గుదియించి క్రమమున
నిరిసిన కౌఁగిట నింపొనర్తు
నంగుళంబుల నల్ల నలకలు గబళించి
కెమ్మోవి యాని యెక్కింతుఁ గాయ్వు

మనము మనంబునఁ బెనచి కేళికిఁజొచ్చి
సతిఁదేల్తు సౌఖ్యరసంపునిట్టఁ
దనివు మొదలైనఁ జిగురొత్తు తమకమునకుఁ
బ్రాఁకు వెట్టుచు మగుడఁ బైఁబడుచు నింతి
వింత భంగుల కెలయించి వెకలిఁ జేసి
యభిమతక్రీడనములకు నలవరింతు. 310ప. 2ఆ. వి. ప.

"ఏ మోహనాంగుఁడీ యెలనాగ ముచ్చటల్
వించుఁ గౌఁగిట గారవించునొక్కొ?
ఏ యెమ్మెకాని కీ యింతి వాతెఱ తేనె
లిచ్చి పైకొని రమియించునొక్కొ?
యే మనోహరుఁ డీ వధూమణీమణితంబు
చేఁ బారవశ్యంబుఁ జెందునొక్కొ?
యే వన్నెకాని కీ లావణ్యవతి గోటి
చెనకులు కళ లూరఁ జేయునొక్కొ?
యీ వెలఁది జన్మనామంబు లేమియొక్కొ?
మేలుగని నన్ను రతికేళి నేలదొక్కొ?
యేలకుండిన దీని నే నేలవిడుతు?
నని దశాననుఁ డుద్వృత్తి నట్టి లేచి." 194ప. 4ఆ.

అల్లసాని పెద్దన మనుచరిత్రములోని "ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ" అను పద్యమునకు అనుసరణమైన పద్యము.

"ఎవ్వరి దానవే జలరుహేక్షణ? యెయ్యది పేరు? దెల్పవే,
జవ్వని! యెవ్వనిం దలఁచి చయ్యనఁ బోయెదవే? మిటారి! నీ
జవ్వనమున్ విలాసమును జక్కఁదనంబును నీటు జూచినన్
బువ్విలుకాని కైన భ్రమ పుట్టుగదే! భువనైక మోహినీ!" 196ప. 4ఆ.

తిక్కన ఉత్తరరామాయణములోని రావణుడు "కారించి విడిచిన" రంభ వర్ణనమునకు, (75ప. 6ఆ.) పాపరాజు ఉత్తరరామాయణములోని రావణుడు "అలమటఁబెట్టి విడిచిపెట్టి"న రంభవర్ణనము (220ప. 4ఆ.) అనుకరణము. తిక్కన "అంగనఁబొదివి" అనుపద్యము (74ప. 6ఆ.) గూఢము. పాపరాజు "తమకించి యొడినంచి" అనుపద్యము (217ప. 4ఆ.) గాఢము.

రంభ వావివరుసల వాదమునకు రావణుని ప్రతివాదము పాపరాజు ప్రతిపాదనమే.

"జనకుండు సుతుఁడును జన్నంబు సేసిన
వనిత వారేమి కావలయు నీకు?
నన్నదమ్ములు సోమయాజులై వెలసిన
వనిత వారేమి కావలయు నీకు?
బావయు మఱఁదియు బవరానఁ గూలిన
వనిత వారేమి కావలయు నీకు?
నల్లుఁడు మామయు ననిఁ ద్రెల్లి వచ్చిన
వనిత వారేమి కావలయు నీకు?" 216ప. 4ఆ.

ప్రధానమైన సీతారాముల వృత్తాంతము తిక్కన ఉత్తరరామాయణమునందు రెండు వందల, రెండు పద్యములందు కలదు. (24-136ప. 8ఆ; 4-92ప. 9ఆ.) పాపరాజు ఉత్తరరామాయణమునందు మూడువందల పదియేడు పద్యగద్యములందు కలదు. (20-305, 321-351ప. 6ఆ.) సీతాపరిత్యాగఘట్టము తిక్కన ఉత్తరరామాయణమునందు కంటె, పాపరాజు ఉత్తరరామాయణమునందు పుటపాకప్రతీకాశమైన కరుణరసమునకు కాణాచి. రామాజ్ఞను లక్ష్మణుడు సీతాదేవికి తెల్పుట రెండిట కలదు. లక్ష్మణుడు. దుఃఖించుట పాపరాజు ఉత్తరరామాయణమునందే కలదు.

"జనపతి లోకనిందఁ బడఁజాలక నిన్ వనిఁద్రోయుమన్నచో
విని, సహియించి కానలకు వేగమునన్ గొనితెచ్చి, నిల్వఁగాఁ
జను నెడ లుగ్గడించి, ధృతిసంపదఁ బొంపిరివోవుచున్నవాఁ
డను, ననువంటి మూర్ఖు నకటా! విధియేగతి సృష్టిచేసెనో! 269

×××　　×××　　×××

మితిలేని యీ మిడి మేలంపు మెకములు
　　సకియల బలఁగమే జనని నీకుఁ?
బరికింపరాని యీ బలుమలల్ నవరత్న
　　మయచంద్రశాలలే మాత నీకుఁ?
గడు భీతి ముంచు నీ గహనముల్ విహరింపఁ
　　దగిన పూఁదోఁటలే తల్లి నీకుఁ?
ఘోరనక్రభుజంగకోటితో మలయు నీ
　　హ్రదములు కొలకులే యంబ నీకు?
బంధురములైన యీ మహాప్రస్తరంబు
లిందుమణివేదికలె జనయిత్రి నీకుఁ?
గటకటా! యొంటి నిచ్చోట నెటుల నిలిచె
దమ్మ! నీ యున్కి నేమందునమ్మ? నేను. 273

జననీ! నీవు మహాపతివ్రతవు; నీ సౌశీల్య మిల్లాంధ్ర కె
ల్లను మేల్బంతి; రఘూద్వహాంఘ్రియుగళీలగ్నాత్మవై యుండుమీ
యని నే నెవ్వఁడ విన్నవింపఁ బతిఁ బాయన్జేసి, నిన్నొంటి డిం
చిన పాపాత్ముఁడ; నూరి కేగు మనుచున్ సెల్విచ్చెదే? నావుడున్. 274ప. 6ఆ.

లక్ష్మణుని మాటలు విని, సీత నిష్ఠురము లాడుట రెండిట కలదు. లక్ష్మణుడు "చనిన త్రోవ పలుమఱు గనుచు" సీత శోకించుట పాపరాజు ఉత్తరరామాయణమునందే కలదు.

"రమణి మఱి కొంతవడి దాఁక రథముఁ జూచుఁ
దరుణి మఱి కొంతసేపు కేతనముఁ జూచుఁ
గాంత మఱి మీఁద రథపరాగంబుఁ జూచుఁ
బడఁతి మఱి యంతటను వట్టి బయలు సూచు. 299
చూచి చూచి చొక్కి, స్రుక్కి తాలిమి దక్కి,
వగలఁ బొగిలి యూర్పుసెగల నొగిలి,
దిగులు దగులఁ గుంది వగఁజెంది బెగడొంది

యలసి సొలసి మూర్ఛ లొలసి తెలిసి 300

వ. అచ్చెలువ తన్ను మున్ను ముచ్చట లడుగునప్పు
డప్పుడమితేఁడు చేసిన చెయ్వులఁ దలంచుకొని" 301
ఇట్లు దుఃఖించును.

"ఒడి మీఁద నిడుకొని యురముపైఁ జేర్చుట
చేరిక కది కడసారి యేమొ?
చెక్కుఁ జెమ్మట చేల చెఱఁగునఁ దుడుచుట
చెలిమికి నది తుది చీటి యేమొ?
పుక్కిటి తావి కప్పురవీడె మిచ్చుట
యనురాగమున కది యవధి యేమొ?
కోరిన పని కియ్యకొనుటది కరుణార్ద్ర
బంధమ్మునకు ఫలగ్రంథ మేమొ?
మోము మోమునఁ గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపుఁబనికిఁ దీఱుదల యేమొ?
యెల నగవు దేరఁ జూచి లోపలి కనుచుట
మేలు చిన్నెల కది పొలిమేర యేమొ?" 302

భూదేవి సీతను తీసికొని పోవుట తిక్కన ఉత్తరరామాయణమునందు ఒక్క పద్యమునందు కలదు. (143ప. 8ఆ.) పాపరాజా ఉత్తరరామాయణమునందు ఒక సుదీర్ఘవచనమునందు కలదు. (94వచ. 8ఆ.) అది కరుణరసనిర్భరము.

"---- భూదేవి ---- కూఁతునకు సాక్షాత్కరించి, చేరవచ్చి, మచ్చిక హెచ్చి గ్రుచ్చి కౌఁగిలించి, సేమం బడిగి, కన్నీరు మున్నీరుగా వగచుచున్న యప్పుత్త్రి ననునయించుచుఁ "దల్లీ! యేల చింతిల్లెద? వెవ్వారికి దైవగతిన్ దప్పించవచ్చునే? యూఱడిల్లు"మని యనిమిషకన్యకాకరకీలిత కనకకలశవిలసితభోగవతీసలిలంబుల ముఖప్రక్షాళనంబుఁ గావించి కస్తూరిబొట్టు పెట్టి, కొప్పు చక్కఁగ నవరించి, మందారకుసుమమాలికలు దుఱిమి, దివ్యాంబరాభరణాదుల నలంకరించి, ఘనసారగంధసారకాశ్మీర కస్తూరిపరిమళంబుల నలంది, సిద్ధభామినీసమర్పితకర్పూరనీరాజనాదుల విరాజమానయగు నమ్మానవతి నసమానమణిపీఠంబుపై నుంచుకొని, నలుగడల ముంచుకొని, గంధర్వచారణయక్షకిన్నరపన్నగబాలిక లడపంబు సురఁటిగిండి, కాలాంజి మొదలయినవి. ధరియించి, యూడిగంబులు ఘటింప, నచ్చరలు నటింప, నింద్రాదిదేవతలు మందారకుసుమంబులు గురియింప,శంఖమర్దళపణవగోముఖఢక్కాహుడుక్కాది దివ్యవాద్యఘోషంబులు మించ, భుజంగపుంగవులు బంగరుబెత్తంబు లూని బరాబరు లొనరింప రసాతలంబునకుఁ గొంపోయె నమ్మహాప్రభావంబునకు నద్భుతంబు నొందుచు బ్రహ్మాదిదేవత లందఱున్ దమలోఁ దమరు జగతీనందనపాతివ్రత్యసత్యధర్మంబుల నభినందించు నెలుంగులు, నంతరంగంబు గలంగి, సీతాంగనఁ గూర్చి విలపించు సభాసదుల యాక్రందనధ్వనులు నేకీభవించి, భూనభోంతరంబు లావరించె; నమ్మహాకలకలంబున నేలంబడి పొరలి పొరలి యేడ్చువారు, నయ్యయో

శ్రీరామభద్రుని యర్ధాంగలక్ష్మి నేఁటితో మా స్వామి నెడఁబాసి పోయితే? యని బిట్టుగాఁ బ్రలాపించువారు, నేమియు ననలేక శోకవ్యాకులితేంద్రియులై మూర్ఛల మునుఁగువారును నీ లోకాపవాదం బింత చేసెఁగదా యను వారును, నిట్టి మహాత్మురాలి నట్లాడిన యీ లోకుల కొక సత్యంబున్నదే యను వారును, నక్కటా! తల్లి లేని బిడ్డలైతిరే యన్నలార! యని కుశలవులఁ జూచి వగచువారును, నవనీకన్యక వచ్చి నిలిచిన చోటుఁ గాంచి, పలికిన పలుకులు వర్ణించి, పోయిన పోకఁ దలంచి, పలికినదే పలుకుచుఁ బలుమాఱు పరితపించువారును, నిదిగో కన్నులఁ గట్టినట్లున్నయది; యజ్జగన్మాత నేరీతి మఱవవచ్చు నను వారును, నందఱచే మాటలఁబడి విసివి వేసరి యీ సరసిజాక్షి లోకనిందఁ బాపికొని, కారణజన్మురాలు గావున మహనీయపదంబునకుఁ జనియెఁ; దత్ప్రభావం బెవ్వరికైనఁ దెలియ శక్యంబే యను వారును, నింత యద్భుతం బెక్కడఁ గని విని యెఱుంగ మను వారును, నౌదలలను వంచి యవిచ్ఛిన్నాశ్రుజలధారాపూరితనేత్రులై వెక్కసంబుగా వెక్కి వెక్కి యేడ్చు భరతలక్ష్మణశత్రుఘ్నసుగ్రీవాంగదహనుమత్సుషేణ నలనీలజాంబవద్విభీషణవిదేహకేకయరాజప్రముఖులం జూచి, వగపులు క్రొత్తలై చిత్తంబు లుత్తలంబు లొంద నందందుఁ దల్లడించువారును, నధోముఖుఁడై చేష్టలు దక్కి చేడ్పడియున్న యన్నరేంద్రచంద్రునిన్ జూచి పురపురన్ బొక్కువారును, నంతస్తాపంబుల స్రుక్కువారును, దాలిమి దక్కువారునై, పెక్కుచందంబుల నందఱున్ దురపిల్ల నయ్యాస్థానంబు శోకదైన్యనిధానంబై యుండె." 94వచ. 8ఆ.

ఏవంవిధమైన కరుణరసోల్బణమే కంకంటి పాపరాజా ఉత్తరరామాయణము పండిత లోకమున మహాకావ్యముగ పరిగణింపబడుటకు కారణము.

ఉత్తరరామాయణము పూర్వజన్మవృత్తాంతముల పుట్ట. యుద్ధముల గుట్ట. సీతారాముల వృత్తాంతమునందు వన, జల, లీలావిహారములు కలవు. అవిగాక తిక్కన ఉత్తరరామాయణమునందు పుర, నగ, అంధకార, చంద్రోదయ, చంద్రికావిహారవర్ణనలు కలవు. పాపరాజా ఉత్తరరామాయణమునందు పుర (2-23ప. 1ఆ.) గృహ (292ప. 2ఆ.) సూర్యాస్తమయ (149-153ప. 4ఆ.) అంధకార (154-158ప. 4ఆ) హేమంతర్తు (279-288ప. 5ఆ.) వసంతర్తు (2-18ప. 6ఆ.) వైకుంఠ (294-297, 313వచ. 8ఆ.) వర్ణనలు కలవు. వర్ణనాధిక్యమేగాని; వర్ణనావ్యామోహము లేదు. ఇది విశేషము.

# పుష్పగిరి తిమ్మన

ఇతని కృతులు 1. సమీరకుమారవిజయము. 2. భాగవతసారము. 3. దశకుమార చరిత్రము. 4. (భర్తృహరి) నీతిశతకము. 5. రఘునాథశతకము. 6. శేషశైలవిహారశతకము. 7. తిరువడాంబాశతకము. సమీరకుమారవిజయము రామాంకితము. నీతిశతకము నిరంకితము. రఘునాథశతకము, రఘునాథాంకితము. శేషశైలవిహారశతకము శేషశైలవిహారాంకితము. తిరువడాంబాశతకము తిరువడాంబాంకితము. దైవాంకితములు. అయినను తిమ్మన వంశవృక్షమును బట్టి సమీరకుమారవిజయము రచనాకాలము 1640 ప్రాంతమని పూర్వోక్తము. (భర్తృహరి) నీతిశతకము 1645 ప్రాంతము, భాగవతసారము 1650 ప్రాంతము, దశకుమారచరిత్రము 1655 ప్రాంతము కావచ్చును. రఘునాథ శతకము, శేషశైలవిహారశతకము, తిరువడాంబాశతకము వార్ధకదశను రచించినట్లు కలవు. వాని రచనాకాలము 1675 ప్రాంతము కావచ్చును. కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమునందు ప్రసక్తమైన అనేకాంధ్రకృతులు, 1655-1675 మధ్య రచించిన కృతులు. అనుపలబ్ధములు. దశకుమారచరిత్రమును అనుపలబ్ధమే.

ఉత్తరరామాయణపద్యములకు, సమీరకుమారవిజయపద్యములకు సంవాదము కలదని ఒకరు ఉదాహరించినవి పంద్రెండు[45], మఱొకరు ఉదాహరించినవి ఎనిమిది[46] మొత్తము ఇరువది కలవు. ఒక్క పద్యమే రెండిట ఒక్కటి. అది (49ప. 1ఆ-56ప. 1ఆ) శ్రీనాథుని హరవిలాసములోని పద్యము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శాకుంతలమునందు ఉండుట వంటిది. ఉత్తరరామాయణ, సమీరకుమారవిజయములందు సదృశపద్యములు అయిదు మాత్రమే కలవు. (18ప. 1ఆ. - 53ప. 1ఆ. ; 105ప. 1ఆ. - 138ప. 2ఆ.; 139ప. 5ఆ. - 217ప. 2ఆ.; 199ప. 4ఆ. - 240ప. 3ఆ.; 135ప. 6ఆ. - 202ప. 6ఆ.) ఇవి పాపరాజునకు "సాహాయ్యమాచరిం"చిన తిమ్మన అనుసరించినవి కావచ్చును. రెండు కృతులకు శైలీభేదము కలదు. పాపరాజు శైలి తురంగవల్గనము. తిమ్మన శైలి మాతంగగమనము.

**సమీరకుమారవిజయము** :- ఇది హనుమచ్చరిత్రసర్వస్వము. అంజనా, వాలి, సుగ్రీవుల జన్మవృత్తాంతములు ప్రథమాశ్వాసము. ఆంజనేయుని జన్మవృత్తాంతము, శైశవబాల్యవృత్తాంతములు ద్వితీయాశ్వాసము. హనుమంతుని రామాయణవృత్తాంతము తృతీయాశ్వాసము. మైరావణవధ, రామలింగప్రతిష్ఠాపనవృత్తాంతము చతుర్థాశ్వాసము. శతకంధరసంహారము, రామభుక్తశేషస్వీకరణము, సకుంభనికుంభసాధనము పంచమాశ్వాసము. హనుమన్మంత్రమాహాత్మ్యము, గరుడ, సత్యా, తుంబురు, నారద గర్వభంగములు షష్ఠాశ్వాసము. అర్జునశరసేతుభంగము, భీమునిగర్వభంగము సప్తమాశ్వాసము.

ఒక అప్సరస- శాపము వలన కుంజరుడను వానరునికి అంజనగ జన్మించినదని వాల్మీకి రామాయణములోని కిష్కింధాకాండమునందు కలదు. (8-10శ్లో. 66స.) ఉత్తరకాండమునందు సరోవరస్త్రీకి ఇంద్రుడు కారణముగ వాలి, సూర్యుడు కారణముగ సుగ్రీవుడు జన్మించినట్లు కలదు. ఇది పాపరాజు ఉత్తరరామాయణమునందును కలదు.

(159ప. 5ఆ.) తిమ్మన సమీరకుమారవిజయమునందు అహల్యకు ఇంద్రుని వలన అంజన, వాలి; సూర్యుని వలన సుగ్రీవుడు జన్మించినట్లు కలదు. (185, 186ప. 1ఆ.) అహల్యకు గౌతముని వలన అంజన, ఇంద్రుని వలన వాలి, సూర్యుని వలన సుగ్రీవుడు జన్మించినట్లు విచిత్రరామాయణమునందుకలదు[47]. అంతేకాదు. వాలి సుగ్రీవులు తన పుత్త్రులే అని తలంచు గౌతమునికి అసలు సంగతి అంజన చెప్పినట్లు, తన పుత్త్రులు కానిచో వానరు లగుదురని గౌతముడు శపించినట్లు విచిత్రరామాయణమునందు కలదు[48]. ఇది కూడ సమీరకుమారవిజయమునందు కలదు. (215, 221ప. 1ఆ.) "వాయుజాపుణ్యచరిత్ర లన్నియున్ గూరిచి"న (20ప. 1ఆ.) తిమ్మన వాల్మీకి రామాయణమును కాదని, విచిత్రరామాయణమును అనుసరించుట వలన, హనుమంతుని పుణ్యచరిత్రకు అహల్య పాపచరిత్ర బయటపడినది! అహల్యను సృజించిన బ్రహ్మ గౌతమునిఁ అహల్య "నేరము లొకటి రెండు కావుమని వేడుకొ"నుట వలన (184ప. 1ఆ.) అహల్య మూడు నేరములు చేసినది!!

సూర్యుడు తిక్కన కీచకుని, పాపరాజు రావణుని మించి పోవును. 193-205ప.1ఆ.

"శుకవాణి యధరోష్ఠచుంబనచ్ఛలమున
నాస్యచంద్రునిఁ జూచి యాడు కఱచి
జవరాలి చేర్చుక్క సవరించు నెపమున
వేణికాతిమిరంబు వీఁగ నొత్తి
శృంగారవతి కుచాశ్లేషకైతవమున
హారతారలఁ దాఱుమాఱుఁ జేసి
వనజాస్య రతిపారవశ్యదంభంబునఁ
గన్దొగల్ ముకుళింపఁగా నొనర్చి
తన స్వభావంబు రతియందు మునుకొనంగఁ
దరణి బహుబంధచాతుర్యసరణి మొనసి
తరుణి నలయించి సొలయించి తమి వహించి
లలితరతికేళికానందలహరిఁ దేలి." 204ప. 1ఆ.

ఇది పారదారికశృంగారప్రవణత్వమునకు పరమనిదర్శనము.

ఆంజనేయుని జన్మవృత్తాంతము వాల్మీకిరామాయణములోని కిష్కింధాకాండమునందు కలదు. (11-20శ్లో. 66స.) ఉత్తరకాండమునందును కలదు. రెండును భిన్నములు. అంజన కేసరి భార్య. కామరూపిణి. మానవరూపమున వాయుదేవుని మాటలకు సమ్మతించిన, ఆంజనేయుడు జన్మించినట్లు కిష్కింధాకాండమునందు కలదు. పాపరాజు ఉత్తరరామాయణమునందు హనుమంతుడు ఏకపాదరుద్రుడని, "రుద్రాంశంబునన్ బార్వతీకుక్షిన్ వృద్ధి వహించి పావకునిలోఁ గొన్నాళ్లు వర్తించి ..... పవనగర్భాంతస్థుడై ... అనిలు వరంబుచే ... అంజనకుం జనియిం"చినట్లు కలదు. (83-85ప. 5ఆ.) ఇది సమీరకుమారవిజయమునందు ఇంచుక భేదమున కలదు. ఇందుకు ముందే ప్రథమాశ్వాసమునందే, హనుమంతుడు ఏకపాదరుద్రుడని ఏకపాదరుద్రావతరణకథ కలదు. అందు జగన్మాతృ పితలైన పార్వతీపరమేశ్వరుల రతిక్రీడ మర్కటాకృతిని కలదు!

"ఇటువలెఁ బార్వతీసతి మహేశ్వరసంగతిఁ గ్రీడ సల్పఁగా

నట నొకచోట మేను లెనయంగ మొగంబు మొగంబు నిక్క నొ
క్కటియయి తోఁక పెనగంగ నెదుర్కొని క్రీడ సేయు మ
ర్కటమిథునంబు మన్మథసుఖస్థితి దృష్టికి గోచరించినన్. 133
తగ్గని సిగ్గునం బురవిదారి ముఖాబ్జము దేటి చూడ లే
కగ్గిరి కన్నె యున్న తెఱఁ గాతఁడెఱింగి లతాంగి మంచిదే
యుగ్గతిఁ గూడి క్రీడ ఘటియింతము రమ్మని మర్కటాకృతిన్
డగ్గఱి చిగ్రుబంగరుకటారివజీరుని కేళిఁ దేలఁగన్ 134ప. 1ఆ.

శివతేజమును భూదేవి దశశతవర్షములు, అగ్ని కొన్నేఁడులు, వాయువు వేయేడులు భరించిరట! (137,139,141ప. 1ఆ.) పార్వతీకుక్షిప్రసక్తి లేదు. ఇక ద్వితీయాశ్వాసమునందు గౌతముడు వానరరూపము వచ్చిన అంజనను కుంజరుడను వానరునికి కూతురుగ ఇచ్చును. కుంజరుడు అంజనకు కేసరితో వివాహము సేయును. అంజనకు సంతానము కలుగదు. ధనకనకవస్తువాహనధాన్యకన్యకాదిబహుదానములు సేయును. వినాయక, సూర్య, చంద్ర, వరలక్ష్మి, మార్గశిరలక్ష్మి, గజగౌరీ, ఉత్తరాగౌరీ, సాంవత్సరగౌరీ, షోడశగౌరీ, మహాగౌరీ, నిట్టుప్పు గౌరీ, తంగేటి గౌరీ, చల్లకూటి గౌరీ, సావిత్రిగౌరీ, చల్దిగౌరీ, కరళ్లగౌరీ, ఆదిత్యగౌరీవ్రతములు పట్టును. (60,61ప. 2ఆ.) "ఆకైన దెల్లఁ బత్తిరి, యేకడ రాయైనదెల్ల నీశ్వరుఁడనుచున్ " భక్తి భజించును. (62ప. 2ఆ.) ధర్మదేవత "కొరవంజి తీరు దాల్చి' ' వచ్చి సోదె చెప్పును (64-69ప. 3ఆ.) "పతి యనుమతి తపము సేయు"మనిన (69ప.) కేసరి ఆనతిని వాయువు గుఱించి ఏడువేల సంవత్సరములు తపస్సు చేయును. (85-105ప. 2ఆ.) వాయుదేవుడు శివతేజమును ఫలాకృతిని ఆమె చెంతనుంచి పోవును. అంజన ఫలమని ఆరగించును. (106ప. 2ఆ.) గర్భవతి అగును. ఆంజనేయుడు జన్మించును. (107-119ప. 2ఆ.) ఇది యెల్ల తిమ్మన కల్పనమగును. ఇందు అంజనాతపోవర్ణనము - కాళిదాసు కుమారసంభవములోని పార్వతీతపోవర్ణనము నకు, తెనాలిరామ(లింగ)కృష్ణుని పాండురంగమాహాత్మ్యములోని రాధాతపోవర్ణనమునకు అనుకరణము. ఆంజనేయుని జననాదివృత్తాంతము, శైశవక్రీడాదికము, సూర్యునొద్ద విద్యాభ్యాసము మొదలైనవి (117-290ప. 2ఆ.) పురాణప్రసిద్ధములు.

రామాయణవృత్తాంతమునందు రాముడు తమ చెంతకు వచ్చు హనుమంతుని చూచి, లక్ష్మణునితో పలికినది పరమరమణీయము.

"సోదరు నంటి యంటి సుగుణోత్తమ! కంటివె యల్ల కొండపైఁ
బాదములూఁది డిగ్గి మదబంధురసింధురలీల నొయ్యనే
యీ దెస సుప్రసన్నశుభదృష్టిని జూచుచు వచ్చుచున్నవాఁ
డా దరణీయుఁ డీ వటుకులాగ్రణిఁ జూడఁగ వేడుకయ్యెడున్ . 21
బంగరు పట్టుగోచి నునుపచ్చని ముంజియు నొంటి జందెమున్
ముంగయి కంకణంబు జిగి మోహనహారము కుండలప్రభా
భంగకపోలముల్ తరుణభానుసమానముఖాంబుజంబు మీ
ఱంగ వటుక్రియన్ శివుఁడు రాఁడుగదా మన చింత దీర్పఁగన్. 22
శివుఁడె కావలెఁ గాకున్నఁ జిన్ని వటుక
పాపని వితాన మనలోని తాపమార్ప
మనుమని యకృత్యము సహింప మనవి దెల్ప

వచ్చు వాణీశ్వరుండు గావలయు నితఁడు. 23
ఉక్తివధూసతీశ్వరుల నొక్కఁడుగా కితఁడున్న నీ శుభ
వ్యక్తియు నీ విరక్తి విభవాద్యనురక్తియు నీ మహత్కళా
వ్యక్తముఖాబ్జయుక్తి కలదా? యితనిం గని మాటలాడఁగాఁ
బ్రాక్తనజన్మపుణ్యపరిపాకవశంబునఁ గాక గల్గునే? 24
మచ్చిక కెక్కు నీ కపికుమారుని చారుశరీరకాంతిచే
నిచ్చటి చెట్టులన్నియును హేమపువన్నియఁ జెన్ను మీఱె నే
నెచ్చటఁ గాన నిట్టి ఘను నీతనిఁ జూచినయంత నిచ్చలో
హెచ్చె ముదంబు విచ్చెవెత లేమి విశేషము గల్గనున్నదో!" 25ప.3ఆ.

సీత "ప్రమద లెఱుంగనేర్తురె! కృపాళు రొనర్చిన మేలు" అనుట
(114ప. 3ఆ.) శాండిల్యముని

"శీలక్ష్మాధరవజ్రధారలు దయాసింధూజ్జ్వలద్బాడబ
జ్వాలల్ లోభమృషాభిమానమదహింసాజన్మభూముల్ వృథా
కాలక్షేపవిధాదికారణలు జాగ్రత్కీర్తిబాలానిల
వ్యాళస్త్రీలు వివేకపాకసుకృతవ్యాపారసారంగశా
ర్దూలల్ కొమ్మలు వీరి నమ్ముదురె సాధుశ్రేష్ఠు లెప్పట్టుకన్" 252ప. 3ఆ.

అనుట పురుషాధిపత్యసమాజపురస్కారమే.

మైరావణవృత్తాంతము మైరావణచరిత్రమునకు సంగ్రహము. రామలింగప్రతిష్ఠ స్వతంత్రకల్పనమున సవిస్తరము. రావణబ్రహ్మహత్యాదోషపరిహారమునకు శివలింగప్రతిష్ఠ సేయుమని మునులు రాముని ఆదేశింతురు. సుముహూర్తమును నిశ్చయింతురు. వ్యవధి ముహూర్తద్వయమాత్రము. నాలుగు గడియల లోపల కైలాసగిరినుండి శివలింగమును తీసికొని రమ్మని రాముడు హనుమంతునికి ఆనతిచ్చును. హనుమంతుడు తెచ్చుట ఆలస్యమగును. ఈ లోపున ముహూర్తము మించిపోకుండ రాముడు సైకతలింగమును ప్రతిష్ఠించును. హనుమంతుడు శివలింగమును తెచ్చి, ఖిన్నుడై ప్రాణత్యాగమునకు సిద్ధపడును. రాముడు హనుమంతునికి తత్త్వోపదేశము చేసి (98-121ప. 4ఆ.) ఊరడించి ఇట్లనును.

"సైకతాలింగము దీసి లింగముఁ బ్రతిష్ఠింపం దలంతేని దు
శ్శక మా కార్య మదెట్టులన్నఁ దిలకింపన్ సప్తపాతాళభూ
మికలం బాదుకొనెన్ మహేశుఁ డిఁకఁ బేర్మిన్ దియ్య నే శౌర్యరా
శికశక్యం బటుగాక దీసినఁ బ్రతిష్ఠింతున్ భవల్లింగమున్. 136ప. 4ఆ.

హనుమంతుడు విశ్వప్రయత్నము చేసి విఫలుడగును. అంతేకాదు. "సకలలోక పాలకహాహాకారంబులతో నవరంధ్రంబుల బుడబుడ నెత్తురులు వడియవడి యడఁగి యక్కడికి రెండు గడియల యెడ నొడ లెఱుంగక పరవశుండై పుడమిం బ"డును. (130వచ. 4ఆ.)

"అప్పుడు ధూళిధూసరితుఁడై కనుదమ్ములు మోడ్చి మక్షికల్
గప్పుకొనంగ నెత్తురులు గ్రక్కుడు నక్కపిముఖ్యుఁ జేరి మా
యప్ప! యిదేమిరా? యని ధరాత్మజ కన్నుల బాష్పపూరముల్

చిప్పిలఁ గేలుదమ్మిఁ దుడిచెన్ దనుసక్తధరాపరాగమున్. 133

అచట వసియించి తొడమీఁద ననిలసుతుని
శిరము గీలించి నెత్తుటిచేతఁ దడిసి
పుల్లసిలు మోము గనుంగొని తల్లడించి
ప్రేమ సీతాధిపతి విలపింపఁదొడఁగె" 134ప. 4ఆ.

రాముడు విలపించి, "కనుఁగవ పెన్నీట నతని కాయముఁ దడుపును." (135-142ప. 4ఆ.)

"జగతి యేల నేల సౌమిత్రి యేల సీ
తాలతాంగి యేల తక్కియున్న
వారలేల నిన్నువంటి గుణాఢ్యుండు
లేకయున్న నాకు నో కుమార!" 142ప. 4ఆ.

అను రాముని విలాపము హృదయవిదారకము. కరుణరసనిర్భరము.

శతకంధరసంహారము శతకంఠరామాయణమునకు సారగ్రహణము. కథాబీజము ప్రథమాశ్వాసమునందు కలదు. కథాఫలము పంచమాశ్వాసమునందు కలదు. రాముడు హనుమంతుని,

"ఓయీ వాయుకుమార! సారజవశౌర్యోత్సాహబాహబలో
పాయశ్రీల భవత్సమానుఁడు తలంపన్ లేఁడు లోకంబునం
దే యుద్యోగములన్ సమర్థుఁడవు నీకే యేకపాదాఖ్య చె
న్నాయెన్ నాయమె నీవు సేయఁగల కార్యం బి ట్లుపేక్షింపఁగన్." 81ప. 1ఆ.

అని ప్రశ్నించును. హనుమంతుడు "నను నెక్కి సహోదరసైన్యయుక్తి నద్దీవికి దాఁటిపోయి పగదీర్పుడు" అని సమాధానమిచ్చును. (82ప. 1ఆ.) అది చతుర్థాశ్వాసము తుదిని ప్రారంభమైనది. పంచమాశ్వాసము తొలిని సంపూర్ణమైనది. అంతేకాదు. శతకంధరుని సంహరించినది సీత! రాముడు "ఆత్మీయకోదండమున్ శరధిద్వంద్వ మొసంగె ..... పార్శ్వద్యోతకున్ సీతకున్." (68ప. 5ఆ.) "రక్కసుం జెచ్చెరఁ బేరఁ జీరుమని శ్రీరఘునాయకుఁ డానతిచ్చెను." (69ప. 5ఆ.) సీత సంగ్రామసరణి శ్రీరామునికే ఆశ్చర్యము కలిగించినది.

"కమలాక్షి తెలి వాలుగన్ను లే గతిఁ జూపెఁ
గాలానలజ్వాల నేలు డాలు
మగువ లేనగవారు మొగ మే కరణిఁ దెల్పెఁ
బ్రళయకాలాభీలభానులీల
నబల శింజిని మ్రోఁత యదియెట్లు ప్రకటించెఁ
గల్పాంతదీర్ఘనిర్ఘాతరవముఁ
గలకంఠి యలఁతి హుంకార మెమ్మెయి దాఁటి
విలయఝంఝామరుద్విహరణంబు
నతివ మార్దవ మెటులు క్రౌర్యంబు నెఱపె
లలన సౌశీల్య మెటులు దౌర్లభ్యమయ్యె
బాల ముగ్ధత యెటు లనిఁ బ్రౌఢి మెఱసె
నని వెఱఁగుజెందెరాముఁడయ్యవసరమున." 75ప. 5ఆ.

రామభుక్తశేషస్వీకరణము మైరావణచరిత్రమునకు అనుసరణము. సకుంభని కుంభసాధనమునకు మూలము మృగ్యము. అందు హనుమంతుడు అమృతమును తెచ్చి, భరత శత్రుఘ్నులను బ్రతికించుట విశేషము.

హనుమన్మంత్రమాహాత్మ్యము మంత్రశాస్త్రవిషయము. గరుడ, సత్యా, తుంబురు, నారదగర్వభంగములు కృష్ణలీల. కృష్ణుడు గంధమాదనగిరి నుండి హనుమంతుని తీసికొని రమ్మనిన, గరుత్మంతుడు.

"నా సత్త్వస్ఫూర్తి నా జవద్రఢిమయున్ నా భక్తిసంపత్తియున్
గాసిం జెందఁగఁజేసి క్రోఁతి బిల వేగం బేఁగుమ న్నాన నా
యాసం బేల ఘటించి తిట్టిపని నా కర్హంబె? నానాఁటి కా
హా! సన్మానము లెస్స చేసితివి బాగాయెన్ యశోదాత్మజా! 144ప. 6ఆ.

అని గర్వాతిశయమును ప్రకటించును. (144,145ప. 6ఆ.) అయినను గంధమాదన గిరి కేఁగి "మారుతి వాలసాలముం గడ గనలేక కాఁకఁబడి గర్వము దక్కియుఁ దక్కక' ' (164ప. 6ఆ.) పిలిచిన పలుకక, "వాలలత బోరన వెన్కకుఁ బెల్లగిల్ల నీడ్చెదనని" తలంచిన, హనుమంతుడు-

"అలవోక వోలె వాలాగ్ర మొకించుక
విదలించినంత నవ్విహగవిభుఁడు
మొదటఁ బట్టిన పట్టు వదలి తన్మారుతో
ద్రేకంబునను సైకరింపలేక
ముదముర తెక్కలు మొరయ నుద్భ్రాంతుఁడై
గిరగిర చక్రంబు క్రియఁ దిరుగుచు
వెఱ బెండువడి యొడ లెఱుఁగక దిగ చెమ్మ
టలు గాలువలు వాఱ బలిమి జాఱఁ
బృథివి చలియింప దశదిశల్ బెగడు కుడువ
జగము లచ్చెరుపడ మేరునగము పెకలి
వచ్చెనో! యని ద్వారకావాసు లగలఁ
గొలువులో వచ్చి గుప్పునఁ గూలఁబడియె." 169ప. 6ఆ.

కృష్ణుడు సత్యభామతో, "సామీరి సీతారాముల్ పిలిపించిరనిన సత్యం బంచు వచ్చె ..... నేఁ జెందెదన్ శ్రీరామత్వము నీవు సీత వగుమా శీఘ్రంబుగా" అనిన (187ప. 6ఆ.) సత్యభామ,

"ప్రేదారూఢి మొగంబు వాంచి మిగులన్ రీఢాత్మయై మారు మా
టాడంజాలక రూపభాగ్యజనితాహంకారముల్ దాఁటుటన్
గోడం జిత్రము లీల నున్న నగుచున్ గోవిందుఁ డుద్యజ్జగ
త్క్రీడా ప్రౌఢచరిత్ర భీష్మకసుతం గ్రేఁగంట వీక్షించినన్ (188. 6ఆ.)

హనుమంతుడు మేఘరంజి పాడి, బండరాయిని కరగించి, తుంబురునారదుల తాళములు అడిగి పుచ్చుకొని అందులో వైచును. అది బండరాయి అగును. "ఈ గుండు కరఁగి పోవన్ రాగం బని తాళములు గొనంగలవారే" అనిన (213-215ప. 6ఆ.), ఇద్దఱు విఫలులగుదురు. (216-219ప. 6ఆ.) నారదుడు మౌనము వహించును. తుంబురుడు చేష్టలుడుగును.

"చెల్లరె గానవిద్యలఁ బ్రసిద్ధులు రా గరగింపలేక పో
జెల్లునె? యిట్టులైన నిఁకఁ జెప్పెడి దేగతి తారతమ్యముల్. 219
జగతి భయకారి పద్దున
నెగడెడి మీ కింత చింత నిజతాళంబుల్
దిగవిడిచి పోవు టుచితం
బగునే యని యాంజనేయుఁ డాడిన వారున్. 220
చేతు ల్మోడ్చి వచించి రో త్రిజగతీశ్రేయోనిధానక్రియా
చాతుర్యాత్మక! యెంతయైనఁ గల దెంచన్ మా మదోద్వృత్తి యే
లా తద్విస్మృతు లుగ్గడింప నగుఁబాటాయెంగదా యింకిటన్
మా తాళంబులు మాకు నెప్పటివలెన్ మన్నింపవే సత్కృపన్." 221ప. 6ఆ.

అని పరితపించి, హనుమంతుని ప్రశంసింతురు. (222-296ప. 6ఆ.)

అర్జునశరసేతుఖండనము. కవిధ్వజమండనము ఇది కూడ కృష్ణలీలయే. అర్జునుడు శరములతో కట్టిన సేతువును హనుమంతుడు తొలిసారి ఖండించును. రెండవసారి కృష్ణుని మాయను ఖండింపలేకపోవును.

"నరుఁ డొనరించిన శపథము
నెఱవేర్పఁ దలంచి రుక్మిణీపతి మును మం
దరము ధరించిన రూపున
శరసేతువు క్రింద నుండె జాఱఁగ నీకన్." 33ప. 7ఆ.

అది కృష్ణుని మహత్త్వమని గ్రహించిన ఆంజనేయుడు, పందెము ప్రకారము అర్జునుని ధ్వజమునందు అధివసించును. భీముని గర్వభంగము సౌగంధికాహరణ వృత్తాంతమే.

హనుమంతుని విశ్వరూపమును చూచి భీముడు,

"ఔరా! నీయంతవాఁడు తోడయి నడవఁగ
రావణు జయించు టే దొడ్డ రాఘవునకు" 90ప. 7ఆ.

అనుట యథార్థమే అనిపించునది సమీరకుమారవిజయము.

ఇందు పుర (43-56ప. 1ఆ.), వనవిహార (120-132ప. 1ఆ.) గ్రీష్మర్తు (85-91ప. 2ఆ.) వర్షర్తు (93-98ప. 2ఆ.), శిశిరర్తు (100-102ప. 2ఆ.) సూర్యాస్తమయ (64-71ప. 3ఆ.) చంద్రోదయ (241-242ప. 3ఆ.) యుద్ధ (3-78ప, 5ఆ.) వర్ణనలు కలవు.

సమీరకుమారవిజయమునందు చిత్ర, గర్భ, బంధకవిత్వములు కలవు. 1. అనులోమవిలోమకందము. (80ప. 4ఆ.) నిరోష్ఠ్యదండకము. (145ప. 4ఆ.) 3. కందగర్భితశార్దూలము (210ప. 3ఆ.) 4. కందద్వయగర్భితసరసిజము. (71ప. 4ఆ.) 5. కందద్వయగర్భితభాస్కరవిలసితము. (72ప. 4ఆ.) 6. స్రగ్విణీభుజంగప్రయాత గర్భితవృత్తము (75ప. 4ఆ.) 7. కందగర్భితమణిగణనికరము (79ప. 4ఆ.) 8. మత్తేభకందగర్భితసీసము (147ప. 4ఆ.) 9. ద్విపదగర్భితసీసము (98ప. 5ఆ.) నాగబంధము (78ప. 4ఆ.)

**భాగవతసారము** : ఇది వచనకావ్యము. అముద్రితము. ద్వితీయస్కంధము నుండి

షష్ఠస్కంధము వఱకు కలదు. ద్వితీయస్కంధాంతగద్య ఇట్లు కలదు[49].

> "ఇది శ్రీమహాభాగవతమహాపురాణకవి తిమ్మనార్యుడు లోకోపకారముగా రచించిన వచనకావ్యము. భాగవతం. ద్వితీయస్కంధం సంపూర్ణం."

ఇది తమిళములోనికి తర్జుమా అయినది. అందు "పుష్పగిరి తిమ్మయ్య తెలుఁగున రచించిన దాని ననుసరించి రచియింపఁబడినట్లు కలదు[50].

> "ఇంద పనిరెండు స్కందంగళుం విష్ణుప్రియ తెలుంగిలె పుష్పగిరి తిమ్మయ్యప్పన్ యెడిదినదై పార్రై యివ్వారే వాద్యార్ చిన్నయన్ తమిళవచ నత్తి నాల్ యెడిదినార్"

అని తమిళవచనకావ్యగ్రంథపట్టికను కలదు[51]. "పనిరెండు స్కందం గళుం" అని కలదు గావున, తిమ్మన పంద్రెండు స్కంధముల భాగవతమును వచనకావ్యముగ రచించినట్లు వ్యక్తమగును. సారగ్రహణమగుట వలన భాగవతసారమను నామకరణము. స్కంధాంతగద్యలోని "లోకోపకారముగా" అను మాటకు, సామాన్యులకు అర్థమగునట్లు అని తాత్పర్యము కావచ్చును. అంత సులభశైలిని మాత్రమేగాక, అత్యంతసుందరశైలిని కలదు భాగవతసారము. అలతి అలతి వాక్యముల రచన అధికము. ఒక ఉదాహరణము[52]:

> "సూతుండు శౌనకాదిమహామునులఁ జూచి వింటిరా! మునులారా! ఇటువలె నుత్తరపుత్త్రు డడిగితే ప్రత్యుత్తరముగా శుకయోగిమహానుభావుండు పలికెను. ఓ రాజేంద్రా! నీ వడిగిన ప్రశ్నము మంచిది. ఇది పెద్దలు మెత్తురు. వినఁదగినది వేయివేలుం గలవు. వాటిలో నీ వడిగినవి ముఖ్యము. సంసారమగ్నులకు ఈ తత్త్వము తెలియ గూడదు. కాలమహిమ కనియుఁ గానలేరు. విష్ణుతత్త్వము వినియు వినలేరు. ప్రాణము విడుచునప్పుడు నారాయణస్మరణ సేయువానిదే భాగ్యము. సేవనే చేయఁదగువాఁడు, పూజింపఁదగువాఁడు, పురుషోత్తముఁడే కాని అన్యుఁడు లేఁడు. బ్రహ్మధ్యానము సేయు యోగులున్ను హరిస్మరణనే సేయుదురు. ద్వాపరయుగమందు మా తండ్రి వ్యాసులు భాగవతము నిర్మించి నా చేతఁ జదివించెను. నేనున్నూ హరిగుణములకు లోనై చదివి తిని."

ఇది వాడుక భాష అని ఒక అభిప్రాయము కలదు[53]. "అడిగితే, యోగులున్నూ, నేనున్నూ" అను శబ్దములు అట్టి భ్రమ కలిగించును. అవి లేఖకవ్యాపారములు. అడిగిన, యోగులును, నేనును అని కవిపాఠములు కావచ్చును. ఇందు శబ్దములెల్ల సుశబ్దములు, నామవాచకములు, క్రియాపదములు సలక్షణములు. విసంధి కలదు. వాడుకభాష కాదు తేలికభాష. ఇతరత్రవ్యాకరణస్ఖాలిత్యములు ఉండవచ్చును. అట్టివి సమీరకుమార విజయమునందును కలవు.

**దశకుమారచరిత్రము** :- ఇది కూడ వచనకావ్యము. అనుపలబ్ధము రచించినట్లు కలదు[54].

**నీతిశతకము** :- ఇది భర్తృహరి సుభాషితరత్నావళిలోని నీతిశతకమునకు తెనుగుసేత బాలసరస్వతి నీతిశతకము గుఱించి పూర్వోక్తము. అది మత్తేభ, శార్దూలవిక్రీడితములందు కలదు. ఇది చంపకోత్పలమాలికలందు కలదు. అతనికి మకుటము వలన సంకటము కలదు .ఇతనికి లేదు, కారణము మకుటమే లేదు. అయినను బాలసరస్వతి తెనుగుసేత వలె తిమ్మన తెనుగుసేత కూడ అసంతృప్తికరము.

పూర్వోదాహృతమైన "బోద్ధార:" అను శ్లోకమునకు ఆంధ్రీకరణమిది.

"బోద్ధలు మత్సరోచ్ఛలితబుద్ధుల నూకొనఁబో రహంక్రియా
బద్ధులు గావునన్ ప్రభులు బాళిమెయి న్వినలే రబోధపు
న్పద్ధతి నున్కిఁ దక్కిన యపండితు లొల్ల రసద్విభేదస
న్నద్ధసుభాషితంబులివి నా తనువందె యణంగుఁగా కిఁకన్." 1ప.

ఇందు శ్లోకములోని వ్యంగ్యార్థము "ఊకొనఁబోరు, వినలేరు, ఒల్లరు" అనుటవలన వాచ్యతాదోషమునకు పాల్పడినది. "కావునన్, బాళిమెయిన్, తక్కిన" అనునవి గణయతి మైత్రిమాత్రప్రయోజనులు. "బద్ధులు, పద్ధతి, సన్నద్ధ" అనునవి ప్రాసమాత్రప్రయోజనులు. "అబోధోపహతా:" అనుటలోని స్ఫూర్తి, అబోధపున్పద్ధతి నున్కిఁ దక్కిన యపండి తులు' ' అనుటయందు లేదు. "జీర్ణమ్" ఉక్తివైచిత్రివిలసితము. "అణంగుఁగాక" ఉక్తివైచిత్రి విరహితము. "ఇఁకన్" వ్యర్థము.

"విపది ధైర్యమథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమ:
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్. 52 శ్లో.

"ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పుఁ బ్రౌఢవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున న్పరాక్రమా
టోపము కీర్తి నిచ్చయుఁ గడున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్పఁ బ్ర
జ్ఞాపరు లొప్పుచుందు రివి సాజములై తమయందుఁ బొందఁగన్. 52

సభలో వాక్పాటవమనుటకు, రచ్చలో ప్రౌఢవాచాపటిమంబనుటకు అంతరము కలదు. సభ అన పండితసభ. రచ్చ అన పామరసభ. యుద్ధమునందు పరాక్రమమే గుణము. పరాక్రమాటోపము దోషము. ఆటోపమన ఆడంబరము. ప్రాసప్రయోజని. అర్థనిష్ప్రయోజని. మహాత్ములకు ప్రకృతిసిద్ధములని మూలము. ప్రజ్ఞాపరులకు సాజములని తెనుగుసేత. ప్రజ్ఞాపరులు మహాత్ములే కారు; దురాత్ములు కూడ. "ప్రకృతిసిద్ధమ్" అనుదానికి "ఒప్పుచుండు నివి సాజములై" అనునది సరిపోవును. " తమయందుఁ బొందఁగన్" పునరుక్తి. అది "సాజములై" అను దానియందు గతార్థము. పునరుక్తి పాదపూరణప్రయోజని.

"బ్రహ్మా యేన కులాలవన్నియమితో బ్రహ్మాణ్డభాణ్డోదరే
విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసంకటే
రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమ: కర్మణే." 92శ్లో.

"నెఱి నజా నండభాండకృతి నేమపుఁ గుమ్మరిఁ జేసె నెద్ది శ్రీ
హరిని దశావతారగహనాప్తిని సంకటపెట్టె నెద్ది శం
కరునిఁ గపాలపాణిపుటకంబున భిక్షకుఁ జొన్పు నెద్ది భా
స్కరు దివిఁ ద్రిప్పు నెద్ది యల కర్మముఁ గూర్చి నమస్కరించెదన్." 92ప.

నెఱి అను ఎత్తుగడ నిరర్థకము. ప్రాసయతిమైత్రి, పాదపూరణప్రయోజని. "నేమపు" కూడ నిరర్థకము. గణయతిమైత్రిమాత్రప్రయోజని. బ్రహ్మాండభాండము సహజము. అజానండభాండము కృతకము. క్షిప్త: అనగా ఆప్తి కాదు. "యేన" అనగా

"దేనిచే" అని అర్థము. అందలి స్ఫూర్తి ఎద్దియందు లేదు. శ్లోకములోని క్రియలు భూతార్థకములు. పద్యములోని క్రియలు తద్ధర్మాద్యర్థకములు. వాని స్ఫూర్తి వీనికి లేదు. "కర్మముఁ గూర్చి" వ్యాకరణవిరుద్ధము కాదుగాని వ్యవహారవిరుద్ధము.

మొత్తము మీద బాలసరస్వతి నీతిశతకము వలె పుష్పగిరి తిమ్మన నీతిశతకము కూడ పేలవము. శ్లోకములోని భావము కలదుగాని జీవము లేదు. విగ్రహప్రతిష్ఠయే గాని ప్రాణప్రతిష్ఠ జరుగలేదు. అది ఏనుగు లక్ష్మణకవి సుభాషితరత్నావళియందు అంతట అగ్రేసరభాసమానము.

**రఘునాథశతకము** : తొంబదియొక్క పద్యములు లభించినవి. కర్తృనిర్దేశము లేదు. వంశీయుల కడ లభించినది. "అనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ!" అను మకుటము శతకసాధారణము. శతకమునందు దశకములు కలవు. అందు సాధారణమకుటమునకు ముందు - సంక్రాంతసీతాహృత్సాధ!, మాయామృగధ్వంసివ్యాధ!, ఉదగ్రక్రోధ!, విద్వత్సం బోధ!, ధూతదైత్యమహాయోధ!, సుధాధారాయూధ!, భక్తవనీరాధ!, గౌతమీతతటినీరోధ!, ఉదంచద్గాథ!, ధైర్యగుణోత్సేధ - అను ఉపక్రమణములు కలవు. వార్ధకమున రచించినట్లు కలదు.

" గమనింప న్వడి లేదు పాదయుగళిన్, గందోయిఁ గప్పెం బొరల్,
సమసెన్ దేహబలంబు, రోగవికృతుల్, సంధిల్లె వృద్ధత్వసం
గమమున్ గామముఁ గ్రోధముం బెరిగె, నాకర్ణింపవే! ధూతదై
త్యమహాయోధ!, యనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ!" 47ప.

కవి ఆత్మీయత ప్రతిఫలించు కతిపయోదాహరణములు :

"హాహాకారము సేయుదున్ రుజలచే నాకొన్నచో నోర్పు లే
దే హంసీగమనం గనుంగొనిన మోహింతున్ గుబుద్ధిన్ బుధ
ద్రోహంబుల్ ఘటియింతు మాన్పు మఘసందోహంబు సంక్రాంతసీ
తాహృత్సాధ! యనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ 3ప.

చిత్సంపత్తి యొకింత లేదు కడు నశ్లీలంబు శీలంబు, యో
షిత్సంపర్కమునందె కాంక్ష, శమమున్ క్షీణించె, నర్థార్జనా
ద్యౌత్సుక్యంబునఁ గాలముం గడచె రావయ్యా ననుం బ్రోవ వి
ద్వత్సంబోధ! యనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ!" 33ప.

"దారిద్ర్యంబు ఘటించి తద్వ్యధలచే దైన్యంబుఁ గల్పించి సం
సారభ్రాంతి ధనప్రమత్తుల నుతించంజేసి, యాశాగతుల్
మీరం జిక్కులఁ బెట్టి దేమిటికి స్వామీ! నన్ గనద్వాక్సుధా
ధారాయూధ! యనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ!" 59ప.

"ఎంచన్ రాని యనేకదోషములు మున్నేఁ జేసియున్నాఁ డ నే
కించిద్భీతియు లేక నప్పనులకుం గేడించ కిప్పంటికిన్
చాంచల్యంబు వహించెదన్ మనుపవే? సర్గాదిభూబోధితో
దంచద్గాథ! యనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ!" 81ప.

**శేషశైలవిహారశతకము** :- నూట అయిదు కందపద్యములు కలవు. శిథిల భాగము లధికము. "రమ్మా! చేకొమ్మా కృతి" అను పంక్తిని బట్టి (72ప.) శేషశైలవిహారుడు

వేంకటేశ్వరస్వామికి అంకితము. " శేషశైలవిహారా! " అని మకుటము. అధికపద్యములందు పూర్వార్ధము స్వీయస్థితి. ఉత్తరార్ధము దైవస్తుతి. వార్ధకమునందు రచించినది.

"ముదిసితి ధనమోహాదులఁ
గదిసితి నినుఁ గొలువనేర, ఖమరున్ముఖసం
సదజాండభాండమండిత
సదఖండాకార! శేషశైలవిహారా!" 19ప.

"అణుమధ్యాత్మజవిత్తే
షణముల పాలైతి, తెలివొసంగుము రాధా
ప్రణయోజ్జ్వంభితసంభా
షణజితకర్పూర! శేషశైలవిహారా!" 48ప.

"మతకరి లోభి గులాముల
స్తుతి నగు నఫు మణఁగ నిన్ను స్తుతియింతు, నదీ
రతరపృథాసుతరక్షణ
చతురవ్యాహార! శేషశైలవిహారా!" 79ప.

శతాధికపద్యములందు " పటుమతి దెలిపితి నా స్థితి " అని (103ప.) నా తలఁపులు నా యలపులు నీతో వివరింపనేల, నీకే తెలియున్" అనుట (104ప.) చిత్రము.

**తిరువడాంబాశతకము**:- ఏబది లయగ్రాహిపద్యములు కలవు. అర్ధశతకము. "కవనం బొసఁగెదన్" అను పంక్తిని బట్టి (42ప.) జగదంబ అయిన తిరువడాంబకు అంకితము. "హేరంబజననీ! తిరువడాంబ! ముఖరమ్యశశిబింబ! పుషితాశ్రితకదంబ! జగదంబా!" అని ముకుటము. ఇది కూడ వార్ధకదశను రచించినది.

"పెం బలిత మౌదల దలంబు కొనె, దృష్టి బెడఁ
గుంబడె, జవస్ఫురణయుం బదను లేద
య్యెం బదపకామగుటం బహుకుటుంబభర
ణంబునకు లేదు భరణం బెపుడు, నన్నిం
కం బరిభవంబు తొలఁగం బెనుకువల్ బెనఁగొ
నం బణము లిచ్చి కరుణం బెనిచెదో, హే . . . . . 47ప.

తిరువడాంబ అను జగదంబ "పురిషికాఖ్యత్రిపురిం బొసఁగు"నని కలదు. (15.) మఱొక పద్యమునందు ఇట్లు కలదు.

"కంబు లొనఁ గూర్చు నుదకంబు గల శ్రీకుశన
దిం బరిఘగాఁ గొని నలంబుల మహశ్లా
ఘ్యంబగు సుగంధినగరంబు నళషేశసహి
తంబుగను జేరి, వితతంబగు దయాశీ
లంబునఁ జెలంగెడు నినుం బొగడితిన్, బరిణ
యంబునఁ దీసిన ఋణం బుడుపవే, హే..... 50ప.

కంబు లన శంఖములు. శంఖము "లొనఁగూర్చు నుదకంబు" కలది కుశనది. నలములన పద్మములు పద్మములచేత మహశ్లాఘ్యమగునది సుగంధినగరము. అది కుశనది అగడ్త వలె కలది. శంఖముల నొసగు కుశనదిలోని పద్మములచేత మహశ్లాఘ్య మగునది సుగంధినగరము. అది పురుషికాఖ్యత్రిపురి అగును. అచటికి తిమ్మన అళషేశ

సహితముగా ఏల చేరెనో? - శ్రీహనుమత్పాదసేవాగతాధ్యాత్మతత్త్వకవిత్వమహత్త్వవిదుఁ "డైన (12ప. 1ఆ. స.కు.వి.) తిమ్మన రామభక్తుడు, వేంకటేశ్వరభక్తుడు మాత్రమేగాక, తిరువడాంబ భక్తుడును అగుటకు హేతువు, "పరిణయంబునకుఁ బుణంబు" తీరక పోవుటయే అగును. కుటుంబభారము వలన క్రుంగిపోయిన కవి పుష్పగిరి తిమ్మన.

"తొంబరపు టర్థవితతిం బెనఁచి, యేమియు ర
సంబుఁ గనిపింపని పదంబు లిడి మేల్ ప్రా
సంబులు పృథగ్విరమణంబు లొనఁగూర్చు పాలు
పంబుఁ గనలేకను స్తవంబు లనుచుం బ
ద్యంబులు రచించు కుకవిం బిలిచి యిచ్చు జడు
నిం బొగడు వాఁడు ధనముం బడయునే, హే
రంబజననీ! తిరువడాంబ! ముఖరమ్యశశి
బింబ! పుషితాశ్రితకదంబ! జగదంబా! 31ప.

ఇందు రసస్ఫూర్తి లేని పదములతో, యతిప్రాసల విలాసము లేని పద్యములతో కుకవి స్తోత్రములు సేయునని కలదు. అంతేకాదు అట్టి కుకవిని ఆదరించు మందబుద్ధి సుకవిని ఆదరింపడని భంగ్యంతరముగ కలదు. ఇది తిమ్మన స్వీయానుభూతిప్రకటనమే.

# ధరణిదేవుల రామయమంత్రి

ఇతని కృతి దశావతారచరిత్రము. మగదల కృష్ణమంత్రికి అంకితము. అతని పెదతండ్రి తిమ్మమంత్రి "వీరవేంకటపతిరాయవిభువతంసభావితోభయచామరభద్ర దంతిపల్యంకికాదిసన్మానఘనుఁడు." (35ప. 1ఆ.) పినతండ్రి నారాయణామాత్యుని కుమారుడు ఆదినారాయణప్రభువు "దేశాధినాథనబాబు సాహిబూవితీర్ణసువర్ణజాంబూనదాంబరాసమగ్రామబహుమానభాసమాననవ్యవిభుఁడు." (58ప. 1ఆ.) నవాబు గోలకొండసుల్తాను అబ్దుల్‌కుత్బ్‌షా. (1626-72). సాహెబు. అతని మీర్‌జుమ్లా అనగా ఆర్థికమంత్రి మహమ్మదుసయీదు. ఇతడు 1645 వ సంవత్సరమునందు విజయనగర సామ్రాజ్యములోని ఆగ్నేయభాగము జయించెను[55]. 1656 వ సంవత్సరమునందు గోలకొండ సుల్తానుకు ద్రోహము చేసి, మొగలాయీచక్రవర్తిని ఆశ్రయించెను[56]. ఇతని వలన ఆదినారాయణప్రభువు బహుమానము లందిన కాలము 1645 ప్రాంతమే అగును. అది గ్రంథస్థమైన దశావతారచరిత్రము తదనంతరకాలికమగుట తథ్యము. కాఁబట్టి దశావతారచరిత్రము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

దశావతారచరిత్రమును పుష్పగిరి తిమ్మన రచించెనను వదంతి కలదు[57]. తిమ్మన జీవితకాలము 1607-77 అని పూర్వోక్తము. దశావతారచరిత్రము రచనాకాలము 1650 ప్రాంతము కావున, రామయ జీవితకాలము 1615-1685 కావచ్చును. కనుక వదంతికి కాలము కలసివచ్చును. కాని వాస్తవము కాదు. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదయందు సంస్కృతవాక్యములు తెలుగుపద్యములందు ఇమిడిపోయినట్లు, పాపరాజు కృతియందు సకృత్తుగ, తిమ్మన కృతులందు సమధికముగ, రామయ కృతియందు సమృద్ధిగ సంస్కృతవాక్యములు తెలుగుపద్యములందు ఇమిడిపోయినవి. అవి వదంతికి నిమిత్తము కావచ్చును. పాపరాజు శైలికి తిమ్మన శైలికి భేదము కలదు. తిమ్మన శైలికి రామయ శైలికి భేదము కలదు. పాపరాజు శైలి తురంగవల్గనము. తిమ్మన శైలి మాతంగగమనము. రామయ శైలి కురంగలంఘనము. కంకంటి పాపరాజు, పుష్పగిరి తిమ్మన, ధరణిదేవుల రామయ సమవయస్కులు కాకపోయినను సమకాలికులు. సమీపవాసులు. సన్నిహితులు. పరస్పరకరస్పర్శలు, పరస్పరప్రతిస్పర్ధలు సహజము. వదంతి నిర్నిమిత్తము కాకపోవచ్చును. దుర్నిమిత్తమును కావచ్చును. ప్రకృష్టమైన ప్రమాణాంతరము లేని వదంతి వర్జ్యము. ఉత్తరరామాయణము, దశావతారచరిత్రము పరకృతము లనుటకు ప్రకృష్టమైన ప్రమాణాంతరములు లేవు. ఉత్తరరామాయణము పాపరాజుకృతము. దశావతార చరిత్రము రామయకృతము.

కృష్ణమంత్రి "కృష్ణుని దశావతారముల్ గృతి యొనర్చి యంకితము సేయు"మనిన (16ప. 1ఆ.) రామమంత్రి రచించినది " రసికజనకంఠాభరణశ్రీకృష్ణదశావతారచరిత్ర మహాప్రబంధ"ము. (82ప. 1ఆ.) రామయ దశావతారచరిత్రము రసికజనకంఠాభరణమే. అసలు దశావతారవర్ణనము ప్రథమత: శ్రీనాథుని శృంగారనైషధమునందు కలదు. (120-142ప. 8ఆ.) అది శ్రీహర్షుని నైషధీయచరితమునకు ఆంధ్రీకరణము. అందు శ్రీరామావతారము సప్తమావతారమని (128ప.) కల్క్యవతారము దశమావతారమని

(141ప.) కలదు. ఇందు శ్రీరామావతారము సప్తమావతారమే. కల్క్యవతారము దశమావతారము కాదు. ఏకాదశావతారము. బలరామావతారము కృష్ణావతారము తోపాటు కలదు. మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బౌద్ధ, కల్క్యవతారములు తొమ్మిది, దేని కది ఒక ఆశ్వాసముగ తొమ్మిది ఆశ్వాసములు. బలరామ, కృష్ణావతారములు కలిసి ఒక ఆశ్వాసము. మొత్తము పది ఆశ్వాసములు. పదకొండు అవతారములు. అయినను దశావతారములుగ ప్రసిద్ధము. కనుక దశావతారచరిత్రము.

మత్స్యావతారకథ మత్స్యపురాణమునందు కలదు. భాగవతమునందును కలదు. పోతన భాగవతమునందు సుమారు ఏబది పద్యగద్యములందు కలదు. (693-740 8స్కం.) అది దశావతారచరిత్రమునందు సుమారు రెండువందల పద్యగద్యములందు కలదు. (114-306వ. 1ఆ.) నాలుగింతలు. పోతన ప్రభావమును కలదు. సత్యవ్రతుడు కపటమీనమును ప్రశ్నించునెడ, రామయ రసికజనకంఠాభరణముగ రచించిన పద్యమిది:

"శ్రీనారీకుచకుంభికుంభయుగళాశ్లేషంబొ బ్రహ్మాదినా
నానాకేశనమస్క్రియాదరమొ వీణామౌనిలోకాగ్రణీ
గానాకర్ణనమో వధూనటనశృంగారావలోకంబొ యీ
మీనాకారము దాల్ప నేమి పని స్వామీ నా కెఱింగింపవే" 164ప. 1ఆ.

కూర్మావతారకథ భాగవతమునందు కలదు. పోతన భాగవతమునందు రెండు వందల నాలుగు పద్యగద్యములందు కలదు. (146-409ప. 8స్కం.) అది దశావతార చరిత్రమునందు నాలుగువందల ఏబదియాఱు పద్యగద్యములందు కలదు. (3-458ప. 2ఆ.) సముద్రమథనసమయమునందే లక్ష్మీకల్యాణము పోతన భాగవతమునందు పాతిక పద్యగద్యములందు కలదు. (265-289ప. 2ఆ.) దశావతారచరిత్రమునందు నలుబది పద్యగద్యములందు కలదు. (251-290ప. 2ఆ.) లక్ష్మీదేవి అవతరించినప్పుడు వర్ణన అందును, ఇందును కలదు. ఇందు మఱల లక్ష్మీదేవి వధూటిగ " మన్మథరథంబు తీవి మీఱంగ" వచ్చినట్లు కలదు.

"ఘంటలు మొలనూలి ఘణఘణధ్వనులతో
ఘనతరశ్రోణి చక్రంబు గదల
మలిగుబ్బ చనుదోయి వలిపె పయ్యెదకొంగు
చెంగావి టెక్కెంబు చెన్ను మీఱ
జిన్ని లేనవ్వులు చికిలిఁ జేసిన తళ్కు
చెక్కుటద్దంబుల చెన్ను చూప
వెలిదమ్మి రేకుల వెలయించు కనుడాలు
తెల్లజల్లుల లీల నుల్లసిల్ల
నంఘ్రికటకారవాకృష్టహంసతతులు
వాజులై మించఁ గచగంధవలదపార
మధుపబలములు వెలయు మన్మథరథంబు
తీవి మీఱంగ వచ్చె లక్ష్మీవధూటి." 270ప. 2ఆ.

రథమునకు చక్రములు, టెక్కెము, అద్దములు, తోరణములు, గుఱ్ఱములు, సైనికులు, కుదిరినను, లక్ష్మీదేవి జగన్మాత! జగన్మోహిని ఘట్టమునందు ఇంతకంటె శృంగారము స్ఫురితిమించినది. రసికజనకంఠాభరణము కద!

"గజరాజగమన సింగారంబు గనుఁగొన
వలవదే కన్నులు గలుగు ఫలము
జలజాక్షి మధురభాషణము లాకర్ణింప
వలవదే వీనులు గలుగు ఫలము
విరిఁబోఁడి జీని చక్కెరమోవి రుచులాన .
వలవదే నాలుక గలుగు ఫలము
చెలి చెక్కుఁగపురంపుఁబలకలు మూర్కొన
వలవదే నాసిక గలుగు ఫలము
గబ్బిగుబ్బల బిగ్గరఁ గౌఁగిలింప
వలవదే తళ్కు నెమ్మేను గలిగిన ఫల
మటులుఁ గాకున్నఁ బంచేంద్రియములు గలిగి
నందులకు నేమి ఫలము వ్యర్థములు గాక." 317ప. 2ఆ.

చక్కెర కెమ్మోవి చవి చూడనే కాని
మొనపల్లు చుఱుకన మోపరాదు
బలితంపు గుబ్బలు పట్టి చూడనె గాని
నును వాడి గోరున నొక్కరాదు
తనులత యెదను మెల్లనఁ జేర్పనే కాని
మించి బిగ్గరఁ గౌఁగిలించరాదు
లలితంపు రతికేళి నలరింపనే కాని
బంధనచాతుర్య మేర్పఱుపరాదు
ఈఁగ వ్రాలినఁ గందు నీ యిగురుబోఁడి
కమ్మ నెమ్మేను గనఁగఁ బొంకమ్ము దెలిసి
యేలికొనవలె మన్మథకేళియందు
నాకుఁ దక్కిన మెప్పింతు నళినముఖిని." 321ప. 2ఆ.

ఇది దైతేయవల్లభుని ఆత్మీయవాల్లభ్యము! హాస్యము కూడ అతివేలము.

" ఆ మదిరాక్షిఁ జూచి పరిహాసము మీఱ బలీంద్రుఁ డిప్పుడో
కోమలి నీవు చే నమృతకుంభము పూనినఁ జూచి గోపబా
లామణివంచుఁ బాల్గొనఁ దలంచెదనన్నను నవ్వుచు న్నృగా
క్షీమణి బావ నీవు దధిఁ జిల్కఁగ గోపికనైన దోసమే. 363
అవు బావా యమృతంబు ముందు మన దైత్యశ్రేణికిం బంతునో
దివిజా ల్లుయ్యిడకుండ ముందొసఁగి యందే గొంత తర్వాత దా
నవదైత్యాసురరాక్షసావళులకు న్వడ్డింతునో యానతీ
యవలె న్కొ రన మంచిదే యనియె దైత్యస్వామి మే నుబ్బఁగన్. " 364ప. 2ఆ.

వరాహావతారకథ భాగవతమునందు కలదు. స్కాందపురాణమునందును కలదు. స్కాందపురాణకథయే దశావతారచరిత్రమునందు కలదు. భాగవతమునందు దితికశ్యపులకు విష్ణుభృత్యులు జయవిజయులు హిరణ్యాక్షహిరణ్యకశిపులుగ జన్మింతురు. దశావతారచరిత్రమునందు దితికశ్యపులకే రుద్రభృత్యులు భద్రానుభద్రులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగ జన్మింతురు. కారణము సంధ్యాకాలరతిక్రీడ. ప్రేరణము దితి. దితి

ప్రేరణము కశ్యపుడే అన్నట్లు జారసరణిని కలదు. (70ప.) దితికశ్యపుల శృంగారఘట్టము ఎనభై అయిదు పద్యగద్యములందు కలదు. (7-91ప. 3ఆ.) అందు సంభోగశృంగారము పదియేను పద్యగద్యముల పట్టు. పదుమువ్వురు సతులు కల (5ప.) కశ్యపుని కడమాట :

> "వల దిది సంజ వేళ చెలువా యొకయించుక తాళుమంచు నేఁ
> బలుమఱుఁ జెప్పిన న్మనసుఁ బట్టఁగఁ జాలక నొంటిపాటునన్
> వలనుగఁ గంటి కింపయిన వాని గనుంగొని ప్రేమ హెచ్చఁగా
> బలిమిని జేరు జార వలెఁ బైకొనఁ గోరుదు నీకు మేరయే." 70ప. 3ఆ.

నరసింహావతారకథ బహుపురాణములందు కలదు. ప్రత్యేకపురాణమును కలదు. ఎఱ్ఱన లక్ష్మీనరసింహావతారకథ క్షేత్రమాహాత్మ్యకావ్యము. పోతన ప్రహ్లాదచరిత్రము భక్తిమయము. దశావతారచరిత్రములోని నరసింహావతారకథ భక్తిరహితము కాదుగాని రక్తిసహితము. హిరణ్యకశిపుడు తపస్సు చేయునెడ, ఇంద్రుడు మేడమీద చెలికత్తెల నడుమ శచితో సరసమాడును.

> "జిలుగుంబయ్యెద చాటునం గులుకు నీ సిబ్బెంపుఁజన్దోయి నాఁ
> జెలువయ్యెం జలజాతకోశములు హంసీపక్షవిక్షేపచం
> చలగంగోర్ములఁ జక్రవాకనఖలక్ష్మంబుల్ విశేషంబు లం
> దుల నిందుం గలిగింపఁగా వలదె తోడ్తోఁ బద్మకోశస్తనీ! 21
> అనినం జాలు మతేమి యంచు శచి యొయ్యారంపు లేనవ్వుజం
> కెన వాల్చూపులు చిన్నికిన్కఁ దెలుపం గెందమ్మి పూమొగ్గచేఁ
> దను వైవం గని భర్త గుబ్బ యని మెత్తన్గోర నొత్త న్నితం
> బిని సీత్కారము తోడఁ జొక్కుచును గప్పెం బైఁట నున్సిగ్గునన్" 22వ. 4ఆ.

ప్రహ్లాదహిరణ్యకశిపుసంవాదము, జ్వాలానరసింహావతారము, హిరణ్యకశిపువధ, బ్రహ్మాదుల ప్రార్థన, ప్రహ్లాదుని సాష్టాంగదండప్రణామము, స్తోత్రము, నృసింహుడు శాంతించి, లక్ష్మీనృసింహాఖ్యచే భక్తుల రక్షించుట సర్వమును ఒక మహాసుదీర్ఘదండకము. అందును శృంగారవర్ణనమే.

> "-రమాదేవి నెత్తావి పూబంతికిం గ్రమ్ము భృంగంబులో నాఁగఁ
> గల్పప్రసూనంబులం గొప్పయై యొప్పు కీల్గొప్పు కప్పూనఁగా వేణికాషట్పద
> శ్రేణి నెమ్మోము కెందమ్మి నెత్తావి యేమాత్రమో చూచి రమ్మంచుఁ బంప
> న్ముఖాంభోజసద్వాసన గ్రోలుచుం బోవఁగా లేని చారాళి నా మీరు ఫాలస్థకస్తూరికా
> రేఖయుం దాని రాదా య నంచు న్విలోకించు బాలాళిబృందంబునా రంగులా
> ముంగురుల్ మోము జాబిల్లి గాన న్విచిత్రంబుగా లేడి లోనూని తల్లోచన
> ద్వంద్వముం బైని గప్పించు లీల న్విరాజిల్లు నేత్రంబులుం బెళ్కువా
> ల్జూపులుం జాతి నిద్దంపు కెంపుం దుటారించు కెమ్మోవిపై నందమౌ మంద
> హాసంబు చెన్నొందు క్రొమ్ముత్తెపుం జెక్కడంపుం బదార్వన్నె బంగారపుం
> గమ్మ గ్రొమ్మించు లే చెక్కుటద్దంబుల న్నిద్దము ల్పూనఁగా జాళువాగిండ్ల
> పూఁజెండ్ల దాడింబ పండ్ల న్విడంబించు పాలిండ్లపై రత్నహారావళుల్ చౌకళింపన్
> వలగ్నంబు జవ్వాడ శ్రోణీమణీమేఖలాకింకిణు ల్మ్రోయఁ జెంగావి మంజీర
> ముం గొంగున న్వింతఁగాఁ గ్రొత్తఁగా జంటముత్తెంబుల న్గూర్పు చెల్వౌ నఖంబు
> ల్విలోకించువా రల్పదోర్మేవమాయస్య తత్పద్మమంచున్ సమానింప నింపా

పదాంభోరుహంబుల్ రణన్మంజుమంజీరశింజారవంబుల్ చెలంగన్ జగ
న్మోహనాకారరేఖావయోరూపలావణ్యశృంగారలీలావిలాసంబులున్ హర్ష
రోమాంచము న్మించగాఁ జెంతకు న్వచ్చుచో-" 236దం. 4ఆ.

ఇది జ్వాలానరసింహుడు "రోషతంతన్యమానాత్ముఁడైయున్న" వేళ, లక్ష్మీదేవి శృంగారలీలావిలాసము! అసభ్యము కాదుగాని అసందర్భము.

వామనావతారకథ భాగవతమునందు కలదు. పోతన భాగవతములోని వామనావతారము కవితారసావతారము. అందు లేని గంగావతారము దశావతారచరిత్రమునందు కలదు. వామనుడు ఆకాశమును ఆక్రమించినపుడు, బ్రహ్మ తన కమండలూదకముచే, వామనుని పాదమును కడిగెనని, ఆ కడిగిన జలమే గంగానది అయినదని బ్రహ్మాండ పురాణమునందు కలదు. వామనుడు ఆకాశమార్గమున అంఘ్రి నిడ, అంగుష్ఠనఖముచేత బ్రహ్మాండభాండము పగిలి గంగావతరణము జరిగినదని దశావతారచరిత్రమునందు కలదు. ఇందును శృంగారమే. గంగానది,

"-కోనలలోఁ జిగురువిలుకాని కేళిం దేలుచు నదరిపాటునం జాచి
యదరిపడి లేచి తమ తమ క్రొత్తముత్తియపుఁజెఱుఁగుల చెంగావులఁ గటీ
తటంబుల నొక కొంగు, పచ్చి నునుగోటి తాఁకులం జిలుప చిలుప నెత్తురులు గ్రమ్ము
గుబ్బచన్నుల నొక కొంగు సవరించి యఱజాఱు క్రొవ్విరులు పువ్వుల వాన గురియఁ
గొను జడియ బెళుకుచూపుల బెగడు కోడె బేడిసల బిత్తరంపుటూర్పుల
మృగనాభిపరిమళంబులు గుప్పళించుచు బలితంబులై మెలఁగు గిలుకు మట్టియల
రొదలతోఁ గడలకుం జని మును తాము కదల నిడిన తొడవులం దా లోఁగొనిన
నర్తితంబులు సేయు నెయ్యంపుఁ గర్పూరగంధుల నేర్పులకు నగుచు . . . . "
118వచ. 5ఆ.

ప్రవహించినదట!

పరశురామావతారకథ బ్రహ్మాండపురాణమునందు, భాగవతమునందును కలదు. పోతన భాగవతములోని,

"ఆయెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ
దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజమా
లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞఁ దలంపక కొంత ప్రేమతోన్. "466ప. 9స్కం.

అను పద్యము దశావతారచరిత్రమునందు నాలుగు పద్యము లయినది!

అట నొకనాఁడు రేణుక మహర్షిపురంధ్రులతోడఁ గూడియొ
ప్పటివలె గంగ కేగి యతిపావనతీర్థము లాడి యన్నదు
ర్తటముగ వాలుకాపటలి గట్టి ఘటిన్ ఘటియించి నీటితోఁ
గటితటి నుంచి దోవతులు గాలికిఁ బైనడతేర వచ్చుచోన్. 75

అలతి జక్కవపిట్ట లంచుఁ బట్టితిఁ గాని
గుబ్బ లం చెఱుఁగనే కోమలాంగి
నును నాచుతీవియయని యొడిసితిఁ గాని
వేణి యం చెఱుఁగనే విద్రుమోష్ఠి
సుడియంచు మిని వ్రేళ్లఁ బుడికి చూచితిఁ గాని

నాభి యం చెఱుఁగనే నలినగంధి
తామరవిరి యంచుఁ దావిఁ గ్రోలితిఁ గాని
మోమంచు నెఱుఁగనే ముద్దులాఁడి
యంచు నర్మోక్తిఁ జెనకుచు నించుఁబోండ్లఁ
గూడి జలకేళిఁ గావించు కోడెకాని
తలిరువిల్కాని నగు చక్కఁదనము వాని
నొక్క గంధర్వుఁ గాంచి య య్యుత్పలాక్షి. 76
ఏమే రేణుక కూడి రాఁగదవె నీ వెవ్వారి నీక్షించెదే
మామాట ల్వినవే యటంచు మునిభామారత్నము ల్పిల్వ నో
హో మీ కెంతటి తీవ్రమే నిలువరే యొక్కింత సేపంచు న
క్కామిన్యుత్తమ నిల్చెఁ దోడి సతు లేగ న్వాని వీక్షించుచున్. 77
మఱియు మఱియును వాని మన్మథవికార
ముల విలోకించుచును వేఱెతలఁపు లేక
భ్రమసి యనురక్తయై యున్న పంచబాణ
కాండ మగలించె ననఁ గటి ఘటము పగిలి." 78ప. 6ఆ.

ఇందు రేణుక కొంత ప్రేమతో చూచినది దుర్లభుడైన చిత్రరథుని కాదు. పూర్తి కామముతో చూచినది నర్మోక్తు లాడుచు జలక్రీడలు సేయు చిత్రరథుని. అంతే కాదు. మఱియు మఱియు చూచినది వాని మన్మథవికారములు. ఆమెతో వచ్చిన ముని భామలు రత్నములు! ఆమె కామిన్యుతమ! ఇది జమదగ్నిమునిపత్ని పాత్రచిత్రణము! కారణము రసికజనకంఠాభరణకరణము.

శ్రీరామావతారకథ వాల్మీకి రామాయణమే. బాలకాండము ప్రథమభాగముగ, అయోధ్యాకాండాదియుద్ధకాండాంతము ద్వితీయభాగముగ దశావతారచరిత్రమునందు కలదు. ప్రథమభాగము 321 పద్యగద్యములు. ద్వితీయభాగము 199 పద్యగద్యములు. మొత్తము 520 పద్యగద్యములు. బాలకాండభాగములోని 321 పద్యగద్యములందు ఆరుశ్లోకముల (17-22శ్లో. 48స.) అహల్యావృత్తాంతము 123 పద్యగద్యములందు కలదు. (48-106ప. 7ఆ.) మూడవ వంతు కంటె అధికము. మొత్తము మీద నాలుగవవంతు కంటె అధికము. ఇది సముఖము వేంకటకృష్ణప్పనాయకుని అహల్యాసంక్రందనమునకు ఆదర్శము. అది అసత్కావ్యమని పూర్వోక్తము. ఇది అసత్కావ్యము మాత్రమే కాదు; మహాసత్కావ్యములోని అసత్కావ్యము. అంతకంటె ఘనము. శ్రీరామావతారకథలోని అహల్యావృత్తాంతమిది పూజామందిరములోని పంచపాత్ర కాదు, పానపాత్ర. దేవతార్చన పేటికలోని సాలగ్రామముకాదు, సాలెగూడు. అహల్య దుర్మేధ అని వాల్మీకి ఖండనము. వారవనిత కంటె హీనముగ రామయమంత్రి మండనము. అహల్య "వెలయాలనా?" అని మనోరంజనితోను (89ప. 7ఆ.) "వారవనితను గాను" అని ఇంద్రునితోను (184ప. 7ఆ. 1) అన్నది గాని, దశావతారచరిత్రమునందు వెలయాలిని, వారకాంతను మించి పోయినది.

పూజ కొఱకు పుష్పములు కోయుచున్న అహల్యకు, ఇంద్రుడు పంపిన దూతిక మనోరంజని చేసిన ఉపదేశమిది:

"వయసునఁ గంటి కింపయినవాని రమించుట ధర్మ మింతి క

ట్లయె మగవాఁడు చక్కని మిటారికిఁ దక్కి రమింపఁగా వలెన్
నయమిది న్యాయశాస్త్రములు నమ్మకు మొజ్జల పుచ్చకాయ యా
నయవిదుఁడౌ గురుండు మదనత్వర నగ్రజు భార్యఁ గూడడే. 85
వేడుక లెస్సఁగా ననుభవించుట యొక్కటి తక్కఁగాని యం
దేడది ధర్మశాస్త్రగతు లెక్కడి పుణ్యము లేద పాపముల్
సూడవుగాక నీవు బలసూదను వీఁడు సుపర్వు లన్యులం
గూడియ కాక నందనులఁ గూరిమి పత్నులయందుఁ గాంచిరే. 86
వింతలె నిన్నువంటి యవివేకిను లెందఱు లేరు వారి నే
వంతుకుఁ దేను నా మనసు వచ్చిన జాణయె కర్త తారయే
కాంతుని పజ్జమాని వగకాఁడగు చంద్రునిఁ దక్క నేలఁ దా
నెంతయుఁగాక నేమి దనయిచ్చఁ గరంగిన సౌఖ్యమబ్బునే. 87
అలుగుటొ యల్గినప్పుడు భయంబున నంఘ్రుల వ్రాలి వేఁడుటో
కలయఁగఁ బల్కుటో బలిమిఁ గౌఁగిటఁ జేరిచి మోవినొక్కుటో
చలము మిటారి చూపొనర జంకెనయో ముడిబొమ్మొ తక్కు చె
య్వులు గలవో తపస్విరతియున్ రతియే వెతగాక కామినీ. 88
దోషారంభము సంభ్రమం బొసఁగ నాథున్ సాధుమేషాసము
న్మేషాప్తిం గికురించి యొంటిఁ జని యన్వేషించు నజ్జారు నా
శ్లేషింపం గల సౌఖ్య మిందుముఖికిన్ లేదెందుఁ బద్మాననా!
"యోషాజారమివప్రియం" బనెడి శ్రుత్యుక్తిన్ విచారింపవే. " 90ప. 7ఆ. 1

మనోరంజని ఇంకను మదనోపదేశము చేసినది. (91-97ప.) అహల్య సమాధాన మిది:

"మంచి పున్నమచందమామఁ జూడనె కాని
వేడుకతోడ ముద్దాడ వశమె
యూరక చూచి నోరూరు టింతియె కాని
యందని ద్రానిపం డ్లంద వశమె
తళుకు తళ్కని మించు తొలుకారు మించుఁ గాం
చనె కాని కౌఁగిలించంగ వశమె
కనకాద్రిశృంగారముల్ గనుఁగొననే కాని
సులభంబుగఁ బట్టి చూడ వశమె
యటులు పరకాంత నగుమొగం బధరబింబ
మంగవల్లియుఁ జనుదోయి యలరుఁబోఁడి
కోరుటయె కాక యేల చేకూరుఁ దనకు
వలవని దురాశ యేటికి వలదు సొమ్ము. 98
చీమ చిటుక్కుమన్న వెతఁజెందెడి చిత్తముతోడ జారతో
నేమి సుఖంబు గాంచు విటుఁ డేటికొ యీ భ్రమ వట్టి పాప మం
తేమతి యేమిలేదు పెఱతెర్వులఁ బోవుట గాదటంచు నో
కామిని నేఁడు నా మనవిగా వినిపింపు నిలింపభర్తకున్. " 99ప. 7ఆ. 1

ఇందు వశము కాదని వాచ్యార్థము. వశమైన సిద్ధమే అని వ్యంగ్యార్థము. అంతేకాదు.

వెతఁజెందెడి చిత్తముతోడి జారతో విటునికి సుఖము లేదని వాచ్యార్థము. వెతఁజెందని చిత్తముతోడి జారతో విటునికి సుఖము కలదని వ్యంగ్యార్థము. ఇంత విటీవిటజ్ఞాన ప్రకాశము అహల్యకు ఎట్లు కలిగినదో?

గౌతమవేషధారి ఇంద్రుడని గ్రహించిన అహల్య, అతడు మీద పడిన మోహము, భయము కలిగి వర్తించిన విధమిది :

"ఇదె తెలవాఱ వచ్చెఁగదవే యిదె సంధ్యకు వేళ గాదె స
మ్మదమున నిత్యకర్మవిధి మానక దీర్తురు రాత్రివేళ మీ
మది సరిపోవు రీతి నను మన్నన చేసెద రింతెకాక నీ
యదవద మేర గాదని మృగాక్షి గృహాంతరసీమ కేఁగఁగన్. " 125

అది రాత్రివేళయే. గృహాంతరసీమకు ఏగుట సాభిప్రాయము. గృహాంతరసీమలో ప్రవేశించి ఇంద్రుడని చెప్పి, అతడు కౌగిలించిన అహల్య,

గమకపు గుబ్బచన్ను లెదఁగాడఁగ నింద్రునిఁ గౌఁగిలించుచోఁ
దమిని నహల్య దొంటి సుకృతంబునఁ గల్గెడుగాక నింద్రభో
గము సమకూరునే యితరకాంతల కంచును మేను వొంగ భా
వమునఁ దలంచె నాటి శ్రుతివాక్యము వాసవదూతి మెచ్చుచున్. " 132

అంతేకాదు. ముద్దుగొంచు మోవికి ఆసపడిన ఇంద్రుని చెట్టవట్టుక శయ్యను చేరి ఇట్లన్నది.

"పంట నొక్క నటంచు బాస చేసినఁగాని
తేనె లూరెడి మోవి యాననీయ
గోట నొక్క నటంచుఁ జాటి పల్కినఁగాని
బటువు గుబ్బల కేలఁ బట్టనీయ
నాడు సేయ నటంచు నమ్మి కిచ్చినఁగాని
మినుకుఁజెక్కిలి ముద్దు గొనఁగనీయ
నగడు సేయ నటంచు నాన పెట్టినఁగాని
హొళితో రతికేళిఁ దేలనీయ
వినుము నెఱజాణ నీ చక్కఁదనము సూచి
వలచి యొప్పిన యప్పు డే వారవనిత
గాను మగనాలఁగాన నీ క్రమముఁ దెలిసి
యిందు కొడఁబడి నన్నేలుమీ సురేంద్ర. 134ప. 7ఆ. 1

ఇందలి వ్యంగ్యార్థము స్పష్టము. ఇక అహల్యాసురేంద్రుల సంభోగశృంగారము పదియేడు పద్యములందు కలదు. (136-152ప.) మఱి వీడ్కోలు ఆరు పద్యములందు కలదు. (154-158ప.) అనంతరసమాగమములకు అహల్య చెప్పిన ఉపాయమును కలదు.

"దేవపూజకు విరు లెచ్చెదనంచును
వనికాంతరములకు వచ్చునపుడు
నివ్వరి ధాన్యము ల్నిమకంగఁ గేదార
పరిసరంబులయందుఁ దిరుగునపుడుఁ
గడువేడ్క నన్నోదకంబులఁ గొనితేర
దూరతటాకంబు సేరునపుడుఁ

జెఱగు మాసె నటంచుఁ జెప్పి యూరకయైన
　　నొంటిగాఁ గడయింట నుండునపుడు
వచ్చి నాముచ్చట ల్దీర్చు మెచ్చుగాను
నిచ్చ తచ్చన గాదు వియచ్చరేంద్ర
యనుచు నక్కునఁ జేర్చి మోహమునఁ జెక్కు
ముద్దుగొని పంపె నింద్రు నమ్మోహనాంగి. " 159ప. 7ఆ. 1

ఇంత మోహనాంగిగ అహల్య పాత్రను చిత్రించిన శ్రీరామావతారకథ శ్రీరామరామ అనిపించునది. ఇది శ్రీమద్రామాయణము కాదు; అహల్యారామాయణము. పారదారిక శృంగారపారాయణము. జమదగ్నిపత్ని రేణుక పాత్రచిత్రణము కంటె, గౌతమపత్ని అహల్య పాత్ర చిత్రణము పరమదారుణము. క్షీణయుగలక్షణము.

రాముడు మానవునిగ రామాయణము రచించిన వాల్మీకి బాలకాండమునందు సీతారాముల సంభోగశృంగారమును వర్ణింపలేదు. (25-29శ్లో. 77స.) కాని రాముడు దైవముగ దశావతారచరిత్రమును రచించిన రామయమంత్రి శ్రీరామావతారకథను సీతారాముల సంభోగశృంగారమును సుమారు ఇరువది పద్యములందు వర్ణించెను. (310-328ప. 7ఆ. 1) అంతే కాదు. "శ్రీరఘుపతి చతురుఁడు గాఁడె యతనుశాస్త్రము లందున్" అని సమర్థనము. అయిదు కాండల రామాయణమును సుమారు రెండు వందల పద్యగద్యములకు సూక్ష్మీకరించినను, అరణ్యవాసమైనను, శ్రీరామావతారకథను సీతారాముల లీలావిహారము హేలావిలాసమే. (31-34ప. 7ఆ-2).

బలరామావతారకథ హరివంశమునందు కలదు. భాగవతమునందు కలదు. అందును ఇందును ఉన్నవి మాత్రమేగాక, లేనివి కూడ దశావతారచరిత్రమునందు కలవు. రేవతీపరిణయమునకు పూర్వము వారుణి, కాంతి, అబ్జసదన బలరాముని వరింతురు. (34-46ప. 8ఆ-1) తర్వాత బలరాముడు గోపికలతో యమునాతీరము నందు విహరించును. (124-138ప. 8ఆ-1)

"కలికి యీ పాదరింటఁ గాదె నీ వూరకె
　　కినిసి నాచేత మ్రొక్కించుకొనుట
తెరవ యీ ద్రాక్షపందిటఁ గాదె నడికిరే
　　యని వచ్చి నీవు నన్నేలికొనుట
మెలఁత యీ గుజ్జు మామిడి నీడఁ గాదె చి
　　ల్కలు పల్కఁ జెలులంచు నుల్కిపడుట
వనిత యీ కదళికావనిఁ గాదె దళివీ
　　జనముచే రతాంతరశ్రమ ముడుపుట
దలఁచుకొందువె యీ సైకతమునఁ గాదె
నానఁ బైకొనకున్న నో చాన మంచి
దత్తలో జెప్పి కొట్టింతుననిన జడిసి
నీవు నాకోర్కి దీర్చుట నీలవేణి." 124ప.
"కొదమరాయంచ జవరాండ్ర గుంపుతోడ
సరసి విహరించు రాజహంసంబుఁ బోలి
గోపికాహంసయానలఁ గూడి యాము

నాంబువులఁ దేలె యదురాజహంసమపుడు." 138ప. 8ఆ. -1

శ్రీకృష్ణావతారకథ వివరముగ హరివంశమునందు కలదు. భాగవతమునందు కలదు. అందును, ఇందును కల గోపికల రతికేళి, లేని రాధ రతికేళి, వేశ్యారతికేళి దశావతారచరిత్రమునందు ప్రధానవిషయము. ఇది 270 పద్యగద్యముల శ్రీకృష్ణావతారకథను 224 పద్యగద్యముల ఘట్టము. ఆదిని 21 పద్యగద్యములందు శ్రీకృష్ణుని జన్మవృత్తాంతము. అంతమున 25 పద్యగద్యములందు అష్టమహిషుల, పదాఱువేల రాజకన్యల కల్యాణముల ప్రసక్తి, కుచేలుని విషయము, పాండవుల విషయము మాటవరుసకు కలవు. గోపికల సంభాషణమునందు గోపికావస్త్రాపహరణము, కాళియమర్దనము, గోవర్ధనోద్ధారము గతార్థములు. శ్రీకృష్ణుని బాల్యచేష్టలు శృంగారచేష్టలే. (25, 42, 51, 54ప. 8ఆ.-2.) రాధ వారకాంత వలె కృష్ణుని ముందు కనువిందుసేయునని కవి ప్రతిపాదనమే.

"కొప్పుల జాజులున్ బిగువు గుబ్బల కుంకుమ తేనె మోవిపైఁ
గప్పురవీడియంబు జిగికస్తురిబొట్టును నిచ్చ చల్వముం
జొప్పడ వారకాంత వలెఁ జూడ్కికి విందొనరించెఁగాని యొ
క్కప్పుడు మైలదోఁప నడయాడదు రాధ ముకుందు ముందటన్. 57

దోర్మూలములు గాంచఁ దొలఁగించుఁ బయ్యెద
నాభి గన్గొన వితా నానఁబూను
మురువుతోఁ గమ్మోవి విఱుచు చుఱుక్కన
నుదుటు గుబ్బలు నిక్క నొడలు విఱుచు
మెలఁత మై నొరఁగునేమో చూచి పక్కున
నగు బాలు ముద్దాడు నన్నుఁ జూడు
మను నొక్క వ్యాజంబునను జెంతఁ జేరుఁ జె
క్కుల చెమ్మవో మీటుఁ గొప్పు నిమురుఁ
గటితటం బంటి సొలయుఁ గ్రేఁగంటఁ జూచుఁ
బంత మీడేరెనా యని పైని విరులు
వైచుఁ గనుసన్నఁ బిలుచు రావా యటంచుఁ
జిలుకపై నిడి కెలయు నచ్చిగురుఁబోణి. 58ప. 8ఆ. -2

మదనగోపాలమూర్తి వేణుగానమునకు గోపికామానవతుల పోకలు :

"కెంగేల జలపాత్రఁ గీలించి యెలదోఁట
త్రోవగా నవ్వల దూఁటె నొకతె
యత్త యెక్కడికంచు నడుగ నెక్కడికి లే
దిదిగొ వచ్చెదనంచు నేఁగె నొకతె
పొరుగింటనుండు మా పొరుగింటి పడుచును
చూచి వచ్చెదనంచు లేచె నొకతె
మంచినీళ్లకుఁ బోయి మఱలి వచ్చెదనంచు
వేడ్క మీఱఁగ నేఁగె వెలఁది యొకతె
త్రోవలో తోడికోడలు పోవఁజూచి
యేడకే యన్న నదియ నీ వేడకన్నఁ
గూయకు మటంచు నిద్దఱుఁ గూడి తోడి

దొంగలై పోయి దా గోపధూర్తు కడకు. 75ప. 8ఆ. 2

మధురానగరి కేగిన కృష్ణుని గోపికారాధల గుతించిన విరహమును మహాగాఢము.

"అక్కట నన్నుఁ బాసి క్షణమైన సహింపఁగలేరు గోపికల్
చక్కెరబొమ్మ లే కరణి సైఁచిరొ యిన్నిదినంబులందు లో
మిక్కిలి రాధ యీ యెడను మేను భరించుట దుర్లభంబు నీ
వక్కడి కేఁగి కృష్ణుఁ డిదె వచ్చెనటంచు వచింపు ముద్దవా." 192ప. 8ఆ. 2

భాగవతములోని కుబ్జ దశావతారచరిత్రమునందు వేశ్య. వేశ్యమాత విడియ మిప్పించును. (227ప.) వేశ్య పదాబ్జసంసేవ చేయును. పలుకని కృష్ణుని ఇట్లు ప్రశ్నించును.

"పలుక వదేమి సామి యొకపాటి వధూటిని నీవు మెత్తువే
చెలువము గుల్కు రాధ వలెఁ జిత్తము రంజిల సేవ సేయఁగాఁ
గలిగిన కాంత సేకుఁతినగా కిపు డాపెఁ దలంచుకొంటివో
పులకలు నిండెనంచు విరిబోణి ముదంబునఁ బక్కఁ జేరుచున్. 230

కృష్ణుడు రాధ ప్రథమగణ్య, వేశ్య ద్వితీయగణ్య అనిన, వేశ్య " దేవాంగనాతిలకంబే యది యంచు మార్మొగము పెట్టును. కృష్ణుడు లేనవ్వున

"వనితరొ కోపమేమిటికి వల్లవకాంతలలోన జాణయౌ
నని యల రాధఁ బేర్కొనుట యంతియె నీ సరియైనఁ జేసినం
గినుకను నేర్పు సూపుటలు గేలిగదా యని వేఁడి నిక్కమౌ
నని మరుఁ డెచ్చరింప ఘనమౌ తమి మన్మథయుద్ధలోలయై." 233ప. 8ఆ. 2

ఇది శ్రీకృష్ణావతారకథ. మన్మథయుద్ధమును ఎనిమిది పద్యములందు వర్ణించి,

"లోకారాధ్యుఁడు గావున
శ్రీకృష్ణున కిటుల నడువఁ జెల్లెం దగునే
యీ కైవడి వర్తింపఁగ
లోకమువారలకు రాజలోకవతంసా" 248ప. 8ఆ. 2.

అని రామయమంత్రి హెచ్చరిక. లోకము వారలకు తగదని తెలిసి రచించుట చిత్రము.

బౌద్ధావతారకథ పురాణప్రసిద్ధము. త్రిపురాసురులు వేదోక్తవిధులు ఆచరించుట వలన దేవతలకు అజేయులు. విజితులను చేయుటకు విష్ణువు బౌద్ధాకారముతో వారికి వేదములు ప్రమాణములు కావని హేతువాదములు వివరించును. గౌరీపూజ సేయు అసురాంగనలకు విగ్రహారాధనము వ్యర్థమని, అశ్వత్థవృక్షమును కౌగిలించుకొనిన కార్యసిద్ధి కలుగునని చెప్పును. వారు అట్లు సేయుదురు. అశ్వత్థవృక్షమైన విష్ణువు వారి పాతివ్రత్యము నకు భంగము కలిగించును. అధర్మనిమిత్తముగ ఈశ్వరునిచేత త్రిపురదాహము కావించును. విష్ణువు బుద్ధుడై చేసిన హేతువాదాంశములు కొన్ని:

"స్నానంబు వలన మోక్షంబు గల్గిన నీరు
కాకికి మోక్షంబు గలుగ వలదె
కాక ధ్యానమున మోక్షము గల్గినను దటా
కము బకంబులకును గలుగ వలదె
ముక్తి ప్రదక్షణంబులఁ గల్గునన్నను
కాకి గ్రద్దలకును గలుగ వలదె

పుడమి పశ్వాలంబమున స్వర్గమన్నను
బలలభుక్కుల కెల్లఁ గలుగ వలదె
కాననస్థితి బోయకుఁ గల్గ వలదె
బిలములందున్నఁ గలదె గబ్బిలములకును
గాన యందున్న మోక్షంబు గానరాదు
క్షణికవిజ్ఞానమునని మోక్షంబు గలుగు." 44ప. 9ఆ.

"రంభాభోగముఁ గోరి యాగముల కర్థంబెల్ల వెచ్చించుటా
యంభోదంబులఁ జూచి చెర్వుజల మాద్యంతంబుఁ జల్లించుటల్
సంభోగేచ్ఛ జనించెనేని మఱి వేశ్యారత్నముల్లేరొకో
సంభోగింపఁగరాదె కానరు జనుల్ జ్ఞానంబు సామాన్యమే" 51ప. 9ఆ.

"మొదటికి నిహమే లేదట
పిదపం బరమెటులు గల్గు బేలుఁదనముగా
కిది మతము గాదు నా మత
మిది గైకొనుఁ డిహపరంబు లిచటనె కల్గున్." 60ప. 9ఆ.

"అప్పు గొనియైన దొంగిలియైన లెస్స
జిహ్వ కింపైన దాని భుజింపవలయుఁ
గంటి కింపైన కాంతలఁ గలయ వలయు
బ్రదుకు దినమున మోక్షంబు వెదకనేల. " 61ప. 9ఆ.

"హృద్యము గాదు మీర లిట నీశ్వరి యంచును ధూపదీపనై
వేద్యము లిచ్చి ఱాప్రతిను వేయువిధంబులఁ బూజసేయుటల్
చోద్యము గాక యే ఫలము సూపెడి ఱాళ్లకు నీళ్లు పోసినన్
వేద్యము లా ఫలార్థులకు వృక్షము లుండఁగ నీ వృథాశిలల్." 70ప. 9ఆ.

పయి నాలుగవ పద్యము చార్వాకసిద్ధాంతము. యజ్ఞవిధు లజ్ఞవిధు లనుట బౌద్ధసిద్ధాంతము. విగ్రహారాధనఖండనము నాథసిద్ధాంతము.

కల్క్యవతారకథ కల్కిపురాణము. కలియుగమునందు ధర్మగ్లాని కలుగును. యుగాంతమునందు విష్ణువు, శంబళపురమున సుశీలావిష్ణుయశులకు కల్కి అను పేర అవతరించును. దుష్టజనసంహారము చేసి, ధర్మసంస్థాపనముచేయును. కలియుగములోని అధర్మములు పంద్రెండు పద్యములందు కలవు. (11-16, 18-25ప. 9ఆ.) కలియుగధర్మములు బహుపురాణప్రోక్తములు.

దశావతారచరిత్రమునందు చిత్రగర్భబంధకవిత్వములు కలవు. వ్యోష్ఠాచలజిహ్వ ద్వ్యక్షరకందము (179ప. 7ఆ-2) అనులోమవిలోమము (193ప. 7ఆ.-2) చతుష్కంధము (8ప. 8ఆ.-2) గూఢచతుర్థిసీసము (23ప. 8ఆ.-2) మత్తేభగర్భితసీసము (162ప. 3ఆ.) మంజభాషిణీగర్భితోత్పలమాల (196ప. 8ఆ.-2) నాగబంధము (214ప. 1ఆ.; 191ప. 7ఆ.-2) ఖడ్గబంధము (72ప. 7ఆ.-1) పుష్పమాలికాబంధము (188ప. 7ఆ.-2) గోమూత్రికాబంధము (189ప. 7ఆ-2) ఛత్రబంధము (190ప. 7ఆ.-2)అష్టదళపద్మము (194ప. 7ఆ-2).

రామయమంత్రి "సంస్కృతప్రాకృతాద్యష్టభాషాకవితత్త్వసంవేది." (16ప. 1ఆ.) అని కలదు అందుకు నిదర్శనముగ ప్రాకృతసీసపద్యమును (49ప. 5ఆ.) రచించుట ప్రత్యేకవిశేషము.

# రామదాసు

అసలు పేరు కంచెర్ల గోపన్న. మహారామభక్తుడగుటవలన రామదాసు అని ప్రసిద్ధుడు. ఇతని కృతులు 1. దాశరథిశతకము. 2. కీర్తనలు. శతకము భద్రాచలరామాంకితము దైవాంకితము. కీర్తనలు రామదాసముద్రాంకితములు. కీర్తనలందు తానీషా విషయము కలదు. తానాషా బిరుదము తానీషా అయినది. రామదాసు తానాషా ఆజ్ఞానుసారము 1652 వ సంవత్సరమునందు భద్రాచలరామునికి కైంకర్యములు, నిత్యపూజాదికములు చేయించినట్లు 1852 వ సంవత్సరమునందు పునరుద్ధరించిన శాసనము కలదు[58]. గోలకొండ సుల్తానులు అబ్దుల్లా కుత్బ్‌షా (1626-72) అబ్దుల్ హసన్ కుత్బ్‌షా (1672-87) తానాషాబిరుదాంకితులు[59]. రామదాసు 1620 ప్రాంతమున జన్మించి, 1650 ప్రాంతమున తహశీల్దారు అయి, 1665ప్రాంతమున బందిఖానాలో వేయబడి, 1677 ప్రాంతమున విడుదల అయినట్లు చారిత్రికసమన్వయము కలదు[60]. అది సుసంగతము. రామదాసును బందిఖానాలో వేసిన తానాషా అబ్దుల్లా కుత్బ్‌షా, విడుదల చేసిన తానాషా అబ్దుల్‌హసన్ కుత్బ్‌షా అగుదురు. కాఁబట్టి దాశరథిశతకరచనాకాలము 1655 ప్రాంతము, కీర్తనల రచనాకాలము 1660-80 మధ్యకాలము కావచ్చును.

**దాశరథిశతకము:-** నూట మూడు పద్యములు కలవు. "దాశరథీ! కరుణాపయోనిధీ!" అని మకుటము. కొన్ని పద్యములందు "భద్రగిరిదాశరథీ! కరుణాపయోనిధీ" అని కూడ కలదు. శతకాదిని ఆర్యస్తుతి, గురుస్తుది, కవిస్తుతి, కావ్యస్మృతి కలవు.

"ఆర్యులకెల్ల మ్రొక్కి, వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యుల కంజలించి, కవిసత్తములన్ వినుతించి, కార్యసా
కర్య మెలర్ప నొక్క, శతకం బొనఁగూర్చి రచింతు నేఁడు, తా
త్పర్యమునన్ గ్రహింపుమిది దాశరథీ! కరుణాపయోనిధీ! 6
మసగొని రేఁగుబండ్లకును మౌక్తికముల్ వెలవోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోసమయ్యె నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగఁ జేకురునట్లు వాక్సుధా
రసములు చిల్కఁ బద్యముఖరంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరిదాశరథీ! కరుణాపయోనిధీ!" 7

శతకరచనకు నిమిత్తమైన కార్యసౌకర్యము భద్రాచలరామాలయజీర్ణోద్ధారము కావచ్చును. నరాంకితములు చేసిన కావ్యముల జాడ కానరాదు.

శతకాంతమునందు కవి స్వవిషయము కలదు.

"పట్టితి భట్టరార్యగురుపాదము; లిమ్మెయి నూర్ధ్వపుండ్రముల్
వెట్టితి; మంత్రరాజ మొడిఁబెట్టితి; నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ; మీ చరణకంజములందుఁ దలంపు పెట్టి పో
దట్టితిఁ బాపపుంజముల దాశరథీ! కరుణాపయోనిధీ! 102.
అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్ల కులోద్భవుండనఁ బ్రసిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచించిన గోపకవీంద్రుఁడన్ జగ

ర్వల్లభ! నీకు దాసుఁడను దాశరథీ! కరుణాపయోనిధీ!" 103.

ఇందు కంచెర్ల గోపన్న అను పేరు, రామదాసు అను విశేషము కలదు. భట్టరార్య గురువు రఘునాథభట్టరాచార్యులే. అతడు ఉపదేశించిన మంత్రరాజము తారకమంత్ర మగును. "తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా" అని ఒక కీర్తన కలదు.

శతకమునందు రామపూజ (11) రామభజన (16) రామనుతి (18) రామకథామృత పానము (37) రామదాసభావము (54) రామస్మరణ (57) రామనామస్మరణ (59,80) రామభక్తి (94) రామమహిమ (98) కలవు. రామదాసునకు దశావతారములు రామావతారములు (68-77) రామునికి సాటి దైవము లేదు (34) అన్యదైవభక్తుల పొందు అపచారము (49). అని చెప్పి అన్యదైవనిరసనము లేదు. సర్వము రామమయము. "అంతా రామమయం బీ జగమంతా రామమయం" అని రామదాసు కీర్తన కూడ కలదు. ఇంత రామభక్తికి హేతువు భద్రాచలరాముడే.

"కంటి నదీతటంబుఁ, బొడగంటిని భద్రనగాధివాసమున్
గంటి నిలాతనూజ, నురుకార్ముకమార్గణశంఖచక్రముల్
గంటిని, మిమ్ము లక్ష్మణునిఁ గంటిఁ గృతార్థుఁడనైతి నో జగ
త్కంటకదైత్యనిర్దళన! దాశరథీ! కరుణాపయోనిధీ!" 21

భద్రాచలరామాలయమును చూచి ధన్యుడైన రామదాసు రామభక్తి తీవ్రతరము.

"జుట్టెద మీ కథామృతము జుట్టెద మీ పదకంజతోయమున్
జుట్టెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు; నే
జుట్టెద జుట్టి జుట్టఁగ రుచుల్ గను వారి పదంబుఁ గూర్పవే
తట్టులతోడి పొత్తిడక దాశరథీ! కరుణాపయోనిధీ!" 37

భక్తిదాస్యమే గాని వ్యక్తిదాస్యము లేదు.

"దాసిన చుట్టమా శబరి దాని దయామతి నేలినావు; నీ
దాసుని దాసుఁడా గుహుఁడు తావకదాస్యమొసంగినావు, నేఁ
జేసిన పాపమో వినుతి చేసినఁ గానవు; గావుమయ్య నీ
దాసులలోన నే నొకఁడ దాశరథీ! కరుణాపయోనిధీ!" 54

తత్త్వరసావగాహనమే గాని తీర్థావగాహనము సమ్మతము కాదు.

"నీ మహనీయతత్త్వరసనిర్ణయబోధకథామృతాబ్ధిలోఁ
దా మునుఁ గ్రుంకులాడక వృథా తనుకష్టముఁ జెందిమానవుం
డీమహిలోకతీర్థముల నెల్లమునింగిన దుర్వికారహృ
త్తామసపంకముల్ విడునె దాశరథీ! కరుణాపయోనిధీ!" 87.

సద్భక్తియే గాని సత్కులము ముఖ్యము కాదు.

"ఎంతటి పుణ్యమో శబరి యెంగిలి గొంటివి, వింత గాదె? నీ
మంతన మెట్టిదో యుడుత మైని కరాగ్రనఖాంకురంబులన్
సంతస మందఁజేసితివి సత్కులజన్మము లేమి లెక్క? వే
దాంతము గాదె నీ మహిమ దాశరథీ! కరుణాపయోనిధీ!" 98

ఇట్లు రామదాసు శతకపద్యములెల్ల రాముని కీర్తివధూటికి పూలదండలు (19)

కీర్తనలు :- సుమారు రెండు వందలు కలవు. అచ్చపు భక్తికి అనర్ఘమణిదర్పణములు. శృంగారస్పర్శ లేని కేవలభక్తిసమర్పణములు. రామచంద్రజ్యోత్స్నాంచితములు. రామదాస ముద్రాంకితములు. రామదాసు జీవితమునకు సంబంధించిన కీర్తనలు కలవు.

అందు భద్రాచలరామాలయ జీర్ణోద్ధారము వివరములు, బందిఖానాలో పడిన బాధలు కలవు.

"ఇక్ష్వాకుకులతిలక యికనైన పలుకవె రామచంద్రా నన్ను<br>
రక్షింపకున్నను రక్షకు లెవరింక రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
చుట్టు ప్రాకారములు సొంపుగ చేయిస్తి రామచంద్రా<br>
ఆ ప్రాకారమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
గోపురమంటపాలు కుదురుగ కట్టిస్తి రామచంద్రా నను<br>
క్రొత్తగ చూడక నితరి బ్రోవుము రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
భరతునకు చేసితి పచ్చల పతకము రామచంద్రా<br>
ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
శత్రుఘ్నునకు నేను చేసితి మొలత్రాడు రామచంద్రా<br>
ఆ మొలత్రాడునకు పట్టె మొహరీలు పదివేలు రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
లక్ష్మణునకు చేసితి ముత్యాల పతకము రామచంద్రా<br>
ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా<br>
ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
వాహనములు మీకు వరుసతో చేసితి రామచంద్రా జగ<br>
న్మోహన సంకెళ్లు వేసిరి కాళ్లకు రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
కలికి తురాయి నీకు పొలుపుగ చేసితి రామచంద్రా<br>
నీవు కులుకుచు తిరిగెద వెవరబ్బ సొమ్మని రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
మీ తండ్రి దశరథమహారాజు పెట్టెనా రామచంద్రా<br>
లేక మీ మామ జనకమహారాజు పంపెనా రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
అబ్బా తిట్టితి నని ఆయాసపడవద్దు రామచంద్రా<br>
ఈ దెబ్బల కోర్వక అబ్బ తిట్టితినయ్య రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
సర్కారు పైకము తృణముగ నెంచకు రామచంద్రా<br>
దెబ్బల కోర్వను అప్పు తీర్పుమయ్య రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
ఏటికి చల్లిన నీళ్లాయె యీ బ్రతుకు రామచంద్రా<br>
నేను అధములందరి కంటె అన్యాయమైతిని రామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
కౌసల్య పుత్రుడు దశరథతనయుడు రామచంద్రా<br>
కావు క్షేమముగ భద్రాద్రి నెలకొన్న శ్రీరామచంద్రా ॥ ఇక్ష్వాకు ॥<br>
భక్తు లందరిని పరిపాలించెడి శ్రీరామచంద్రా<br>
నీవు క్షేమముగ రామదాసుని నేలుము ॥ ఇక్ష్వాకు ॥

తహశీల్దారైన రామదాసు సర్కారుపైకముతో జీర్ణాలయోద్ధారము చేయుట వలన, సర్కారువారు బందిఖానాలో వేయుటయేగాక, కొరడాలతో కొట్టించెడివారని, పంద్రెండేళ్లు బందిఖానాలో ఉంచిరని కలదు. "తానీషాగారు వచ్చి సరితీర్పు జేసెదరు", "తానీషా

జవాన్లు తహశీలు చేశేరు", "తహశీలు సేయ జామీనైనా యెవ్వరు లేరు" అని కూడ కీర్తనలందు కలదు.

రామదాసు దారిదొంగల దాడినుండి రాముని దయవలన బ్రతికినట్లు ఒక కీర్తనయందు కలదు.

ప్రత్యక్షముగా నను నీ వేళ - బ్రతికించితివయ్యా
సత్యము సత్యము నీవే నా - దైవము సదయ రామచంద్రా ॥ ప్రత్యక్ష ॥
ఝుమ్మను చీకటిలో వాన - ఝురఝుర గురియఁగను
ఇమ్మగు సొమ్ముల నిమ్మని కత్తిని - గ్రుమ్మఁదలఁపఁగాను
సొమ్మసిల్లుచును నా చిత్తమ్ము - సొలసి ఝల్లుమనగా
నమ్మఁదగిన నా దైవము నీవని - నమ్మినందు కిపుడు ॥ ప్రత్యక్ష ॥
ఉబ్బలిలో దారి నెఱుఁగక త - బ్బిబ్బుగ నడువఁగను
అబ్బురముగ నాకు చోరులు ముందుగ - నగపడి యొరదీయ
గొబ్బున నస్త్రముచే నాపై నిక - దెబ్బ వేయరాఁగా
అబ్బా యనక శ్రీరామా యని నే - అప్పుడు శరణంటి ॥ ప్రత్యక్ష ॥
అంత నహో ఏం తా చోరుని - రంతు ఎంతో వింతా
పంతము చెడి యా చోరులు పాఱిరి - పరమపురుషస్వామి!
అంతట కడు వేగమున నేను - సుంత భయము లేకా
దంతిరక్షకా! దాసపోషణ! దయ గల నా స్వామి ॥ ప్రత్యక్ష ॥

ఇందు రామదాసముద్ర లేదు గాని, దాసపోషణసంబుద్ధి రామదాస పోషణసంబుద్ధి అగును. రామదాసు రామకోటి రచించినట్లు ఒక కీర్తనయందు కలదు.

"రామా దయఁజూడవే భద్రాచల - ధామా నను బ్రోవవే సీతా
రామా దయఁజూచి రక్షించి మమ్మేలు - రామా రణరంగభీమా జగదభి॥ రామా ॥
రాజీవదళలోచనా భక్తప - రాధీన భవమోచన
రాజరాజకుల రాజరాజార్చిత - రాజితవైభవ రాజాలలామ ॥ రామా ॥
తాటకసంహరణమేటి - కోటి రాక్షసహరణా
నీటుతో శ్రీరామకోటి వ్రాసితి నీకు - సాటి లేరని సారెసారెకు వేడితి ॥ రామా ॥
దిక్కు నీవని నమ్మితి నీ పదములు - మక్కువ గొని మ్రొక్కితి
చిక్కులు బెట్టకు శ్రీరామదాసుని - చక్కగ బ్రోవవె చక్కని జానకి ॥రామా ॥

ఇవి రామదాసు స్వీయచరిత్రాంశములు. జీవితచరిత్రాంశములు బహు గ్రంథములందు కలవు. యాదవదాసు, సింగరిదాసు, నరసింహదాసు రచించిన రామదాసుచరిత్రములు కలవు[61]. అవి హరికథలు. యక్షగానములు. అంతేకాదు. రామదాసు చరిత్రము భవిష్యత్పు రాణమునందు భద్రపడినది. అది మరాటీనాథచరిత్రమునందు మాఱాకు వైచినది[62].

రామదాసు ప్రస్తుతి త్యాగరాజు ప్రహ్లాదభక్తివిజయమునందు ప్రథమతః కలదు.

"కలియుగమున వరభద్రా
చలమున నెలకొన్న రామచంద్రుని పదభ
క్తులకెల్ల వరుఁడనం దగి
వెలసిన శ్రీరామదాసు వినుతింతు మదిన్." 7.

రామదాసు ప్రశస్తి త్యాగరాజు కృతులందును కలదు. "రామదాసు వలెనైతే సీతాభామమందలించును నీతో" (95). "భాగవతాగ్రేసరులగు నారదప్రహ్లాదపరాశర రామదాసులు" (199). "ధీరుడౌ రామదాసుని బంధము దీర్చినది విన్నానురా" (479.) బంధమన బందిఖానా. భాగవతాగ్రేసరులైన నారదప్రహ్లాదపరాశరుల పంక్తిని రామదాసును ప్రతిష్ఠించుట విశేషము. రామదాసు ప్రభావము త్యాగరాజు మీద సమధికము. కారణము రామభక్తి మాత్రమే కాదు; రామదాసు కీర్తనలు కూడ.

భద్రాచలక్షేత్రమును సాక్షాత్కరింపజేయు కీర్తన :

"అదిగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి ॥ అదిగో ॥
ముదముతో సీత ముదితలక్ష్మణుడు
కదసి కొలువగా కలడదె రఘుపతి ॥ అదిగో ॥
చారు స్వర్ణప్రాకార గోపుర
ద్వారములతో సుందరమై యుండెడి ॥ అదిగో ॥
అనుపమానమై అతిసుందరమై
తనరు చక్రమది ధగధగ మెరిసెడి ॥ అదిగో ॥
కలియుగమందున నిల వైకుంఠము
నలరుచునున్నది నయముగ మ్రొక్కుడి ॥ అదిగో ॥
పొన్నల పొగడల పూపొదరిండ్లతో
చెన్నుమీరగను చెలగుచున్నది ॥ అదిగో ॥
శ్రీకరముగ శ్రీరామదాసుని
ప్రాకటముగ బ్రోచే ప్రభువాసము ॥ అదిగో ॥

అర్తిని స్ఫూర్తిమంతము సేయు కీర్తన :

"ఏ తీరుగ నను దయజూచెదవో ఇనవంశోత్తమ రామా
నా తరమా భవసాగర మీదను నళినదళేక్షణ రామా ॥ ఏ తీరుగ ॥
మురిపెముతో నా స్వామివి నీవని ముందుగ తెల్పితి రామా
మరవక యిక నభిమానముంచు నీ మరుగు జొచ్చితిని రామా ॥ ఏ తీరుగ ॥
క్రూరకర్మములు నేరక చేసితి నేరము లెంచకు రామా
దారిద్ర్యము పరిహారము చేయదె దైవశిఖామణి రామా ॥ ఏ తీరుగ ॥
గురుడవు నా మది దైవము నీ వని గురుశాస్త్రంబులు రామా
గురుదైవంబని యెరుగక తిరిగెడు క్రూరుడనైతిని రామా ॥ ఏ తీరుగ ॥
నిండితి వీ వఖిలాండకోటిబ్రహ్మాండములందున రామా
నిండుగ మది నీ నామము దలచిన నిత్యానందము రామా ॥ ఏ తీరుగ ॥
వాసవకమలభవామరవందిత వారధిబంధన రామా
భాసురవరసద్గుణములు గల్గిన భద్రాద్రీశ్వర రామా ॥ ఏ తీరుగ ॥
వాసవనుత రామదాసపోషక వందన మయోధ్యారామా
దాసార్చిత మా కభయ మొసంగవె దాశరథీ రఘురామా ॥ ఏ తీరుగ ॥

పలుకు బంగారమైన కీర్తన :

"పలుకే బంగారమాయెనా కోదండపాణి ॥ పలుకే ॥
పలుకే బంగారమాయె పిలిచిన పలుకవేమి

కలలో నీ నామస్మరణము మరువ చక్కని తండ్రి ॥ పలుకే ॥
ఇరువుగ ఇసుకలోన పొరలిన యుడుత భక్తికి
కరుణించి బ్రోచితివని నెరనమ్మితిని తండ్రి ॥ పలుకే ॥
రాతి నాతిగ జేసి భూతలమందున ప్ర
ఖ్యాతి జెందితి వని ప్రీతితో నమ్మితి తండ్రి ॥ పలుకే ॥
ఎంత వేడినను నీకు సుంతైన దయరాదు
పంతము చేయ నే నెంతవాడను తండ్రి ॥ పలుకే ॥
శరణాగతత్రాణబిరుదాంకితుడవు గావా
కరుణించు భద్రాచలవరరామదాసపోష ॥ పలుకే ॥

రామభక్తిప్రబోధకీర్తన :

"రామజోగి మందు కొనరే ఓ జనులారా ॥ రామ ॥
రామజోగి మందు కొని - ప్రేమతో భుజియించుడన్న
కామక్రోధలోభమోహ - ఘనమైన రోగాలకు మందు ॥ రామ ॥
కాటుక కొండల వంటి - కర్మము లెడబాపే మందు
సాటి లేని జగమునందు - స్వామి రామజోగి మందు ॥ రామ ॥
వాదుకు చెప్పిన గాని - వారి పాపములు గొట్టి
ముదముతోనే మోక్షమిచ్చే - ముద్దు రామజోగి మందు ॥ రామ ॥
ముదముతో భద్రాద్రియందు - ముక్తిని పొందించే మందు
సదయుడైన రామదాసు ముదముతో సేవించే మందు ॥ రామ ॥

రామనామరుచికీర్తన :

ఓ రామ నీ నామ మేమి రుచిరా
శ్రీరామ నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
కరిరాజ ప్రహ్లాద ధరణి విభీషణుల
గాచిన నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
కదళీకర్జూరాదిఫలముల కధికమౌ
కమ్మన నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
నవరసముల కన్న నవనీతముల కంటె
అధికమౌ నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
పనసజంబూ ద్రాక్షఫలరసముల కంటె
అధికమౌ నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
అంజనతనయు హృత్కమలంబునందు
రంజిల్లు నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
శ్రీసదాశివుడు తా నే వేళ భజియించు
శుభరూప నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
సారము లేని సంసారతరుణమునకు
తారకము నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
శరణన్న జనులను సరగున రక్షించు
బిరుదు గల్గిన నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
తుంబురునారదుల్ డంబు మీరగ గా

నంబు చేసెడి నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥
అరయ భద్రాచల శ్రీరామదాసుని
ఏలిన నీ నామ మేమి రుచిరా ॥ ఓరామ ॥

ఇట్లు రామనామమేకాదు; రామదాసు కీర్తనలును భక్తిరసహృదయులకు, కదళీఖర్జూరాదిఫలముల కంటె, పనసజంబూద్రాక్షఫలరసముల కంటె, నవరసముల కంటె, నవనీతముల కంటె రుచికరములు.

రామదాసు కీర్తనలు సంస్కృతమునందును కలవు. ఒక ఉదాహరణము :

"భజ రే మానసరామం
భజరే మానసరామం
కరధృతశరకోదండం
కరితుండాయుతభుజదండం ॥ భజరే ॥
దాశరథీనరసింహం
దాశరథీసురసింహం
కౌసల్యాబహుభాగ్యం రామం
మైథిల్యాలోచనయోగ్యం ॥ భజరే ॥
అవనతజలజభవేంద్రం
అగణితగుణగణసాంద్రం
మాయామానుషదేహం ముని
మానసరుచికరవేషం ॥ భజరే ॥
శ్యామసజలధరశ్యామం
సాంబశివానుతనామం
భద్రాద్రిచలనివాసం పరి
పాలితశ్రీరామదాసం ॥ భజరే ॥

# గణపవరపు వేంకటపతి

ఇతని కృతులు 1. తారావళులు. 2. యమకశతకము. 3. శృంగారమంజరి. 4. ఉదాహరణము. 5. కృష్ణమల్లకథ 6. చతుర్భద్రము. 7. బాలరామాయణద్విపద. 8. చాటుపద్యములు. 9. లింగానుశాసనము. 10. లింగనిర్ణయక్రమము. 11. ప్రతాపరుద్రీయము 12. రసమంజరి 13. ఆంధ్రనిఘంటువు. 14. ఆంధ్రకౌముది. 15. గణయతిప్రాసలక్షణ సీసమాలిక. 16. ఆంధ్రప్రయోగరత్నాకరము. 17. రేఫఱకారనిర్ణయపద్ధతి 18. షట్ప్రత్యయప్రస్తారసరణి. 19. ఇర్వదాఱుఛందములకు వచనము. 20. అలంకారసారము. 21. ద్విరూపకోశము. 22. కల్పితకల్పలత. 23. వసంతతిలకభాణము. 24. కఠినప్రాసశతకరాజము. 25. యతిరాజాద్విపద. 26. రమణద్విపద. 27. బిరుదుగద్య. 28. జాంబవతీవిలాసచిత్రకావ్యము. 29. చండవిద్యావతీదండకము. 30. చక్రవాళము. 31. సకలపురాణసారవిలాసము. 32. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. (26, 35-37, 45-48, 50, 51ప. ప్ర.వేం.వి.వి.)

ఇందు ఆంధ్రనిఘంటువు, ఆంధ్రకౌముది, గణయతిప్రాసలక్షణసీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాకరము, రేఫఱకారనిర్ణయపద్ధతి, విద్యావతీదండకము, ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము మాత్రమే ఉపలబ్ధములు. గణయతిప్రాసలక్షణసీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాకరము, రేఫఱకారనిర్ణయపద్ధతి, విద్యావతీదండకము అముద్రితములు. ఆంధ్రనిఘంటువు (వేంకటేశాంధ్రము), ఆంధ్రకౌముది, ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము ముద్రితములు. ఆంధ్రనిఘంటువు, ఆంధ్రకౌముది, గణయతిప్రాసలక్షణసీసమాలిక రేఫఱకారనిర్ణయపద్ధతి, షట్ప్రత్యయప్రస్తారసరణి, ఇర్వదాఱుఛందములకు వచనముతోపాటు కవితాలక్షణము, కావ్యలక్షణము, నాయికా నాయకలక్షణము, రసప్రకరణము, దోషప్రకరణము మొదలైనవి కలిసి పదిఉల్లాసముల సర్వలక్షణశిరోమణి[63].

విద్యావతీదండకము ముద్దళఘురికి అంకితము. దండకమునందు ముద్దళఘురి "క్షోణిపాలుండు", "నిండోలగంబుండి విద్యావినోదంబులం గొంతప్రొద్దు" గడిపినవాడు, "కర్ణాటసింహాసనాధ్య"క్షుడు అని కలదు[64]. కర్ణాటసింహాసనమన విజయనరగసింహాసనము కాదు. మధురసింహాసనమగును. ముద్దళఘురి మధురసింహాసనాధ్యక్షుడైన కాలము 1675-78 అని పూర్వోక్తము. కాఁబట్టి విద్యావతీదండకము రచనాకాలము 1675 ప్రాంతము, విద్యావతీదండకముతోపాటు సర్వకృతులు ప్రసక్తమైన ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము రచనాకాలము 1680 ప్రాంతము కావచ్చును.

**విద్యావతీదండకము** : ఇది ముద్దళఘురికి అంకితము. ఇందు ముద్దళఘురి కొలువు చాలించి, వాహ్యాళిగా వెళ్లిన, విద్యావతి అను వేశ్య చూచి వివశురాలగుట, వేశ్యమాత ముద్దళఘురిని వేడుకొనుట, ముద్దళఘురి సమ్మతించుట, వేశ్యమాతకు చిత్రశాటీధన గ్రామాదు లిచ్చుట, విద్యావతిని తన నాట్యశాలాపాత్రలందెల్ల సన్మానపాత్రను చేయుట ఇతి వృత్తము. ప్రభుభక్తిపరాయణము.

**ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము** : ఇది తిరుపతి వేంకటేశ్వరునికి

అంకితము. ఇందు తిరుపతి వేంకటేశ్వరుని విజయవిలాసమే ప్రధానేతివృత్తము. నాగదత్తోపాఖ్యానము అనుషంగికేతివృత్తము. ఇది సాధారణకావ్యము కాదు. మహా చమత్కారకావ్యము. "అన్యానధీన సుధీనవనవస్తవ్యసర్వపథీనపాండితీ మండితచమత్కారంబుగా" రచియించినది. (63వచ.) అన్యానధీన మన అన్యులకు అధీనము కానిది. సాధ్యము కానిది. సుధీనవనవస్తవ్యమన మహాధీమంతులు క్రొంగ్రొత్తగా కొనియాడదగినది. సర్వపథీనపాండిత్యము సకలభాషాఛందోలంకారవ్యాకరణలక్షణశాస్త్ర సర్వంకష పరిజ్ఞానము. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము అష్టాదశలక్షణ గ్రంథములకు లక్ష్యము. చతుర్వింశతినిఘంటుపదములకు పదము. షష్టివిధయతి చమత్కారములకు ఆధారము. చతుర్వింశతిప్రాసములకు ఆవాసము. ఆంధ్రప్రబంధములకు ఆలవాలము. పూర్వకవుల రచనావిధానమునకు ఘంటాపథము. అంతేకాదు. విద్యాధికులకు హృద్యము. విటీవిటులకు పుటపుట-విరహులకు మెఱమెఱ. అని కవి వివరణమే. (63వచ.) 885 పద్యగద్యముల కథాభాగమునందు సుమారు అయిదువందల కవితావిశేషనిర్దేశములు కలవు. మొత్తము మీద 885 పద్యగద్యములును ఉపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్యశ్లేషశబ్దాలంకార విశేషభాషలకు, వర్ణనలకు, జాతివార్తాచమత్కారములకు, చిత్రగర్భబంధకవిత్వము లకు లక్ష్యములు. కాఁబట్టి లక్ష్యకావ్యము. ప్రబంధరాజము. ప్రతిపద్యచమత్కృతి, ప్రతిపద ప్రౌఢి ప్రధానము.

"ప్రతిపద్యంబు జమత్కృతిఁ
బ్రతిపదమును బ్రౌఢి మివులఁ బరఁగిన కృతి స
త్కృతి గాక జల్లిమాటల
యతకడపుఁ దడిక సభల కర్హం బగునే" 21ప.

అని గణపవరపు వేంకటపతి ఆశయము. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము అతకడపు తడిక కాదు. చిత్రలిఖితశిలాభిత్తిక.

ప్రధానేతివృత్తమైన వేంకటేశ్వరవిజయవిలాసము కథాప్రధానము కాదు. వర్ణనాభూయిష్ఠము. వేంకటేశ్వరుడు వేట నెపమున ఆకాశరాజా కూతురు అలమేల్మంగను వివాహ మాడుటయే విజయవిలాసము. ఆరువందల అయిదు పద్యగద్యములందు పర్యాప్తము. విప్రలంభశృంగారమేగాని, వివాహానంతరము సంభోగశృంగారము లేకపోవుట విశేషము. అంతేకాదు. సంభోగశృంగారమునకు బదులు స్వామిపుష్కరిణీ మాహాత్మ్యమును ప్రతిపాదించు నాగదత్తోపాఖ్యానము కలదు. అది కథాప్రధానము. ప్రధానకథారంగమైన తిరుపతి వర్ణనము సుదీర్ఘము. (1-44ప.) తిరుపతి వృత్తరత్నాకరము వలె అలరుచుండునట. అందలి వేశ్యలు, పుష్పలావికలు, పుష్పములు, పరిఖలు, ప్రాసాదకేతువులు, రసికనటవిటీవీరరాహుత్తభటచయము, గజాశ్వములు, గోపురము, మోకాళ్ల ముడుపు, ఆకాశగంగ, బయకాని కోన, శేషగిరి, పూలతోట మొదలైనవి స్థానికవిశేషములు. ఫిరంగులు, నల్లమందు మొదలైనవి సమకాలికవిషయములు.

"అన్నమున సున్నమున నృపుల్ బన్నమొంద
నెన్ని మందు లిడుదు రౌర యెన్ని మందు
లట్టి దొక శూరకర్మమె యనుచు నెట్టి
యొల్లమందుల గెలుపొందు నల్లమందు." 7.

వేంకటేశ్వరస్వామి తిరువీధివిహారము, కొలువు సేయుట, షోడశోపచారము లంగీకరించుట, సుఖసుప్తి స్థానికవిశేషములు. (79-112వచ.) ఇందు నూట నాలుగు రకముల పైరులు కలవు. భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయాదుల వివరములు కలవు. చెంచు నాయకుల ఘట్టము సవిస్తరము. (127-177ప.) ఇందు జాతివార్తలు ఇతోధికము. వేంకటేశ్వరస్వామి మృగయావినోదమును సవిస్తరము. (178-240వచ.) ఇందు చెంచు భేదములు (193ప.) పక్షి భేదములు (234ప.) కలవు. ఆటవికజానపదకథలు కలవు.

"బాసఁ దప్పక బూమి రాసబాపని కిచ్చి
    నిజము సేకొన్న మన్నీని కతలు
నలకి పుట్టువు గ్రోల నరచేతను గలాని
    చిలుకుముక్కున నిల్పు బలియు కతలు
కంపటీలను పసిగాపరులకు గొండ
    వేల నెత్తిన గోపబాలు కతలు
పలుమాఱు మనువు బిడ్డల బిడ్డలాటకై
    నేలకుఁ జేయు కయ్యాల కతలు
కులము పెద్దలు రచ్చల గుంపు గూడి
చేరగా వచ్చి కోయితల్ చెప్పుకొనఁగ
సకలమును విన్నవారము సామి మమ్ము
నేళముగ సూసి సిత్రాన నెంచకయ్య." 174ప.

వేంకటేశ్వరస్వామి మంత్రి శ్యేనాన్వేషణము, అలమేల్మంగ సఖి కమలమాలిక రాయబారము, అలమేల్మంగావేంకటేశ్వరుల పరస్పరావలోకనాపారవశ్యము అలమేల్మంగా విరహము, అలమేల్మంగావేంకటేశ్వరుల వివాహము మొత్తము 605 పద్యగద్యములందు కలదు. (1-605 వచ.) ఇందు మంత్రి శ్యేనాన్వేషణానంతరము వేంకటేశ్వరస్వామిని స్తుతించుట నలుబదియైదు పద్యగద్యములందు కలదు. (346-390 ప.) అది కథకు ఆవశ్యకము కాదు. కవి తన వేంకటేశ్వరస్తుతిని కావ్యపేటికను భద్రపఱిచినట్లు కలదు. అంతేకాదు. నాగదత్తోపాఖ్యానము తర్వాత దేవతలు వేంకటేశ్వరస్వామిని స్తుతించుట ఎనుబదియైదు పద్యగద్యములందు కలదు. (801-885ప.) అది కూడ కథకు ఆవశ్యకము కాదు. కవి తన వేంకటేశ్వరస్తుతిని కావ్యపేటికను భద్రపఱిచినట్లే కలదు. అవి 45, ఇవి 85 మొత్తము 130 పద్యగద్యములు ప్రత్యేకమొక వేంకటేశ్వరస్తుతికావ్యమగును.

ఆనుషంగికమైన నాగదత్తోపాఖ్యానము సుమారు రెండువందల పద్యగద్యములందు కలదు. (606-800 ప.) ఇది తెనాలిరామ (లింగ) కృష్ణుని నిగమశర్మోపాఖ్యానమునకు, కందుకూరి రుద్రయ నిరంకుశోపాఖ్యానమునకు సహోదరము. నాగదత్తుడు నిగమశర్మ కంటె, నిరంకుశుని కంటె భ్రష్టుడు. నాగదత్తుని తల్లి మాత్రము గుణనిధి తల్లి వలె, నిగమశర్మ అక్క వలె, నిరంకుశుని భార్య వలె సజీవపాత్ర, నిరుపయోగమైనను తల్లి కర్తవ్యముగ నీత్యుపదేశము చేసినది. అది సుమారు పాతిక పద్యములందు కలదు. (679-703 ప.) ఉపదేశమునకు ఉలుకు, పలుకు లేని కొడుకును చూచి గోలపెట్టినది.

" ఏమీ పల్కవు నేనుఁ బిల్వ దయలేదే నీకు నా యయ్య ని
న్నేమంటి న్నుకుమార నా యెడను దప్పేదీ కుమారాగ్రణీ

నా మీఁదన్ జలమేదిరా తనయ నన్మన్నించరా పెన్నిధీ
నీ ముద్దు ల్గన నోచినాఁగదర తండ్రీ! నీతిపారంగతా! " 704 ప.

అవినీతిపారంగతుడైన నాగదత్తుడు తల్లి ఆభరణములు అపహరించి, వేశ్యకు సమర్పించి వీథిని పడును. బోయలతో కూడి దొంగతనములకు పాల్పడును. వేంకటేశ్వర స్వామి ధనము దోచునెడ హరిభటులు అడ్డగింతురు. వారి ధాటికి తాళలేక అందఱును స్వామిపుష్కరిణిలో మునుగుదురు. ఫలితముగ సాయుజ్యమును పడయుదురు. ఇది స్వామిపుష్కరిణి మాహాత్మ్యము.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమునందు జాతి అను నిర్దేశముతో ఏడు పద్యములు (53, 127, 130, 134, 180, 191, 622); వార్త అను నిర్దేశముతో ఒక పద్యము (747); జాతి వార్త అను నిర్దేశముతో ఒక వచనము (78), మూడు పద్యములు (155, 167, 626) కలవు. జాతి అను నిర్దేశముతో కల ఏడు పద్యములును స్వభావోక్త్యలంకారములే. ఒక పద్యమునకు మాత్రము (127) స్వభావోక్త్యలంకారజాతి అను నిర్దేశము కలదు. అది స్పష్టార్థప్రతిపత్తికి అగును. ఒక జాతి లక్ష్యము :

" మేను తల తోక కాళ్లు పల్ మించు గలిగి
రెట్ట మెడ మెత్తి తొడ ప్రక్క పొట్ట పెంచ
మఱచి కాటున విడువక తఱమి గెల్చు
దొడ్డ పికిలిపిట్టల బిరుదుకురుజులును." 134 ప.

ఇది స్వభావోక్తియే. ఇక వార్త లక్ష్యము :

"కరము గాజులు ఘల్లన కంచె లొరయ
దత్తనిభ నాగదత్త నీ దత్తరంపు
గుత్తగాని తనం బెత్తు గుత్తగాను
పంజెమాటలఁ గూడునా లంజెతికము. " 747 ప.

ఇందు " పంజెమాటలఁ గూడునా లంజెతికము" అను సామాన్యము సామెత వంటిది. జాతివార్తావచనమునందు స్వభావోక్తి కలదుగాని సామెత లేదు. డెబ్బదిరెండు వినియోగముల వివరములు; బలిజకన్నడమిటారుల, చోళవిలాసినుల, గుజరాతిహంతకారుల, సాతని జాతి నీటుకత్తెల సహజవర్ణనలు; పదిరెండు దండల, పదిరెండు గతుల, పదిరెండు గాయమానముల, పదిరెండు మొనల, పదునాల్గు విసరుల, ముప్పదిరెండు విన్నాణముల ద్వాత్రింశదాయుధముల వివరములు కలవు. ఆయా జాతుల సమాచారమే ఈ జాతివార్తావచనము కావచ్చును. జాతివార్తలు లక్ష్యము :

"చలిగాలి దిండిమేతల జాతికొమ్మల
  యాటల కిరవైన యట్టి సెలలు
గుబ్బపు మూతుల కులము పాల్తుల తేట
  పాటల కునికైన మేటి చరులు
నిసుమంత మాని సవంగసము బాలల కిన్నె
  రల మ్రోఁతలకు మారుపలుకు గవులు
తెలిసుర తెరగంటి తెరగంటి తెఱవల
  రచ్చపట్టగు నెలజాతి గములు
జంట ముక్కాలి తెక్కడా లంటు చేత

మలినమౌ నలినములకు (బలు కొలఁకుల
గలిగి చెంబుల కెల్లను నిలుక డయిన
పొన్న వలిమల చెంత మా బూమి సామి. " 154 ప.

ఇందు స్వభావోక్తి కలదు. సామెత లేదు. అంతేకాదు. చెంచుజాతి సమాచారములు కలవు. జాతి సమాచారములే ఈ జాతి వార్తలు. జాతివార్త లక్ష్యము :

" కోనము ల్వెలువడి ఘుర్ఘురధ్వనులతో
దారి ముస్సెలు మోర లోరసెలగ
నేల జల్లెడు వలె నెలకొల్పి పాలమెల్ల
పోడి గొట్టిరన గోరాడి చప్ప
రింపుచు పై వేరు దెంపుల దంట్రలు
నూరి జొల్పెలవుల నురుగు బిరుదు
జల్లుల గతి నొప్ప దుళ్లుచు నవ్వాడి
కోఱల నరవాడు దేరు చీక
దిగులు నుత్తరింపుచు వెదురు గడలు వడ
రాచి తుదలెల్ల ఝాడించి రాలు బియ్య
మొరకు గొని పెంట్లఁగూడి మై నెరులు నిక్క
నేన్గు దోమగఁ జూచు నయ్యేకలములు. " 167 ప.

ఇందు స్వభావోక్తి కలదు. సామెత కలదు. అంతేకాదు. ఎఱుకజాతి సమాచారమును కలదు. ఈ జాతివార్త జాతిసమాచారము కావచ్చును. జాతి=స్వభావోక్తి , వార్త=సామెత కావచ్చును. అయిన జాతివార్తలు అను నిర్దేశము కావలయును.

"ఇంతిరో మనదీట నింతగా మును పెఱు
కెఱుకో యటం చొక యొఱుకసాని
యేతెంచె నడుగవే యో యవ్వ యొకసుద్ది
సెప్పెద బాగెవు సేయి సూపు
కొల్లాపురమ్మాన పొల్లాపు లే దొండుఁ
దలఁచితి వడి గాదు దయ నిటుండు
గడకేగు నినుబాసి కన్నది పెఱవాని
నిన్నుఁ జేర్చు నెఱుంగ నేర వీవు
గానఁ దరకట బురకట గాదు మేట
జేరు బురకని తోడితే తారుకాణ
యొండు రెండే దినాలలో దుండి నాదు
మాట మఱువకుమని పోయె మఱచినావె. " 626 ప.

ఇందు స్వభావోక్తి కలదు. సామెత లేదు. ఎఱుకత సమాచారము కలదు. ఈ జాతివార్త జాతి సమాచారమే కావచ్చును.

కతిపయచమత్కారకవితలు :

"శ్రీముఖప్రభవసుస్మేరాభకౌస్తుభ
సర్వజిద్విక్రమచక్రహస్త
సౌమ్యభావమునింద్రసన్మనోంబుజభృంగ

యవ్యయానందహృద్భవ్యరూప
ధాతృసాధారణస్తవనీయనిజచర్య
విభవప్రమోదాప్తవిబుధనాథ
జయదుందుభిధ్వానచకితాసురాధ్యక్ష
దుర్మతిరాక్షసశర్మహరణ
చిత్రభానుస్వభానుజిత్సిద్ధతేజ
విజయనందనఖరసూతవిధివినోద
మన్మథక్రోధిధర్మనిర్మథనసార
వృషగిరీశ్వరసంకాశ వేంకటేశ! " 389 ప.

ఇది వేంకటేశ్వరస్తుతి. ఇందు పాతిక తెలుగు సంవత్సరముల పేరులు కలవు. అవి స్తుతిపరముగ అర్థవంతములు. సంవత్సరనామము లగుట చమత్కారము. శ్రీముఖ, ప్రభవ, సర్వజిత్, విక్రమ, సౌమ్య, భావ, అవ్యయ, ఆనంద, ధాతృ, సాధారణ, విభవ, ప్రమోద, జయ, దుందుభి, దుర్మతి, రాక్షస, చిత్రభాను, స్వభాను, విజయ, నందన, ఖర, మన్మథ, క్రోధి, వృష ఈశ్వర నామములు తెలుగు సంవత్సరములు.

" రహి మది యయోధ్య వాతెఱ రక్తి మధుర
కౌను మాయ కబరి కాశి కటియు కాంచి
గాంచి వెలయు నవ్వెలఁదిని గాంచినంత
యబ్బురమె క్షేత్రఫలము మీ కబ్బుటెల్ల. " 393 ప.

ఇది కమలమాలిక వేంకటేశ్వరునికి అలమేల్మంగ అందచందములు తెలుపునది. ఇందు అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి అందచందముల పరముగ అర్థవంతము లు. అంతేకాదు. అవి ప్రసిద్ధములైన పంచక్షేత్రములు. అలమేల్మంగను కాంచినంతనే పంచక్షేత్రదర్శనఫలము కలుగునని శుభాశంసనము. క్షేత్రనామములు శ్లిష్టము లగుట చమత్కారము. క్షేత్రఫలమును శ్లిష్టము, స్పష్టము.

"తెఱవ నీ తీయవాతెఱ మణిసారంబు
రమణి నీ నెన్నొసల్ రసతిలకము
పొలఁతి నీ మోము ప్రబోధచంద్రోదయ
మతివ నీ నవ్వు కావ్యప్రకాశ
మబల నీ చూపుటొయ్యారంబు కౌముది
కలికి నీ మే నలంకారసరణి
కొమ నీ కనుంగవ కువలయానందంబు
మగువ నీ చన్దోయి మంజరిగతి
నెలఁత నీ కొప్పు మేఘసందేశ మయ్యె- " 639 ప.

ఇది వేశ్యావర్ణనము. ఇందు మణిసారము, రసతిలకము, ప్రబోధచంద్రోదయము. కావ్యప్రకాశము, కౌముది, అలంకారము, కువలయానందము, మంజరి, మేఘసందేశము అధరాదుల పరముగ అర్థవంతములు. అవి గ్రంథనామములు. ఇది చమత్కారము.

ఇంతకంటె మహాచమత్కారము చిత్రగర్భబంధకవిత్వముల కందుకక్రీడ. ఇతర కావ్యములందు ఇవి సకృన్మాత్రము. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయ విలాసమునందు సమృద్ధిప్రాయము. అంతేకాదు. చిత్రగర్భబంధకవిత్వముల సమ్మేళనము, గర్భబంధ

కవిత్వముల సంయోజనము, చిత్రగర్భకవిత్వముల సమ్మిశ్రణము సమధికము.

ఏకాక్షరకందము (214) ఏకాక్షరనామకందము (230) చతుర్విధకందము (827) అనులోమప్రతిలోమకందము (365) మొదలైనవి కేవలము చిత్రకవిత్వములు. కందగర్భితప్రమితాక్షర వృత్తము (261) గీతగర్భితసీసము (466) ద్విపదమత్తకోకిల కందగర్భితసీసము (821) కందద్వయగర్భితభాస్కరవిలసితవృత్తము (825) మొదలైనవి కేవలము గర్భకవిత్వములు. కటారికాబంధకందము (830), శంఖబంధకందము (853) పట్టసబంధోత్సాహవృత్తము (856) చక్రబంధము (861) నాగబంధము (862) మొదలైనవి కేవలము బంధకవిత్వములు.

భుజంగప్రయాతస్రగ్విణీగర్భితదండకరూపచిత్రసీసము (807), నవాక్షరసమవృత్త కందద్వయమణిగణనికరగర్భితదండకరూపచిత్రసీసము (818) గర్భితాచలజిహ్వాకోష్ఠ్యవర్ణ భుజంగప్రయాతవృత్తము (833) స్రగ్విణీవృత్తమంజరి ముక్తపదగ్రస్తద్విపదదండకవృత్తి దండకగర్భితదుర్భరద్విప్రాసత్రిప్రబకాంత్యనియమసమధిక పదచిత్రాస్పద చిత్రచరణ భాసమానసీసము (879) మొదలైనవి చిత్రగర్భకవిత్వసమ్మేళనములు. ప్రమితాక్షర వృత్తకందగర్భితనాగబంధయుక్తచంపకమాలికావృత్తము (826) మంజరీగీతగర్భితచరణ వహమహానాగబంధసీసము (831) అష్టమాలికాబంధగోమూత్రికాబంధగుచ్ఛబంధహల బంధచత్రబంధపంచకనిరోష్ఠ్యకందము (851) చతుర్దళగర్భితద్వాదశదళపద్మబంధపాదు కాబంధద్వయమణిగణప్రవాళానుష్టుప్ శ్లోకము (852) పుష్పమాలికాబంధయుక్తకంద మదనవిలసితశ్లోకగర్భితస్రగ్ధరావృత్తము (863) మొదలైనవి గర్భబంధకవిత్వసంయోజనములు.

బహువిధచిత్రకంకణబంధద్విగుణితసీసచరణచతుష్టయగర్భితద్విపదకందద్వయసమ వృత్తచౌపదయుగళాటవెలఁదితేటగీతిమదనవిలసితతురంగవృత్తబహువిధతాళవృత్తాష్ట కధవళశోభనగానారాత్రికగానజంపెత్రిపుటార్ధచంద్రికాసువ్వాలలాలిపదైలామంజరిసమతా డిండిమతాళవృత్తమణిగణనికరతురగవల్గనరగడోదాహరణసంబుద్ధికళికోత్కళికార్ధాహిరీరాగదళ ముఖారిరాగాటతాళదళకాంభోదిరాగరూపకతాళదళకాంభోదిరాగసమపదకన్నడరాగసాంగత్య కొరవంజిదళదేవగుప్తిరాగసమపదసావేరిరాగైకతాళదళబిలహరిరాగాటతాళసమపదపుష్ప మాలికాబంధగోమూత్రికాబంధశార్ఙ్గబంధషోడశదళపద్మబంధపాదుకాబంధనవరంగబంధ ఖడ్గబంధగుచ్ఛబంధఛత్రబంధచామరబంధగదాబంధచక్రబంధశకటబంధనాగబంధరథ బంధవీణాబంధశంఖబంధమృదంగబంధపాదభ్రమరకబంధపాదార్ధభ్రమరకబంధవింశతి బంధభేదానుష్టుప్‌శ్లోకాంతర్గతచతుర్భద్రనవరంగసర్వతోభద్రాందోళికాబంధయుక్తానులోమవిలోమ కందభాషాశ్లేషకందాటవెలఁది గర్భితాంత్యతేటగీతియుక్తచౌషష్టిభేదసీసము (808) మొదలైనవి (832, 877) చిత్రగర్భబంధకవిత్వసమ్మిశ్రణములు. చౌషష్టిలీలల సీసపద్య మిది :

సారాగ్ర్యసారససమనేత్రయుగళ నా
రదరుచికాంతినర ఘనపనిత
సారాగధీరవిశదవీనతురగ భై
రవభవజైత్రభరశుభకరణ

సారాతిహారవిసరచారణహరిసా
    రసహితచంద్రశరజజయనుత
వారాశినారదవరపూజితపదగౌ
    రవకటిఖడ్గగరళగళసఖ
హరినగనిలయ గిరిధర యసురదళన
మణిమయమకుటసురమణిమధువిశరణ
కరివరద కువలరుచిరతరవసన న
రహరి లసితదరనిగమవిహరణ హరి! " 808 ప.

ఇది కవిత్వపు కంప్యూటర్. ఇందు అరువది నాలుగు రకముల చిత్రగర్భ బంధ కవిత్వముల సమ్మిశ్రణము కలదు. అందు సంస్కృతాంధ్ర, సంగీతసాహిత్య, పదపద్య, జాత్యుపజాతి సమైక్యము కలదు. పదకవితాప్రభేదములివి :

**" 5. ప్రథమమహానవమి చౌపది**

సారాగ్ర్యసారస సమనేత్రయుగళ
నారదరుచికాంతినరఘనపనిత
సారాగధీరవిశదవీనతురగ
భైరవభవజైత్రభరశుభకరణ.

**6. ద్వితీయమహానవమిచౌపది**

సారాతిహార విరసచారణ హరి
సారసహితచంద్రశరజ జయనుత
వారాశి నారదవరపూజితపద
గౌరవకటి ఖడ్గగరళ గళసఖ.

**13. ధవళము**

సారససమనేత్రయుగళ
నారద నరఘన పనిత
ధీరవిశద వీనతురగ
భైరవభవ శుభకరణ.

**14. శోభాన**

సారససమనేత్రయుగళ
ధీరవిశద వీనతురగ
హారవిసర చారణహరి
నారదవరపూజితపద.

**15. హారతి (ఆరాత్రికము)**

సారాగ్ర్యసారస సమనేత్రయుగళఘన
భైరవభవ జైత్రభర శుభకర
సారాతిహార విసరచారణ హరిజయ
గౌరవకటి ఖడ్గ గరళ గళసఖ.

**16. జంపె**

సారాగ్ర్యసారస సమనేత్ర నరనుత

గౌరవకటిఖడ్గ గరళగళసఖ.

**17. త్రిపుటరేకులు**

హారవిసరచారణ హరిసారసహిత చంద్ర జయనుత
నారదవర పూజితపద గౌరవకటి
నారద రుచికాంతి నరఘన సారస సమనేత్రయుగళ
ధీరవిశద పీన తురగ భైరవభవ.

**18. అర్ధచంద్రికలు**

కరి వరద కువల! హరినగ నిలయ

**19. సువ్వాల**

సారససమనేత్రయుగళ
నారదరుచి నరఘన
ధీరవిశద పీనతురగ
భైరవభవ.

**20. లాలి**

సారససమనేత్ర నారదరుచి
భైరవభవ జైత్రభర శుభకరణ.

**21. ఏల**

ధీరవిశద పీనతురగ ! సారసమనేత్రయుగళ
హారవిసరచారణహరి! సారసహిత నారదవరపూజితపద.

**28. ఆహిరీరాగదరువు**

సారాగ్ర్యసారస సమనేత్రయుగళ
సారాగధీర విశదపీనతురగ.

**29. ముఖారిరాగదరువు - ఆట తాళము**

సారాగ్ర్యసారస సమనేత్రయుగళ
భైరవ భవజైత్ర భరశుభకరణా.

**30. ఎఱుకల కాంభోదిరాగదరువు - రూపకతాళము**

సారాతిహార విసర చారణహరి
వారాశి నారదవర పూజిత పద

**31. కాంభోదిరాగసమపదదరువు**

సారస సమనేత్రయుగళ
నారదరుచి కాంతినరఘనపనిత
సారాగధీర విశద పీనతురగ
భైరవ భవజైత్రభర శుభ కరణ

**32. కన్నడరాగసాంగత్యదరువు పదము**

సారాగ్ర్యసారస సమనేత్రయుగళ
నారదరుచి కాంతి నరఘన పనిత
సారాగధీర విశద పీనతురగ

భైరవ భవజైత్ర భరశుభకరణ

**33. కొరవంజిదళరేవగుప్తిరాగసమపదదరువు**

సారాతి హార విసర చారణహారి
సారసహిత చంద్ర శరజ జయనుత
వారాశి నారదవర పూజితపద
గౌరవకటి ఖడ్గ గరళగళ సఖ.

**34. సావేరిరాగైకతాళదరువు**

హరినగనిలయ గిరిధర
యసుర దళన మణిమయ మకుట
సురమణిమధు విశరణ
కరివరద కువరలసితవర.

**35. బిలహరిరాగాటతాళసమపదదరువు**

సారాగధీర విశదవీన తురగ
నారదరుచి కాంతి నరఘన పనిత

ఇట్లు పదములు 19, సమవృత్తము 1, తాళవృత్తములు 2, రగడ 1, కళిక 1, ఉత్కళిక 1, అష్టకము 1 పద్యములు 14, అనుష్టుప్శ్లోకము 1 మొత్తము 41 గర్భకవిత్వ ములు 23 బంధకవిత్వములు కలవు. ఇవి ఎక్కువ వేంకటేశ్వరస్తుతులందు కలవు.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమునందు తిరుపతి (1-44) తిరునాళ్లు (53-57) తిరువీథివిహారము (76-79) కొలువు (80-111) పూజ (112) చెంచునాయకులు (127-177) వేట (178-240) అలమేలుమంగ మన్మథపూజ (241-248) వనవిహారము (249-256) జలక్రీడ (257-280) వేంకటేశ్వరస్వామి మంత్రి స్వగతములోని అలమేల్మంగ సౌందర్యము (288-321) కమలమాలిక రాయబారము (392-432) అలమేలుమంగావేంకటేశ్వరుల పరస్పరావలోకనము (441-456) అలమేలుమంగ విరహము (457-553) అలమేలుమంగావేంకటేశ్వరుల వివాహము (554-605) ప్రధానమై వర్ణనములు-వసంతర్తు (45-52) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (58-75; 113-126) ప్రకృతి వర్ణనలు మాత్రమే కలవు. వర్ణనలను మించి స్తుతులు కలవు. 1. వేంకటేశ్వరస్వామి మంత్రి కావించిన వేంకటేశ్వరస్తుతి. (247-290) దేవతలు కావించిన వేంకటేశ్వరస్తుతి (803-885) ఇవి గణపవరపు వేంకటపతి వేంకటేశ్వరభక్తికి నిదర్శనములు.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమునందు పూర్వకవితాచర్వణము పుష్కలము. మంచెన కేయూరబాహుచరిత్రము, ఎఱ్ఱన నృసింహపురాణము, నాచన సోమన ఉత్తరహరివంశము, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము, హుళక్కి భాస్కరాదుల భాస్కరరామాయణము, వేములవాడ భీమన చాటువు, శ్రీనాథుని చాటువు, పలనాటి వీరచరిత్ర, జక్కన విక్రమార్కచరిత్రము, వల్లభామాత్యుని క్రీడాభిరామము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శాకుంతలము, నంది మల్లయ ఘంటసింగనల వరాహ పురాణము, మొల్ల రామాయణము, కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక, హరిభట్టు ఉత్తరనారసింహపురాణము, అల్లసాని పెద్దన మనుచరిత్రము, శ్రీకృష్ణదేవరాయల ఆముక్త మాల్యద, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము, పింగళి సూరన కళాపూర్ణో

దయము, ప్రభావతీప్రద్యుమ్నము, తెనాలి రామ(లింగ)కృష్ణుని ఉద్భటారాధ్యచరిత్రము, భట్టుమూర్తి కావ్యాలంకారసంగ్రహము, వసుచరిత్రము, హరిశ్చంద్రనలోపాఖ్యానము, పొన్నిగంటి తెలగన్న యయాతిచరిత్రము, తెనాలి రామభద్రుని ఇందుమతీపరిణయము, తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రము, ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రము, రఘునాథనాయకుని వాల్మీకి చరిత్రము, పసుపులేటి రంగాజమ్మ మన్నారుదాసవిలాసము, ధరణిదేవుల రామయమంత్రి దశావతారచరిత్రము, కట్టా వరదరాజు రామాయణము, శ్రీరంగమాహాత్మ్యము, చింతలపల్లి ఛాయాపతి రాఘవాభ్యుదయము, మోచెర్ల నన్నయ సాంబోపాఖ్యానము మొదలైన బహుకావ్యములలోని పద్యములకు ప్రతిబింబప్రాయము లైన పద్యములు కలవు[65].

"పొదలి యొండొండ దివియును భువియు దిశలుఁ
బొదివికొనియుండు చీఁకటిప్రోవు వలన
మిక్కుటంబుగఁ గాటుక క్రుక్కినట్టి
కరవటంబన జగదండఖండ మమరె" 80 ప. 3ఆ. నృ. పు.
" - కటికి చీఁకటి పుడమి యాకసము జత యొ
నర్చి కాటుక బరిణ చందమునఁ జేసి
చెలఁగు నభిసారికల దీవన లనఁ బెరిగి
సూదిమొన కెడమీక హెచ్చునను నెరసె." 64 ప. ప్ర.రా.వేం.వి.వి.
"శ్రీనరసింహుని భుజస
న్మానితకౌక్షేయకంబు మహిమండలిలో
నానారిపుభూనాథవి
తానార్థితకీర్తిదుగ్ధదుగ్ధధారలు గ్రోలున్." 155 ప. 2ఆ. కా. అ. సం.
శ్రీనాయకతావకభుజ
మానితఖడ్గంబు సకలమహిమండలితో
నానాసురసేనాసం
తానయశస్స్నిగ్ధదుగ్ధధారలు గ్రోలున్." 140 ప. ప్ర.రా.వేం.వి.వి.

"నిలిచిన తేట వెన్నెలల నీడలు చూచుచు గట్టి వెన్నెలన్
జిలుగు మెఱుంగు ముక్కుతుదఁ జించి మెసంగుచు దప్పి గప్పినన్
బలచని తియ్యవెన్నెలలఁ బానము సేయుచుఁ బ్రేమ డాయుచున్
మెలకువ మించ నయ్యెడ రమింపఁ దొడంగెఁ జకోరదంపతుల్." 105ప. 3ఆ. వా.చ.
"చక్కని చొక్కు వెన్నెలరసంపు బిరంజి ప్రియాంగనాళికిన్
గ్రక్కున నోరికిచ్చి తమిఁగొఁగిటఁ జేర్చుచు తెక్క లార్చుచున్
ముక్కున ముక్కుఁ గూర్చిరవముల్ నిగుడింపుచుఁ దోనపాయుచున్
మక్కువ డాయుచున్ గలసి మంపిలు నౌర చకోరదంపతుల్." 114ప. ప్ర.రా.వే.వి.వి.

ఇందలి పద్యములకు ప్రతిబింబప్రాయములైన పద్యములు అనంతరకృతులందు కలవు. అది గణపవరపువేంకటకవిప్రభావమునకు ప్రబలనిదర్శనము.

# కూచిమంచి తిమ్మన

ఇతని కృతులు 1. రాజశేఖరవిలాసము 2. రుక్మిణీపరిణయము 3. సింహాచలక్షేత్ర మాహాత్మ్యము 4. నీలాసుందరీపరిణయము 5. అచ్చతెనుగు రామాయణము 6. భర్గశతకము 7. సారంగధరచరిత్రము. ద్విపదకావ్యము 8. సప్తార్ణవసంగమాహాత్మ్యము 9. కృష్ణదండకము 10. సర్వలక్షణసారసంగ్రహము. లక్షణగ్రంథము 11. ఆంధ్రచంద్రాలోకము అలంకారశాస్త్రము. అముద్రితము 12. రసికజనమనోభిరామము 13. సర్వపుర క్షేత్రమాహాత్మ్యము 14. శివలీలావిలాసము 15. చిరవిభవశతకము 16. కుక్కుటేశ్వర శతకము.

అచ్చతెనుగు రామాయణమునందు రాజశేఖరవిలాసము, రుక్మిణీపరిణయము సింహాచలక్షేత్రమాహాత్మ్యము, నీలాసుందరీపరిణయము పేర్కొనఁబడినవి.

"మునుపు మా కీవె భల్లాణుఁడనెడి ఱేని
కతయు రుక్మిణి పెండిలి కతయు బొబ్బ
మెకపు గుబ్బలి కతయు మేల్మిఱ నీల
పెండ్లి కతయు గబ్బము ల్పేర్మిఁ గూర్చి."

అయిదు కృతుల క్రమము కాలక్రమము కూడ అగును.

రుక్మిణీపరిణయమునందు రచనాకాలము కలదు

"ఆరయ శాలివాహనశకాబ్దము లద్రిగుణాంగచంద్రులం
బేరగు మన్మథాబ్దమునఁ బ్రేమఁబ్రబంధ మొనర్చి . . ." 128 ప. 5ఆ.

అద్రి =7, గుణ = 3, అంగ = 6, చంద్ర = 1 = 1637 + 78 = 1715. కాఁబట్టి రుక్మిణీపరిణయము రచనాకాలము 1715 వ సంవత్సరము.

సింహాచలక్షేత్రమాహాత్మ్యమునందు రచనాకాలము కలదు.

"శాలివాహనశక . . . . . . . చంద్ర
వేదరసభూమి సంజ్ఞల విదితమగు" 165 ప. 5ఆ.

చంద్ర = 1, వేద = 4, రస = 6, భూమి = 1 = 1641 + 78 = 1719. కాఁబట్టి సింహాచల క్షేత్రమాహాత్మ్యము రచనాకాలము 1719 వ సంవత్సరము.

భర్గశతకమునందు రచనాకాలము కలదు.

"ధరలో నెన్నఁగ శాలివాహనశకాబ్దంబుల్ దగన్ యామినీ
కరబాణాంగశశాంకసంఖ్యఁ జెలువై కన్పట్టు సౌమ్యాప్వాయ
స్ఫురదబ్దంబున నిమ్మహాశతక మేఁ బూర్ణంబు గావించి -" 100ప.

యామినీకర = 1, బాణ = 5, అంగ = 6, శశాంక = 1 = 1651 + 78 = 1729. కాఁబట్టి భర్గశతకము రచనాకాలము 1729 వ సంవత్సరము.

సారంగధరచరిత్రమునందు రచనాకాలము కలదు. శాలివాహనశకసంవత్సరసంఖ్య కల పంక్తులు శిథిలములైనవి కాని, తెలుగు కాలమానము కలదు.

"అగు సౌమ్యనామసంవత్సరమునఁ (?)
దగ మాఘబహుళసప్తమియును దివిజ
గురువాసరమునకు గొదలె నీ భక్తి " పుట 45

సౌమ్యనామసంవత్సరము 1729. కాఁబట్టి సారంగధరచరిత్రము రచనాకాలము 1729 వ సంవత్సరము.

సర్వలక్షణసారసంగ్రహమునందు రచనాకాలము కలదు.

"శాలివాహనశకవర్షసంఖ్య కరర
సాంగశశిసంజ్ఞ నలరు రౌద్ర్యబ్దమునను
భాద్రపదశుక్లపంచమివఱకుఁ బూర్ణ మయ్యె"

కర = 2, రస = 6, అంగ = 6, శశి = 1 = 1662 + 78 = 1740 కాఁబట్టి సర్వలక్షణసారసంగ్రహము రచనాకాలము 1740 వ సంవత్సరము.

రసికజనమనోభిరామమునందు రచనాకాలము కలదు.

"రసికజనమనోభిరామం బనెడు పేరఁ
దెనుఁగున శాలివాహనశకాబ్ద
ములఁ గరగిరిరసభూసంఖ్యఁ దర్దయు
వఱలు ప్రమోదూతవత్సరమున
నీ ప్రబంధంబు రచియించి నీ కొసఁగితి."

కర = 2, గిరి = 7, రస = 6, భూ = 1 = 1672 + 78 = 1750. కాఁబట్టి రసికజనమనోభిరామము రచనాకాలము 1750 వ సంవత్సరము.

సర్వపుర్క్షేత్రమాహాత్మ్యమునందు రచనాకాలము కలదు.

" . . . . శాలివాహనశకాబ్దంబులు
పాటింప వేయు నార్నూట డెబ్బ
దాఱగు భావమహావత్సరంబున
భావనారాయణదేవదేవు
నానతి వలన నిట్లాంధ్రం బొనర్చి -" 118 ప. 3ఆ.

1676 + 78 = 1754. కాఁబట్టి సర్వపుర్క్షేత్రమాహాత్మ్యము రచనాకాలము 1754 వ సంవత్సరము.

శివలీలావిలాసమునందు రచనాకాలము కలదు.

"శాలివాహనశకవర్షసంఖ్య వసున
గాంగశశిసంజ్ఞ నలరు ధాతాబ్దమునను
దగ రచించిన యీ కృతి - " 193 ప. 2ఆ.

వసు = 8, నగ = 7, అంగ = 6, శశి = 1 = 1678 + 78 = 1756. కాఁబట్టి శివలీలావిలాసము రచనాకాలము 1756 వ సంవత్సరము.

పయి నిర్దిష్టరచనాకాలములను బట్టి- రాజశేఖరవిలాసము రచనాకాలము 1710 ప్రాంతము, నీలాసుందరీపరిణయము రచనాకాలము 1722 ప్రాంతము, అచ్చతెనుగు రామాయణము రచనాకాలము 1725 ప్రాంతము, సప్తార్ణసంగమాహాత్మ్యము రచనాకాలము 1732 ప్రాంతము, కృష్ణదండకము రచనాకాలము 1735 ప్రాంతము, ఆంధ్రచంద్రాలోకము రచనాకాలము 1745 ప్రాంతము, చిరవిభవశతకము రచనాకాలము 1758 ప్రాంతము, కుక్కుటేశ్వరశతకము రచనాకాలము 1760 ప్రాంతము కావచ్చును. చిరవిభవశతకము శివలీలావిలాసానంతరకృతిగ అంతస్సాక్ష్యము కలదు. ముందు

వివరింతును.

రుక్మిణీపరిణయమునందు పీఠికాపురము "రావుమాధవనృపపరిరక్షితంబు" అని కలదు.

> "- రాజమహేంద్రవరదుర్గరాజ్యభూరి
> భారసంభరణాక్రాంతభాసమాన
> రావుమాధవనృపపరిరక్షితంబు
> భోగనికరంబు పీఠికాపురవరంబు. "

రావు పెద మాధవరాయలు సంస్థానాధిపతి అయిన కాలము[66] 1679-1704. రావు చిన మాధవరాయలు సంస్థానాధిపతి అయిన కాలము[67] 1759-62. పెద మాధవ రాయల మరణకాలము 1704 వ సంవత్సరము. చిన మాధవరాయల జననకాలము 1715 ప్రాంతము కావచ్చును. రుక్మిణీపరిణయము రచనాకాలము 1715 వ సంవత్స రము. పరిరక్షితమన పరిపాలితము. గతచరిత్ర.

సారంగధరచరిత్రమునందు రావువేంకటకృష్ణరాయల ప్రసక్తి కలదు.

> "రావువేంకటకృష్ణరాయవిశ్వంభ
> రావరపరిగుప్తరాజమహేంద్ర
> వరదేశభాగభాస్వద్దివ్యపీఠ
> పురమహారాజ్యవిభూషాయమాణ
> పావకకంద్రాడపట్టణాదిపుని
> తిమ్మసత్కవినామధేయుని నన్ను"

రావు వేంకటకృష్ణరాయలు సంస్థానాధిపతి అయిన కాలము[68] 1728-59. సారం గధరచరిత్రరచనాకాలము 1729 వ సంవత్సరము. ఇది సుసంగతము.

రసికజనమనోభిరామమునందు రావు నీలాద్రిమాధవరాయల ప్రసక్తి కలదు.

> "రావు నీలాద్రిమాధవరాయనృపతి
> చేతఁ గవిసార్వభౌమవిఖ్యాతబిరుద
> మందిన ఘనుండఁ దమ్మయాహ్వాయుఁడ నేను
> విమలతరభక్తి మదిలోన విస్తరిల్ల. " 24 ప. 1ఆ.

రావు నీలాద్రిమాధవరాయలు అనగా రావు (చిన) మాధవరాయలు సంస్థానాధిపతి అయిన కాలము 1759-62. రసికజనమనోభిరామము రచనాకాలము 1750 వ సంవత్సరము. కావున రావు నీలాద్రిమాధవరాయలు సంస్థానాధిపతి కాకపూర్వము కవిసార్వభౌమబిరుదప్రదానము కావించియుండుట సంగతమగును.

రావు పెద మాధవరాయలు తెనుగు రాయల పౌత్రుడు. రామచంద్రరాయల పుత్రుడు. రావు చిన మాధవరాయలు తెలుగురాయల సోదరుడు నరసింహరాయల ప్రపౌత్రుడు. నీలాద్రిరాయల పౌత్రుడు. కాబట్టి నీలాద్రిమాధవరాయలు. రామచంద్ర రాయల పుత్రుడు పెద మాధవరాయలు. రామచంద్రరాయలు తరములోని నీలాద్రి రాయల పౌత్రుడు. చిన మాధవరాయలు. కూచిమంచి తిమ్మనకు కవిసార్వభౌమబిరుద ప్రదానము కావించిన నీలాద్రిమాధవరాయలు రావు చినమాధవరాయలే. పెద మాధవరాయల కాలము నుండి, చిన మాధవరాయల కాలము వఱకు స్థూలముగ 1680-

1765 తిమ్మకవి జీవితకాలము.

**రాజశేఖరవిలాసము:** శివాంకితము. రాజశేఖరుడు భల్లాణుడు. అతడు జంగములకు కోరినదెల్ల ఇచ్చెదనని వ్రతము పట్టి అట్లు చేయును. అది నారదుని వలన విని, భక్తుని పరీక్షించుటకు శివుడు జంగమవేషధారియై వచ్చి వేశ్యను కోరును. భల్లాణునికి వేశ్య లభింపకుండ చేయును. భల్లాణుడు వ్రతభంగము గాకుండ పెద్ద భార్య చల్లమాంబను వేశ్యగా నియోగించును. అతని చిన్న భార్య మల్లమాంబ కూడ అందుకు సిద్ధపడును. చల్లమాంబ వారించును. భల్లాణుడు పెద్ద భార్యను వేశ్యగ సమర్పించిన జంగమవేషధారి స్థాణువగును. చల్లమాంబయే ఆలింగనము సేయబోయిన శిశువగును. నెలబాలుడు శివుడై భల్లాణుని ప్రమథగణములో పెద్దగ పట్టము గట్టును. వ్రతము పట్టుటకు భల్లాణుడు భావించిన తీరు (86-94ప. 1ఆ.) భావ్యమే.

> "సిరి గల వాఁడె మానవుఁ డశేషజగద్విదితంబు గాఁగ సు
> స్థిరతరమైన కీర్తులను జెందుట మేలగు నట్టుగానిచో
> సిరియును లేమియుం దలపఁ జీఁకటి వెన్నెల వాసి గాక యె
> వ్వరికిని లేఁత ప్రాయమును వార్ధకమున్ గురి గాదె మేదినిన్. 86
>
> ధనము గల్గియుండ ధర్మంబు సేయక
> యున్న నదియుఁ బరుల కొదవు గాదె
> తేఁటులెల్లఁ గూడి తేనియఁ గూర్చిన
> నొరుల కబ్బి నట్టు లెఱుఁగు కొనిన. 87ప. 1ఆ.

జంగమస్వాములు భల్లాణరాజశేఖరుని కోరిన తీరు భావ్యముగా లేదు.

> " ఏరా! భూవర! మాకుఁ గాంచనతురంగేభాడంబరాందోళికా
> భూరిస్యందనమందిరోపవనసద్భూషామణిశ్రేణులున్
> జేరం గావునఁ బల్లెలున్ బశువులున్ లెక్కింప కర్థంబు మా
> కీరా! కోరిక దీఱ మీఱ కిఁక నీ వెంతేనియున్ దీరతన్. 171
>
> పాలు పెరుఁ గిక్షురసమునుఁ
> జాల ఫలరసములు దేనె శర్కరఘృతమున్
> మేలగు కజ్జంబులు నీ
> వేళకుఁ దెప్పించరోరి వేగమె మాకున్." 172ప. 1ఆ.

రాజశేఖరుని " ఏరా", "ఈరా", "ఓరి" అనుట జంగమస్వాముల అహంకారము.

శివుడు మోహనాకారలీల రాజశేఖరుని రాజధాని సింధుకటకము పురవీథిని చనునెడ, పురసతుల విలోకనము (119-170ప.2ఆ.) మనుచరిత్రప్రభావము. జంగమ వేషధారి ఎటువంటి వేశ్య కావలయునో వివరించుట (35-42ప. 3ఆ.) శ్రుతి మించిన శృంగారము. వేశ్యలు భల్లాణుని భటులకు వివరించిన వేశ్యాపద్ధతులు (62-75ప. 3ఆ.) యథార్థములైనను కథార్థములు కావు. "గడన పూఁబోడి యవ్వ పెన్కంచు మువ్వ" (75ప. 3ఆ.) అను పలుకు మాత్రమే తళుకు. చల్లమాంబ మల్లమాంబను వారించిన తీరు (129-132ప. 3ఆ.) మల్లమాంబ అల్పజ్ఞత కంటె, చల్లమాంబ అత్యభిజ్ఞతకు నిదర్శనము. అంతేకాదు. పల్లవుని ఉల్లము పల్లవింపజేయు పద్ధతిని (132ప.) పతివ్రతాశిరోమణి ప్రస్తరించుట విపరీతము. చల్లమాంబ వేశ్యాశృంగారనైపథ్యము (135-

143ప. 3ఆ.) వధూశృంగారనైపథ్యమునకు వంతపాట. వేశ్యను తెచ్చితినన్న భల్లాణునితో,

"కామాంధకారినై కడఁకతో నీ రాకఁ
గాంచుచుండఁగ మూఁడు కన్ను లయ్యెఁ
దలయేఱు బరువయ్యెఁ దగ మేను సగమయ్యె
గళమూలమునఁ జేదు నిలుకడయ్యె
వలనొప్ప మునుపటి వగ దప్పె వలపును
విరిగెను నడురేయి సరవి నయ్యె
నా కేటి కీ వేశ్య నీ కేటి నిజభక్తి
బూటకంబుల చేతఁ బ్రొద్దు గడపి
నాఁడ వింతియ కాక భూనాథు లెచట!
వ్రతము లెచ్చట! ఘనశైవమతము లెచట!
నెందుఁ గొఱగాని పాలఁతుక నిటులఁ దెచ్చి
యందుకొమ్మను వా రెందునైనఁ గలరె." 155ప. 3ఆ.

అని జంగమవేషధారి శివుడు అనుట ధ్వనిగర్భితము.

రాజశేఖరవిలాసమునందు పుర (40-58ప. 1ఆ; 90-103ప. 2ఆ.) నాయక (59-62ప. 1ఆ.) నాయిక (65-84ప. 1ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతప్రకృతి (126-144ప. 1ఆ.) జంగమ (167-168ప. 1ఆ.) నగ (32-44ప. 2ఆ.) ఋతు (45-49ప. 2ఆ.) సముద్ర (82-88ప. 2ఆ.) వర్ణనలు కలవు.

రుక్మిణీపరిణయము: పిఠాపురము కుక్కుటేశ్వరస్వామికి అంకితము. ఇందు రుక్మిణీకల్యాణమే ఇతివృత్తము. అది పోతన భాగవతమునందు నూటరెండు పద్యగద్యముల రసవద్ఘట్టము. ఇది ఆరువందల ఇరువది పద్యగద్యముల స్వతంత్రకావ్యము. అందు అనావశ్యకమైన అంశము లేదు. ఇందు అనావశ్యకములైన అంశములే అధికము. అది కథాప్రధానము. ఉదాత్తశృంగారరసాన్వితము. ఇది వర్ణనాత్మకము. సామాన్యశృంగారరసాస్పదము. అందు రుక్మిణి స్వతంత్ర. ఇందు పరతంత్ర.

పోతన భాగవతమునందు రుక్మిణి తనకు తగిన భర్త కృష్ణుడని తలచినది. అన్న రుక్మి శిశుపాలుని కిత్తునని తలచెను. "అన్న తలంపు దానెఱిఁగి", "కొడుకు విచారము లయ్యుయు వారింపఁజాలఁ"డని ఆప్తుడగు బ్రాహ్మణునికి సందేశము తెలిపి కృష్ణుని తోడ్కొని రమ్మని పంపినది. (1695-98) రుక్మిణీపరిణయమునందు "అత్తెఱఁ గంతయుఁ దన చెలికత్తె లెఱిఁగింప .... చిత్తము తత్తఱము నొంద" చింతించును. (21-41ప. 1ఆ.) ఒక సఖి ద్వారకకు నరిగి దానవారిని దెత్తునని" ధైర్యము చెప్పి, బ్రాహ్మణకుమారుని రప్పించిన, రుక్మిణి కొన్ని మాటలు తెలిపి పంపించును. (30-66ప. 1ఆ.) భాగవతమునందు బ్రాహ్మణుడు రుక్మిణి సందేశమును మాత్రమే కృష్ణునికి తెలుపును. (1702-1715) రుక్మిణీపరిణయమునందు బ్రాహ్మణకుమారుడు కొన్ని మాటలు తెలపుటయేగాక, రుక్మిణి సౌందర్యమును వర్ణించును. (86-107ప. 4ఆ.) భాగవతమునందు బ్రాహ్మణుని రాకకు రుక్మిణి ఉద్విగ్నమనస్క అగును. (1724-32) రుక్మిణీపరిణయమునందు రుక్మిణి విరహనాయిక అగును. (67-103, 117-130ప. 2ఆ. 3-129ప. 3ఆ.) భాగవతమునందు బ్రాహ్మణుడు రాఁగానే "మెచ్చె

భవద్గుణోన్నతి . . . వచ్చె సుదర్శనాయుధుఁడు . . . రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను" అని రుక్మిణికి చెప్పును. (1784) రుక్మిణీపరిణయమునందు బ్రాహ్మణ కుమారుడు రుక్మిణి అడిగిన మీదట, ద్వారకకు వెళ్ళుట, కృష్ణుని చూచుట, రుక్మిణి మాటలు చెప్పుట, కృష్ణుడు శత్రువుల మీద మీసములు దువ్వుట చెప్పి తర్వాత కృష్ణుడు వచ్చెనని చెప్పును. (10-14ప. 5ఆ.) భాగవతములోని బ్రాహ్మణుడు చెప్పిన తీరు సందర్భోచితము. రుక్మిణీపరిణయమునందు బ్రాహ్మణకుమారుడు చెప్పిన తీరు సందర్భానుచితము. అంతేకాదు. భాగవతమునందు రుక్మిణి బ్రాహ్మణుని పంపిన తర్వాత ఉద్విగ్నమనస్క అగును. రుక్మిణీపరిణయమునందు బ్రాహ్మణకుమారుడు. వచ్చిన తర్వాత రుక్మిణి తాను ఉద్విగ్నమనస్క అయినట్లు చెప్పును.

"రమణన్ విప్రుఁడు శౌరి పట్టణము చేరంగల్గెనో లేక మా
ర్గమునం జిక్కెనొ వెన్నుఁడీ పనికి నేరంబెన్ని రాఁడయ్యెనో
విమతశ్రేణి తలంపు విస్తరిలునో వేంచేయునో యంచుఁ జి
త్తమునం గుందుచునుంటి నింతతడవున్ ధాత్రీసురేంద్రోత్తమా" 7ప.5ఆ.

ఇది "ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో" అను పోతన పద్యమునకు (1725ప. ద.స్కం.పూ.భా.) అనుకరణము. అస్థానపతితము.

రుక్మిణీపరిణయమునందు బ్రాహ్మణకుమారుడు రైవతకాద్రిని శంభులింగమును చూచి స్తుతించుట (29-40ప. 4ఆ.) కవి ఆత్మీయతకు కరతలామలకమే కాని, కథ ప్రయోజనమునకు కరబదరకము కాదు. అంతేకాదు. భీష్మకుడు బలరామకృష్ణులను తోడి తెచ్చునెడ పౌరాంగనల విలోకమునందు (25-36ప. 5ఆ.) పౌరాణికప్రతిపత్తి లేదు.

"కంచెల విప్పి యొత్తు తన గబ్బి చనుంగవపైని వాసనల్
మించు మృగీమదంబునఁ దమిన్ మకరీమయచిత్రపత్రముల్
కొంచక వ్రాయుచుండి యదుకుంజరుఁ గన్గొనఁ జేరి పట్టుదా
భ్యంచితపుష్పమంజరులు బాగుగఁ గానుక దెచ్చెనో యనన్." 29ప. 5ఆ.

రుక్మిణీపరిణయమునందు పుర (36-55ప. 1ఆ.) రాజ (56-59ప. 1ఆ.) రాజ్ఞీ (60-62ప. 1ఆ.) గర్భధారణ (64-70ప. 1ఆ.) నాయికాజనన, బాల్య యౌవన (71-104ప. 1ఆ.) వివాహప్రయత్న (3-22ప. 2ఆ.) పురాలంకరణ (23-29ప. 2ఆ.) వసంతర్తు (104-116ప. 2ఆ.) నాయికావిరహ (117-130ప. 2ఆ; 3-25ప. 3ఆ.) వనకేళి (26-42ప. 3ఆ.) జలకేళి (44-58ప. 3ఆ.) మన్మథపూజ (59-74ప. 3ఆ.) సూర్యాస్తమ యాదిచంద్రోదయపర్యంత (75-96ప. 3ఆ.) మన్మథాద్యుపాలంభ (97-125ప. 3ఆ.) సూర్యోదయ (130-135ప. 3ఆ.) స్వయంవరసన్నాహ (136-145ప. 3ఆ.) వన (4-7ప. 4ఆ.) సముద్ర (8-12ప. 4ఆ.) నగ (19-28ప. 4ఆ.) పౌరాంగన (25-37ప. 5ఆ.) వధూశృంగారనైపథ్య (38-44ప. 5ఆ.) నాయికా (59-64ప. 5ఆ.) నాయక (65-70ప. 5ఆ.) యుద్ధ (74-101ప. 5ఆ.) శోభన (102-122ప. 5ఆ.) వర్ణనలు కలవు. కృష్ణ (131-139ప. 2ఆ.) శివ (32-40ప. 4ఆ.) శివా (49-53ప. 5ఆ.) స్తుతులు కలవు. వివాహప్రసక్తియేగాని, వివాహవర్ణనము లేకపోవుట విశేషము.

**సింహాచలక్షేత్రమాహాత్మ్యము** : శివాంకితము. స్కాందపురాణములోని సింహాచలక్షేత్రమాహాత్మ్యమునకు అనుసరణము. ఇందు హిరణ్యకశిపుని వృత్తాంతము,

ఊర్వశీపురూరవవృత్తాంతము క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునవి. హిరణ్యకశిపుని వృత్తాంతము బహుపురాణప్రసిద్ధమైన ప్రహ్లాదచరిత్రము. ఊర్వశీపురూరవవృత్తాంతము అన్యపురాణప్రసిద్ధము కాదు.

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని సముద్రమునందు పడద్రోయించిన, సముద్రుడు ప్రహ్లాదుని పూజించును. (205ప. 3ఆ.) ప్రహ్లాదుడు విష్ణువును ప్రార్థించును. (11-24ప. 4ఆ.) విష్ణువు ప్రత్యక్షమై ప్రహ్లాదుని రక్షించుటయేగాక, సింహాచలమునందు శాంతరూపమున శాశ్వతముగ వసియింతునని చెప్పును. (48ప. 4ఆ.) తర్వాత స్తంభము నుండి ఉగ్రరూపమున ఉద్భవించి హిరణ్యకశిపుని సంహరించును. (101-124ప. 4ఆ.) ప్రహ్లాదుడు కొంతకాలము రాజ్యముచేసి, విరోచనుడను కుమారునికి అప్పగించి, సింహాచలమునకు వచ్చి నృసింహస్వామిని కొలిచి, అనుగ్రహము వడసి, నిజలోకమున కేగి నృసింహారాధనము సేయును. (4-49ప. 5ఆ.) ఇది ప్రహ్లాదచరిత్రమునకు సింహాచలక్షేత్రమునకు గల సంబంధము.

కలియుగము రాఁగానే సింహాచలక్షేత్రములోని ఆలయవిమానమంటపాదులు శిథిలము లగును. నృసింహస్వామి వల్మీకమునందు కప్పబడును. (33వచ. 5ఆ.) మఱల కృతయుగము రాగానే పురూరవుడు రాజగును. కైలాసమునందు ఊర్వశీపురూరవుల పరిచయము, ప్రణయము, పరిణయము జరుగును. కొంతకాలమునకు సింహాచలము నకు వత్తురు. ఊర్వశి పురూరవునికి సింహాచలము పూర్వవృత్తాంతము చెప్పును. పురూరవునికి స్వప్నమునందు నృసింహస్వామి కనిపించి వల్మీకమునందున్నట్లు, వల్మీకమును క్షీరధారలచేత కరిగించి పూజింపుమని చెప్పును (126-131ప. 5ఆ.) పురూరవుడు అట్లు చేయును. ఆలయవిమానమంటపాదులు యథాపూర్వముగ, యథాస్థానమున పునర్నిర్మితములగును. ఇది ఊర్వశీపురూరవవృత్తాంతమునకు సింహాచలక్షేత్రమునకు గల సంబంధము.

సింహాచలక్షేత్రమాహాత్మ్యమునందు పుర (92-107, 135-147ప. 2ఆ.) ఋతు (4-44ప. 2ఆ.) యుద్ధ (113-126ప. 2ఆ.) గర్భధారణ (6-10ప. 3ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (4-9, 58-62ప. 4ఆ.) స్త్రీ (97-105ప. 5ఆ.) మొదలైన వర్ణనలు కలవు.

**నీలాసుందరీపరిణయము** : శివాంకితము ఇది అచ్చతెనుగుకావ్యము. ఇంచుమించు నిర్వచనకావ్యము కూడ. మూడు వందల ఏబదియాఱు పద్యగద్యములందు మూడు వందల ఏబదియొకటి పద్యములే. అయిదు మాత్రమే వచనములు. ప్రథమాశ్వాసమునందు వచనము లేదు. ద్వితీయాశ్వాసమునందు ఒక్క చిన్న వచనము కలదు. (117) తృతీయాశ్వాసమునందు ఒక పెద్ద వచనము (10) మూడు చిన్న వచనములు (2,50,74) కలవు.

ఇతివృత్తము నీలాకృష్ణుల వివాహము. మూలము హరివంశము. విష్ణుపురాణము లోని నాగ్నజిత్తీకృష్ణుల వివాహేతివృత్తమునకు సదృశము. మిథిలాపురాధిపతి ధర్ముడు. పురప్రముఖుడు కుంభకుడు. యాదవనాయకుడు. అతని భార్య ధర్మద. తనయ నీల కృష్ణుని మేనమామ కూతురు. నీలాకృష్ణుల వివాహమునకు ఒక బ్రాహ్మణదూత రంగము

సిద్ధము సేయును. కాని కాలనేమి అను రాక్షసుని కొడుకు లేడుగురు ఆబోతులై పుట్టి ప్రజలను ఏడిపింతురు. ప్రజలు ధర్మునికి మొఱపెట్టు కొందురు. ధర్ముడు కుంభకుని ఆబోతులను బంధించుమని ఆదేశించును. కుంభకుడు ఆబోతులను బంధించిన వానికి నీల నిచ్చి వివాహము సేయుదునని ప్రకటించును. నీల విచారించును. విరహము చెందును. ఘోషవంతుడు ప్రయత్నించి విఫలుడగును. కృష్ణుడు ఆబోతులైన రాక్షసులను సంహరించును. నీలాకృష్ణుల వివాహము జరుగును.

అచ్చతెనుగునందు కృతకత్వము తప్పనిసరి. రుద్రాక్షమాలలకు చిచ్చఱకంటిదొర కంటిపేరింటి పేరులు (60) భూసురునికి పుడమి దయ్యము (62) నేలవేలుపు (97,100) రాక్షసికి నల్లఁ ద్రావు పడఁతి (72) సంభోగమునకు పూవడిదపు జోదు నిబ్బరపుటాలము (108) కృష్ణునికి సోఁకు మూఁకల గొంగ (103) పాలమున్నీటి గారాపుఁబట్టి మగఁడు (113ప. 1అ.) రాకాసుల సూడు (14) పుత్తడి దువ్వలువ తాలుపు (73) మన్మథునికి చిగురాకుఁగటారి కడిందిజోదు (110ప. 2అ.) తలిరు జిరావజీరు (14) వసంతునికి అలరు జిరాబోదు తోడు (23) శీతలోపచారములకు చలిపనులు (33ప. 3అ.) మొదలైనవి కృతకరూపములు. ముహూర్తమునకు మూరతము (78-89) అరుంధతికి ఆరంజోతి (85ప. 3అ.) మొదలైనవి గ్రామ్యరూపములు.

కృష్ణుడు భర్త కావలయునని నీల మ్రొక్కుకొనిన తీరు నిసర్గరమణీయము.

" పాలమున్నీటి గారాపుఁ బట్టి మగఁడు
వేడుకలు మీఱ ననుఁ బెండ్లియాడెనేని
గొప్ప చింబోతు కదుపులఁ గూర్చి నీకుఁ
గావు వెట్టింతుఁ జుమ్మి యో గంగనమ్మ. 113.
పూని యొదలఁ దలఁబ్రాలు వోసి తాళి
బొట్టు మరు తండ్రి తనమెడఁ గట్టనేని
వెండి పువ్వుల నపరంజి విరులచేతఁ
జెలఁగ నించెదఁ గోరి యో చిలువతాల్ప. 114
తన తలపై వడి బల్లిదుఁ
డనువొప్పఁగఁ గ్రొత్తముత్తియపుఁ దలఁబ్రాల్వో
సినఁ దఱుఁగని యుండ్రంబులు
వెనకయ్యా నీ కొసఁగుదుఁ బ్రిదులని బత్తిన్. 115ప. 1అ.

వసంతాదుల దూషణమునందు తెనుగుదనము మఱింత తేటతెల్లము.

"జతలేని పూవు గల్గుట
కతివలపైఁ బెల్లు రేఁగి యలజడి మీఱ
న్వెత పెట్టుదువే యిఁక నీ
బ్రతుకు బయల్గాను నాలిపయ్యెరకుఱ్ఱా! 24
మున్ను కొన్నాళ్లు పలుగాకి మూఁకలోన
గలసి మెలఁగిన తెఱఁగెల్లఁ గానిపింపఁ
జేడియల మీఁద గ్రుడ్డెఱ్ఱసేయరాకు
కోయిలా! యింకనీయిల్లుకూలిపోను. 25

నెమ్మదిఁబలుమఱు మొరయుచుఁ
గమ్మని పూఁదేనెలాని కడుఁగ్రొవ్వి యహో
గొమ్ములఁ గలపగఁ జూచెదు
తుమ్మెద నీత్రుళ్ళు పెద్ద తుప్పలఁబట్టన్. 28ప. 3ఆ.

నీలాసుందరీపరిణయమునందు పుర (26-40ప. 1ఆ.) రాజ (41-46ప. 1ఆ.) నాయిక (54-59ప. 1ఆ.) కృష్ణలీల (64-83ప. 1ఆ.) నాయిక వలపు (101-116ప. 1ఆ.) విరహము (83-117ప. 2ఆ; 11-42ప. 3ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయ పర్యంతప్రకృతి (3-10వచ. 3ఆ; 44-45ప. 3ఆ.) వివాహ (78-110ప. 3ఆ.) వర్ణనలు కలవు.

**అచ్చతెనుగు రామాయణము** : శివాంకితము. ఇది కూడ అచ్చతెనుగు కావ్యము. నీలాసుందరీపరిణయము కంటె ఇంచుమించు నిర్వచనకావ్యము. బాలాయోధ్యారణ్యకిష్కింధాసుందరకాండములు అయిదును నిర్వచనకాండములు. యుద్ధ కాండమునందు మాత్రమే ఒక పెద్ద వచనము (364) "అప్పుడు" (542) "అట్టి యెడ" (580) అను మాటలు కలవు.

బాలకాండమునందు దశరథుడు, రోమపాదుడు, ఋష్యశృంగుడు, కౌశికుడు, తాటక, గౌతముడు, అహల్య, పరశురాముడు అను సంస్కృతనామములు కలవు. సీతకు మాత్రము నాఁగటి చాలు పేరి యెలనాగ, పుడమి కాన్పు అను అచ్చతెనుగు పేరులే కలవు. దశరథునికి చాల్పు తేర్ల దొర, రోమపాదునికి వెంద్రుక యడుగుల దొర, ఋశ్యశృంగునికి మనుఁబోఁతు కొమ్ము తపసి, విశ్వామిత్రునికి తపసి పులి, పరశురామునికి గండ్రగొడ్డలి తాల్పు అను అచ్చ తెనుగు పేరులు కూడ కలవు. కౌసల్య, కైక, సుమిత్ర, వసిష్ఠుడు, సుబాహుడు, మారీచుడు పేరులే లేవు. రాముడు పెద్ద కొడుకు లక్ష్మణుడు కడపటిల్లాలి పెద్దకొడుకు. రాముడు పుడమి తల్లి యల్లుఁడు కూడ.

అహల్య శిల అగుట కలదు. అంతేకాదు అహల్య వృత్తాంతము అహల్యయే చెప్పుట. (120-123) అహల్య రాముని దశావతారపురుషునిగ స్తుతించుట (125-133) విశేషము.

"మును గౌతముఁడు నాఁగ నొనరు పంటవలంతి
జేజే నిరాబారి సింగమునకు
గారాపుటిల్లాలఁ బే రహల్య యటందు
రొకనాఁడు వేలుపుటొడయఁ డెమ్మె
నను(గోరి పుంజురూపునఁ జేరి నడురేయి
తతి నింటిదరిఁ బొంచి యఱచుటయును
దెల్లవాఱె నటంచుఁ దివిరి య జ్జన్నిగ
ట్టేటిపొంతకుఁ గ్రుంకు లిడగఁ జన్న
నపుడె జన్నంపుఁదిండిరాయండు సెలఁగి
పెక్కు దెఱఁగుల రాచిల్కజక్కిజోదు
పనులకై వేఁడుకొన నియ్యకొని యతండు
నేను నెనలేని నెమ్మది నెనయు నెడల. " 120ప. బా.కాం.

శివధనుర్భంగమునకు సాదృశ్యకల్పనము సహజసుందరము.

" ఏపుతోడ నాము టేనుఁగు గున్నలేఁ
జెఱకు కోల విఱుచు తెఱఁగు దోఁపఁ
దోలుదాల్పువిల్లు దునిమిన యజ్ఞాణఁ
జూచి యబ్బ పేరి రాచగిబ్బ." 151 ప. బా.కాం.

తోలుదాల్పు విల్లు = శివధనుస్సు. అబ్బ పేరి రాచగిబ్బ = జనకరాజవృషభము. అయోధ్యాకాండమునందు వాల్మీకి కరువలిమేపరి మనికిపట్టు కాన్పు. రాముడు నీరుతిట్ట బత్తళికవజీరు, బల్విలు దునిమిన వెరవరి. రాగవుడు. పాలమేపరి సూడు.

దశరథుడు వరము లడిగిన కైకను మందలించి మాఱుమాటాడ కుండిపోవును. (22-36) కైకయే మంత్రులకు రాముని అడవులకు పంపుడని ఆజ్ఞాపించును (49). వారు తగదన్న పొమ్మనును (57) అది తెలిసి రాముడు వెలినారచీరలు, జడలు,దాల్చి అచటికి వచ్చి అడవుల కేగుచున్నట్టు తెలుపును. (60,61) సీతారామలక్ష్మణులు వెళ్ళుట విని దశరథుడు దు:ఖించు ఘట్టము (88-98) అనుకరణము.

"కా యను మేటి తప్పు కొడుకా యను నిద్దపుఁబూఁత మావిమో
కా యనుఁ బంజరంపుఁజిలుకా యను నబ్రపుసోయగంపుఁబో
కా యనుఁ బల్కవేమి యలుకా యనుఁ బంతము దీఱె నోటు కై
కా యను నేర యిట్లు దుడుకా యనుఁ బాయఁగఁ గోరికా యనున్. 90

మక్కువల యిమ్మ వలతేని మానికమ్మ
పసిఁడి కీల్బొమ్మ జగముల పట్టుఁగొమ్మ
పొగడ పూరెమ్మ వలపుఁగప్పురపు దిమ్మ
కానవేలమ్మ యో నేల కాన్పుఁగొమ్మ. " 98ప. అ. కాం.

ఆరణ్యకాండమునందు అత్రి, విరాధుడు, శరభంగుడు, రావణుడు, మారీచుడు, లక్ష్మణుడు, జటాయువు, సుగ్రీవుడు అను సంస్కృతనామములు కలవు. సీతకు పుడమి కాన్పు, పుడమి పుట్టువు అని, శూర్పణఖకు చుప్పనక, చేటగోళ్ళ బోటి అని, శబరికి చెంచుతెఱవ అని, సూర్యునికి చాయమగఁడు అని అచ్చ తెనుగు పేరులే కలవు. రావణునికి సోఁకు మూఁకల తేఁడు జటాయువునకు జడబ్రతుకు గూఁడుపుట్టువు, సుగ్రీవునికి చెట్టు ద్రిమ్మరి యెకిమీడు అను అచ్చ తెనుగు పేరులును కలవు. లంక మున్నీటినడుదీవి. పరమపదము ఎన్నఁడు చెడకయుండు ప్రోలు.

దశరథుని విలాపమునందు వలె రామునివిలాపమునందును (85-102) అను కరణము కలదు.

"పా యను నేరమేమి బలుపాయపు నాడెపు ప్రోడరాచపా
పా యను గుందనంపు మెఱుపా యనుఁ బూవిలుకాని వాలుఁదూ
పా యనుఁ బల్కవేమి విసుపా యనుఁ బంటవలంతి ముద్దుఁగా
న్పా యను నిట్టు లింత మఱపా యను నీకిది నేరుపా యనున్. 97

శబరి ఎంగిలిపండ్లు ఇచ్చినట్లు లేదు. దుంపలు పండ్లు ఇచ్చి పూజ చేసినట్లు కలదు.

తెలిపినఁ జనుచో ముందఱ
వలనుగ నొక చెంచు తెఱవ వారలఁ దన యి
మ్ములకుం దోడ్కొని చని దుం

పలుఁ బండులు చాల నొసఁగి బలితపు టెలమిన్. 120
ఒరిమికయు బత్తియు న్మది
గర మలరఁగఁ బూజఁజేసెఁ గన్నియ యపుడా
గరువంపు టెఱచి దిండుల
నిరుసతపదినూర్ల దొరల నేసిన దొరలన్." 121ప. ఆ.కాం.

కిష్కింధాకాండమునందు హనుమంతుడు, రాముడు, లక్ష్మణుడు, వాలి, అంగదాదులు, సంపాతి, సరస అను సంస్కృతనామములు కలవు. వాలికి కొండసూడు పట్టి, వేయిగన్నులు గల బలువేల్పు కొడుకు అని, సుగ్రీవునికి సొగసుకుత్తుక కోతులతేడు, పచ్చతత్తడుల వజీరుని కొడుకు, వెచ్చని జేజేదొర యనుంగునిసుగు, మినుకుల యిక్కకుఱ్ఱడు, వేడివేలుపు బిడ్డ అని, హనుమంతునికి విన్గూరిమి మన్మడు, కరువలి కొమరుడు, జింకవార్వపు వజీరు గార్వపుఁబట్టి అను అచ్చ తెనుగు పేరులు కలవు. తారకు రిక్క అని అచ్చ తెనుగు పేరే కలదు.

వాలివధ ఘట్టమునందు ధర్మవిచారము, తారావిలాపము లేదు. రాముడు ఏసిన బాణమునకు వాలి "పుడమిపైఁ ద్రెళ్లి నీల్గె గొబ్బున" (46)
అపుడు కోతి తేని కమ్మానుసుల తేఁడు
రిక్క పేరి చెలిని దక్క నొసఁగి
కొమ్మ మెకపు ప్రోలి కిమ్ముగా నేలికఁ
జేసి యనుప బత్తిచే నతఁడు. " 47ప. కి.కాం.

సుందరకాండమునందు మందోదరి, శార్దూలముఖుడు, దీర్ఘజిహ్వుడు, శూల దంష్ట్రుడు, పింగళనేత్రుడు, అశ్మవక్షుడు, రక్తరోముడు, రుధిరాక్షుడు, వ్యాఘ్రకబళుడు, అక్షుడు, జంబుమాలి, శతజిహ్వుడు, వక్రనాసుడు, విభీషణుడు అను సంస్కృత నామములు కలవు. శార్దూలముఖునికి బెబ్బులి మోమురేద్రిమ్మరి అని, దీర్ఘజిహ్వునికి నిలునాల్క పలుదిండి అని, పింగళనేత్రునికి పచ్చకన్నుల వేల్పుసూడు అని, అశ్మవక్షునికి ఱాబోరరక్కసుడు అని, వక్రనాసునికి వంకముక్కు తొల్వేల్పు అని అచ్చ తెనుగు పేరులు కూడ కలవు. సీతకు మన్నుచూలి అని కూడ అచ్చతెనుగు పేరు కలదు. అశోకవృక్షము సంస్కృతనామము లేదు. హనుమంతుడు సీతను "మ్రాని క్రింద" చూచినట్లు, తాను ఇరుగుడు మ్రాఁకు చివురుజొంపములందున్నట్లు కలదు. సముద్రము నీరుకుప్ప.

హనుమంతుడు నిద్రించు రావణుని చూచి తలంచిన విధము తదుచితము.
"అద్దిఱ వీని ఠీవియు నొయారము దిట్టతనంబు చేవయుం
దద్దయు నబ్బురం బెదకుఁ దార్కొనఁజేయఁదొడంగె నిట్టి బల్
గ్రద్దఱికాఁడు వాఁడిని జగంబులు గెల్చుట యేమి వింత మే
ల్బుద్ధి యొకింత లేక చెడిపోవఁ దలంపిడెఁగాక యిత్తఱిన్. 12
ఈ టీవికి నీ నేర్మికి
మేటితనంబునకుఁ జాల మేలి గొనంబే
నాటుకొనియున్న నీతఁడు
సేటెన్నఁడు లేని సిరులఁ జెన్నారుగదా. 13
తెఱఁ గెఱుఁగక రామునితో

గుఱుతుగఁ బగ గూడఁ బెట్టుకొని కొలమెల్లం
జెఱుచుకొనెఁగాక యాతం
డుఱఁడుగదా పూని వేల్పుటొడయనికైనన్. " 14 సుం. కాం.

యుద్ధకాండమునందు కుంభకుర్ణుడు, ప్రహస్తుడు, ఇంద్రజితుడు, అకంపనుడు, మహాకాయుడు, నలుడు అను సంస్కృతనామములు కలవు. రావణునికి ఇరుచావంచ యాదలల రక్కసితేడు, ఎఱచి మేపరి దొర, నల్లద్రావుడు తేడు, చాల్పు మోముల చెడుగు తొల్వేల్పు, విభీషణునికి నెత్తురు ద్రావుడు వంగడంపు కడలి తామరదాయ, సేతువునకు నడవ అను అచ్చ తెనుగు పేరులు కలవు.

లక్ష్మణుని మూర్ఛకు రాముడు విలపించు ఘట్టమునందును (392-400) అనుకరణము కలదు.

"డాయ వదేల రావు బెగడా యను నెక్కటి చివ్వగెల్పుకాఁ
డా యను ముద్దురాకొమరుఁడా యను మేలిగొనంబు లూను ప్రో
డా యను సోయగంపు మరుఁడా యను నెన్నికఁగన్న నేలతేఁ
డా యను మేటి జెట్టిమగఁడా యను బల్కుర తమ్ముఁడా యనున్." 400.ప. యు.కాం.

మందోదరి రామావతారము రావణసంహారార్థమని రావణునికి హితబోధ సేయును.

" వినుము తెలియ మొదట వెన్నుఁ డిజ్జగమెల్లఁ
బ్రోచుకొఱకు పెక్కు రూపు లూని
తిరుగుచుండు నట్టి దేవర యా రాచ
మానికంబు గాఁడె మదిఁ దలంప" 464
"విను మిపుడు నిన్నుఁ దునుమగఁ
బనివడి యీరైదుతేర్ల బల్లిదునకు లా
వెనయంగ రాముఁడై యే
పునఁ బొడమిన వాఁ డితండు పాలదిండిదొరా." 466ప. యు.కాం.

అచ్చతెనుఁగు రామాయణమునందు పుర (4-17బా.కాం.) రాజ (18-22.బా.కాం.) వన (91-96 బా.కాం.) నాయిక (105-114 బా. కాం; 18-27 అర. కాం.) సూర్యాస్తమయ (16-20అ.కాం.) సూర్యోదయ (37-43 అ. కాం.) విరహ (85-93 అర. కాం.) వర్షర్తు (57-67 అర. కాం.) శరదృతు (68-69 అర. కాం.) యుద్ధవర్ణనలు కలవు.

ఇది వాల్మీకి రామాయణమునకు ఆంధ్రీకరణము కాదు. వాల్మీకిరామాయణము నందు నారదుడు వాల్మీకికి చెప్పిన రామకథకు ప్రపంచీకరణము. యుద్ధకాండమునందు క్రింది పద్యము కలదు.

"తెనుఁగు చదువునఁ బున్నియం బెనయ దనుచుఁ
గొంద ఱాడుదు రాడినఁ గొఱఁత యేమి
మును మరా యంచు నుడివిన చెనఁటి బోయ
నెఱనిరాబారి యగుటయె గుఱుతు గాదె. " 594ప. యు. కాం.

ఇది సమకాలికమైన తెనుగు చదువు సమాచారము.

భర్గశతకము :- శివాంకితము. కాలనిర్దేశకపద్యము కాక సరిగా వందపద్యములు

కలవు. "భర్గా! పార్వతీవల్లభా!" అని మకుటము. సగము పైగా భక్తినివేదనములు. తీర్థస్నాన, విగ్రహారాధన, రాజ, కుకవిప్రభృతుల గర్హణములు, నీతిపద్యములు కలవు.

తీర్థస్నాననిరసనము :

"కావేరీసరయూమహేంద్రతనయాగంగాకళిందాత్మజా
రేవావేత్రవతీసరస్వతుల కర్థిం బోవఁగా నేల? నీ
సేవాసంస్మరణార్చనాదు లెపుడున్ సిద్ధించు మర్త్యాళికిన్
గ్రైవీభూతభుజంగమప్రవర! భర్గా! పార్వతీవల్లభా! " 45

విగ్రహారాధనవిమర్శనము :

"ధర మృద్దారుశిలామయప్రతిమలన్ దైవంబులంచున్ బర
స్పరవాదంబులఁ బోరుచున్ నిబిడసంసారాంధులై మేలు చే
కుఱకే మగ్గములోని కండెల గతిన్ ఘోరార్తులై ప్రాకృతుల్
కరముం జచ్చుచుఁ బుట్టుచుంద్రుగద! భర్గా! పార్వతీవల్లభా! " 52

రాజదూషణము :

ఆజిన్ వైరివరూథినీమథనదీక్షారూఢిఁ గ్రాలన్ వలెన్
భోజుం బోలి సమస్తయాచకతతిం బోషించుచుండన్ వలెన్
తేజం బెప్పుడు నుర్విలోఁ బ్రజకుఁ జెందింపన్ వలెన్ గానిచో
రాజావాఁడు? తరాజు గాక! భువి భర్గా! పార్వతీవల్లభా !" 74

కుకవినింద :

"భువిలో మేదరసెట్టి చిప్పతడకల్ పొంకంబుగా నల్లి పె
న్రవళిన్ సంతలనెల్లఁ ద్రిప్పు క్రియ దైన్యం బెచ్చఁగా దుష్కవుల్
తివుటొప్పం జెడు కబ్బపుం దడక లోలిం ద్రిప్పఁగా నద్దిరా!
కవితల్ కాసుకు గంపెడయ్యెఁగద భర్గా! పార్వతీవల్లభా! " 85

నీతిపద్యము :

"రాలన్ దైలము తీయవచ్చు భుజగవ్రాతమ్ముల న్పేర్లఁగా
లీలన్ బూనఁగ వచ్చు నంబునిధి హాళిం దాటఁగా వచ్చు డా
కేలన్ బెబ్బులిఁ బట్టవచ్చు విపినాగ్ని న్నిల్పఁగావచ్చు మూ
ర్ఖాళిం దెల్పఁ దరంబె యేరికిని భర్గా! పార్వతీవల్లభా! " 96

ఇది భర్తృహరి సుభాషితమునకు స్వేచ్ఛానుసరణము.

**సారంగధరచరిత్రము** : శివాంకితము. గౌరన నవనాథచరిత్రములోని సారంగధర చరిత్ర ఆధారముగ, చేమకూర వేంకటకవి రచించిన సారంగధరచరిత్రకావ్యము గుఱించి పూర్వోక్తము. బాణాల శంభుదాసుని, పరశురాముని, కూచిమంచి తిమ్మన సారంగ ధరచరిత్రములు ద్విపదకావ్యములు. శంభుదాస, పరశురాముల ద్విపదకావ్యము లందు చిత్రాంగి భోగవతి కాదు. కులసతి. కూచిమంచి తిమ్మన ద్విపదకావ్యమునందు గౌరన, చేమకూర వేంకటకవి గ్రంథములందు వలె భోగవతియే. అంతేకాదు. మాళవదేశములోని కథారంగము ఆంధ్రదేశమునకు మాఱినది.

" . . . .  . . . . .  . . . .  కోటి
లింగతీర్థస్నానలీలలఁ బొంపె
సంగి మార్కండేయశంభుపదాబ్జ

పూజావిధప్రాప్తి పొసఁగ నెసఁగు
రాజమహేంద్రవరం బను వీడు
వరపాండవాన్వయవర్ధనుఁ డమల
తీరమూర్తి విష్ణువర్ధనసమాహ్వయుఁడు
రాజరాజనిలింపరాజవైభవుఁడు
రాజరాజనరేంద్ర రాజన్యవరుఁడు. " పుట 3.

ఇది అప్పకవి అభూతకల్పన దుష్ప్రభావము. కడమ కథ సారంగధరచరిత్రములం దన్నిట సమానము.

పద్యకావ్యముల కంచు దివిటీల ముందు ద్విపదకావ్యములు చిఱుదివ్వెలు మాత్రమే గాక, చేమకూర వేంకటకవి సారంగధరచరిత్ర స్థిరవిద్యుత్కాంతుల ముందు తదితర సారంగధరచరిత్రములు క్రొవ్వత్తి వెలుగులే. ఎడనెడ చమత్కారములు, నుడికారములు, వర్ణనలు మాత్రమే కొలది క్రొమ్మెఱుంగులు.

" అనిమిషల్ మినుపెచ్చునం దిడ్డ నిప్పు
తునె లన రిక్కలు దోచె నభ్రమున" పుట 29

అను తిమ్మయనక్షత్రవర్ణన అనిదం పూర్వము.

**రసికజనమనోభిరామము** : ఇది బ్రహ్మపురాణములోని గోదావరీఖండమునందలి వృద్ధస్రవంతీసరిత్పతీసంగమమాహాత్మ్యమును తెనుగున రచియించినది. (207ప. 6ఆ.) అది గోదావరీనదీమాహాత్మ్యప్రతిపాదకపురాణము. ఇది రసికజనమనోభిరామసాధక కావ్యము. మాహాత్మ్యప్రతిపాదకవృత్తాంతము షష్ఠాశ్వాసములోని 118 వ పద్యము నుండి ప్రారంభమై, 206 వ పద్యముతో కావ్యము పరిసమాప్తమగును. ప్రథమాశ్వాసములోని కథాప్రారంభమునుండి, షష్ఠాశ్వాసములోని 117 వ పద్యము వఱకు రసికజనమనోభిరామమే. అది పురాణమునందు ప్రసక్తిమాత్రము కావ్యమునందు స్వతంత్రకల్పనము. కల్యాణనగరాధిపతి ఋతుధ్వజాని మృగయావినోదము ప్రథమాశ్వాసము. గంధర్వకన్య సుశ్యామ సఖీసమేతసాక్షాత్కారము ద్వితీయాశ్వాసము. ఋతుధ్వజాని సుశ్యామా సందర్శనము, సంప్రార్థనము, తృతీయా శ్వాసము. సుశ్యామవిరహము చతుర్థాశ్వాసము చిలుక రాయబారము, సుశ్యామాఋతుధ్వజుల పునస్సమావేశము, శృంగారవిహారము పంచమా శ్వాసము. ఋతుధ్వజాని రాక్షససంహారము, సుశ్యామ సయ్యాట, ఋతుధ్వజాని విరహము, శృంగారవిహారము, పుత్త్రికాజననము, సుశ్యామ నిష్క్రమణము షష్ఠాశ్వాస పూర్వార్ధము.

కథ బీజప్రాయము. వర్ణనము వటవృక్షసదృశము. నంది తిమ్మన పారిజాతాపహరణములోని, అల్లసాని పెద్దన మనుచరిత్రములోని, భట్టుమూర్తి వసుచరిత్రములోని పద్యములకు, భావములకు అనుకరణములు కలవు. స్వతంత్రములును సమధికము.

నర్మసఖుని నర్మోక్తులు నవ్యోక్తులు

"అలరుగుత్తులపై వ్రాలి యదె మరంద
మానుచున్నది మగతేఁటి యనుఁగ చూడు
సామి యా లేమ కుచగుచ్ఛముల మీఁద
వ్రాలి కెమ్మోవి తేనియఁ గ్రోలె దీవు. " 111ప. 2ఆ.

"పలుమఱుఁ గీరదంపతులు భావభవప్రథనక్రియారతిన్
మెలఁగుచు మింటిదాఁకఁ బొర మిద్దియఁ గేరెడుఁ జూడు నెచ్చెలీ
భళిభళి రాజచంద్ర యల పంకజపత్రవిశాలలోచనం
గలసి సువర్ణగేహమునఁ గామసుఖోన్నతిఁ గేరె దీ విఁకన్." 114ప. 2ఆ.

సుశ్యామ పరమహంసాకృతివర్ణన అనిదంపూర్వము.

"పుండరీకాక్షి యీ భువనైకసుందరి
యాత్రేయవదన యీ యబ్జగంధి
పర్వతజఘన యీ భామాశిరోమణి
మాతంగగమన యీ మంజువాణి
శాండిల్యకుచ యీ యఖండతేజోనిధి
శుకవాణి యీ మణిప్రకరరదన
భృగుకటిభాగ యీ బింబఫలాధర
నారదవేణి యిన్నాతిమిన్న
యౌర యియ్యంతి పరమహంసాకృతిని బొ
సంగి యున్నది మది నరయంగ దీని
నెయ్య మొనఁగూడు వాని కున్నిద్రనిబిడ
నిరుపమానందయోగంబు దొరకు టరుదె " 61 ప. 3ఆ.

ఇంతి పరమహంసాకృతికి - మునులు పుండరీకుడు, ఆత్రేయుడు, మాతంగుడు, శాండిల్యుడు, శుకమహర్షి, భృగుమహర్షి మాత్రమేగాక; దేవమునులు నారదుడు, పర్వతుడు కూడ పాదాక్రాంతులు! పరమహంసాకృతి నిరుపమానందయోగమునకు నిశ్రేణి!

ఋతుధ్వజాని ప్రతిజ్ఞ రసికజనమనోభిరామమకుటము.

"పురము ల్వోయినఁ బోవనీ బుధులు తప్పుల్వట్టినం బట్టనీ
తరుణు ల్గుందినఁ గుందనీ ప్రజలు వంతం జెందినం జెందనీ
సరివా ర్నవ్విన నవ్వనీ సచివ నే సంప్రీతిఁ దద్దేవతా
హరిణాక్షీనిబిడోపగూహనసుఖాయత్తుండనై యుండెదన్. " 154ప. 3ఆ.

స్వభావోక్తి విలసితమైన సుశ్యామ విరహవర్ణన :

"తల యూఁగు నెదలోనఁ దలఁకి గుప్పున లేచుఁ
జిలుకలఁ గొట్టు నెచ్చెలులఁ దిట్టుఁ
దనలోనఁ దా నవ్వుఁ గినిసి యంచల ఱువ్వుఁ
గన్నులు మూయు నల్లడలు రోయు
దైవంబు దూఱుఁ జిత్తవికారమునఁ దారుఁ
దహతహ చెందు వేదనలఁ గుందుఁ
బిలువకే పల్కుఁ గోయిలకూకలకు నుల్కుఁ
గలవరించు నభంబుఁ గౌఁగిలించుఁ
గలఁగుఁ బిమ్మటఁ గుడుచు బెగ్గిలు వడంకు
బెదరుఁ గన్నీరు నించు దూపిలుఁ గృశించుఁ
బంచశరఘోరశితచూతభల్లభగ్న
మానసాంభోజ యగుచు న మ్మంజువాణి. " 8ప. 4ఆ.

చిలుక తానుగా రాయబారము చేయుట చిత్రము

"ఇంతిరో యింత వింత వగపేటికిఁ జూడు (సమస్త) ధారుణీ
కాంతుఁడు సంతసం బడరఁ గ్రన్నన న న్ననవింటిదంటచే
వంతఁ గలంగి బెంగగొని వాలెము దాలిమి దూలి తేపు నీ
చెంతకు వచ్చి హెచ్చుతమిఁ జేకొను మా కొడఁగూడు వేడుకల్. " 4ప. 5ఆ.

"తలిరు జిరావజీరు బలుదాడికి నోడి కడంక డక్కి పే
రలమటఁ జిక్క పొక్కెద వహా నవహాటకదేహ నీకు నేఁ
గలుగఁగ నింతవంతఁ బడఁ గారణ మే మిఁక లెమ్ము నెమ్మదిం
గలఁగక పంపు వెట్టు మిదె క్రన్నన న న్నరనాథుఁ దెచ్చెదన్. " 8ప. 5ఆ.

"కొమ్మ నీ మేని దొక మంచి సొమ్ము దిగిచి
యానవాలుగ మెడఁ గట్టుమనిన నలరి
వనజలోచన గొబ్బునఁ దన పసిండి
బన్నసర మానవా లిచ్చి పనుచుటయును. " 16ప. 5ఆ.

చిలుక సుశ్యామకు ధైర్యము చెప్పి, ఋతుధ్వజాని తీసికొనివచ్చెదనని పలికి, ఆనవాలు తానే అడిగి పుచ్చుకొనుట అభినవము. రాయబారము నిర్వహించి,

" ఆ మ్మదచంచరీకరుచిరాలకజాలక దా నొకింత డెం
దమ్మునయందు నా పలుకు నమ్మకయమ్మకరాంకకంకప
త్రమ్ముల దాడి నేమగునొ రాజకులైకలలామ జాళువా
కమ్మ లిఖించి నా యెఱుతఁ గట్టుము చెచ్చెర నేగి యిచ్చెదన్. " 64ప. 5ఆ.

అని ఋతుధ్వజాని అడిగి, లేఖ వ్రాయించి, ఆ లేఖ మెడ గట్టించుకొనుట అనుగుణము. మొత్తము మీద ముగ్ధమోహనము.

సుశ్యామాఋతుధ్వజాల సంభోగశృంగారము రసికజనమనోభిరామమహాఘట్టము. అందు వర్షాగమసాదృశ్యకల్పనము అనిదంపూర్వము.

"వదలిన నెఱికొప్పు వారివాహము గాఁగఁ
దనరుచు ల్మెఱుఁగు మొత్తములు గాఁగ
గళరవంబు లనూనగర్జాధ్వనులు గాఁగ
వలపుటూర్పులు గంధవాహములుగ
గళితముక్తాఫలంబులు వడగండ్లుగాఁ
గింకిణీధ్వనులు భేకీధ్వనులుగ
సీత్కృతారవములు చిమ్మెటరొదలుగా
బెడఁగు లేనగవులు ఫేనములుగ
మేన జాల్కొను చెమ్మట ల్వాన గాఁగఁ
గరఁగు మృగనాభిపంకంబు బురద గాఁగ
నఖపదము లింద్రగోపబృందములు గాఁగ
మగువ సురతంబు వర్షాగమంబుఁ బోలె. " 177 ప. 5ఆ.

సుశ్యామాఋతుధ్వజాల వాహ్యాళిఘట్టమునందు, ఋతుధ్వజాడు సుశ్యామకు దివిజదంపతుల మదనక్రీడల గుర్తులు వివరించుట (1825ప. 6ఆ.) కవి కామశాస్త్రపాం డిత్యమునకు తార్కాణమే కాని, కావ్యౌచిత్యమునకు భంగకరము.

"ధేనుకబంధంబున నొక
చానయుఁ బల్లవుఁడు గ్రీడ సలిపిరి తమి ని
చ్చో నారు కరపదంబులు
గానంబడెఁ జూడు వికచకంజాతముఖీ." 18ప. 6ఆ.

"శూలచితబంధమున నొక్క వాలుఁగంటి
విటునిఁ గవఁగూడెఁ జూడు మివ్విరుల సెజ్జ
నొక్క కాల్పేర్చి యున్న చొప్పొప్పు మీఱె
హరిపరిపక్వబింబాఫలాధరోష్ఠి. " 22ప. 6ఆ.

సుశ్యామ కనిపించక ఋతుధ్వజాడు విలపించిన ఘట్టము (43-84ప. 6ఆ.) శబ్దాలంకారప్రధానము.

"హా యను మారసంగరకళాతిశయానమితాప్సరస్సమా
హా యనుఁ దప్తకాంచనసమంచితచంచలచంచలాభదే
హా యను దివ్యరత్నఖచితాంగదదీప్తమృణాళనాళబా
హా యను నెట్టులోర్తు నహహా రుచిరాస్యసరోరుహా యనున్. " 47ప. 6ఆ.

మతమా నీ కెపుడు నిదే
వ్రతమా తెరువరులఁ జెనకవచ్చెదవు మధు
వ్రతమా పరభృతమా పరి
వృతమాచ్యత్కీరకురరపృతనాశతమా. " 67ప. 6ఆ.

"సాలములార చంపకరసాలములార కదంబ నింబ హిం
తాలములార తూలపురతాలములార తమాలమాలతీ
జాలములార మీ రిపుడు జాలము సేయక యాదరించి మా
బాలకురంగలోచన నభంగురలీలఁ గనంగఁ జేయరే. " 81ప. 6ఆ.

ఇదియెల్ల రసికజనమనోభిరామము. ఇక బహుకల్పములు తపస్సు చేసిన ఋతుధ్వజాని తనయ, వేయేడుల గౌతముడు యువ, నవదంపతు లగుట గోదావరీనదీ మాహాత్మ్యము.

"పదమా పొక్కిలి జాంబూ
నదమా మెయి చాయ కోకనదమా పద మా
పదమా జడ నడుము వియ
త్పదమా నూఁగారు గూఢపదమా చెలికిన్. " 68ప. 3ఆ.

అను పద్యము అతిప్రసిద్ధమైనది.

రసికజనమనోభిరామమునందు పుర (35-51ప. 1ఆ.) నాయక (52-56ప. 1ఆ; 48-52ప. 3ఆ.) వేటగాండ్ర (63-67ప. 1ఆ.) ప్రయాణ (68-85ప. 1ఆ.) పురకామినీ విలోకన (86-94ప. 1ఆ.) అరణ్య (97-102ప. 1ఆ.) వేట (104-116ప. 1ఆ.) వసంతర్తు (3-16ప. 2ఆ.) మహారణ్య (18ప. 2ఆ.) నగ (19-28ప. 2ఆ.) నదీ (30-31ప. 2ఆ.) దేవాలయ (41,42ప. 2ఆ.) నాయిక (67-107ప. 2ఆ; 3-15ప. 3ఆ; 137ప. 5ఆ.) నాయకవిరహ (116-144, 154-176ప. 3ఆ; 20-30ప. 5ఆ; 43-84ప. 6ఆ.) నాయికావిరహ (6-30, 117-181ప. 4ఆ.) వనవిహార (31-64ప. 4ఆ; 3-26ప. 6ఆ.) జలకేళి (66-80ప. 4ఆ.) మన్మథపూజ (82-91ప. 4ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయ

పర్యంత (93-107ప. 4ఆ; 103-119ప. 5ఆ.) మధుపాన (108-118ప. 4ఆ.) చంద్రాద్యుపాలంభ (121-151, 166-172ప. 4ఆ.) శిశిరోపచార (152-164ప. 4ఆ.) సంభోగశృంగార (148-182ప. 5ఆ.) యుద్ధ (27-39ప. 6ఆ.) గర్భధారణ (92-101ప. 6ఆ.) యౌవన (119-120ప. 6ఆ.) తపః (123-124ప. 6ఆ.) సముద్ర (165-167ప. 6ఆ.) వివాహ (188-204వచ. 6ఆ.) వర్ణనలు కలవు.

గంగాస్తుతి (32-39ప. 2ఆ.) శివస్తుతి (43-57ప. 2ఆ; 176-177ప. 6ఆ.) వాణీస్తుతి (151-156ప. 6ఆ.) వైశ్వానరస్తుతి (157ప. 6ఆ.) విష్ణుస్తుతి (179దం. 6ఆ.) గోదావరీస్తుతి (181-183ప. 6ఆ.) కూడ కలవు.

ఫిరంగి సాధనమైన వర్ణనమిది :

"తతి యను లోహకారకుఁ డుదగ్రతఁ బశ్చిమశైలశృంగమున్
గుటిగొని వేలువుండెరువు గొప్ప ఫిరంగునఁ జాయమందులోఁ
గొఱలెడు విస్నుమానికవు గుండు ఘటించి యగాదు చేసినం
దఱుచుగఁ గ్రమ్మ క్రొంబొగ లనంగ జగంబునఁ బర్వెఁ జీఁకటుల్" 95ప. 4ఆ.

ఇది న్యూనోపమ అయినను నూతనాంశము.

గంగాస్తుతి :

"మదనారాతిజటాటవీతటనటన్మల్లీగుళుచ్ఛాకృతీ
త్రిదశాధీశపురానిశాధిపసతీ దేవీ జగత్పావనీ
హృదయాహ్లాదకరీ నమజ్జనమనోభీష్టార్థసంధాయినీ
మది నెల్లప్పుడు సంస్మరింతు నిను నేమం బొప్ప మందాకినీ." 33ప. 2ఆ.

గోదావరీస్తుతి :

"మగ్నమాతంగమదజలోన్మత్తభృంగ
యతిదయాపాంగ శంభుజటాగ్రగంగ
కలితశుభసంగ ఘోరదుష్కలుషభంగ
గౌతమీగంగ తరళరంగత్తరంగ." 183ప. 6ఆ.

**సర్పపురక్షేత్రమాహాత్మ్యము** : సర్పవరక్షేత్రదైవమైన భావనారాయణస్వామికి అంకితము. సర్పపురము నేడు సర్పవరమని ప్రసిద్ధము. అనంతుడు - సర్పరాజు - తపస్సు చేసి విష్ణుసాక్షాత్కారమునందిన స్థలము సర్పపురక్షేత్రము. మాహాత్మ్యము "బ్రహ్మవై(క్రై?)వర్తపురాణోక్తమై"న "సర్పనగరమాహాత్మ్యము"ను "ఆంధ్రంబొనర్చి" నట్లు కవి వచనము (188ప. 3ఆ.) కలదుగాని, బ్రహ్మవైవర్తపురాణమునందు సర్పనగర మాహాత్మ్యము లేదు.

ఇందు అంబరీషుడు "సర్పపురమహాక్షేత్రమాహాత్మ్య మే వినంగ నభిలషింతు" ననిన (27ప. 1ఆ.) వసిష్ఠుడు - అగస్త్యుడు శౌనకాదిమహామునులకు చెప్పిన ఆ వృత్తాంత మును - చెప్పినట్లు కలదు. (47వచ. 1ఆ.) కాని సర్పవరక్షేత్రము పురాణపురుషుల కాలము నాటిది కాదు; చారిత్రికవ్యక్తుల కాలము నాటిదే.

అనంతుడు తపస్సు చేయుట, విష్ణువు సాక్షాత్కరించుట, క్షేత్రనామాదికమును అనుగ్రహించుట, బ్రహ్మ విష్ణువు ఆధిక్యమును వివరించుట, నారదుడు తాను విష్ణుమాయకు అతీతుడనని గర్వోక్తు లాడుట ప్రథమాశ్వాసము. నారదుడు సర్పపురము

నకు వచ్చి, విష్ణువు కల్పించిన తటాకమునందు స్నానము చేయుట వలన సుదతి అను స్త్రీ అగుట, వేటకు వచ్చిన పీఠికాపట్టణాధిపతి నికుండరాజు సుదతిని కొనిపోవుట, సంసారము చేయుట, నూరుగురు సుతులను కనుట, సుదతి భర్త, కొడుకులును యుద్ధమునందు చనిపోవుట, క్షుత్పిపాసాపరవశయైన సుదతి ఎంత ప్రయత్నించినను మామిడి పండును అందుకొనలేకపోవుట, విష్ణువు వృద్ధవిప్రుడై వచ్చి అనతిదూరమున కల తటాకమునందు స్నానము చేసిన ఫలము చేతికి వచ్చునని చెప్పుట ద్వితీయాశ్వాసము. తటాకస్నానము చేయుట వలన సుదతి నారదుడగుట, బ్రహ్మసభలోని గర్వోక్తుల ఫలమని గ్రహించుట, విష్ణువును ధ్యానించుట, విష్ణువు ప్రత్యక్షమై అనుగ్రహించుట, నారదుడు భావనారాయణస్వామిని ప్రతిష్ఠించుట, దేవతలు మునులు లక్ష్మీనారాయణులను స్తుతించుట తృతీయాశ్వాసము.

ఇందు నారదుని వృత్తాంతమే ఇంపు గొలుపునది. అది ఉత్తరభారతదేశమునందు జరిగినట్లు దేవీభాగవతమునందు కలదు. ఆంధ్రదేశమునందు జరిగినట్లు ఇందు కలదు. ఇందు నికుండరాజునకు, సుదతికి తొలిచూపు వలపు తొలకరించును. నికుండరాజు సుదతిని చూచి,

"ఎక్కడి దాన వీవు కమలేక్షణ నీవు వసించు నున్కిప
ట్టెక్కడ నీ మనోరమణుఁ డెవ్వఁడు నీ తలిదండ్రు లెవ్వ రీ
చక్కని జాళువా పసిఁడి చాయలఁ గేరెడు మేను గందఁగా
నొక్కతె విక్కడం దిరుగుచుండఁగఁ గారణమేమి చెప్పుమా. 50

అనిన నచ్చాన యనంగనారాచసం
తప్తయు నాచ్ఛాదితస్వదేహ
లతికయు నిర్భరలజ్జానిమీలిత
నయనయునై మహీనాథు సారెఁ
గడగంటి చూపులఁ గనుఁగొంచు నొక తరు
పార్శ్వంబునందుండి పాదపంబు
కొనగోళ్ళ వాయించుకొనుచు నొదల వాంచి
యొక్కింత మాటాడ కూరకుండె
వీతరాగుఁడు తత్త్వసంవిదుఁడు నిన్న
పొండు నగు నారదుం డప్పు డోలి రాగ
కామలజ్జాదికత్వముల్ గలిగియుండె
నహహ దైవకృతం బెన్న నద్భుతంబు. 51ప. 2ఆ.

నికుండరాజు సుదతి కన్య అని భావించి, మరుకేలి నేలుకొమ్మనును. (55)

"అనుడు నబ్భూమివరు మాట లాలకించి
మెత్తఁబాటూని యన్నుల మిన్న కన్ను
సన్నల నలంతి నవ్వుల నున్న తెఱఁగు
వన్నె దైవాఱ నెఱిఁగించి మిన్నకుండె." 56ప. 2ఆ.

ఇట్లు సుదతి పాత్రను భావసంయమనముతో చిత్రించుట, అందును క్షీణయుగము నందు చిత్రించుట విశేషము.

శ్రీనాథుని కాశీఖండములోని లక్ష్మీస్తుతియందు వలె, ఇందలి దేవతల, మునుల

లక్ష్మీస్తుతియందును కలవారి, లేనివారి పరామర్శ కలదు. (78చ,79,81,82ప. 3ఆ.)

"మతి మఱపూను నుస్సురను మందతఁ జెందుఁ గృశించు మాటికిన్
వెతపడు నీచవర్తనుల వేడఁగఁ జూచు విధిన్ సహించు లో
ధృతి చెడి క్రుంగు బెంగగొను నెట్టి మహోన్నతుఁడైన నీ జగ
ద్హితకరుణారసప్లుతనిరీక్షణ మబ్బని వేళ శ్రీసతీ. 82ప. 3ఆ.

శివలీలావిలాసము : కుక్కుటేశ్వరస్వామికి అంకితము. ఇందు శివుని ఒక్క లీల ఇతివృత్తము. అది గంగాపరిణయము. పర్యవసానము పార్వతీపరమేశ్వర, గంగాగౌరీసంవాదద్వయము. భీష్ముడు - మున్ను నారదుని వలన విన్న ఈ శివలీల - అర్జునునికి చెప్పినట్లు కలదు. (14-19ప. 1ఆ.) రెండాశ్వాసముల కావ్యము.

గంగ ప్రవహించుట వలన సకలభువనములు ఏకార్ణవ మగును. అందుకు గంగ "తన కెదు రెవ్వరు లేరని" గర్వించును. శివుడు జాలరి కులమున జన్మింపుమని శపించును. గంగ భూలోకమునకు వచ్చి, సముద్రతీరమున శివుని గుఱించి తపస్సు చేయును. ఏలూరి నగరము నుండి సముద్రమున వేటాడుటకు వచ్చిన శంఖదేవుడను జాలరికి పెంపుడు కూతు రగును. ఆ జాలరి కన్య అందచందములు నారదుడు శివునికి వివరించును. శివుడు జంగమవేషధారియై జాలరికన్య విహరించు వనమునకు వచ్చును. ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై ప్రేమభిక్ష అర్థించును. జాలరికన్య మౌనము వహించును. ఆమె చెలికత్తెలు జంగమవేషధారిని మందలించి పంపివైతురు. జంగమవేషధారి, జాలరికన్య పరస్పరవిరహపరితప్తులగుదురు. శంఖదేవుడు తగిన వరునికిచ్చి పెండ్లి చేయుదు ననిన, జాలరికన్య తాను జాహ్నవినని, జంగమవేషధారి శివుడని, అతనినే పెండ్లాడుదునని చెప్పును. శంఖదేవుడు జంగమవేషధారి నిజస్వరూపము చూపించి నిఖిలదివిజవర్గములతో వచ్చిన పెండ్లి చేయుదు నను. గంగ విన్నపమున శివుడు నిఖిలదివిజవర్గములతో ప్రత్యక్ష మగును. శంఖదేవుడు పెండ్లి చేయును. ఇది గంగాపరిణయము. పురాణసరణి.

నారదుడు కైలాసమున కేగి, శివుడు జాలరికన్యను పెండ్లాడి వచ్చుచున్నాడని పార్వతికి చెప్పును. శివుడు గంగను జడలలో నిడుకొని వచ్చును. పార్వతి తలుపులు బంధించి అతికఠినోక్తు లాడును. పార్వతీపరమేశ్వరసంవాదము సాగును. పరమేశ్వరుడు బాసలు చేసి మన్నింపుమని వేడుకొనిన పార్వతి తలుపు తీయును. పరమేశ్వరుని మేన సంభోగచిహ్నాము లరసి ప్రశ్నలు కురిపించును. పరమేశ్వరుడు అబద్ధములు చెప్పి మురిపించును. ఒకనాడు పార్వతీపరమేశ్వరులు నెత్తము లాడ పరమేశ్వరుడు ఓడిపోవును. పార్వతి కిలకిల నవ్వును. అది సహింపలేక గంగ జడల నుండి తొంగి చూచును. ఆమెను చూచి పార్వతి పరమేశ్వరుని పట్టిపల్లార్చును. "దానిఁ గ్రిందికి దించి నా దఱిని నిల్పి మాటలాడించు" మనును. శివుని సిగలో నుండి గంగ చివ్వన క్రిందికి ఉఱుకును. గంగాగౌరీసంవాదము సాగును. ఇది పార్వతీపరమేశ్వర, గంగాగౌరీసంవాదద్వయము. జానపద గేయసరణి.

పార్వతీపరమేశ్వరుల కవాటబంధనఘట్టములోని కతిపయసంవాదపంక్తులు :

పర్వేందువదన విను మే
సర్వజ్ఞుఁడ నహహ మేలు సర్వజ్ఞునిపై
నుర్విని జను లెవ్వారు న

ఖర్వమతిం దలఁగిపోరుగద పరికింపన్. 130

నీలకంఠుండ నే హరినీలవేణి
నీ చెలిమి గోరుకొని వచ్చి నిలిచినాఁడ
నౌర మే ల్నీలకంఠుఁడవైతివేని
కేక లిడుకొంచు వేగమె గిరికిఁ జనుము. 131

క్రీడాకిరాతుఁడను నేఁ
జేడియ యటులైన నీవు జింకలు పులులుం
గ్రోడంబులు గల యడవికిఁ
బోడిమితో వేఁటలాడఁ బొమ్మా నెమ్మిన్. 132

అబల నేఁ బశుపతి నహహా నీ వట్లైన
నాలమందకు అంకె లడరఁ జనుము
స్థాణుఁడ నేను గంజాతాక్షి యబ్బబ్బ
మోడు మాటాడుట చూడ మెందుఁ
బురసంహరుఁడ నేను బొలఁతి నీ వట్లైన
మా వీట నుండక మరలి పొమ్మ
పన్నగధరుఁడను బడఁతి నే వట్లైనఁ
బడగ లెత్తుచు నూళ్లఁబడి తిరుగుము
భూతనాథుఁడ నేను బూఁబోఁడి యట్టు
లేని నల ప్రేతభూముల కేగు మిపుడె
కుటిలకుంతల నే మహానటుఁడ నట్టు
లైనఁ బ్రభువుల కడకేఁగి యాడు మెలమి." 133ప. 2ఆ.

పార్వతీపరమేశ్వరుల - సంభోగచిహ్నములరసిన ఘట్టములోని - సంవాదము :

"పసుపును గుంకుమ గంధము
నసమాంబక నీదు మేన నట్టు నదలి యే
బిసరుహముఖి యంటించెనొ
కసరక నాతోడ నిపుడు గట్టిగఁ జెపుమా. 141

విను మానిని జనులందఱు
వెనుకయ్యను బూజ సేయ వెస నాతఁడు నన్
బెనఁగి కవుంగిటఁ బొదవినఁ
దనువున నవి యంటుకొనియెఁ దప్పే నాకున్. 143.

కాలకంధర నీ మోవిగంటు లేమి
కారణంబునఁ బొదలె నా గౌరి వినుము
మరునితోడ నెదిర్చి సంగరమొనర్చు
తఱిని గోపించి కీరంబు గఱచెఁజుమ్ము 144

హాటకగిరిధర నీ మెయిఁ
గాటుక యంటిన దదేమి కారణ మబలా
కాటుక కాదిది కుత్తుక
గాటపు గరళప్రభావికాసము సుమ్మీ 145

మే లెంతటి నెఱజాణవొ

బాళిగ దత్తురము లాడి వంచించెదవో
బాలేందుజూట నీ మెయిఁ
బూ లంటుక యున్నవేల బొంకక చెపుమా 146
భామ విను మున్ను శ్వేతుఁ డ న్భక్తవరుఁడు
వెలవెలందికిఁ బూల్గొంచు వెడలు నెడల
గొన్ని మహిమీఁద వ్రాలినఁ గోరి వాఁడు
నాకు నర్పింప నవి యంటి నాటుకొనియె. 147
పన్నగరాజాంగద నీ
కన్నుల నెఱుపేల గలిగె గౌరీభక్తుల్
నిన్నర్ధరాత్రివఱకున్
నన్ను న్జాగరణమునిచినం బొసఁగె నిటుల్. " 148ప. 2ఆ.

గంగాగౌరీసంవాదములోని ఆదిమధ్యావసానములు :

గౌరి :- ఎక్కడిదానవె నీ విటు
లక్కజముగ నా హృదీశు నౌఁదలపైఁ బెం
పెక్కఁగ వసించి యిప్పుడు
చిక్కున నుఱికితివి బుద్ధి సెప్పెదఁజామ్మా. 165

గంగ :- చిగురాకుఁబోండ్ల కెల్లను
మగఁ డేమారఁగను మేటి మక్కువతోడన్
సగమేన నిల్పుకొన్నను
సిగలో నిడుకొన్న (నెట్లు)ఁ జెల్లుగదమ్మా 170

గౌరి :- అడుగు నిలుపనీక వడికొట్టు చూపుచు
నింగి ముట్టి మిగులఁ బొంగెదేమి
గట్టి వాతనంబు గనఁబడనౌనె నీ
నిలువు నీరుగాను నీచురాల. 173

గంగ :- పెద్దదాననుచుఁ బెళపెళ నార్చుచు
జగములెల్ల మ్రింగఁ జాలు నట్టి
సత్తి రూపు పూని జడిపింప వచ్చెదు
కినుక నిగుడ నీవు గిరితనూజ 175

గౌరి :- ఓసి గయ్యాళి నీ కింత రోసమేల
చెడుగు జాలరివానింటఁ బొడమి బిట్టు
చేప జెల్లలు దిని మేను చెందకున్న
పలికెదవు నీవు నీతోడ సరియె చెపుమ. 182

గంగ :- అప్పరో యింక నీ గుట్టు చెప్పనేల
కల్లు గంజాయి నంజాడు నెల్లప్రొద్దు
బాళిగాఁ దిను కడజాతివాని యింటఁ
బుట్టితివొ లేదొ చెప్పుమా గట్టిగాను. " 184ప. 2.ఆ.

శివలీలావిలాసమునందు నాయిక (42-45, 71-83ప. 1ఆ.) పుర (70ప. 1ఆ.) వన (87-88ప. 1ఆ.) వనవిహార (92-97ప. 1ఆ.) సూర్యాస్తమయాదిచంద్రోదయపర్యంత (3-8ప. 2ఆ.) నాయకవిరహ (9-22ప. 2ఆ.) నాయికావిరహ (24-78ప. 2ఆ.)

సూర్యోదయ (80ప. 2ఆ.) వివాహ (103-110ప. 2ఆ.) శోభన (112-115ప. 2ఆ.) వర్ణనలు కొన్ని మాత్రమే కలవు. విరహవర్ణనములు వినా కడమవర్ణనములు కతిపయ పద్యములే.

**చిరవిభవశతకము** : శివాంకితము. నూటొక్క పద్యములు కలవు. అన్నియు చంపకమాలలు. భక్తినివేదనములు. "చిరవిభవా! భవా! విజితచిత్తభవా యభవా! మహాభవా!" అని మకుటము. కాలనిర్దేశకపద్యము లేదు కాని శివలీలావిలాసకథాంశము కల పద్యము కలదు.

"ఇరవుగ నెల్లలోకముల నేలెడు స్వామివి నీవు కూర్మితో
దొరతనమెల్లఁ బో కడచి తుచ్ఛపు జాలరి పూప కన్నియన్
శిరమునఁ బెట్టుకొంటివఁట చిత్రము లౌర భవద్విలాసముల్
చిరవిభవా! భవా! విజితచిత్తభవా! యభవా! మహాభవా!" 45

జాలరికన్య జాహ్నవి ప్రసక్తి భర్గశతకమునందు లేదు. కావున చిరవిభవశతకము శివలీలావిలాసానంతరకృతి కావలయును. కాఁబట్టి చిరవిభవశతకము రచనాకాలము 1758 ప్రాంతము కావచ్చును.

"నరపతి కొక్క కావ్యమిడినన్ ధనధాన్యమణీనిచోళముల్
పురములు వాహనంబులు విభూషణగోవసుధాదికంబులుం
గురుకృప నిచ్చి ప్రోచు నిదిగో మఱి నీ విఁక నేమియిచ్చెదో చిర." 11

"పారిఁబొరిఁ బుణ్యభూములకుఁ బోవఁగనేలఁ గడు న్దపోమహా
ధ్వరము లొనర్పనేల యుపవాసములన్ గృశియింపనేటికిన్
హరహర యంచు నొక్క తఱి నాడినఁ జాలు నఘప్రశాంతికై, చిర. 57

"ఒరిమెఁ గవీంద్రుఁ డేమడుగునో యని దర్శనమియ్యనోడి బ
ల్దొరలును మూల నీగుదురు లోభమున న్నిను నే మఱేమియున్
వరములు వేడ నా కిపుడు నైళము దర్శనమీయ రాఁగదే. చిర." 95

ఇట్లు భక్తిభావములు భర్గశతకమునందు కంటె ఇందు భాసిల్లును.

**కుక్కుటేశ్వరశతకము** : కుక్కుటేశ్వరస్వామికి అంకితము. తొంబది రెండు పద్యములు కలవు. అన్నియు సీసపద్యములు. "భూనుతవిలాస! పీఠికాపురనివాస! కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!" అని మకుటము. ఇందు భక్తినివేదనములు, నీతులు, దుష్టరాజనిందలు, శిష్టరాజప్రశంసలు, కుకవినిందలు, సుకవిప్రశంసలు, సమకాలికసమాచారములు కలవు. సమకాలికసమాచారములైన అధిక్షేపకపద్యములు వ్యావహారికభాషలోను కలవు.

ఒక సమకాలికసమాచారము :

"వేదశాస్త్రపురాణవిద్య లక్కఱ గావు
    పరిహాసవిద్యలు పనికి వచ్చు
గద్యపద్యవిచిత్రకవితలు కొఱ గావు
    గొల్లసుద్దుల కతల్ పెల్లు మీఱు
దేవతాభాషల తీరు లేమియుఁ గావు
    పారసీకోక్తులు ప్రణుతి కెక్కు
శైవవైష్ణవమతాచారంబు లొప్పవు

పాషండమతములు బాళి నలరు
నౌర! యి క్కలికాలమహత్త్వ మెంతొ
వింతయై తోఁచుగద ధరాభ్యంతరమున
భూనుతవిలాస! పీఠికాపురనివాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ! " 21.

ఒక వ్యావహారికభాషాపద్యము :

"సల్లఁగా మాలదాసరసటారయగారి
తిర్నామములు సాన తేప లింటి
గొల్ల మారన బోయ దెల్లఁగా సతికితే
బొల్లేవు పోట్లాట లెల్ల యింటి
జయన యెంకట బొట్లు సబ్బండు సారాలు
పూరాండములు సెప్పఁ గోరి యింటి
సరవయ్య బయలీదు జమిలికతోఁ బాడు
నంకమ్మ పాట లెన్నెన యింటి
గాని సీ యెద్దుమాంసుల కయిత కంబు
లంద మది పించుకాయల యందమంద్రు భూ." 24

కుకవినింద :

"ఇల జొన్నఁబడు గ్రుడ్డియెద్దు చాడ్పున మృదు
పదగతు లరయక పరుపుకొనుచుఁ
బెనఁకువ నోడిన పిరికి బంటును బోలె
వడి లేక ప్రాసంబు విడిచి వైచి
సారెఁ గొక్కెర రీతి జడధుల నెరసుల
నెమకుచు మిగుల భంగములఁ దోఁగి
పెంటలపైఁ బొర ల్పెట్టు రాసభమట్లు
పలుమఱు నపశబ్దములె పలుకుచు
తస్కరుని చందమునఁ బదార్థములు ముచ్చి
లించుచుఁ జరించు కుకవుల నెంచనేల. భూ. " 35

సుకవిప్రశంస :

"దేశాటనంబును దేవతోపాస్తియుఁ
బండితస్నేహంబు బహుపురాణ
శోధకత్వము పరిశుద్ధతయును మహా
ప్రతిభయుఁ గల్పనాపాటవంబు
ఛందోముఖాశేషశాస్త్రవేదిత్వంబు
సంగీతసాహిత్యసౌష్ఠవంబు
నిఖిలకళానైపుణియు నహంకారరా
హిత్యంబు జనహితకృత్యములును
గలిగి కవిరాజరాజశేఖరులు మెచ్చు
కబ్బములు గూర్చు వాఁడెపో కవి యనంగ
భూనుతవిలాస! పీఠికాపురనివాస!

కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ !" 36



ఒక నీతిపద్యము :

"మొదవులఁ బదివేలు కదుపులు గూర్చిన
దూడ యొక్కటియైనఁ దోడ రాదు
మాడ లసంఖ్యముల్ మాటుగా నించినఁ
బసిఁడి పీసమును వెంబడిని రాదు
కోకలు మేట్లుగాఁ గొట్ల నిండించిన
గుడ్డ యొక్కటియైనఁ గూడ రాదు
గొలుసులు రాసులు బలుపాతరల నిడ్డ
గింజ యొక్కటియైనఁ గెలన రాదు
గావున నొడళ్ళు నిక్కముల్ గావటంచుఁ
జెలఁగి సుజనులు ధర్మంబు సేయుచుంద్రు. భూ. " 63



ఒక భక్తిపద్యము :

"నటుని పోల్కి ననేక నామరూపవిభేద
ములు పూని శుభలీలఁ జెలఁగు వాని
తవిలి పూసలలోని దారంబు కైవడి
జగదంతరాత్మయై నెగడు వాని
నైంద్రజాలికు రీతి నఖిలంబు నుద్భవ



స్థితిలయంబుల నొందఁజేయు వాని
విమలాంబువులఁ బ్రతిబింబితుండౌ హేళి
వలె సర్వసాక్షియై వెలుఁగు వాని
నిన్ను సేవింతు భావింతు సన్నుతింతుఁ
బ్రేమ యేపార సాక్షాత్కరింపుమయ్య
భూనుతవిలాస! పీఠికాపురనివాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!" 80

ఇట్లు కుక్కుటేశ్వరశతకమును కేవలభక్తిశతకము, కేవలనీతిశతకము, కేవల హేళనశతకము కాక; భర్గశతకము, చిరవిభవశతకము వలె భక్తినీతిహేళనాద్యనేకభావ శబలితమైన శతకము.

# ఏనుగు లక్ష్మణకవి

ఇతని కృతులు 1. విశ్వేశ్వరోదాహరణము 2. నృసింహదండకము 3. సూర్యశతకము (సంస్కృతము) ఈమూడును అనుపలబ్ధములు. 4. రామేశ్వరమాహాత్మ్యము క్షేత్ర మాహాత్మ్యకావ్యము. 5. జాహ్నవీమాహాత్మ్యము. తీర్థమాహాత్మ్యకావ్యము 6. విశ్వామిత్ర చరిత్రము అనుపలబ్ధము. 7. సుభాషితరత్నావళి 8. రామవిలాసము కావ్యము.

రామేశ్వరమాహాత్మ్యము గురజాపల్లిలోని చెన్నమల్లేశ్వరస్వామికి, జాహ్నవీ మాహాత్మ్యము వెంటూరులోని సోమేశ్వరస్వామికి, సుభాషితరత్నావళి పెద్దాడలోని సోమశంకరస్వామికి అంకితములు. దైవాంకితములు. రామవిలాసము వత్సరాయ గోపరాజానకు అంకితము. నరాంకితము గోపరాజా కాలము[69] 1759-93. ఇతని తాత లత్సన లేక లచ్చన కృతుల రచనాకాలములు 1645, 55 ప్రాంతము. ముందు వివరింతును. కనుక ఇతని కృతుల రచనాకాలము 1725, 30 నుండి ప్రారంభమగును. కాఁబట్టి విశ్వేశ్వరోదాహరణము 1730 ప్రాంతము, నృసింహదండకము 1732 ప్రాంతము, సూర్యశతకము 1735 ప్రాంతము, రామేశ్వరమాహాత్మ్యము 1740 ప్రాంతము, జాహ్నవీమాహాత్మ్యము 1745 ప్రాంతము, విశ్వామిత్రచరిత్రము 1750 ప్రాంతము, సుభాషితరత్నావళి 1755 ప్రాంతము, రామవిలాసము 1760 ప్రాంతము కావచ్చును.

**రామేశ్వరమాహాత్మ్యము** : ఇది స్కాందపురాణములోని సేతుఖండమునకు తెనుగుసేత. ఇందు రామకథ గాక, రామేశ్వరక్షేత్రమునందలి చతుర్వింశతితీర్థస్నాన ఫలములు; ధనుష్కోటితీర్థవిషయము; రామేశ్వరలింగదర్శనధ్యానపూజాఫలములు; రామేశ్వరలింగప్రతిష్ఠ; బ్రహ్మాదిదేవతల, వసిష్ఠాదిమహర్షుల రామేశ్వరస్తోత్రములు, పాండ్యరాజుకథ మొదలైనవి కలవు. రామేశ్వరలింగప్రతిష్ఠ ఘట్టము, పాండ్యరాజా కథ కావ్యత్వసిద్ధి కలవి. కడమ గ్రంథమెల్ల స్థలపురాణమే.

రావణవధ వలని పాపమునకు నిష్కృతిగ మునులు శివార్చనము సేయుమనిన, రాముడు హనుమంతుని కైలాసనగమున కేగి శివలింగము తెమ్మని పంపును. హనుమంతుడు ముహూర్తకాలమునకు శివలింగము తేకపోవుట వలన, రాముడు మునులు చెప్పిన ప్రకారము, సీత చేసిన వాలుకాలింగమునుప్రతిష్ఠించును. హనుమంతుడు శివలింగమును తెచ్చి, సైకతశివలింగమునకు పూజ సేయు రాముని చూచి దుఃఖించును. (6-13ప.3ఆ.) ఇది కరుణరసప్రధానము. ఆద్యంతపద్యములు :

"కేవలక్లేశభుక్తికినై జగంబునఁ
బుట్టినాఁడను నేను భూతలేంద్ర
యుక్కు మీఱిన పెక్కు రక్కసి మూకచే
ననిలోన ఖిన్నుండనైతి మిగుల
బగతి నొకానొక సరసిజాతాక్షియుఁ
గనదుగా నావంటి కాన్పు నెచట
భవసాగరంబు లోపల మునింగి యనంత
బాధలకెల్లఁ బాల్పడితి నహహ

మున్ను నేవఁ జేసి ఖిన్నుండనైతిని
కలహభూమిఁ జాల కష్టినైతి
నమితదుఃఖరాశినైతి నీచే నవ
మానమొంది యిపుడు మానవేంద్ర. 6ప. 3ఆ.
" ఈ దురంతఖేద మేను సహింపఁగా
జాలనయ్య ధరణిపాలతిలక!
యేమి సేతు నింక నెచ్చటి కేఁగుదు
తెలిసి చూడ నాకు దిక్కు లేదు. " 12ప. 3ఆ.

పాండ్యరాజు కథ పంచమాశ్వాసము. రాజధాని మణిపురము వర్ణన ముప్పది రెండు పద్యగద్యములందు (5-36) రాజు శంకరుని వర్ణన పందొమ్మిది పద్యగద్యములందు (37-55) చెంచుదొరల, వేట వర్ణన ముప్పది మూడు పద్యగద్యములందు (56-58) కలదు. వేట పరికరములందు తుపాకులు కలవు. (79ప. 5ఆ.) ఇది యెల్ల కావ్యత్వ సిద్ధికైన స్వతంత్రకల్పనము.

పురవర్ణనమునందు పూలతోట చాటుకావ్యము

"స్తబకములఁ బొల్చి విస్ఫురధ్వనులఁ బొసఁగి
భ్రమరవిలసితవృత్తసంపదలఁ బొదలి
యతుల మృదుకలికామంజులతలఁ దనరి
చాటుకృతు లట్ల పీటఁ బూఁదోట లమరు. " 27ప. 5ఆ.

శంకరమహారాజు పేరోలగమునందు "పురాణేతిహాసకథ లిచ్చగిం "చుటయే గాక, "చంపూచాటునాటకోదాహరణాదిచాటుప్రబంధంబు లాలోచిం "చుట, కలదు. (66వచ. 5ఆ.) ఈ సమాసము "చంపూచాటునాటకోదాహరణజయఘోషచక్రవాళచతుర్భద్రచతురాతిప్రబంధంబు లాకర్ణించుచు" అను శ్రీనాథుని సమాసమునకు (118వచ. 6ఆ. భీ.పు.) అనుసరణము. అవి దక్షారామము మొగసాల వాకిటి మహోత్సవమండపము లోనివి. ఇవి పెద్దాపురము సంస్థానము పేరోలగము లోనివగును.

శంకరభూపాలుడు వేటయందు, ఒక గుహలోని వ్యాఘ్రచర్మము కప్పుకొనియున్న మునిని, మునిపత్నిని చంపినందుకు, మునులు "వహ్నియందుఁ గాయసంత్యాగంబు సేయు మట్లు సేయవేని శుద్ధి నీకు లేదు." (104ప. 5ఆ.) అనిన, "అటువలె నగుఁ గాక" అనుటయే గాక, మంత్రులు వారించినను అందుకు సిద్ధపడుట (106-113వచ. 5ఆ.) ధీరోదాత్తము. ఆకాశవాణి వలన అది నివారణమగుట రామేశ్వరక్షేత్రమాహాత్మ్య ప్రతిపాదనార్థము.

రామేశ్వరమాహాత్మ్యమునందు గర్భకవిత్వమును కలదు. స్రగ్విణీమిళితభుజంగ ప్రయాతవృత్తము (52ప. 4ఆ.) కందమిళితమణిగణనికరవృత్తము. (74ప. 4ఆ.) చతుర్విధకందము (113ప. 4ఆ.) కందగర్భితగీతము (126ప. 4ఆ.)

జాహ్నవీమాహాత్మ్యము : ఇది "వివిధపురాణఫక్కికల" అనుసరణము. (29వచ. 1ఆ.) ప్రథమాశ్వాసములోని గంగాస్మరణఫలాదికమునకు మూలము పద్మపురాణము (81అ. 4భా. ఉ. ఖం.). గంగాసంభవప్రకారమునకు మూలము బ్రహ్మపురాణము (71,72అ.). ద్వితీయాశ్వాసములోని గంగాభవాని విస్తరణకు మూలము బ్రహ్మపురాణము

(18అ.). పద్మపురాణము (ఉపభాగము 20అ.). గంగావతరణమునకు మూలము రామాయణము (38-44ప. బా. కాం.) తృతీయాశ్వాసములోని శ్రీకుండల. వికుండలుల వృత్తాంతమునకు మూలము పద్మపురాణము (సర్గఖండము 2భా. ఉ. ఖం.) మాఘస్నాన మాహాత్మ్యమునకు - కాంచనమాలినీవృత్తాంతమునకు - మూలము పద్మపురాణము (126-128అ. 4భా. ఉ. ఖం.) ఇది వివిధపురాణఫక్కికల వివరము[70]. ప్రతివృత్తాంతము కావ్యత్వసిద్ధి కలిగించు నదియే కాని, అందు కాంచనమాలినీవృత్తాంతమే అగ్రేసరము.

కాంచనమాలిని గౌరీదేవి సఖి. పూర్వజన్మమునందు గౌరవిలాసిని అను వేశ్య. వేశ్యావృత్తి అవలంబించినను మనస్తత్త్వము మాఱుట విశేషము. ఒకనాడు ఒక విటశ్రేష్ఠుని రాకకు ఎదురు చూచి, ఎంతకు రాకపోవుట వలన ఆలోచనలో పడును.

"నే నెవ్వతెను? వాఁడెవ్వఁడు? వాని రాక కెదురు చూచుచు
నింత వంతం బడి వగవనేటికి? నిద్ర విడిచి మిడుక నేల? యేల
వలచితి? నే నింతకాలం బిట్లు పడసి యేమి సాధించితి? మహాదురిత
భాజనంబగు నీ జన్మంబు నాకేల కలిగె? ఎక్కడి తల్లి యెక్కడి చెల్లెలు?
ఈ ధనంబుల నేమి పని యయ్యెడు? నయ్యయో! యీ వెచ్చకాఁ డెచ్చటి
కేగిన నేమి? మాంసవిక్రయంబు జీవికగానున్న కటికవానికన్న నీచంబు
నా వర్తనంబు . . . . . . పడచి కుడుచు పడఁతి కంటెఁ బాపిని యున్నదే?" 41వ. 4ఆ.

ఇట్లు విచారించునెడ విటశ్రేష్ఠుడు వచ్చిన, గౌరవిలాసిని "పలుకకయె త్రోసి పుచ్చిన, పిలిచి పిలిచి నోరు నొచ్చి "వాడు వెడలిపోవును. విరక్తి చెందిన విలాసిని మఱునాడు రాజపురోహితుని సందర్శించి, పుణ్యలోకము కలుగు నుపాయమును ఆనతిమ్మని ప్రార్థించును. (44-49ప. 4ఆ.) పురోహితుడు "ఇట్టి తలఁపు లుడిగి యింటికిఁ జని సుఖంబుండు" మని సూచించును. (49-53ప. 4ఆ. ) గౌరవిలాసిని వైరాగ్యవాంఛను వివరించును. (54-57వచ. 4ఆ.)

"త్వగసృఙ్మాంసమేదోమజ్జాస్థిస్నాయునిబద్ధంబయిన యీ
శరీరంబునం గలుగు సుఖం బెంత. దీనికి నాయుష్యంబును పరమ
స్వల్పంబు.కలిగి భోగింపవలదా యని పలికెదవేని విన్నవించెద. నున్న
రూపుఁ జిత్రగింపుము. గంధచర్వావీటీచర్వణభూషణాంబరధారణం బెల్ల
నన్యుని కొఱకుఁ గాని యాత్మసుఖార్థంబు గాదు. పడపుఁగుడుపుగాఁ
బరగు పడంతుల కిది మర్యాద. అదియునుంగాక నాకు భోగాపేక్ష
లేదు. విషయసుఖకాసారనిదాఘకాలంబగు జర వచ్చుచున్నయది.
ఇఁకఁ బుణ్యచింతనంబు పురుషార్థంబు గాని తుచ్ఛభోగానుభవంబు
కార్యంబు గాదు. " 54వచ. 4ఆ.

ఇంత మనఃపరిణతి కల వేశ్య పాత్ర ఇతరత్ర మృగ్యము. వసంతోసేన సానివతంస. మధురవాణి వాణీమధుర. వృత్తిసుముఖలే కాని, వృత్తివిముఖలు కారు.

బ్రహ్మరాక్షసుడు కాంచనమాలినిని చూచి, "తల్లి వలె డాయఁ బుట్టిన చెల్లెలి వలె నిన్నుఁ జూచి చిత్తము కడు రంజిల్లె " ననుట (25. 4ఆ.) అపూర్వరాక్షసలక్షణముకాదు. అనర్ఘజాహ్నవీజలమాహాత్మ్యము.

"ఉవిద నీ తడిచీర బిందువులు తలను

సోఁకి నంతనె దయపుట్టె సూనె మదిని
ప్రాణుల భుజించు నాకుఁ గ్రౌర్యంబు మాని
ప్రియము గదిరెడు నీ రూపు రేఖ చూడ. " 24ప. 4ఆ.

అని ముందే బ్రహ్మరాక్షసుని ఉపోద్ఘాతము. కాంచనమాలిని తడిచీర బిందువులకు హేతువు ప్రయాగమాఘస్నానము.

బ్రహ్మరాక్షసుడు కాంచనమాలినిని పలుకరించిన విధము ప్రకరణోచితము కాదు.

"తులకించు తడిచీరతొడలపైఁ గడుహత్తి
    జోకగా లోజిగి చౌకళింప
పసిఁడి కుండలఁ బోలు పాలిండ్ల భరమున
    నసదు లేఁగౌ నసియాడుచుండ
తొడవుగా నలరు కీల్జడయందుగిరికొని
    యుదుటు తీర్థపు బిందు లుట్టిపడఁగ
నడుగుఁదమ్ముల కాంతి విడివడి పగడంపుఁ
    జిగురుటాకుల మేలు చిందు సేయ
నెలమి నెక్కడనుండి నీ విటకు వచ్చి
తెచట నీ యున్కి యెచ్చోటి కేగె దిపుడు
నామ మెయ్యది నిజముగా నాకుఁ దెలుపు
భీతసారంగశాబకస్ఫీతనయన" 21ప. 4ఆ.

తల్లి, చెల్లి అనుటకు ముందు తడిచీర లోజిగి వర్ణనము, భీతసారంగబక స్ఫీతనయన అను సంబుద్ధి సందర్భశుద్ధి లేనివి.

భగీరథుని ఘోరతపస్సునకు షడృతునైపథ్యకల్పనము (106-153ప. 2ఆ.) కాళిదాసు పార్వతితపస్సును, తెనాలి రామకృష్ణుని రాధాదేవి తపస్సును అనుసరించినది. మొత్తము మీద రామేశ్వరమాహాత్మ్యము కంటె జాహ్నవీమాహాత్మ్యము రసవత్కావ్యము.

**సుభాషితరత్నావళి** : ఇది భర్తృహరి సుభాషితరత్నావళికి తెనుగుసేత. ఇంతకు ముందు ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మనల తెనుగుసేతలు ఎట్టివో సోదాహరణ నిరూపితములు. అవే శ్లోకములకు ఏనుగు లక్ష్మణకవి ఆంధ్రీకరణము లివి :

"బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః
అబోధోపహతా శ్చాన్యే జీర్ణ మఙ్గే సుభాషితమ్. " 2 శ్లో. నీ. శ.

"బోద్ధలగు వారు మత్సరపూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువు లెన్న
నితరమనుజు లబోధోపహతులు గాన
భావమున జీర్ణమయ్యె సుభాషితంబు. " 2ప. నీ. శ.

ఇందు శ్లోకములోని అంశమును విడిచి పెట్టినది లేదు. లేని అంశమును తెచ్చి పెట్టినది లేదు. మత్సరగ్రస్తులనుటకు మత్సరపూర్ణమతులనుట అక్షరమైత్రినిమిత్తము. మత్సరగ్రస్తులు మత్సరపూర్ణమతులే. స్మయదూషితులనుటకు ప్రబలగర్వవిదూషితు లనుట గణసంపాదనార్థము. గుణసంపాదనార్థము కూడ. మత్సరపూర్ణమతులు గర్వదూషితమాత్రులు కారు. ప్రబలగర్వవిదూషితులే. ప్రబల అను విశేషణము, వి అను ఉపసర్గ అర్థవంతములు. అంగమున అనుటకు భావమున అనుట అక్షరమైత్రి నిమిత్తము.

అంగమన అంతరంగమని అర్థము. భావమని తాత్పర్యము. అగతికములైన అలతి మార్పులు వినా ఆంధ్రీకరణమిది అన్యూనాతిరిక్తము. అంతేకాదు శ్లోకములోని జీవము పద్యమునందు ప్రస్ఫుటము.

"ఉద్వృత్తః స్తనభార ఏష తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదం కుర్వన్తు నామ వ్యథామ్
సౌభాగ్యాక్షరపఙ్క్తి, కేన లిఖితా పుష్పాయుధే నస్వయం
మధ్యస్థాపి కరోతి తాపమధికం రోమావళిః కేన సా." 15 శ్లో. శృ.శ.
గరువపుఁ జన్నులుం బెళుకుగన్నులు నిల్కడ లేని కన్బొమల్
మురియుచు నెఱ్ఱవారు జిగి మోవియుఁ దాపముఁ జేయఁగా దగున్
స్మరలిఖితోరుభాగ్యలిపిజాల మనం దగి మధ్యవర్తియై
పరఁగిన రోమరాజియును బాయక తాపముఁ జేయ నాయమే."15ప. శృం. శ.

ఇందును శ్లోకములోని అంశమును విడిచిపెట్టినది లేదు. లేని అంశమును తెచ్చి పెట్టినది లేదు. శబ్దానుసరణము లేదుగాని, అర్థానుసరణము కలదు. ఉద్వృత్త స్తనములు గరువపుఁజన్నులు. తరళనేత్రములు బెళుకుగన్నులు. చలనభ్రూలతలు నిల్కడ లేని కన్బొమలు. రాగాధిష్ఠితమైన ఓష్ఠపల్లవము మురియుచు నెఱ్ఱవాఱు జిగి మోవి. పుష్పాయుధలిఖితసౌభాగ్యాక్షరపంక్తి స్మరలిఖితోరుభాగ్యలిపిజాలము మధ్యస్థరోమావళి. మధ్యవర్తియై పరఁగిన రోమరాజి. శ్లోకమునందు మొదట వ్యథ అని, తర్వాత తాపము అని కలదు. వ్యథ అన తాపమే. పద్యమునందు తాపశబ్దము పునరుక్తమైనను, అర్థము ఆమ్రేడితము. శ్లోకమునందు ఓజోగుణము కలదు. పద్యమునందు ప్రసాదగుణము కలదు. అది గౌడీరీతి. ఇది వైదర్భీరీతి. విషయము శృంగారము. వైదర్భీరీతియే శృంగార రసోచితము. శ్లోకములోని జీవము తీక్ష్ణము. పద్యములోని జీవము సౌమ్యము. ఆంధ్రీకరణమిది కూడ అన్యూనాతిరిక్తమే.

"కిం కన్దాః కందరేభ్యః ప్రళయముపగతా నిర్ఝరా వా గిరిభ్యః
ప్రధ్వస్తా వా తనుభ్యః సరసఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః
వీక్ష్యన్తే యన్ముఖాని ప్రసభమపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖాప్త స్వల్పవిత్తస్మయపవనవశావర్తితభ్రూలతాని. " 25శ్లో. వై. శ.
"ఇలఁ గందంబులు మూలముల్ మడిసెనో? యేర్లింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడం బాడయ్యెనో చూడఁ గే
వలదుఃఖాప్తమితార్థగర్వపవనవ్యావర్తితభ్రూలస
త్ఖలభూపాస్యము లర్థిఁ జూచెదరు భ్రాంతస్వాంతులై యాచకుల్." 25ప. వై. శ.

ఇందు పూర్వార్ధములోని అంశమును విడిచిపెట్టినది లేదు. లేని అంశమును తెచ్చిపెట్టినది లేదు. ఉత్తరార్ధములోని అంశమును విడిచిపెట్టినది కలదు. లేని అంశమును తెచ్చిపెట్టినది కలదు. ఏ మాత్రము వినయము లేని ఖలులని మూలము. ఖలులైన రాజులని తెనుగుసేత. వినయరాహిత్యము విడిచిపెట్టినది. రాజనిర్దేశము తెచ్చిపెట్టినది. మన్నీలని బాలసరస్వతి తెనుగుసేత. ఏడుపుతో కొంచెము గడించి, మిక్కిలి గర్వించువారు రాజులు, మన్నీలు మాత్రమే కారు. ఎవరైనను కావచ్చును. ఖలభూపాస్యము లనుట కంటె, ఖలకోపాస్యము లనుట కొంత నయము. యాచకులకు భ్రాంతస్వాంతములు

తెచ్చిపెట్టినవి. అయినను మఱి అర్థవంతము. కీస వెలితిగ లక్ష్మణకవి తెనుగసేత అన్యూనాతిరిక్తము. బాలసరస్వతి పద్యము బలవదాకృష్టము. లక్ష్మణకవి పద్యము సహజసిద్ధము. సజీవము.

"విపదిధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్. " 52ప. నీ. శ.

"ఆపదలందు ధైర్యగుణ మంచితసంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ బుష్కలవాక్పతురత్వ మాజి బా
హాపటుశక్తియున్ యశమునం దనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ ప్రకృతిసిద్ధగుణంబులు సజ్జనాళికిన్. " 52ప. నీ. శ.

పద్యమునందు "ధైర్యగుణము" అను పాఠము కవిపాఠము కాదు. ధైర్యమే గుణము. ధీరగుణము ధైర్యము మఱల గుణము వ్యర్థము. అంతేకాదు. "ప్రకృతిసిద్ధగుణంబులు " అను పట్టికయందు గుణనిర్దేశము పునరుక్తిదోషము. "ఆపదలందు ధైర్యము సమంచితసంపదలందుఁ దాల్మియున్" అను పాఠమే కవిపాఠమగును. ప్రాదియతిని అఖండయతిగ భావించి పరిష్కరించినది ముద్రితపాఠము.

ఇందు శ్లోకములోని అంశమును విడిచిపెట్టినది లేదు. లేని అంశమును తెచ్చిపెట్టినది లేదు. అభ్యుదయమునకు సమంచితసంపదలనుట అనుగుణము. సదస్సునకు భూపసభాంతరాళమనుట ప్రాసనిమిత్తము మాత్రమేగాక స్పష్టార్థప్రతిపత్తికి సాధకము. వాక్పటుత్వమునకు పుష్కలవాక్పతురత్వము అక్షరమైత్రినిమిత్తము మాత్రమేగాక అర్థవైశద్యమునకు అనుగుణము. వాక్పటుత్వము కంటె వాక్పతురత్వము ప్రధానము. విక్రమమునకు బాహాపటుశక్తి ప్రాసనిమిత్తము మాత్రమేగాక, విక్రమమన బాహాపటుశక్తియే. శ్రుతివ్యసనమునకు విద్యావాంఛాపరివృద్ధి ప్రాసనిమిత్తము మాత్రమేగాక విస్పృతార్థమునకు వినియోగము. ఆంధ్రీకరణమిది అన్యూనాతిరిక్తము.

" బ్రహ్మ యేన కులాలవ న్నియమితో బ్రహ్మాణ్డభాణ్డోదరే
విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసఙ్కటే
రుద్రోయేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే. " 92శ్లో. నీ. శ.

"నలువ కులాలు భంగి నలినప్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతారవననిష్ఠితుఁడయ్యె మురారి దేనిచేఁ
బెలుచఁ గపాలహస్తుఁడయి భిక్షుకుఁ డయ్యెఁ బురారి దేనిచే
నల రవి దేనిచేఁ దిరుగు నా ఘనకర్మము వంద్యమే కదా" 92 ప.నీ.శ.

ఇందు శ్లోకములోని అంశమును విడిచిపెట్టినది లేదు. లేని అంశమును తెచ్చిపెట్టినది లేదు. శబ్దానుసరణము లేదుగాని, అర్థానుసరణము కలదు. "కపాల హస్తుఁడయి" అనునెడ "కపాలపాణియయి" అనిన శబ్దానుసరణము కలసి వచ్చును గాని నడక కుంటువడును. పద్యమునకు నడక ప్రాణము.

తెనుగు నుడికారమును, తెనుగు కాకువును పాటించుట వలన లక్ష్మణకవి పద్యములు భర్తృహరి శ్లోకములను మఱపించునంత శక్తిమంతములు.

"రత్నై ర్మహార్హై స్తుతుషు ర్న దేవా
న భేజిరే భీమవిషేణ భీతిమ
సుధాం వినా న ప్రయయు ర్విరామం
న నిశ్చితార్థా ద్విరమన్తి ధీరా:" 71 శ్లో.నీ.శ.

"తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత
వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
విడిచిరే యత్న మమృతంబు పొడము దనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు." 71 ప.నీ.శ.

ఇది శ్లోకము కంటె శక్తిమంతము.

ఇట్లు అన్యూనాతిరిక్తమైన, నిసర్గరమణీయమైన అస్వతంత్రాంధ్రీకరణపద్ధతి నీతిశతకము నందు మాత్రమేగాక, శృంగారశతకమునందును అసిధారావ్రతమగుట అనన్యసామాన్యము. అత్యంతధీమాన్యము.

"ద్రష్టవ్యేషు కి ముత్తమం? మృగదృశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యేష్వపి కిం? తదాస్యపవనః శ్రావ్యేషు కిం? తద్వచః
కిం స్వాద్యేషు? తదోష్ఠపల్లవరసః స్పృశ్యేషు కిం? తద్వపుః
ధ్యేయం కిం నవయౌవనే సహృదయైః సర్వత్ర తద్విభ్రమాః" 7 శ్లో.శృం.శ.

"చూడంగఁదగిన వస్తువులందు ఘనమెద్ది?
తుల లేక తగు వెలందుల మొగంబు
వలపు గైకొనఁదగు వానిలో నెయ్యది?
మగువల వదనాబ్జమారుతంబు
వీనుల కింపైన వానియందెయ్యది?
కోమలాంగుల ముద్దు గులుకు పలుకు
తనువు సోఁకిన సుఖం బొనరించు నెయ్యది?
మెలఁతల సొబగైన మేనుఁదీవ
యతిమధుర మెద్ది? కాంతాధరామృతంబు
సరసజనులకుఁ జింతింపఁ జాలు నెద్ది?
పువ్వుఁబోఁడుల వెలలేని జవ్వనంబు
వెలయు నెల్లెడఁ బడఁతుల విభ్రమములు." 7 ప.శృం.శ.

శార్దూలవృత్తము సీసపద్యమైనను తెనుగుసేత మూలవిధేయమే. వైరాగ్యశతకము నందు క్వాచిత్కముగ సంక్షిప్తీకరణము కలదు.

"మాతర్లక్ష్మి! భజస్వ కంచిదపరం మత్కాఙ్క్షిణీ మాస్మభూ
ర్భోగేషు స్పృహయాళవ స్తవ వశే కా నిస్పృహాణామసి
సద్యఃస్యూతపలాశపత్రపుటికా పాత్రే పవిత్రీకృతై
ర్భిక్షావస్తుభిరేవ సంప్రతి వయం వృత్తిం సమీహామహే" 93 శ్లో.వై.శ.

"అమ్మా! లక్ష్మి నమస్కా
రమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యారూ
పమ్మున నేలుకొను ముఖ్య ఫల మదియకదా." 93 శ్లో.వై.శ.

శ్లోకమునందు భిక్షాటనము ముఖ్యఫలము. పద్యమునందు విద్యాభివృద్ధి ముఖ్య

ఫలము. భోగవైముఖ్యము సమానము. భిక్షాటనము నాథసంప్రదాయమునకు చెందిన భర్తృహరికి విధ్యుక్తధర్మము. బ్రాహ్మణసంప్రదాయమునకు చెందిన లక్ష్మణకవికి విరుద్ధధర్మము. కనుక సంక్షిప్తీకరణము. " ముఖ్యఫల మదియకదా " అని మూదల.

(పయి శ్లోకములోని "సద్యఃస్యూతపలాశపత్రపుటికాపాత్ర" సమాసము శ్రీనాథుని పూర్వకవితాచర్వణపురస్కారము)

ఏనుగు లక్ష్మణకవి సుభాషితరత్నావళి సుభాషిత - రత్నావళియే.

**రామవిలాసము** : ఇది వాల్మీకి రామాయణములోని బాలకాండమునందలి కథకు ప్రపంచీకరణము. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయమునకు అనుకరణమును కలదు. రామాభ్యుదయమునందు రాయలయుగము రాజిల్లును. రామవిలాసమునందు క్షీణయుగము భ్రాజిల్లును. అయోధ్యానగరవర్ణనము, దశరథరాజవర్ణనము, వసంతర్తు వర్ణనము, దశరథదంపతుల వనవిహార, జలవిహారముల వర్ణనము ప్రథమాశ్వాసము. పుత్త్రకామేష్టి , దేవతల విష్ణుసందర్శనము, రామావతారము, బాల్యవర్ణనము ద్వితీయాశ్వాసము. విశ్వామిత్రాగమనము, రామలక్ష్మణానయనము, బలాతిబలమంత్రోపదేశము, తాటకవధ, మారీచసముద్రపతనము, అహల్యాశాప విమోచనము, మిథిలానగరప్రవేశము, శివధనుర్భంగము తృతీయాశ్వాసము. సీతవిరహము, శీతలోపచారములు, సీతారామ కల్యాణము చతుర్థాశ్వాసము. పరశురామగర్వభంగము, సాకేతనగరప్రవేశము, సీతారాముల వనభవనకేళీవిహారము పంచమాశ్వాసము. ఇది రామవిలాసకావ్యము.

రాముని బాల్యవర్ణనమునందు జానపదగేయప్రభావము కలదు.

"రావే పొందుగఁ జందమామ యిటకున్ రామయ్యతో నాడవే<br>
పోవే కొండకు మంచి తియ్యని ఫలంబుల్ దేనెలు న్గోటివే<br>
ల్దేవే రాఘవు పొత్తునం గుడువవే తేజంబుతో నంచు నీ<br>
శేవ న్వెన్నెలలోన నొక్క చెలి యాడించున్ రఘూత్తంసునిన్. " 81ప.

దశరథనందనులు ఏకసంథాగ్రాహులు. వేదశాస్త్రపురాణేతిహాసపరిజ్ఞాతలు మాత్రమే కారు. చతుష్షష్టికళల, వివిధాయుధవిశేషముల, గతుల, కత్తెరల, మొనల, నఱుకుల, విన్నాణముల, దండల పరిజ్ఞానము కలవారు. (83-84పు.) అంతేకాదు. ఆయుధసాధన రంగస్థానములందు భేతాళపూజలు చేసి, వ్యాయామములు, యోగాభ్యాసములు, బాణ ప్రయోగములు, వ్యూహరచనలు మొదలైనవి చేయువారు కూడ. (84-85పు.) ఇవియెల్ల సమకాలికసమాచారములు. విజ్ఞానసర్వస్వప్రాయములు. అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతిలోని విజ్ఞానసర్వస్వప్రాయరచనకు మార్గదర్శకము.

రాముడు శివుని విల్లెక్కుపెట్టుట చూచి వచ్చిన చెలికత్తెలు సీతకు రాముని గుణగణములు వివరింతురు. అవి విన్న సీత "మీనకేతననిశాతచూతసాయక సంఘాతపాత జాతయాతనాపరిధూతప్రభూతచేతనావృత్తియై చింతచేత నవసె" నట! (104పు.) అంతేకాదు.

" హారము భారమయ్యె వలయవ్రజము ల్దిగజాతె నూర్మికా<br>
వారము కంకణావళుల వైఖరిఁ బూనె సితారవిందధి

క్కారము సేయనేర్చె ముఖకాంతివిశేషము సమ్ముఖాంగనా
కారములెల్లఁ గాంచియును గానకయున్కి పొసంగె బోటికిన్. " 104పు.

ఇంకను విరహతాపము విజృంభించును. చెలికత్తెలు శీతలోపచారములు చేయుదురు. అయినను మెత్తని మెత్త కత్తెరబోను అయినది. చిలుక పలుకలు ములుకు లయినవి. క్రొత్తముత్తియంపుటెత్తులు సున్నపురాసు లయినవి. (105పు.) సీత చంద్రోపాలంభము, మన్మథోపాలంభము, మారుతోపాలంభము సేయును. (106-107పు.) కోకిల పంచమస్వరము కర్ణపూరమై పాన్పుమీద పడి మోహపయోధిని మునుగును. చెలికత్తెలు మఱల శీతలోపచారములు చేయుదురు. (107పు.) చెలికత్తెల కలకలమునకు జనక మహారాజు పత్నీసమేతముగ పరుగెత్తుకొని వచ్చి, ఏమి కోలాహలమని అడిగిన, చెలికత్తెలు చెప్పిన విషయమిది :

"అతనుజ్వరాతురకు ధర
ణితనూజకుఁ జలువపనులు నెఱపితి మిఁక నూ
ర్జితరఘుపతిపరిరంభా
మృతమె యౌషధమనుమీ నృప వినుమీ " 107పు.

విన్న జనకుడు "ఎల్లి వివాహం బగు" నని ప్రకటించును. ప్రకటించక పోయినను "ఎల్లి వివాహ" మే. శివధనుర్భంగము తన్నిమిత్తమే. అయినను సీతకు అతనుజ్వరము! వివాహోత్కంఠ కలుగు సమయమునందు విరహోత్కంఠ సందర్భోచితము కాదు. అంతేకాదు. సీత పరముగ పాత్రోచితము కాదు.

రాముని గృహారామములోని చిన్నియుప్పరిగ వర్ణనమిది :

"నలుగడ దానికి జిలుగు పూఁత పసిండి
పనుల గందంపుఁ గంబములఁ బెంచి
యగరుదూలము లుంచి హవణించి సురదారు
చదరంపుగమి సొంపు గదుర గదిసి
విన్ను ముట్టిన వట్టి వ్రేళ్ళ చప్పరమున
కప్పురంపు హొరంగు గల యరుంగు
నల్పగల్వల తోరణముల దండగ నుండు
బొండుమల్లియ పూవుదండ కడలు
ఘుమ్ము ఘుమ్మన నటఁ దావి గ్రుమ్మరించు
గొనలు నువుఁబువ్వుసురటీలు గుమ్మటిల్లు
చివురు సవురు తివాసీలు చిలుక డాలు
పచ్చ కుర్చీలు సేవంతి పాన్పు చాలు " 127పు.

ఇందు కుర్చీలు, తివాసీలు కలవు. కవికాలములోని కుర్చీలు, తివాసీలు కథాకాలము నందు వేయుట ఎటువంటిదో, క్షీణయుగకావ్యలక్షణములు రామకథాసుధారసమునందు రంగరించుట అటువంటిదే.

రామవిలాసమునందు పూర్వకవితాచర్వణమును కలదు. పోతన(?-) వీరభద్ర విజయములోని పద్యమిది :

"భూకాంత తేరును బూవుల తేరును

నిర్జరసుభటులు స్గిరభటులు
కనకాచలము విల్లు కడు తియ్యనగు విల్లు
మేటి నందిపడగ మీనుపడగ
బహుమంత్రవాజులు పచ్చని వాజులు
పెక్కు దలల నారి భృంగనారి
నలుమొగంబుల యంత నవవసంతుఁడు యంత
పురుషోత్తముం డమ్ము పూవుటమ్ము
వెలయు రేయుఁబగలు వెలిఁగించు కన్నులు
తమ్మికండ్లు త్రిపురదైత్యకోటి
గురి విటవ్రజంబు గురి యతనికి నీకు
నేమి సెప్పవచ్చు నెంత కెంత " 81ప. 2ఆ. వీ. వి.

ఇది రతిదేవి-సపరమేశ్వరుని మీదికి దండయాత్రకు బయలుదేరిన మన్మథునికి వారి తారతమ్యము సమగ్రముగ తెలిపినది. దీనికి సారగ్రహణము రామవిలాసమునందు ఇట్లు కలదు.

"సురగిరి విల్లు శంభునకు సూనము చాపము నీకుఁ బన్నగే
శ్వరుఁడు గుణంబు ధూర్జటికి షట్పదమాలిక నారి నీకు శ్రీ
హరి శర మిందుశేఖరున కబ్జము బాణము నీకు మన్మథా
హరునకు నీకు సామ్యమగునా తగునా బలవద్విరోధముల్" 106పు.

ఇది సీత మన్మథోపాలంభము. వీరభద్రవిజయములోని తారతమ్యప్రసంగము కథాప్రయోజనాత్మకము. రామవిలాసములోని తారతమ్యప్రసంగము కథాప్రయోజ నాత్మకము కాదు. కేవలము పూర్వకవితాచర్వణము.

రామేశ్వరమాహాత్మ్యములోని పురవర్ణమునందలి పూలతోట చాటుకావ్యము. పూర్వో దాహృతము. రామవిలాసములోని రాముని గృహారామవర్ణనమునందలి పారిజాతము చాటుకావ్యము.

"స్తబకములఁ బొల్చి విస్ఫురద్వనుల నలరి
భ్రమరవిలసితవృత్తసంపదలఁ బొదలి
యతులమృదుకలికామంజులతలఁ దనరి
చాటుకృతి రీతి నవపారిజాత మమరు. " 127పు.

భర్తృహరి సుభాషితరత్నావళిని అన్యూనాతిరిక్తముగ, అనన్యాదృశముగ, పరమప్రామాణికముగ, అస్వతంత్రాంధ్రీకరణపద్ధతిని అద్వితీయునిగ ఆంధ్రీకరించిన ఏనుగు లక్ష్మణకవి రామవిలాసము క్షీణయుగలక్షణలక్షితమగుట చిత్రము. ఇతని కృతు లన్నిట సుభాషితరత్నావళియే రత్నకిరీటము.

# పిండిప్రోలు లక్ష్మణకవి

ఇతని కృతులు 1. శకుంతలాపరిణయము. నేడు కానరాదు. 2. లంకావిజయము. రావణదమ్మీయము అని నామాంతరము. గోపాలునికి అంకితము. దైవాంకితము. ఇది "కల్యబ్దములు 4898 శాలివాహనశకాబ్దములు 1716 ఇంగ్లీషు సంవత్సరములు 1897 ఫసలీ 1202 నగు పింగళనామసంవత్సరశ్రావణమాసములో రచియింపనుద్యోగించి" నట్లు (50వచ. పీ.) తెలుపుట విశేషము. ఇందు ఇంగ్లీషు సంవత్సరమును తెలుపుట ఇతోధికవిశేషము. కాఁబట్టి లంకావిజయము లేక రావణదమ్మీయము రచనాకాలము 1797 వ సంవత్సరము.

లంకావిజయము ద్వ్యర్థికావ్యము. అయినను ఒక ప్రత్యేకత కలదు. ఇది రెండు పురాణగాథల యుగళగానము కాదు. ఒక పురాణగాథ, తన స్వీయగాథ మేళవించిన అపూర్వమైన ద్వ్యర్థికావ్యము. స్వీయగాథ కూడ శృంగారగాథ, వైరాగ్యబోధ కాదు. జీవితకథ, జీవనవ్యథ. స్వీయసమస్య అయినను సాంఘికసమస్య. భూమి సమస్య. కలలో కనిపించిన తండ్రి ఆనతిని కావ్యరచనము.

"ఆరెవెట్టం బన్న యూర నుండెడు రావు
బుచ్చయ్య నరసమాపుత్త్రకుండు
దమ్మన్నరావన ధర్మరాయండన
నిరుపేళ్ళ తోడుత నెసఁగు వెలమ
యరయ భద్రయ్య జగ్గయ్య తమ్మయ్య భా
వయ్య ల న్నలుగురి కగ్రజుండు
పుత్త్రాదిసంపత్తి పొసఁగు నతఁడు మన
కుయ్యేరు ప్రీతితో గుత్త సేసి
నీదు లంకమాన్యము బల్మిని హరియించెఁ
గానఁ దత్ప్రాప్తి కై రామకథయును మన
కథయు జత గాఁగ నర్థంబు ఘటనపఱిచి
కృతి రచించి గోపాలున కిమ్ము తనయ." 53ప. పీ.

ఇట్టి భూదురాక్రమణలు ఇప్పటికిని కలవు. ఎప్పటికిని ఉండును కావ్యరచనము పరిష్కారసాధనము కాదు గాని, కవి చేయఁగలిగినది కావ్యరచనమే.

ఇది రెండు ఆశ్వాసముల కావ్యము. రెండు ఆశ్వాసములందును రామకథ, స్వీయకథ కలవు. ప్రథమాశ్వాసములోని స్వీయకథ కుటుంబచరిత్ర. ద్వితీయాశ్వాసము లోని స్వీయకథ ప్రధానమైన లంకమాన్యము చరిత్ర. లక్ష్మణకవి లంకమాన్యమును అధికారబలము కల దమ్మన్న అపహరించును. లక్ష్మణకవి ఎన్ని విధముల బ్రతిమాలినను తిరస్కరించును. అతని తమ్ములు, కుమారులు తగదని చెప్పిన వారిపై కోపగించును. నయభయముల అడిగి విఫలుడైన లక్ష్మణకవి భగవంతుని మీద భారము వైచి, ధమ్మన్న మీద తిట్టుకవిత్వము ప్రచారము చేయును. ప్రజాసానుభూతి లభించును. దమ్మన్నకు అప్రతిష్ఠ సిద్ధించును. దమ్మన్న పెద్ద భార్య కూడ దమ్మన్నకు గట్టి హితబోధ చేయును. అయినను దమ్మన్న లెక్కసేయడు. భగవదనుగ్రహము, తిట్టుకవిత్వము ప్రభావము

వలన దమ్మన్న శరీరపటుత్వము సన్నగిల్లును. స్వర్గస్థుడగును. లంకమాన్యము లక్ష్మణకవికి ప్రాప్తించును. కావ్యమునందు తిట్టుకవిత్వము లేకపోవుట విశేషము. అది లక్ష్మణకవి ఔచిత్యదృష్టికి నిదర్శనము.

ఇందు రామకథ, స్వీయకథల పరమైన శ్లేష కంటె, సంస్కృతాంధ్రకవుల మూలకమైన శ్లేష చమత్కారజనకము. ఎంత ప్రాధేయపడినను మాటాడని ధర్మన్నకు లక్షణకవి తన సామర్థ్యమును ప్రకటించిన సందర్భములోని పద్యములివి :

"ఒనరు మద్వాక్కులం దెలుంగునకు బద్దుఁ
డగును వాగనుశాసనుఁడైన నమ్ము
మలఘుమద్దివ్యగోచయంబులకు బద్దుఁ
డగును శ్రీమనోవసుచోరుఁడైన నిజము." 59ప. 2ఆ.

"నా వాక్కుల ధ్వనికి బ్రహ్మ బద్ధుడగును. బాణములకుశ్రీమహావిష్ణువు బద్ధుడగును." అని రావణుడు సీతతో అన్నట్లు రామకథాపరము. "నా తెలుగు కవితావాక్కులకు నన్నయభట్టు బద్ధుడగును. సంస్కృతకవితావాక్కులకు చోరకవి బద్ధుడగును అని లక్ష్మణకవి దమ్మన్నతో అన్నట్లు స్వీయకథాపరము.

"తెలియ విను రామకవ్యా
దులు సూరకవిప్రముఖప్రధుప్రతిభావం
తులు భీమశ్రీనాథులు
వెలయఁగ నా కరణి దిట్టలే రూఢమతిన్." 61ప. 2ఆ.

"సీతా! పితృదేవతలు (కవ్యమును తినువారు), సూర్యుడు, శుక్రుడు, శివుడు, విష్ణువు నా వలె దిట్టలు కారు." అని సీతతో రావణుడు అన్నట్లు రామకథాపరము. "తురగా రామకవి, అడిదము సూరన, వేములవాడ భీమన, శ్రీనాథుడు మొదలైన కవులు నా వలె తిట్టలేరు." అని దమ్మన్నతో లక్ష్మణకవి అన్నట్లు స్వీయకథాపరము.

వేములవాడ భీమన, తురగా రామకవి, అడిదము సూరన తిట్టుకవులుగ సుప్రసిద్ధులు. శ్రీనాథుడు కాడు. ఒకటి రెండు చాటువులను బట్టి ఊహ్యము.

దమ్మన్న తమ్ముడు భద్రయ్య అన్నకు హితబోధ చేసిన సందర్భములోని పద్యములు :

"లలి భూతలంబునం దెలుఁగుల రా జంబ
వత్సమాఖ్య ప్రసిద్ధి వఱలెడు నివు
ణుండు వాగనుశాసనుఁడు తిమ్మఁ డొకఁడు ధూ
ర్జటి రామలింగసంజ్ఞాప్రథితుఁడు
బుధవరుల్ భాస్కరపోతన లాదిక
వనచారులు మఱియు నసుపమాన
కృతి రామభద్రుండు శ్రీనాథుఁడుగణింపఁ
దత్సముల్ తదధికుల్ ధరణి లేరు
కళల సోముండు పెద్దన్న కరణి వెలయు
చుండు రెండవ వీరుఁ డనూనమతి ని
రూపణము సేయఁ గుండలింద్రుండు సుమ్ము
లక్ష్మణాఖ్యుఁడు గానఁ జలంబు విడుము." 209ప. 2ఆ.

"జాంబవంతుడు బ్రహ్మాంశసంభూతుడు, హనుమంతుడు శివాంశసంభూతుడు, (రాముని చిహ్నమైన అంగుళీయకము చేత ప్రసిద్ధుడు కూడ.) సూర్యపుత్త్రుడైన సుగ్రీవుడు, నలుడు మొదలైన వానరులు దేవతాంశసంభూతులు. సాటిలేని రామభద్రుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. రెండవ వీరుడైన లక్ష్మణుడు షోడశకళాపరిపూర్ణుడైన చంద్రుడు. ఆదిశేషువు అవతారము. పెద్దన్న రాముని వంటి వాడు. కాఁబట్టి పట్టుదల విడిచిపెట్టుము " అని విభీషణుడు రావణునితో అన్నట్లు రామకథాపరము. "రాజమ్మ పుత్త్రుడు లక్ష్మణకవి - నన్నయ, నందితిమ్మన, ధూర్జటి, తెనాలిరామలింగము, హుళక్కి భాస్కరుడు, పోతన, అయ్యలరాజు రామభద్రుడు, శ్రీనాథుడు, నాచనసోమనాథుడు, అల్లసాని పెద్దన, పిల్లల మఱ్ఱి పినవీరన, తిక్కన వంటి మహాకవి, కాఁబట్టి పట్టుదల వదలిపెట్టుము " అని భద్రయ్య దమ్మన్నతో అన్నట్లు స్వీయకథాపరము.

"బాణుని భారవిన్ ఘనసుబంధుని నా భవభూతి సర్వగీ
ర్వాణపదంబులం గొనిన వారిఁ దదన్యుల విందుమే కదా
క్షోణిని వారికన్న మతిసూక్ష్ముఁ డవారణవిద్య నిన్ను ని
ష్ప్రాణునిఁ జేయు నాతఁ డరయం బురుషోత్తముఁడౌ కతంబునన్. " 115ప. 2ఆ.

"బాణాసురుని, కాంతియందు సూర్యుని వంటి వానిని (?), ఘనుడైన మంచి బంధువు కల వానిని (వృత్రాసురుని?) శివుని వలన విభవము పొందిన వానిని, (భస్మాసురుని?) సమస్తదేవతల పదవులు ఆక్రమించిన వారిని (హిరణ్యాక్షహిరణ్య కశిపులను?) తదితరరాక్షసులను విందుము కదా! వారి కంటె నీవు రణవిద్యయందు సూక్ష్మబుద్ధివా? - రాముడు విష్ణువైన కారణమున నిన్ను విగతప్రాణుని చేయును. " అని విభీషణుడు రావణునితో అన్నట్లు రామకథాపరము. " భట్టబాణుని, భారవిని, ఘనుడైన సుబంధుని, భవభూతిని, సర్వగీర్వాణశబ్దజ్ఞులైన తదితరసంస్కృతకవులను విందుము కదా! వారి కంటెను సూక్ష్మబుద్ధి అయిన లక్ష్మణకవి పురుషశ్రేష్ఠుడైన కారణమున నిన్ను విగతప్రాణుని చేయును" అని భద్రయ్య ధర్మయ్యతో అన్నట్లు స్వీయకథాపరము.

" వేయును జెప్ప నేమిటికి విన్మొక వాక్యము నీవు క్రొత్తగా
నాయన కాలిదాసుఁడవు నాటకు లో ననుమానమొంద కా
ధీయుతు క్షేత్రమాతనికిఁ దెల్పి నొసంగెదవేని నిత్యభూ
త్యాయురుదారకీర్తు లలరారఁగ నుందువు భోగసంపదన్. " 116ప. 2ఆ.

"పెక్కు మాట లేల? ఒక్క మాట వినుము. క్రొత్తగా రాముని పాదసేవకుడవగుటకు మనస్సులో సంశయము చెందకు. ఆ ధీశాలి భార్యను ఆయనకు తెలివి తెచ్చుకొని ఇచ్చినచో నిత్యవైభవము, ఆయుర్దాయము, ఘనకీర్తి కలిగి భోగభాగ్యములతో తులఁదూగుదువు " అని విభీషణుడు రావణునితో అన్నట్లు రామకథాపరము. " పెక్కు మాట లేల? ఒక్క మాట వినుము. లక్ష్మణకవి అభినవకాళిదాసు అగును. అందుకు మనస్సులో సంశయము చెందకు, ఆ ధీశాలి లంకమాన్యమును ఆతనికి తెలివి తెచ్చుకొని ఇచ్చినచో - నిత్యవైభవము, ఆయుర్దాయము, ఘనకీర్తి కలిగి భోగభాగ్యములతో తులఁదూగుదువు' ' అని భద్రయ్య దమ్మన్నతో అన్నట్లు స్వీయకథాపరము.

ఇట భద్రయ్య విభీషణుడు. దమ్మన్న రావణాసురుడు. ఇక లక్ష్మణకవి తిట్టుకవిత్వము ప్రచారమునకు అప్రతిష్ఠపాలైన దమ్మన్నకు అతని పెద్ద భార్య సునీతి మంద

లించిన సందర్భములోని పద్యము :

> "నిక్కపుఁ బాపశీలు నకు నీకుఁ గళత్రము నొట నాత్మలోఁ
> బొక్కుచునుందు నా కరయఁ బుణ్యసతీత్వము లేదు లేదిఁకన్
> దిక్కయయో యనంగ గురుదివ్యకళాంచితుఁ డౌచు ధాత్రిఁ బెం
> పెక్కిన లక్ష్మణాగ్రజుని కింపగు క్షేత్రము నీ వొసంగమిన్. " 200ప. 2ఆ.

"అయయో! మన్మథుని తండ్రి విష్ణువు యొక్క దివ్యకళాంచితు డగుచు మించిన రామునికి సీతను నీవు ఒసగక పోవుట వలన నాకు పుణ్యసతీత్వము లేదు. ఇక దిక్కును లేదు. " అని మండోదరి రావణునితో అన్నట్లు రామకథాపరము. "తిక్కనయో అన గురు దివ్యకళాంచితు డగుచు మించిన లక్ష్మణకవికి లంకమాన్యము నీవు ఒసగక పోవుట వలన నాకు పుణ్యసతీత్వము లేదుగాక లేదు " అని సునీతి దమ్మన్నతో అన్నట్లు స్వీయకథాపరము.

ఇట సునీతి మండోదరి కంటె మాననీయ.

ఇట్లు సంస్కృతాంధ్రకవులను కథాభాగమున సంస్తుతించుట కావ్యసాధారణము కాదు. పురాణకథను సాంఘికకథను జోడించుట ద్వ్యర్థికావ్యసాధారణము కాదు. స్వీయకథ అయినను సాంఘికకథను పురాణకథను మేళవించిన లంకావిజయము లేక రావణదమ్మీయము అపూర్వమైన ద్వ్యర్థికావ్యము.

# పరవస్తు చిన్నయసూరి

ఇతని జీవితకాలము[71] 1806 - 1862 కృతులు 1. సూత్రాంధ్రవ్యాకరణము, (1842) 2. శబ్దలక్షణసంగ్రహము. (1853) 3. నీతిచంద్రిక (1853) 4. బాలవ్యాకరణము (1856) 5. హిందూధర్మశాస్త్రసంగ్రహము - సంయుక్తరచన (1858) 6. నీతిసంగ్రహము - భారతములోని నీతిపద్యముల సంకలనము (1870) 7. విభక్తిబోధిని (1870) 8. అక్షరగుచ్ఛము (1886) 9. ఆంధ్రశబ్దశాసనము (1931) 10. పద్యాంధ్రవ్యాకరణము (1931) (కుండలీకరణములలోని సంఖ్యలు ముద్రణసంవత్సరములు) 11. నిఘంటువు అముద్రితము. సూర్యరాయాంధ్రనిఘంటువునందు నిక్షిప్తము. చి. ని అని ఉదాహృతము. 12. విశ్వనిఘంటుటీక (అనుపలబ్ధము) 13. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య (అనుపలబ్ధము.)

ఇందు నీతిచంద్రిక వచనకావ్యము. మూలము పంచతంత్రహితోపదేశములు.

"ఒనరఁగాఁ బంచతంత్రహితోపదేశ
ములను బరికించి వానిలో వలయు నంశ
ములను గొని కొంత యభినవంబుగను గూర్చి
కృతి యొనర్చెద నీతిచంద్రిక యనంగ. " 5ప. నీ. చం.

ఇందు పంచతంత్రహితోపదేశములను పరికించి, వలయు నంశములు గైకొని, కొంత అభినవముగ కూర్చినట్లు కలదు. కనుక స్వతంత్రాంధ్రీకరణము. ఇది రచించుటకు ఇతనికి రెండు ఆశయములు కలవు. 1. బాలురకు భాషాజ్ఞానము 2. బాలురకు నీతికుశలత్వము.

"తుదముట్టఁగ నీ కబ్బము
పరిలముగాఁ జదివినట్టి బాలుర కోలిం
బొదలును భాషాజ్ఞానము
కుదురుం గొదలేక నీతికుశలత్వంబున్. " 6ప. నీ. చం.

ఇందు నీతిచంద్రిక కబ్బము అని ఇదమిత్థముగ కలదు. కబ్బమన కావ్యము. "బాలుర కోలిం బొదలును భాషాజ్ఞానము " అనగా బాలురకు క్రమముగ భాషాజ్ఞానము కలుగునని అర్థము. కాఁబట్టి బాలురకు క్రమముగా భాషాజ్ఞానము కలిగించు విధానము నీతిచంద్రిక రచనాప్రణాళికలోని విశేషము. అంతేకాదు. బాలవ్యాకరణమునందు ఇట్లు కలదు[72].

"ఆ (పూర్వ) లక్షణగ్రంథములు చదువువారికి నిస్సందేహముగా
వచనరచన సేయు కౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరి
శ్రమము చేయక కానేరదు. . . . . . . . . కాఁబట్టి యిట్టి కొఱఁత
వారింపఁబూని పెక్కు లక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీ
లించి రచనాప్రణాళిక నిర్ణయించుకొని నా నేర్చుకొలఁదిని సంస్కృత
భాషలో సూత్రగ్రంథమొకటి కావించితిని ఆగ్రంథము బాలురకు
సుసాధము గాకుండుటవలన దానియందలి సూత్రములు కొన్ని
తెనిఁగించి ప్రకృతగ్రంథరూపముగా రచించినాఁడ. "

ఇందు వచనరచన సేయు కౌశలము బాలురకు అని ఇమిడియున్నది. వచనరచన

అన పద్యరచనము, గద్యరచనము కావచ్చును. కాని నీతిచంద్రిక పద్యకావ్యము కాదు. వచనకావ్యము. కావున వచనరచన ఇచట పద్యరచనము కాదు; గద్యరచనమే కావలయును. బాలురకు భాషాజ్ఞానము, వచనరచనాకౌశలము, నీతికుశలత్వము చిన్నయసూరి ఆశయములు.

అయిన బాలురు ఎవరు? అని ప్రశ్నించిన, వెంటనే "గ్రహణధారణ పటుర్బాలః" అను పండితసమాధానము వచ్చును. అది శాస్త్రార్థము కాని చరిత్రార్థము కాదు. అది కూడ గమనార్హమైన విషయము.

నీతిచంద్రిక ప్రథమముద్రణమునందు "పె. చిన్నయసూరి తెలుగు హెడ్మాస్టర్ ఆఫ్ ది మద్రాసు యూనివర్సిటీ అని కలదు- ద్వితీయముద్రణమునందు (1856) మద్రాసు యూనివర్సిటీ యను శాస్త్రపాఠశాలయందు నాంధ్రంబునకుం బ్రథమోపాధ్యాత్వము వహించు పరవస్తు చిన్నయసూరిచే రచియింపఁబడినది." అని కలదు. రాజధాని ఉన్నతపాఠశాల (1840) రాజధానికళాశాల (1853) అప్పటి మదరాసు యూనివర్సిటీ. అందలి విదేశీయులతోపాటు స్వదేశీయులును విద్యార్థులు. స్వదేశీయులైన విద్యార్థులే చిన్నయసూరి బాలురు.

నీతిచంద్రిక పూర్వార్ధము పరిశీలించిన, ప్రణాళికానుగుణమైన రచనము ప్రస్ఫుటమగును. భాషాజ్ఞానక్రమపరిప్రాప్తి బహువిధభాసమానము.

మిత్రలాభమునందు తేట తెనుగు తేలిక మాటల అలతి అలతి వాక్యములు అత్యధికము. సంస్కృతపదములు, పదబంధములు అత్యల్పము. పదబంధములైనను రెండేసి పదముల బంధములు ఎక్కువ. మూడేసి పదముల బంధములు తక్కువ. నాలుగేసి పదముల బంధములు నామమాత్రముగనైన లేవు. రెండేసి, మూడేసి పదముల బంధములు అల్పసమాసములు. అంత కంటె అధికమైనవి దీర్ఘసమాసములు, సుదీర్ఘసమాసములును అగును. అవి మచ్చునకైన లేవు. అంతేకాదు. పాత్రల సంభాషణలు వ్యవహారసరళికి అత్యంతసన్నిహితములు.

> " తల్లిదండ్రులు చెప్పినట్టు విని చదువుకొని లోకులచేత మంచి వాఁడనిపించు కొన్నవాఁడు బిడ్డఁడు గాని తక్కినవాఁడు బిడ్డఁడా? మూర్ఖుఁడు కలకాలము తల్లి దండ్రులకు దుఃఖము పుట్టించుచున్నాఁడు. అట్టి వాఁడు చచ్చెనా తల్లిదండ్రులకు దుఃఖము నాఁటిలోనే తీఱుచున్నది. కులమునకు యశము దెచ్చిన వాఁడు పుత్త్రుఁడు గాని తల్లి కడుపు చెఱుపఁబుట్టినవాఁడు పుత్త్రుఁడు గాఁడు...." 17-21, 1-2 పం 3-4 పు.

> "ఒకనాఁడు వేకువ లఘుపతనకమను వాయసము మేలుకొని రెండవ యముని వలె సంచరించుచున్న కిరాతునిఁ జూచి "వఱువాత లేచి వీని మొగము చూచితిని. నేఁడేమి కీడు రాఁగలదో తెలియదు. వీఁడు వచ్చిన చోట నిలువఁదగదు. జాగు చేయక యీ చోటు విడిచి పోవలె"నని యత్నము చేయుచుండఁగా వాఁడా వృక్షమునకు సమీపమందు నూక లు చల్లి వలపన్ని పోయి చేరువ పొదలో దాఁగి పొంచి చూచుచుండెను."
> 6-13 పం. 6పు.

"నేను నక్కను. నా పేరు సుబుద్ధి. నా బంధువు లందఱు నన్నొంటిఁజేసి పోయిరి. ఈ యడవిలో మృతకల్పుఁడనయి యున్న వాఁడను. మఱి యెవ్వరితోఁ గాదు దైవముతోఁ జెప్పుచున్నాను. నిన్నుఁ జూడఁగానే నా బంధువు లందఱు వచ్చినట్లు తోఁచినది. సజ్జనదర్శనము సమస్తదోషములు పోఁగొట్టును; సర్వశుభము లిచ్చునని పెద్దలు చెప్పుదురు. దాని కిదే తార్కాణము. నేను నీతోడ సావాసము చేయవలెనని మిక్కిలి కోరుచున్నాఁడను. నా కోరిక నెఱవేర్పుము." 10-17 పం. 14పు.

" వీఁడు తనవాఁడని వీఁడు పరుఁడని యెన్నిక లఘుబుద్ధులకు; మహాత్ములకు లోకమే కుటుంబము. ఈ మృగము నాకు బంధువయి నట్లు నీవు కావా? ప్రపంచ మున్నంత కాలము బ్రతుకఁబోము. ఎప్పుడో కాలుఁడు మ్రింగఁ గాచియున్నాఁడు. ఉన్న కాల మందఱికి మంచివాఁడనిపించుకొని పోవలెఁగాని యిట్టి విషమబుద్ధిచేత ఫలమేమి? అనగా విని మృగ మిట్లనియె. " 19-25 పం. 18పు

"నీవు చపలుఁడవు. చపలునితో మైత్రి సర్వథా చేయరాదు. ఇంతేకాదు. మాకు నీవు శత్రుపక్షము వాఁడవు. ఎంత మంచివానితోఁ గాని దయతో సాంగత్యము చేయరాదు. కాఁబట్టి నీతో నాకు నేస్తము సరిపడదు. అశక్యము శక్యము గాఁబోదు. శక్య మశక్యము గాఁబోదు. జలము మీఁద బండ్లు నేల మీఁద నావలు నడచునా? నీ పని చూడు. మిక్కిలి ప్రొద్దెక్కినది .పని విచారించుకో. పో పో. " 14-22 పం. 22పు.

"ధనవంతునికే పౌరుషమును, మేధాసంపత్తియు, బంధుమిత్రులును గలుగుదురు! పుత్రమిత్రవిరహితుని గృహమును, మూర్ఖుని చిత్తము ను శూన్యములు. దారిద్ర్యము సర్వశూన్యము.. దారిద్ర్యము కంటె మరణము మేలు. మరణ మాపాతయాతనావహము. దారిద్ర్యము యావ జ్జీవము తీవ్రవేదనాకరము. ఇంద్రియముల, నామమున, బుద్ధిని, వచోధోరణిని బురుషుఁడు తొంటి వాఁడయ్యు ధనమును బాసిన క్షణము ననే లాఁతి వాఁడగును. ఇది మహాచిత్రము. "

20-24, 1-4పం. 28-29పు.

"ఒరుల కిచ్చి తాను భుజించినదే తన సొత్తు. పరుల కీక తాను గుడువక కూడఁబెట్టిన ద్రవ్యము చచ్చిన తఱి వెంటరాఁబోదు. అని చెప్పి కూర్మము మఱియు నిట్లనియె. మిగిలిపోయిన దిప్పుడు త్రవ్వుకోనేల? పోనిమ్ము. బుద్ధిమంతులు రాని దాని కెదురు చూడరు. పోయిన దానికి వగవరు. విపత్తు వచ్చినప్పుడు వితాకు పడరు. కాఁబట్టి మిత్రుఁడా! సదా నీ వుత్సాహముతో నుండుము. శాస్త్రములు చదివియు మూర్ఖులయి యున్నారు. పురుషుఁ డెవ్వఁడు క్రియావంతుఁడు వాఁడు విద్వాం సుఁడు. " 18-23, 1-3పం. 33-34పు.

"చెలికాఁడా! నీవు పరుల సొమ్మున కాశపడవు. పరులను బాధింపఁ బోవు. అడవిలోని గడ్డి మేసి పడియనీరు త్రాగి యొక చెట్టునీడలోఁ బడి యుండి ప్రొద్దుఁబుత్తువు. నీవొక్క కీడుఁజేఁత యెఱుఁగవు. నీవంటి సాధువునకా యిట్టి యాపద రావలె! ఇంత దూరము చింతింపనేల? ఎంత

> వారికిఁ గాని దైవ మలంఘ్యము. ప్రాప్తించిన వ్యసనమునకుఁ బ్రతికారము విచారింపవలెఁగాని తిచ్చవడి యుండఁదగదు. " 24, 1-6పం. 38-39పు.
>
> "మేను నిప్పులఁ బొరలిన ట్లెరియుచున్నది. చిత్తము స్వాయత్తము గాదు. కర్తవ్య మిట్టిదని మాకుఁ దోఁచినది గాదు. నీవు బుద్ధిశాలివి. నీకుఁ దోఁపని యుపాయము లేదు. చెలికానిని విపత్సముద్రము దరి చేర్చి శోకసముద్రము దరిఁ దరి వలె మమ్ముఁ జేర్పుము. నీవు దక్క మా కన్యము శరణము లేదు. కర్తవ్యమును మా కుపదేశింపుము. నీ పంపు శిరసావహించి చేసెదము. " 18-24పం. 45పు.

మిత్రభేదము మిత్రలాభమునకు ఇంచుమించు రెట్టింపు కలదు. ఇందు తేటతెనుగు తేలిక మాటల అలతి అలతి వాక్యములు అత్యధికము. సంస్కృతపదములు, పదబంధ ములు మిత్రలాభమునందు కంటె ఎక్కువ. నాలుగేసి పదముల అల్పసమాసములు పది, అయిదేసి పదముల అల్పసమాసములు తొమ్మిది, ఆరేసి పదముల అల్పసమాస ములు రెండు, అంతకంటె అధికమైన పదముల దీర్ఘసమాసములు ఆరు, సుదీర్ఘ సమాసములు రెండు కలవు. సగము పైగా గ్రంథము సాగిన మీదట సంస్కృతసూక్తులు ఏడు కలవు. అంతేకాదు. తేటతెనుగు తేలికమాటల పెద్దపెద్ద వాక్యములును అక్కడక్కడ కలవు.

నాలుగేసి పదముల అల్పసమాసములు :

1. " ఆరామతటాకాదిప్రతిష్ఠల " 4పం. 53పు.
2. " ఖండితశుండాదంతకాండంబులు " 8పం. 63పు.
3. " దూరితతారళ్యవిస్తారితనయనుండు " 8పం. 68పు.
4. " చిరసంచితధనసంచయంబు " 14పం. 69పు.
5. " సంతోషభరాక్రాంతస్వాంతుండు " 19పం. 69పు.
6. " బాష్పవారిపూరితలోచనంబు " 5పం. 74పు.
7. " స్తనగమనసామ్యాసహనత్వంబు " 4పం. 78పు.
8. " స్వామికార్యహతప్రాణుండు " 24పం. 100పు.
9. " హస్తిమస్తకవిదళనఖరంబులు " 22పం. 101పు.
10. " భవదీయదుర్మంత్రశ్రవణఫలంబు " 2-3పం. 113పు.

అయిదేసి పదముల అల్పసమాసములు:

1. " ప్రళయసమయపర్జన్యగర్జానుకారి " 23, 1పం. 49, 50పు.
2. " సోపప్లవకారణమారణప్రహరణంబులు " 5-6పం. 78పు.
3. " పారిప్లవేతరవిస్తారితచారులోచనలు " 14పం. 78పు.
4. " సూచీముఖాలంకృతనాసికాగ్రలు " 17-18పం. 78పు.
5. " మధ్యందినవిద్యోతమానఖద్యోతమండలుండు " 22పం. 82పు.
6. " ప్రతీపప్రతాపదీపనిర్వాపణమహోబలుండు " 17-18పం. 96పు.
7. " దందశూకసందోహపరివేష్టితపటీరవిటపి. " 10-11పం. 101పు.
8. " నవశృంగనిస్సరజ్ఝరీపూరంబు " 20పం. 112పు.
9. " కులవిద్యారూపగుణవిహీను " 19పం. 118పు.

ఆఱుపదముల అల్పసమాసము :

1. " పరస్పరకరకమలసమీరితవారిధారల " 15-16పం. 77పు.

ఏడుపదముల దీర్ఘసమాసము :

1. " నిజఖరనఖదారితహస్తమస్తమస్తిష్కము " 12పం. 56 పు.

దీర్ఘసమాసములు :

1. "అనాదరసూచకమందహాసరోచిరుదంచితసుందరవదనుండు"20-21పం.67పు
2. " ఆర్ద్రాదంశుకోత్తరీయాంతర్గతనిస్తులస్తనస్తబకంబులు " 19-20పం. 77పు.
3. " తత్రత్యకాలవ్యాళవినాశపిశునోల్కాపాతానుకారి " 15-16పం. 79పు.
4. " నిజపక్షవిక్షేపజాతవాతోద్ధూతకాండకాండచండబలుండు " 21పం. 104పు.
5. " చక్రచక్రాంగప్రముఖవివిధజలవిహంగమసంచారరమ్యంబు " 10పం. 105పు.
6. " పుండరీకషండసాంద్రమరందధారాసారసంభ్రమద్భ్రమరఝుంకారసంకులంబు" 11-12పం. 105పు.

సుదీర్ఘసమాసములు :

1. " చిరంతనాత్మీయధర్మసంశయనిరాకరణచణప్రస్తుతప్రకరణార్థ శ్లాఘమానుండు. " 9-10పం. 68పు.
2. " అస్పందమిళిందసుందరవికసితకుసుమరాజివిరాజమానమల్లికా వల్లికావిభ్రమానుకారిణులు " 14-16పం. 78పు.

సంస్కృతసూక్తులు :

1. " సహసా విదధీత నక్రియామ్. " 24పం. 87పు.
2. " నీచా: కలహ మిచ్ఛన్తి సన్ధి మిచ్ఛన్తి సాధవ: " 22-23పం. 92పు.
3. " శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్. " 23పం. 100పు.
4. " యథా రాజా తథా ప్రజా " 6పం. 103పు.
5. " జీవన్ భద్రాణి పశ్యతి. " 20పం. 103పు.
6. " వినాశకాలే విపరీతబుద్ధి: " 14పం. 111పు.
7. " పృష్ఠతాడనా ద్దన్తభఙ్గ: " 17పం. 121పు.

పెద్ద పెద్ద వాక్యములు :

" అని విచారించి పరదేశమునకు వలసిన తన దేశమందలి మేలు సరకులు సేకరించుకొని పెక్కు సరకులు బండ్ల మీఁద గుఱ్ఱముల మీఁద వేసడముల మీఁద నెత్తించి కొన్నిటికి భారవాహులను నియమించి మంచి కంచర మొకటి సిద్ధము చేసికొని దానిని సంజీవక నందకములను నఱ్ఱిలను బూన్చి యెక్కి సముచిత పరివారముతో నుత్తరదేశమునకుఁ బయనమాయెను. " 7-13పం. 48పు.

ఇట్లు కొన్ని ఘట్టములు, కొన్ని కథలు ఏకవాక్యములు. ఒక కథ మొత్తము ఒక్క వాక్యము. అందు జలక్రీడ వర్ణనము అనన్యాదృశము. జలక్రీడవర్ణనము లేని కావ్యము లేదు. ఇంత సహజసుందరమైన, సభ్యతాసముచితమైన జలక్రీడ వర్ణనము కల కావ్యమును లేదు.

" - ఒక్క లతాంగి దోయంబులు దోయిలించి దోయిలించి యొక్క తోయజాక్షి పయిం జల్లి యది మాఱుకొని "యేదేది నిలువక చల్లుమా చూత"మనుచు మీఱం జల్లిన ధారాసారంబునకుఁ దాళంజాలక కేలొడ్డి పెడమొగంబిడి పెఱకేలెత్తి మ్రొక్కుచు నమ్మమ్మ జాలుంజాలు నీ జోలికిక రాను మానుమన నయ్యది యిస్సిరో యింత పిఱికివేనా, మఱి యొక్క తెఱవ నెఱజాణ వేని నావంక మఱలుము చిఱుతుక దానితోడనా యింత బింకంబులు పొంకించెదవని పురికొలిపి తాను నదియు మలంగక తొలంగక పట్టు వదలక నట్టుగదలక పరస్పరకరకమలసమీరితవారిధారల లోఁగక తోఁగుచు నొండొరుల హెచ్చుచు మెచ్చుచు నిదియేటి సుమాళంబె చాలుఁ జాలు మీ యాలంబు చాలింపుండని తోడివారలు వారింప దరహాసాంకూరంబులాననాంబుజంబుల నలంకరింప నార్ద్రాంశుకోత్తరీయాంతర్గతనిస్తులస్తనస్తబకంబు లుబ్బి నిబ్బరంబుగ నిక్కం గడు రోఁజుచు నిలువంబడ మఱికొందఱు ముద్దియ లుద్దులయి యొండొరువుల రవణంబులు పణంబుగఁ బన్నిదంబు సఱిచి పారంబు సేర వేగంబు మీఱ నీఁదుచుం బోవనేల యూరక కరంబు కలగుండు పఱచెదరే యని లాఁతి చేడియలాడ మనలంజేరిన వారి కతను క్షోభంబు దుర్వారంబు గాదె? యని చదురు లాడుచుం బారంబు ముట్టుచు ముట్టని వారిం గరంబులం జప్పటలు గొట్టి యోడితి రోడితి రని గేలిసేయుచు స్తనగమనసామ్యాసహనత్వంబునం బోలె రథాంగ చక్రాంగంబులం బాఱందోలుచు సోపప్లవకారణమారప్రహారణంబులను నీరసంబునం బోలె సారసంబులం దునుముచు జలవిహారంబు సలుపుచుండ - " 6-24, 1-7పం. 77, 78పు.

**అలతి అలతి వాక్యములు :**

" మఱి సద్దు గానము. నీవును వింటివి గదా? ఇదియేమి? ఇంతకాలమాయెను. ఈ యరణ్యములో నున్నాము. ఇట్టి బెట్టిదపుఁగూఁత యెన్నడు గాని విన్నది లేదు. అనిన దమనకుం డిట్లనియె. ఔనౌను. ముందు విన్నది గాదు. ఈ శబ్దము మహాశ్చర్యము. అదిగోఁ జూడు మన రాజు పింగళకుఁడు యమునాకచ్ఛమునకుఁ బోవువాఁడు రాపడి నిలుచున్నాఁడు. ఈ ధ్వని విని కాఁబోలు. అని చిఱునవ్వు నవ్వి యంతవాఁడట్లాయెను. మన మనఁగా నెంతవారము? 7:15పం. 50పు.

" - నీవు నేర్పిన నీతులన్నియుఁ బెల్లుగ వల్లించితివి గాని నా పలుకొకటి యయినఁ జెవిఁ జొరనిచ్చితివె? తన్నుఁగట్టఁ ద్రాళ్ళు దాఁదెచ్చుకొన్నట్లు రాఁగల హాని గానక ఆనితోడ లేని పెద్దఱికంబులు కొన్ని నోరి కసిదీఱ నా యెద్దునకుం గలుగం బలికి చెలికారంబు చేయించితివి. ఇప్పు డనుభవింపక తీరునె? ఇది నీ నేరమిం గాదె? " 24, 1-6పం. 66-67పు.

" స్వామీ! మతివిహీనుండనయి మహాపరాధంబు గావించితిని. నా వలనం గరుణింపుఁడు. క్షమియింపుఁడు. భృత్యుండు స్వాపరాధంబు స్వామికి నివేదింపక మొఱంగం జనదు. మొఱంగిన వాఁడు రెండు

> లోకంబులకుఁ గాక చెడు. అది యట్లుండనిమ్ము. పెక్కండ్ర మనుగడకు మూలంబగు పుణ్యపురుషున కొక్క యెడరు వాటిల్లిన నది యెక్కటి శోచ్యంబు గాని మాదృశుండు క్షుద్రుం డొక్కరుండు పొలిసిన దానం గొఱంత లేదు. దాన లోకం బస్తమింపదు. " 14-22పం. 84పు.
>
> "దమనకా! వినుము. కలకాలంబు బ్రదుకంబోము. చావు నిక్కంబు. మన కన్నుముందఱం బుట్టి గిట్టిన వారి నెందఱం గానము. నిన్న యున్న వాఁడు నేఁడు లేఁడు. నేఁడు పగతు మొగంబునకుం దొలంగిన తేవు మృత్యువు మొగంబునకుం దొలంగవచ్చునె? దానంజేసి యపయశంబు దప్పం బ్రయోజనంబు గలదె? పగతు కడిమి దడవక కడఁగినవాఁడం గాను. లాఁతి వెరవు లావు గామింజేసి ప్రకృతోద్యమంబుం బూనవలసె. కడ మాట యొక్కటి వినుము. ప్రాణహాని కయిన నోర్తుంగాని మాన హాని కోర్వంజాల. ఇది నిక్కంబు. నీ వింక నా కడకు నడ్డవాట్లు వ్రేయకుము. నేనిదె వచ్చెదఁ గట్టాయితంబయి యుండుమని తేనికిం జెప్పుము. వేగిరింపుము. లెమ్ము పొమ్ము. " 21-24, 1-9పం. 109-110పు.

మిత్రలాభమునందు, మిత్రభేదమునందు ప్రయుక్తమైన "మృతకల్పుడు" (11పం. 14పు; 13పం. 52పు.) మిత్రభేదమునందు మాత్రమే ప్రయుక్తమైన "దుస్త్యజమే" (1పం. 51పు.) గంగోత్తరతారము (1పం. 73పు.) "కటిద్వయసంబుగ" (5పం. 77పు.) "దుస్సాధంబు" (8పం. 106పు.) "పండితమానులు" (23పం. 114పు.) మొదలైన శబ్దములు సంస్కృతవ్యాకరణపరిజ్ఞానమునకు సాధకములు. కొందఱు పరిష్కర్తలు "గంగోత్తర తారము" ను గంగోత్తరతీరమని తీర్చి దిద్ది ముద్రించుట దయనీయము. ఈ ప్రయోగములు, ఆ సమాసములు బాలబాలికలకు క్రమభాషాజ్ఞానపరిప్రాప్తికి ప్రాతిపదికలు. సంస్కృతపరిజ్ఞానము లేని తెలుగుపరిజ్ఞానము నిరాలంబనృత్యాడంబరము.

(ఇందలి పంక్తుల, పుటల సంఖ్యలు 1853, 1856 నాటి ప్రథమద్వితీయ ముద్రణములను సంవదించు 1832 నాటి ముద్రణము లోనివి.)

నీతిచంద్రిక పూర్వార్ధము మిత్రలాభము, మిత్రభేదము. ఉత్తరార్ధము సంధి, విగ్రహము అగును. అది చిన్నయసూరి రచించినట్లు లేదు. అయినను, పూర్వార్ధము బాలురకు భాషాజ్ఞానము, వచనరచనాకౌశలము, నీతికుశలత్వము కలిగించునదియే.

వచనకావ్యములు దక్షిణాంధ్రయుగమునందు బహుళము. క్షీణయుగమునందు విరళము. అవి గ్రంథాలయపేటికాంతర్గతములు. చిన్నయసూరి నీతిచంద్రిక విద్యాలయ వాటికావిరాజమానము. చిన్నయసూరి పందొమ్మిదవశతాబ్ది పండితుడని ప్రసిద్ధుడు. పండితుడన శాస్త్రపండితుడు. సంస్కృతాంధ్రపద్యకవి కూడ. ఇందుకు పచ్చయప్ప యశోమండనము శ్లోకములు, పద్యములు (1845-49) నిదర్శనము. అయినను పద్యకావ్యము రచింపక, వచనకావ్యము రచించుట అవశ్యగమనార్హమైన అంశము. అంతేకాదు. ఆధునికయుగము వచనప్రధానము. ఒక ఆధునిక వచనరచనా విధానమునకు చిన్నయసూరి నీతిచంద్రిక ఆద్యప్రకృతి. అందువలన చిన్నయసూరి ఆధునికయుగమునకు వేగుఁజుక్క.

**తత్త్వదర్శనము[73] :**

"వచనరచనలకుఁ దండ్రియట్టి వాఁడు నన్నయభట్టు. ఆతని ప్రౌఢిమ యన్యులకు లేదు. ఒక్క చిన్నయసూరి మాత్రము ఇంకొక విధమైన వచనశైలిని బక్కమునకుఁ దెచ్చి నన్నయ్యతో సమానుఁడై యున్నవాఁడు."

**సమదర్శనము[74] :**

"వ్యావహారికభాష తల్లి వలె నాకు ప్రేమపాత్రము. ప్రాచీనాంధ్ర భాష మూలపుటమ్మ వలె నాకు పూజ్యురాలు.

# ఇతరకవులు

## పదునేడవశతాబ్ది

**లింగమకుంట రామన:** ఇతని కృతులు 1. మత్స్యపురాణము. 2. వామన పురాణము. 3. వేంకటమాహాత్మ్యము. 4. చతుర్వాటికామహత్త్వము. 5. ఆనందకానన మాహాత్మ్యము. మొదటి మూడును అనుపలబ్దములు. కడమ రెండును అముద్రితములు. చతుర్వాటికామహత్త్వము రామాంకితము. ఆనందకాననమాహాత్మ్యము వేంకటేశ్వ రాంకితము. రెండును దైవాంకితములు. చతుర్వాటికామహత్త్వము కృతిప్రేరకుడు చదలువాడ నివాసి అనంతాచార్యులు. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఆనందకానన మాహాత్మ్యము కృతిప్రేరకుడు కోనమంత్రి. అతడును చరిత్రకు అందని వ్యక్తి. ఇతడు "రామకృష్ణాఖ్య జామాత" అని, భట్టరుచిక్కాచార్యుల శిష్యుడని చతుర్వాటికామహత్త్వము నందు కలదు. రామకృష్ణాఖ్యుడు తెనాలి రామ(లింగ)కృష్ణుడని సమన్వయము[75]. తెనాలి రామ (లింగ) కృష్ణుని జీవితకాలము 1500-1580 అని, చిక్కరు భట్టాచార్యుల జీవిత కాలము 1520-1590 నడుమ అని పూర్వోక్తము[76].ఇతని కాలము స్థూలముగ1 550-1625 కావచ్చును. కాఁబట్టి కృతుల రచనాకాలములు మత్స్యపురాణము1585 ప్రాంతము, వామనపురాణము 1590 ప్రాంతము, వేంకటమాహాత్మ్యము 1595 ప్రాంతము, చతుర్వాటి కామహత్త్వము 1600 ప్రాంతము, ఆనందకాననమాహాత్మ్యము 1605 ప్రాంతము కావచ్చును.

చతుర్వాటిక అనగా చెదలువాడ. ఎఱ్ఱాప్రెగడ నిలయము. అచట రామాలయము కలదు. రాముని మహత్త్వమును కలది చతుర్వాటికామహత్త్వము.

ఆనందకానన మన కాశీక్షేత్రము. ఆనందకాననమాహాత్మ్యము కాశీక్షేత్ర మాహాత్మ్యము. ఇది స్కాందపురాణములోని కాశీఖండమునకు మఱొక తెనుగుసేత కాదు. వాయుపురాణములోని లక్ష్మీసంహితయందలి ఆనందకాననమాహాత్మ్యమునకు తెనుగుసేత.

**వెణుతురుపల్లి విశ్వనాథము** = ఇతని కృతులు 1. శ్రీరామవిజయము. యక్షగానము. 2. గౌరీవివాహము. ద్విపదకావ్యము. 3. నిరోష్ఠ్యనలచరిత్ర పద్యగద్య కావ్యము. 4. శేష ధర్మము. 5. పారిజాతాపహరణము సంస్కృతము[77]. ఇందు శేషధర్మము మాత్రమే ఉపలబ్దము. అవతారికాభాగము ముద్రితము. గ్రంథభాగము అముద్రితము. పెద్దాపురము సంస్థానాధిపతి వత్సవాయ చతుర్భుజతిమ్మజగపతికి అంకితము. చతుర్భు జతిమ్మజగపతి కాలము[78]. 1555-1607. విశ్వనాథము మేనల్లుడు ఏనుగు లత్సన (లచ్చన) ద్రౌపదీపరిణయము సార్వభౌమతిమ్మజగపతికి అంకితము. అతని కాలము[79] 1649-88. కాఁబట్టి శేషధర్మము రచనాకాలము 1601 ప్రాంతము కావచ్చును.

శేషధర్మము సంస్కృతహరివంశములోని ఆశ్చర్యపర్వమునందలి శేషధర్మములకు ఆంధ్రీకరణము. ముందు వివరింతును.

**బమ్మెర కేసన, మల్లన** : ఇద్దఱు సవతి సోదరులు. పోతన మునిమనుమలు. జంట కవులు. వీరి కృతులు 1. దాక్షాయణీపరిణయము. 2. విష్ణుభజనానందము. ఇందు మొదటిది నేడు కానరాదు. రెండవది అముద్రితము. దాక్షాయణీపరిణయము గురజాల చిన మల్లన సోమయాజికి అంకితము. విష్ణుభజనానందము పెనుమత్స నారభూపాలునికి అంకితము. గురజాల చిన మల్లన సోమయాజి కాలము 1596 ప్రాంతమని పూర్వోక్తము[80]. కాఁబట్టి దాక్షాయణీపరిణయము రచనాకాలము 1601 ప్రాంతము, విష్ణుభజనానందము రచనాకాలము 1605 ప్రాంతము కావచ్చును.

**బట్టేపాటి తిమ్మయ, బాలసరస్వతి, ఆతుకూరి సోమన** : వీరి కృతి ద్విపద భారతము. తిమ్మయ రచించినవి ఆది, ఆరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వములు ఆరు. బాలసరస్వతి రచించినది సభాపర్వము ఒక్కటి. సోమన రచించినవి కర్ణాదిస్వర్గారోహణాంతపర్వములు పదకొండు, ఆరణ్యపర్వానుబంధమును. తిమ్మయ ఆరణ్యపర్వమునందు వదలిన ఉపాఖ్యానములు సోమన్న ఆరణ్యపర్వానుబంధమునందు కలవు. తిమ్మయ కొన్ని ఉపాఖ్యానములు వదలుటకు హేతువు, అవి, ముందే అతడు విడి కావ్యములుగ రచించుట కావచ్చును. అతని నలచరిత్రము విడి కావ్యము. అముద్రితము.

తిమ్మయ ఆదిపర్వములోని మొదటి మూడు ఆశ్వాసములు రామాంకితము. దైవాంకితము. కడమ అయిదాశ్వాసములు నరసయ్యచౌడనికి అంకితము. నరాంకితము. నరసయ్యచౌడడు 1600 ప్రాంతమునందు కలడని ఒక అభిప్రాయము కలదు[81]. ఆధారము తెలుపలేదు. బాలసరస్వతి సభాపర్వము రామాంకితము. దైవాంకితము. తిమ్మయ్య ఆరణ్య, ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వములు మఱల రామాంకితములు. దైవాంకితములు. విరాటపర్వము జంగాల ముమ్మయ్యరెడ్డికి అంకితము. నరాంకితము అతడు తెనాలిరామ భద్రుని ఇందుమతీపరిణయమునకు కృతిపతి అయిన పాలచూరి కృష్ణభూపతి మామ[82]. ఇందుమతీపరిణయము రచనాకాలము 1600 ప్రాంతమని పూర్వోక్తము[83]. సోమన్న కాలము 1600-1650 అని ఒక అభిప్రాయము కలదు[84]. కాఁబట్టి ద్విపదభారతము రచానాకాలము 1601-30 కావచ్చును.

వ్యాసభారతమునకు కవిత్రయభారతము స్వతంత్రాంధ్రీకరణము. కవిత్రయ భారతమునకు ద్విపదకవిత్రయభారతము ద్విపదీకరణము. ఎడనెడ సంక్షిప్తీ కరణములు, ప్రపంచీకరణములు కలవు. కవిత్రయభారతము స్థాయి ద్విపద భారతము నకు అందని ఫలము.

**మఱింగంటి సింగరాచార్యులు** : ఇతని కృతులు 1. వరదరాజస్తుతి 2. శ్రీరంగశతకము 3. చక్రలాంఛనవిధి 4. కవికదంబము 5. శతసంహిత. తెనుగుసేత. 6. రామకృష్ణచరితము. ద్వ్యర్థికావ్యము 7. నాటకశాస్త్రము. 8. ప్రేమాభిరామము. ద్విపద కావ్యము 9. ధనాభి రామము ద్విపదకావ్యము 10. నలయాదవరాఘవపాండవీయము. చతురర్థికావ్యము. 11. సకలఅలంకారసంగ్రహము 12. రాకాసుధాపూర్ణరసపుష్పగుచ్ఛము. 13. ఆంధ్రభాషాభూషణము 14. శబ్దశాస్త్రము 15. ఇరువది నిరోష్ఠ్యాదికావ్యములు. ఇవి యెల్ల తొమ్మిదవయేటను మొదలుపెట్టి, ఇరువదవయేటను పూర్తిచేసినవి. (14-18ప. శు.ని.సీ.క.,) ఇందు నిరోష్ఠ్యదశరథరాజనందనచరిత్ర, శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతాకల్యాణము

రెండు కృతులు మాత్రమే లభించినవి. రెండు కృతులును కర్పరపురవరహరికి - కర్పరాద్రి వేంకటేశ్వరునికి - అంకితములు. దైవాంకితములు. ఇతడు మఱింగంటి తిరువెంగళార్యుని అష్టపుత్త్రులందు ఆఱవవాడు. అగ్రజుడు "అప్పలగురుండు." "అతడు" ముగురురాజుల చేత మ్రొక్కులు గొన్నట్టి భగవత్సమానుఁడు (30ప. 1ఆ. ని.దనం.చ.) "మత్తేభనరహయ మనుజేంద్రమకుటాగ్రమిళితాంఘ్రియుగళుఁడు." (52ప. 1ఆ. శు. ని. సీ. క,) కావున మహావైష్ణవగురువు కావలయును. విద్వత్కవి అగును. (8ప. ని. ద. నం. చ.,) అతడు పొన్నికంటి తెలగన్న యయాతిచరిత్రమును అమీరుఖానునకు అంకిత మిమ్మన్న " మరింగంటి అప్పనగారు" అనుట కలదు[85]. ఆతడు "తనకు న్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవాఱఁగాఁ జల్లచూపున నెల్లప్పుడుఁ జూచి మప్పఁగల పెన్ప్రోడ" అని యయాతి చరిత్రమునందు కలదు (9ప. 1ఆ.) భగవత్సమానుడగు "అప్పలగురుండు" మప్పఁగల పెన్ప్రోడ" అగు అప్పనగారు అగుట సంశయము కలిగించును. అయినను, అప్పనగారు అప్పలగురుండు అగుటకు కొంతకాలము పట్టును. యయాతిచరిత్రము రచనాకాలము 1580 ప్రాంతమని పూర్వోక్తము[86]. కాఁబట్టి నిరోష్ఠ్యదశరథరాజనందనచరిత్ర, శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతాకళ్యాణముల రచనాకాలము 1601 ప్రాంతము కావచ్చును.

**నిరోష్ఠ్యదశరథరాజనందనచరిత్ర** : నిరోష్ఠ్యమన ఓష్ఠ్యము లేనిది. ఉ, ఊ, ఒ, ఓ, ఔలు, వీనితో గూడిన హల్లులు ప, ఫ, బ, భ, మ, వ అను వర్ణములు, పూర్ణబిందు పూర్వక శ, ష, స - వర్ణనములు. దండి దశకుమారచరిత్రమునందు నిరోష్ఠ్యవచనము కలదు. అది నిమిత్తము కలది. దంత క్షతముల వలన ఓష్ఠ్యములు పలుకలేని మంత్రగుప్తుని సంభాషణ. "దన్తక్షతవిహ్వలాధరమణి ర్నిరోష్ఠ్యవర్ణ మాత్మచరిత మాచచక్షే. " (పుట 160). నిమిత్తము కల నిరోష్ఠ్య రచనము ప్రయోజనాత్మకము. నిర్నిమిత్తమైన నిరోష్ఠ్య కావ్యము చిత్రకవిత్వము. ఇందుకు శాకల్యమల్లుని నిరోష్ఠ్యరామాయణము ప్రథమోదాహరణము. అనుపలబ్దము. అది సంస్కృతకావ్యమైనను, అతడు తెలుగువాడు. నాచన సోమనాథుని ఉత్తరహరివంశము నందు "నిరోష్ఠ్యము" అను నిర్దేశముతో ఒక పద్యము కలదు. (106ప. 1ఆ.) అది కవి వర్ణన. గంగానది వర్ణన. నిమిత్తము లేదు. చిత్రకవిత్వమే. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలోను, అప్పకవీయములోను నిరోష్ఠ్యములకు లక్ష్య లక్షణములు కలవు. (44, 45 ప. 6ఉ; 552, 553ప. 4ఆ.) తెలుగు నిరోష్ఠ్యకావ్యములకు ఆద్యుడు, అద్యుడు మఱింగంటి సింగరాచార్యులే అగును. ఇరువదవయేట రచించిన నిరోష్ఠ్యాది వింశతి కావ్యములందు ఎన్ని నిరోష్ఠ్యకావ్యములో? - అందు దశరథరాజనందన చరిత్ర ఒకటి. శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతాకాల్యాణము మఱొకటి. ఇందు మొదటిది గ్రంథనామమును నిరోష్ఠ్యము. అది రామాయణము. అందు "మా" ఓష్ఠ్యము. అందువలన దశరథరాజ నందన చరిత్ర అని నిరోష్ఠ్యముగ గ్రంథనామకరణము. శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతా కళ్యాణము గ్రంథనామము శుద్ధాంధ్రమును కాదు; నిరోష్ఠ్యమును కాదు. కావ్యము శుద్ధాంధ్రమే. నిరోష్ఠ్యమే.

దశరథరాజనందనచరిత్ర గ్రంథనామము నిరోష్ఠ్యమైనను, అవతారిక, ఆశ్వాసాంత పద్యగద్యములు సోష్ఠ్యములే. కథాభాగము నిరోష్ఠ్యము. రామాయణకథయందు రాముడు, లక్ష్మణుడు, భరతుడు, వసిష్ఠుడు, భరద్వాజుడు, పరశురాముడు, శబరి, వాలి, సుగ్రీవుడు,

దుందుభి, సంపాతి, జటాయువు, రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, సుమిత్ర, మండోదరి, మొదలైన వ్యక్తినామములు సోష్ఠ్యములు. అందుకు చిల్కలంజీరెడి రెండక్కరాల వాడు, అహిరాడంశజస్థరాజాగ్రణి, చక్రకళాజ నిరాజిహేళి మొదలైన కృతకనామములు కలవు. అంతేకాదు. వరములు కాంక్షలు. ఇరువది చేతులు సెలగ కేలు. పదునాలుగేండ్లు రెట్టియేడేండ్లు. విసనకఱ్ఱలు, వింజామరలు గాలి కఱ్ఱలు. పంపాసరస్సు అధరసంఘట్టనసైన రెండక్కరాలు గల సరస్సు. అహమన్నపుంసకముల ముపర్ణమునకు లోపము. కళంక. నాళ. అంతరాన, అరణ్యాన, కనికరాన, ఏకతాన వంటి ప్రయోగములు అనేకము.

రామాయణకథ సంగ్రహరూపము. సుందరకాండము పది పద్యగద్యములందు కలదు. (133-142ప. 3ఆ.) వర్ణనావ్యామోహము లేకపోవుట విశేషము. పూర్వకవితా చర్వణము కలదు.

"నీ కంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు . . " 448ప.సుం. కాం.

అను భాస్కరరామాయణములోని పద్యమునకు,

"సీత గాదిది దైత్యశేఖర నీకేల
నల్లినయట్టి నీలాహిగాని
సీత గాదిది దైత్యశేఖర నీ నెత్తి
నట్టి జారినయట్టి యశని గాని " 16ప. 4ఆ. యు. కాం.

అను దశరథరాజనందనచరిత్రలోని పద్యము అనుసరణము.

**శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతాకల్యాణము** : ఇది అచ్చతెనుగు కావ్యముతోపాటు నిరోష్ఠ్య కావ్యము. అవతారిక, ఆశ్వాసాంతపద్యగద్యములు అచ్చతెనుగు కాదు; నిరోష్ఠ్యమును కాదు. కథాభాగము మాత్రమే శుద్ధాంధ్రము. నిరోష్ఠ్యమును. కథ బాలకాండకథ. ఇది కూడ రామాయణసంబంధియే.

ఇది మూడాశ్వాసముల లఘుకావ్యము. శుద్ధాంధ్రమన అచ్చతెనుగు. అచ్చతెనుగు కావ్యములందు పేరులకు అచ్చతెనుగు ఐచ్ఛికము. కయ్యాలదిండిజాణ = నారదుడు (75వచ. 1ఆ.) జింకఁ గన్న జడదారి = ఋశ్యశృంగుడు (75ప. 1ఆ.) చాల్తల రాకాసి = రావణుడు (10ప. 2ఆ.) రాయంచ తేజి యయ్య = బ్రహ్మ (13ప. 2ఆ.) సిరిరాయడు = విష్ణువు (20ప. 2ఆ.) నల్తలల దిట్ట = బ్రహ్మ (21ప. 2ఆ.) చాల్తేర్ల దిట్ట = దశరథుడు (26ప. 2ఆ.) గట్లదాయి = ఇంద్రుడు (69ప. 2ఆ.) గట్లరాదిట్ట గన్నట్టి కన్నె కలికి = పార్వతి (6ప. 3ఆ.) సెగకంటి గయ్యాళి = శివుడు (6ప. 3ఆ.) నెల తలఁదాల్చిన గద్దరి = శివుడు (6ప. 3ఆ.) మొదలైనవి అచ్చతెనుగు పదబంధములు.

సాకేతనగరి (68ప. 1ఆ.) దశరథరాజా (70ప. 1ఆ.) అంగరాజు (83ప. 1ఆ.) ఋష్య శృంగజటి (90ప. 1ఆ.) గాధేయజటి (36ప. 2ఆ.) గాధేయర్షి (46ప. 2ఆ.) తాటక (56ప. 2ఆ.) దాశరథి (64వచ. 2ఆ.) జనకనరనేత (3ప. 3ఆ.) జనకధరణినేత (35ప. 3ఆ.) మొదలైనవి సంస్కృతపదబంధములు.

ఋష్యశృంగాఖ్యుడు (86ప. 1ఆ.) ధాతృనందనజటి (104ప. 1ఆ.) దశకంఠని శాచరకర్త (3ప. 2ఆ.) దశగళత్రిదశారి (5ప. 2ఆ.) తాటకేయనిశాటకర్తలు (56వచ. 2ఆ.) అక్షచరణజటిలనేత (76ప. 2ఆ.) జనకరాజధాని (5ప. 3ఆ.) సరస జేజేల దంట

(6ప. 3ఆ.) కదలి కర్త (8ప. 3ఆ.) క్షత్త్రియహంత (44ప. 3ఆ.) సీతాజాని (57ప. 3ఆ.) రాజారి (72ప. 3ఆ.) క్షత్త్రియారి (73ప. 3ఆ.) క్షితిజ, తాటకేయారి (62పుట) వంటి పదబంధములును కలవు.

ఇది ప్రథమశుద్ధాంధ్రకావ్యము కాదు. ప్రథమనిరోష్ఠ్యకావ్యమును కాదు. కాని, ప్రథమనిరోష్ఠ్యకావ్యము, ప్రథమశుద్ధాంధ్రనిరోష్ఠ్యకావ్యము ఏకకవికృతము లగుట విశేషము. అందును జాలకవికృతములగుట అంతకంటె విశేషము.

**ఉప్పుగుండూరి పెరియన్న** : ఇతని కృతి మీనకేతనాభ్యుదయము. అసమగ్ర ముగ లభించినది. అముద్రితము. ఆరవీటి పెద వేంకటపతిరాయలకు అంకితము. అతడు రెండవ వేంకటపతిదేవరాయలు. రాజ్యకాలము 1582-1614. అతడు పెనుగొండ యుద్ధమునందు విజయమునందినట్లు ఇందు కలదు[87].

"ఘనబలదుర్దమరిపుమ
ర్దననగకోదండ మూరురాయరగండా!
పెనుగొండసమరమొరుసక
తనుఖండనచండ బాహుదండోద్దడా!

పెనుగొండ యుద్ధకాలము వేంకటపతిరాయల రాజ్యారంభకాలము[88]. ఆ యుద్ధ విజయమునందు మట్లి అనంతభూపాలుని పాత్ర కలదు. పెరియన్న తండ్రి వేంకటకవి. అతడు మట్లి ఎల్లమరాజు ఆస్థానకవి ఉప్పుగుండూరి వేంకటకవి అగును. అయిన మీనకేతనాభ్యుదయము రచనాకాలము అనంతభూపాలుని కకుత్స్థవిజయము రచనాకాలమునకు అనంతరమగును. కుకుత్థ్సవిజయము రచనాకాలము 1601 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి మీనకేతనాభ్యుదయము రచనాకాలము 1603 ప్రాంతము కావచ్చును.

**మట్లి కుమారానంతభూపాలుడు** : ఇతని కృతి కుముద్వతీపరిణము తండ్రి తిరువెంగళ రాజానకు అంకితము. అముద్రితము. తాత అనంతభూపాలుడు. మనుమడు కుమారానంతభూపాలుడు సమకాలమునందు (1606) కలరని, తాత కకుత్స్థవిజయము రచనాకాలము 1601 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి మనుమని కుముద్వతీపరిణ యము రచనాకాలము 1605 ప్రాంతము కావచ్చును.

కాశీరాజు కూతురు కుముద్వతికి, శ్రీరాముని కుమారుడు కుశునికి జరిగిన పరిణయము కుముద్వతీపరిణయములోని ఇతివృత్తము.

కుమారానంతభూపాలుని కవితల కతపత్రమిది[89].

"మల్లీనవవల్లీమ
తల్లీసుమవేల్లితాచ్యుతరసౌగంధ్యో
ద్యల్లీనాధికసౌరభ
హల్లీసకముల్ కుమారనంతుని కవితల్."

**కవి చౌడప్ప** : ఇతని కృతి కవి చౌడప్పశతకము. సుమారు రెండు వందల పద్యములు కలవు. కందపద్యములు 180, వృత్తములు 7, సీసములు 2, గీతములు 2, కందపద్యములకు "కుందవరపు కవి చౌడప్పా" అను మకుటము నియతముగ కలదు.

"కాకోదరకుందవరపు కవి చౌడప్పా" అని కూడ కలదు. ఇతరపద్యములకు నియత మకుటము లేదు. మకుటములేని పద్యములును కలవు. అవి చాటుపద్యము లగును.

"అన్నిట మంచివారు విమలాత్ములు హాస్యకళాధురంధరుల్
సన్నుతనీతిపాలకులు జాణలు నైపుణు లెవ్వ రంటిరా
పన్నుగ మట్ల్యనంతనరపాలునిఁ గొల్చి మహానుభావులై
వన్నెకు నెక్కునట్టి గుణవంతులు ఘంటన చౌడగాంద్రురా." 32

ఇది చాటుపద్యమే. అన్యకృతమగును. ఇందు ఘంటన, చౌడప్ప అను జాణలు మట్లి అనంతభూపాలుని కొలువులోని హాస్యకళాధురంధరులని కలదు. ఇందు మట్లి అనంతనరపాలుడని కలదు గాని, కవిచౌడప్ప పద్యములందు కుమారానంతుడని కలదు.

"మట్లి కుమారయనంతుని
పట్లను వినయంబు లేని ప్రభువులు మహినే
పట్లను చెడిపోదురు చే
కట్లను వరకుందవరపుఁ గవిచౌడప్పా." 36

"మీఱిన పగతుల మట్లి కు
మారానంతుఁడు విక్రమార్కుని రీతిన్
మారుకొనినఁ బోనీయఁడు
గా, రణమునఁ గుందవరపుఁ గవిచౌడప్పా." 37

కుమారానంతభూపాలుని కుముద్వతీపరిణయము తోపాటు కవి చౌడప్ప శతకము రచనాకాలమును 1605 ప్రాంతము కావచ్చును. శతకసంఖ్యను దాటిన పద్యములు కాలక్రమమున చెప్పినవి కావచ్చును. అవి కాలాంతరమునందు శతకమున అంతర్గతము కావచ్చును.

కవి చౌడప్ప రఘునాథనాయకుని కొలువునందు అడుగుపెట్టినట్లు కలపద్యము "నేరుతునని మాటాడఁగ-" 112, పూర్వోదాహృతము. 1605 ప్రాంతము రఘునాథ నాయకుని రాజ్యకాలములోనిదే.

కవి చౌడప్ప శతకము పచ్చి బూతుశతకమని ప్రసిద్ధము. పచ్చి బూతు పద్యము లున్న మాట నిజము. కాని, ప్రతిపద్యమును పచ్చిబూతుపద్యము కాదు. నూటయెనుబది కందపద్యములందు సుమారు ఏబది కందపద్యములు మాత్రమే పచ్చి బూతు పద్యములు. అవి తొలగించిన సుమారు నూటనలుబది కందపద్యముల మంచి నీతిశతకమగును. అందు దైవపరమైన పద్యములు ఇరువది, పూర్వకవి స్తుతి పద్యములు మూడు, కవి ఆత్మస్తుతిపద్యములు పది, నీతులు బూతులు గుఱించి పద్యములు అయిదు పోను నీతి పద్యములు వంద ఉండును. పూర్వకవిస్తుతిపద్యములు :

"విను భారవి బిల్హణు నా
చన సోముని మాఘకవిని చతురితశ్రీనా
థు నుతింతు సుకవివరుఁ ది
క్కనఁ దలఁతును గుందవరపుఁ గవిచౌడప్పా." 8.

పండితముఖ్యులు ధారుణి
దండియె భవభూతి కాళిదాసులును నె
వ్వండు నిడు కృతులు వారి న

ఖండితయశ కుందవరపుఁ గవిచౌడప్ప " 13.
"పెద్దన వలెఁగృతి సెప్పినఁ
బెద్దన వలె నల్పకవినిఁ బెద్దనవలెనా
యెద్దనవలె మొద్దనవలె
గ్రద్దనవలెఁ గుందవరపుఁ గవిచౌవప్పా. " 63.

కవి చౌడప్ప ఇష్టదైవము పుల్లరిపట్టణగోపాలుడు. ధ్యేయము ముక్తి.

"మందరగిరిధర దశరథ
నందన ప్రహ్లాదవరద నారదనుత గో
విందు యను వారు ముక్తిని
గందురు గద కుందవరపుఁ గవిచౌడప్పా! " 7

ఆత్మస్తుతి అతివేలము

"ముందుగఁ జను దినములలోఁ
గందమునకు సోమయాజి ఘనుఁ డందురు నేఁ
డందఱు నను ఘనుఁ డందురు
కందమునకుఁ గుందవరపుఁ గవిచౌడప్పా. " 9.
"కందము నీవలెఁ జెప్పిన
నందము మఱి గాన మెవరియందును గవిసం
క్రందన యసదృశనూతన
కందర్పా కుందవరపుఁ గవిచౌడప్పా. " 10.
"నా నీతి వినని వానిని
భానుకిరణములు మీఁదఁ బాఱని వానిన్
వానను దడియని వానినిఁ
గానమురా కుందవరపుఁ గవిచౌడప్పా. " 39.

ఇంకను 10, 11, 12, 14, 22, 40, 94, 153 పద్యములు ఆత్మస్తుతులే. నీతులు :

"వానలు పస పైరులకును
సానలు పస వజ్రములకు సమరంబులకున్
సేనలు పస మృగజాతికిఁ
గానలు పస కుందవరపుఁ గవిచౌడాప్పా "50.
"పాండవు లిడుమలఁ బడరే
మాండవ్యుఁడు కొఱఁతఁ బడఁడె మహిఁ బ్రాకృత మె
వ్వండోపు మీఱి చనఁగ న
ఖండితయశ కుందవరపుఁ గవిచౌడప్పా " 90.
"తనయునికిని బరదేశికిఁ
బెనిమిటికిని నొక్కరీతి భోజనమిడు నా
వనితను బుణ్యాంగన యని
ఘను లందురు కుందవరపుఁ గవిచౌడప్పా. " 146.
"ధనమే మూలము జగతికి
ధనమే మూలంబు సకలధర్మంబులకున్
గుణమే మూలము సిరులకు

గనుమప్పా కుందవరపుఁ గవిచౌడప్పా. " 180ప.

**ఒద్దెపూడి పెద్దయ** : ఇతని కృతి మాఘమాహాత్మ్యము. పద్యకావ్యము. అముద్రితము. దాసరి గంగయకు అంకితము. అతని గుఱించి ఇట్లు కలదు[90].

"సాంద్రయశోధనుండు హరిశౌర్యుఁడు బాహుబలేంద్రుఁ డా హరి
శ్చంద్రమహీతలేశుఁడు భృశంబుగ సత్యముచే నొసంగఁగాఁ
జంద్రసుగంధపుష్పఘనసంకుమదాంబరరత్నరాజి ని
స్తంద్రశుభోక్తిఁ గైకొనియె దాసరి గంగన లోక మెన్నఁగన్. "

ఇందు "సత్యముచే" అనునెడ "సత్యవచో" అను లిఖితపాఠము లేఖకదోషము. సాంద్రయశోధనుడు, హరిశౌర్యుడు, సత్యముచే ఆ హరిశ్చంద్రమహీతలేశుఁడు అయిన బాహుబలేంద్రుడు దాసరిగంగనకు చంద్రసుగంధపుష్పఘనసంకుమదాంబరరత్నరాజి ఇచ్చినట్లు స్పష్టార్థము. బాహుబలేంద్రుని శాసనము 1604 వ సంవత్సరమునందు కలదు[91]. కాఁబట్టి మాఘమాహాత్మ్యము రచనాకాలము 1605 ప్రాంతము కావచ్చును. ఇది "వాయుపురాణములోని కొంతభాగము" కావచ్చును.

**ఎలకూచి పినయాదిత్యుడు** : ఇతని కృతి ఆదిత్యపురాణము. అముద్రితము. పాంపూరి గురవమంత్రికి అంకితము. పినయాదిత్యుడు ఎలకూచి బాలసరస్వతి అనుజుడు. బాలసరస్వతి కృతుల రచనాకాలములు 1605 నుండి 1645 వఱకు అని పూర్వోక్తము. జీవితకాలము 1570-1650 అగును. అయిన పినయాదిత్యుని జీవితకాలము 1575-1655 అగును. కాఁబట్టి ఆదిత్యపురాణము రచనాకాలము 1610 ప్రాంతము కావచ్చును.

**ముడియము వేంకటరమణ** : ఇతని కృతులు 1. కళాధరోపాఖ్యానము అముద్రితము. 2. రాధామాధవనాటకము. సంస్కృతము. కళాధరోపాఖ్యానము దత్తాత్రేయునికి అంకితము. దైవాంకితము. ఇతడు పెమ్మసాని తిమ్మానాయని ఆశ్రితుడు.

"అతిలోకాయతభోగభాగ్యమహిమాఢ్యంబైన సింహాసన
త్రితయం బందుఁ బ్రశస్తమౌ నరపతిశ్రీరాయసింహాసనం
బతిధన్యాశ్రయణైకతానమున మెచ్చొ పెమ్మసానన్వయం
బతులంబై తగ నుద్భవిల్లి మను తిమ్మాధీశుఁ డశ్రాంతమున్
ఇట్టటు గెంటని దయ నే
పట్టున సన్మానభోగభాగ్యము గల చే
పట్టితి నని కంకణముం
గట్టుక రక్షింపఁ బెంపుఁ గాంచిన వాఁడన్. "

పెమ్మసాని తిమ్మానాయుడు పేరిటివారు పెక్కుమంది కలరు. వారి శాసనములు పదునాఱవశతాబ్ది చతుర్థపాదమునందు, పదునేడవశతాబ్ది ప్రథమపాదమునందు (1570-1630) కలవు[92]. కాఁబట్టి కళాధరోపాఖ్యానము రచనాకాలము 1610 ప్రాంతము కావచ్చును.

**కంచి వీరశరభయ్య** : ఇతని కృతి హరిశ్చంద్రోపాఖ్యానము. శ్రీశైలమల్లికార్జునస్వామికి అంకితము. దైవాంకితము. ఇతని గురువు ఇవటూరి పర్వతారాధ్యుడు. అతడు బమ్మెర కేసన, మల్లనలకును గురువు, కేసన, మల్లనల దాక్షాయణీపరిణయము

రచనాకాలము 1601 ప్రాంతము, విష్ణుభజనానందము రచనాకాలము 1605 ప్రాంతము అని పూర్వోక్తము. కాఁబట్టి వీరశరభయ్య హరిశ్చంద్రోపాఖ్యానము రచనాకాలము 1615 ప్రాంతము కావచ్చును. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానము "కొందఱు కవిజనోత్తము లందంబు వాటిల్ల రూపించి తమ యోపిన విధంబుతోడ ననవద్యపద్యగద్యాదికప్రబంధ బంధురంబుగా రచియించిన తెఱంగు కంటె మెఱుంగు వెట్టినట్లు భవ్యంబగు నిమ్మహా కావ్యంబు" (20వచ. 1ఆ.) రచింతునని ప్రకటించెను. కొందఱు కవిజనోత్తములన గౌరన, శంకరకవి, చంద్రమౌళి అగుదురు. వారి కృతులు కంటె ఇతని కృతి మెఱుగును కాదు; తఱుగును కాదు. మఱొక హరిశ్చంద్రోపాఖ్యానము. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునకు, వీరశరభయ్య హరిశ్చంద్రోపాఖ్యానము అనుసరణము. కాని అందలి పద్యరచనాపాటవము, భావగాంభీర్యము ఇందు మృగ్యము.

"తన సామ్రాజ్యముఁ బాసినం గులవధూత్తంసంబు వర్జించినన్
దనయుం డీల్గిన హీనకృత్యములచేత న్దుర్దశం బొందినన్
వనటం గుందిన నా నరేంద్రుఁడు మనోవాక్కాయకర్మంబులం
దనృతం బాడిన నా ప్రతిజ్ఞ విను విశ్వామిత్ర చిత్రంబుగన్." 175ప. 1ఆ.

అను శంకరకవి పద్యమునందు నాటకీయధ్వని కలదు.

" సకలపరిపంథిరాజన్యమకుటఘటిత
రత్ననీరాజనాతివిరాజమాన
చరణుఁడైన హరిశ్చంద్రజనవిభుండు
కల్లలాడఁడు మదినైన గాధితనయ " 115ప.1ఆ.

అను వీరశరభయ్య పద్యమునందు "దివసాధిపతి తూర్పున నస్తమించిన. . . . . . . . జాతవేదుని వేఁడి చల్లఁబడిన" అను పట్టిక కలదు.

**కావూరి ఎల్లయ్య** : ఇతని కృతులు 1. మిత్రవిందాపరిణయము 2. బ్రహ్మాండ పురాణము. మొదటిది అనుపలబ్ధము. రెండవది పురాణము. శ్రీరామచంద్రునికి అంకితము. దైవాంకితము. ఇతని గురువు తిరుమల తిరువేంగళాచార్యులు[93].

"హరిపాదకమలసేవా
నిరతు విశుద్ధాంతరంగు నిర్మలచరితున్
తిరుమల తిరువేంగళ స
ద్గురు నాశ్రితముక్తిదాయకుని స్మరింతున్. "

తిరుమల తిరువేంగళాచార్యులు బమ్మెర కేసన, మల్లనలకు కూడ గురువు[94]. ఇద్దఱు ఒకరే కావచ్చును. అయిన ఎల్లయ కాలము- బమ్మెర కేసన, మల్లనల కాలమే అగును. కాఁబట్టి మిత్రవిందాపరిణయము రచానాకాలము 1615 ప్రాంతము, బ్రహ్మాండపురాణము రచనాకాలము 1620 ప్రాంతము కావచ్చును.

**అజ్జరపు పేరయలింగము** : ఇతని కృతి ఒడయనంబివిలాసము. ఆచంట సోమేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు బమ్మెర కేసన, మల్లనల తోఁబుట్టువు భర్త. కాఁబట్టి ఒడయనంబివిలాసము రచనాకాలము 1620 ప్రాంతము కావచ్చును.

ఒడయనంబి కథ పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు కలదు. అది ఒడయనంబివిలాసములోని కథ కాదు. ఒడయనంబి, అతని వేశ్య పరమనాచమ్మ పేరులు

మాత్రమే సంవదించును. బసవపురాణమునందు ఒడయనంబి గర్వమునకు మిఱుమిండడు కోపగించి వెలి వేయును. వాల్మీకేశ్వరుడు మిఱుమిండనికి భయపడి, చాటుగా ఒడయనంబిని తీసికొనిపోయి, శివభక్తుల మహిమలు చెప్పును. ఒడయనంబి విలాసములోని ఇతివృత్తము తద్భిన్నము. శివుడు త్రిపురాసురసంహారము చేసి, వినోదించు సమయమున అచ్యుతుడను మహర్షి, గంగ అను ధర్మపత్నితో వచ్చి, సాయుజ్యమోక్షమును కోరును. శివుడు సాలోక్యమోక్ష మొసగును. అంతేకాదు. ఉభయులను బ్రహ్మచర్యము పాటించి పుష్పములు సమర్పింప నియోగించును. అచ్యుతుని పుష్పసుందరునిగ, గంగను పుష్పసుగంధిగ ఆదరించును. బ్రహ్మచర్యమునకు భంగము వాటిల్ల, పుష్పసుందరుని ఒడయనంబిగ, పుష్పసుగంధిని పరమనాచిగ భూలోకమున జన్మింపుడని శపించును. ఒడయనంబి చరిత్రమిది :

"తన పేరి బాలుఁ డెంతయు నక్రహతుఁడైన
నేడేండ్లకును తల్లి కిచ్చె మగుడ
తన సందు వారకామిని సందు రతిఁగూర్చి
ఫాలాంబకుని రాయబారి చేసె
పైడి నిష్కంబులు ప్రతిదినంబును నందె
వెచ్చాన కభవుచే వేయి నూర్లు
వెలయాలి చంటిలోపల సదాశివు మంచి
పలికించె భక్తిచే పంతగించి
మరియు నెన్నైన గలవు తన్మహితభక్త
వరుని చర్యలు తెలియ దుర్వారమహిమ
అట్టి నంబి చరిత్రమాహాత్మ్యమెల్ల
వినుడు మునులార యని సూతుఁడనియెప్రేమ '' 7ప. 1ఆ.

తిరువళ్లూరిలోని జడనయనారు కుమారుడు నంబి. అతడు నంబులలో ఒడయని వంటి వాడగుట వలన ఒడయనంబి. తిరువళ్లూరి ఒడయనంబి తీర్థయాత్రలు చేసి, ఆచంట వచ్చి, పరమనాచి చంట పరమేశ్వరుని పలికించిన, "చంటఁ బలికించుట వలన" మార్కండేయపురము ఆచంట అయ్యెనట!

కంచి, శ్రీకాళహస్తి, శ్రీశైలము, బెజవాడ, ఏకశిలానగరము, ధర్మపురి, ప్రయాగ, అయోధ్య, కాశి, పూరి, ముఖలింగము, రామతీర్థము, కుంభిల, కనకాపురము, పట్టిసము, తాళ్లపూడి, దాక్షారామము, కోటిపల్లి, మురమళ్ల, ముక్తీశ్వరము, పాంచారపురి, పలివెల-ఒడయనంబి పరమనాచితో దర్శించిన పుణ్యక్షేత్రములు. ఇందు కంచి, ప్రయాగ, అయోధ్య, కాశి, పూరి, వినా కడమ క్షేత్రములు ఆంధ్రదేశములోనివి. అందు మురమళ్ళ, ముక్తీశ్వరము, పాంచారపురి, పలివెల కోనసీమలోనివి. పాంచారపురిలోని క్షేత్రదైవము మల్లేశ్వరస్వామి. అమలాపురములోని చెన్నమల్లేశ్వరస్వామి అగునేమో?- శ్రీనాథుని తర్వాత ఆంధ్రదేశములోని పుణ్యక్షేత్రములను వర్ణించిన కవి ఇంకొకడు కానరాడు. అంతేకాదు. ఆంధ్రదేశములోని మాఱుమూల ప్రాంతమైన కోనసీమను వర్ణించిన కవి ఇతడే (9-12ప. 1ఆ.)

"గంగాస్నానపవిత్రగాత్రులు మహాకారుణ్యపాథోనిధుల్

సాంగాధ్యాపకు లన్నదానపరు లుద్యచ్ఛాస్త్రపారంగతుల్
గంగోత్తుంగతరంగసద్రుమఘుమాగాడార్భటీవాక్కు లు
త్తుంగస్ఫూర్తిని కోనసీమబుధు లెందున్ బూజ్యు లుర్వీస్థలిన్. " 11ప. 1ఆ.

ఆచంట క్షేత్రవర్ణనము (15-41ప. 1ఆ.) శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని దక్షారామ క్షేత్రవర్ణనమునకు శిష్యప్రాయము.

"కవవచ్చు మణికర్ణికాతీర్థమునకును
 రవణిల్లు రామగుండంబు జలము
ప్రతివచ్చు నన్నపూర్ణావిశాలాక్షికి
 భావింప పార్వతీదేవి శివి
సరివచ్చు ననిశంబు వరబిందుమాధవ
 స్వామికి నరయంగ వరదరాజ
ఎనవచ్చు డుండి విఘ్నేశ్వరాంచితమూర్తి
 కింపొందు చిత్రవిఘ్నేశ్వరుండు
లీల విశ్వేశకూటస్థలింగమునకు
రామలింగంబె సాటి యే భూమినైన
కాశి కాచంటపురికిని గణన సేయ
తారతమ్యంబు లేదెంచ తథ్యమరయ. " 26ప. 1ఆ.

"తత్పురి తూర్పెల్ల దయతోడ రక్షించు
 పాలుపొందు హరు కొమ్మ పుట్టలమ్మ
ఆ పట్టణపు దక్షిణాశాస్థలముఁ బ్రోచు
 నుతకల్పకము కొమ్మ నూకలమ్మ
అవ్వీట పశ్చిమం బంతయు నిరతంబు
 కొమరొప్ప కృపఁజూచు గోగులమ్మ
అన్నగరంబున నలరు నుత్తరమధ్య
 కాపాడు గుణవర్గ కనకదుర్గ
కావునను దాన రోగముల్ గదియ వెఱచు
నరుల కెల్లను సమ్మోదనకరరూఢి
సకలభోగంబులకు దానె జనని యగుచు
పుడమిఁ జెన్నొందు నాచంట పురవరంబు. " 27ప. 1ఆ.

పరమనాచి వర్ణనమునందు చిత్రకవిత చిందులాడినది. (45-51ప. 1ఆ.)

మగువ యానము చూడ మత్తేభవిక్రీడ
 సఖి నాసమహిమంబు చంపకంబు
కలికి కన్నుల లీల తలప నుత్పలమాల
 పొలతి సత్కటి వృద్ధి వొనఁగ(?) పృథ్వి
జలజాక్షి కర్ణముల్ చెలగు శ్రీవృత్తముల్
 కొమ్మ కంఠము మత్తకోకిలంబు
చాన నూగారు భుజంగప్రయాతంబు
 వనిత యొప్పులకుప్ప వనమయూర
మార యంగన సొంపుచే నలరు వృత్తి

పటిమ గాంచి మనోహరప్రతిభ మించె
సత్ర్పబంధము గతిని రాజ్యమునఁ జెలఁగె
చిత్తజుని ధాటి పరమనాచీవధూటి. " 46ప. 1ఆ.

భరణీవిలాసమై పాపిళ్లు చెలువొందె
　　కడు పునర్వసు రూఢి గాంచె మేను
కనదపూర్వాషాఢఘనత గాంచె నచలం
　　బిల ప్రసత్కృళలచే జెలగె మోము
ధరణి జ్యేష్ఠాకృతి దాల్చెను కటిసీమ
　　శ్రవణసంగతిని నేత్రములు ప్రబలె
నమృతార్ద్రవిఖ్యాతి నలరెను కెమ్మోవి
　　భాషితాశ్లేషయై భాష మెరసె
శేషనక్షత్రములు నాభిజిత్సములయి
పద్మపత్రాక్షి నఖములై పరిఢవిల్లె
ననుచు సిద్ధాంతవేత్తలు వినుతి సేయ
జెలఁగె శుభనామ పరమనాచీలలామ. " 49ప. 1ఆ.

పరమనాచితోడి ఒడయనంబి యాత్రాక్రమము పరమవైభవోపేతము.

"గంధేభంబులు రెండును
సైంధవములు నాల్గు నర్ధశత ముష్ట్రంబుల్
బంధురభటశతయుగము యు
గంధరధీమంత్రి యొకఁడు కాంతాశతమున్.

కరదీపికలు పూను నరు లొక్క వింశతి
　　యాతపత్రము దాల్చు నధికుఁ డొకఁడు
తెలనాకు మడుపు లందించు వా రిరువురు
　　చేరి గానము సేయు వారు మువురు
తరి మృదంగంబులు దాల్చు వా రొకజోడు
　　ప్రకటింపదగిన కంచుకియుగంబు
వినుతింపదగు వందిజను లెంచ నలువురు
　　తపనీయపాదుకదారు లిద్ద
రన్నపానశివోపచారార్హులైన
విప్రశివభక్తు లెనమండ్రు వేడ్క గొలువ
గదలె జయజయశబ్దసంగతులు వినుచు
నుగ్రసేవాగుణాలంబి యొడయనంబి.

మఱియును త్రైర్థికోత్తములు మక్కువతో తను వెంటనంటి రా
నెఱయఁగ వారి కందరకు నిత్యము భత్యము బత్తి నిచ్చుచున్
గురుతరలీలతో గదలి కుంజరఘోటకముఖ్యసంపదల్
గరిమను గల్గు పట్ణములు కౌతుక మొప్పఁగ గొన్ని చూచుచున్. " పుట 74

ఇది రాజభోగము. శివుని అనుగ్రహము. అసలు ఒడయనంబికి, పరమనాచికి అనుబంధము కలిగించినది శివుడు. "పగలును రేయి నిమ్మగువ బాయక యుండు" మని నిద్రకు వేయి నిష్కము లిచ్చినది కూడ శివుడే. (పుట 66) లక్ష్యము సాయుజ్యమోక్ష

ప్రదానము. ఇదొక శివలీల.

**రేటూరి (రెంటూరి) రంగరాజు** : ఇతని కృతి భానుమతీపరిణయము. వెలుగోటి రాయశౌరికి అంకితము. అతడు వేంకటగిరి నిర్మాత వేంకటాద్రినాయకుని పుత్త్రుడు. వేంకటాద్రినాయకుని జ్ఞాతిసోదరుడు కస్తూరిరంగప్పనాయకుని (19వ తరము) ప్రాభవకాలము 1576-1600 అని రాయప్పనాయకుని (రాయశౌరి) జ్ఞాతిసోదరుడు పెద్దయాచమనాయకుని (20వ తరము) ప్రాభవకాలము 1601-25 అని, ఈతని ఆరవకుమారుడు కుమారయాచమనాయకుని (21వ తరము) ప్రాభవకాలము 1642-72/78 అని, రంగప్పనాయకుని మనుమని మనుమడు సింగమనాయకుని (24వ తరము) ప్రాభవకాలమును 1642-72/78 (?) అని చారిత్రికసమన్వయములు[95]. 21 వ తరములోని కుమారయాచమనాయకుని, 24 వ తరములోని సింగమనాయకుని ప్రాభవకాలములు ఒకటే అగుట సంభవము కాదు. పెద్ద యాచమనాయకుని ప్రాభవ కాలము 1601-25 కనుక, అతని ఆరవకుమారుడు కుమారయాచమనాయకుని ప్రాభవ కాలము 1642-72/78 (?) అగును. రాయప్పనాయకుని ప్రాభవకాలము 1642-72/78(?) అగును. పెద్ద యాచమనాయకుని తరములోని రంగప్పనాయకుని మనుమని మనుమడు సింగమనాయకుని ప్రాభవకాలము తదనంతరకాలికమగుట తథ్యము. రాయప్పనాయకుని మనుమడు సింగమనాయకుని (22వ తరము) ప్రాభవకాలము 1642-72/78(?) కాఁగలదు. కావున రాయప్పనాయకుని ప్రాభవకాలము 1601-25 కంటె పూర్వము కాఁజాలదు. కాఁబట్టి భానుమతీపరిణయము రచనాకాలము 1620 ప్రాంతము కావచ్చును.

భానుమతీపరిణయము హరివంశప్రసిద్ధము. (6ప. 1ఆ.) ఎఱ్ఱన హరివంశమునందు లేదుగాని, సంస్కృతహరివంశమునందు కలదు. అందలి భానుమతి వృత్తాంతములోని పరిణయవిషయమే ఇందలి ఇతివృత్తము. భానుమతి శ్రీకృష్ణుని పినతండ్రి భానుని తనయ. ఆమెకు తగిన వరుడు సహదేవుడని నారదుడు చెప్పును. భానుమతీసహదేవులకు శ్రీకృష్ణుడు వివాహము చేయించును. ఇసుమంత ఇతివృత్తము సముద్రమంత వర్ణనాతి శయము!

భానుమతి గుఱించి శ్రీకృష్ణనారదుల మధ్య సాగిన సంభాషణము సహజముగ, నిపుణముగ కలదు. నారదుడు.

> "ఈ రమణి యెవ్వ రనినను
> నారాయణుఁ డనియె భానునందన గాదా
> యీ రమణి నే నృపాలకు
> మారున కీఁదగను ననిన మౌనియుఁ బల్కెన్. 32ప.
> నీ వెఱుఁగని దేమున్నది
> దేవకులోత్తంస యైనఁ దెలిపెద వినుమో
> దేవా! భానుమతికి సహ
> దేవుని విభుఁ జేయవలయు దివిజులు మెచ్చన్. " 33ప. 2ఆ.

నాలుగాశ్వాసముల కావ్యమునందు భానుమతివిషయము మూడాశ్వాసములందు కలదు. సహదేవుని విషయము నాలుగవ ఆశ్వాసమునందు మాత్రమే కలదు. అది

కూడ వివాహవిషయమే.

ఇందు పుర (4-27ప. 1ఆ.) నాయికా (35-36ప. 1ఆ; 3-21ప. 2ఆ.) వసంతర్తు (35-44ప. 2ఆ.) నాయికావనవిహార (46-68ప. 2ఆ.) మధ్యాహ్న (67-70ప. 2ఆ.) సరోవర (71-77ప. 2ఆ.) నాయికావారివిహార (78-92ప. 2ఆ.) సూర్యాస్తమయాది చంద్రికావిహారపర్యంత (3-20ప. 3ఆ.) మన్మథవిజృంభణ (21-25ప. 3ఆ.) నాయికా విరహ (26-78ప. 3ఆ.) సూర్యోదయ (84-87ప. 3ఆ.) వివాహసన్నాహ (2-11ప. 4ఆ.) నాయికా (12-18ప. 4ఆ.) నాయకవిరహ (20-25ప. 4ఆ.) వివాహ (27-87ప. 4ఆ.) సంభోగ (88-98ప. 4ఆ.) వర్ణనలు కలవు.

శ్రీకృష్ణుడు ధర్మరాజునకు వ్రాసిన శుభలేఖ (10ప. 4ఆ.) సమకాలికశుభలేఖసరణి.

**రేటూరి భావనామాత్యుడు** : ఇతని కృతి కామేశ్వరీచరిత్రము. ద్విపదకావ్యము. కామేశ్వరికి అంకితము. దైవాంకితము. ఇతడు అద్దంకి సింగరాచార్యుని శిష్యుడు[96]. అతడు రేటూరి రంగరాజుకును గురువు. (4ప. 1ఆ. భా.ప.) కాఁబట్టి కామేశ్వరీచరిత్రము రచనాకాలము 1620 ప్రాంతము కావచ్చును.

ఆదిలక్ష్మి శ్రీరాముని మోహించి, అతడు ఏకపత్నీవ్రతుడగుట వలన కృష్ణునిగా అవతరింపుమని శపించి, తాను కామేశ్వరిగా అవతరించి, కృష్ణావతారమునందును ఇష్టసిద్ధి కలుగకపోవుట వలన విరహవ్యథ నంది ఇలవేల్పుగ వెలసినదని కథ.

**తామరపల్లి తిమ్మయ్య** : ఇతని కృతి శేషధర్మము. శ్రీరామునికి అంకితము. దైవాంకితము. ఇతని ముత్తాత అబ్బమంత్రి,

"ప్రౌఢరాయల మెప్పించి రాయసములు
పైఁడి గంటంబు గొని వ్రాసి భద్రలీలఁ
బైఁడిగంటము వారను పద్దుఁ దెచ్చి "

అలరెనట, ప్రౌఢరాయలన ప్రౌఢదేవరాయలు. విజయనగరసామ్రాజ్యాధిపతులు నలుగురికి ప్రౌఢదేవరాయలను వ్యవహారము కలదు. ఏ ప్రౌఢదేవరాయలో లేదు. కృతి ప్రేరకుడు పెద ధర్మయామాత్యుడు. అతని పెదతండ్రి మనుమడు నారాయణరాయలు,

" ప్రబలసుల్తానమ్మహమ్మదుపాదుషాయి
మహితసామ్రాజ్యవైభవ మజుముదారు. "

సుల్తానమ్మహమ్మదుపాదుషాయి గోలకొండసుల్తాను మహమ్మద్ కులీకుత్బ్‌షా (1580-1612) కాడు. మహమ్మద్ కుత్బ్‌షా (1612-23) కాఁబట్టి శేషధర్మము రచనా కాలము 1620 ప్రాంతము కావచ్చును.

శేషధర్మమునకు మూలము హరివంశములోని ఆశ్చర్యపర్వమునందలి శేషధర్మమని ఆశ్వాసాంతగద్యలందు కలదు. ఇందు శ్రీకృష్ణుని ఆదేశమున, భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన భూదాన మహిమ, గోదానప్రశంస, కన్యాదానప్రశంస, సత్యవాక్య మహిమ, అభయదానఫలనిరూపణము, శ్యేనకపోతసంవాదము, వాపీకూపాదినిర్మాణఫలము, తులసీమాహాత్మ్యము, పూజాకాలద్రవ్యాదినిరూపణము, అన్నదానమహిమ, బ్రాహ్మపూజా విధి, విశ్వరూపవివరణము, వస్త్రదానాదిప్రశంస, గాయత్రీజపబ్రహ్మ యజ్ఞాదివిధానము, పురాణశ్రవణఫలము, మహాపాతకలక్షణము, నిమంత్రణబ్రాహ్మణ నిరూపణము, నరక

నిరూపణము, పుణ్యలోకప్రాప్తిప్రకారము, గర్భస్థజీవావస్థాప్రకారము, భీష్మయుధిష్ఠిరసంవాదము, ఋణవిమోచనోపాఖ్యానము, శంఖతీర్థమహిమ, అనంతశంఖపాల సంవాదము, కావేరీకపిలాసంగమస్నానమహిమ, కుంభఘోణమహిమ, వృషభగిరిమాహాత్మ్యము, మహానవమీవ్రతప్రకారము, అహోబలశ్రీశైలవేంకటాచలకాంచ్యాదిమాహాత్మ్యము, శివరాత్రిప్రభావము, నరకచతుర్దశీమహిమ, వైష్ణవలక్షణము కలవు. విషయగౌరవమే కాని, కవితాగౌరవము పూజ్యము. కారణము విషయమే. పురాణ ప్రాయము.

**నేబతి కృష్ణమాచార్యులు** : ఇతని కృతి రాజనీతిరత్నాకరము. పంచతంత్రము. అముద్రితము. వెలుగునకు వచ్చిన సమాచారమిది[97]: ఇతడు మహమ్మదుశాహుసుల్తాను ప్రధాని. ఇతని గురువులు కందాళ రంగాచార్యులు. కందాళ అప్పగారు. ఇతడు ప్రశంసించిన కవులు మఱింగంటి వేంకటజగన్నాథాచార్యులు, మఱింగంటి సింగచార్యులు. మహమ్మదుశాహు కులీ కుత్బ్‌షా (1580-1612) కంటె, మహమ్మద్ కుత్బ్‌షా (1612-23) అగును. కందాళ అప్పగారు సారంగు తమ్మయకును గురువు. తమ్మయ వైజయంతీవిలాసము రచనాకాలము 1623 ప్రాంతము. ఇది ముందు వివరింతును. కాఁబట్టి రాజనీతిరత్నాకరము రచనాకాలము 1620 ప్రాంతము కావచ్చును.

"భళిరె తొల్లిటి కవులు ప్రబంధకర్త
లయ్యు నీ రాజనీతిరత్నాకరంబు
సేయకుందురు (రె?) మున్ను నేఁ జేయు సుకృతి
కలన నీ కృతి రచియింపఁగలిగె నాకు"

"అని కృష్ణమాచార్యులు అనుట చిత్రము. రాజనీతిరత్నాకరము సంస్కృతమునందు కలదేమో?- పంచతంత్రము ఆంధ్రదేశీయము, వైష్ణవీయమును అగుట దీని ప్రత్యేకత. కథాప్రారంభమునందు శ్రీరంగవర్ణనము కలదు. కాంచీపురవ్యాపారి విష్ణువర్ధనుడు తిరుపతి వచ్చును. ఆళ్వారు తీర్థమున స్నానమాడి, తిరుమణి తిరుచూర్ణములు ధరించి, పన్నిద్దరాళ్వారులను ప్రస్తుతించి, గోవిందరాజును కొలిచి, స్వామిపుష్కరిణిలో స్నానము చేసి, గరుడస్తంభమునకు ప్రదక్షిణము చేసి, వేంకటేశ్వరస్వామిని సందర్శించును. స్వామి ఆదేశమున సంజీవకమును స్వామికి సమర్పించును.

"దినదినము నరవపిల్లలు
పనుపడఁగా నానవాల పాసెపు ముద్దల్
దినుపింప వృషభ మెచ్చెన్
మినమినమని మేని చాయ మించులఁ జూపన్. "

ఇంకను ద్రవిడప్రబంధముల, రామాయణభాగవతముల ప్రభావము కలదు. క్షీరాబ్ధివర్ణనము, శ్వేతద్వీపవర్ణనము, శ్రీమన్నారాయణసాక్షాత్కారము మొదలైనవి కూడ కలవు.

**సారంగు తమ్మయ్య** : ఇతని కృతి వైజయంతీవిలాసము. రఘుపతికి అంకితము. దైవాంకితము. ఇతడు గోలకొండ కరణము.

"ఇనసమతేజులౌ నృపులనెల్ల మహమ్మదుశాహి యేలు నీ
యెనుబది నాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండఁ ద
ద్ఘననగరస్థలిన్ గరణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్ము పొమ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థు లౌనన్. " 30ప. 1ఆ.

ఇందు గోలుకొండయందు "ఎనుబది నాల్గు దుర్గముల నేలిన యేలిక" అయిన, '"మహమ్మదుశాహి ఇనసమతేజులౌ నృపులనెల్ల ఏలు" నని కలదు. అతడు గోలుకొండ సుల్తాను మహమ్మదుశాహి అగును. కాని, ఎనుబది నాల్గు దుర్గముల పరిపాలనాధికారము గోలుకొండ సుల్తానుకు లేదని, అతడు బహమనీసుల్తాను మహమ్మదుశాహి అని ఒక అభిప్రాయము కలదు[98]. మఱి బహమనీసుల్తాను రాజధాని గోలుకొండ కాదు. గుల్బర్గా. అంతేకాదు అతడు (1482-1518) నృపులనెల్లను ఏలిన వాడు కాడు. నృపుల కెల్లను ఓడినవాడు. కనుక బహమనీసుల్తాను మహమ్మదుశాహి కాడు. గోలకొండ సుల్తాను మహమ్మదు కుల్ళ్‌షాయే. ఇతని రాజ్యకాలము 1612-1626 అని పూర్వోక్తము. సారంగు తమ్మయ కరణికము చేసిన కాలము.

"జాతుల వార్తల నుపమల
రీతులఁ బదబంధముల ధరిత్రీతలవి
ఖ్యాతిగఁ గృతు లొనరించు పు
రాతననూతనకవీశ్వరావళిఁ గొలుతున్." 12ప. 1ఆ.

అని తమ్మయ పూర్వ, నూతనకవిస్తుతి. జాతివార్తల నూతనకవీశ్వరులు రఘునాథ నాయకుడు, చేమకూర వేంకటకవి. చేమకూర విజయవిలాసము కావ్యనామమువలె, ఇతని వైజయంతీవిలాసము కావ్యనామము కలదు. విజయవిలాసము రచనాకాలము 1618 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి వైజయంతీవిలాసము రచనాకాలము 1623 ప్రాంతము కావచ్చును.

చిత్రభారతము కృతిభర్త గురువు కందాళప్ప. పాండురంగమాహాత్మ్యము కృతిభర్త గురువు కందాళయప్పగారు. వైజయంతీవిలాసము కృతికర్త గురువు కందాళప్పల గురువు. (11ప. 1ఆ.) ముగ్గురును ఒక్క వ్యక్తియే కావలసిన ఆశ్యకము లేదు. భిన్నవ్యక్తులు కావచ్చును. కందాళప్ప కాలము పదునారవశతాబ్ది ప్రథమపాదము. కందాళయప్పగారి కాలము పదునారవశతాబ్ది మధ్యభాగము. కందాళప్పలగురువు కాలము పదునేడవశతాబ్ది ప్రథమపాదము.

వైజయంతీవిలాసము విప్రనారాయణచరిత్రము. అది ప్రథమతః తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసమునందు కలదు. మూలము గురుపరంపరాప్రభావము, తదుపరి సిద్ధరాజు తిమ్మరాజు పరమయోగివిలాసమునందు కలదు. అనంతరము చెదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రము స్వతంత్రకావ్యము. తదనంతరము సారంగు తమ్మయ వైజయంతీవిలాసము. మల్లన కావ్యము పరమయోగివిలాసములోని విప్రనారాయణ చరిత్రమునకు ప్రపంచీకరణము. తమ్మయ కావ్యము స్వేచ్ఛానుసరణము. చిన్నన్న విప్రనారాయణ పాత్రచిత్రణము కంటె మల్లన విప్రనారాయణ పాత్రచిత్రణము ఉదాత్తము. తమ్మయ విప్రనారాయణ పాత్రచిత్రణము అనుదాత్తము.

పరమయోగివిలాసమునందు మహావృష్టి కారణముగ పర్ణశాలలోనికి రానిచ్చిన దేవదేవి శృంగారచేష్టలు చేసినను విప్రనారాయణుడు చలింపలేదు. "బడలితి రొక్కింత పాదము లొత్తుదునె" అని దేవదేవి పాదము లొత్తి, " ఒక్కనాఁడైనఁ బడుచ రమ్మని కేలుపట్టి లాలించి యొడబాటు గావించిరే" అని అడిగిన, "రాగంబుతో నంతరంగంబు రంగభోగి ప్రేరేప" "మోహనాంగి చేయంటుట వలన" రక్తుడైనట్లు కలదు. విప్రనారాయణ

చరిత్రమునందు,

"తలిరుంబోఁడి దొడంగి మాధవుఁడు రాధం గూడి క్రీడించుగా
థలు కుబ్జం గయికొన్న వార్తలును సత్యావాంఛ లీడేర్పు సు
ద్దులు నాభీరవధూటులందుఁ గల పొందున్ రుక్మిణీదేవిపై
చెలిమిన్ గ్రొన్నన విచ్చులాగు వినిపించెన్ మాధురీవైఖరిన్. 82ప.
ఇవ్విధంబున శృంగారరసప్రధానంబులగు కథాప్రసంగంబులం
గొంత యభిముఖుం జేసి కలఁక యగు ధైర్యంబున నున్న యతనిం
జేరంజని 83వచ.
పడఁతుక తేనె లుట్టిపడఁ బల్కెను మౌనికులావతంస! యిం
పడరఁగ మార్దవంబు నెలవయ్యెడు నీ చరణంబు లొత్తెదన్
బడలిన వార లిందనుకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్
మడవలు దీర్చియుం బిదప మార్చియుఁ గాలువ లేర్పతించియున్. 84ప. 3ఆ.

అని, విప్రనారాయణుని "చరణకమలయుగళి నిజాంకపీఠమున నునిచి, పాదము లొత్తిన, తత్తఱముల, సిగ్గుల, మౌగ్ధ్యముల, మమతల- " తపసి డెందము వెన్న చందమునఁ గరఁగె" ను.

అది గమనించి దేవదేవి కులుకు పలుకుల ఇట్లు పలికెను.

" లాలన సేయవు నన్నుం
గేళిసంగతుల బుజ్జగింపవు నీపై
హేళిం జిక్కితిఁ గన్నడ
యేల దయంజూడ లాఁతినే మునినాథా! " 88ప. 3ఆ.

అని కంకణనిస్వనములు మ్రోయ, కాంచీకలస్వనములు వీనుల విందు సేయ, చన్నులు గయాళింప, లోచనదీప్తులు చెలగ పైకొనును. అయినను రంగస్వామి ప్రేరేపగా విప్రనారాయణుడు క్రీడించును.

వైజయంతీవిలాసమునందు కుంభవృష్టికి ముందే, విప్రనారాయణుడు వివశుడు,

"ఆకాంక్ష తెప్ప వేయక చూచు ననిశంబుఁ
దలఁపుచేతనె తృప్తిఁ గొలుపు మదికి
వనజాక్షి కొంగు సోఁకిన మేను గరుదాల్చు
మొగము విప్పుగఁజేయు మగువ నగిన
నర్థి నొయ్యనఁ గోర్కి నడుగ నుద్యోగించు
నడుగఁ జాలమి నేటి కనుచు మానుఁ
జెలి పల్కు మెచ్చి కోయిల పల్కు దూషించు
నధరంబు మధువున కాసఁజెందు
శిరసుపైఁ బేనుఁ బొడగన్నఁ జేరఁబోయి
హింస సేయకుమని చేతికిచ్చుఁ దిగిచి
తన్మయత నొంది కలికి చేఁతలనె హరిప
రాయణుండైన విప్రనారాయణుండు. 138

ఆ విప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై

గ్రావంబై దృఢదారునై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁ బోఁబో నీళ్లకుం బల్చనై. " 139ప. 2ఆ.

ఇందు రెండవ పద్యము హృద్యమే కాని, అనవద్యము కాదు. మొదటి పద్యములోని వాలకము వజ్రపంజరనిభము కాదు. సద్భావము నిశ్చలము కాదు. దుర్భావము చంచలము. కుంభవృష్టి మిషగ పర్ణశాలలోనికి రప్పించిన దేవదేవిని, విప్రనారాయణుడే,

"సరసిజముఖి! పంచాయుధ
గురుకైంకర్యంబు మనసు గురువై చెప్పన్
సరి నింకొక పంచాయుధ
గురుకైంకర్యమున నీవు గురువగుము.. " 8ప. 3ఆ.

అని కోరును. అందుకు దేవదేవి శ్రీవైష్ణవాపచారమెట్లు సేయుదుననిన విప్రనారాయణుడు,

" అపచారము గాదిది మా
కుపచారమె కాని యో తలోదరి! సమ్య
క్కృపచేఁ గైకొని శంబర
రిపుచేఁ జాకుండ నుద్ధరింపుము నన్నున్." 22ప. 3ఆ.

అని ప్రాధేయపడును. ఇట్టి విప్రనారాయణుని విటుని చేయుటకు దేవదేవి, మధురవాణి పందెము సఱచుటయే వ్యర్థము. పరమయోగివిలాసమునందు కంటె విప్రనారాయణచరిత్రమునందు విప్రనారాయణుడు దృఢచిత్తుడు. వైజయంతీవిలాసమునందు దుర్బలహృదయుడు. అది చెదలువాడ మల్లన ఔచిత్యదృష్టికి నిదర్శనము. ఇది సారంగు తమ్మయ అనౌచిత్యదృష్టికి ఆలవాలము.

వైజయంతీవిలాసమునందు పాత్రానౌచిత్యమే కాదు; అశ్లీలవర్ణనమును కలదు. అది శృంగారనైషధమునందును కలదని అనవచ్చును. అంతకంటె అధికముగ శ్రీహర్షుని నైషధీయచరితమునందు కలదు. హర్షనైషధము శాస్త్రకావ్యము. శృంగారనైషధము శాస్త్రకావ్యాంధ్రీకరణము. కామశాస్త్రమునందు కామశాస్త్రవిషయము అశ్లీలము కాదు. అయిన కామశాస్త్రమే అశ్లీలమగును. శాస్త్రకావ్యములకు శాస్త్రరక్షాకవచము కలదు. వట్టి కావ్యములకు లేదు. అది లేని అశ్లీలవర్ణనము ఏ కావ్యమునందును దోషమే. "ఏకోహిదోషః గుణసన్నిపాతే నిమజ్జతి" అనుటకైన, వైజయంతీవిలాసమునందు గుణసన్నిపాతము లేదు. విప్రనారాయణుని వర్ణనమే వైజయంతీవిలాసమునందు (5ప. 2ఆ.) హాస్యాస్పదము. విప్రనారాయణచరిత్రమునందు (68ప. 2ఆ.) గౌరవాస్పదము.

విప్రనారాయణుని మీది చోరత్వనిందారోపణమును విప్రనారాయణచరిత్రమునందు చోళమహీపాలుడు విచారించును. వైజయంతీవిలాసమునందు దండనాయకుడు విచారించును. అది పరమయోగివిలాససరణి. ఇది స్వేచ్ఛాధోరణి.

వైజయంతీవిలాసమునందు పుర (41-54ప. 1ఆ.) వసంతర్తు (92-96ప. 1ఆ.) గ్రీష్మర్తు (97-101ప. 1ఆ.) సూర్యాస్తమయ (32ప. 2ఆ.) అంధకార (33-35ప. 2ఆ.) విటీవిట (37-41ప. 2ఆ.) చంద్రోదయ (42-44ప. 2ఆ.) వేశ్యవాటి (45-48ప. 2ఆ; 68-72ప. 3ఆ.)ఉదయసంధ్య (50ప. 2ఆ.) సూర్యోదయ (51ప. 2ఆ.) వర్షర్తు (141-148ప. 2ఆ.) శరదృతు (77-83ప. 3ఆ.) వర్ణనలు కలవు. శరదృతువర్ణనమునందు

లక్ష్మీదేవి పండుగ నూతనవిశేషము.

"ప్రచురమై యొకచోటఁ బాటీరకర్పూర
కస్తూరికాదుల కమ్మ తావి
దండిగా నొకచోటఁ బిండివంటల వెంటఁ
బ్రభవించు తైలాజ్యపరిమళములు
రహి నొకచోటఁ గూరల తాలిపోఁతల
తోరంపు సంభారసౌరభములు
రమణ నొక్కొకచో నుర్భ్రాదిమస్తముల్
గమలించు మాంసంపు గముల కమురు
గ్రమ్ముకొని యొక్కచో నంబికాసమర్ప
నాసముద్భూతమైరేయవాసనలును
లంకెఁ దోఁ దోఁపు లాడంగ లక్ష్మిదేవి
పండు గేతెంచెఁ గన్నులపండు వగుచు. 80ప.
ఆ దినంబునందు 81వ.

అచ్చిన వంకనైనఁ దమ రావల నప్పుల దూసియైననున్
మ్రుచ్చిలియైన జీవధనము ల్దిగ నమ్ముడు వెట్టియైననుం
బెచ్చుగ సంతరించి తమ పేరటికంబుఁ దలంప కర్థముల్
దెచ్చి యనుంగువేశ్యలకుఁ దీర్తురు పండుగ దండుగ ల్విటుల్. 82

మింతజనదత్తమేషీ
కంఠసముద్భూతరవము కడు నెమ్మది ను
త్కంఠ సలిపె వేశ్యాకల
కంఠుల కత్తఱి గృహోపకంఠములందున్. 22" 83ప. 3ఆ.

**దామరల వేంగళనాయకుడు** : ఇతని కృతులు 1. కృష్ణకథ 2. బహులాశ్వ చరిత్రము. మొదటిది అనుపలబ్దము. రామాంకితము. (15వ. 1ఆ.) రెండవది తండ్రి వేంకటాద్రికి అంకితము. ఆతని సోదరి వెలుగోటి యాచకస్తూరిరంగన్నపతి భార్య వారి ద్వితీయకుమారుడు యాచమనాయకుడు. ఇతని గుఱించి ఇట్లు కలదు.

"ఉత్తరమల్లూరి యొద్ద రావల పాప
విభునిఁ గొట్టిన నాఁటి విజయకలన
తిరుమల చేరి ధాత్రిని మన్నెరాజులఁ
బాఱఁద్రోలిన నాఁటి బాహుబలము
చెంగలిపట్టు వీక్షించి లగ్గలు వట్టి
యాక్రమించిన నాఁటి విక్రమంబు
పాలెంబు కోట వెల్పట నాజి యతిరాజు
జరగఁ జేసిన నాఁటి శౌర్యపటిమ
మున్నె తోపూరు జగ్గరాణ్ముఖుల నొంచి
మధుర దొర చెంచి మన్నీని మద మడంచి
తిరిచినాపలి పోఁద్రోలు తేజము గల
మేటి వెలుగోటి యాచని సాటి గలరె? " 37ప. 1ఆ.

ఇందలి ఉత్తరమల్లూరి యుద్ధము 31-5-1601 వ తేదీని[99], తోపూరు యుద్ధము 8-7-1616 వ తేదీని[100], జరిగినవి. తిరుమల, చెంగలిపట్టు, పాలెముకోట, మధుర యుద్ధములందు ఒకటి రెండైన, "మున్నె తోపూరు" అనుట వలన తోపూరు యుద్ధము తర్వాత జరిగినవగును. కాఁబట్టి బహులాశ్వచరిత్రము రచనాకాలము 1625 ప్రాంతము కావచ్చును.

బహులాశ్వచరిత్రము బహువిలక్షణమైన కావ్యము. బహులాశ్వుడు విదేహరాజు. విష్ణుభక్తుడు. అతని ఇంటికి కృష్ణుడు వచ్చి ఆతిథ్యము గొనుట కావ్యవిషయము. ఇది కథ కాదు. ఒక సంఘటన. అది నాలుగాశ్వాసము లయినది. పంచమాశ్వాసము కళానిధి చరిత్రము. బహులాశ్వునికి, కళానిధికి బాదరాయణసంబంధము కూడ లేదు. కళానిధి చరిత్రము గుణనిధిప్రభృతుల కథలకు సహోదరము. బహులాశ్వచరిత్రము భక్తుని ఇంటికి భగవంతుడు వచ్చి ఆతిథ్యము గొన్న అపూర్వమైన పౌరాణికసంఘటన.

మిథిలానగరవర్ణన (77-89) బహులాశ్వరాజవర్ణన (90-92) శ్రుతదేవమంత్రివర్ణన (93-94) వ్యాసవసిష్ఠాదిమునుల రాకపోకలు (95-97) మునుల ద్వారకానగరప్రయాణము (98-104) కృష్ణుని కొలువుకూటము (105-108) మునుల కొలువు ప్రవేశము (109-111) కృష్ణుని కుశలప్రశ్నలు (113-115) మునుల సమాధానము (114-116) బహులాశ్వప్రశంస (117-120) బహులాశ్వుని చూడ బోవుటకు కృష్ణుని నిశ్చయము (121-122) ప్రథమాశ్వాసము.

కృష్ణుని రాణివాసము తోడి విదేశాపురి విడిది (2-6) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతవర్ణన (7-10) వసంతర్తువర్ణన (11-13) కృష్ణుని రాణివాసముతోడి వినోదకేళి (14-18) వనకేళి (19-53) జలకేళి (34-68) వనభోజనము (69-72) సంగీతసాహిత్య నృత్యవిశేషము (73) ద్వితీయాశ్వాసము.

కృష్ణుని మిథిలానగరప్రవేశము (2-13) ఏకకాలమున ద్విరూపధారణమున రాజ, మంత్రి గృహముల ప్రవేశము (14-15) బహులాశ్వుని స్వాగతసపర్యలు (16-28) కృష్ణస్తుతి (29-34) కృష్ణుని బహులాశ్వప్రశంస (36-40) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత వర్ణన (41-102) తృతీయాశ్వాసము.

బహులాశ్వుని ఆతిథ్యము (2-55) ప్రణుతి (56-66) బహులాశ్వుడు కోరిన మీదట విశ్వామిత్రుడు చెప్పిన (67) సీతాకల్యాణ వృత్తాంతము (68-125) కృష్ణుని ద్వారకానగరప్రయాణము (126-137) చతుర్థాశ్వాసము.

ఇది బహులాశ్వచరిత్రము. ఇందు మునుల కృష్ణుని కొలువు ప్రవేశము, కవుల రాజా కొలువు ప్రవేశమును గుర్తునకు తెచ్చును. అంతేకాదు. పరీక్షార్థుల సభాప్రవేశమును తలంపునకు తెచ్చును.

"ప్రభుగోష్ఠి వేగిరపడకు విశ్వామిత్ర
వాల్మీకి వాణిలో వత్తుఁగాని
భరతప్రపంచంబు హరి యెక్కడడుగునో
జడియక యుత్తరం బిడుము పులహ
యొక్కచోఁ దర్కోక్తిఁ ద్రొక్కుడు వడు నీవు

తెచ్చుకో నెమరున కిచ్చు వత్స
యొక్కక్కరె ప్రసంగ మొసఁగెడుచోఁ గొంద
అడ్డగట్టులు వల దత్రిమౌని
శాస్త్ర సాహిత్యములు మాకె చాల జీత
మంచుఁ గలగూరగంప సేయకుము బాద
రాయణ కవిత్వసందర్భరసము నింపు
మనుచు దౌవారికద్వార మపుడు దాటి " 110ప. 1ఆ.

బహులాశ్వుడు రాజు మాత్రమే కాడు; కవి రాజు కూడ.

"తంఁడ్రి పేరిటి దొరబిడ్డ తగులమునకు
విల్లు విఱిచిన మేటికి విన్నవించు
కబ్బముల వాఁడు . . . .  . .  . . " 119ప. 1ఆ.

తండ్రి పేరిటి దొర జనకమహారాజా. అతని బిడ్డ సీత. ఆమెను పెండ్లాడుటకు విల్లు విఱిచిన మేటి రాముడు. కృష్ణకథను రామాంకితము చేసిన వేంగళనాయకుడు, బహులాశ్వుడు కావ్యములు రామాంకితము చేసిన కవి అనుట గమనార్హము.

విదేశాపురిలోని ఆరామవనసీమ ఆంధ్రావనిలోని ఆరామవనసీమయే.

"గనిమల్ దీఱిచి కాల్వ లేర్పఱిచి చెంగల్వ ల్పస ల్పావి నీ
రున కేతం బిడి వట్టివేఱు కురువేఱుం బోదికై మంచు చి
న్కిన నిద్దా బొనగూడ వాటుకొని గన్నేరావలం బైరు చే
సిన భద్రాక్షలు ద్రాక్ష లిక్షువులు రాజీవాక్షుఁ డీక్షింపఁగన్. " 20ప. 2ఆ.

ప్రకృతివర్ణనములోని గోపికల విరహము ప్రత్యేకఘట్టము. (60-90ప. 3ఆ.)

"క్రిక్కిఱియం గవుంగిట బిగించెదు నీ యెద కౌస్తుభంబు నా
చిక్కని గుబ్బ సందిటను జిక్కను దుత్తుమురౌ నటన్న నీ
చక్కెర మోవి మానికమె చక్కఁగఁ జిక్కె నదేటి కన్న మే
ల్లక్కున నెక్కళావతికిఁ గానుక చేసితొ నందనందనా! " 66ప. 3ఆ.

బహులాశ్వుని విందు తెలుగు విందు. వడ, బజ్జి, పాలతిమ్మనము, ఊరుంగాయలు, పచ్చడులు, ఆవు నేయి, పరమాన్నము, పెరుగు మొదలైనవి కలవు. అంతేకాదు.

"మృదులాన్నంబు మృగీమదోపమఘృతం బింపారఁగాఁ బెల్పు తా
లిదముల్ కమ్మని యూర్పులుం బడిదెముల్ క్షీరాన్నముల్ తేనెలున్
ముదురం గ్రాఁగిన పాలు చక్కెరలు జున్నుల్ బజ్జులుం బచ్చడుల్
కదళీముఖ్యఫలావళుల్ దధియుఁ దక్రంబుం బ్రహర్షింపఁగన్. " 39ప. 4ఆ.

బహులాశ్వుడు భాగవతుడు అతని వలన మిథిలాపురజను లందఱును భాగవతోత్తములు. కళానిధి అను వాడు కాని గుణములు త్రోచినైచి వారిని మించెను. అని శుకయోగి అనిన, ఆ "కళానిధి కథావిధానంబు సవిస్తరం బానతీయవే" అని పరీక్షిత్తు అడిగిన, శుకయోగి వివరించును. కళానిధి తండ్రి రత్నాకరుడు పరమలోభి. కల్తివ్యాపారి.

"దిన మొక కూర గాని మఱి తేఁకుడు శాకము లంచుఁ బల్కు వం
డిన పలుగూరఁ గాంచి జగడింపఁగ జొచ్చు నటంచు వాని నొం
టిన భుజియింపఁబెట్టి కడ నిచ్చ భుజించెద రింటి వార ల
య్యనుపమశాకసూపకలమాన్నఘృతాదుల వాఁ డెఱుంగమిన్." 7ప. 5ఆ.

"పడి కొంచెంబుగ రాదు నుప్పడులకుం బానీయ మర్పించుఁ ద

క్కిడ గట్టుం దిన మెచ్చ గుందులుగఁ బూన్కెన్ నేతిలో నూనియల్
మిడుచు న్నూనియ నాముదంబుఁ గలుపున్ మేలాముదంబందు వె
ల్మిడి నించుం గదియించుఁ బ్రాఁదవుడు హోళిం గ్రొత్త బియ్యంబునన్." 11ప. 5ఆ.

ఇట్టి రత్నాకరుని కుమారుడు కళానిధి వసంతమహోత్సవము నాడు రామాలయము నకు వచ్చిన మణిమంజరి అను వేశ్య అందచందములకు ముగ్ధుడై,

"వైశ్యు ల్నవ్విన నవ్వనీ కటకవిద్వత్కోటి చేటీభటా
వశ్యాత్ముండని పల్కినం బలుకనీ వాణిజ్యపూజ్యుల్ ధనే
ద్దేశ్యుల్ కంచపు పాత్తు హత్తదని ముందే త్రోఁచినం ద్రోవనీ
వేశ్యాకమ్రకపోలచుంబనకళావృత్తిం బ్రవర్తించెదన్." 87ప. 5ఆ.

అని ప్రవర్తించును. ఇల్లు గుల్లసేయును. అత్తింట నగలు కూడ అపహరించును. కడకు వేశ్యమాత వెళ్లగొట్టును. మణిమంజరి ఆదరించదు. ఆమె వెంట రామాలయమున కేగిన చూడదు. మాటాడదు. కళానిధి పశ్చాత్తాపము చెందును. మంటపము పంచను చేరి, "రఘుప్రవరా!" అని కన్నులు మూసి నంతలో రామభద్రుడు ప్రత్యక్షమగును. సర్వసంపద లొసగును. కళానిధి గుడులు గోపురములు కట్టించును. దానధర్మములు సేయును. ఇది కళానిధి చరిత్రము. బహులాశ్వచరిత్రమునకు అనుబంధము.

సీతాకల్యాణము వినా బహులాశ్వచరిత్రము భక్తిప్రధానము. కళానిధి చరిత్రము రక్తిప్రధానము. బహులాశ్వచరిత్రము వర్ణనాత్మకము. కళానిధిచరిత్రము కథాత్మకము బహులాశ్వచరిత్రము అపూర్వసంఘటన. కళానిధిచరిత్రము గతానుగతికము.

**చిత్రకవి వేంకటరమణ** : ఇతని కృతులు 1. త్రిలోకసంజీవని. 2. సకలవర్ణనాపూర్ణరామాయణము. 3. కుమారగురువిలాసము. 4. అభిమన్యువిలాసము. 5. సాంబవిలాసము. ఇందు సకలవర్ణనాపూర్ణరామాయణము, సాంబవిలాసము మాత్రమే ఉపలబ్ధములు. అవి కూడ అముద్రితములు. సకలవర్ణనాపూర్ణరామాయణము సుబ్బ రాయనికి, సాంబవిలాసము సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి అంకితములు. సుబ్బరాయడు కూడ సుబ్రహ్మణ్యేశ్వరస్వామియే[101] అగును.

"ప్రతిపర్వదివససేవా
గతభూజననేత్రమోదకర! సూర్యవిభా
తతదివ్యమంగళాకృతి
భృతసేవక! సుబ్బరాయ! బుధజనగేయా! "

ప్రతిపర్వదినమునందు సేవించుటకు వచ్చిన జనుల నేత్రములకు మోదము కలిగించువాడు, దివ్యమంగళాకృతిని భరించు సేవకులు కలవాడు దైవమే. రెండు కృతులును దైవాంకితములే. ఇతని తండ్రి అనంతయ వసుచరిత్ర వ్యాఖ్యాత. వసుచరిత్ర రచనాకాలము 1571 వ సంవత్సరమని పూర్వోక్తము[102]. వాఖ్యాన రచనాకాలము 1600 ప్రాంతము కావచ్చును. అయిన వేంకటరమణ కృతుల రచనాకాలములు త్రిలోకసంజీవని 1620 ప్రాంతము, సకలవర్ణనాపూర్ణ రామాయణము 1625 ప్రాంతము, కుమారగురు విలాసము 1630 ప్రాంతము, అభిమన్యువిలాసము 1635 ప్రాంతము, సాంబవిలాసము 1640 ప్రాంతము అగును.

సకలవర్ణనాపూర్ణరామాయణమునకు విద్వత్కవికర్ణరసాయనసకలవర్ణనాపూర్ణ

రామాయణ నామాంతరము కలదు. ఇది సంకుసాల నృసింహాకవి కవికర్ణరసాయనమునకు ప్రతిద్వంద్విప్రాయమైన రచనమని స్వయంవ్యక్తము సేయును. ఇది రావణదమ్మీయము వంటి కావ్యము కూడనట.

సాంబవిలాసము మూడాశ్వాసముల శృంగారకావ్యము. ఇందు దుర్యోధనుని కూతురు లక్షణకు, శ్రీకృష్ణుని కుమారుడు సాంబునికి జరిగిన వివాహము ఇతివృత్తము.

**మల్లవరపు వాలేశ్వరుడు** : ఇతని కృతి భల్లాణచరిత్రము అముద్రితము. మల్లవరపు నాగేశ్వరునికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఇతడు ఇవటూరి రామనారాధ్యుని శిష్యుడని ఆశ్వాసాంతగద్యను కలదు. అతడు అజ్జరపు పేరయలింగము గురువు. కాఁబట్టి భల్లాణచరిత్రము రచనాకాలము 1625 ప్రాంతము కావచ్చును.

**కాకమాని మూర్తి** : ఇతని కృతులు 1. రాజవాహనవిజయము. 2. పాంచాలీ పరిణయము. రాజవాహనవిజయము వేంకటేశ్వరాంకితము. పాంచాలీపరిణయము శ్రీరంగేశాంకితము. రెండును దైవాంకితములు.

దామరల వేంగళభూపాలుని బహుళాశ్వచరిత్రములోని పద్యములు, కాకమాని మూర్తికవి బహుళాశ్వచరిత్రములోని పద్యములుగ, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు ఉదాహరింపబడినవి[103]. అది ప్రామాదికమైనను, కాకమాని మూర్తికవి దామరల వెంగళభూపాలుని ఆస్థానకవి కావచ్చును. కాఁబట్టి రాజవాహనవిజయము రచనాకాలము 1625 ప్రాంతము, పాంచాలీపరిణయము రచనాకాలము 1630 ప్రాంతము కావచ్చును.

**రాజవాహనవిజయము** : ఇది "ప్రతిపద్యప్రతివాక్యోన్నతికావ్యము" అని కవి అభిప్రాయము. (21ప. 1ఆ.) అంతేకాదు. ఇతడు "కృతిలోఁ బ్రతిపద్యచమత్కృతి గలుగంగఁ బలుక నేర్చు కృతి" అని స్వప్నమునందు సాక్షాత్కరించిన వేంకటేశ్వరస్వామి పలికెనట! (19ప. 1ఆ.) ప్రతిపద్యమునందు కాకపోయినను బహుపద్యములందు ప్రౌఢిమ కలదు. చమత్కృతి కలదు. కథయే సామాన్యము. వసుమతీరాజహంసులకు రాజవాహనుని జననము; వివాహితుడు, యౌవరాజ్యపట్టాభిషిక్తుడును అయిన రాజవాహనుని దండయాత్ర, శాండిల్యముని విందు, మృగయావినోదము, వనజలకేళీవిహారిణి అవంతీ సుందరి దర్శనము, అవంతీసుందరీరాజవాహనుల మోహము, విరహము, వివాహము మాత్రమే ఇతివృత్తము. కల్పితకథ. ఇందు రాజవాహనుని పరాక్రమము చూచుటకు అతని భార్యలలో ఒకతె సోదరునితో అతని వెంట బయలుదేరుట విశేషమే గాని, రాజవాహనుని పరాక్రమము చూచి పరవశించినది లేదు; పరిణయమును గాంచి పరితపించినది లేదు. నిర్వహించిన పాత్రయు లేదు.

రాజహంసుడు నందనోదయవార్త విని ఆనంద మొందిన విధమిది :

"దూరయాత్రాగతుఁడు తన యూరుఁ గనిన
కరణి, తృష్ణార్తుఁ డమృతంబు గాంచు సరణి
ఖరకిరణఖిన్నుఁ డొక చెట్టు గన్న పగిది
నందనోదయవార్త నానంద మొంది" 14ప. 2ఆ.

ఇందు "దూరయాత్రాగతుఁడు తన యూరు గనిన కరణి; ఖరకిరణఖిన్నుం డొక

చెట్టు గన్న సరణి" అను ఉపమానములు అభినవములు. అతిసహజములు.

రాజవాహనుని జైత్రయాత్రకు "సాన మెఱుంగు రంగులు పొసంగు పిరంగి పరంగి కేడెము" కలవు. (46ప. 2ఆ.) పరంగి కేడెమన ఫ్రెంచిదేశపు డాలు. మాళవరాజు యుద్ధమునందు మందు తుపాకి పేల్చు విధము కూడ కలదు.

> "కటిని ఘటిల్లు కొమ్మపుడు గైకొని మందు తుపాకి నించి గుం
> డటుల శలాకఁ గూరి తగు నట్లుగ రంజక ముంచి కొమ్మ మీఁ
> దట నిడి క్రోవి పత్తి వెసఁగూర్చి పిరంగికి గండిఁ జూచు త
> ద్భటుఁ బడనేసి యార్చె మగధక్షితినాథుని యొద్ద నుద్ధతిన్." 26ప. 5ఆ.

శాండిల్యమౌని విందులో వంకాయవేపుడు, చిక్కుడు జట్టలు (100ప. 2ఆ.) ప్రేల్చిన పొట్టి కాకరకాయ, వంకాయ యూర్పులు, ఊరుఁగాయ (105ప. 2ఆ.) కలవు.

వనకేళిజలకేళివర్ణనములు కవలబిడ్డలు. రాయలయుగము నుండి వనకేళివర్ణనము నందు పుష్పాపచయఘట్ట మొక రగడ. అట్టిది రాజవాహనవిజయమునందు వనకేళి వర్ణనములోని పుష్పాపచయఘట్టము గాక, జలకేళివర్ణనములోని నీటి చిమ్ములాట ఘట్టము రగడ. (122ర. 3ఆ.)

ప్రౌఢిమ పరిఢవిల్లు పద్యము :

> "పంచేషూగ్రజయాంకకంకణరణత్పాదాందుకాగ్రచ్ఛిదా
> చంచచ్ప్రాతనచుంచుచంచుహృతమోచం, బంచవర్ణచ్ఛదో
> దంచద్రత్నమయీభవద్భువనరామాఖ్యాసమాఖ్యాతినై
> రించాంభోజముఖీశుకీజ నొక కీరిం గేలఁ గీలింపుచున్." 79ప. 4ఆ.

శబ్దచమత్కృతిపద్యములు :

> "అన్నగరము రిపుసింధూ
> త్పన్నగరము సన్నతాగ్రపన్నగరము సం
> పన్నగరము వెడవెన్నుని
> య న్నగరము మనుపు నవని ననిశం బగుటన్." 46ప. 1ఆ.

> "అమరీనిభనఖజితశు
> భ్రమరీచి ప్రమద సరియె రమణులు కచవి
> భ్రమరీతుల భ్రమరీతులఁ
> జమరీకులసమతఁ జెలఁగు జలజేక్షణుకున్." 9ప. 4ఆ.

**పాంచాలీపరిణయము** : ఇది "సుహృత్కవిరాట్కాంచనము, సహృద్ద్విరేఫ (ద్విరేభ?) కాంచనము సుమీ"అని (12ప. 1ఆ.) స్వప్నమునందు సాక్షాత్కరించిన శ్రీరంగేశుడు చెప్పెనట! అంతేకాదు.

> "అల్లసాని వాని యల్లిక బిగి సొంపు
> ముక్కు తిమ్మనార్యు ముద్దుఁ బలుకుఁ
> బాండురంగసుకవి పద్యంబు హరువును
> గాకమానిరాయ నీకె కలదు " 13ప. 1ఆ.

అని కూడ శ్రీరంగేశుడే పలికెనట! పాంచాలీపరిణయము ఇతివృత్తము ప్రసిద్ధము. ఇతిహాసలక్షణము కంటె సమకాలికలక్షణము సమధికము. ద్రౌపది స్వయంవరమహోత్స వమునకు వైష్ణవాచార్యపురుషులు, వైదికజాతి ముత్తైదువలు, అప్పుల బాపనయ్య,

కోనలమ్మ కోక కట్టిన స్త్రీ, రెడ్లు, రెడ్డిసానులు, శివబాపన తండము, దిగంతదేశగణికలు వచ్చిరట! (72-80ప. 1ఆ.) స్వయంవరసమాగతరాజకుమారుల పరిచయము (23-28ప. 2ఆ.) రాజకుమారుల వికారములు (32-41ప. 2ఆ.) ద్రౌపదీపరిణయఘట్టమునందు యక్షగానప్రభావము (22-25ప. 5ఆ.).

"అర్ఘ్యు షలోచనల్ పలుకు నప్పుడు విప్రులు హోమవేళ మీ
రొర్ఘ్యులు రండు తెండు సమిధోత్కర మీ యవధాని బ్రహ్మ యీ
యర్ఘ్యుములోన యా పనస యన్న వశిష్ఠులు మీరు శ్రౌతమం
దర్ఘ్యురె యంచుఁ బంచుకొని రందఱు వేల్పుచు ద్రవ్యదక్షిణల్" 25ప. 5ఆ.

వివాహపు విందునందు వంకాయ (45) కాకరకాయ (46) గుమ్మడి కాయ (48) నీరు మజ్జిగ (56) ఉప్పూరఁగాయలు, పప్పు (57) దప్పళాలు, క్షీరాన్నములు (58) మొదలైనవి కలవు.

ఇందును శబ్దచమత్కృతి ఇంచుకంత కలదు.

"దాయాదులు మాయాసము
దాయాదులు వచనమధురతామిషసకలా
దాయాదులు కలహోమం
దాయాదులు ధరణి యెఱుఁగదా యా దుడుకుల్." 43ప. 5ఆ.

అల్లిక బిగి సొంపు, ముద్దుఁ బలుకు, పద్యము హరువును అంతంత మాత్రమే.

మల్లారెడ్డిదేశాయి : ఇతని కృతి గంగాపురమాహాత్మ్యము. క్షేత్రమాహాత్మ్య కావ్యము. అసమగ్రముగ - ద్వితీయాశ్వాసములోని కొంత భాగము వఱకు మాత్రమే లభించినది. ఇతని పెదతాత మల్లారెడ్డి కుతుబుశాహాచే అందలము, దర్శీపులు(?) అందుకొన్నట్లు ఇందు కలదు[104].

"కుతుబుశాహానరేంద్రుచేఁ గోర్కె లలర
నందలంబును దర్శీపు లందుకొనుచు
సరసపూర్ణుల పట్టణచాదరగుచుఁ
బ్రజలఁ బాలించె భూభుజాల్ ప్రస్తుతింప." 17ప. 1ఆ.

గోలకొండ సుల్తానుల వంశనామము కుత్బ్‌శాహి. అది కుతుబుశాహి అయినది. ఏ కుతుబుశాహి మల్లారెడ్డికి అందలము, దర్శీపులు ఇచ్చెనో? -ఇభరాముడని పేరు గాంచిన ఇబ్రాహీం కుత్బ్‌షా ఈయవచ్చును. అతని కాలము 1550-1580. అది పెదతాత మల్లారెడ్డి కాలము కావచ్చును. అయిన మనుమడు మల్లారెడ్డి దేశాయి కాలము 1605-1645 అగును. కాఁబట్టి గంగాపురమాహాత్మ్యము రచనాకాలము 1630 ప్రాంతము కావచ్చును.

గంగాపురమాహాత్మ్యము స్కాందపురాణమునందలి తీర్థఖండములోనిదని కలదు. (57ప. 1ఆ.) గంగాపురము మహబూబు నగర్ జిల్లాలోని జడ్చర్లకు సమీపము నందలిగ్రామము. మత్స్యాపురము, దురితకోలాహలము, మాయాపురము అని పూర్వ నామములు. (60ప. 1ఆ.) క్షేత్రదైవము చెన్నకేశవస్వామి. క్షేత్రమాహాత్మ్యమునందు సుప్రభాపుణ్యశీలురవృత్తాంతము శృంగారప్రబంధము. (100-272ప. 2ఆ.) సుప్రభ వర్ణనములనందు నేరెటేటియసల్‌దెచ్చి"అను పెద్దన మనుచరిత్రములోని పద్యమునకు

అనుసరణము కలదు.

"నేరెటివాగుపంకమున నిద్దపుకారు మె ఱుంగుదీవెలం
భోరుహసంభవుండు దగ ముద్దగఁజేసియు వన్నెలెక్కఁగా
సారసుధారసంబు పయిఁజల్లుచుఁజేసెనొ దాని కాంతివి
స్ఫారితసుప్రభాప్త్యాయముపాటిలు నెట్లెటు కాకలిక్కినన్." 133ప. 2ఆ.

సుప్రభాపుణ్యశీలుర కుమారులు వీరగం(హొం)బాలుడు, భువనైకమల్లుడు. జగదేకమల్లుడు, త్రిభువనైకమల్లుడు, చాణుక్యమల్లుడు. పుణ్యశీలుడు త్రిభువనైకమల్లుని చేత ఆలయము, చాణుక్యమల్లునిచేత ప్రాసాదాదికము కట్టించి, వీరహొంబాలునిచేత నందకాద్రినుండి కేశవస్వామిని తెప్పించి, గంగాపురము నందు ప్రతిష్ఠించుట ప్రధానవిష యము. మీనాంబరవృత్తాంతమునందు నలచరిత్ర కలదు. చతుర్థాశ్వాసము అసమగ్రము గ లభించినది.

పుర (66-86ప. 1ఆ.) నాయిక (116-117, 130-156, 158-159ప. 2ఆ.) అపరాహ్ణసమయవేశ్యాజన (162వచ.-164వచ. 2ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయ పర్యంత (165-171, 176-179, 224-231ప. 2ఆ.) విటీవిట (173-177, 180-186ప. 2ఆ.) నాయకవిరహ (187-198ప. 2ఆ.) నాయికావిరహ (199-220ప. 2ఆ.) స్వయంవర (232-244ప. 2ఆ.) యుద్ధ (245-254వచ. 2ఆ.) పురప్రవేశ (254వచ.-255ప. 2ఆ.) ప్రభృతివర్ణనలు కలవు.

**కంకంటి నరసింహము** : ఇతని కృతులు, 1. విష్ణుమాయావిలాసము. 2. ఆత్మబోధ. మొదటిది అయిదాశ్వాసముల ద్విపదకావ్యము. రెండవది అసమగ్రముగ లభించినది. అముద్రితము ఇతడు కంకంటి పాపరాజు అనుజుడు. విష్ణుమాయావిలాసము కంకంటి పాపరాజు అనంతరము రచించినట్లు కలదు[105].

"దురితసరోరుహహతుహినభానుండు
సరసుండు పాపరాజప్రధానుండు
నా కలలో నొక్కనాఁడు గాన్పించి
యేకతంబునఁ గూర్మియెసఁగ నిట్లనియె."

కలలో కనిపించిన కంకంటి పాపరాజు - విష్ణుమాయావిలాసము ద్విపదకావ్యము. రచనాకాలమునందు - ఇలలో లేడని ఇదమిత్థము. కాని పుష్పగిరి తిమ్మన కలడు[106]. "కృతిసహాయుఁడు" కూడ. విష్ణుమాయావిలాసము రచనాకాలము 1635 ప్రాంతము, ఆత్మబోధ రచనాకాలము 1640 ప్రాంతము కావచ్చును.

విష్ణుమాయావిలాసము చింతలపూడి ఎల్లనార్యుని విష్ణుమాయావిలాసమునకు ద్విపదీకరణము. ఆత్మబోధ వేదాంతగ్రంథము.

**సింహాద్రి వేంకటాచార్యులు** : ఇతని కృతి చమత్కారమంజరి. లక్షణాపరిణ యమని నామాంతరము. అముద్రితము. రామానుజాచార్యులకు అంకితము. ఆచార్యాం కితము. ఇందలి పద్యములు అప్పకవీయమునందు ఉదాహృతములు. (182ప. 2ఆ;92ప. 3ఆ.) అప్పకవీయము రచనాకాలము 1656 వ సంవత్సరమని పూర్వోక్తము. కాఁబట్టి లక్షణాపరిణయమను నామాంతరము కల చమత్కారమంజరి రచనాకాలము 1640 ప్రాంతము కావచ్చును.

ఇందు శ్రీకృష్ణుడు మద్రదేశాధిపతి బృహత్సేనమహారాజు తనయ లక్షణను పరిణయమాడుట ఇతివృత్తము.

**దామరల అంకభూపాలుడు** : ఇతని కృతి ఉషాపరిణయము. ఇందు అంకభూపాలుని సవతి సోదరుడు అయ్యనృపతి, తమ తండ్రి చెన్నభూపాలుని పేర చెన్నపట్టణము కట్టించినట్లు కలదు.

"ప్రళయకావేరి మైలాపురంబుఁ గల్మి
తీరమునఁ బోర నది మట్టు పెట్టఁ దండ్రి
పేరఁ దన్మధ్యభూమినిఁ బృథువిభూతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి."

ప్రళయకావేరి పులికాట్. మైలాపురము మైలాపూర్. చెన్నపట్టణము మద్రాస్. చెన్నభూపాలుడు దామరల వెంగళభూపాలుని అన్న. అతని పేర అయ్యనృపతి చెన్నపట్టణము కట్టించిన కాలము 1639 వ సంవత్సరము[107]. కాఁబట్టి ఉషాపరిణయము రచనాకాలము 1640 ప్రాంతము కావచ్చును.

ఇతివృత్తము ఉషానిరుద్ధుల పరిణయము. అది ఎఱ్ఱన హరివంశమునందు, నాచన సోమన ఉత్తరహరివంశమునందు పోతన భాగవతమునందు సరసకవిత్వసరళము. ఇందు జటిలకవిత్వజర్జరము.

బలరామకృష్ణుల జనన పరాక్రమ కల్యాణములు, రుక్మవతీప్రద్యుమ్నుల వివాహము, అనిరుద్ధజనన బాల్య యౌవనములు ప్రథమాశ్వాసము. నారదుని ఉషానిరుద్ధ పరిణయసూచనము, అనిరుద్ధుని వితర్కవిరహతాపములు, బాణుని సహస్రబాహు విక్రమము, పార్వతీపరమేశ్వరస్తుతి, పరమేశ్వరుని వరప్రసాదము, ఉషాసౌందర్యము, స్వప్నసమాగమము, విరహము, చిత్రరేఖ చిత్రలేఖనము, అనిరుద్ధప్రత్యభిజ్ఞ, చిత్రరేఖ ప్రతిజ్ఞ ద్వితీయాశ్వాసము. చిత్రరేఖ ద్వారకాప్రయాణము, ఇష్టదేవతావందనము, అంతఃపురప్రవేశము, అనిరుద్ధహరణము, ఉష వనవిహారము, విరహాతిశయము, ఉషానిరుద్ధుల సమావేశము, పరిణయము, శృంగారము తృతీయా శ్వాసము. ఉషానిరుద్ధుల సరసవినోదము, ఉష గర్భధారణము, బాణుని కేతుభంగము, అనిరుద్ధుని ప్రభాతపూజ, ఉషానిరుద్ధుల ద్యూతకేళి, ఉష గర్భచిహ్నములు చూచిన దాది బాణదంపతులకు చెప్పుట, బాణుని ఆగ్రహము, బాణానిరుద్ధుల యుద్ధము, అనిరుద్ధ బంధనము, రుక్మిణి విచారము, నారదుని సమాచారము, బలరామకృష్ణుల సమర సన్నాహము, ప్రయాణము, నారదసందేశము, యుద్ధము చతుర్థాశ్వాసము. శివాగమనము, యుద్ధము, బాణబాహుఖండనము, శివకేశవుల అనుగ్రహము, బాణుని స్తుతులు, పరిణయామోదము, విందు వినోదము, బంధు సమ్మోదము, ఉషానిరుద్ధుల స్వగృహ ప్రవేశము పంచమాశ్వాసము.

ఇందు ఉషానిరుద్ధుల రహస్యసమావేశఘట్టమునందు బ్రహ్మాదులు సాక్షాత్కరించి, ఉషానిరుద్ధులకు వివాహము చేయుట విచిత్రకల్పనము.

" సరసిజసంభవుఁ డయ్యెడ
సురమునిముఖమునులతోడఁ జోద్యము మీఱం

బరువడి నేతేఱఁ గని య
నిరుద్ధుఁడు వనజముఖియును నెఱసినభక్తిన్ 165
దండప్రణామముఖవిధు
లొండొండ యొనర్ప బంధురోత్సాహముతో
నిండిన కరుణారసమున
మెండుకొనం జూచి యపుడు మేలు దొలంకన్. 166
కాంచనతులితాంగిఁ గంజసన్నిభకంఠ
విధుబింబసమవక్త్ర విద్రుమోష్ఠిఁ
ద్రైలోక్యపద్మనేత్రాచిత్తసమ్మోహ
నావహవరరూప నంబుజాక్షి:
బంధురపరిపంథిసింధురహర్యక్షు
సౌందర్యవిజితవసంతమూర్తి
గాంభీర్యపాథోధిఘననీలనిభదేహు
నమితశౌర్యసమగ్రు యదువతంసు
మౌక్తికంబులచే విధియుక్తమార్గ
మునను దలఁబ్రాలు పోయించి- పొలఁతి నతనిఁ
జెట్ట పట్టించి సనికెలు మెట్టఁజేసి
వారిఁ గూర్చుండ నియమించి గారవించి 167
సతికిని బతికిని మంత్రా
క్షతములు దీవించి యొసఁగి కమలజుఁడు సర
స్వతియును మునులును గుతుకా
న్వితులై చని రంత నాత్మనిలయంబులకున్. " 168ప. 3ఆ.

బ్రహ్మ సరస్వతితోను, నారదునితో మాత్రమేగాక, మునులతో కూడ వచ్చి, ఉషా నిరుద్ధులకు తలంబ్రాలు పోయించి, చెట్ట వట్టించి, సనికలు త్రొక్కించి, దీవించి, మంత్రాక్షతము లొసగుట శుభావహమే గాని, ఇంతమంది బాణాసురుని అంతఃపురము నందే ఏకరాత్రివివాహము చేసినను, ఎవ్వరికిని తెలియకపోవుట బ్రహ్మాదుల మాయామంత్రమో? బాణాదుల నిద్రాయోగమో?

యుద్ధభేరి మ్రోగి (118ప. 4ఆ.) సమరసన్నాహము సాగి (119ప. 4ఆ.), కవి శ్రీకృష్ణుని శృంగారకేళి విస్మరించకపోవుట విస్మయజనకము.

"పద్మనేత్రుండు వివిధరూపములఁ జనుచు
వారి వా రిండ్ల కడకు నవ్వారియైన
వారిఘటపాళిఁ జెలఁగు నబ్జారి మీఱి
దర్పణశ్రేణిఁ దోఁచు కందర్పుఁ దెగడి 124
దేవారాతివిదారి యన్ని యెడలన్ దివ్యప్రభావంబులం
బ్రావీణ్యంబున నవ్వుచుం దెగడుచుం బట్టాడుచుం బిల్చుచున్
సేవల్ సేయఁగఁ బవ్వళించుచును వాసిం జేరి లాలింపుచున్
ఠీవిం గూడుచు భామలం గలసియుండెం జిత్రరూపంబునన్. 125
అప్పుడు రుక్మిణీసరసిజాననఁ గూడి మనోరథమ్ములం
దెప్పలఁ దేలుచున్ జలదనీలనిభాంగుఁడు గప్పురంబులం

గుప్పెడు పల్కులం జెలులకుం దగు చోద్యము లుగ్గడింపఁగా
నొప్పుగఁ బాట పాడఁగ మహోత్సవలీలల నుండు నంతటన్. 126ప. 4ఆ.

ఉష స్వప్నసమాగమమును వివరింపకపోవుట విశేషము.

"వనమున మెలంగి యపుడొం
టిని సఖులను బాసియున్న నీటు గనుటకుం
జని యనిరుద్ధుఁడు గోరినఁ
గనుఁగొని తాఁగూడినట్లు కలగని యంతన్ 108
మేల్కని నల్గడ లరయుచు
నిల్కడ లేకిట్లు పోవ నీకుం దగునే?
పల్కవు హో కాంతా యని
కల్కి యపుడు పల్కఁ జెలిమికత్తియ లెలమిన్." 109ప. 2ఆ.

బాణాసురుని విందు భోజనమునందు ఉప్పువరుగులు, పచ్చడులు, ఊరుగాయలు; పప్పులు; చిక్కుడు కాయల, పొట్ల కాయల, కాకర కాయల, కంద దుంపల కూరలు కలవు. (286-290ప. 5ఆ.)

ఉషాపరిణయమిది ఉద్యానవనము కాదు. చిత్రగర్భబంధకవిత్వముల చిట్టడివి. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమను పెద్దడవికి ఒజ్జబంతి. ఇందు అక్షరగుణితము. సటీక (52ప. 2ఆ.) కందగర్భచంపకమాల (54ప. 2ఆ.) వృత్తగర్భసీసము (55ప. 2ఆ.) పంచదశదళపద్మబంధము, దశదళపద్మబంధము, ఛత్రబంధము, షడ్దళపద్మబంధము, శేషబంధము కల పద్యము (56ప. 2ఆ.) పదునెన్మిది పద్యములు గర్భితమైన త్ర్యక్షరీ కంకణబంధము (57-74ప. 2ఆ.) పుష్పమాలికాబంధము (75ప. 2ఆ.) పుష్పమాలికా బంధము (94ప. 2ఆ.) గోమూత్రికాబంధము (101ప. 2ఆ.) అక్షరగుణితము (102ప. 2ఆ.) రథబంధము (56ప. 3ఆ.) ద్వికందగర్భకందము (79-81ప. 3ఆ.) సత్సంఖ్య గూఢసప్తమసీసము (128ప. 3ఆ.) అష్టవిధకందకంకణబంధము (148-155ప. 3ఆ.) చక్రబంధము (115ప.5ఆ.) అయిదు తేటగీతులు, మూడు ఆట వెలదులు, మూడు కందములు గర్భితమైన ఒక పద్యము (117-129ప. 5ఆ.)- ఇందొక పద్యము (122) సటీక- విద్యున్మాలావృత్తసర్వతోభద్రచక్రము. సటీక (128ప. 5ఆ.) ఏకాదశబంధగర్భ కంకణబంధకందలక్షణము (129ప. 5ఆ.) లక్ష్యమునందు "ప్రదక్షిణక్రమాన విష్ణుస్తుతిన్ని పరా లేభైనాలుగున్ను, అప్రదక్షిణక్రమాన శివస్తుతిని పరా లేభైనాలుగు కందాలుగా నూటయెనిమిది కందాలు గర్భితకందాలు. ఖడ్గబంధమున్ను అష్టాదశదళపద్మ బంధమున్ను చక్రబంధమున్ను షట్త్రింశద్దళపద్మబంధమున్ను ద్వాదశదళపద్మ బంధమున్ను నవదళపద్మబంధమున్ను షట్కోణబంధమున్ను గోమూత్రికాబంధమున్ను యివి అన్నిన్ని వేరే వేరే వ్రాసి వున్నది. యీ ఆకులనే ప్రౌఢులైన వారు చూచేది" అని వివరణము కలదు. నూట యెనిమిది పద్యములును ఒక్క పద్యమునందు కలవు. (130-237ప. 5ఆ.) అందు పదునెన్మిది పద్యములు (130-138, 184-192) సటీకలు.

ఉషాపరిణయమునందు పుర (19-41ప. 1ఆ; 11-12, 24-27ప. 3ఆ.) గర్భధారణ (61-64ప. 1ఆ; 9-11ప. 4ఆ.) నాయక (65-75ప. 1ఆ.)నాయకవిరహా (20-21ప. 2ఆ.) నాయిక (90-106ప. 1ఆ; 125-136ప. 3ఆ.) నాయికావిరహా (111-120ప. 2ఆ;

94-115ప. 3ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (166-188ప. 2ఆ; 16, 17ప. 3ఆ; 121-131ప. 4ఆ.) నగ (7-8ప. 3ఆ.) వనకేళి (61-91ప. 3ఆ.) జలకేళి (92-93ప. 3ఆ.) ఋతు (13-28ప. 4ఆ.) యుద్ధ (69-88ప. 4ఆ; 135-158ప. 4ఆ; 170-177ప. 4ఆ; 103ప. 5ఆ.) వర్ణనలు కలవు.

**రాజలింగము** : ఇతని కృతి కూర్మపురాణము. చెఱకు లక్ష్మణామాత్యుని ప్రేరణమున శ్రీశైలమల్లికార్జునస్వామికి అంకితము. దైవాంకితము. లక్ష్మణామాత్యుడు చరిత్రకు అందని వ్యక్తి. ఇతని పూర్వకవిస్తుతియందు ప్రౌఢకవి మల్లన కలడు. అతని రుక్మాంగదచరిత్రము రచనాకాలము 1585 ప్రాంతమని పూర్వోక్తము[108]. కూర్మపురాణము లోని పద్యము అప్పకవీయమునందు ఉదాహృతము. (371ప. 3ఆ.) అప్పకవీయము రచనాకాలము 1656 వ సవత్సరము. (33ప. పీ.అ.క) కావున కూర్మపురాణము రచనాకాలము 1585 తర్వాత, 1656 పూర్వము కావలయును. ఆ కాలము 1640 ప్రాంతము కావచ్చును.

కూర్మపురాణము అష్టాదశపురాణములందు ఒకటి. ఇది సంస్కృతపురాణమునకు సంగ్రహానుసరణము.

**ఏనుగు లత్సన (లచ్చన)** : ఇతని కృతులు 1. రాజశేఖరచరిత్రము. భల్లాణ చరిత్రము. అనుపలబ్దము 2. ధ్రువచరిత్రము. అనుపలబ్దము 3. తుల్యామాహాత్మ్యము అసమగ్రముగ లభించినట్లు వదంతి[109]. 4. ద్రౌపదీపరిణయము. అనుపలబ్దము 5. భీమసేనవిజయము. అముద్రితము. ధ్రువచరిత్రము వత్సవాయి జగ్గరాజునకు, తుల్యామాహాత్మ్యము వత్సవాయి జగన్నాథరాజునకు (ఇద్దఱు రాజబంధువులు) ద్రౌపదీ పరిణయము పెద్దాపురము సంస్థానాధిపతి వత్సవాయి సార్వభౌమతిమ్మజగపతికి (1649-88) అంకితములని ఇతని మనుమడు ఏనుగు లక్ష్మణకవి రామవిలాసము నందు కలదు. కాఁబట్టి ద్రౌపదీపరిణయము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును. అయిన తుల్యామాహాత్మ్యము రచనాకాలము 1645 ప్రాంతము, భీమసేన విజయము రచనాకాలము 1655 ప్రాంతము అగును.

భీమసేవిజయము కీచకవధవృత్తాంతము. ఇందు తిక్కన పద్యములకు అను కరణములు కలవు; అలతిమార్పులును కలవు[110].

"ఎవ్వని వాఁకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నణఁగు "

అను తిక్కన పద్యము ద్రౌపది పలికినది. తదనుకరణమైన లత్సన పద్యము భీముడు పలికినది. ఇది అనుచితము కాదుగాని, ద్రౌపది పలుకుటయే అత్యంత సముచితము.

**చెన్నమరాజ చెన్నమరాజు** : ఇతని కృతి చారుచంద్రోదయము. గోపాలకృష్ణు నికి అంకితము. దైవాంకితము. చెన్నమరాజు పిన తాతలు లింగనమంత్రి శాసనము 1594 వ సంవత్సరమునందు, తమ్మయమంత్రికి సంబంధించిన పెమ్మసాని పెదవీరనృపా లుని శాసనము 1606 వ సంవత్సరమునందు, చెన్నమరాజునకు సంబధించిన పెమ్మసాని తిమ్మభూపాలుని శాసనము 1644 వ సంవత్సరమునందు కలవు[111]. కాఁబట్టి చారుచంద్రో

దయము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

పద్మాకరనృపాలుని తనయ కుముద్వతికి, రుక్మిణీశ్రీకృష్ణుల తనయుడు చారుచంద్రునికి జరిగిన వివాహవృత్తాంతమే ఇతివృత్తము. కథామూలము కానరాదుగాని, చారుచంద్రుడు రుక్మిణీసుతుడని భాగవతమునందు కలదు. చారుచంద్రోదయము నందు ప్రథమాశ్వాసము చారుచంద్రోదయము. ద్వితీయాశ్వాసము పుష్కరాసుర సంహారము. కీరస్వీకారము. తృతీయాశ్వాసము పద్మాకరుని తపోమహిమ. కుముద్వతీ జననము. ఇది కీరప్రోక్తము. కుముద్వతీచారుచంద్రుల సమావేశమును. ఇది కూడ కీరసంధానము. చతుర్థాశ్వాసము కుముద్వతీవర్ణనము. నాయికానాయకవిరహము. పంచమాశ్వాసము కుముద్వతీచారుచంద్రుల విరహము శృంగారము. మొత్తము మీద చారుచంద్రోదయము శృంగారకావ్యము.

రుక్మిణి "కొదవ యొకయింత లేదైనఁ గోర్కి యొకటి గలదు విన్నప మొన రింతు"నని (145ప. 1ఆ.) "వచియింపఁగ గొంకిన మది దెలిసి తదీప్సిత మొనరఁగఁ గరుణించె శౌరి (146ప. 1ఆ.) అను కథనము, తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రము లోని గ్రథనమును (97ప. 1ఆ.) జ్ఞప్తికి తెచ్చును.

పద్మాకరుని తపస్సునకు భంగము కలిగించుటకు, ఇంద్రుడు పంపిన అప్సరస శశిరేఖ "వలపింపఁ బోయి తా వల" చుట, మంజుఘోషాద్యప్సరసలు మందలించుట, పద్మాకరుని ప్రాధేయపడుట హాస్యరసమును చిలుకును.

" ఓ లావణ్యవతీరతీశ భవదీయోద్యత్తనూవిభ్రమం
బాలోకించి, యకించిదంకురితమోహావేశయై యాశయై
కాలీఢంబగు కాక నున్నయది మా యబ్జాక్షి దీనిం గృపా
శ్రీలన్ మించు కటాక్షవీక్షణసుధాసేకంబునం దీర్పవే." 55ప. 3ఆ.
ఇది మంజుఘోష మంజుఘోష .

"అనఁగా అనఁగా ఒక రాజు" అని కథ చెప్పు పద్ధతి చారుచంద్రోదయమునందు గ్రంథస్థమయినది.

"మానిని కనంగ తాపము
మానుటకై ప్రొద్దు గడుపు మది కథఁ జెప్పన్
బూని సఖు లనంగ ననం
గా నొక రాజని యనంగ కళవళ మందెన్. " 30ప. 5ఆ.

అనంగతాపము నందిన కుముద్వతి, సఖులు అనంగ అనంగ ఒక రాజని అనంగ, కళవళపడుట సహజము. శబ్దచమత్కారము.

పుష్కరాసురుని సంహరించినందుకు ఇంద్రుడు చారుచంద్రునికి ఇచ్చిన చిలుక కథానిర్వహణము తోపాటు కథాకథనమును కావించును. కుముద్వతి గతకథను, చారుచంద్రుని భావికథను తెలుపుటయేగాక, కుముద్వతీచారుచంద్రుల ప్రథమసమా వేశమునకు అంజనకళను ఆకర్షణకళను, అదృశ్యకళను ప్రదర్శించును. ఇంద్రుడు,

"కీరమొక్కటిఁ జూపి యాకీరరాజ
మంజనాకర్షణాదృశ్యమంజుకళల
వెలసియుండుఁ బేరు త్రికాలవేది యంద్రు

శుభముఁ జేకూర్చు నది మది సొంపు మీఱ " 63ప. 2ఆ.

అన్నట్లు శుభము చేకూర్చినది.

వర్ణనలు బహుళము. పుర (95-124ప. 1ఆ; 72-74ప. 2ఆ.) స్నాన (132-135ప. 1ఆ.) భోజన (136-139ప. 1ఆ.) గర్భధారణ (148-153ప. 1ఆ; 77-79ప. 3ఆ.) కుమారోదయ (154-162ప. 1ఆ; 80-84ప. 3ఆ.) నాయక (163-168ప. 1ఆ.) గ్రీష్మర్తు (3-9ప. 2ఆ; 138-139ప. 2ఆ.)అశ్వ (11ప. 2ఆ.) నగ (12-20ప. 2ఆ.) వన (22-25ప. 2ఆ; 55-82ప. 4ఆ.) సిద్ధ (26ప. 2ఆ.) యుద్ధ (48-60ప. 2ఆ.) రాజ (75-81ప. 2ఆ.) విష్ణు (102ప. 2ఆ; 70ప. 3ఆ.) నదీ (120-123ప. 2ఆ.) ఆశ్రమ (128ప. 2ఆ.) తపోవిధాన (134-136ప. 2ఆ.) వర్షర్తు (140-149ప. 2ఆ.) శరదృతు (152-155ప. 2ఆ.) హేమంతర్తు (156-157ప. 2ఆ.) నాయికా (85-112, 124-132ప. 3ఆ; 7-17ప. 4ఆ.) నాయకవిరహ (2-27ప. 4ఆ.) నాయికావిరహ (30-36, 47-53ప. 4ఆ.) వసంతర్తు (37-42ప. 4ఆ.) పుష్పాపచయ (83-86ప. 4ఆ.)కాసార (89వచ. 4ఆ.) జలకేళి (90-104ప. 4ఆ.) మన్మథపూజా (106-110ప. 4ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (114-124ప. 4ఆ; 3-7, 36-39ప. 5ఆ.) ఉపాలంభ (9-28ప. 5ఆ.) శైత్యోపచార (31-32ప. 5ఆ.) వివాహ (40-104ప. 5ఆ.) శృంగార (110-125ప. 5ఆ.) వర్ణనలు కలవు.

నూతనకవి సూరన : ఇతని కృతి ధనాభిరామము. దక్షారామభీమేశ్వరునికి అంకితము. దైవాంకితము.

ఇతని కాలము 1450 ప్రాంతమని ఒక అభిప్రాయము కలదు[112]. అందుకు ప్రదర్శించిన ఉపపత్తులు మూడు కలవు. 1. సూరన పూర్వకవిస్తుతియందు నాచన సోముడు, చిమ్మపూడి అమరేశ్వరుడు చివఱి వారు. 2. ధనాభిరామములోని పద్యము పెదపాటి జగ్గన్న ప్రబంధరత్నాకరమునందు కలదు. 3. సూరన గురువు ముదిగొండ వీరభద్రుడు. అతడు భైరవుని రత్నశాస్త్రమునకు కృతిపతి. కాలము 1440 ప్రాంతము. ఇందు 1. పూర్వకవిస్తుతి నిర్ధారకసాధనము కాదు. 2. ప్రబంధరత్నాకరము పదునాఱవ శతాబ్దిగ్రంథముకాదు. పదునెన్మిదవశతాబ్దిగ్రంథము 3. సూరన గురువు ముదిగొండ వీరభద్రుడు కాడు. "మద్గురు ముదిబండ వంశగురు ధూర్జటిఁ గొల్చెద నిష్టసిద్ధికిన్" అని ధనాభిరామములోని అవతారికయందు కలదు. (9ప. 1ఆ.) ముదిబండ ముదిగొండ కావచ్చును. ధూర్జటి వీరభద్రుడు కాడు. సూరన గురువు ధూర్జటి. ఇష్టదైవము వీరభద్రుడు (2ప. 1ఆ.) ఆశ్వాసాంతగద్యలందు "శ్రీవీరభద్రకృపాలబ్ధకవితావిశేషమహితచారిత్ర" (1.3) "శ్రీవీరభద్రకరుణావిశేషమహితచారిత్ర" (2) అను విశేషణములు కలవు. వీరభద్రకృప, వీరభద్రకరుణాగురుకృప, గురుకరుణ కాదు. ఇష్టదైవకృప, ఇష్టదైవకరుణ మాత్రమే. కనుక సూరన కాలము 1450 ప్రాంతము కావలసిన ఆవశ్యకము లేదు. అంతేకాదు. ధనాభిరామమునందు

"పసిమి గల క్రొత్త యిప్పపూరసముఁ దిగిచి
ఖండశర్కరతోఁ గూడ వండి మిగుల
మేలి కర్పూరరజముతో మిళితమైన
మంచి సారాయి రయమునఁ గొంచు వచ్చి " 59ప. 3ఆ.

అని కలదు. మంచిదైనను, చెడ్డదైనను సారాయిశబ్దప్రయోగము పదునేడవ శతాబ్ది పూర్వము మృగ్యము. పదునేడవశతాబ్దిని ప్రచురము. కాఁబట్టి ధనాభిరామము రచనా కాలము 1650 ప్రాంతము కావచ్చును.

ధనాభిరామము సుమారు మూడు వందల (289) పద్యగద్యముల కథాభాగము కల లఘుకావ్యము. ఇందు ఆశ్వాసములు మూడు మాత్రమే కలవు. మూడు ఆశ్వాసముల కావ్యములును పదునేడవశతాబ్ది ముచ్చటయే.

కూచిరాజు ఎఱ్ఱన సకలనీతి కథానిధానములోని,

"సాక్షాన్మన్మథుఁ గూడి యిష్టగతులన్ సంభోగముల్ సల్పినన్
దాక్షిణ్యంబునఁ గూడియున్న తఱి ఖేదం బొంది హేమాంబరా
పేక్ష న్నిల్వఁ గుబేరునిం గలిసి చూపెం గూర్మి కామాంధయై
దాక్షారామమునందు నొక్క సతి కాంతల్ పేదకుం గూర్తురే." 332ప. 2ఆ.

అను పద్యములోని కథాంశమే, ధనాభిరామములోని ఇతివృత్తము. ఇంద్రుడు రంభాద్యప్సరసలను "మీ కవశ్యము చాలన్ ధనమో రూపమొ చెపుడా" అనిన, వారు సిగ్గున మన్మథుని వంక చూతురు. మన్మథుడు రూపమే ప్రధానమని, కుబేరుడు ధనమే ప్రధానమని వాదప్రతివాదములు చేయుదురు. కుబేరుడు,

"తరమిడి యిన్ని మాటలు వృథా పనిలేవు సమస్తవైభవో
త్కరమగు దక్షవాటి పురి గల్గు ధరాస్థలిలోనఁ బోయి నీ
నిరుపమరూపసంపదయు నేర్పునఁ జూపుము నేను వచ్చి యా
పురవరసీమఁ జూపెదను భూరిధనంబున నా మహత్త్వమున్. " 79ప. 1ఆ.

అని పందెము సఱచును. మన్మథుడు మానవరూపమున దక్షవాటికి వచ్చి, భీమేశ్వరుని సందర్శించి, ఆస్థానమంటపమునందు నిలిచి, "వైభవవిశాలగుణోజ్జ్వల చారుమూర్తితో నన్నిట నేర్పరైన సుగుణావతి" అను వేశ్యను చూచును. సుగుణావతి మన్మథ మానవుని చూచును. మరులుగొని విరహముచెంది, చెలికత్తెను రాయబారము పంపును.

"భవదీయమందిరంబునకు వచ్చి సుగుణావతిం గలసి
సుఖంబున నుండువాఁడ నింతియకాని పచ్చసైకంబు నేను
వెచ్చంబునకుం బెట్ట సమర్థుండఁగాను. అదియునుంగాక
యెంత ధనవంతుఁడు వచ్చిన తన్ను నుపేక్షించి పోయిన
మాకుం గాదు. అప్పుడు విడుచుట కంటె రాకయుండుటే లెస్స "

అను నిబంధన సుగుణావతి అంగీకరించిన మీదట మన్మథమానవుడు సుగుణావతి ఇంటి కేతెంచును. సుగుణావతీమన్మథమానవులు సుఖముందుదురు.

కుబేరుడు యోగిరాజరూపమున దక్షవాటికి వచ్చును. భీమేశ్వరుని పూజించును, దేవుని నైవేద్యము కొఱకు పూజారులకు నూరు సువర్ణనిష్కము లొసగును. రంగమధ్యమున గూర్చుండి నర్తకీమణులకు మణిభూషణాంబరము లిచ్చును. దేవదాసీలకు చీరలు, సొమ్ములు వెదజల్లును. విద్యల వారికి వివిధవస్తువు లిచ్చును. విటులకు తగిన విత్తము లిచ్చును. నానాజాతివేశ్యలకు నానావిధాభరణాంబరము లిచ్చును. పరిమళద్రవ్యములు పంచిపెట్టును. అది తెలిసి సుగుణావతి తల్లి విటరంపము సిద్ధుని ఇంటికి తీసికొని వచ్చును. సిద్ధుడు పంపించిన మణిభూషణాంబరములు సుగంధాదివస్తువులు చూచి

సుగుణావతి మనస్సు మాఱును. మణిభూషణము లవి ధరించి "సెద్దపుంగవునిఁ బొందు దలిర్పఁగఁ జూచి వత్తు"నని మన్మథమానవునికి చెప్పును. అతడు నిందించును. విట రంపము వెళ్ళగొట్టించును. మన్మథమానవుడు భీమేశ్వరుని ప్రార్థించును. భీమేశ్వరుడు మన్మథకుబేరులను సమాధానపఱుచును.

> "రూపు లేకున్న జగములో రూఢి లేదు
> ధనము లేకున్న మఱియు నంతకును గొఱఁత
> వలయు రూపంబు ధనము నవశ్య మఖిల
> మానవులకును సురలకు మాన కిపుడు." 106ప. 3ఆ.

నాటి నానావిధాభరణములు : కమ్మలు, పచ్చల కడియాల జోళ్లు, పతకంబు మొలనూలు, బాహుపురులు, పుంజాలదండలు, పూదెల కడియాలు, ముంగరలు, రాకట్టు నుంగరములు, ముత్యాల పేరులు, డోరీలు, కుంటెనలు, నీలాల కంటసరులు, ముంగాముఠములు, మొగపుల తీవెలు, సందుల దండలు, సరపణులు, పసిడియొత్తులు నేవళాలు, బన్నసరులు, చేరు బాట్లు, తాళీలు, చెవుల పువులు, కదలు మట్టెలు, పిల్లాండ్లు మొదలైనవి. (36ప. 3ఆ.)

నాటి చిత్రవిచిత్రములైన చీరలు : వెల్లలు, నీటంచు వెలిపములు, కరకంచు పట్లు, జిబులు, పదకడములు, మంజిష్ఠ కిముకములు, మాదావళములు, కర్పూరవన్నెలు, ముత్తెసరులు, తోఁపులు, బీరనేతులు, గజపుప్పొళ్ల వ్రాఁతలు, పతి నిలు రాయగళులు, జాళీలు, చెరఁగులు, సామంతవిధులు, కావులు, దసలిలు, ఖండసరులు, సర్వశృంగా రములు, చిర్తచౌకములు, చిన్న కస్తూరి మళ్లు, (చి)లుక చారు వన్నియలు, మంచి బొమ్మంచు వన్నియలు మొదలైనవి. (37ప. 3ఆ.)

ధనాభిరామమునందు దక్షవాటి నృత్యగానవిశేషములు కలవు. (42-51ప. 2ఆ.) పుర (30ప. 1ఆ; 13-26ప. 2ఆ.) వసంతర్తు (3-10వచ. 2ఆ.) విరహ (74-78, 97-98ప. 2ఆ.) దూత్య (98-120వచ. 2ఆ.) రతి (124-128ప. 2ఆ.) వర్ణనలు మాత్రమే కలవు.

**పూసపాటి తమ్మభూపాలుడు** : ఇతని కృతి కృష్ణవిజయము. బెజవాడ కనకదుర్గకు అంకితము. దైవాంకితము. ఇతడు విజయనగరసంస్థానమునకు మూల పురుషుడైన రఘునాథరాజు సహోదరుడు. అతడు మొదట గోలకొండ దర్బారులోని కొండపల్లి సర్దారు. 1652 వ సంవత్సరమునందు విశాఖమండలమునకు వచ్చి, శ్రీకాకుళము నందు ఫౌజుదారైన షేర్ మహమ్మద్ ఖాన్ దగ్గఱ కుమిలె, భోగాపురము ఇజారా చేసినట్టు కలదు[113]. ఇది కృష్ణవిజయమునందులేదు. అంతేకాదు. కృష్ణవిజయము రచనాస్థలము బెజవాడ. కాఁబట్టి రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

కృష్ణవిజయము సభాసదుల కోరిక ప్రకారము తమ్మభూపాలుడు రచించినట్లు కలదు. సభాసదుల కోరిక ఇది:

> "హరి వివిధావతారములయందుఁ బ్రశస్తము కృష్ణమూర్తి య
> క్కరివరదుండు లోకములు గావ సురేంద్రుఁడు విన్నవింపఁగా
> నరకుని సంహరించి లలనామణులన్ బదియాఱువేల మున్
> బరిణయమైన యక్కథ ప్రబంధముగా వివరింపఁగా దగున్." 42ప. 6ఆ.

కృష్ణుడు నరకాసురుని సంహరించి, అతడు కారాగారమునందు బంధించిన పదియాఱు వేల మంది కన్యలను విడిపించి, అదితి కుండలములు అందఁజేసి, నందన వనములోని పారిజాతవృక్షమును పెకలించి తెచ్చునెడ ప్రతిఘటించిన ఇంద్రుని జయించి, పదియాఱువేల మంది కన్యలను వివాహమాడిన కథ హరివంశ, విష్ణుపురాణ, భాగవతము లందు కలదు. పదియాఱువేలమంది కన్యలు దేవకన్యలని ఎఱ్ఱన హరివంశమునందు కలదు. రాజకన్యలని పోతన భాగవతమునందు కలదు. (206ప-10స.ఉ.భా.) మూడు పురాణములలోని కథను మూదలించునది కృష్ణవిజయములోని కథ. ఇందు పదియాఱు వేలమంది కన్యలు రాజకన్యలే. కృష్ణవిజయమునందు పోతన ప్రభావమే అధికము.

నరకాసురునిపై యుద్ధమునకు బయలుదేఱిన కృష్ణుని, తన్ను వెంటగొనిపొమ్మని వేడిన సత్యభామకు, కృష్ణుడు ఇచ్చిన సమాధానము పోతన భాగవతమునందు ఇట్లు కలదు.

"సమదపుష్పంధయఝుంకారములు గావు
భీషణ కుంభీంద్రబృంహితములు
వాయునిర్గతపద్మవనరేణువులు గావు
తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణజలతరంగాసారములు గావు
శత్రుధనుర్ముక్తసాయకములు
గలహంససారసకాసారములు గావు
దనుజేంద్రసైన్యకదంబకములు
కమలకహ్లారకుసుమసంఘములు గావు
చటులరిపుశూలఖడ్గాదిసాధనములు
కన్య వీవేడ రణరంగగమన మేడ
వత్తు వేగమ నిలువుము వలదు వలదు. " 158ప. 10స్కం. ఉ.భా

ఇది కృష్ణవిజయమునందు ఇట్లు కలదు.

"చిలుక పల్కులు గావు చెలిమితో విన నీకు
సమదభటాట్టహాసములు గాని
చెలుల భూషలు గావు చేరి గన్గొన నీకు
నమరారివికృతవేషములు గాని
గృహదీర్ఘికలు గావు క్రీడ సేయంగ నీకుఁ
గఠినబాణప్రయోగములు గాని
చారుభసలీసలీలసంచారవనవి
హారములు గావు వేడ్కసేయఁగ నీకు
భయజనక సాహసాహవక్రియలుగాని
బేలతనమేల నీ కింత నీలవేణి. " 83ప. 2ఆ.

సత్యభామ యుద్ధసంరంభము ఎఱ్ఱన హరివంశమునందు ఇట్లు కలదు.

"వీరం బాఁడుదనంబు నొందె ననఁగా విక్రాంతిసౌందర్యల
క్ష్మీరేఖం బచరించె నాఁగ ధృతి యక్షీణాకృతిం జెందె నా
ధీరోదాత్త పతిప్రియాచరణభక్తిప్రౌఢ యా తన్వి దాఁ

బ్రారంభించె మహారణక్రియకు నా ప్రత్యర్థితో నుక్కునన్." 162ప. 4ఆ.ఉ.భా

ఇది నాచన సోమనాథుని ఉత్తరహరివంశమునందు ఇట్లు కలదు.

"అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
తొరుగం బయ్యెదకొం గొకింత దొలఁగం దొడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్." 162ప. 1ఆ.

ఇది పోతన భాగవతమునందు ఇట్లు కలదు.

"పరుఁ జూచున్ హరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపుఁ బరగం జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్. 178ప. 10స.ఉ.భా

ఇది తమ్మభూపాలుని కృష్ణవిజయమునందు ఇట్లు కలదు.

"నవమందహాసకందళలీల హరి చోట
నరి చోట నట్టహాసాంకురంబు
అమృతంబుఁ జిల్కు నెయ్యపుఁబల్కు హరి చాయ
నరి చాయఁ గోపనిష్ఠురతరోక్తి
విరితూపు రూపు బిత్తరి చూపు హరి చెంత
నరి చెంత శిఖిశిఖాభరనిరీక్ష
చటులవిద్యుల్లతా సమవృత్తి హరిపట్ల
నరిపట్ల వనలకీలాను వృత్తి
వెలయ శృంగారరసమును వీరరసము
నిరుదెసలయంద వెదఁజల్లు నిగురుఁబోణి
పౌణిమి తెఱంగుఁ గాంచు గీర్వాణనీల
వేణు లాశ్చర్య రసధుర్యవాణు లైరి. " 92ప. 3ఆ.

ఇందు ఎఱ్ఱన, సోమనల పద్యముల అనుసరణము కంటె, పోతన పద్యముల అనుసరణము కరతలామలకము.

"అవనిపతికన్యకలఁ బదియాఱువేల హరి నిరీక్షించి (20ప. 4ఆ.) వర్ణించునెడ అనుప్రాసముల అట్టహాసములు కలవు.

"అనుకులై యమృతంపు చినుకులై క్రొమ్మించు
మినుకులై విరిదూపు మునుక లగుచు
నింపులై వెలలేని కెంపులై పవడంపు
సొంపులై తేనియ నింపు లగచు
గొప్పలై యపరంజి తిప్పలై వలపుల
కుప్పలై వనటుల యప్ప లగుచు
మురువులై కలికి చిత్తరువులై వలరాచ
హరువులై తీవల గురువు లగుచు
వరలు వీరల చూపులు వాతెఱలును
వలుద కుచములు మేనుల నలరుచున్న
సొయగపు తీరు లన్నియుఁ జూచి వొగడ

జాలునే నల్మొగంబుల వేలుపయిన." 26ప. 4ఆ.

షోడశసహస్రరాజకన్యకలు "హరిపైఁ బ్రేమమునఁ బల్కి"నపుడు నరకాసురుని మెచ్చుకొనుట కలదు.

"అవనిసుతుండు పాపనిరతాత్మకుఁ డంచుఁ దలంప వల్వదో
కువలయనేత్ర పుణ్యాజనకుంజరుఁ డాతఁడు బల్మిఁ దెచ్చి యీ
భవనమునందు నిల్పగ నపారకృపారసపూర్ణలోచనున్
భువనశరణ్యుఁడైన యదుపుంగవుఁ గంటిమి నేఁడు కన్నులన్" 44ప. 4ఆ.

షోడశసహస్రకన్యకాషోడశసహస్రరూపకృష్ణుల శృంగారమునందు ఒక అపూర్వమైన భావము కలదు.

"కెంపుటోవరి మేల్ పగడంపు గడప
దాటుతరి లజ్జ నదివోలెఁ దారసిలఁగ
నూరకుండిన దాటించె నువిద నొకతె
దిట్ట మదనుడు తూపుల తెప్ప గట్టి." 229ప. 5ఆ.

ఇందు భావుకత ఇంచుక భాసించును.

పుర (1-30ప.క.ప్రా. 1ఆ; 140-146ప. 2ఆ; 142-146ప. 4ఆ.) నాయక (31-39ప.క.ప్రా. 1ఆ.) నాయికా (72ప. 2ఆ; 21-27, 29-32ప. 4ఆ.) శరదృతు (4-14ప. 2ఆ.) జైత్రయాత్రా (87ప. 2ఆ.) సముద్ర (90-100ప. 2ఆ.) యుద్ధ (3-132ప. 3ఆ; 97-100ప. 5ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతప్రకృతి (64-104ప. 4ఆ.) నదీ (134-139ప. 4ఆ.) వసంతర్తు (5-14ప. 5ఆ.) విరహ (18-34ప. 5ఆ.) శైత్యోపచార (35-41ప. 5ఆ.) చంద్రాద్యుపాలంభ (42-59ప. 5ఆ.) చంద్రాదిప్రశంస (61-75ప. 5ఆ.) వన (82-86ప. 5ఆ.) వనవిహార (129-148ప. 5ఆ.) పుష్పాపచయ (132ర. 5ఆ.) సరో (149ప. 5ఆ.) జలకేళి (153-168ప. 5ఆ.) వివాహ (171-224ప. 5ఆ.) శృంగార (127-241ప. 5ఆ.) వర్ణనలు కలవు.

చిత్రగర్భబంధకవిత్వములును కలవు. అవి : చక్రబంధము (159ప. 3ఆ.) ఖడ్గబంధము (60ప. 3ఆ.) పుష్పమాలికాబంధము (161ప. 3ఆ.) చతుర్విధకందము (162ప. 3ఆ.) పాదగోపనవృత్తము (163ప. 3ఆ.) నామగోపనవృత్తము (164ప. 3ఆ.) స్రగ్విణీగర్భితభుజంగప్రయాతము (165ప. 3ఆ.) ద్వ్యక్షరము (166ప. 3ఆ.) గోమూత్రికాబంధము (168ప. 3ఆ.) తలకట్టుపద్యము (169ప. 3ఆ.)

చక్రబంధమునందు కవి పేరు కలదు.

"విద్యాతత్పరమౌనిభావిత ధృతావీ విశ్వసంపత్కరా
హృద్యమ్మయ్యె మహాత్మ యద్భుతముగా నీ కృష్ణతాకల్పనా
సద్యోభూచరదేకరూపత యశఃస్ఫాతిప్రభావక్రియా
యాద్యా శ్రీవిమతాహృతారిసముదారా దైత్యనాశప్రియా"

ఇందు మూడవ వలయమునందు "తమ్మభూపకవ" లని, ఆఱవ వలయమునందు "మాహాదేవికృతి" అని కలదు. "తమ్మభూపకవ" = తమ్మభూపకవి. "మాహాదేవికృతి" = మహాదేవికృతి. మహాదేవి అన దుర్గామహాదేవి. "దుర్గామహాదేవి" అని మొట్టమొదటి ఇష్టదేవతాస్తుతి పద్యమునందు కలదు. కృష్ణవిజయము దుర్గామహాదేవికి అంకితమైన

కృతియే. తిమ్మభూపకృతమే.

**పెనుమళ్ల సోమనామాత్యుడు** : ఇతని కృతి సీమంతినీకల్యాణము. శ్రీశైలమల్లికార్జున స్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని వంశీయుడు (44ప. 1ఆ.) కృష్ణవిజయకర్త పూసపాటి తమ్మభూపాలుని మంత్రి. (81ప. 1ఆ.) కాఁబట్టి సీమంతినీకల్యాణము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

సీమంతినీకల్యాణము "స్కందపురాణంబునందు బ్రహ్మోత్తరఖండంబునందు విఖ్యాతియైన సీమంతినీనామసీమంతినీమణి చారిత్రము" (103ప. 1ఆ.). సోమవార వ్రతమాహాత్మ్యము. ఆర్యావర్తదేశాధిపతి చిత్రవర్మతనయ సీమంతిని. ఆమె యౌవన వర్ణనము ప్రముఖమైనది ప్రథమాశ్వాసము. ఆమెకు యాజ్ఞవల్క్యుని సతి - నీతులు, ధర్మములు మొదలైనవానితోపాటు సోమవారవ్రతవిశేషము, విధానము తెలుపుట ప్రధానమైనది ద్వితీయాశ్వాసము. సీమంతినీచంద్రాంగదుల వివాహము పర్యాప్తమైనది తృతీయాశ్వాసము. చంద్రాంగదుడు యమునానదిలో మునిగిపోవుట, సీమంతిని విగతభర్తృక అగుట, యమునానదిలో మునిగిపోయిన చంద్రాంగదుని నాగకన్యలు నాగలోకమునకు తీసికొనిపోవుట, నాగలోకాధిపతి తక్షకుడు చంద్రాంగదుని భూలోకమునకు పంపుట, సీమంతినీచంద్రాంగదులు కలిసికొనుట, మఱల కల్యాణము జరుగుట పరివ్యాప్తమైనది చతుర్థాశ్వాసము. చంద్రాంగదుడు పదివేల సంవత్సరములు రాజ్యము చేయుట, సీమంతిని సోమవారవ్రతమునందు మోసము చేసిన సామవంతుడు, సామవతి అగుట పరిశిష్టమైనది పంచమాశ్వాసము. కతిపయవర్ణనములు కలవు. వసంతర్తు వర్ణనములోని,

> "సరసవసంతగాయకుఁడు చారుగతిన్ గలకంఠగీతవి
> స్ఫురణముఁ జూపుచో మివులఁ బ్రోడతనంబున నెల్ల పల్లవో
> త్కరములయందు రాగములు కన్పడఁజేయుచు మాటిమాటికిన్
> గురుసుమనోనికాయములకుం గరుణించె రసాతిరేకముల్" (63పుట)

అను పద్యము సరసము. సరళము. ఇట్టి పద్యములు విరళము.

**బోయనపల్లి కుమారవేంకటరాయలు** : ఇతని కృతి ద్రౌపదీకల్యాణము. అముద్రితము. వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు పానుగల్లు దుర్గాధిపతి. కాలము పదునేడవశతాబ్ది మధ్యభాగము[114]. కాఁబట్టి ద్రౌపదీకల్యాణము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

**టేకుమళ్ల రంగశాయి** : ఇతని కృతులు 1. జానకీపరిణయము. యక్షగానము. అనుపలబ్ధము 2. తిరువళ్లూరు వీరరాఘవశతకము. అనుపలబ్ధము 3. వాణీవిలాసవనమాలిక. విజ్ఞానసర్వస్వము 4. భాగవతము. ద్విపదకావ్యము. చతుర్థస్కంధములోని పృథుచక్రవర్తి చరిత్రము వఱకు మాత్రమే లభించినది. అముద్రితము 5. కృష్ణదండకము. అనుపలబ్ధము.

వాణీవిలాసవనమాలిక ఆశ్వాసాంతగద్యను "మహంకాళ్యప్పకొండార్యపుత్త్ర . . . వెంకయసహాయ" అను విశేషణము కలదు. మహంకాళి వెంకయ్య చరిత్రకు అందని వ్యక్తి. భాగవతద్విపదకావ్యరచనమునందు పుష్పగిరి తిమ్మన సహాయము పొందినట్లు

జనశ్రుతి కలదు. సంస్కృతము పండితులకైన తెలియదని, పద్యకావ్యము తెలుగు, సంస్కృతము వచ్చినగాని తెలియదని లోకోపకారముగా భాగవతద్విపదకావ్యమును రచించినట్లు కలదు. పుష్పగిరి తిమ్మన భాగవతసారవచనకావ్యమును లోకోపకారముగా రచించినదని పూర్వోక్తము. అది సహాయకమగును. భాగవతసారవచనకావ్యము రచనాకాలము 1645 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి భాగవతద్విపద కావ్యము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

భాగవతద్విపదకావ్యము పోతన భాగవతమునకు ద్విపదీకరణము.

**పట్టమట్ట సరస్వతీసోమయాజి** : ఇతని కృతి పృథుచరిత్రము. అముద్రితము దక్షారామభీమేశ్వరునికి అంకితము. దైవాంకితము. ఇతడు కూటస్థుడుగ లభించిన ఒక వంశవృక్షమునుబట్టి ఇతనికాలము 1649 ప్రాంతమని ఒక అభిప్రాయము కలదు[115]. కాఁబట్టి పృథుచరిత్రము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

పృథుచరిత్రము భాగవతములోని పృథుచరిత్రము నిమిత్తముగ రచించిన స్వతంత్ర కావ్యము.

**మోచర్ల నన్నయ** : ఇతని కృతులు 1. కాశీఖండము. ద్విపదకావ్యము. అనుపలబ్దము 2. సాంబోపాఖ్యానము బాలగోపాలస్వామికి అంకితము. దైవాంకితము. అతని పూర్వకవిస్తుతియందు "ప్రేమ మదీయమాతామహవంశవిహారుఁ బింగళి సూరనార్యుఁ దలఁచి" అని కలదు[116]. సాంబోపాఖ్యానములోని పద్యములు రెండు అప్పకవీయమునందు ఉదాహృతములు. (102, 123ప. 3ఆ.) కాఁబట్టి సాంబోపాఖ్యానము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

లక్షణాసాంబుల పరిణయకథయే సాంబోపాఖ్యానము.

**ఋగ్వేది వేంకటాచలపతి** : ఇతని కృతి చంపూరామాయణము. వెల్లంటి కసవరాజనకు అంకితము. అతడు కార్వేటినగరసంస్థానాధిపతి వెల్లంటి కసవరాజునకు పూర్వుడు. వేంకటాచలపతి తండ్రి, గురువు తిరువేంగళార్యుడు సాళ్వ తిమ్మనృపాలుని సమ్ముఖమున చక్రవాళాంకప్రశస్తి, వీరవేంకటపతిరాయశౌరి సభను బలురౌతను కీర్తి, వెలుగోటి వేంకటవిభుని చెంత జంఘాలవాతూలచతురలాంఛనము, చెంజి వరదేంద్రుని ఆస్థానమునందు పాకశాసనచిహ్నప్రభ అందినట్లు కలదు. (31ప. 1ఆ.) చెంజి వరదేంద్రుడన చెంజి వరదప్పనాయకుడు. అతని రాజ్యకాలము 1645-49 అని పూర్వోక్తము. వీరవేంకటపతిరాయశౌరి అనగా మూడవ వేంకటపతిదేవరాయలు. అతని రాజ్యకాలము 1630-42 అని పూర్వోక్తము. కావున తిరువేంగళార్యుని ప్రాభవకాలము 1630-50 కావలయును. వేంకటాచలపతి దామర అక్కనృపాలుని సన్నిధిని కవి గంధసింధురము క్రొవ్వణగించిన కవిరాజకేసరి అని కలదు. (34ప. 1ఆ.) దామర అక్కనృపాలుడన దామరల అంకభూపాలుడు. అతని ఉషాపరిణయము రచనాకాలము 1640 ప్రాంతమని పూర్వోక్తము. కావున వేంకటాచలపతి ప్రాభవకాలము 1640-1660 కావలయును. కాఁబట్టి చంపూరామాయణము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

చంపూరామాయణము సంస్కృతచంపూరామాయణమునకు తెనుగుసేత. సంస్కృతచంపూరామాయణమునందు ఆఱు కాండలు కలవు. బాలాయోధ్యారణ్య కిష్కింధా

సుందరకాండలయిదును విదర్భరాజవిరచితము. యుద్ధకాండము లక్ష్మణసూరి పూరితము, విదర్భరాజు భోజుడని లక్ష్మణసూరి నిర్దేశము. "భోజేనతేనరచితామపి పూరయిష్యన్ ....." (2శ్లో. యు. కాం.) "భోజనృపాలుఁ డపూర్తికంబుగా రచియించి నిల్పిన యుదార కృతింబ్రతిసూక్తి నిత్తఱింబూరిత మాచరించుటకుఁ బూనితి" (3ప. 8ఆ.) భోజరాజు కాలము పదొకండవశతాబ్ది. రాజరాజనరేంద్రునికి సమకాలికుడు. పదవ శతాబ్దికి పూర్వము సంస్కృతమునందు చంపూకావ్యములు(=పద్యగద్యోభయకావ్యములు) మృగ్యము. త్రివిక్రమభట్టు నలచంపువు (915) సోమదేవుని యశస్తిలకచంపువు (958) సోడ్ఢలుని ఉదయసుందరీకథ, భోజుని చంపూరామాయణము, అనంతభట్టు చంపూ భారతము, అభినవకాళిదాసు చంపూభాగవతము సుప్రసిద్ధములు[117].

వేంకటపతి తెనుగుసేత స్వతంత్రాస్వతంత్రము.

"ఏతే వవృధిరే వీరా: బ్రహ్మక్షేమాయ దీక్షితా:
లోకానందముకుందస్య చత్వార ఇవ బాహవ:" 60శ్లో. బా.కాం.

అనుశ్లోకమునకు ప్రపంచీకరణము :

"పుంవ్యక్తులై తోఁచు పురుషార్థముల రీతిఁ
దనువు గైకొన్న వేదముల పగిది
నయనగోచరములైన యుపాయముల రీవి
నరులైన జలనిధానముల కరణి
సుఖదర్శనతఁ గన్న శిఖిశృంగముల భంగి
ప్రభులైన ధాతృవక్త్రముల భాతి
నడవడి గల దివ్యనాగదంతము లట్లు
బాహుజులగు శౌరి బాహుల క్రియ
ధర్మముఖ్యత నిత్యసత్యత నయాను
సృతి గభీరిమ శుచిభవోన్నతియు వాఙ్మ
ఖాకృతిఁ బలాశహ్వాతియుఁ బంచాయుధాతి
విలసనముఁ బూని వెలసి రన్నలువు రంత." 53ప. 1ఆ.

ఇట దశరథుడు కొలువు తీర్చుట కూడ స్వతంత్రవర్ణనమే. అందు,

"నలినహితాన్వయేశుఁ డొకనాఁడినుఁ డిందిర యిండ్ల బీగము
ద్రలు కరకుంచికావిఘటితం బొనరింపక మున్న గాయకా
వళి నుతిగీతి మేలుకని వచ్చి యహర్ముఖనిత్యకృత్యముల్
సలిపి మణీమయాభరణజాలవిడంబితరోహణాద్రియై" 54ప. 1ఆ.

అను పద్యములోవి సూర్యోదయవర్ణనాంశము, నంది తిమ్మన్న పారిజాతాపహరణములోని సూర్యోదయవర్ణనాంశమునకు అనుసరణము. ఆ పద్యమిది:

"విననయ్యెం గృకవాకుకూజితము లుద్వేలంబులై సూరసూ
తనవోద్యత్కరకుంచికావిఘటితధ్వాంతారరక్రేంక్రియా
స్వనముల్ కైరవిణీప్రసూనపృథుకస్వాపక్రియాలోలికల్
దినకృన్మార్గనివారణత్వరితమందేహోగ్రసింహధ్వనుల్." 65ప. 2ఆ.

అహల్య వృత్తాంతమును స్వతంత్రకల్పనము. మూలమునందు వాల్మీకి రామాయణానుసారముగ మూడు శ్లోకములు కలవు. (147-149శ్లో.బా.కాం.) అవి పరిహరించి

అంతర్నిగూఢముగ సంతరించిన పద్యమిది :

"అరిది యనఁగఁ జెల్లదె రజోగుణమె ఖేద
మునకు మోదమునకు మూలమగుట
రజము వలన వికృతి భజియించిన యహల్య
ప్రకృతిఁ దాల్చె రామపదరజమున. " 32ప. 3ఆ.

ఇట అహల్యావర్ణనమును అమూలకము. "తస్యాశ్రమం భేజే పాకం రామేణ కౌశికః" అను పంక్తి (149శ్లో. బా.కాం.) ఆధారముగ రచించిన పద్యమిది:

"తన చంచలత వాయదని తపం బొనరించు
లొలకరి మెఱుఁగొ యీ తలిరుఁబోడి
హరసాంధ్యకృతిదాటి ధరకు జాఱిన సుధా
కరరేఖ యేమొ యీ కంబుకంఠి
వసుమతి తన పేరు వాసింపఁ గన్న పైఁ
డిసలాక యేమొ యీ బిసరుహాక్షి
తన చెలికాని కామని కనంగుఁ డొసంగి
న కృపాణి యేమొ యీ నలినపాణి
యనఁదగు నహల్య యాతిథ్యమునకు నలరి
కౌశికుఁడు రాఘవులతోడఁ గదలి యంత
జనకమఖవాటి కరుగఁ బూజన మొనర్చి
యినకులునితో శతానందుఁ డిట్టు లనియె. " 33ప. 3ఆ.

ఇది అపూర్వమేగాని అస్థానపతితము.

మూలమునందు అయోధ్యాపురవర్ణనము లేదు. మిథిలానగరవర్ణనమును లేదు. తెనుగుసేతను అయోధ్యాపురవర్ణన ఒక్క పద్యమునందే (88ప. 1ఆ.) కలదుగాని, మిథిలానగరవర్ణనము ఇరువదిపద్యములందు (50-19ప. 3ఆ.) కలదు. అంతేకాదు. మూలమునందు లేని సీతావర్ణనము. విశ్వామిత్రుని ముఖతః పాతికపద్యములందు (72-93ప. 3ఆ.) కలదు. మూలమునందు వివాహఘట్టము సంగ్రహము. (182గ-185శ్లో.బా.కాం.) తెనుగుసేతను సవిస్తరము. (111-137ప. 3ఆ.)

మంథర వృత్తాంతము యథామూలకము.

"యామేవాహు ర్నిశిచరకులోన్మూలనే మూలహేతుం
యస్యా శ్శిత్తం ప్రకృతికుటిలం గాత్రమిత్రం బభూవ
అంభోజిన్యా శ్శిశిరసరసం కాసరీవాచ్ఛ మంథః
కైకేయ్యా స్సా హృదయ మదయం మంథరా నిర్మమంథ. " 20శ్లో. అ. కాం.
"హరిహయకంటకాన్వయలయావహవైఖరి కెల్ల యైన క
ల్లరి మది రీతి మేను కుటిలమ్ముగఁ ద్రిమ్మరు మాయదారి మం
దర యను జంత శాంతభరితంబగు కైక మనంబు దివ్యపు
ష్కరణివితుద్దవారి వనకాసరి వోలెఁ గలంప నత్తతిన్." 18ప. 4ఆ.

ఇందు శిశిరసరస్సు కంటె దివ్యపుష్కరిణి సమర్థము. కైకకు రాముని సమాధానము ను యథామూలకమే.

"వనభువి తనుమాత్రత్రాణ మాజ్ఞాపితం మే

సకలభువనభార స్థాపితో వత్స మూర్ధ్ని
తదిహ సుకరతాయా మానయో స్తర్కితాయాం
మయి పతతి గరీయా నంబ తే పక్షపాతః " 47శ్లో. అ. కాం.

"నను వని గాత్రమాత్రభరణంబునకున్ నియమించి యా చతు
ర్వననిధిమేదినీభరణరాజ్యరమాగరిమంబుఁ దమ్ముగు
జ్జని తల కెత్తినావు సుకరత్వము దీన గణింప నా పయిం
గనఁబడుఁ బక్షపాత మధికంబయి నీ మది కంబుజేక్షణా" 33ప. 4ఆ.

సీతాపహరణము మూలమునందు ఇట్లు కలదు.

"రామాశ్రమా ద్విగతలక్ష్మణసన్నిధానా
త్సీతాం జహార చపలః పిశితాశనేంద్రః
మాలాం వనోత్పలమయీం పలలభ్రమేణ
దేవాలయా దివ నిరస్తజనా నలర్కః" 66శ్లో. అర. కాం.

ఇట "వనోత్పలమయీం" అనునెడ "మహోత్పలమయీం" అను పాఠాంతరము కలదు. ఇది తెనుగుసేతను ఇట్లు కలదు.

దశనిలయం బరాఘవయుతం బగుటం గని సీత సత్కృతుల్
సలిపెడు రూపు మాని సహజంబగు నెప్పటి మేనిఁ బూని యా
నళినముఖిన్ హరించె విజనంబగు కోవెలఁ జొచ్చి జాగిలం
బలరు సరంబు నామిషదురాశ సవిం గొనిపోవు కైవడిన్. " 70ప. 5ఆ.

రావణుడు కపటసన్న్యాసివేషమున వచ్చినట్లు మూలమునందు కలదు. (65గ.) ఆ కపటసన్న్యాసివేషము సవివరముగ తెనుగుసేతను కలదు. (69సీ.ప.) సన్న్యాసికి సత్కృతులు సలుపునని సహజవేషమును ధరించుట అమూలకము. అంతేకాదు. శునకము గుడిలోని వనోత్పలమాలనో, మహోత్పలమాలనో అపహరించుట కంటె, అలరు సరమును అపహరించుట సహజము.

సీత ఆభరణముల మూట పతనము రావణుడు స్వతేజఃపతనమని గ్రహింపలేదను మూలమును (22గ.అర.కాం.) తెనిగించుటకు (75ప. 5ఆ.) ముందు స్వతంత్ర కల్పనమిది :

"సుగ్రీవసాత్కృతోదగ్రపంక్తిగ్రీవ
బహుదోఃప్రతాపసంగ్రహ మనంగ
వాలిరాజ్యప్రాజ్యవైభవాతిశయాచి
తోత్పాతహేతుభూతోల్క యనఁగ
మనువంశ్యమైత్రీకృతినిమిత్తపుత్త్రాభి
పతదుగ్రభానుబింబం బనంగ
నంగదయౌవరాజ్యరమావినోదోచి
తాసాదినైయన్నదాబ్జ మనఁగ
నంత వ్రాలె మతంగాద్రిహరుల చెంత
నిశిచరేంద్రరథాంతరనీయమాన
జనకతనయోత్తరాసంగకనకపటని
బద్ధవిక్షిప్తమణిమయాభరణసమితి. " 74ప. 5ఆ.

విపినమధ్యమునందు సీతావియోగమునకు రాముడు విలపించి విలపించి ధైర్యము వహింపలేదని, అట్లే లక్ష్మణుడు ధైర్యము వహింప లేదని, ఆవిధముగ కథాకథనము చేసిన వాల్మీకి కఠినహృదయుడని భోజుని వ్యాజనింద. ఆ శ్లోకమిది :

"ఇత్థం విలప్య విపినే దయితాం విచిన్వన్
రామో న తత్ర ధృతిమా న్నహి లక్ష్మణశ్చ,
తాదృగ్విధామపి కథాం కథయన్ స్వవాచా
వల్మీకజన్మముని రేవ కఠోరచేతాః " 81శ్లో. ఆర. కాం.

ఇది తెనుగుసేతను ఇట్లు కలదు.

"మఱియు రఘువీరుడలతఁ గ్రిమ్మరిన తెఱఁగు
వినఁ దరమె యట్టి దురవస్థ కనికరంబు
లేక వర్ణించినట్టి వాల్మీకి యెట్టి
బోయయో కాక తొలుతటి పుట్టువందు. " 84ప. 5ఆ.

వాలివధానంతరము తార రామునితో ఇట్లు పలికినది.

"ఏవం విధే ప్రియతమే ఽ ప్యపేతజీవాం
మాం రాక్షసీతి రఘుపుంగవ సాధుబుద్ధ్యా
బాణం విముఞ్చ మయి సంప్రతి తాటకారే
శ్రేయో మహద్ధ్యితసంగమకారిణ స్తే. " 44శ్లో. కి. కాం.

ఇది తెనుగుసేతను ఇట్లు కలదు.

"ఇనవంశోత్తమ నీ మొనం దునిసిపో నే వాలివో సప్తసా
లినొ మారీచుని తల్లినో యవిశాఖాళీభేద్యతన్ వజ్రసా
రవిరాతంకహృదంతరాళనగు తారాకాంత నింతే యిఁక
న్నను నిర్జింపక నీవు ధన్వి వనుకొన్న న్నవ్వరో యెవ్వరున్. " 45ప. 6ఆ.

మూలమునందు అభ్యర్థనము, పద్యమునందు ధిక్కారము కలవు. ఇది స్వతంత్రాంధ్రీకరణము.

సీతను అన్వేషించిన హనుమంతుని ఆత్మగతమిది :

జ్యోత్స్నాం వినాఽ పి నివసే న్నిశి శీతభాను
శ్ఛాయాం వినాఽ పి నివసే ద్దివసేశ్వరోఽ పి,
ఏనాం వినా రఘుపతిః పరిగృహ్యధైర్యం
సప్రాణ ఏవ వసతీతి విచిత్ర మేతత్. " 30శ్లో.సుం.కాం.

ఇది తెనుగుసేతను ఇట్లు కలదు.

"యామినిఁ జంద్రికారహితుఁడై శశి యుండిన నుండు వాసర
గ్రామణి ఛాయఁ బాసి యధికప్రభ నుండిన నుండుఁగాక యీ
తామరసేక్షణామణినిఁ దా నెడబాసి కకుత్స్థవంశ్యను
త్రాముఁడు మేనఁ బ్రాణములు దాలిచియుండుట చిత్ర మెన్నఁగన్ " 35ప. 7ఆ.

ఇది యథామూలకము. అస్వతంత్రాంధ్రీకరణము.

సేతువు గుఱించి సంభావన హృదయంగమము.

"అలక్షితమహీధరగ్రహణ మస్ఫుటక్షేపణం
విచిత్రఘటనం తతో విరచితో వలే నామునా

అబోధి హరియూథ్నై రధిపయోధి సేతు ర్మహాన్
భువో భుజ ఇవా భయం నిజతనూభువో లంభయన్." 46శ్లో.యు.కాం.

"ఉరువడి గట్లు కైకొనుట యుంచు టమర్చుట యించుకేని యె
వ్వరికి నెఱుంగకుండఁ గరపాటవమొప్ప నలుండు సేతు వ
చ్చెరువుగ సంఘటించె నది సీతకు భూమి యభీతిహస్తమున్
దురుసుగఁ జాఁచెనో యనఁగఁ దోఁచె వనేచరవీరకోటికిన్." 46ప. 8ఆ.

చంపూరామాయణమునందు సీత అగ్నిప్రవేశము స్వయంకృతము.

"అనంతర మియ మరుంధతీవ పవిత్రచారిత్రనిధే రధి
దేవతా పతిదేవతా ఽ నాదిపుంసో ఽ పరస్య మర్త్యధర్మేణ
ప్రత్యాయనాయ నాయకస్య పుర: పురందరముఖాన్ పురస్కృ
త్య చ భగవంత మరవిందాసన మిందుకలేవ పునరుదేష్యంతీ
తపనమివ దహన మవజగాహే." 163గ.యు.కాం.

"అనంతరం బరుంధతియుం బలె పవిత్ర చారిత్రనిధి యన ధరిత్రీ
పుత్త్రి పతివ్రతాశిరోమణి యని తెలియంబడియును మర్త్యధర్మొందైన పరమ
పురుషునకును లోకంబునకును ప్రత్యాయనంబునకై పురందరముఖులగు
బర్హిర్ముఖులును భగవంతుండగు నరవిందాసనుండును సాక్షులుగాఁ బునరు
దయంబునకై వనరుహబంధునిం బ్రవేశించు నిందుకళయుం బలె సముజ్జ్వలజ్జ్వ
లనంబుఁ బ్రవేశం బొనరించె." 196వచ. 8ఆ.

మొత్తము మీద చంపూరామాయణము తెనుగుసేత స్వతంత్రాస్వతంత్రము.

**చింతలపల్లి వీరరాఘవయ్య :** ఇతని కృతి మధురవాణీవిలాసము. తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. ఇతని పితామహుడు వీరరాఘవయ్య "వేదపరీక్ష లిచ్చి మట్లి యనంతరాజాచేఁ గొనియెఁ జక్రములువేయు"అని కలదు. (38ప. 1ఆ.) అతని సిద్ధవటశాసనకాలము 1606 వ సంవత్సరమని పూర్వోక్తము. కాఁబట్టి మధురవాణీవిలాసము రచనాకాలము 1660 ప్రాంతము కావచ్చును.

ఇందు పాంచాలరాజు వర్ధమానపురనివాసి అగు విక్రమశాలి తనయ మధురవాణికి, హైహయరాజు మాహిష్మతీపురనివాసి అగు కృతవీర్యుని కుమారుడు అర్జునునికి (కార్తవీర్యార్జునునికి) జరిగిన వివాహమే ఇతివృత్తము. ఇది కేవలము కల్పితకథ. అయిదాశ్వాసముల కావ్యము. సంతానము లేని కృతవీర్యుడు దత్త్రాత్రేయుని ప్రార్థించుట, దత్త్రాత్రేయుడు సంతానవైష్ణవమంత్రమును ఉపదేశించుట, కృతవీర్యుడు మంత్రమును జపించుట ప్రథమాశ్వాసము. కృతవీర్యునికి పరవాసుదేవమూర్తి ప్రత్యక్షమై వరమిచ్చుట, అర్జునుడు జన్మించుట, యువరాజగుట, అతని కొలువునకు విక్రమశాలి మంత్రులు భావజ్ఞవిధిజ్ఞులు వచ్చుట, మధురవాణిని వర్ణించుట ద్వితీయాశ్వాసము. ఒక జోగిని ఒసగిన నేత్రాంజనము మహిమను కార్తవీర్యార్జునుని చూచి మరులుగొన్న మధురవాణి విరహమును వర్ణించుట తృతీయాశ్వాసము. అది విని కార్తవీర్యార్జునుడు మధురవాణి యెడల మరులుగొనుట చతుర్థాశ్వాసము. కార్తవీర్యార్జునుని మంత్రులు భావహేవాకులు వర్ధమాన పురమున కేగి వివాహము నిశ్చయించుట, మధురవాణీకార్త వీర్యార్జునుల వివాహము, నిషేకము పంచమాశ్వాసము.

ఇదొక పిల్ల వసుచరిత్ర[118]. సంగీతసాహిత్యసమ్మేళనము లేదుగాని, శ్లేషానుకరణము, పద్యానుకరణము కలదు. అంతేకాదు. ఇందు శబ్దచమత్కారము; చిత్రగర్భ, బంధకవిత్వములు ఇతోధికవిశేషములు.

"స్వైరవిహారధీరలగు సారసలోచన లున్న చోటికిన్
బోరన లాఁతివారు చొరఁబూనినచో రసభంగమంచు నేఁ
జేరక పువ్వుఁదీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్." 54ప. 2ఆ.

అను వసుచరిత్రములోని పద్యమునకు అనుకరణమిది :

"సతి కుచవాక్య మెచ్చ నరిజాతసుధల్ తము దామె వాదులై
హతులయి వారిజాతవసుధాకృతిఁ బూనుచు దృబ్ధతంబని
ర్జితరుచి నెవ్వగం దుద సరిత్వముఁ బొందియుఁ జంద్రసేవధి
స్థితిని ముఖాంగముల్ గెలిచె ఛీ తగ దెన్నిట నొంట నోడినన్." 120ప. 2ఆ.

వసుచరిత్రమునందు సారసలోచనలు రసశబ్దము లోపించిన, సాలోచనలు అగుదురు. మధురవాణీవిలాసపద్యమునందు అరిజాతసుధలు వ అను వర్ణము ఆదిని కలవైన వారిజాతవసుధలగును. ఇది శ్లేషానుకరణము.

వసుచరిత్రములోని సుప్రసిద్ధమైన "లలనాజనాపాంగవలనావసదనంగతుల నాభికాభంగదోఃప్రసంగ" మనుపద్యమునకు అనుకరణము :

"హితసారభద్రుమామితసారభభ్రమా
గతసారభవనమానితఖగాళి
భృంగీతతివిరావసంగీతనటభావ
భంగీతతశిఖావళాంగనాళి
మందారమధురిమామందారవిందమా
రందారచనసమానందితాళి
సారాంతరహితకాసారాంతరకృతకా
ధారాంతసుఖితకాదంబపాళి
నవకదంబకదంబపున్నాగనాగ
జాతజాతిజటాజటీసేతుమాతు
లుంగలుంగఘనాఘసారంగరంగ
దవలపావనమవ్వనమొనెపొగడ." 138ప. 2ఆ.

"లలనాజనాపాంగ" పద్యములోని లాలిత్యము, సంగీతము "హితసారభద్రుమ" పద్యమునందు మృగ్యము. అది జాతిరత్నము. ఇది కృత్రిమరత్నము.

మధురవాణీవిలాసమునందు యమకముల గమకము సమధికము

"ఆనందనారదాదులు
సానందనసుతుల కరణి నాదరణముతో
నానం దనరి దయానిల
యా! నందనలాభ మొసఁగు మఘనాశ ఘనా." 26ప. 2ఆ.

ఇందు నామధేయములును శబ్దచమత్కారవిధేయములు :

"అనిన నరపతి పల్కు నో యార్య నీదు

మధురవాణీప్రశంస సమ్మదము నిడియె
ననిన భావజ్ఞు డర్థమౌ నౌ మదీయ
మధురవాణీప్రశంస సమ్మదము నిడదె." 93ప. 2ఆ.

నరపతి పలుకులోని మధురవాణి మధురవాక్కు. భావజ్ఞుని సమాధానములోని మధురవాణి విక్రమశాలి తనయ మధురవాణి.

మధురవాణీవిలాసమునందు మంత్ర, స్వప్న, శకున, సాముద్రిక, జ్యోతిషరత్న ప్రభృతిశాస్త్రములలోని అంశములను ప్రతిఫలించినవి[119].

పుర (93-119ప. 1ఆ; 103ప. 2ఆ.) రాజ (120-123ప. 1ఆ.) రాజ్ఞ (124-127ప. 1ఆ.) దౌహృద (39-41ప. 2ఆ.) నాయక (42ప. 82వచ. 2ఆ.) నాయిక (106-131ప. 2ఆ.) వసంతర్తు (133-134ప. 2ఆ.) వనకేళి (135-146ప. 2ఆ; 2-25ప. 3ఆ.) కాసార (26-28ప. 3ఆ.) జలకేళి (29-35ప. 3ఆ.) నాయికావిరహ (62-85ప. 3ఆ.) శిశిరోపచార (86-87ప. 3ఆ.) చంద్రాదిప్రార్థన (91-97ప. 3ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (3-26, 41-51ప.4ఆ.) చంద్రాద్యుపాలంభ (27-38ప. 4ఆ.) నాయకవిరహ (3-7ప. 5ఆ.) వివాహ (31-88ప. 5ఆ.) పురప్రవేశ (90ప. 5ఆ.) పౌరాంగనావిలోకన (92-97ప. 5ఆ.) నిషేక (103-127ప. 5ఆ.) వర్ణనలు కలవు.

వృత్తకందద్విపదాదిగర్భితసీసము (8ప. 2ఆ.) ఖడ్గబంధచతుర్విధకందము (10ప. 2ఆ.) ఏకాక్షరకందము (11ప. 2ఆ.) ద్వ్యక్షరకందము (12, 13ప. 2ఆ.) త్ర్యక్షరకందము (14ప. 2ఆ.) ఛ్మకవాళకందము (15ప. 2ఆ.) చక్రబంధము (107ప. 3ఆ.) పుష్పమాలికా బంధము (86ప. 2ఆ; 135ప. 5ఆ.) నాగబంధము (133ప. 5ఆ.) కలవు.

**చింతలపల్లి ఛాయాపతి** : ఇతని కృతి రాఘవాభ్యుదయము. అయిదాశ్వాసము లు లభించినవి. ఆరవ ఆశ్వాసము అభింపలేదు. అయిదాశ్వాసములగ్రంథమును అముద్రితము. బోరువెల్లి కేశవస్వామికి అంకితము. దైవాంకితము. కృతిప్రోత్సాహకుడు నాదెగౌని వేంకటపతి. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఇతడు చింతలపల్లి వీర రాఘవయ్య పెదతండ్రి కుమారుడు. కాబట్టి రాఘవాభ్యుదయము రచనాకాలము 1660 ప్రాంతము కావచ్చును.

రాఘవాభ్యుదయము ముద్రణభాగ్యమునందకపోయినను కొంత వెలుగు చూచినది[120].

అయిదాశ్వాసములందును అజమహారాజచరిత్రము కలదు. అయిదవ ఆశ్వాసము నందు రఘుమహారాజ జననము కలదు. ఆరవ ఆశ్వాసము రఘుమహారాజ చరిత్ర మగును. (ఒక ప్రతిలో 124 వ ఆకున షష్ఠ్యాశ్వాసాంతగద్య కలదు[121].) కాళిదాసు రఘు వంశములోని 4, 5, 6 సర్గల నుండి చాలవఱకు ఆంధ్రీకరణము కలదు.

"స నిర్విశ్య యథాకామం తటేష్వాలీఢచందనౌ,
స్తనావివ దిశ స్తస్యా శ్శైలౌ మలయదర్దురౌ" 51శ్లో. 4స.

"తటనితాంతవిలీనచందనము లగుచుఁ
దద్దిశాబంధురస్తనద్వయముఁ బోలి
రూఢి కెక్కిన మలయదర్దురములందుఁ
గొంత తడవు సుఖంబుండి యంత వెడలి." 2ఆ.

"తం కర్ణభూషణనిపీడితపీవరాంసం
శయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగరాగమ్,
సూతాత్మజా స్స వయవ: ప్రథితప్రబోధం
ప్రాబోధయ న్నుషసి వాగ్భి రుదారవాచ: 65 శ్లో. 5స.

"పేశలకర్ణభూషణనిపీడితపీనతరాంసభాగు సు
శ్రీశయనోత్తరాస్తరణచేలవిమర్దకృశాంగరాగు ధా
త్రీశు గురుప్రబోధుని సదృక్షవయస్సుతిపాఠకుల్ విని
ర్దేశు లుదారభూషణులు వేకువ మేల్కొనఁ జేసి రల్లనన్. 4ఆ.

"రతి ర్గృహీతానునయేన కామం
ప్రత్యర్పితస్వాంగ మివేశ్వరేణ
కాకుత్స్థ మాలోకయతాం నృపాణాం
మనో బభూ వేన్దుమతీ నిరాశమ్." 2శ్లో. 6స.

రతిసంప్రార్థితచంద్రశేఖరకృపాప్రత్యర్పితస్వాంగసం
గతుఁడైనట్టి ప్రసూనసాయకుఁడనన్ గన్పట్టు కాకుత్స్థభూ
పతి నీక్షించు నరేంద్రచిత్తము విదర్భక్షోణిభృత్కన్యకా
యుతి నిర్వేశనిరాశమై యుపగతప్రోత్సాహమయ్యెం గడున్." 5ఆ.

ఇట్లు ఆరవసర్గలోని 61, 64, 67, 79, 84 శ్లోకములకు తెనుగుసేత కలదు. ఛాయాపతి ఆంధ్రీకరణము శ్రీనాథుని ఆంధ్రీకరణమునకు శిష్యప్రాయము.

**పింగళి ఎల్లన** : ఇతని కృతి సర్వేశ్వరమహత్త్వము. అనగా "తోభ్యచరిత్ర ము'. సర్వేశ్వరునికి అంకితము. దైవాంకితము. కృతిప్రేరకుడు తుమ్మ రాయపరెడ్డి. అతని పెదతండ్రి కొండారెడ్డి. ఆతడు "శౌర్యపటిమన్ గొట్టె న్మరాటీలను" అంతేకాదు. "దామెర వేంకటాధిపుఁడు మన్నించంగఁబామూరిలో నుండు"ను. దామెర వేంకటాధిపుని కాలము 1640 ప్రాంతము. మరాటీలను కొట్టిన కాలము 1676 కంటె పూర్వము[122]. కాఁబట్టి తోభ్యచరిత్రము రచనాకాలము 1670 ప్రాంతము కావచ్చును.

సర్వేశ్వరమహత్త్వమునకు మూలముగ వాక్యగ్రంథమును ఒసగిన సంజీవనాథస్వామి క్రీ.శ. 1703వ సంవత్సరమునందున్నట్లు ఒక అభిప్రాయముకలదు.(పీఠిక: అథనూ కాంబిక). ఈ కాలమున దామెర్లవేంకటాధిపుడు, కొండారెడ్డి, రాయపరెడ్డి లేరు. కావున ఈ సంజీవనాథస్వామి (1703) మఱొకడగును.

సర్వేశ్వరమహత్త్వము సంజీవనాథస్వామి ఒసగిన వాక్యగ్రంథమునకు అనగా వచన కావ్యమునకు పద్యగద్యోభయకావ్యము. అలతి అలతిమార్పులు అక్కడక్కడ గలవు. చాలవఱకు వచనకావ్యమునకు అనుసరణమే. వచనకావ్యములోని ఇతివృత్తము - తోభ్యునిచరిత్రము - అతని కుమారుడైన చినతోభ్యునిచరిత్రమును ఇందు ఇంచుమించు యథాతథముగ గలదు. అది కొంత విలక్షణమైన అసాధారణమైన చిత్రకథ.

కవిత్వము రసవత్తరము. పూర్వకవితాచర్వణముపుష్కలము. తోభ్యునిబాల్యవర్ణన (56-1) - పోతన ప్రహ్లాదబాల్యమునకు తోభ్యునిపరిణయవర్ణన (62-1) - పోతనరుక్మిణీ కల్యాణమునకు సారమ్యమాన ప్రాధాన్యము (83-2) - తిమ్మన పారిజాతాపహరణము నకు రఫేలుని చిన్నతోభ్యుడు ప్రశ్నించువిధము (7-3) - పెద్దన మనుచరిత్రమునకు

తల్లిదండ్రుల స్థితివర్ణన (11-3) - శ్రీనాథుని శృంగారనైషధమునకు వనవర్ణన (38-3) - పోతన గజేంద్రమోక్షమునకు అనుసరణములు.

ఈ కావ్యమునందు తల్లిదండ్రుల అసహాయస్థితికి తనయుని వేదన, తనయునకై తల్లి ఆవేదన సహజసుందరముగ కలవు.

తోభ్యుడు నిర్ధనుడై అంధుడై అసహాయుడై యున్నస్థితిలో అతని భార్య పరుల యిండ్లలో పనులుచేసి ఇల్లుగడుపు చుండును. ఆతల్లి ఇక్కట్లను గాంచిన తనయుడు

మ॥ అకటా! చేరెడు కూలిబియ్యమునకై యత్యంత నిత్యాన్నదా
న కళావైభవలక్ష్మికి న్నిలయమౌ నాతల్లి హస్తాబ్జమిం
తకృశీభావమునొంది క్రిందుపడగా నాగుండెయెంతే వికా
వికలైప్రీలక నిల్చియుండె గరినోర్వీ భృద్విపక్షాసియై. 69-2

చ॥ అనుపమ సౌఖ్యలీలలఁ బ్రయాసమెఱుంగని తల్లినేఁడునీ
పనులొనరింపఁ గష్టమెడబాపగఁ జాలనిఁకేమి సేతుహా
ననుఁదెగఁజాడ రెవ్వరును నాదిశరీరమె నాదిజన్మమే
శునకములైన ఁజావఁదిన జాచునె రోయక యిట్టిదేహమున్ 70-2

మాతృమూర్తిని గూర్చి తండ్రి తోభ్యుడు తనయునకు చెప్పిన విషయములు ఉదాత్తములు.

సీ॥ మొదలఁదొమ్మిది మాసములు గర్భభారంబు
దాల్చి తత్ప్రసవ వేదనకు నోర్చి
ముదముతో నినుఁగని ముద్దుగాఁ బెంచుచు
వేకి పెచ్చుల పట్ల వెతలనొంది
మాన్పుచుఁ గరుణ మైమఱియు నాఁకొననీక
తన నోటి కడియైన దాఁచిపెట్టి
కనిసినయెడ బుజ్జగించి సమ్మతిజేసి
కలతప్పులన్నియుఁ గ్రమ్మపుచ్చి
తే॥ యెపుడు సంధ్యల నిలువెళ్లనీకమిగులఁ
బ్రేమఁదనరారఁ గంటికి తెప్పకరణిఁ
బ్రోచెఁ బరపీడ లేమియుఁ బొదవనీక
తల్లినీకునెపుడుఁ గల్పవల్లి యయ్యె. 98-2

దూరమేగిన కుమారుని రాకకై ఎదురుతెన్నులు చూచుచు శంకాకులయగు తల్లిమనసును వర్ణించిన తీరు రమ్యము.

సీ॥ తనయుడు నర్థియై మునివెంట నరిగి పె
క్కుదినంబు లయ్యెను గుశలవార్త
వినఁబడదయ్యె నేవెరవున నేగిరో
గహనమార్గంబున బహుళసత్త్వ
చోరభయంబుల సుద్దులెట్టివో గబే
లుని పట్టణమునకుఁ జనిరో లేదొ
యతఁడు కన్పడి వారి కర్థమిచ్చెనొ లేదొ
యిచ్చిన నది గొనివచ్చునప్పుడు

తే ॥ నడుమ గుంరిత మెట్టిదొకడు శరీర
సంకటము లిట్టివో రాకజాగుచేసి
రేమొకోయని సంతాపమినుమడింప
నన్నమాంబిక మదిలోన నడలునపుడు. 45-4

ఇట్టిస్థితిలో ప్రతిదినము కుమారుని రాకకై ఎదురుచూచు ఆతల్లికి ఒకనాడు దూరముగా తనయుని రాక కంటబడినది. ఆమె పర్వతముమీదికెక్కి చూచుచున్నది. తల్లి హృదయమట్టిది. ఆ 'పర్వతముడిగి పరుగిడి ప్రాణనాథునికి సుతునిరాక' ఎతిగించినది. ఆతనయుడు తలిదండ్రులను చేరి నమస్కరించగా తల్లిదండ్రులాతని ప్రియమార కౌగిలించుకొనిరి. ఆసందర్భమున కవి కూర్చిన అర్థాంతరన్యాసము అత్యంతమనోహరము.

"ఆత్మజుడు సన్మనస్కుని యాజ్ఞదల్లి
దండ్రులకు మ్రొక్క వారలిద్దఱును గదిసి
వలనుపడఁ గౌగిటను జేర్చి వదలరైరి
పుత్రవాత్సల్యమున కెంత భూరిబలమొ." 4-55

ఇందు పుర (9-2), నాయిక (61-1), పరిణయ (65-1), భోజన (27-2), అన్నదాన మాహాత్మ్య (101-2) నదీ (39,40-2), వన (38-3), సూర్యాస్తమయాదిచంద్రికావర్ణన (52,53,55-3) చేయబడినవి.

'మదనదర్పణము' అను నూతన ఛందము కలదు (58-1)

ఇది క్రైస్తవగ్రంథమయినను ఇందు మతప్రబోధము లేకపోవుట విశేషము.

భాస్కరాచార్యులు : ఇతని కృతి వైశ్యపురాణము. ఇది కావ్యమనియు (36ప. 1ఆ.) ప్రబంధమనియు (61వచ. 1ఆ.) పేర్కొనఁబడినది. పురాణధోరణి, కావ్యసరణి రెండును కలవు. పెనుగొండ బాలనగరులకు అంకితము. బాలనగరులు కథాకాలము నందు, రచనాకాలమునందును కలరు. (77ప. 8ఆ.) కాని సుసంగతము కాదు. అవతారిక యందు "భారతరామసత్కథలు భాగవతంబు తెనుంగు సేయఁగా నేరరె సత్కవీశ్వరులు"అని కలదు. (22ప. 1ఆ.) తెనుగు భాగవతము రచనాకాలము 1480 ప్రాంతమని పూర్వోక్తము[123]. కావున వైశ్యపురాణము రచనాకాలము 1480 తర్వాత కావలయును. అంతేకాదు. "వరుస నార్గురు చక్రవర్తులు రాజులు పదియు నార్వురఁ బేరఁ బరగె కృతుల " అని కలదు. (18ప. 1ఆ.) పదియు నార్వురు రాజుల పేర పరగిన కృతి వెన్నెలకంటి అన్నయ షోడశకుమారచరిత్రము ఆర్గురు చక్రవర్తుల కృతి కామినేని మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్రము. షట్చక్రవర్తిచరిత్రము రచనాకాలము 1575 ప్రాంతమని పూర్వోక్తము[124]. కావున వైశ్యపురాణము రచనాకాలము 1575 తర్వాత కావలయును. అంతేకాదు. రఘునాథనాయకుని వాల్మీకి చరిత్రములోని పద్యమునకు, భాస్కరాచార్యుల వైశ్యపురాణమునందు అనుకరణము కలదు.

'చెప్పఁగ వలెఁ గప్పురములు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపైఁ
గప్పిన క్రియ విరిపొట్లము
విప్పిన గతి ఘుమ్మనం గవిత్వము సభలన్." 15ప. 1ఆ.

"చెప్పెద సుకవుల చెవులన్
జిప్పల నమృతంపు సోన చిలికిన మాడ్కిన్
గప్పురమును విరిపొట్లము
విప్పిన క్రియ నొకరికొకరి విప్పగు కీర్తుల్." 24ప. 1ఆ.

ఇందు "కప్పురమును" అనునది అనన్వితము. కనుక అనుకరణము. వాల్మీకి చరిత్రము రచనాకాలము 1625 ప్రాంతమని పూర్వోక్తము[125]. కావున వైశ్యపురాణము రచనాకాలము 1625 తర్వాత కావలయును. వైశ్యపురాణము తాళపత్రగ్రంథములలోని లేఖనకాలములందు 20-9-1704 వ తేదీ[126] పూర్వతమము. కావున వైశ్యపురాణము రచనాకాలము 1625, 1704 సంవత్సరముల మధ్యకాలము కావలయును. కాఁబట్టి వైశ్యపురాణము రచనాకాలము 1675 ప్రాంతము కావచ్చును.

వైశ్యపురాణమునకు మూలభూతములైన సంస్కృతపురాణములు నాలుగు కలవు[127]. 1. వైశ్యధర్మప్రకాశిక 2. శ్రీమత్కన్యకాపురాణము 3. వాసవకన్యకాపురాణము 4. శ్రీవాసవకన్యకాపురాణము. వైశ్యధర్మ ప్రకాశిక భాస్కరకవికృతము. ఇందు ఆచార్య త్రయము జీవితచరిత్రలు కలవు. శంకరాచార్యుల కాలము[128] 788-820. రామానుజా చార్యుల కాలము [129] 1018-1137. మధ్వాచార్యుల కాలము [130] 1198-1275. కనుక వైశ్యధర్మప్రకాశిక పదమూడవశతాబ్దికంటె పూర్వగ్రంథముకాదు. పదునాల్గవశతాబ్ది గ్రంథము కావచ్చును. శ్రీమత్కన్యకాపురాణమునందు వైశ్యధర్మప్రకాశిక యందు లేని బహువిషయములు కలవు. పరమేశ్వరానుగ్రహమున వాసవి, విరూపాక్షుడు జన్మించినట్లు కలదు. విరూపాక్షనామధేయము విజయనగరసామ్రాజ్యకాలమునందు విఖ్యాతము. అంతేకాదు. విష్ణువర్ధనుని రాజధాని పద్మశైలపురమని కలదు. పద్మశైలమన కమలాద్రి. అది కల పురము పద్మశైలపురము. కమలాద్రి రాజమహేంద్రవరమునందు కలదని శ్రీనాథుని భీమేశ్వరపురాణ, కాశీఖండములందు కలదు. అవి పదునైదవశతాబ్ది పూర్వార్ధము లోని కృతులు. కనుక శ్రీమత్కన్యకాపురాణము పదునైదవశతాబ్ది పూర్వార్ధము కంటె పూర్వగ్రంథము కాదు. ఉత్తరార్ధములోని గ్రంథము కావచ్చును. వాసవకన్యకా పురాణము శ్రీమత్కన్యకాపురాణమునకు అనుసరణము. సంగ్రహవిస్తరములు, నూతన విషయములు కలవు. కనుక వాసవకన్యకాపురాణము పదునైదవశతాబ్దికంటె పూర్వ గ్రంథము కాదు. పదునాఱవశతాబ్ది గ్రంథము కావచ్చును శ్రీవాసవకన్యకాపురాణము వాసవకన్యకా పురాణమునకు సంగ్రహము. వచనగ్రంథము. ఇది వర్తమానశతాబ్ది వ్యవహారము కావచ్చును. పదునాఱవశతాబ్ది వాసవకన్యకాపురాణములోని భాస్కరా చార్యుల వృత్తాంతమునకు వైశ్యపురాణములోని భాస్కరాచార్యుల వృత్తాంతము అనుసరణము. కావున వైశ్యపురాణము రచనాకాలము పదునేడవశతాబ్ది (1675) కావలయును.

వైశ్యపురాణమునందు తొలి అయిదాశ్వాసములు పురాణము. తుది మూడు ఆశ్వాసములు కావ్యము. పురాణభాగమునందు పార్వతీపరమేశ్వరపరిణయవృత్తాంతము ప్రసిద్ధము. కావ్యభాగమునందు వాసవీకన్యకావృత్తాంతము చరిత్రాత్మకము. రాజ మహేంద్రవరరాజ్యాధిపతి విష్ణువర్ధనుడు కారణముగ, పెనుగొండ (ప.గో.జి) పట్టణాధిపతి కుసుమసెట్టి కూతురు వాసవీకన్యక, నూట రెండు గోత్రముల వైశ్యదంపతులు అగ్ని

ప్రవేశము చేయుట ఇతివృత్తము. విష్ణువర్ధనుడు రాజమహేంద్రవరరాజ్యాధిపతి అని వైశ్యధర్మప్రకాశికయందు, అతని కుమారుడు రాజరాజేంద్రుడని శ్రీమత్కన్యకా పురాణమునందు రాజరాజు అని వాసవీకన్యకాపురాణమునందు కలదు. విష్ణువర్ధనుడు రాజమహేంద్రపురాధీశ్వరుడు, చాళుక్య వంశీయుడు అని (5-9ప. 6అ.), శర్వాణీరాజరాజ నరేంద్రుల కుమారుడు అని (47ప. 5అ.) వైశ్యపురాణమునందు కలదు. ఈ రాజరాజ నరేంద్రుడు చరిత్రప్రసిద్ధుడైన రాజరాజనరేంద్రుడు కాడు. అతని కుమారుడు కులోత్తుంగ చోళుడు. ఇతడు రాజమహేంద్రవరరాజ్యాధిపతికాడు. చోళసామ్రాజ్యాధిపతి. రాజ మహేంద్రవరమునందు లేడు. ఉన్న ఇతని నాల్గవ కుమారుడు విక్రమచోడుడు (1118-35), ఇతని దత్తుడు రెండవ కులోత్తుంగచోళుడు (1133-50), ఈతని కుమారుడు రెండవ రాజరాజచోళుడు (1145,46-1173) రాజమహేంద్రవరరాజ్యాధిపతులు[131]. విక్రమచోళుని దత్తుడైన రెండవ కులోత్తుంగచోళుడు శర్వాణీరాజరాజనరేంద్రుల కుమారుడు కావచ్చును. ఇతని కుమారుడు రాజరాజే. వీరు చోళనామధేయులైనను, అసలు చాళుక్యవంశీయులే. అంతేకాదు. 1145 వ సంవత్సరమునందు ఒక విష్ణువర్ధనమహారాజు శాసనము కలదు[132]. అందు విష్ణువర్ధనుని 21 వ సంవత్సరమని, శాలివాహనశకము 1067 వ సంవత్సరమని కలదు. (1067+78=1145) అదే శాసనము నందు పెనుగొండ మాదిసెట్టి కొడుకు ప్రోలిసెట్టి పట్టిసపునాడులోని వీరభద్రేశ్వరస్వామికి పాతిక గోవులు దానము చేసినట్లు కలదు. ఇంకను 1124, 1144, 1151 సంవత్సరముల లోని శాసనములందు వైశ్యులు పెనుగొండపురవరాధీశ్వరులుగ కలరు[133]. అంతేకాదు. 1164 వ సంవత్సరములోని శాసనమునందు నూటరెండు గోత్రముల వైశ్యుల సంగతి కలదు[134]. 1145 వ సంవత్సరము రెండవ కులోత్తుంగచోళుని రాజ్యకాలములోనిది. ఇతడు 1125 వ సంవత్సరమునందు యువరాజైన, 1145 వ సంవత్సరము 21 వ సంవత్సరమగును. శాలివాహనశకము శంకనీయము కాదు. కనుక 1145 వ సంవత్సరము నందలి శాసనము లోని విష్ణువర్ధనమహారాజు రెండవ కులోత్తుంగచోళుడే అగును. కావున పురాణపురుషుడైన విష్ణువర్ధనుడు, చారిత్రికవ్యక్తి రెండవ కులోత్తుంగచోళుడు కావల యును. వాసవీకన్యక అగ్నిప్రవేశము చేసిన వార్త వినఁగానే, విష్ణువర్ధనుడు మరణించినట్లు కలదు. (204ప. 8అ.) అది రాజ్యాంతకాలమగును. రెండవ కులోత్తుంగచోళుని రాజ్యాంత కాలము 1150 వ సంవత్సరము. కావున వాసవీకన్యక కాలము పంద్రెండవశతాబ్ది కావలయును.

అగ్నిప్రవేశమునకు గురుత్వము వహించిన భాస్కరాచార్యులకు అష్టాదశపట్టణాధి పతులైన వైశ్యులు, తామరవాడ (తామరాడ) అగ్రహారముగ ఇచ్చినట్లు శాసనము వాసవీకన్యకాపురాణమునందు కలదు. (21-34శ్లో. 44అ.) అందు శాసనకాలము ఇట్లు కలదు.

"కల్యాద్యబ్దగణేక్షణాబ్ధిరసద్వైస్సంఖ్యా గతే వత్సరే
ప్రాప్తేఽ థ ప్రభవే తపస్యసి సితే పక్షే ద్వితీయా గురౌ " 22శ్లో.
ఇది వైశ్యపురాణమునందు ఇట్లు కలదు.
"కల్యాద్యబ్దగణేఽ ష్టనేత్రరసదృక్సంఖ్యే గతే వత్సరే

ప్రాప్తేఽ థ ప్రభవే తపస్యసి సితే పక్షే ద్వితీయా గురౌ " 79ప. 8ఆ.

ఇది 1881-1890 నడుమ పెదచెఱుకూరు గరుడస్తంభశిలాశాసనమునందు, తామ్రశాసమునందు ప్రవేశించినది. అదొక కూటశాసనము[135]. వాసవీకన్యకాపురాణములోని శాసనకాలసంఖ్య ఈక్షణాబ్ధిరసదోస్సంఖ్య అగును. అది క్రీస్తుపూర్వము 454 వ సంవత్సరమగును. ఆ కాలమునందు ఆంధ్రావనిలో శాసనములే లేవు. కల్యబ్దపరిగణనము కల్పితము. వైశ్యపురాణములోని అష్టనేత్రరసదృక్సంఖ్యయందు "అష్ట" సంఖ్యావాచకము. "నేత్ర రసదృక్" సంఖ్యాసూచకము. వాచకసూచకసాంకర్యము శాసనసంప్రదాయము కాదు. అయినను, అది కూడ క్రీస్తుపూర్వము 468 వ సంవత్సరమగును. ఇది కూడ కల్పితమే. "అష్టనేత్రరసదిక్" అయిన 1532 వ సంవత్సరమగును. ఇది పదునాఱవశతాబ్ది. ఇంత అర్వాచీనము కాదు; అంత ప్రాచీనము కాదు. సంఖ్యామానమునకు స్వస్తి చెప్పిన, ప్రభవనామసంవత్సరమాఘశుద్ధవిదియాగురువారము 12-1-848 వ తేదీ అగును[136]. ఆ కాలమునందు రాజరాజనరేంద్రుని కుమారుడు, రాజరాజేంద్రుని తండ్రి అగు విష్ణువర్ధనుడు లేడు. ఇది సైతము కల్పితమే. ఇదొక కూటశాసనము. ఇందలి భాస్కరాచార్యులు పండ్రెండవశతాబ్దివాడు. వైశ్యపురాణము రచించిన భాస్కరాచార్యులు పదునేడవ శతాబ్ది వాడు. ఇద్దఱు భిన్నులు.

పార్వతీపరమేశ్వరపరిణయవృత్తాంతము కాళిదాసు కుమారసంభవమునకు రేఖామాత్రమైన అనుసరణము. తొలి పద్యము (28ప. 3ఆ.) తొలి శ్లోకమునకు ఆంధ్రీకరణము. విష్ణువర్ధనుని జైత్రయాత్రలు (19-57వచ. 6ఆ.) చరిత్రాభాసములు. విష్ణువర్ధనుని మంత్రుల, వైశ్యుల సంవాదము (150-289వ. 7ఆ.) వాసవీకన్యకాగ్నిప్రవేశఘట్టము సముజ్జ్వలము. అందు వీరతాంబూలస్వీకరణము, వీరకంకణధారణము (29వచ.-38వచ. 8ఆ.) వీరరసస్ఫోరకము. ధనదుడను యువకుడు భాస్కరాచార్యులు వారించినను (23-25ప.),

"నగరస్వాములు ధరలో
నగణితముగఁ బలికి తిరుగ రనఁగా మహిమ
న్నెగడిన ప్రతిభలు దలఁపక
తగునే ననుఁ బిన్నఁ జేయఁ దలఁచుట మీకున్. 27ప.
అని పలికి యొడంబడక వీరావేశహృదయుండై వీర
కంకణంబు ధరించి వీరతాంబూలంబందిన . . . . " 28వచ. 8ఆ.

కుసుమసెట్టి దంపతుల విలాపము (96-119ప. 8ఆ.) కరుణరసనిర్భరము. కుసుమసెట్టి "తన పుత్త్రియైన వాసవిని నవలోకించి" (95వచ. 8ఆ.)

"నీ రూపంబును నీదు మంచితనము న్నీ నేర్పు నీ ముద్దులున్
నీ రమ్యంబగు రాజహంసగతియున్ న్నీ రాజబింబాస్యమున్
నీ రత్నావళిహారశోభిగళము న్నీ మందహాసంబు నిం
కేరీతి న్మఱవంగవచ్చుఁ జెపుమా యేణాక్షి యో వాసవీ! " 96ప. 8ఆ.

అని విలపంచి, విలపించి, నగరస్వాముల నిశ్చయమును.

"చెప్పలేక కలఁగుఁ జెప్ప నుద్యోగించుఁ
జెప్ప నేటికనుచుఁ జెప్పకుండుఁ

జెప్పుకున్న బాల చిత్త మెట్లుండునో
చెప్పవలయు ననుచుఁ జెప్పఁ దొడఁగె " 18ప. 8ఆ.

అది విని అతని భార్య కుసుమగంధి "శోకపరవశయై మూర్ఛిల్లి కొంత తడవునకు సేద దేఱి తన ముద్దుఁగూఁతు నెత్తికొని పురపురం బొక్కుచు గద్గదస్వరంబున నిట్లనియె " 110వచ. 8ఆ.

"నోములు సద్వ్రతంబులును నూతనభంగి నొనర్చి భామినీ
స్తోమము మెచ్చ మాసములు తొమ్మిది మోసియు నిన్నుఁ బుత్రిగా
నేమముతోడఁ గాంచితిని నీరజలోచన మమ్ము డించి నీ
వేమని యగ్ని కాహుతిగ నేఁగెదు మా కెఱుగంగఁ జెప్పుమా " 111ప. 8ఆ.

ఇట్లు విలపించు తల్లిదండ్రులకు వాసవీకన్యక ఉపదేశము (121-127ప. 8ఆ.) రౌద్రశాంతరససమ్మిశ్రణము.

"ఏలా యజ్ఞుల రీతి మూఢమతులై యిబ్బంగి శోకించుచున్
జాలిం బొందకుఁ డింక నన్నుఁ గడఁక న్సంరంభజృంభంబులన్
బాల న్నుగ్రతఁ బట్టి తెండను నృపున్ వైశ్వానరాభీలమై
కాలోగ్రంబగు శాపఖడ్గమున నే ఖండింతుఁ దత్కంఠమున్. 121

తేజ మొనరించి సుజ్ఞానదీపలక్ష్మి
చేత నజ్ఞానతిమిరంబు చెండి వైచి
శ్రీమహాదేవు కైలాసశిఖరవాసు
నెలమి మెప్పించి కైకొందు నిష్టసిద్ధి. " 126ప. 8ఆ.

వాసవీకన్య అగ్నిప్రవేశమునకు వైశ్యకాంతలు కావించిన శృంగారనైపథ్యము (129-138ప. 8ఆ.) విస్మయజనకము. అగ్నికుండములు మొదట చల్లనగుట ఆశ్చర్యజనకము.

"అనలము చల్లనై జలము లా శతకుంభముల న్సమగ్రమై
ఘనకమలాకరాకృతులు గైకొని యుండినఁ జూచి వైశ్యులు
వ్వనితలుఁ జిత్రభంగి తడి వస్త్రము లొయ్యనఁ గట్టుకొంచుఁ జ
య్యన జలకేళి సల్పిరి మహావరసంభ్రమలీల లుబ్బఁగాన్. " 184ప. 8ఆ.

**కట్టా వరదరాజు** : ఇతని కృతులు 1. పరమభాగవతచరిత్రము 2. శ్రీరంగ మాహాత్మ్యము 3. రామాయణము. ద్విపదకావ్యము. మూడు కృతులును తిరుపతి వేంకటేశ్వరునికి అంకితములు. దైవాంకితములు. ఇతని తండ్రి హరిదాసురాజా దానశాసనము కడప జిల్లా మాధవపురమునందు కలదు[137]. శాసనకాలము 1636-37 సంవత్సరము. కాఁబట్టి పరమభాగవతచరిత్రము రచనాకాలము 1670 ప్రాంతము, శ్రీరంగమాహాత్మ్యము రచనాకాలము 1675 ప్రాంతము, రామాయణము రచనాకాలము 1680 ప్రాంతము కావచ్చును.

**పరమభాగవతచరిత్రము** : అష్టమాశ్వాసము. అంతిమాశ్వాసము మాత్రమే లభించినవి. అవి అముద్రితములు. అష్టమాశ్వాసాంతగద్యను "కట్ట హరిదాసరాజ తనూభవ సాహితీభోజ వరదరాజప్రణీతంబైన పరమభాగవతచరిత్రంబను మహాప్రబంధంబునం దష్టమాశ్వాసము" అని కలదు[138]. అది రుక్మాంగదచరిత్రము. అంతిమాశ్వాస గద్యను " కట్ట హరిదాసరాజతనూభవ సాహితీభోజ వరదరాజప్రణీతంబైన పరమభాగవత

చరితంబను పుండరీకమహాప్రబంధంబునందు సర్వం సంపూర్ణం" అని కలదు[139]. ఇది పుండరీకచరిత్రము. రుక్మాంగదుడు, పుండరీకుడు పరమభాగవతులు. కావున పరమభాగవతచరిత్రమని గ్రంథనామము కావలయును.

**శ్రీరంగమాహాత్మ్యము** : ఇది పూర్వకవులు రచింపలేదని ఇతని అభిప్రాయము.

> చేయరె తొల్లి సత్కవు లశేషపురాణములుం దెనుంగులో
> నీ యితిహాస మెందు రచియింపమి తావకపుణ్య మింతె యా
> మ్నాయచతుష్కసారము సనాతనగారుడసంహితాశతా
> ధ్యాయి తెనుంగు సేయ నొకఁ డర్హుఁడె నేటి కవీంద్రకోటిలోన్. " పుట 2.

అని స్వప్నమునందు సాక్షాత్కరించిన వేంకటేశ్వరస్వామి ఆనతిచ్చెనట! శ్రీనాథ యుగములోని భైరవుని శ్రీరంగమహత్త్వము (ముద్రితము), రాయలయుగములోని పింగళి సూరన గారుడసంహిత (అనుపలబ్ధము) సనాతనగారుడసంహితశతాధ్యాయి తెనుగు సేతలే. ఉదాహరణపద్యము లను సంకలనగ్రంథమునందు ఉదాహృతమైన చెన్నమల్లు శ్రీగిరన్న శ్రీరంగమాహాత్మ్యము పూర్వగ్రంథమో, అపరగ్రంథమో అనిశ్చేయము. చెన్నమల్లు శ్రీగిరన్న, నవనాథచరిత్ర పద్యకావ్యమును రచించిన ఎఱ్ఱన యుగములోని శ్రీగిరి అనుటకు మఱి ఆధారము లేదు. మఱొకడు కావచ్చును. భైరవుని శ్రీరంగ మహత్మ్మమునకు, వరదరాజు శ్రీరంగమాహాత్మ్యమునకు మూలము గరుడపురాణము. పింగళి సూరన గారుడసంహిత కూడ అదే. గారుడసంహిత అశుభసమయమునందు చదువునది కాదు. అది విష్ణువు గరుత్మంతునికి చెప్పినది. షోడశాధ్యాయి. అష్టాదశ పురాణములలో ఒకటి కాదు. ఇది వ్యాసమహర్షి నాగదంతుడను మునికి చెప్పినట్లు సూతుడు శౌనకాదిమహా మునులకు చెప్పినది. శతాధ్యాయి. అష్టాదశపురాణములలో ఒకటి. భైరవుని శ్రీరంగమహత్త్వము, వరదరాజు శ్రీరంగమాహాత్మ్యము శ్రీరంగక్షేత్ర మాహాత్మ్యమును ప్రతిపాదించు క్షేత్రమాహాత్మ్యకావ్యములు. భైరవుని శ్రీరంగమహత్త్వము కవిత్వపటుత్వసంపద కలది. వరదరాజు శ్రీరంగమాహాత్మ్యము మూలవిధేయము. కావ్యత్వ సిద్ధి క్వాచిత్కము.

**రామాయణము** : ఇది ద్విపదరామాయణము. గోన బుద్ధారెడ్డి ద్విపదరామా యణము పరమస్వతంత్రము. కట్టా వరదరాజు ద్విపదరామాయణము పరమమూల విధేయము. చాలవఱకు యథావాల్మీకము. అందు అవాల్మీకవృత్తాంతములు అనేకము. ఇందు అవాల్మీకవృత్తాంతములు ఇంచుమించు లేవు. అహల్య శిల అగుట మాత్రము కలదు. జనకుడు సీతాకల్యాణమునకు దశరథునికి పంపిన కమ్మవక్కణ సమకాలికసరణి.

> "-శ్రీమన్ మహామండలేశ్వ
> రేందుకులోత్తమాహీనప్రతాప
> జనకమహారాజచంద్రులుంగారు
> ఘనవంశదశరథమనుజేశు నగరి
> చాలు మనుసులకు సంప్రీతిఁ బంపు
> మేలు వార్త నిరుద్ధమితమున కేము
> అందఱుఁ బరిణామ మచటి మీ రాజు
> నందు యోగక్షేమ మప్పటప్పటికి

వ్రాసియుంపునది. మా వైదేహిఁ బెండ్లి
చేసెద మిపుడు మీ శ్రీరామునకును
మీ రాజ వారును మీ పురోహితులు
చారువైఖరులఁ గౌసల్యాదిసతులు
రావలెనని తమరాజుతోఁ దెలుపఁ
గావలె " ననెడి వక్కణఁ జదివింప" పుటలు 203-204

**వెలగపూడి వెంగన** : ఇతని కృతి శ్రీకృష్ణకర్ణామృతము. వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము కృత్యాది లేదు. ఆశ్వాసాదిపద్యములు లేవు. ఆశ్వాసాంత పద్యములందు మాత్రమే కర్తృభర్తృవిషయములు కలవు. సులక్షణసారోదాహరణము నిర్ధారకసాధనముకాదు[140]. ప్రతివిలేఖనకాలమే[141] ప్రకృష్టసాధనము.

"శ్రీమత్కర్ణామృతకృతి
ప్రేమంబున వెలఁగపూడి వెంగన తెమఁగున్
గా మాల్యఁ గూర్చె దీనిన్
రామబ్రహ్మేంద్రమౌనిరాట్టు లిఖించెన్.
శాలివాహనాఖ్యశకవర్షములు వె
యిన్ని ఆరు నూరు నిరువదేడు
పరఁగ జనిన పిదపఁ బార్థివవత్సర
మార్గశీర్షమందు వ్రాసినాము. "

1627 + 78= 1705. ఇది రామబ్రహ్మేంద్రమౌనిరాట్టు లిఖించిన కాలము. వెంగన రచించిన కాలము తత్పూర్వ మగుట తథ్యము. కాఁబట్టి శ్రీకృష్ణకర్ణామృతము రచనా కాలము 1675 ప్రాంతము కావచ్చును.

ఇది లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతమునకు తెనుగుసేత. తేనె లొలుకునది.

"చిన్తామణి ర్జయతు సోమగిరి ర్గురుర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ఛిఖిపిఞ్ఛమౌళిః
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవరం లభతే జయశ్రీః " 2శ్లో. 2స.

"శ్రీచింతామణి యోగి సోమగిరియున్ శ్రీకృష్ణదేవుండుఁ దా
రాచార్యస్థితిఁ జెందఁ దచ్చరణకల్పాంకూరముల్ మౌళిపైఁ
దాచం గల్గిన వారిఁ జూచి తనయంతం దాన లీలన్ శుభ
శ్రీచాతుర్యముతో వరించు జయలక్ష్మీకన్య ప్రౌఢాకృతిన్. " 1ప. 1ఆ.

చింతామణి మంత్రము. కాఁబట్టి శ్రీచింతామణి అని తెనుగుసేత. సోమగిరి చింతామణీమంత్రోపదేశము చేసిన గురువు. శ్రీకృష్ణభగవానుడు చింతామణీమంత్రఫల మొసగు గురువు. చింతామణికి అర్థాంతరకల్పనము చింత్యము.

"మౌళి శ్చన్ద్రకభూషణా మరకతస్తమ్భాభిరామం వపు
ర్వక్త్రం చిత్రవిముగ్ధహాసమధురం బాలే విలోలే దృశౌ
వాచశ్శైశవశీతలాః మదగజశ్లాఘ్యా విలాసస్థితి
ర్మన్దం మన్ద మయే క ఏష మథురావీథీ మితో గాహతే." 57శ్లో. 1స

"మౌళితటిన్ ఘటించిన సమంచితపింఛము మందహాసమున్

లోలవిశాలలోచనములుం జిఱునవ్వును ముద్దు మాటలున్
నీలపుడాలు నేలు మెయి నిగ్గులుఁ గల్గిన బాలుఁ డెవ్వఁడో
వ్రాలెడు వీనిఁ జూడు మధురాపురవీథులఁ బాటలాధరా! " 57ప. 2ఆ.

ఇది ఒక గోపిక మఱొక గోపికతోనో, లేదా ఒక నాయిక తన సఖితోనో తలపోయునది. ఇందు ముఖము చిత్రవిముగ్ధహాసమధురమనిగాక, మందహాసమని మాత్రమే కలదు. అంతేకాదు. మఱల "చిఱునవ్వును" అని కలదు. పునరుక్తి. అది బహుశః "చిఱుఁబ్రాయపు" అని కవిపాఠమగును. "మందం మందం గాహతే = మెల్లమెల్లగా వచ్చుచున్నాడు అను మూలమునకు "వ్రాలెడు." అను తెనుగుసేతను తెనుగు నుడికారము. తేజరిల్లును.

"శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పఞ్చాక్షరీజపపరా నితరాం తథాపి
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్. " 24శ్లో. 2స.

"అనుమానింపఁగ నేమి శైవులము మే మత్యంతపంచాక్షరీ
మనుపారీణుల మౌదు మైన నెపుడున్ మందస్మితభ్రాజితా
ననచంద్రుం గపిలాతసీసుమసమానద్యోతనిస్తంద్రుఁ గృ
ష్ణుని గోపాలకబాలు నెంచనె తలంచుం జిత్త మాసక్తితోన్. " 24ప. 2స.

ఇందు శ్లోకార్థము ఇంచుక తీగ సాగినది.

" రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా
మన్థాన మాకలయతీ దధిరిక్తపాత్రే
తస్యాః స్తనస్తబకచఞ్చలలోలదృష్టి
ర్దేవోపి దోహనధియా వృషభం నిరున్ధన్. " 25శ్లో. 2స.

భ్రమసి హరిం దలంచి దధిభాండము దండ వసించు రిక్తభాం
డము మథియించు రాధయు మనంబునఁ దత్కుచకుంభికుంభవి
భ్రమముఁ దలంచి యొక్క వృషభంబును దోహనబుద్ధిఁ గట్టు న
క్కమలదళాక్షుఁడుం గరుణఁ గాతురుగాత జగద్వితానమున్. " 25ప. 2ఆ.

ఇందు "భ్రమసి" అను ఎత్తుగడ వాచ్యము. "దధిభాండము దండ రిక్త భాండము". అను వివరణ వాచ్యతాదోషము వాటిల్లని వ్యాఖ్యానము. ధ్వన్యర్థము ధన్యము.

"అఙ్గనా మఙ్గనా మన్తరే మాధవో
మాధవం మాధవం చాన్తరే ఙాఙ్గనా
ఇత్థ మాకల్పితే మణ్డలే మధ్యగః
సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః " 35శ్లో. 2స.

"ఇరుదెసఁ దాను నిల్చి తన కింతులు పార్శ్వములన్ వసింపఁగాఁ
గరములు కంఠపాళిఁ జెలఁగన్ బలభిన్మణివిద్రుమంబులన్
సర మొనరించి నట్టు సరసస్థితి మండలమధ్యవర్తియై
మురళిరవంబునం జెలఁగు మోహనమూర్తి మురారిఁ గొల్చెదన్. " 35ప. 2స.

అంగనకు అంగనకు నడుమ మాధవుడు, మాధవునికి మాధవునికి నడుమ అంగన అనుటలోను, "ఇరుదెసఁ దాను నిల్చి తన కింతులు పార్శ్వమునన్ వసింపఁగా" అనుటలోను అర్థ మొకటేగాని, స్ఫూర్తి భిన్నము. ఇంద్రనీలమణిప్రవాళముల సర మొనరించినట్లు

అను సాదృశ్యకల్పనము సముజ్జ్వలము. మండలమధ్యగామి అయిన శ్రీకృష్ణుని వేణుగానము రాసక్రీడ. అంగిరసము శృంగారము. అట్లు వేణుగానము సేయు శ్రీకృష్ణుని కొల్చుట రాసక్రీడ కాదు. భక్తి జాడ. శృంగారము అంగరసము. భక్తి అంగిరసము. అతి స్వతంత్రానుసరణము.

"రామో నామ బభూవ హుం తదబలా సీతేతి హుం తాం పితు
ర్వాచా పఞ్చవటీతటే విహరత స్తస్యాహరద్రావణః
నిద్రార్థం జననీకథా మితి హరే ర్హుఙ్కరతః శ్రుణ్వతః
సౌమిత్రే క్వ ధనుర్ధనుర్ధను రితి వ్యగ్రా గిరః పాన్తు వః 72శ్లో. 2స.

"ఇలలో రాఘవుఁ డొప్పు వాని సతి యయ్యెన్ సీత వారిన్ వనం
బులకుం బంచె గురుం డటంచు నిదురం బొందించు నయ్యంబ ప
ల్కులు దా నూఁకొని రావణుండు మహిజం గొంపోయె నా నుల్కి విల్
విలు దే లక్ష్మణ యంచుఁ బల్కు హరి యుద్వేలోక్తి నన్ బ్రోచుతన్. 72ప. 2ఆ.

ఇందు శ్లోకభావము కలదు. అర్థవంతమైన శబ్దచమత్కారము లేదు. యశోద కథ చెప్పునెడ కృష్ణుడు హుం అనుట ధ్వన్యనుకరణము. అది సీతను రావణుడు అపహరించెననగానే ఆగ్రహోదగ్రమైన హుంకారమగుట అర్థవంతమైన శబ్దచమత్కారము. "క్వధనుర్ధనుర్ధనుః" అనుటలోని వ్యగ్రత "విల్ విలుదే" అనుటయందు లేదు. తెనుగు సేతను అంతయు కలిసివచ్చుట అంత తేలిక కాదు. కొంత మాత్రమే గత్యంతరము.

"ఉర్వ్యాం కోపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలేచ సతతం గోవర్ధనోద్ధారకః
త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రే న తద్గణ్యతే
కిం వా కేశవ భాషణేన బహునా పుణ్యై ర్యశో లభ్యతే." 106శ్లో. 2స.

"ధరణిం జేతుల నొక్క చిన్ని గిరి యెత్తన్ నిన్ను గోవర్ధనో
ద్ధరణుం డంచు నుతించె నీ దశదిశల్ త్రైలోక్యధౌరేయ ని
న్నురువక్షోజములన్ భరింప నను బేర్కొ దెవ్వరుం బుణ్యవి
స్ఫురణం గీర్తి చెలంగు పెక్కు వచనంబుల్ కృష్ణ యింకేటికిన్" 106ప. 2ఆ.

ఇందు "కుచయో రగ్రే" అను దానికి "ఉరువక్షోజములన్" అను తెనిగింపు సరికాదు.

"కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కఙ్కణమ్
సర్వాఙ్గే హరిచందనం చ కలయన్ కణ్ఠేచ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః" 109శ్లో. 2స.

"నుదుటం గస్తురిబొట్టు నాసికతుద న్ముత్తెంబు శ్రీగంధసం
పద నెమ్మేనఁ గరంబులం గటకముల్ వంశంబు హస్తాగ్రమం
దెదపై నిస్తులకౌస్తుభంబు నఱుతన్ శృంగారహారంబు నిం
పొదవం గృష్ణుఁడు గోపికావృతుఁడు సర్వోత్కృష్టుఁడై వర్ధిలున్".109ప. 2ఆ.

ఇందు శ్లోకభావము కలదు. శైలీమాధుర్యము తెనుగుసేతకు అందని ఫలము.

"అంగుల్యా కః కవాటం ప్రహరతి? కుటిలే! మాధవః, కిం వసన్తో?
నో చక్రీ, కిం కులాలో? నహి ధరణీధరః, కిం ద్విజిహ్వః ఫణీన్ద్రః

నాహం ఘోరాహిమర్దీ, కి మసి ఖగపతిః నో హరిః, కిం కపీన్ద్రః?
ఇత్యేవం గోపకన్యాప్రతివచనజితః పాతు వ శ్చక్రపాణిః" 110 శ్లో. 3స.

ఇది సరసమైన సంవాదశ్లోకము. తెనుగు సేత లేదు. ఇట్లు తెనుగుసేతలు లేని శ్లోకములు మూడు సర్గల మొత్తము మీద 2+1+2=5 కలవు. అధిక శ్లోకములగును. మొత్తము 110+110+110=330 శ్లోకములకు తెనుగు సేతలు కలవు. వెంగన ఆంధ్రీకరణము మోదావహము. అంతేకాదు. శ్రీకృష్ణకర్ణామృతము సుప్రసిద్ధమైన సంస్కృత కావ్యము. అయినను మఱొకరు ఆంధ్రీకరించిన జాడ కానరాదు. ఇది వెంగన ఆంధ్రీకరణమునకు భంగ్యంతరకతపత్రము.

**లయగ్రాహి గరుడాచలము** : ఇతని కృతి కౌసలేయచరిత్రము. అముద్రితము. బోరవెల్లి కేశవస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు బోరవెల్లి సంస్థానకవి. గద్వాల సంస్థానాధిపతి పెద సోమభూపాలునికి సమకాలికుడు[142]. (1663-1712) కాఁబట్టి కౌసలేయ చరిత్రము రచనాకాలము 1680 ప్రాంతము కావచ్చును.

కౌసలేయచరిత్రము మఱొక రామాయణము.

**అందుగుల వెంకయ్య** : ఇతని కృతి రామరాజీయము. నరపతివిజయమని నామాంతరము. అళియరామరాయల మనుమడు చిన వెంకటరాజా మనుమడు కోదండరామరాజునకు అంకితము. చినవెంకటరాజు అన్న పెదవెంకటరాజు విజయనగర సామ్రాజ్యధిపతి మూడవ వెంకటపతి దేవరాయలు. అతని రాజ్యకాలము 1630-42 అని పూర్వోక్తము. అందువలన కోదండరామరాజు ప్రాభవకాలము 1680-92 అగును. కాఁబట్టి రామరాజీయము రచనాకాలము 1685 ప్రాంతము కావచ్చును.

రామరాజీయము చరిత్రోపయోగిగ్రంథము. అళియరామరాయల వంశావళి.

**పోశెట్టి లింగము** : ఇతని కృతులు 1. శంకరదాసమయ్య చరిత్రము 2. వీరసంగయదేవు చరిత్రము 3. మల్హణచరిత్రము 4. శిష్యప్రబోధము 5. నవచోళ చరిత్రము. ఇందు మొదటి నాలుగు అనుపలబ్ధములు. నవచోళచరిత్రము ద్విపద కావ్యము. మృత్యుంజయేశ్వరునికి అంకితము. గుర్వంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఇందలి భైరవరాజచరిత్రమునందు ఇట్లు కలదు.

"వరకీర్తివిభవసంవత్సరమునను
పరికింపఁగా భాద్రపదమాసమందు
ధరఁగృష్ణపక్షము దశమీందువార
మిరవొందఁ జనుదెంచె . . . . " పుట 113.

విభవనామసంవత్సరభాద్రపదమాసబహుళపక్షదశమీసోమవారము 10-9-1688 వ తేదీ. ఆ తేదీ ప్రసక్తమైన నవచోళచరిత్రము తదనంతరకాలిక మగుట తథ్యము. కాఁబట్టి నవచోళచరిత్రము రచనాకాలము 1690 ప్రాంతము కావచ్చును.

నవచోళచరిత్రము తొమ్మండుగురు చోళరాజుల కథలు. వారు కరికాలచోళుడు, విక్రమచోళుడు, ఉత్తుంగచోళుడు, అహివరచోళుడు, వరధర్మచోళుడు, సత్యేంద్రచోళుడు, మనుజేంద్రచోళుడు, వీరచోళుడు, ఉత్తమచోళుడు. వీరి కథలు పండితారాధ్యుడు భైరవరాజునకు చెప్పును. భైరవరాజు కథ కూడ కలదు. కరికాలచోడుని కథలో భాస్కరచోడుని

కథ, ముక్కంటి చోడుని కథ, పిట్టవ్వ కథ, చెన్నయ కథ; విక్రమచోళుని కథలో పూసల నయనారు కథ కలవు. ఉత్తమచోళుని కథలో గణపాలుని కథ; భైరవరాజు కథలో కైకూలి కేతయ్య కథ కలవు. ప్రధానకథలు, ఆనుషంగికకథలు శివభక్తిమహిమను ప్రకటించును. శైవమతసంప్రదాయములను ప్రతిపాదించును.

కరికాలచోళుడు, ఉత్తుంగ (కులోత్తుంగ) చోళుడు, వీరచోళుడు, విక్రమచోళుడు చారిత్రికవ్యక్తులు. ముక్కంటి చోళుడు లేడు. ముక్కంటి పల్లవుడు కలడు. త్రిలోచన పల్లవుడు, ముక్కంటి కాడువెట్టి అని ప్రసిద్ధుడు. కరికాలచోళుని కావేరీసేతునిర్మాణము, త్రిలోచనపల్లవవిజయము చరిత్రాంశములు. సత్యేంత్రచోళుని కథలోని పేదరాలి వృత్తాంతము, పల్లకేతమండలేశ్వరుని బెజవాడ మల్లేశ్వరాలయశాసనమునందు ప్రసక్తమైన, 118+78=196 వ సంవత్సరము నాటి మాధవవర్మ కథకు అనుసరణము. ఆదే కథకు నవధర్మచోళుని కథలోని గోవత్సవృత్తాంతము రూపాంతరము.

శివపూజాప్రకారము, పూజోపకరణాదికప్రభావము, వివిధపుష్పార్చనామహిమ, నైవేద్యవైవిధ్యము, షోడశోపచారములు, స్థూలసూక్ష్మదేహవిచారము, పంచేంద్రియాదివివరణము, సాత్త్వికాదిగుణనిర్ణయము, అంతఃకరణాద్యనుభవము, పంచకోశప్రపంచనము, షడ్రుమలు, షడూర్ములు, ఆధ్యాత్మికాదిభౌతికవివేచనము, నాదానుభవవినోదము, లింగధారణమహిమ, నిత్యానిత్యవిచారము మొదలైన మతతత్త్వవిషయములు కలవు. పుర, నదీప్రభృతివర్ణనములు కలవు. శైలి పరమసరళము. చోళరాజుల శైవమతసంబంధికథలే నవచోళచరిత్రము.

**వక్కలంక వీరభద్రుడు** : ఇతని కృతులు 1. కుమారసంభవము 2. వాసవదత్తా పరిణయము 3. సేతుఖండము. మొదటిది అనుపలబ్ధము. మూడవది సూర్యరాయాంధ్ర నిఘంటుకారులు ఉట్టంకించినది. ఇతడు పిఠాపురసంస్థానమునందు ప్రథమసంస్థానకవి. వాసవదత్తాపరిణయము పిఠాపురసంస్థానాధిపతి రావు పెద మాధవరాయనికి (1679-1704) అంకితము. కుమారసంభవము బాల్యరచనము. (27ప. 1ఆ. వా.ప.) సేతు ఖండము వాసవదత్తాపరిణయమునందు పేర్కొనలేదు. కాఁబట్టి వాసవదత్తాపరిణయము రచనాకాలము 1690 ప్రాంతము, సేతుఖండము రచనాకాలము 1695 ప్రాంతము కావచ్చును.

వాసవదత్తాపరిణయము సుబంధుని వాసవదత్తాగద్యకావ్యమునకు స్వతంత్రాను సరణము[143].

> "అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతల మేలు విక్రమా
> దిత్యసభాస్థలంబునఁ బ్రతిష్ఠితుఁడై ఘనదీసమగ్రతన్
> సత్యవతీతనూభవుని జాడఁ బ్రసిద్ధికి నెక్కి నవ్యసా
> హిత్యమునన్ సుబంధసుకవీంద్రుఁడు ప్రస్తుతిఁ గన్నవాఁ డిలన్. 28
>
> ఘనతరమనీష నమ్మహాకవివరుండు
> ప్రతిపదశ్లేషగద్యప్రబంధ మత్యు
> దారగతిఁ జెప్పె వాసవదత్త యనఁగ
> నార్యు లా కథ కడుఁ జోద్య మనిరి సభల. 29
>
> స్తవనీయంబగు తత్కథాక్రమము భాషాయోషిదంఘ్రిస్ఫుర

న్నవమంజీరనినాదమేదురనితాంతప్రౌఢవాగ్గుంభన
ద్భువదీయోక్తుల నాంధ్రకావ్యముగ వైదర్భీగతిం గూర్పు త
త్కవినవ్యోక్తులు గొన్ని నీ కవితకున్ గైదండ గావింపఁగన్. " 30ప. 1ఆ.

అని కృతిపతి ఆదేశము.

సుబంధుని వాసవదత్త కథ- కథాసరిత్సాగరములోని, తదనుసారి భాసుని స్వప్న వాసవదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణనాటకములలోని కథ కంటె భిన్నము. అది వాసవదత్తా వత్సరాజపరిణయము. ఇది వాసవదత్తాకందర్పకేతుపరిణయము. అది ప్రసిద్ధము. ఇది కల్పితము.

పాటలీపుత్త్రపురాధిపతి కందర్పకేతుడు స్వప్నమునందు సాక్షాత్కరించిన సుందరిని అన్వేషించుటకు, సఖుడైన మందారకునితో వింధ్యాటవికి వెడలుట, అట శుకశారికాప్రసంగమున స్వప్నసుందరి వృత్తాంతము వినుట, కుసుమపురాధిపతి శృంగారశేఖరుని కూతురు వాసవదత్త అగుట, కందర్పకేతుడు వాసవదత్తను తీసికొనివచ్చుట, మార్గమధ్యమున వాసవదత్త అదృశ్యమగుట, కందర్పకేతుని ఆత్మహత్యాప్రయత్నము, ఆకాశవాణి నివారణము, వాసవదత్త శిలావిగ్రహమగుట, కందర్పకేతుని హస్తస్పర్శను శిలావిగ్రహము వాసవదత్త అగుట, వాసవదత్తాకందర్పకేతుల పాటలీపుత్త్రపురాగమనము చిత్రకథ. ఇందు స్వయంవరసమాగతుల స్వగతవికారములు, కందర్పకేతుని తీర్థయాత్రలు, కుసుమపురమునందు వాసవదత్తాకందర్పకేతుల వివాహము వీరభద్రుని ప్రధానమైన స్వతంత్ర కల్పనములు.

సుబంధుని కృతి శ్లేషబంధురము. శైలీప్రౌఢము. గద్యము. వీరభద్రుని కృతి కథాప్రధానము. వైదర్భీరీతి. పద్యగద్యోభయము. రెండును వర్ణనాభూయిష్ఠములు.

స్వయంవరసమాగతుల స్వగతవికారములు :

"ఒకఁడు చేవంకిపై నొప్పు తామరకెంపు
ముగుద మోవి యటంచు ముద్దు గొనియె
నొకఁడు సౌవర్ణకందుక మిందువదన చ
న్గవఁ బోలునని యక్కునను ఘటించె
నొకఁడు లీలాబ్జంబు ముకురాస్యమోముతోఁ
దుల రాదనుచుఁ గోరఁ ద్రుంచి వైచె
నొకఁడు తాఁ బెంచిన శుకి తలోదరి పల్కు
జాడఁ బల్కినఁ జేయి చాచి పిలిచె
క్షితిపతులు వేడ్క నిటు చమత్కృతుల నలరి
యొకరొకరు తత్ప్రియాహితోద్యోగు లయిరి
లలితచేష్టావిలాసలీలావిభూతి
నవ్వరారోహఁ జూచిన యాక్షణంబ. " 38ప. 3ఆ.

అశరీరవాణి "అచిరకాలమున వాసవదత్తను కలసికొందువు" అని పలికిన, కందర్ప కేతుడు ఆత్మహత్యాప్రయత్నము విరమించి, కావించిన తీర్థయాత్రలు కాశీజగన్నాథ క్షేత్రములు. కాశీక్షేత్రవర్ణనమునందు బిందుమాధవస్వామికి అగ్రతాంబూలము. కారణము కృతిపతి పిఠాపురము సంస్థానాధిపతి కుంతీమాధవస్వామి భక్తుడగుట

కావచ్చును.

"నివసించె నే పీట నిజపదాబ్జానతో
  మాధవుం డగు బిందుమాధవుండు
ప్రవహించె నే పీట భవబంధవిచ్ఛేద
  కరవారిసంగ యాకాశగంగ
దయసేయు నే పీట తారకం బఖిలదే
  హులకు విశ్వేశ్వరుం డెలమిలోడ
సిద్ధించు నే పీట జీవకోటికి శంభు
  సారూప్యముక్తి నిస్సంశయముగ
నరసి యే పీట ప్రతిదినం బన్నపూర్ణ
యతిథుల కమృతదివ్యపాయస మొసంగు
నట్టి కాశీపురంబు ప్రత్యక్షమైనఁ
గాంచి ముదమందె నా రాచకలువతేఁడు." 49ప. 4ఆ.

కందర్పకేతుడు గంగాస్నానము చేసి, ప్రథమతః ఆదికేశవమూర్తి దేవాలయము చేరి హరిపరంజ్యోతిని అధికముగ స్తుతించును. (53-57ప. 4ఆ.) జన్మము పవిత్రమయ్యె నని మోదమంది నర్తించును. (58ప. 4ఆ.) జగన్నాథక్షేత్రము వైష్ణవక్షేత్రమే. కందర్పకేతుని జగన్నాథక్షేత్రయాత్ర పదియేను పద్యగద్యములందు కలదు. అందు సుదీర్ఘమైన రగడ, చతుర్విధకందము, త్రివిధకందము, సార్వవిభక్తికపద్యము భక్తిపారవశ్యమును ప్రకటించును.

"నీవే దైవతచక్రవర్తివి సభన్ నిన్నే ప్రశంసింతు నీ
చే విశ్వం బలరారు నీకొఱకు నేఁ జేతున్ నమస్కారముల్
నీవల్లన్ భవము ల్దొలంగు నెవరు న్నీకున్ సము ల్గారయా
యావిర్భావమునందు లోకములు నీయందే గదా యో హరీ." 81ప. 4ఆ.

అమూలకమైన వాసవదత్తాకందర్పకేతుల వివాహము- ఎదురింపుసన్నాహము, విడిది, పెళ్లిపీట, కన్యాదానము, తలంబ్రాలు, అరుంధతీదర్శనము, హోమము, విందుల తెలుగు వివాహమే.

వాసవదత్తాపరిణయమునందు పుర (152-187ప. 1ఆ; 36-41ప. 2ఆ.) నగ (3-6ప. 2ఆ; 21ప. 4ఆ.) వన (20, 22-23వచ. 4ఆ.) నదీ (6-9ప. 2ఆ.) కాసార (10ప. 3ఆ.) సముద్ర (44-47ప. 4ఆ.) నాయక (175-179ప. 1ఆ.) నాయికాజనన (54-61ప. 1ఆ.) నాయికాసౌందర్య (210-230ప. 1ఆ.) వసంతర్తు (67-73ప. 2ఆ.) గ్రీష్మర్తు (4-8ప. 3ఆ.) వర్షర్తు (61-78వచ. 4ఆ.) చంద్రోదయ (22ప. 2ఆ.) సూర్యోదయ (24-33ప. 4ఆ.) వనకేళి (74-83ప. 2ఆ.) జలకేళి (11-19ప. 3ఆ.) మధుపాన (73-76ప. 3ఆ.) విటీవిట (71-77వచ. 3ఆ.) విరహ (190-282ప. 1ఆ; 78-102ప.3ఆ; 37-42ప. 4ఆ.) వివాహ (27-73ప. 5ఆ.) రతి (104-114ప. 5ఆ.) యాత్ర (49-83ప. 4ఆ.) యుద్ధ (90-94ప. 4ఆ.) ప్రభృతివర్ణనలు కలవు.

**చక్రపురి రాఘవాచార్యులు** : ఇతని కృతులు 1. నలచరిత్రము ద్విపదకావ్యము 2. విష్ణుభక్తచరిత్రము. విష్ణుపురాణమని నామాంతరము. ద్విపదకావ్యము 3.

విప్రనారాయణచరిత్రము. యక్షగానము. అముద్రితము. మూడును ఘటికాచలనర సింహస్వామికి అంకితములు. దైవాంకితములు. ఇతడు కందాళ దొడ్డయాచార్యుల శిష్యుడైన చక్రపురి దొడ్డయాచార్యుల మనుమడు. (1203-1213పం. న.చ.) ఇతని పూర్వాచార్యస్తుతియందు కందాళ దొడ్డయాచార్యుల ప్రస్తుతి కలదు. కనుక కందాళ దొడ్డయాచార్యులు, చక్రపురి రాఘవాచార్యులు సమకాలికులు కారు. కందాళదొడ్డయా చార్యులు, చక్రపురి దొడ్డయాచార్యులు మాత్రమే సమకాలికులు. ఘటికాచలక్షేత్రము నకు సంబంధించిన- ఒక దొడ్డయ్యం గారి ప్రసక్తి, మిఁకొక కందాళ దొడ్డ యాచార్ల అయ్యవార్లం గారి విషయము కల రెండు శాసనములు కలవు. 1. 3-7-1545 వ తేదీ తిరుపతిశాసనము[144]. 2. 1652-53 నాటి సింగిరెడ్డిపల్లి (నెల్లూరుజిల్లా, ఉదయగిరి తాలూకా) శాసనము[145]. తిరుపతిశాసనమునందు "కందాడై అప్పలాచార్యులు, దొడ్డయ్యం గారు స్వామిప్రసాదగ్రహీతలుగా" వైష్ణవాచార్యుల తోపాటు కలరు. సింగిరెడ్డిపల్లి శాసనము నందు "శ్రీవాడ పెద్ద వేంకటాద్రినాయనింగారు కందాళ దొడ్డయాచార్ల అయ్యవార్లంగారికి' ' సింగిరెడ్డిపల్లిని జాగీరుగా ఇచ్చినట్లు కలదు. తిరుపతిశాసనమునందు కందాళ దొడ్డయ్యంగారు అనిలేదు. సింగిరెడ్డిపల్లి శాసనమునందు కందాళ దొడ్డయా చార్యులు అని ఇదమిత్థముగ కలదు. కావున చక్రపురి దొడ్డయాచార్యులు 1652-53 నాటి శాసనములోని కందాళదొడ్డయాచార్యులు అయ్యవార్ల శిష్యుడు కావలయును. అయిన చక్రపురి దొడ్డయాచార్యుల కాలము 1650 ప్రాంతము, అతని మనుమడు చక్రపురి రాఘవాచార్యుల కాలము 1690 ప్రాంతము అగును. కాఁబట్టి నలచరిత్రము రచనాకాలము 1690 ప్రాంతము, విష్ణుభక్తచరిత్రము రచనాకాలము 1695 ప్రాంతము, విప్రనారాయణ చరిత్రము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

నలచరిత్రమునందు తుపాకి శబ్దము కలదు. అది పదునాఱవశతాబ్ది కృతులందు మృగ్యము. పదునేడవశతాబ్ది కృతులందు ప్రచురము. కనుక "తమ్మితుపాకి" (776పం. ప్ర.భా.) అను ప్రయోగము పయి కాలనిర్ణయమునకు ఉపబలకసాధనము.

నలచరిత్రము : ఇది మహాభారతములోని సకలనలోపాఖ్యానమునకు అనుసరణము. స్వతంత్రకల్పనలు కలవు. అందు విష్ణుచక్రమహిమ అంతట కలదు.

" . . . . . . . . . . . ఆ విష్ణుచక్ర
మరయుచుఁ బంపుసేయఁగ నలాధిపుఁడు
నవలీల రాజ్యంబుఁ జేయుచునుండె " 76-78పం. 1భా.

ఒక పులి తన్ను ఎద్దు లెక్కచేయకపోవుటకు హేతువు నలుడని, "నలరాజా సత్యమెన్నాళ్లు వర్ధిల్లు" నని, ఎద్దును చంపబోయిన, విష్ణుచక్రము పులిని చంపును. (79-112పం. 1భా.) నలుడు చేసిన వసంతపూజ చూచుటకు వచ్చెనో యన హంసలు వచ్చి, నలుని ముందఱ వ్రాలును. (179-204పం. 1ఆ.) స్వయంవరమునకు వచ్చిన రాజులను దమయంతికి వసుదేవుడను విప్రుడు పరిచయము చేయును. (441పం. 2భా.) నలుడు ఒకనాడు "శౌచవిధి సల్పునపుడు మడమ నొక్కించుక మాత్రము నీటఁ దడియక పడియున్న" కలికి అవకాశము లభించును. (101-110పం. 3ఆ.) కలి బోయరూపమున వచ్చి నలుని వేటకు తీసికొనివెడలును. (119-154పం. 3ఆ.) ఇది కేవలము వేటకోసమే.

తిరుగు ప్రయాణమునందు ఒక కొలనుకడ విశ్రాంతి గైకొను నలునికి స్వప్నము వచ్చును. అది సన్నిధినున్న దమయంతికి ఇట్లు చెప్పును.

"అలివేణి యీ రాజ్యమంతయు మనము
విడిచిన గతిఁ బొంది విపినంబులోన
నుడుగక నిద్దఱ మొకచీర గట్టి
పరువడి బాధలఁ బడి కొంత కాల
మరిగిన పిదప శ్రీహరికటాక్షమున
మనము రాజ్యసుఖాప్తి మనఁగంటిమి-" 386-391పం. 3భా.

నలుడు అడవిలో దమయంతిని వదలిపోవు ఘట్టము కరుణరసనిర్భరము.

"తన మది నొక్కింత ధైర్యంబు దెచ్చి
వనిత పయ్యెద కొంగు వలనొప్ప గప్పి
యనుమాన మేటికి నరిగెద ననుచు
నడలుచు మఱి నాలు గడుగులు పోయి
తడఁబడి పోలేక ధరణిపై వ్రాలి
దిగ్గన లేచి యా దేవినిఁ జూచి
దగ్గఱ కేతెంచి తనలోనె తాను
బెగ్గలం బందుచు భీతి నిట్లనియె" 1278-85పం. 3భా.

ఇట్లు మూడు నాలుగు సార్లు చేయును. (1310-18, 1348-49, 1370-1381పం. 3భా.) కర్కోటకుడు "కరాటములోన నమరిన యొక్క కనకవస్త్రము ధరాకాంతుని కిచ్చి, నను నీవు దలఁచి యీ గోక ధరియించినప్పు డందము మీఱ నీకు వరుస నీ రూపలావణ్యముల్ గల్గు" నని చెప్పినట్లు కలదు. (1498-1593పం. 3ఆ.) కర్కోటకుడు అప్పటికప్పుడు కనకవస్త్రమున్న బరిణె కల్పించి ఇచ్చిన, నలుడు ఎప్పటి కప్పుడు దానిని తన దగ్గఱ ఎట్లు దాచుకొనెడివాడో?- నలుడు దమయంతికి అగ్నిపరీక్ష పెట్టుట అమూలకము. (873-963పం. 5ఆ.) విష్ణుసాక్షాత్కారము, విష్ణుస్తోత్రము, లక్ష్మీసాక్షాత్కారము (964-1071) విశేషము.

**విష్ణుభక్తచరిత్రము** : ఇది విష్ణుపురాణమని వ్యవహృతము. కాని విష్ణుపురాణము కాదు. విష్ణుభక్తుడైన రామానుజాచార్యుల చరిత్రము. ఆదిశేషువు రామానుజాచార్యులుగా అవతరించి వైష్ణవమతవ్యాప్తి చేయుట ప్రధానవిషయము. స్వమతస్థాపనము తోపాటు పరమతనిరసమును కలదు[146].

**విప్రనారాయణచరిత్రము** : ఇది కూడ విష్ణుభక్తుని చరిత్రమే. పైది రామానుజాచార్యుల చరిత్రమైన, ఇది విప్రనారాయణుని చరిత్రము. అది ద్విపదకావ్యమైన, ఇది యక్షగానము. ఇందు కర్తృనిర్దేశములేదు. ఘటికాచలనరసింహస్వామికి అంకితమగుట, కందాళ దొడ్డయాచార్యుల ప్రశంస ఉండుట, నలచరిత్రములోని దమయంతి అలంకరణము, విప్రనారాయణచరిత్రములోని దేవదేవి సింగారము సమానముగ ఉండుట కారణములుగ చక్రపురి రాఘవాచార్యకృతమని నిర్ణీతము[147].

**పెనుగోటి జగన్నాథరాయలు** : ఇతని కృతి కుముదవల్లీవిలాసము. గురువు సముద్రాల తిరుమలాచార్యులకు అంకితము. గుర్వంకితము. ఇతనికి తొమ్మిదవతరము

లోని పెనుగోటి వెంకటరాయుడు 1925 వ సంవత్సరమునందు కుముదవల్లీవిలాసమును ముద్రించినట్లు పీఠికయందు కలదు[148]. ఉభయులకు నడుమ ఎనిమిదితరములు కలవు. తరమునకు ముప్పదిసంవత్సరములు పరిగణనమున 1925-30×8=240--1685వ సంవత్సరమునందు జగన్నాథరాయలు ప్రాభవదశను ఉండును. కాఁబట్టి కుముదవల్లీ విలాసము రచనాకాలము 1690 ప్రాంతము కావచ్చును.

కుముదవల్లీవిలాసము పరమయోగివిలాసములోని పరకాలయోగి వృత్తాంతమునకు ప్రపంచీకరణము. పేరు కుముదవల్లీవిలాసము కాని, తీరు పరకాలవిలాసమే. నిమిత్తము కుముదవల్లి. అమృతహస్తుడను వైద్యునికి ధవళపుష్కరిణియందు "కలువపై నున్న చిలుకల కొలికి" లభించును. అనపత్యుడైన అతడు పెంచును. "కలువలో నెలకొన్న కతమున" కుముదవల్లి అని నామకరణము చేయును. ఆమె యౌవనవతి అగును. చోళరాజు గేహాధికారి అయిన పరకాలుడు వచ్చి, ఆమెను చూచి, అల్లుడ నయ్యెదనని అడుగును. అమృతహస్తుడు,

"బలశౌర్యోజ్జ్వల యింతకంటెఁ గలదే భాగ్యంబు నీ వంటి ని
ర్మలకీర్తిప్రదుఁ డల్లుఁడైన పిదపన్ మా కర్థసంసిద్ధి యీ
కలకంఠీమణి నీకొసంగెదను నిక్కం బైన నింకొక్కటే
దెలియ న్విన్నప మాచరించెదను సందేహంబు గల్గెం దగన్.
సన్నుతలీల విష్ణుకరసాధనముద్రలుఁ బూని యిచ్చతో
వెన్నుని భక్తసంతతికి వేగురి కన్నముఁ బెట్టు భాగ్యసం
పన్నుఁ బ్రపన్నుగాఁ దెలిసి భర్తను నా కొనఁ గూర్పుడంచుఁ దా
పిన్నపు డీ లతాంగి వినుపించెను మించిన బుద్ధిసంపదన్" 126ప. 1ఆ.

అనిన, పరకాలుడు,

"నలిననాభుని ముద్రలు నాకె కలవు
నేనె పరమప్రపన్నుఁడ పూని నేఁడు
మొదలుగా వైష్ణవసహస్రమునకు నిత్య
మారగింపిది తచ్ఛేష మారగింతు" 129ప. 1ఆ.

అని వివాహమాడును. వివాహవర్ణనము లేకపోవుట విశేషము.

పరకాలుడు వైష్ణవారాధనము సాగించును. అందుకు చోళరాజు "గాదెకు నూదరఁబెట్టి"న విధము :

"పతి సొమ్ము దొరకొన్న పాతకంబని తలం
　　కుచు ననుమానించుఁ గొన్ని నాళ్లు
మనకుఁ గల్గినఁ దీర్చుకొనవచ్చు నిపు డప్పు
　　గొనుట కేమని యెంచుఁ గొన్ని నాళ్లు
పారుపత్తెము సేయు వార లబ్బినది చే
　　కొనరే యటంచును గొన్ని నాళ్లు
ముందర నా జీతమునఁ జెల్లు నట్టిన
　　కొదువ యేమని యంచుఁ గొన్ని నాళ్లు
తంతె మీది తెగువ కింతేమి యంతేమి
వలయు నట్లు లాగవలయుఁగాక

యనుచు నృపధనాపహారియై వైష్ణవా
ర్చనము సలుపుచుండు సరవి నతఁడు" 20ప. 2ఆ.

పరకాలుడు చేసిన అప్పు తీర్చుటకు, కంచి వరదరాజస్వామి అల్లాడరెడ్డి రూపమున వచ్చి, అమాత్యులు పరకాలుని అప్పు తీర్చుటకు నీవెవ్వరవని అడిగిన నర్మగర్భముగ తెలిపిన విషయము :

"కాపుఁదనమునకు లోకముల నెన్నికయైతి
పాటించగా మాకు సాటి లేదు
దుర్గాధిపతులు మాతో పొందుఁగూర్తురు
వ్యవసాయ మెపుడు మా కాత్మవృత్తి
మా యింటఁ గల సిరి మఱి యెవ్వరికి లేదు
భూమి చేకొను దొడ్డ పూన్కి నందు
బంధుసంతతి మాకు పొందు వర్గంబులు
పాలేరు ప్రాపున పండుకొందు
ధాత్రి సంగోరు విధి ప్రసిద్ధముగ నిలుతు
మొదట మోటాడవారమై పొదలు కతన
నీరు పొలమున బ్రదికెడు నేర్పు మాకె
యమర యల్లమరెడ్డి యటంద్రు నన్ను." 81ప. 3ఆ.

ఇది అల్లాడ రెడ్డికి, కంచి వరదరాజస్వామికి అన్వయించునది.

అధికారము పోయిన తర్వాత పరకాలుడు వైష్ణవారాధనము సాగించుటకు చౌర్యము చేయుదుననిన, కుముదవల్లి ఒసగిన సమాధానము :

"అనినం గైరవవల్లి దర్పకధనుర్జ్యావల్లికావల్లి యి
ట్లను ప్రాణేశ్వర మీర లిట్లనిన మారాడంగ నేనెంతదా
నను మీ మన్ననఁ గూర్చి యొక్క పలుకెక్కన్ జాతు మీవంటిపా
వనసంశీలురు చోరవర్తనములన్ వర్తింపఁగా నేర రీ
సున సంస్తుత్యచరిత్ర మీ మనసు దా చోరక్రియన్ గోరెనే " 124
చౌర్యము కార్యమే నయవిచారము దక్కి మెలంగఁ జూచుటల్
కార్య చందమే కలుషకర్మమునం దొనఁగూడియున్నచో
ఆర్యుల సేవ మానునది. . . . . . . " 125ప. 3ఆ.

అయినను పరకాలుడు చౌర్యవృత్తిని అవలంబించును. ఇంతకు మించి కుముదవల్లి నిర్వహించిన దేమియు లేదు. పరకాలుడు దారిదోపిడికాడగును. అతనిని ఉద్ధరించుటకు రంగనాథుడు లక్ష్మితో,

"కొమ్మ! నీ కెప్పుడును పెండ్లికొడుకు నగుదుఁ
గావునను వేడ్క సంధిల్లఁగాఁగ నాదు
సరసఁ బాయని పెండ్లికూతురవు నీవు
పెండ్లికూతురు చొప్పు గల్పింపవలయు" 20ప.

అని చతుర్ముఖప్రముఖులకు ఆనతిచ్చిన,

బ్రహ్మదేవుండు జన్నంపు బాపఁడయ్యె
ప్రీతి దిక్పాలకులు పెండ్లిపెద్దలైరి

యమరకాంతలు పేరటాండ్రగుచు వలిచి
రితరు లందఱు తగురీతి నెసఁగి రంత." 23ప. 4ఆ.

ఈ పెండ్లివారిని పరకాలుడు నిలువుదోపిడి చేయును. రంగనాయకుడు పరకాలునికి అష్టాక్షరీమంత్రమును ఉపదేశించి, సాక్షాత్కరించును. తదాదేశానుసారము పరకాలుడు శ్రీరంగమునకు వచ్చును. భాగవతారాధనము తోపాటు భగవదారాధనమును సాగించును. అంతేకాదు. రంగనాథాలయమునకు ప్రాకారము కట్టించుటకు నాగపట్టణములోని సౌగతుని స్వర్ణవిగ్రహమును అపహరించి శ్రీరంగమునకు తెచ్చును. శిల్పులు స్వర్ణవిగ్రహమును విచ్ఛిన్నము చేసిన విధము.

"గురుఁడ నటంచు బౌద్ధజనకోటికి మాటికి దుర్మదక్రియల్
గరపుచు వేదమార్గములు గానఁగ నీయక త్రిప్పు నీ జడున్
నరకుఁడు కొట్టుఁడంచు జయినవ్రజదేశికకాంచనాకృతిన్
దొరకొని పట్టి శానములతో తెగవేసిరి హేమకారకుల్. 93.

అగ్నిసంస్కార మెఱుఁగని యతులదుష్ట
మతమునందు మెలంగు సామాన్యుఁ డగుట
వీని తంపటిలో కాల్ప విహితమనుచు
జినగురుని కాల్చి రగసాలు లనలమున. 94

కట్టు లేని మతముగను జైనకులగురు
బట్టి జాతియందుఁ బెట్టి యిపుడు
గొట్టివలయు ననుచు పట్టెడపై సుత్తెఁ
గొట్టి కొట్టి సాగఁ బట్టి రపుడు." 95ప. 5ఆ.

ఇందు బౌద్ధ జైనమతసాంకర్యము కలదు.

పరకాలుడు త్రికవి అయిన సంబంధుని ఓడించి చతుష్కవి అగును. మొత్తము మీద వైష్ణవమతాతిశయము పరకాలుని వృత్తాంతమునకు పరమార్థము.

పుర (39-49, 66ప. 1ఆ; 77ప. 3ఆ.) నాయక (55-65ప. 1ఆ.) కాసార (75-76ప. 1ఆ.) నాయిక (87-96ప. 1ఆ.) సూర్యాస్తమయాదిచంద్రోదయపర్యంత (39-42ప. 3ఆ.) ప్రభాత (66-68ప. 3ఆ.) వర్ణనలు కలవు.

**బిజ్జుల తిమ్మభూపాలుడు** : ఇతని కృతి అనర్ఘరాఘవము. ప్రాకటూరి రామేశ్వరునికి అంకితము. దైవాంకితము. ఇతని పితామహుడు పెద తిమ్మభూపాలుడు అలంపూరు సీమకు నాడగౌడుడు, దేశాయి, నాడకరణము. (78ప. 1ఆ.) అతనికి బిజాపూరు నవాబు హైదరాలీ 1653 వ సంవత్సరమునందు అలంపూరు పరగణాలోని శేరీలు ఇచ్చినట్లు పత్రము కలదు. అది రాయచూరుజిల్లా డిప్యూటీ కమీషనరు 14-11-1854 వ తేదీని ధ్రువపఱిచినది[149]. 1653 ప్రాంతమున ప్రసిద్ధుడైన పెద తిమ్మభూపాలుని మనుమడు తిమ్మభూపాలుడు 1693 ప్రాంతమునందు ఉండుట సహజము. కాఁబట్టి అనర్ఘరాఘవము రచనాకాలము 1695 ప్రాంతము కావచ్చును.

అనర్ఘరాఘవము బాలవాల్మీకి, భట్టమురారి రామాయణనాటకము. సంస్కృత పద్యకావ్యములందు శ్రీహర్షుని నైషధీయచరితము, పురాణఖండములందు కాశీఖండము వలె, గద్యకావ్యములందు భట్టబాణుని కాదంబరి, దృశ్యకావ్యములందు భట్టమురారి

అనర్ఘరాఘవము మహాప్రౌఢకావ్యములు. ప్రత్యేకముగ అనర్ఘరాఘవము భావగాంభీర్యమునకు, రీతిమాధుర్యమునకు, వర్ణనావైదగ్ధ్యమునకు నిధి, "గురుకులక్లిష్టో మురారిఃకవిః" అని ప్రసిద్ధము. అంతేకాదు.

"మురారిపదచిన్తా చే త్తదా మాఘే మతిం కురు
మురారిపదచిన్తా చే త్తదా మాఽఘే మతిం కురు"

అని ప్రసిద్ధమైన ఆభాణకము. మాఘకావ్యమునందు పదగుంభనముతోపాటు పాండిత్యవిజృంభణము కలదు. అనర్ఘరాఘవమునందు అపూర్వపదప్రయోగముతోపాటు అనేకశాస్త్రకారికానియోగము కలదు. రెండిట రెండిటిని మించినది శ్రీహర్షుని నైషధీయ చరితము. నైషధాంధ్రీకరణము శ్రీనాథుని శృంగారనైపథ్యము. అనర్ఘరాఘవాంధ్రీకరణము తిమ్మభూపాలుని తిలకధారణము.

నాందీప్రస్తావనలలోని అనర్ఘశ్లోకములను ఆంధ్రీకరించుట విశేషము. నాందీశ్లోకము :

"నిష్ప్రత్యూహ ముపాస్మహే భగవతః కౌమోదకీలక్ష్మణః
కోకప్రీతిచకోరపారణపటుజ్యోతిష్మతీ లోచనే
యాభ్యా మర్ధవిబోధముగ్ధమధురశ్రీ రర్ధనిద్రాయితో
నాభీపల్వలపుండరీకముకుళః కంబో స్సపత్నీకృతః " 1శ్లో.
"శ్రీకరమైన నాభిసరసీరుహ మర్ధవిబోధనార్థము
ద్రాకరణైకచాతురి దరప్రతిమానముఁ జేసి నిచ్చలున్
గోకవిలోకనోత్సవచకోరకపారణముల్ ఘటించు లో
కైకశరణ్యు కన్నుఁగవ యీవుత మాకు నిరంతరాయమున్." 3ప. 1ఆ.

అది నాందీశ్లోకము. ఇది తిమ్మభూపాలుని ఇష్టదేవతాస్తుతి.

యాన్తి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽ పి సహాయతామ్
అపన్థానం తు గచ్ఛన్తం సోదరోఽ పి విముఞ్చతి. " 4శ్లో.ప్ర.
"ఎట్టి లన్నను న్యాయమార్గైకవృత్తి
కవనిఁ దిర్యక్కులైన సహాయమగును;
గాని తెరువున నడిచినవాని విడుచు
ననుఁగుఁదోఁబుట్టువైన సత్యంబు సుమ్ము. " 23ప. 1ఆ.

సామాజికుల ప్రోత్సాహమే నటీనటులను సమకూర్చునని సమర్థించుకొనుటకు సూత్రధారుడు ప్రవచించినది శ్లోకము. పేరమహాసత్కవి పౌత్రుడైన కృష్ణసత్కవి సహాయ కవిత్వమున సమాజసంతతభజనానందుడనని సమర్థించుకొనుటకు తిమ్మభూపాలుడు విరచించినది పద్యము. ఇందు వానరసహాయము, విభీషణశరణాగతి గర్భితము. తిమ్మ భూపాలుని కవిత్వమునకు సహాయము చేసిన కృష్ణకవి, అతని తాత పేరకవి చరిత్రకు అందని కవులు.

"చేతశ్శుక్తికయా నిపీయ శతశః శాస్త్రామృతాని క్రమా
ద్వ్యాప్తై రక్షరమూర్తిభిః సుకవినా ముక్తాఫలై ర్గుమ్ఫితాః
ఉన్మీలత్కమనీయనాయకగుణగ్రామోపసంవల్గన
ప్రౌఢాహంకృతయో లుఠన్తి సుహృదాం కణ్ఠేషు హారస్రజః. " 5శ్లో.ప్ర.

"తమి శాస్త్రామృతపూరముల్ సుకవిచేతశ్శుక్తికం జేర్చి యం
త మరల్పందగు నక్షరాకృతుల ముక్తాశ్రేణులన్ గూర్చు హా
రము లుద్యత్కమనీయనాయకమణిగ్రామోపసంపల్లనై
కమహాలంకృతులై చెలంగెడు సుహృత్కంఠంబులం దెల్లెడన్." 24ప. 1ఆ.

సూత్రధారుడు చెప్పిన శ్లోకమునకు, తిమ్మభూపాలుడు తెనిగించిన పద్యమునకు సుకవి కవిత్వము సహృదయహృదయంగమమని సారాంశము.

"యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పునరన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యన్తి కవయః" 9శ్లో. ప్ర.

"గొనబౌ రామచరిత్ర నాదిమకవిక్షుణ్ణంబుగా నెంచి మా
నిన నా రీతి గుణాఢ్యుడై తనరు వానిన్ నాయకుం గాంచలే
మిని, దత్తద్గుణగౌరవస్ఫురితగాంభీర్యాతిమాధుర్యవా
క్యనవబ్రహ్మలు పండితుల్ తమ రయో సార్థక్యముల్ గాంతురే." 30ప. 1ఆ.

రాముని చరిత్రము పూర్వులచేత పూర్ణమైనదని మూలము. వాల్మీకిచేతనే క్షుణ్ణమైనదని తెనుగుసేత. ఇందు శబ్దానుసరణము గమనార్హము.

తిమ్మభూపాలుడు "శబ్దం బనుసరించియు" తెనిగించిన శ్లోకములు అనేకము.

"జాతాః పక్వపలాణ్డుపాణ్డుమధురచ్ఛాయా కిర స్తారకాః
ప్రాచీ మజ్ఝరయన్తి కించ న రుచో రాజీవజీవాతవః
లూతాతన్తువితానవర్తులమితో బిమ్బం దధ త్తుమ్బతి
ప్రాతఃప్రోషితరోచిరమ్బరతలా దస్తాచలం చన్ద్రమాః" 2శ్లో. 2అం.

"జాతపక్వపలాండుపాండుమధురచ్ఛాయన్ గనెం దార లు
ద్యుతిం గైకొనెఁ బ్రాచిఁ గొన్ని కిరణంబుల్ పద్మజీవాతువుల్
లూతాతంతువితానవర్తులనభోలోలాత్మబింబంబుతోఁ
బ్రాతఃప్రోషితరోచియై డిగియెఁ దారానాథుఁ డస్తాద్రికిన్. " 6ప. 2ఆ.

శ్లోకములోని ప్రథమపాదమునందు యతిమైత్రి, ప్రథమతృతీయచతుర్థ పాదములందు ప్రాస యాదృచ్ఛికము. అది తెనుగుసేతను సద్వినియోగము చేసికొనుట తెలివి.

"ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీనిష్కూజకోయష్టయః
భౌమోష్మప్లవమానసూర్యకిరణక్రూరప్రకాశాదృకో
రావిష్కుర్వసమాపయన్తి దిగమూ ర్మధ్యాహ్న శూన్యా దిశః" 30శ్లో. 2అం.

"పరుషోద్యద్ద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపలాం
కురితజ్వాలజటాలజాంగలతట్కోయష్టులై భౌమని
ర్భరబాష్పప్లవమానభానుకిరణోగ్రప్రక్రియ న్నేత్రతా
మరసంబుల్ దరికొల్పెడున్ దశదిశల్ మధ్యాహ్నశూన్యంబులై. " 111ప. 2ఆ.

ఇందు పూర్వార్ధము శ్రీనాథుడు తెనిగించినది. "అప్రాలేయహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపలజ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టులై" (109ప. 7ఆ.హ.వి.) ఇందు "ఉద్దామద్యుమణిద్యుతివ్యతికర" విశేషణమునకు శబ్దానుసరణము లేదు.

అంతేకాదు. నిష్కూజకోయష్టులు వాచాలకోయష్టులైనవి. "ద్యుమణిద్యుతివ్యతికరవిశేషము తిమ్మభూపాలుని తెనుగుసేతను కలదు. అంతేకాదు. ఉత్తరార్ధములోని "భీమోష్ణప్లవమాన సూర్య కిరణక్రూరప్రకాశాదృశో:" అను సమాసము "భౌమనిర్భరబాష్పప్లవమాన కిరణో ప్రక్రియన్" అని సంకుచితమైనది. "జ్వాలాజాలజటాలజాంగలతటీనిష్కూజకోయష్టః" అను పూర్వార్ధములోని సమాసము "జ్వాలజటాలజాంగలరటత్కోయష్టులై" అని సంకుచితమైనది. జ్వాలాశబ్దము హ్రస్వాంతమగుట, జాలశబ్దము పరిత్యక్తమగుట అగతికము. మొత్తము మీద తెనుగసేత మోదావహము.

తిమ్మభూపాలుడు "భావం బుపలక్షించియు" తెనిగించిన శ్లోకములు కలవు.

"తత్రాద్యక్ష్ణణపూలకోపనయనక్లేశా చ్చిరద్వేషిభి
ర్మేధ్యా వత్సతరీ విహస్య వటుభిః సోల్లుంఠ మాలభ్యతే
ఆప్యేష ప్రతనూభవ త్యతిథిభిః సోచ్ఛ్వాసనాసాపుటై
రాపీతో మధుపర్కపాకసురభిః ప్రాగ్వంశజన్మానిలః" 14శ్లో. 2అం.

"తల పాలంబున కేఁగి దగ దప్పులకు నోర్చి
గాసిల్లి కసవులు గోసి గోసి
కడఁగి రొమ్మున గ్రుడ్లు వెడలంగఁ బెద పెద్ద
మోపులుగాఁ గట్టి మోసి మోసి
కంటి కెన్నఁడుఁ గూర్కు గానక రేలెల్ల
వేగించి తినఁదిన వేసి వేసి
స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లటువెట్టి
దినమును చిణుదులు తీసి తీసి
యడలు మా దుఃఖఫల మింక గుడువు మనుచు
నగుచుఁ బలుమాఱు సోల్లుంఠనము లెసంగ
వటులు విశ్వసింపుచున్నారు వత్సతరిని
నతిథిసంతర్పణంబున కదె కుమార! 86ప. 2ఆ.

తిమ్మభూపాలుడు "అనౌచిత్యంబును బరిహరించియు" తెనిగించుట కలదు.

ద్వితీయాంకమునందు విశ్వామిత్రుని శిష్యుల విష్కంభము కలదు. అందు విశ్వామిత్రుని ఒక శిష్యుడు శునశ్శేపుడు. ప్రసిద్ధుడు. కాని పేరునందు అశ్లీలార్థము కలదు. ప్రసిద్ధుడగుటనుబట్టి సద్యఃస్ఫూర్తి కలుగదు. మఱొక శిష్యుడు పశుమేఢ్రుడు. అప్రసిద్ధుడు. పేరునందు అశ్లీలార్థము కలదు. అప్రసిద్ధుడగుట వలన సద్యఃస్ఫూర్తి కలుగును. అది శునశ్శేపనామధేయములోని అశ్లీలార్థమునకు సద్యఃస్ఫూర్తి కలిగించును. అందుకు తిమ్మభూపాలుడు విశ్వామిత్రుని శిష్యులకు విష్కంభసన్నివేశమునందు కళాధరుడు, సదాచారుడు అని నామకరణములు కావించెను. ఇది అనౌచిత్యపరిహారము.

ఇట్లు అనౌచిత్యమును పరిహరించి, ఔచిత్యమును ఆదరించి ఆంధ్రీకరించిన తిమ్మ భూపాలుడు అమూలకమైన అనౌచిత్యమునకు పాల్పడుట చిత్రము.

తృతీయాంకమునందు విశ్వామిత్రుడు, జనకుడు, శతానందుడు, రావణదూత శౌష్కలకుడు సంభాషించునెడ రామలక్ష్మణుల జనాంతికములు, స్వగతములు, అపవారితములు కలవు. అందు మూలమున రావణదూత అరుదెంచునపుడు,

రామ :- (సవ్యథం జనాంతికమ్) వత్స! లక్ష్మణ! కథ మస్తరితో
య మనేన దురాత్మనా రాక్షసేన కామారికార్ముకపరిచర్యా
మహోత్సవః

లక్ష్మణః :- ఆర్య! న కేవల మయమ్- (ఇత్యర్థోక్తే హసతి)

అని కలదు. రావణదూత రాక వలన శివధనుస్సంధానమహోత్సవమునకు అంత రాయము కలుగుచున్నదని రాముఁ డనగా, లక్ష్మణుడు కేవల మదే కాదని అనుట సాభిప్రాయము. పరిణయమహోత్సవము కూడ అని ప్రతీయమానము. రావణపరాజయమును ధ్వని గర్భితము. మర్యాదావిలసితము. పాత్రోచితము. సందర్భోచితము. ఆంధ్రీకరణమునందు ముందే, విశ్వామిత్రుడు రామునితో శివధనుస్సంధానము చేయవలయునని చెప్పినప్పుడే రాముడు ఏకతముగ లక్ష్మణునితో,

"వినుమ నాకుఁ జంద్రశేఖరు
ఘనచాపవిలోకకౌతుకంబు జనించెన్. 220
అనిన సౌమిత్రి పరిహాసమెనయ ననఘ!
యా యయోనిజ యగునట్టి యబ్జవదన
నరయ వేడుక పొడమిన దనిన నేమి
తప్పుగాదని పలికినఁ దాటకారి 221
తన మోమున మందస్మిత
మనువుపడం గినుకఁ బోలె నౌనౌను భళీ
కనఁ బ్రహసనమున సూత్రము
గను వివరించితివి . . . . . . " 222ప. 2ఆ.

అన్నట్లు కలదు. ఇది ధ్వనిగర్భితము కాదు. మర్యాదావిలసితము కాదు. పాత్రోచితము కాదు. సందర్భోచితమును కాదు. అంతేకాదు. విశ్వామిత్రుడు జనకుని శివధనుస్సు చూపించుమనిన, "డెందంబున నానందంబు కందళింప రఘునందనుం డాత్మగతంబున" వితర్కించిన విధము ఇంతకంటె అనుచితము. ఆ విధమిది :

"సమకూరు టెన్నఁడో జానకీజితకుంభ
కుచకుంభపరిరంభగుంభనంబు
చేకూరు టెన్నఁడో సీతావధూసుధా
మధురాధరాస్వాదమంగళంబు
సిద్ధించు టెన్నఁడో క్షితినందినీకటీ
తటపటీకర్షణోదారకేళి
యొనఁగూడు టెన్నఁడో యుర్వీసుతాకృతా
మితరతాంతనితాంతచతురిమంబు
అని యళీకమనోరథవ్యాప్తి నలరు
నాయభీష్టంబు పూరింప నీ యతీంద్రుఁ
డడిగెఁ జండీశకోదండమని చెలంగి
జనకు చందంబు గాంచి యయ్యినకులుండు." 319ప. 2ఆ.

ఇట్లు రాముడు వితర్కించుట మతింత పాత్రానుచితము. లక్ష్మణుని పరిహాసము కంటె రాముని ఆత్మవితర్కము దారుణము. ఇది మురారి ఉదాత్తమైన రామచంద్రపాత్ర

చిత్రణమునకు తిమ్మభూపాలుని కళంకాపాదనము. కారణము కాలదోషము. క్షీణయుగ ప్రభావము.

**ఈఁదులపల్లి భవానీశుడు :** ఇతని కృతి ధర్మఖండము. శ్రీశైలమల్లి కార్జునస్వామికి అంకితము. దైవాంకితము. ఇతని మిత్రుడు వక్కలంక వీరభద్రుడు. అతడు పిఠాపుర సంస్థానాధిపతి "రావుమాధవనృపాలాగ్రేసరుం గావ్యచాతురి మెప్పించి తదీయసత్కృతి సిరుల్ దోరంబుగానంది"నట్లు ఇందు కలదు. (32ప. 1ఆ.) అతని వాసవదత్తాపరిణ యము రచనాకాలము 1690 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి ధర్మఖండము రచనా కాలము 1695 ప్రాంతము కావచ్చును.

ధర్మఖండము స్కాందపురాణములోని ఏబది ఖండములందు ఒకటి. (14, 15ప. 1ఆ.) అది "వాల్మీకిచరిత్రంబు" అని (333ప. 9ఆ.), "చిత్రప్రబంధంబు" అని (337ప. 9ఆ.) కవి నిర్దేశము. వాల్మీకిచరిత్రము నిమిత్తముగా ధర్మములు, ఇతిహాసములు, పురాణ కథలు, పూజావిధులు, రామనామజపమాహాత్మ్యము దట్టించిన చిత్రమైన పురాణఖండము. కిరాతుడు కూడ ధర్మములు ఏకరువు పెట్టును. ఇందు ధర్మములు చాలవఱకు కాల దోషము పట్టినవి. పంచమాశ్వాసమునందు కావ్యత్వసిద్ధి కలదు. విజయుడు అను కిరాతుడు, వసిష్ఠుని మరామంత్రోపదేశమున-

> ఖగములు శిరమున గూళ్లిడ
> మృగములు శృంగములఁ గ్రుమ్మి మేనుల నొరయన్
> నగము గతి కదల కాతఁడు
> జగములు భీతిల్లఁ దపము సలుపఁగఁ దొడఁగెన్. " 6ప. 5ఆ.

అతని తపస్సు భంగము చేయుటకు ఇంద్రుని ఆనతిని వచ్చిన అప్సరసల ప్రగల్భములు, వనవిహారములు, జలవిహారములు మాత్రమేగాక, వనమునందు పురము నిర్మించి, అందు "పల్లవులం గలసి యుల్లంబు లుల్లసిల్ల యథేష్టదివ్యభోగంబు లనుభ వించుట" కలదు. తపోవనమునందు అప్సరసలకు ప్రతితరువునందు సీతాలక్ష్మణ సమేతుడైన రాముడు కనిపించును. అయినను,

> "ఇతనిఁ గౌఁగిటఁ గదియించి రతులఁ దేలి
> యతుల సౌఖ్యంబుఁ జెందుదమని తలంచి
> తరువు తరువున కరిగిరి తరుణు లపుడు
> తరువుకాఁడయి మరుఁడు తత్తఱము సేయ. " 126ప. 5ఆ.

- అప్సరసల ప్రయత్నము వ్యర్థమై, వ్యథచెందు ఇంద్రునికి బృహస్పతి వరాహ నృసింహ, కృష్ణావతారకథలు వివరించును. శివుడు దేవతలకు రామావతారకథను భవిష్య త్పురాణముగ చెప్పును. భవిష్యదర్థకక్రియలతోపాటు భూతార్థకక్రియలును కలవు. ఇందు ఒక చిత్రమైన అంశము కలదు. అది దుఃఖార్తయైన సీత శాపము.

> "క్రవ్యభుగ్రాజనీతయై గగనవీథి
> నుత్తరీయంబు ముసుఁగిడి యువిద చనఁగ
> ద్రవిడదేశాంగనలు సూచి తను హసింప
> నరసి యమ్ముగ్ధ రోషతామ్రాక్ష యగుచు
> పయ్యెద దొలఁగిన నను మి

రియ్యెడ హసియింపఁ బాడియే? నేఁడు మొదల్
పయ్యెదలు లేక యుండుఁడు
దయ్యంబుల భంగి ద్రవిడతామరసాక్షుల్. " 14ప. 9ఆ.

అనేకధర్మములకు అనేకానేకములైన ఇతిహాసములు దృష్టాంతములుగ కలవు. అవి ఇతరపురాణములలోని కథలకు, ఉపాఖ్యానములకు సహోదరములు. శివపూజా విధానము సవిరముగ కలదు. రామనామజపమాహాత్మ్యము ఆది నుండి అంతము వఱకు అంతట కలదు. వ్యాసనిష్కాసనకథ కాశీఖండమునందు కంటె భిన్నముగ కలదు. శివాజ్ఞను భైరవుడు వ్యాసుని కాశినుండి వెళ్లగొట్టును. కాశీదక్షిణకాశీక్షేత్రముల వర్ణనతో పాటు పీఠికాపురవర్ణనమును కలదు. (27-44ప. 4ఆ.) దక్షారామక్షేత్రవర్ణనమునందు (49-60ప. 4ఆ.)

"మును మాతంగపతంగపుంగవతతుల్ మోదంబుచే నిచ్చటన్
దనువుల్ వే దిగనాడి దీప్తతరగాత్రస్ఫూర్తిఁ బెంపొంది సొం
పునఁ గైలాసనివాసతం జెలఁగె నాఁ బొల్పొందు మర్త్యాళికిన్
జనునే యిందుల నస్తినాస్తివిచికిత్సాదృష్టి మోక్షాప్తికిన్. " 59ప. 4ఆ.

అను పద్యము ధర్మఖండము మొత్తము మీద శ్రీనాథుని ప్రభావమునకు శృంగ గ్రాహిక.

ధర్మఖండమునందు చిత్రగర్భబంధకవిత్వములును కలవు. (218ప. 3ఆ; 270, 271ప. 4ఆ; 118ప. 5ఆ; 291ప. 9ఆ; 293ప. 9ఆ.) కతిపయవర్ణనములును కలవు.

**ముష్టిపల్లి పెదసోమభూపాలుడు** : ఇతని కృతులు 1. రతిశాస్త్రము. శాస్త్రగ్రంథము 2. అష్టపదులు. అముద్రితము. ఇతడు గద్వాల సంస్థానాధిపతి. కర్త. కారయిత. కాలము[150] 1663-1712. గద్వాలనగరనిర్మాణకాలము[151] 1698-1705. కృతినిర్మాణ కాలము తత్పూర్వమగును. కాఁబట్టి అష్టపదుల రచనాకాలము 1695 ప్రాంతము కావచ్చును.

అష్టపదులు జయదేవుని గీతగోవిందములోని అష్టపదులకు సంస్కృతాంధ్రభాషలందు సవిస్తరవ్యాఖ్యానరూపము. అష్టపదిలోని ఒక్కొక్క చరణమునకు ఒక్కొక్క శ్లోకము, పద్యము, దరువు, చూర్ణిక కలవు[152].

పెద సోమభూపాలుడు ఆస్థానకవులచేత యథాశ్లోకతాత్పర్యరామాయణమును రచింపజేసెను[153]. ఇతని కాలమునందు పూర్తి కాలేదు. ఇతని మనుమడు చిన సోమ భూపాలుని కాలమునందు పూర్తి అయినది. యథాశ్లోకతాత్పర్యరామాయణకవులు: బాల కాండము కాణాదము పెద్దన, అయోధ్యాకాండము కొత్తపల్లి రామచంద్రాచార్యులు. ఆరణ్యకాండము గార్గ్యపురము సుబ్బరాయశాస్త్రి. కిష్కింధాకాండము కామసముద్రము అప్పలాచార్యులు. సుందరకాండము తిరుమల కృష్ణమాచార్యులు. యుద్ధకాండము బోరవెల్లి శేషాచార్యులు. అప్పలాచార్యులు కృష్ణలీలాతరంగిణిని అష్టపదులు అను పేర తెనిగించెను.

**కొటికలపూడి వీరరాఘవాచార్యులు** : ఇతని కృతులు యథాశ్లోకతాత్పర్య భారతోద్యోగద్రోణపర్వములు. ఉద్యోగపర్వము పెద సోమభూపాలుని అనుమతిని

రచించినది[154]. ద్రోణపర్వము అముద్రితము. ఉద్యోగపర్వము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

**పైడిమఱ్ఱి వేంకటపతి** : ఇతని కృతి చంద్రాంగదచరిత్రము. శ్రీరామచంద్రునికి అంకితము. దైవాంకితము. ఇతని వంశమూలపురుషుడు కృష్ణరాయభూషణుడు. అతడు శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజకవులలో ఒకడు[155]. అప్పటి నుండి వంశవృక్షము లేదు. వేంకటపతి ముత్తాత రామరాజు నుండియే కలదు. రామరాజాదులు చరిత్రకు అందని వ్యక్తులు. చంద్రాంగదచరిత్రము నుండి అప్పకవీయమునందు ఉదాహరించిన పద్యములు లేవు. కనుక వేంకటపతి కాలము 1700 ప్రాంతమని ఒక అభిప్రాయము కలదు[156]. ఆముక్తమాల్యద, మనుచరిత్రములలోని పద్యములకు చంద్రాంగదచరిత్రమునందు పెక్కు అనుకరణములు కలవు. కనుక వేంకటపతి కాలము పదునేడవశతాబ్ది అని మఱొక అభిప్రాయము కలదు[157]. కాఁబట్టి చంద్రాంగదచరిత్రము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

చంద్రాంగదచరిత్రము సీమంతినీపరిణయమే- బ్రహ్మోత్తరఖండములోనిది. అందు సీమంతిని చిత్రవర్మ తనయ. ఇందు చిత్రసేనుని తనయ. అందు సీమంతిని పతిగండము నకు పరిహారము సోమవారవ్రతము. ఇందు సత్యప్రతిజ్ఞాని తపస్సు. కావ్యము వర్ణనా భూయిష్ఠము.

ప్రథమాశ్వాసమునందు పుర (1-43) రాజ (44-50) విష్ణ్వర్చన (60-66), విష్ణు సాక్షాత్కార (68-71) దశావతార (73-83) దౌహృద (93-99) కుమారోదయ (101-103) వర్ణనలు కలవు. ఇంద్రసేనుడను రాజునకు విష్ణ్వనుగ్రహమున చంద్రాంగదుడు జన్మించుట కథాంశము. ద్వితీయాశ్వాసమునందు నాయకబాల్యయౌవన (3-16) గ్రీష్మర్తు (17-37) మృగయా (38-107) వర్ణనలు కలవు. సీమంతినిని చూచి చంద్రాంగదుడు, చంద్రాంగదుని చూచి సీమంతిని మోహపరవశులగుట కథాంశము. తృతీయాశ్వాసము నందు సీమంతిని పతిగండపరిహారవృత్తాంతము ప్రధానకథాంశము. సత్యప్రతిజ్ఞాని తపస్సు నకు ఇంద్రుడు భంగముకలిగించు ప్రయత్నము సుదీర్ఘము. చతుర్థాశ్వాసమునందు నాయకవిరహ (3-4; 59-146) వర్షాదివసంతర్తు (5-58) నాయికావిరహ, వనవిహార, వారివిహార మన్మథపూజా వర్ణనలు (147-174) కలవు. సీమంతిని విషయము తల్లి విమలకు తెలియుట కథాంశము. పంచమాశ్వాసమునందు నాయక (6-35) సూర్యాస్తమయాదిచంద్రికావిహారపర్యంత (39-63) నాయికావిరహ, మన్మథాద్యుపాలంభ (64-112) సూర్యోదయ (113-123) స్వయంవర సమాగతరాజకుమార (124 వచ.) స్వయంవర (125-163) వర్ణనలు కలవు. చిత్రరేఖ సీమంతినికి చిత్రపట మిచ్చుట సీమంతిని స్వయంవరమునందు చంద్రాంగదుని వరించుట కథాంశములు. షష్ఠాశ్వాసము నందు వివాహ (3-62) యుద్ధ (63-114) పురప్రవేశ (115-130) సంభోగ (131-151 పైగా గ్రంథపాతము కలదు.) వర్ణనలు కలవు.

సత్యప్రతిజ్ఞాని తపశ్శక్తి స్వతంత్రకల్పనము.

చంద్రాంగదుని చూచి మోహించిన సీమంతిని, చెలికత్తెల పరిహాసమునకు వనము నుండి నిష్క్రమించిన తీరు నిపుణము.

"జలజసాయకుఁ డెంతయు సాక్షి గాఁగఁ
దన మనంబిచ్చి యా రాజతనయు మనము
మార్చుకొనినది గానఁ దన్మానసంబు
వెనుఁదగుల నింతి వనవీథి వెడలి చనియె." 148ప. 2ఆ.

చంద్రాంగదుని మిథ్యాకేళి ఉదాత్తముగ లేదు.

"సొలయున్ జూచు నగు న్నయ ల్బలకరించు న్బల్కు నూకొట్టు బి
ట్టలుఁగున్ మ్రొక్కుఁ బ్రియంబుఁ జెప్పు నధరం బల్లార్చి కోకొమ్మనున్
బిలుచున్ గౌఁగిటఁ గ్రుచ్చు మెచ్చు నట చుంబించున్ నిను న్బాయలే
నలరుంబోఁడి యటంచు నేకతమ మిథ్యాకేళి లోలాత్ముఁడై. " 4ప. 3ఆ.

వర్ణనాబాహుళ్యమేగాని వైదగ్ధ్యము మృగ్యము.

సస్యవర్ణనము :

"కనుఁగొన నయ్యెఁ బండి యొఱఁగంబడి యుండెడు రాజనంబు చ
య్యన హాలికు ల్కమున్ గనిన యట్టి మహీమహిళ న్మదర్థమై
ఖననముఁ జేయఁ జూచెదరుగా యని యాంతరకైరవాళిసం
జనితమరందబాష్పములు జాఱఁగ మూర్ఛిలి వ్రాలు కైవడిన్." 39ప. 1ఆ.

వర్షర్తువర్ణనమునందు చంద్రాంగదుడు విరహవేదనాదోదూయమానమానసుడై మేఘమును వేడుకొనుట (20-25ప. 4ఆ.) విశేషము.

"నా మీఁద నాటిన నాఁటి ప్రేమముఁ జిత్త
మున నిల్పి మఱువకు మనఁగదయ్య
వనజాయతేక్షణ యనుఁగుచెచ్చెలువల
నందఱి నడిగితి ననఁగదయ్య
యలరుఁగ్రొవ్వాఁడి చూపులు నించు వలఱేని
ననవింటి నే నోర్వ ననఁగదయ్య
తనుఁ జేరి యితర మెన్నని నాదు హృదయంబుఁ
గనఁ బరామర్శింపు మనఁగదయ్య
యరయ కిటు లెంచుట నుచితం బనఁగదయ్య
యాలసించిన మఱి మోస మనఁ గదయ్య
వనజగర్భుండు నిర్దయుఁ డనఁగదయ్య
ప్రాణము లొసంగి నను నేలు మనఁగదయ్య " 24ప. 4ఆ.

ఇదొక విధమైన మొయిలు రాయబారము.

పాలవేకరి కదిరీపతినాయకుడు : ఇతని కృతి శుకసప్తతి. రఘురామునికి అంకితము. దైవాంకితము. ఇందు తాడగొల్ల కరియమాణిక్యన్నపతి "రామదేవరాయల సరిగద్దె నొడ్డోలగమున నుండె" నని (38ప. 1ఆ.) "రామరాయక్ష్మావరదత్తబిరుదాంక వార" మందెనని (40ప. 1ఆ.) కలదు. అతని జ్యేష్ఠపుత్త్రుడు వసంతాధీశుడు. (43ప. 1ఆ.) వసంతాధీశుని కుమారుడు రామభూవిభుడు (47ప. 1ఆ.) "రామభూపతి శ్రీరంగరాయ దత్తమత్స్యమకరధ్వజాఢ్యుఁడు." (48ప. 1ఆ.) "రామభూపతి ద్వితీయ సోదరుడు కదురక్ష్మాధీశుడు. (58ప. 1ఆ.) కదురక్ష్మాధీశుని జ్యేష్ఠపుత్త్రుడు కదురభూనాథుడు (64ప. 1ఆ.) కదురభూనాథుడే కదిరీపతినాయకుడు. (70ప. 1ఆ.) రామదేవ

రాయల (1619-30) తర్వాతి శ్రీరంగరాయలు మూడవ శ్రీరంగదేవరాయలు. (1642-78/80) కనుక రామభూపతి ప్రాభవకాలము 1640-80, కదుర్క్ష్మాధీశుని ప్రాభవకాలము 1650-1690, కదిరీపతినాయకుని ప్రాభవకాలము 1680-1720 అగును. కాఁబట్టి శుకసప్తతి రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

శుకసప్తతి అనగా చిలుక చెప్పిన డెబ్బది రాత్రుల కథలు. అర్వాచీనమైన హంస వింశతి హంస చెప్పిన ఇరువది రాత్రుల కథల వలె. కాని శుకసప్తతి ముప్పది తొమ్మిది రాత్రుల కథల గ్రంథభాగమే లభించినది. ప్రథమాశ్వాసమునందు 465, ద్వితీయాశ్వాసము నందు 582, తృతీయాశ్వాసమునందు 634, చతుర్థాశ్వాసమునందు 126 పద్యగద్యముల కథాభాగము కలదు. చతుర్థాశ్వాసము కథ పూర్తికావచ్చినది కాని, కావ్యము పూర్తి కాలేదు. ఇంకను అయిదు వందల పద్యగద్యములు ఉండవచ్చును. అంతేకాదు. మఱొక అయిదారువందల పద్యగద్యముల పంచమాశ్వాసమును ఉండవచ్చును. ముప్పది తొమ్మిది కథలలోని ఉపకథలను కలిపి డెబ్బది, కథ లనుట కలదుగాని, అవి డెబ్బది రాత్రుల కథలు కాఁజాలవు.

ప్రభావతి అను గృహిణి భర్త మదనసేనుడు దేశాంతరమున కేగినపుడు, పల్లవి అను రాజదూతి దుర్బోధకు లోనైనను, పరకీయశృంగారమునకు పాల్పడకుండ, మదన సేనుడు పెంచిన చిలుక ప్రతి రాత్రి ఒక కథ చొప్పున డెబ్బదిరాత్రులు డెబ్బది కథలు చెప్పుట ఇతి వృత్తము. కావ్యోద్దేశము మంచిదే కాని, కాని పనికి లేని తెలివి కలిగించు ప్రమాదము కలదు. ఇట్టి కావ్యము సంస్కృతవాఙ్మయమునందును కలదు. అది కూడ శుకసప్తతియే. కాని దాని కిది తెలుగు సేత కాదు. స్వతంత్రకావ్యము.

ఇవి కట్టు కథలు. పాత్రలు సంఘజీవులు. సంఘమునకు శుకసప్తతి అచ్చపు దర్పణము అందు ప్రతిఫలించినవి అనేకవిషయములు. అందు కొన్ని అంశములు: గ్రామ దేవత గంగగుడి ప్రాంగణము :

"కావు గుబ్బెతలు పొంగళ్ళు పెట్టిన పాల
కడవ చాటికల పొక్కళ్ల ఱాలు
దొరలు దెప్పించి బంతులు గట్టి యుర్వించు
పొట్టేళ్ల నెత్తురు బురద రొంపి
కోర్కి చెల్లిన భుజంగు లొసంగఁ బెఱికిన
కుక్కుటపటలంపు తెక్క గుంపు
మంత్రముల్ ఫలియింప మాంత్రికుల్ పయి జోతి
వన్నె యుంచిన పంచ వన్నె కోళ్లు
పరఁగ గుగ్గు లగురుధూపపరిమళంబు
శాకినీఢాకినీభూతసంభ్రమంబు
చరదిత ప్రాణమృత్తికాతురగచయము
నలను నా గంగగుడిఁ జేర నరుగు నవుడు. " 76ప. 2ఆ.

పల్లె పట్టు రచ్చ కొట్టము :

"కంబళాక్రామితక్ష్మాభాగసవిధంబుఁ
జేరు వారలతోడఁ బోరు వారు

నిజదేహబహువర్ణనీయవిచిత్రముల్
చెవులొగ్గ వారితోఁ జెప్పు వారు
నాగామిదివసగమ్యపురాధ్వపరిమాణ
మద నెఱింగిన వారి నడుగు వారు
క్షీరవిక్రయపరాభీరనారీకోటి
తోడ నవ్వుల బేర మాడు వారు
నగ్గి గొనితెచ్చి రథ్యాతృణాళి పైచి
సీమతిమిరోద్ధతికిఁ బ్రతిష్ఠించు వారు
నైన నానావనీసమాయాతపథికు
లమరఁ గనుపట్టు రచ్చ కొట్టమున కరిగె. " 199ప. 3ఆ.

కాపుటూరి రైతు గృహము :

"అచ్చమై వాకిట రచ్చ ఱాయి మెఱుంగు
పంచతిన్నెలు గొప్ప పారి గోడ
కంపతెట్టులును రాకట్టు ముంగిలి మల్లె
సాలెదేవర యఱచవికె యొకటి
కోళ్ల గూండ్లును గొఱ్ఱు కుఱుగాడి యేడికో
లలు కాఁడి పలుపులు గలుగు నటుక
దూడలు పెను మూవ కోడెలు కుఱుకాఁడి
గిత్త లీనిన మేటి గిడ్ల దొడ్డి
యిఱుకు మ్రాను పెరంటిలో నెక్కు బావి
మునుఁగలును జొప్ప పెనువామి జనుము రుబ్బు
ఱోలు పిడకల కుచ్చెల దాలి గుంత
దనర నిరతంబు వెలయు నాతని గృహంబు." 408ప. 2ఆ.

ఇది వ్యవసాయము. ఇక వ్యాపారము : ఈళ, విళంగ, బంగాళ (176ప. 1ఆ.) ముమ్మొంగి పైగోవ (8ప. 3ఆ.) మొదలైన దీవుల నుండి- పద్మరాగములు, పుష్యరాగములు, ఈళాపు నీలములు, పగడములు, కట్టాణిపూసలు, మక్కా జరీ తివాసులు, సామ్రాణి తేజాలు, ఏనుగు గున్నలు, కెంపు మిన్నలు, కస్తూరి వీణెలు, రుద్రవీణలు, జల్లులు, జవ్వాది పిల్లులు, పన్నీటి గాజుపనటులు, ఏడాకుటనటులు, కొమ్ములు, పంచవన్నె చిలుకలు, ఫిరంగులు, సివంగులు, అపరంజి లప్పలు, తెలి వెండికుప్పలు, జవిడి కట్టులు, బకదారి పిట్టలు, పుత్తడి సూరెపానులు, దంతపు బోసులు, సింగిలీకలు, హరిచెయీాకలు, పటికపుసాగటాలు, పగడముల నీలముల చదరంగమందములు, కొల్లారు బండులు, కుంకుమపుగోనెలు, పును గిడదగిన పూనెలు, మంచి సిరిగందపు మ్రాకులు, మగఱాపిడుల బాకులు, నెలఱాల గిన్నెలు, ఉడిగంపుఁ గన్నెలు, ఓడ పోకలు, పండుటాకులు (222ర. 1ఆ.) నవరత్నములు, పటలాంశుకములు, గోవ, జవ్వాది, కుంకుమపూవు, పచ్చ కప్పురము, జల్లి సవరములు, పాదరసము, జాజి, ఇంగువ, ఏలకులు, లవంగములు, గోరోచన గంధకములు, కొచ్చి కుక్కలు, మానిసి క్రోతులు (7ప. 3ఆ.) దిగుమతులు.

రాచ కొలువులందు "ఇంగిలీసు ముఖాములు" కలరు. (175ప. 1ఆ; 10ప. 3ఆ.)

కదిరీపతి కవిత్వము కమనీయము. తెనుగు నుడికారము తేనె పానకము. సంస్కృతప్రౌఢి సముజ్జ్వలము. ధారాశుద్ధి ధారాళము. ఉక్తివైచిత్రి ఉజ్జ్వలము.

తెనుగు నుడికారములు :

"మగఁడు పులి వంటి వాఁడు" 136ప. 1ఆ.

"అనఁగా ననఁగా నొక పుర మొనరుం జంద్రవతి యనఁగ" 171ప. 1ఆ.

"నక్కఁ గన్న వాఁడెల్ల వేఁటకాఁ డనెడు వార్త నిక్కమయ్యెననఁగ" 266ప. 1ఆ.

"కననోపునె నుదుటఁ గన్ను గల వాఁడైనన్." 280ప. 1ఆ.

"కసివోని వలపు హెచ్చిన కతనన్" 301ప. 1ఆ.

"అడుగు దప్పినచోఁ దప్పుఁ బిడు గటంచు నొడువ మును విందువే కద" 319ప. 1ఆ.

"కోమలుల చూపుములికి నాటిన మరుఁడు మూర్ఛనొంద" 347ప. 1ఆ.

"సీత పుట్టి లంక చెఱచిన చందాన" 459ప. 1ఆ.

"కడుపు చుమ్మలు చుట్టఁగా గన్న కన్నె" 462ప. 1ఆ.

"బసవెద్దగు మగఁడు మండిపడు" 530ప. 1ఆ.

"పెడికెడు రూక లొడిం జల్లి" 25ప. 2ఆ.

"నల్ల పూసలు చెవియాకు నాకుఁ జాలు" 84ప. 2ఆ.

"ఇంతటిలోఁ బతి పాటిపోవఁడు" 99ప. 2ఆ.

"తలవాఁకిటఁ గాఁపురమయ్యె దానికిన్" 103ప. 2ఆ.

"ఇది బ్రదికి నట్టి మీఁదటఁ గద యా జోలి" 150ప. 2ఆ.

"పెండ్లి పే రకట దేవుఁ డెఱుంగు మెఱుంగుబోడికిన్" 154ప. 2ఆ.

"బకు తండ్రి హిడింబుని కొడుకన" 207ప. 2ఆ.

"అతని పాలిటి ప్రతిబంధపుఁ బేరఁటాలు" 242ప. 2ఆ.

"తగిలించుకొన్న పిమ్మట నిగిలించుటె కాని కార్య మే మున్నది" 291ప. 2ఆ.

"కుడువఁ గూడును గట్టుకోఁ గూడు లేక" 365ప. 2ఆ.

"పట్టినది యెల్ల బంగారు పనుల పట్ల" 407ప. 2ఆ.

"పెరుగు నివ్వెరతో నోరు తెఱచికొనుచుఁ దప్ప కీక్షించె" 453ప. 2ఆ.

"త్రోయ విస్తరి చినిగెడు నన్నట్లు వలపు చెడ్డది సుమ్మీ" 476ప. 2ఆ.

"మనముననే యిట్టి నేల మాలెలు ద్రవ్వన్" 508ప. 2ఆ.

"దానిఁజాడ గొబ్బునఁ బదివేల మన్మథులు పుట్టుదు రప్పురిఁ బల్లవాత్మలన్."55ప. 2ఆ.

"నీకే రోసము గలిగిన బ్రతికితిమి" 34ప.3ఆ.

"గడు వొకటి యేల యింతలోఁ గాల మేమొ
దేశమేమొ కదా యంచుఁ దెలియు నటవె " 83ప. 2ఆ.

అవ్వధూటి పతి కన్నులు మూసి చరించు నిచ్చలున్" 109ప.3ఆ.

"దీనికిఁ జిల్లర విద్యల బిరుదు చెల్లు ననంగన్" 159 ప.3ఆ.

"తను ముంచినది సముద్రంబన వినమే" 176ప.3ఆ.

"ఇచ్చటి జగజంతలు మగలకన్నఁ జట్రాళ్ళు సుమీ" 184వ. 3ఆ.

"పాము జాడ పామునకుం గాని పరులకుం దెలియఁబడని తెఱంగున" 236 వచ. 3ఆ.
"గాజు గడిపినట్లు దినము గడుపుచునుండెన్. " 243ప. 3ఆ.
"ఇంటఁ బ్రోయి రాజుదుగా" 251 ప. 3ఆ.
"ఇటు వండి పెట్టినఁ బొగులవు కుంభంబు మీఁది పొట్టేలు క్రియన్" 276ప. 3ఆ.
"ఎంత దుఃఖమైన నింటికి వచ్చి యి
ల్లాలి మొగముఁ జూచినపుడె తలఁగు" 340 ప. 3ఆ.
"మున్ను మ్రొక్కి గద మ్రొక్కు గొన న్వలయున్" 381 ప. 3ఆ.
"ఆతని చేతులలోఁ జెంగలమ్మ గొట్ట" 403ప. 3ఆ.
"అద్దంబులోఁ దోఁచు నల్లరేఖ యనంగ" 429ప. 3ఆ.
"మగ కలవునఁ బడిన గతి నుండ" 543ప. 3ఆ.
"అయ్యో యీ యూరికి దొరలేఁడా" 580ప. 3ఆ.




"గుండియలు గుఱ్ఱ్లఁ దన్నిన గ్రక్కు మిక్కు రనక" 627ప. 3ఆ.
"దాని కిలికించితంబునఁ దవిలి నట్టి
వాఁడు దేవేంద్రునకుఁ జీటి వ్రాయఁ గలఁడు" 12ప. 4ఆ.
"వాని బంటున కున్న యైశ్వర్యగరిమఁ
బడసినఁ గుబేరుఁడైనను బ్రదికి పోవు" 14ప. 4ఆ.
కన్ను లెఱ్ఱగా నెగాదిగఁ గన్గొని" 39ప.4ఆ.
"రట్టున కోర్చునంతకుం దాళునె యీ శరీరము" 67ప.4ఆ.
"తండ్రి గడియించినట్టి విత్తంబు వోవ
లొల్లగాఁడయ్యె . . . . . . . . . . . " 111 ప. 4ఆ.

**ముత్తరాజు వేంకటకృష్ణయ్య** : ఇతని కృతులు 1. బ్రహ్మోత్తరఖండము. అముద్రితము 2. గీతగోవిందము. గేయరూపము. అనుపలబ్ధము 3. శ్రీకృష్ణకర్ణామృతము. గేయరూపము. అనుపలబ్ధము. బ్రహ్మోత్తరఖండము జన్నవాడ మల్లేశ్వరస్వామికి అంకితము దైవాంకితము. ఇతని కాలము 1700 ప్రాంతమని వంశవృక్షమునందు కలదు[158]. కాఁబట్టి బ్రహ్మోత్తరఖండము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

బ్రహ్మోత్తరఖండము స్కాందపురాణములోని ఖండము.

**గోపమంత్రి** : ఇతని కృతి సింధుమతీవిలాసము. అముద్రితము. ఇతని కాలము 1700 ప్రాంతమని కలదు[159]. కాఁబట్టి సింధుమతీవిలాసము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

సింధుమతి అను వేశ్యకు, జయుడను విటునికి నడచిన శృంగారలీలలు సింధుమతీ విలాసములోని ఇతివృత్తము[160].

**కృష్ణకవి** : ఇతని కృతి శకుంతలాపరిణయము. వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. కృతిప్రోత్సాహకుడు చిరుమామిళ్ల పాపయ్య. అతని వంశమూలపురుషుడు పెద్దన. ఆతడు "సన్నుతకృష్ణరాయనృపసత్తము చిత్తము రాఁ జరించుచున్! మన్నన మీఱ భూరిబహుమానముగా గజరాజిగ్రై!కొన్న ఘనుండు. (12ప. 1ఆ.) ఆతనికి, కృష్ణకవికి నడుమ అయిదు తరములు కలవు. శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము 1509-

1525 అని పూర్వోక్తము[161]. పెద్దన భూరిబహుమానము గైకొన్నకాలము 1525 ప్రాంతము కావచ్చును. అయిన తరమునకు ముప్పదియైదు సంవత్సరముల పరిగణనమున కృష్ణ కవి కాలము 1700 ప్రాంతమగును. కాఁబట్టి శకుంతలాపరిణయము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

"విశ్వశ్రేయః కావ్యమ్" అని కృతిప్రోత్సాహకుని ఉట్టంకనము. (90ప.) "మహారాజన్య చరిత్రంబు కలిదోషనాశకంబు ... ఆముష్మికఫలప్రదంబు ... ఒక్క రాజన్య చరిత్రంబు రచియింపఁజేసి వేంకటేశ్వరార్పణంబుగా నివేదింపు"మని అతని తల్లి ఆనతి. (91వచ.) "కృతి భారతార్థపద్ధతియఁట" అని అతని ప్రశంస. (92ప. 1ఆ.) శకుంతలాపరిణయము దుష్యంతమహారాజు చరిత్రమేగాని, విశ్వశ్రేయము ధ్యేయముగ లేదు. కలిదోషనాశకమును కాదు. ఆముష్మికఫలప్రదమును కాదు. క్షీణయుగలక్షణలక్షితమైన శృంగారకావ్యము. భారతార్థము భాసిల్లదు. దుష్యంతుడు అనంతసత్త్వుడు కాడు; అనంగసత్త్వుడు శకుంతల మునికన్య కాదు; వరకన్య.

శకుంతలాపరిణయమునందు భారతకథానుసరణము, అభిజ్ఞానశాకుంతలాను కరణము, స్వతంత్రకల్పనము, అన్యథాకల్పనము కలవు.

శకుంతలాదుష్యంతుల గాంధర్వవివాహము, భరతజననము, యౌవనము; భరత సమేతముగ శకుంతల రాజసభాప్రవేశము, దుష్యంతుని తిరస్కారము భారతకథాను సరణములు. దుష్యంతుడు ఉద్యానవనమునందు శకుంతలను చూచుట, ప్రియంవద శకుంతలాజన్మవృత్తాంతము చెప్పుట, కణ్వమహర్షి శకుంతల వెంట గౌతమిని పంపుట, శకుంతలానిర్గమనఘట్టము అభిజ్ఞానశాకుంతలానుకరణములు. నారదుడు దుష్యంతుని వేటకు పంపుట, మునికన్యలను చూచి దుష్యంతుడు పొదరింట దాగుట, శకుంతల చిలుకమీద విసిరిన విరిబంతి దుష్యంతుని ఉరమును సోకుట, కందుకపాతము నిమిత్తముగ శకుంతల దుష్యంతుని సమీపించుట, దుష్యంతుడు సంగమము కోరుట, పరస్పరము సాభిప్రాయముగ, సాకూతముగ సంభాషించుట, దుష్యంతుడు ఆశ్రమ సమీపమునందు స్కంధావారమును విడియించుట, శకుంతలాదుష్యంతుల విరహము, ప్రియంవద శకుంతలా దుష్యంతుల సమాగమమును సంధానించుట, శయ్యామందిరము నందు శంకుతల వగలు ఒలకఁబోసి వరమడుగట వగైరా స్వతంత్రకల్పనములు. గౌతమి కణ్వమహర్షి భార్య అనుట, దుష్యంతుడు తిరస్కరించినపుడు శకుంతల విష్ణువును ప్రార్థించుట, విష్ణువు సకుటుంబపరివారముగ సాక్షాత్కరించుట అన్యథా కల్పనము. దుష్యంతుని విష్ణుస్తోత్రము కారణముగ శకుంతలాపరిణయము కలిదోషనాశకము, ఆముష్మికఫలప్రదము అని కవి ఆశయము కాబోలు!

ప్రియంవద (అనసూయ) శకుంతలాజన్మవృత్తాంతమును చెప్పుట అభిజ్ఞాన శాకుంతలమునందు ఎంత ఔచిత్యవిలసితమో, శకుంతలాపరిణయమునందు అంత అనౌచిత్యకలుషితము. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కణ్వశిష్యునిచేత చెప్పించిన విధము ముల్లు తీసి కొఱ్ఱు అణచిన చందమైన, కృష్ణకవి ప్రియంవదచేత చెప్పించిన విధము కొఱ్ఱు తీసి కొఱకంచు పెట్టిన వైఖరి. ప్రియంవద దుష్యంతునికి వివరించిన తీరు :

"జిలుఁగు పైఁట చెఱఁగుఁ దొలఁగించి తొలఁగించి

యుదుటు గుబ్బల గోరు లూని యూని
బిగువు కౌఁగిటిలోన సాగయించి సాగయించి
సవురుగా మైఁదీవ నివిరి నివిరి
కదిసి మోమున మోముఁ గదియించి కదియించి
యలర వాతెఱ తేనె లాని యాని
కేళిమైఁ దమకంబుఁ గెరలించి కెరలించి
కళలూర మరుకేళిఁ గలసి కలసి
సొలసి సొలసియుఁ గ్రమ్మఱ ననఁగి పెనఁగి
యొడలి బడలిక వాయ నయ్యువిద సేయు
నంగసంవాహనంబున కలరి యలరి
కడపె నా రాత్రి సుఖితుఁడై కౌశికుండు. " 141ప. 2ఆ.

ఇది కణ్వమహర్షి ఆశ్రమబాలిక ప్రియంవద దుష్యంతమహారాజునకు వివరించిన మేనకావిశ్వామిత్రశృంగారము. మేనక కూడ ఇట్లు వివరింపదేమో!

శకుంతల సాభిప్రాయప్రకటనము :

"చేసితి మీ కవజ్ఞ నృపసింహమ! సైరణ సేతురేని మీ
చేసిన యాజ్ఞలో మెలఁగి చిత్తము రా నడతున్ ప్రసన్నవీ
క్షాసుముఖంబుగాఁ గదలి చయ్యన రాఁదగుఁ బర్ణశాలకున్
నా సఖు లేనుఁ గూడి భవనంబున నిచ్చెద మర్ఘ్యపాద్యముల్ " 62ప. 2ఆ.

"యాస్యత్యద్యశకుంతలేతి " శ్లోకమునకు ఆంధ్రీకరణమిది :

"కనుఁగవ బాష్పపూరములు గ్రమ్మెడు గద్గదఖిన్నమై యెలుం
గనువున రాదు సూ హృదయ మాకుల మయ్యెడు మేను మ్రాన్పడుం
బెనిచిన వారి కింత వగఁ బిమ్మటి గ్రమ్మెడు కన్నవారలుం
దనయను బంప లేక పరితాపభరంబున నెట్లు సైతురో." 102ప. 3ఆ.

శకుంతలాపరిణయమునందు పుర (4-10ప. 1ఆ.) నాయక (11-14వచ. 1ఆ; 22-27ప. 1ఆ; 51-56ప. 2ఆ.)ఋుతు (30-45ప. 1ఆ; 70-76ప. 1ఆ.) వేట (53-68ప. 1ఆ.) ఉద్యానవన (76-81ప. 1ఆ.)ఆశ్రమ (82-86ప. 1ఆ.) నాయికా (7-17ప. 2ఆ.) వనకేళి (165,166ప. 2ఆ.) జలకేళి (167-172ప. 2ఆ.) మన్మథపూజ (174-180ప. 2ఆ.) నాయికావిరహ (183-185, 219-228ప. 2ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (187-196ప. 2ఆ; 54-58ప. 2ఆ.) మన్మథాద్యుపాలంభ (198-218ప. 2ఆ.) నాయకవిరహ (3-9ప. 3ఆ.) రతి (47-52ప. 2ఆ.) వర్ణనలు కలవు.

**పూసపాటి వేంకటపతిరాజు** : ఇతని కృతి ఉషాభ్యుదయము. అసమగ్రముగ లభించినది. అముద్రితము. రామతీర్థములోని సీతారాములకు అంకితము. దైవాంకితము. ఇతని కాలము[162] 1669-1720. కాఁబట్టి ఉషాభ్యుదయము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును.

ఉషాభ్యుదయములోని ఇతివృత్తము ఉషాపరిణయమే.

**పోతులూరి వీరబ్రహ్మము** : ఇతని కృతి కాలజ్ఞానము. శాస్త్రగ్రంథము. ఇతని కాలము 1608-1693 అని పరిశోధకాభిప్రాయము[163]. కాని, వంశవృక్షమునకు[164] అను

కూలము కాదు. ఇతని కాలము 1608-1693 అయిన, ఇతని ఆరవసంతానము వీరనారాయణమ్మ కాలము 1653-1738, ఈమె కుమారుడు పెద్దగోవిందయ్య కాలము 1683-1768, ఇతని రెండవ కుమారుడు వేంకటాద్రి కాలము 1715-1800, ఇతని నాల్గవ కుమారుడు గోవిందయ్య కాలము 1755-1840, ఇతని జ్యేష్ఠకుమారుడు వేంకటేశ్వరస్వామి కాలము 1785-1870 అగును. కాని వేంకటేశ్వరస్వామి అవసానకాలము 1932 వ సంవత్సరము[165] 1932-1870 = 62 సంవత్సరముల అంతరము కలదు. అసంగతము. వీరబ్రహ్మము కాలము 1668-1753 అయిన, వీరనారాయణమ్మ కాలము 1713-1798, పెద్దగోవిందయ్య కాలము 1743-1828, వేంకటాద్రి కాలము 1775-1860, గోవిందయ్య కాలము 1815-1900, వేంకటేశ్వరస్వామి కాలము 1845-1930 అగును. 1932-1930 = 2 సంవత్సరముల అంతరము కలదు. సుసంగతము. కాఁబట్టి కాలజ్ఞానము రచనాకాలము 1700-1752 కావచ్చును.

కాలజ్ఞానమునందు వచనకాలజ్ఞానము, ద్విపదకాలజ్ఞానము, కాలజ్ఞానసౌజన్య పత్రికలు, జీవైక్యబోధకాలజ్ఞానము, సిద్ధబోధము, కాళికాంబపద్యములు, తత్త్వములు కలవు. సిద్ధబోధము శతకప్రాయము, ఏబదియైదు పద్యములు కలవు. "సిద్ధా!" అని మకుటము. శిష్యుడు దూదేకుల సిద్ధయ్యకు సంబుద్ధి అని ప్రసిద్ధి. యోగసిద్ధి సిద్ధబోధము. కాళికాంబపద్యములు ద్విశతి. రెండు వందలు పైగా కలవు. కొన్ని "కాళీ" అను మకుటము కల కందపద్యములు. మఱి కొన్ని "కాళికాంబ హంస కాళికాంబ" అను మకుటము కల ఆటవెలదిపద్యములు. ఇందు భక్తిజ్ఞానవైరాగ్యమార్గముల ఉపదేశము, సాంఘిక దురాచారముల ఖండనము కలదు. వేమన ప్రభావము అధికము. అంతేకాదు. ఒక తత్త్వమునందు వేమన తత్త్వము గుఱించి కలదు.

"తన్ను తాను తెలిసియున్న సంగతి
వేమన్న పద్యములోని భావము
కన్న గురువుల చేత మరి తా వినన్
పురుషుడు నాటి కొక్కఁడు. " 24త.

# ఇతరకవులు

## పదునెన్మిదవశతాబ్ది

**కుమారధూర్జటి** : ఇతని కృతులు 1. సావిత్రీచరిత్రము. అనుపలబ్ధము. 2. ఇందుమతీపరిణయము. 3. కృష్ణరాయవిజయము. ఇందుమతీపరిణయము నూజివీడు సంస్థానాధిపతి - విజయాప్పారావు పౌత్రుడు - నారసింహాప్పారావునకు అంకితము. అతనికాలము[166] 1698-1735 కృష్ణరాయవిజయము శ్రీరామాంకితము. దైవాంకితము. కృతిప్రేరకుడు ఆరవీటి చిన వేంకటపతిరాయలు. అతడు విజయనగరసామ్రాజ్యాధిపతి మూడవ శ్రీరంగరాయల (1642-78/80) తమ్ముడు వేంకటపతి మనుమడు. కోదండరామరాయల కుమారుడు. కోదండరామరాయలు నామమాత్రావశిష్టమైన విజయనగరసామ్రాజ్యసింహాసనమునకు వారసుడు (1680) అతని కుమారుడు చిన వేంకటపతిరాయల కాలము 1705, 1710 ప్రాంతమగును. కాఁబట్టి సావిత్రీచరిత్రము రచనాకాలము 1701 ప్రాంతము, ఇందుమతీపరిణయము రచనాకాలము 1705 ప్రాంతము, కృష్ణరాయవిజయము రచనాకాలము 1710 ప్రాంతము కావచ్చును.

కాని, ఇందుకు ఒక బాధకము కలదు. చిన వేంకటపతిరాయలు "ధూర్జటి పౌత్రుని" పిలిపించి (23ప. 1ఆ.) అనగా కుమారధూర్జటిని పిలిపించి,

> "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో
> యతులితమాధురీమహిమ నా మును మీ పెదతాత చాల స
> న్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభన్ విను మీవు నట్ల మ
> త్కృతబహుమానవైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్." 29ప. 1ఆ.

అన్నట్లు కృష్ణరాయవిజయమునందు కలదు. "పౌత్త్రుఁడు" వంశీయుడును కావచ్చును. నిర్బాధకము. "పెదతాత" తాత అన్న అగును. శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ కవి ధూర్జటి. అంతేకాదు. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో యతులితమాధురీమహిమ" అను సంప్రశ్నము శ్రీకృష్ణదేవరాయల సంప్రశ్నమే. కావున కుమారధూర్జటి కాలము పదునాఱవశతాబ్ది ఉత్తరార్ధమే కావలయును. ఇది బాధకము. కాని ఆ కాలమునందు నూజివీటి నారసింహాప్పారావు లేడు. ఆరవీటి చిన వేంకటపతి రాయలు లేడు. కనుక "పెదతాత" తాత అన్న కాడు. కావున పెద్ద అయిన తాత పెద్దతాత, పెదతాత కావలయును.

ఇందుమతీపరిణయమునందు ఆశ్వాసాంతగద్యను "ధూర్జటిపౌత్ర" అని కలదుగాని, అవతారికను "వంశాబ్ధిచంద్రుఁ" డనియే కలదు. (13ప. 1ఆ.) కావున అష్టదిగ్గజకవి ధూర్జటికి, కుమారధూర్జటి వంశీయు డగును.

**ఇందుమతీపరిణయము** : ఇది "కాళిదాసకృతమగు రఘువంశము ౫ - ౭ సర్గముల యందలి కథ ననుసరించి కొంచెము విస్తరించి . . . రచించెనని ఒక అభిప్రాయము కలదు[167]. కథానుసరణమే గాని, కవిత్వానుసరణము కాదు. అంతేకాదు.

ఇత:పూర్వమే తెనాలి రామభద్రుని ఇందుమతీపరిణయము కలదు. అందు రఘువంశములోని షష్ఠ సప్తమసర్గలలోని కాళిదాసు శ్లోకములకు స్వతంత్రాంధ్రీకరణము, స్వతంత్రానుసరణము కలదని పూర్వోక్తము[168]. ఇది స్వతంత్రాంధ్రీకరణము కాదు. స్వతంత్రానుసరణముకాదు. స్వతంత్రరచనమే.

ప్రథమాశ్వాసమునందు రఘుమహారాజు చరిత్రము సంగ్రహముగ కలదు. (158-202) ద్వితీయాశ్వాసమునందు అజమహారాజు జన్మవృత్తాంతము, శైశవము, యౌవనము, యౌవరాజ్యపట్టాభిషేకము, మృగయావినోదము, కీర్తి కలవు. (3, 72) ఆకీర్తిని విదర్భరాజు భోజుడు అంత:పురమునందు చెప్పిన, అతని సోదరి ఇందుమతి అజమహారాజును వివాహమాడగోరును. (73-74) స్వప్నమునందు అజుని చూచి విచారించును. (76-80)

"కలలోఁ జూచిన నృపునిన్
గలయుదు నేననిన వట్టి కాంక్షయ గాదే
జలబింబితవృక్షస్థిత
ఫల మాస్వాదింప వాంఛ పడినట్లు గదా" 79ప. 2ఆ.

అయినను సునంద ఆదేశమున, శివశర్మ అను విప్రుని రాయబారిగ పంపును. (81-110) అతడు రాయబారము సేయును. (111-184) అందు శివశర్మ సాకేతపురవర్ణన, అజమహారాజు కొలువు కూటము వర్ణన కలవు.

"గద్దియ డిగ్గుచో గళముకు బంగరు రత్న
గండపెండేరంబు ఘల్లుమనఁగ
పావర నైముచో భామాకరాంచన్మ
ణికంకణాళి ఘణిల్లురనఁగ
పాదుకల్ మెట్టుచోఁ బట్టువేత్రధరసౌవి
దల్లసాహోద్వనుల్ ఘొల్లురనఁగ
సిగ వేగ జారుచోఁ జికిలి సంపఁగిపూల
జల్లు తేనియ పెల్లు చిల్లుమనఁగ" 123ప. 2ఆ.

అజమహారాజు అతిథిసత్కారము. ఇందుమతి కవయిత్రి. వీణావాదనప్రవీణ.

"రుచిరతరార్థగుంఫనము రూఢిఁ దగన్ మకరందమాధురీ
విచికిలసారభప్రతిభ విస్తరిలన్ ధ్వనియౌనలంక్రియా
ప్రచయ మెలర్ప నిందుమతి బంధురధార చెలంగ సాహితీ
రచన యొనర్చు నాతుకవిరాజమణుల్ తన వాక్కు లెన్నఁగన్. " 145ప. 2ఆ.

"పాణిప్రవాళసంభరితప్రవాళమై
నఖరుచుల్ తంత్రుల నాట్యమాడ
అనురాగమొనరఁ దాననురాగమునఁగాక
కెమ్మోవిరాగమ్ము గీలుకొలుప
శ్రుతులు తానొనర గూర్చుటెగాక కనుదోయి
చూపులు బెళ్కుచు శ్రుతులనంట
తాళగతుల నేర్పు దలఁ జూపుటయెగాక
తాళవృత్తత కుచద్వయము దాల్ప

వాణి చందాన నా నటత్పాణికటక
చటులకంకణగణఘనస్వన మెసంగ
వివిధమృదుతానతానప్రవీణ యగుచు
వీణె వాయించు నెలనాగ వేడు కలర. " 189ప. 2ఆ.

శివశర్మ ఇందుమతి చిత్రమును అప్పటి కప్పుడు రచించి, అజమహారాజునకు చూపుట అపూర్వము.

"తాళఁగఁ జాలవేని వనితామణిఁ జూపెదఁ జూడుమంచుఁ గ్రొ
మ్మేలిమి పల్కపైఁ దళుకు మించఁ దదాకృతి వ్రాసి చూప రా
చూలి మహాద్భుతం బెనయఁ జూచి ముదం బెసఁగన్ సుగంధతాం
బూలదుకూలదివ్యమణిభూష లొసంగెను విప్రమౌళికిన్. " 183ప. 2ఆ.

చిత్రపటమునుబట్టి అజమహారాజు ఇందుమతీవర్ణనము సేయుట (184-220) ఇతోధికవిశేషము.

తృతీయాశ్వాసమునందు ఇందుమతీవిరహము (3-26;66-92) వనకేళి (27-52) జలకేళి (53-63) గ్రీష్మ, వర్ష, శరదృతువర్ణనములు కలవు. (93-114) శరదృతు వర్ణనమునందు భారతము కలదు.

"కలితగాంగేయమహిమంబు కలశజోద
యప్రభావము పాండుపక్షాధికతయు
ధార్తరాష్ట్రాభివృద్ధియుఁ దనర జగతి
శరదృతువు మించె భారతసమితి గాంచి " 114ప. 3ఆ.

చతుర్థాశ్వాసమునందు శివశర్మ తిరిగివచ్చి రాయబారము విశేషములు చెప్పుట, అజమహారాజును అభివర్ణించుట కలవు. (3-24) అంతేకాదు. సూర్యాస్తమయాదిచంద్రికా విలాసపర్యంతవర్ణనము (28-37) మఱల ఇందుమతీవిరహవర్ణనము (37-64) చంద్రాస్త మయాదిసూర్యోదయపర్యంతవర్ణనము (65-71) కలవు.

పంచమాశ్వాసమునందు స్వయంవరము కలదు. స్వయంవరమును చూచుటకు వచ్చిన వారిలో వెలవెలందులును కలరు.

"జిలుగు కాటుకరేఖ జిగి కన్నుఁగవ డాలు
కర్ణలక్ష్మికి నల్లగల్వ లొసఁగ
నుదుటి కస్తురిచుక్క యుదుటి నిద్దపునిగల్
రంగు ముంగురులతో రహిఁ జెలంగ
చిఱునవ్వు వెన్నెలల్ చిందు చెక్కులయందు
బెళుకు కమ్మలదోయి తళుకు లెసఁగ
గుబ్బ కుంకుమపూఁత నిబ్బరంపు మెఱుంగు
వలిపె చెంగావి పైటల మెలంగ
శేత లతకూన లౌట మిళిందలేఖ
లంటినా నీలకాంతిచే నతిశయింప
మడిమ లానిన సోగ కీల్ జడలు మెఱయ
వెలవెలఁదు లందు వచ్చి రప్పేటి కపుడు. " 64ప. 5ఆ.

ఇందుమతి స్వయంవరస్థలికి పల్లకిలో వచ్చినపుడు, వందిమాగధకీర్తనలు, వేత్ర

ధరుల బరాబరులు, మృదంగరావములుతోపాటు వారాంగనల నృత్యమును కలదు.

"వందిమాగధకీర్తనల్ గ్రందుకొనఁగ
వివిధమర్దళతాళనవీరరవము
నెరయ వారాంగనాతతుల్ నృత్యమాడ
ప్రబలి వేత్రధరుల్ బరాబరులు సేయ" 104ప. 5ఆ.

అజమహారాజు చండతరాస్త్రమునకు ప్రియంవదుడను గంధర్వుని శాపవిమోచనము (28-52) నాయకోత్కర్షాపాదకమైన పిట్టకథ.

షష్ఠాశ్వాసమునందు అజేందుమతుల వివాహము, అయోధ్యాప్రయాణము, స్వయంవరపరాజితుల యుద్ధపరాజయము, పురప్రవేశము, శోభనము కలవు.

మొత్తము మీద కుమారధూర్జటి ఇందుమతీపరిణయము సగటు శృంగారప్రబంధము.

"దాక్షిణాత్యకవుల ద్రాక్షేక్షుమధురస
మాధురీధురీణమహితదివ్య
భవ్యకావ్యనవ్యపటువాక్చమత్కార
పటిమఁ దనరినట్టి ప్రౌఢు లండ్రు. 32
-ధారాదికాలంక్రియార్ణమార్ద
వాంచితరసధ్వనుల్ మెచ్చనగు ప్రబంధ
మలర నొనరింపు ధూర్జటి (కులపయోధి
చంద్ర! శ్రీమత్కుమార) ధూర్జటికవీంద్ర " 33ప. 1ఆ.

అని కృతిభర్త ఆదేశము. కృతికర్త నిర్దేశమిది:

"ప్రతిపద్యచమత్కృతితో
నతిహృద్యం బది యటంచు నఖిలకవీంద్రుల్
మతిఁ జొక్కలీల వినఁగాఁ
గృతి సద్యశ మలరఁ జేయఁ గృతనిశ్చయతన్ "

**కృష్ణరాయవిజయము** :- ఇది రాయవాచకము వచనగ్రంథమునకు పద్యగద్యకావ్యరూపాంతరీకరణము. రాయవాచకములోని ఉదాహృతపద్యములును ఇందు పద్యాంతరములయినవి.

"వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల " 13, 14 పు.రా.వా.
"బోటి జూదంబు పానంబు వేట జనుట
తిట్టుట యహేతువుగను దండించ దలచు
టౌచితిఁ దొఱంగి యనుచితంబైన వ్యయము
సేయుటయు నివి వ్యసనము ల్సాయ వలయు " 54ప. 2ఆ. కృ.రా.వి.

రూపాంతరీకరణమునందు మార్పులు, చేర్పులు, జార్పులు కలవు. రాయవాచకమునందు లేని వర్ణనలు కృష్ణరాయవిజయమునందు కలవు. అవి:

పుర (43-56వచ. 1ఆ.) రాజ (57, 58ప. 1ఆ.) శైవ, వైష్ణవ (2-6ప. 2ఆ.) విష్ణు

(21ప. 2ఆ.) నదీ (26ప. 2ఆ.) స్థల (29, 31, 127ప. 2ఆ.) నాయికా (22, 56-65ప. 4ఆ.) వసంతర్తు (41-46ప. 4ఆ.) వనకేళి (47-55ప. 4ఆ.) జలకేళి (66-67ప. 4ఆ.) మన్మథపూజ (68-69ప. 4ఆ.) వైవాహికోత్సవ (73-78ప. 4ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (80-82; 101-105ప. 4ఆ.) మన్మథాద్యుపాలంభ (83-97ప. 4ఆ.) వివాహ (108-128ప. 4ఆ.)రతి (129-137ప. 4ఆ.) వర్ణనలు.

యుద్ధవర్ణనలు అందును, ఇందును కలవు. అవి చరిత్రకు అనుగతములు. కడమ వర్ణనలు కావ్యలక్షణాకాంక్షితములు.

**ప్రభంజనము అహోబలపతి** : అసలు పేరు గాలి ఓబయ్య లేక గాలి నరసయ్య అగును. గీర్వాణము ముదిరి ప్రభంజనము అహోబలపతి అని, వాతూలము అహోబలపతి అని స్వయంవ్యవహృతుడు. ఇతని కృతులు 1. కవి శిరోభూషణము. (అహోబలపండితీయము) 2. కాళిందీకన్యాపరిణయము. మొదటిది వ్యాకరణశాస్త్రము. నిరంకితము. రెండవది కావ్యము శ్రీరామాంకితము. దైవాంకితము. ఇతని చిన మేనమామ పోలూరి ఓబరాజు కుమారుడు శ్రీరామచంద్రుడు కవిశిరోభూషణము తాళపత్రగ్రంథమును సర్వజిన్నామసంవత్సరఫాల్గుణశుక్లతృతీయా(తదియ) శుక్రవారము నాడు, అనగా 13-2-1708 తేదీని లిఖించినట్లు కలదు[169]. అహోబలపండితీయమునందు అప్పకవీయము ప్రసక్తి బహుధా కలదు. అప్పకవీయము రచనాకాలము 1656 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి కాళిందీకన్యాపరిణయము రచనాకాలము 1710 ప్రాంతము కావచ్చును.

ఒక వ్యాకరణపండితుడు అధర్వణాచార్యులు రచించిన భారతము - ఉదాహృత పద్యములు వినా - లభింపలేదు. మఱొక వ్యాకరణపండితుడు అహోబలపతి రచించిన కాళిందీకన్యాపరిణయము లభించినది. రెండు భాగములుగ ముద్రితము. ఇతడు పూర్వక విస్తుతియందు పాణినిని, పతంజలిని స్తుతించుట విశేషము. అంతేకాదు. వాల్మీకివ్యాసకాళిదాసాదిసంస్కృతకవులను, కవిత్రయాద్యాంధ్రకవులను మాత్రమేగాక, సమకాలికకవులను సహితము సన్నుతించుట ఇతోధికవిశేషము.

> "అప్పటి వారలే నుతుల కర్హు లనర్హులు సన్నుతింపఁగా
> నిప్పటి వారలన్న నది యెంతటిమాట యఖండపాండితుల్
> దప్పని కారణంబులగుఁ దద్భుజనంబున కంచు నెంచి నే
> నిప్పటి పండితోత్తముల నెంతు నిరంతరభక్తియుక్తతన్. "  28ప. 1ఆ.

పండితోత్తములు సుకవులు. కాకవులను గూడ కాదనఁ గూడ దనుటకు కారణ మిది :

> " వైదుషి లేకయే కవిత వచ్చు నటంచు వచించు వారలం
> గాదనఁగూడ దెట్లనినఁ గాకవి పల్కెడు శాస్త్రవాగ్విసం
> వాదిదురుక్తుల న్వినఁగఁ బండితమౌళికి మోముదామరం
> బ్రోదిగ నవ్వుఁదేనియులు పుట్టును రూపక మంగితం గొనన్. "  38ప. 1ఆ.

కాళిందీకన్యాపరిణయము కాళిందీకృష్ణుల పరిణయము. ఇది పోతన భాగవతమునందు "కృష్ణుండు . . . . . . ఒక్క దినంబునందు శుభలగ్నంబునం గాళిందిం బెండ్లియయ్యె"నని ఒక్కవాక్యమునందు కలదు. (124వచ. ద.స్కం.ఉ.భా.) అది ప్రత్యేకమొక ప్రబంధమైనది. నారదుడు సూర్యుని తనయ కాళిందికి కృష్ణుడు తగిన వరుడని

చెప్పుట; కృష్ణలాలసయైన కాళింది తన వేదన నీలవేణికి తెలుపుట; నీలవేణి కాళింది తల్లి ఛాయాదేవికి సమాచార మందఁజేయుట; కాళింది విరహమును శుకవాణి నీలవేణికి వివరించుట; సఖీసమేతముగ; కాళింది ఉద్యానవనము చేరుట; సఖీజనులు శీతలోప చారములు సేయుట; సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతప్రకృతివర్ణన; చంద్ర, మన్మథ, మారుత, శుక, కోకిలాద్యుపాలంభములు; సూర్యోదయవర్ణన, కాళింది అవస్థ చెలికత్తె సూర్యునికి నివేదించుట ప్రథమభాగము.

కథ సామాన్యము. కవిత ధీమాన్యము. హర్షనైషధము విద్వదౌషధమైన, అహోబలపతి కాళిందీకన్యాపరిణయము పండితమరీచకషాయము.

గురుస్తుతియందు వేదవాక్కు :

"మోహం బార హృదంబుజాంతరములో ముమ్మాటికిం గొల్చెద
న్మోహాదిప్రతిషిద్ధదోషగుణసమ్మూర్చానిరాసక్రియా
సాహిత్యప్రతిపన్నచిద్రసరుచీసంబంధకృన్మానసున్
"సాహిత్రమృతాసతా" మితి వచస్సంపాదితశ్రీయుతున్
సాహిత్యాంబుధిపారగు న్సకలశాస్త్రజ్ఞు న్గురు న్మాధవున్. " 32ప. 1ఆ.

అంధకారవర్ణనమునందు వేదాంతవిషయము :

"నే ననిర్వచనీయనిజరూపమగు చనా
దిత మెలంగుచుఁ దత్త్వధీ నడంచి
వెలయు నవిద్యనై మెలఁగెద మచ్చబ
లతఁ గాంచి యే యాత్మ బ్రహ్మ మయ్యె
నటుగాన నాయందు నమరు కారణలక్ష
ణం బతివ్యాప్తిదుష్టంబు గాదు
బ్రహ్మవిద్య యటంచు బలవత్ప్రమాణంబు
మతి గుహాశయత బ్రహ్మంబు నేన
యఖిలమును నాదు రూపంబు ననుసరించి
నిలుచునో లేదొ చూడుఁడీ నిఖిలజనము
లనెడి వైఖరి రోదసు లాక్రమించి,
యంధతమసంబు వరఁగె భయంబు వెరుఁగ " 279ప. 1ఆ.

ప్రభాతవర్ణనమునందు సంస్కృతవ్యాకరణము :

"ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీయుక్తంబు గావింపుచున్
జోకన్ హ్రస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్మాటిగా
వ్యాకర్తౌ ముని మధ్యచస్సరణి నుత్వం బచ్చట న్మానమం
చూకారాకృతి త్రిప్రకారముగ వ్రేయుం గాలవిద్వాంసముల్. 132ప. 3ఆ.

విరహనివేదనమునందు ప్రాకృతవర్ణనము :

"ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో
వికృతి యిద్ది వింత వెలఁది యందుఁ
బ్రకృతి నడఁచి వికృతి ప్రబలమై కనుపట్టె
నఖిలగుణసనాథ యబ్జనాథ! " 162ప. 3ఆ.

పురవర్ణనమునందు అలంకారశాస్త్రము :

"ప్రకటౌదార్యవిశేషకాంతిసమతార్థవ్యక్తిసౌశబ్దరూ
పకసారాధికచిత్రచిత్రలిపిసంబంధంబు శ్రీకృష్ణనా
యకవైశిష్ట్యనితాంతభాసురమునై యప్పట్టణం బొప్పుఁ దా
నకలంకుల్ (ముదమ)ంద సత్కవితఁ గావ్యంబుం బలెం జూడఁగన్. " 57ప. 1ఆ.
"తలఁపగ నర్థవాచకపదంబుల గౌణత గాంచె దాతలం
బలుకు పదంబు లొప్పె మముఁ బల్కెడి శబ్దములందు గౌణతన్
మెలఁగు నటన్న మేము మది మెత్తుమె వ్యత్యయమైనఁగాక యం
చలరుదు రందు దాతృమణు లద్భుతవస్తువితీర్ణసంపదన్. " 91ప. 1ఆ.

వనవర్ణనమునందు కావ్యము :

"నవరసఫలరుచితోషిత
కవిరాజము సుప్రసాదఘటితము నగుచున్
ధవళాక్షి సమ్మతం బగు
కవిసత్కృతిఁ బోలు కేలికానన మొందెన్. " 150ప. 2ఆ.

గృహవర్ణనమునందు నాటకము :

"రమణీయనాయకరత్నబంధూరంబు
నవవిధవస్తువైభవయుతంబు
శ్రీకరాంకాంచత్పతాకాభిరామంబు
నురుమంగళార్థపదోజ్జ్వలంబు
దీవ్యత్రపంచసంధిప్రౌఢిలసితంబు
నీహామృగాభిదావగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తిమహితంబు
మధురవాక్కవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగణోజ్జీవితంబు
నద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తదోష
పాటనంబును నగు చొప్పి నాటకంబు
క్రియఁ బ్రకాశించు నొక దివ్యగృహ మొనర్చి. " 193ప. 3ఆ.

వనవర్ణనమునందుకావ్యముతోపాటు న్యాయమీమాంసావ్యాకరణశాస్త్రములు :

"గుణవృద్ధిపదవృద్ధగోత్రవిఖ్యాతమై
పాణిని గ్రంథంబు పటిమఁ గాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణ మౌచు
నక్షపాదీయంబు ననుకరించి
కర్మజన్యాపూర్వధర్మప్రకాశమై
జైమిని వ్యాప్యాతిచ్ఛాయఁ బూని
సద్వీక్షణాక్షీణసమ్మోదహేతువై
వ్యాసవాచార్యుటి వన్నె కెక్కి
కవిత నవరసఫలకమై ఘటితమత్త
శిఖిమధువ్రతవిలసితస్ఫీత మగుచు
నసమకవిరాజకావ్యంబు ననుకరించి
చూడ నింపొందు నచటి యా క్రీడవనులు. " 97ప. 1ఆ.

ఇందు శ్లేషాశ్లేషమును కలదు.

నాయకవర్ణనమునందు తెలుగు వ్యాకరణము :

గుణవృద్ధులగుచు రాజిలు
ఫణిరాజశయాను బొమలు పరికించును గా
గుణిగణము వక్రమే యిది,
గణుతింపఁగ వక్రతమమె కా యిది యనుచున్. " 314ప. 1ఆ.

తెలుగు వ్యాకరణములందు ఆంధ్రశబ్దచింతామణి సూత్రగ్రంథప్రాయము. అధర్వణకారికావళి వార్తికాగ్రంథప్రాయము. అహోబలపండితీయము (కవిశిరోమణి) భాష్యగ్రంథప్రాయము. ఆంధ్రశబ్దచింతామణియందు, అధర్వణకారికావళియందు లేని విసంధి విధానము అహోబలపండితీయమునందు కలదు. "సంధ్యభావోఽ పి న దోషాయ." అని కవిశిరోమణి. "అసిద్ధోపమత విసంధితయు గుణతఁ బరఁగె నరిదిగన్." (98ప. 1ఆ.), "మానదువో విసంధితన్" (188ప. 1ఆ.) అని కాళిందీకన్యకాపరిణయమునందు కలదు. అంతేకాదు. విసంధికి లక్ష్యములును కలవు.

" పొరఁగలరు1 అజానితోనైన " 116ప. 1ఆ.
" మంజుపదము1 అల భుజంగప్రయాతము " 225ప. 1ఆ.
" నీవు1 అరసి " 7ప. 3ఆ.

ఇట్టి వింకను గలవు. ఇవి యెల్ల అహోబలపతి వ్యుత్పత్తిప్రదర్శనమునకు నిదర్శనములు.

కృష్ణకర్ణామృతములోని "కస్తూరీతిలకం లలాటఫలకే" అను శ్లోకమునకు అనుసరణము :

"మృదులఫాలమునందు మృగమదంబు ధరించి
తొమ్మనఁ జారురత్నమ్ముఁ బూని
నాసికాగ్రమునందు నవమౌక్తిక మూని
కరముల రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి
నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి
రాణించు పీతాంబరంబు గట్టి "

నెల్లూరి వీరరాఘవయ్య : ఇతని కృతులు 1. విశేషణరామాయణము. 2. కృష్ణభుజగము. 3. కృష్ణలీలామృతము. 4. త్రిపురారిదండకము. 5. స్తంభోద్భవాదిగద్యకావ్యము. 6. రసమంజరి. 7. సర్వలోకేశశతకము. 8. కస్తూరిరంగశతకము. 9. మంత్రపాదస్తవము. 10. వల్లీపరిణయము. 11. ఉత్తరరామచరిత్రవాఖ్యానము. 12. వసుంధరాపరిణయము. 13. యాదవరాఘవపాండవీయము. ఇందు మొదటిది సంస్కృతకావ్యము. కస్తూరిరంగశతకము, వసుంధరాపరిణయము, యాదవరాఘవపాండవీయము మాత్రమే ఉపలబ్ధములు. యాదవరాఘవపాండవీయము ప్రథమముద్రణగ్రంథము తుదిని ఇట్లు కలదు[170].

"కలియుగాబ్దంబులు శాలివాహనశకంబులు అగు హేవళంబి
సంవత్సర ఆషాఢబ వఱకు యాదవరాఘవపాండవీయరచన

నెఱవేతినట్టును, శార్వరివైశాఖ బ॥బుధవారము వఱకు
అమృతకవి రాఘవయ్యచేత వ్రాయబడినట్లు మాయి
ద్ద తాళీదళసంపుటములో వ్రాయఁబడియున్నదది- ''

1635 + 78 = 1713 వ సంవత్సరము. అవతారికయందు వీరరాఘవయ్య తాత కు తాత అయిన కొండన్న "పెద్ద వేంకటపతిరాయల దళవాయి" అని కలదు. (15ప. 1ఆ.) పెద్ద వేంకటపతిరాయలన విజయనగరసామ్రాజ్యాధిపతి రెండవ వేంకటపతి దేవరాయలు. అతని రాజ్యకాలము 1586-1614. అది కొండన్న దళవాయి అయిన కాలము. కొండన్నకు వీరరాఘవయ్యకు నడుమ నాలుగు తరములు కలవు. తరమునకు పాతికసంవత్సరములు పరిగణించిన వీరరాఘవయ్య కవి అగు కాలము 1686-1714 అగును. ఇది యాదవరాఘవపాండవీయము రచనాకాలము 1713 వ సంవత్సరమగుటను సంవదించును.

వీరరాఘవయ్య కుమారుడు శివకామయ్య రచించిన కామకళానిధి అను కామశాస్త్ర గ్రంథము, తంజావూరు మహారాష్ట్రపాలకుడు జయసింహునికి అంకితమని పూర్వోక్తము. అతని రాజ్యకాలము 1736-37. కామకళానిధి రచనాకాలము 1736 వ సంవత్సరము కావచ్చును. తండ్రి వీరరాఘవయ్య కవి అగు కాలము 1680-1714 అయిన, తనయుడు శివకామయ్య కవి అగు కాలము 1705-1739 అగును. ఇది పరస్పరోపబలకము.

యాదవరాఘవపాండవీయమునందు వసుంధరాపరిణయము ప్రసక్తము.

"అలర వసుంధరాపరిణయంబు తదుత్తరభాగకావ్యమున్
వెలయఁగఁ జెప్పినాఁడ నన వేతె మదీయవిధంబు దెల్పఁగా
వలయునె శ్లేషచిత్రముఖవైఖరులన్ రచనాప్రపంచమం
దుల నెవరెట్టు సెప్పినను దోడనె నెవ్వగ నేర్తు నట్టులన్-'' 3ప. 1ఆ.

కాఁబట్టి వసుంధరాపరిణయము రచనాకాలము 1710 ప్రాంతము, యాదవరాఘవ పాండవీయము రచనాకాలము 1713 ప్రాంతము కావచ్చును.

**వసుంధరాపరిణయము** :- ఇది రెండు భాగముల కావ్యము. పూర్వభాగము నాలుగాశ్వాసములు. ఉత్తరభాగము ఒక ఆశ్వాసము. పూర్వభాగము సగము భాగవతప్రసిద్ధమైన వరాహావతారకథ. ఇందు శ్రీకృష్ణస్తవభుజంగప్రయాతవృత్తములు ఇరువదియెనిమిది సంస్కృతశ్లోకములు. (పుటలు 141-142) కడమ సగము పురాణ ప్రసిద్ధము కాని వసుంధరాపరిణయకథ. ఇందు భూదేవి శ్రీమహావిష్ణువును పరిణయ మాడుటకు తపస్సు చేయును. అది సహింపలేక లక్ష్మీదేవి ఆమె తపస్సునకు భంగము కలిగించుటకు దేవతలను నియోగించును. స్త్రీ తపస్సు చెడగొట్టుటకు లక్ష్మీదేవి పురుషుని తపస్సు చెడఁగొట్టుటకు ఇంద్రుడు రంభాద్యప్సరసలను నియోగించునట్లు, స్త్రీతపస్సు చెడగొట్టుటకు లక్ష్మీదేవి జయంతాది దేవతలను నియోగించుట ప్రతికల్పనమేగాని, పాత్రోచితము కాదు. అంతేకాదు. జయంతుని ప్రగల్భములకు లక్ష్మీదేవి మన్మథుని పురిగొల్పిన విధము పురాణసహజమును కాదు.

"పరపురుషాసక్తభావంబు పరపురు
షాసక్తభావంబు నలుపనేని
యత్యనంతవిమోహమత్యాస్తి యత్యనం

తవిమోహమత్యార్తిఁ దార్పనేని
గతతృష్ణకృష్ణవీక్షావృత్తి గతతృష్ణ
కృష్ణవీక్షావృత్తి నెనచనేని
యాత్మభూస్తుతివినోదాత్మార్ద్వనాత్మభూ
స్తుతివినోదాత్మార్ద్వఁ జొనుపనేని
పడఁతి భూధరకులసతిపదవి నుడిపి
పడఁతి భూధరకులసతిపదవి నుడిపి
చేయనేని సకలలోకనాయకసుత
శేఖరుండంచు నెంచుకో సిగ్గులేదె? " 55ప. 3ఆ.

ఇందు జయంతుని సాహంకారప్రాగల్భ్యముతోపాటు, వీరరాఘవయ్య చిత్రకవితా ప్రాగల్భ్యమును కలదు. ఇట్టి జయంతుని ప్రగల్భములకు లక్ష్మీదేవి మన్మథుని పురిగొల్పిన విధమిది :

"ఏంటే దర్పక దర్పధూర్వహతఁ బృథ్వీకాంత మత్కాంతుఁ గే
లంటన్ గెంటని చిత్తవృత్తి నని నద్యాస న్నిదిధ్యాసయై
యుంటన్ గంటిని యింత వింత భవదీయోత్సాహసోత్సాహముల్
కంటం గానదు తుంటవింటిపని చక్కంబెట్టు మిప్పట్టునన్. " 66ప. 3ఆ.

భూదేవికి తపోభంగము కలిగించుటకు జయంతుడు రంభాద్యప్సరసల వలె నాట్యము సేయును. ప్రేమభిక్షను అర్థించును. అంతేకాదు. భూదేవి "పదారవిందములపై నిజహస్తము లుంచి మ్రొ"క్కును. (77-115ప. 3ఆ.) భూదేవి జయంతుని శపించును. తపస్సు నిర్విఘ్నముగా సాగును. బ్రహ్మ ప్రత్యక్ష మగును. బ్రహ్మవాక్కున భూదేవి సత్రాజిత్తునకు సత్యభామగ జన్మించి శ్రీకృష్ణుని వివాహమాడును. (71ప. 4ఆ.)సత్రాజిత్తు వంశవర్ణనము, హార్యభ్యంజనవర్ణనము, హరి బువ్వపువర్ణనమును కలవు.

ఇట్లు వసుంధరాపరిణయము పూర్వభాగమునందు పూర్తి అయినది. అయినను, "వసుంధరాపరిణయంబను నుత్తరభాగంబగు సత్యభామాపరిణయంబను మహా ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన" అని (2వచ. 1ఆ.ఉ.భా.) మఱల కలదు. పూర్వ భాగమునందు కల సత్యభామ జన్మవృత్తాంతము, పూర్వభాగమునందు లేని పుర, రాజ, దౌహృద, పుత్రికోదయ, బాల్య, యౌవనవర్ణనములు కలవు.

సత్యభామ యౌవనవర్ణనముతో ముగిసిన ఆశ్వాసము తుదిని "వసుంధరాపరిణయంబను మహాప్రబంధంబునందు నుత్తరభాగంబునఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము" అని కలదు. "ప్రథమాశ్వాసము" అనుట వలన అసంపూర్ణ మనిపించును. "సంపూర్ణము" అనుట వలన సంపూర్ణ మనిపించును.

**యాదవరాఘవపాండవీయము** :- ఇది త్ర్యర్థికావ్యము. రామకృష్ణార్జున చరిత్రము. (99ప. 4ఆ.) ద్వ్యర్థికావ్యము ద్వికథాసంధానమైన, త్ర్యర్థికావ్యము త్రికథా సంధానము. దశకథాసంధానము చేయగలిగి త్రికథాసంధానమే చేయుట విశేషము.

"అవుననఁ గావ్యపంక్తి పదియర్థములన్ రచియింపనేర్తు స
త్కవుల దయన్ శిరీషకవితామృదుతామహితార్యవైఖరిన్
భువి నటులైన సత్కథల మూఁటి నొనర్తును బాలబోధకై

తివిరి బహుత్వమందు నల త్రిత్వము పర్యవసాన మౌటచేన్. " 31ప. అవ.

రామకృష్ణార్జునుల చరిత్రలు సత్కథలే. మూడు కథల ముప్పేట ముచ్చట గొలుపునదియే. కాని సుబోధము కాదు. అయినను రసప్రబంధమని కవి ఆశయము.

"ఒక చోట శబ్దార్థయుగళచమత్కార
సందర్భగర్భితచతురవృత్తి
యొకవంక నకలంకితోదయధ్వనిముఖ్య
మొకవంక వాచ్యార్థయోగవిభవ
మొకచక్కిఁ జక్కని ప్రకటితశ్లేషోక్తి
యొక చక్కిని సభంగయుతపదాప్తి
యొకదారి పదవాక్యనికరగవ్యంగ్యంబు
నొకదారి బహుళార్థయోగగమ్య
మొకట పూర్వాపరాన్వయయోగగతుల
నొకట నేకార్థవైభవప్రకటయుక్తి
సరసగుణములు విలసిల్ల సరసరీతి
వృత్తుల రసప్రబంధంబు విస్తరింతు. " 32ప. అవ.

అభంగసభంగశ్లేషలు, అర్థశ్లేషలు, అన్వయభేదములు అనేకార్థకావ్యములకు ఆవశ్యకము. శబ్దార్థచమత్కారములు క్వాచిత్కములు. గుణరీతివృత్తులు ఆనుషంగికములు. ధ్వని, రసము మరుమరీచికలు. ద్వ్యర్థికావ్యములందు కథాద్వయసంవిధానము వలె, త్ర్యర్థికావ్యములందు కథాత్రయసంవిధానమే కాంచదగినది.

"రాజగృహ మాది యావరణాజిరములు
దాఁటి ప్రమదజనకరాజతనయకృష్ణ
మృగవిలోచన తత్కాంతమృదులసూక్తిఁ
గాంచ నచట వసించి హర్షించె మదిని. 23ప. 3ఆ.

రాజగృహము యాదవపరముగ భీమకరాజు గృహము. రాఘవపరముగ రావణాసురుని గృహము. పాండుపరముగ విరాటరాజు గృహము. ఆవరణములు = ప్రాకారములు, అజిరములు = ముంగిళ్లు మూడిట సమానము.

ప్రమదజనక = ప్రమోదము కలిగించు, రాజతనయ = భీమకమహారాజు కూతురు, కృష్ణమృగవిలోచన = లేడి కన్నుల వంటి కన్నులు కలది అయిన, తత్కాంత = ఆ రుక్మిణి మృదులసూక్తి = మృదువైన మాటను, కాంచన్ = వినగా అచట = అంతఃపురమునందు, వసించి = ఉండి, కృష్ణుడు మదిని = మనస్సులో, హర్షించెన్ = సంతోషించెను. అని యాదవపరము.

ప్రమద = స్త్రీ, జనకరాజతనయ = జనకమహారాజు కూతురు, కృష్ణమృగవిలోచన = లేడి కన్నుల వంటి కన్నులు కలది, మృదులసూక్తి = మృదువుగా మాటాడునది అయిన తత్కాంతన్ = ఆ సీతను, కాంచన్ = చూడగా, అచట = అశోకవనమునందు వసించి = కొమ్మల మాటున ఉండి, హనుమంతుడు మదిని = మనస్సులో, హర్షించెన్ = సంతోషించెను. అని రాఘవపరము.

ప్రమదజనక = ప్రమోదము కలిగించు, రాజతనయ = ద్రుపదమహారాజు కూతురు,

కృష్ణ = ద్రౌపది, మృగవిలోచన = లేడి కన్నుల వంటి కన్నులు కలది, మృదులసూక్తి = మృదువుగా మాటాడునది అయిన తత్కాంత = ఆ ద్రౌపది, కాంచన్ = ఆశ్రయము నందగా, అచట = సుధేష్ణసమీపమునందు, వసించి = ఉండి, మదిని = మనస్సులో, హర్షించెన్ = సంతోషించెను. అని పాండవపరము.

మూడు కథలకు సమానార్థకములైన కతిపయపద్యములు సుబోధకములు.

"పరమాన్నంబులు పప్పులున్ శిఖరులున్ బచ్చళ్ళు నూర్పిండులున్
బెరుగు న్బాలును నెయ్యి మీఁగడలు జు న్వెన్నల్ రసాలంబులున్
జెఱుకు న్బాల్ కలవంటకాల్ పనసలున్ జీన్కక్కెరల్ పాఁగులున్
వరుగుల్ రేఁగులు ఖండచక్కెరలు నంబళ్ళజ్జులు న్మజ్జిగల్." 42ప. 2ఆ.

ఇంద్రోత్సవ, సీతాకల్యాణ, ద్రౌపదీపరిణయసందర్భములందు సాగిన విందులోని పదార్థములు సమానము.

**కూచిమంచి జగ్గన** : ఇతని కృతులు 1. జానకీపరిణయము. 2. నర్మదా పరిణయము. 3. రాధాకృష్ణదివ్యచరిత్రము. లేక- రాధాకథాసుధానిధానము. 4. సుభద్రా పరిణయము. 5. ఉమాసంహిత. 6. సోమదేవరాజీయము. 7. చంద్రరేఖావిలాపము. 8. దండకములు. 9. బహుశతకములు. 10. గీతప్రబంధములు. 11. ఖడ్గాదిబంధములు 12.రగడలు. 13. గద్యలు. 14. మంజరులు. 15. వృత్తములు. ఇందు సుభద్రాపరిణయము, సోమదేవరాజీయము, చంద్రరేఖావిలాపము, భక్తమందారశతకము మాత్రమే ఉపలబ్ధ ములు. ఇతడు కూచిమంచి తిమ్మన అనుజుడు. అతని కాలము 1680-1765 అని పూర్వోక్తము. కనుక ఇతని కాలము 1685-1770 అగును. భక్తమందారశతకమునందు ఇట్లు కలదు.

"సరసప్రస్తుతకూచిమంచికులభాస్వద్వార్ధిరాకాసుధా
కరుఁడన్ గంగనమంత్రినందనుఁడ రంగత్తిమ్మభూమండలే
శ్వరపర్యార్పితబేబదల్‌బిరుదవిస్ఫారజ్జగన్నాథనా
మరసజ్ఞుండను బ్రోవు మెప్పు నను రామా! భక్తమందారమా!" 101ప.

ఇందలి తిమ్మభూమండలేశ్వరుడు పెద్దాపురసంస్థానాధిపతి వత్సవాయ తిమ్మజగపతి. అతనికాలము[171] 1714-34. చంద్రరేఖావిలాపము చింతలపాటి నీలాద్రిరాజునకు (1722-1794) వికటాంకితము[172]. కాఁబట్టి కృతుల రచనాకాలములు భక్తమందార శతకము 1720 ప్రాంతము, జానకీపరిణయము 1725 ప్రాంతము, నర్మదాపరిణయము 1730 ప్రాంతము, రాధాకృష్ణదివ్యచరిత్రము 1735 ప్రాంతము, సుభద్రాపరిణయము 1740 ప్రాంతము, ఉమాసంహిత 1745 ప్రాంతము, సోమదేవరాజీయము 1750 ప్రాంతము, చంద్రరేఖావిలాపము 1755 ప్రాంతము, తక్కిన కృతులు తదనంతరకాలము కావచ్చును.

**భక్తమందారశతకము** : ఇది శతకము. సరిగా నూఱు పద్యములు కలవు. "రామా! భక్తమందారమా!" అని మకుటము. ఇందు భక్తిపద్యములు అఱువది రెండు, అధిక్షేప పద్యములు ముప్పది యెనిమిది కలవు. అధిక్షేపపద్యములందు రాజులను అధిక్షేపించిన పద్యములు అధికము. అందు కవులను ఆదరింపని రాజులను అధిక్షేపించిన పద్యములు

అయిదు కలవు. అందొకటి :

"లసదుద్యజ్జ్వలభవ్యకావ్యకవితాలంకారవిద్యావిశే
షసమాటోపవిజృంభమాణకవిరాట్సంక్రదనుం ద్రిప్పి త్రి
ప్పి సమీచీనతఁ బ్రోవకుండు నృపతుల్ పెంపేది నిర్భాగ్యులై
మసియై పోవరె తత్క్రుధాగ్ని నిల రామా! భక్తమందారమా! 79ప.

దుష్టనాయకులను అధిక్షేపించిన పద్యము :

"మురుగుల్ ప్రోగులు నుంగరా ల్సరిపిణీ ల్ముక్తామణీహారముల్
తురగంబు ల్గరు లందలంబులు భటస్తోమంబులున్ రాజ్యమున్
స్థిరమంచున్ మది నమ్మి పాపములు వేసేతు ర్మదోన్మత్తపా
మరభూవిష్టపదుష్టనాయకులు రామా! భక్తమందారమా! 85ప.

ప్రారబ్ధమునకు చమత్కారకల్పనము :

"అమరశ్రేష్ఠుని వారువంబునకుఁ దూం డ్లాహార మీశానమౌ
ళిమహాభోగికి గాలి మేఁత; నిను హాళి న్మోయు మాద్యద్విహం
గమలోకేంద్రుని కెల్లఁ బుర్వుగమియే బోనంబు ప్రారబ్ధక
ర్మ మవశ్యంబ భుజింప కెట్ల చను? రామా! భక్తమందారమా! 41ప.

భక్తినివేదనము :

"సకలాభీష్టఫలప్రదాయకుఁడవై చంచద్దయాశాలివై
ప్రకటస్నేహరసార్ద్రమానసుఁడవై భంగీకృతానేకపా
తకఘోరామయశాత్రవోత్కరుఁడవై ధాత్రీసుతం గూడి మా
మకచిత్తాబ్జమునన్ వసింపు మొగి రామా! భక్తమందారమా!" 9ప.

భక్త్యావేదనము :

"నే నీ బంటను నీవు నా దొర విదే నిక్కం బటంచు న్మదిన్
నానాభంగుల నమ్మి కొల్చితినె యెన్నాళ్లాయె జీతంబు కా
సైన న్నేఁటి కొసంగవైతి భళి! యాహా! లెస్స! బాగాయెగా!
మానీంద్రాశయపద్మషట్చరణ! రామా! భక్తమందారమా!" 89ప.

ఇట్టి భక్తిపద్యములను బట్టి భక్తిశతకము; అట్టి అధిక్షేపపద్యములను బట్టి అధిక్షేపశతకము భక్తమందారశతకము.

**సుభద్రాపరిణయము** : ఇది పూరీజగన్నాథస్వామికి అంకితము. దైవాంకితము. ఇందు చేమకూర వేంకటకవి విజయవిలాసములోని ఇతివృత్తమే కలదు. కథాప్రారంభము నందు మాత్రము విశారదుడు ద్వారకానగరమున కేగి, శ్రీకృష్ణసందర్శనము చేసి, ఇంద్ర ప్రస్థమునకు వచ్చి, అర్జునునికి సుభద్ర సౌందర్యమును అభివర్ణించుట, అర్జునుడు మోహమునందుట అధికము. అనంతరకథయందు విజయవిలాసము ప్రభావము కలదు గాని, ప్రతిపద్యచమత్కారము లేదు. జాతివార్తాచమత్కారములు లేవు. నుడికారముల నయగారములు లేవు. అది మేలిమి పసిడి. ఇది కాసు బంగారము.

విజయవిలాసమునందు అర్జునుడు నాగలోకము నుండి వచ్చి, ఆందోళన చెందు ఆప్తపురోహితముఖ్యవర్గమునకు ఒక్క వాక్యములో చెప్పిన సమాధానము (116ప. 1ఆ.) ఇందు విశారదుని నిర్దేశించి ఉలూచి సౌందర్యమును వర్ణించుటగ ఆరు పద్యములందు కలదు. (108-113ప. 2ఆ.) అర్జునుని తీర్థయాత్రలందు, అందులేని సింహాచలయాత్ర

ఇందు వివరముగ ఆరు గద్యపద్యములందు కలదు. (4-9ప. 3ఆ.) విజయవిలాసము నందు చిత్రాంగద వనవిహారము ఒక్క పద్యమునందు మాత్రమే కలదు. ఇందు చిత్రాంగద వన, జలవిహారములు ఇరువది పద్యములందు కలవు. (41-61ప. 3ఆ.) "మామకాగమనవార్త" శ్లేషచమత్కారము లేదు. "మారాకయును దలంచిన పనియు" అని కలదు. (87ప. 3ఆ.) ఇందు సుభద్ర యతివేషధారిని అర్జునుని గుఱించి అడిగి నప్పుడు, యతివేషధారి అయిన అర్జునుడు ముందు నచ్చికబుచ్చికలాడి, తర్వాత అర్జునుడు తానే అని సూచించి, "సైరింపరాని మోహాయత్తచిత్తంబునఁదత్తరింపుచు" పలికిన విధము, ప్రవర్తించిన తీరు, కోరిక తీర్చుమని కోరిన వైఖరి (106-130ప. 4ఆ.) పాత్రోచితముగ లేవు.

"కలకల నవ్వవేమి వగఁ గ్రాలఁగఁ గౌఁగిటఁ గూర్పవేమి యిం
పలరఁగఁ బల్కవేమి యధరామృత మానఁగ నీయవేమి నేఁ
బిలచిన రావదేమి నను బిత్తరి చూపులఁ జూడవేమి హా!
చిలుకల కొల్కి యిట్టు లరఁజేయఁగ నేనొక లాతివాఁడనే" 117ప. 4ఆ.

అకస్మాత్తుగ సుభద్ర చేతిలో చిలుక ఉండుట, అర్జునుడు చిలుకతో సుభద్రను ఒడంబఱుచుమని చెప్పుట, సుభద్ర చిలుకతో న్యాయము కాదని చెప్పుమనుట వింత గొలుపును. అంతేకాదు. పరిణయానంతరము శయ్యామందిరమునందు అర్జునుడు,

"ముప్పిరిఁగొన్న మోహమున మున్న యతీశ్వరరూపమూని సొం
పొప్పు భవద్గృహాంగణనుపోపవనంబున నుండి వేడినన్
గుప్పున కౌగి లీక ననుఁ గొందల మందఁగఁ జేసి యోగి తీ
విప్పు డటుల్ జాడింగి చన నింతయు శక్యము కాదు కోమలీ!" 115ప. 6ఆ.

అని సుభద్రతో అనుట కూడ అంత ఉచితముగ లేదు. ఉదాత్తము కాదు. పదునేడవ శతాబ్ది విజయవిలాసములోని పాటవము, పదునెనిమిదవ శతాబ్ది సుభద్రాపరిణయము నందు పలచఁబడినది.

సుభద్రాపరిణయమునందు పుర (24-43ప. 1ఆ; 56-57ప. 1ఆ.) రాజ (44-49ప. 1ఆ.) సముద్ర (54ప. 1ఆ.) కృష్ణ (60-61, 85-86ప. 1ఆ.) నాయికా (5-29, 82-85, 108-113ప. 2ఆ; 79-84ప. 3ఆ; 41-46ప. 4ఆ.) నాయకవిరహ (31-40ప. 2ఆ; 3-10, 21-22, 79-85ప. 4ఆ; 3-26ప. 5ఆ.) నాయికావిరహ (43-54ప. 2ఆ; 29-95ప. 5ఆ.) నదీ (67ప. 2ఆ.) నాయక (76-79ప. 2ఆ.) నగ (115ప. 2ఆ; 17-18ప. 4ఆ.) క్షేత్ర (117-130ప. 2ఆ; 3-28ప. 3ఆ.) వసంతర్తు (30-39ప. 3ఆ.) వనవిహార (41-48ప. 2ఆ; 102-104ప. 3ఆ.) జలవిహార (49-61ప. 3ఆ.) మన్మథపూజా (63-69ప. 3ఆ.) మధుపాన (70-77ప. 3ఆ.) వర్షర్తు (26-30ప. 4ఆ.) రైవతకోత్సవ (33-39ప. 4ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (60-70, 120-123ప. 5ఆ.) మన్మథాద్యుపాలంభ (73-98ప. 5ఆ.) శిశిరోపచార (110-114ప. 5ఆ.) వివాహ (88-90ప. 3ఆ; 7-60ప. 5ఆ.) యుద్ధ (66-84ప. 6ఆ.) రతి (95-121ప. 6ఆ.) వర్ణనలు కలవు.

**సోమదేవరాజీయము** : ఇది రెండాశ్వాసముల పద్యగద్యోభయగ్రంథము. ఇందు అవతారిక లేదు. ఆశ్వాసాద్యంతపద్యగద్యములు కలవు. "కాకతిరుద్రాన్వయనాకాధి

, పుడు", "మండపాటి నారాయణు"డు అయిన కృష్ణునికి అంకితము. (పు. 69, 71.) దైవాంకితము. ఆశ్వాసాంతగద్యను "సోమదేవరాజీయం బను మహారాజచరిత్రం" బని కలదు. చరిత్రమన వృత్తాంతమే.

ఇందు చరిత్రాంశముల కంటె చరిత్రవిరుద్ధాంశములు బహుళము. ఇందలి పద్యములు ఉదాహృతములైన ప్రతాపరుద్రచరిత్రము కంటె నయము "ఎరుకు దేవ రాజు" విజయనగరంబుపై నేగి . . . వీరనృసింహరాయలను . . . "గెల్చి"నట్లు కలదు. (పు. 48) ఇతని కుమారుడు భువనైకమల్లుడు వీరనరసింహరాయల అనుజ రంగమదేవిని వివాహమాడినట్లు కలదు. (పు. 51) అతని కుమారుడు త్రిభువనైకమల్లుడు "కాకతిదేవి వరమున సుతుని నొకని గాంచి కాకతిరాజనెడి నామమిడి"నట్లు కలదు. (పు. 57) ఈ కాకతిరాజు వంశపరంపరయే కాకతీయరాజులు!

గణపతిదేవుడు తిక్కనసోమయాజిచే,

" . . . . . .  . . . .  . . . . భారతా
ర్థమును ద్వైతాద్వైతతత్త్వములును
విశ్రుతచిదచిద్వివేకలక్షణములుఁ
బ్రకటధర్మాధర్మపద్ధతులును
రాజనీతిప్రకారంబును భారత
వీరుల మహిమంబు- "

విన్నట్లు కలదు. (పు. 78) ప్రతాపరుద్రుని కొలువునందు "హుళక్కిభాస్కరుండు మొదలగు ప్రబంధకవీశ్వరు లిన్నూఱుగురు" ఉన్నట్లు కలదు (పు. 121) కాని మొల్ల ప్రసక్తి కాని, కృష్ణమాచార్యుల ప్రశక్తి గాని లేదు. మాచలదేవి మాట లేదుగాని, "భరతకథల అప్పాదేవి" బిరుదపాత్రగ కలదు. (పు. 122) శరభాంకుడు, మల్లికార్జునుడు, పాలకుర్తి సూరప్ప "ప్రధానవర్గంబు"లోనివారుగా కలరు. (పు. 123) ప్రతాపరుద్రుడు "ఢిల్లీశ్వరుఁడు తన కెదురు వనుచు కానుకల గొని" నట్లు (పు. 109) కలదుగాని, ప్రతాపరుద్రుని ఢిల్లీ సుల్తాను పట్టుకొని పోయినట్లు లేదు!

సోమదేవరాజీయము పద్యగద్యోభయగ్రంథము- సిద్దేశ్వరచరిత్రము ద్విపద గ్రంథము. ప్రతాపరుద్రచరిత్రము (ఏకశిలానగరవృత్తాంతము) వచనగ్రంథము. అందు సోమదేవరాజీయములోని పద్యములు ఉదాహరింపబడినవి. కావున సోమదేవరాజీయము మూలము కావలయును.

**చంద్రరేఖావిలాపము** : ఇది హాస్యప్రబంధమని కవి ఆంతర్యము కాని అపహాస్యప్ర బంధము. ఇందు బూతు కవిత్వము కలదు. తిట్టు కవిత్వము కలదు. వికటకవిత్వము కలదు. హేయకవిత్వము కలదు. హేళనకవిత్వము కలదు. అయినను ' పేరడీ' అని, సెటైరని సంఘదురాచారతిరస్కారప్రతిపాదకమని, 'ప్రబంధయుగపు పాత చింతకాయ పచ్చడి' మీద పదింతలు ప్రతిచర్య అని కొందఱి అభిప్రాయములు కలవు. కాని, ఇదెంత మాత్రము ' పేరడీ 'కాదు. 'సెటైర్' అంతకంటె కాదు. సంఘదురాచారతిరస్కారప్రతి పాదకమును కాదు. వ్యక్తిగతద్వేషపురస్కారప్రతిపాదకము ' ప్రబంధయుగపు పాత చింత కాయ పచ్చడి' మీద పదింతలు కాదు సరికదా ఒకింత కూడ ప్రతిచర్య కాదు. చింతల పాటి నీలాద్రిరాజు కృతి స్వీకరించి, భృతి కల్పించిన- చంద్రరేఖావిలాసము ' ప్రబంధయు

గపు పాత చింతకాయ పచ్చడిగ లభించెడిది! సుభద్రాపరిణయము 'ప్రబంధయుగపు పాత చింతకాయ పచ్చడి'యే. అశ్లీల మందే కలదు. (76ప. 3ఆ.) చంద్రరేఖా విలాసముకృతి స్వీకరించని చింతలపాటి నీలాద్రిరాజు మీద, అందుకు కారణమైన అణివెళ్ల వేంకటశాస్త్రి అను సంస్కృతకవిమీద పదింతలు కాదు; వేయింతలు ప్రతీకారచర్య.

"శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁడ
స్తోకాటోపబలప్రతాపపురరక్షోదక్షసంశిక్షణుం
డాకాశోజ్జ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు తా
మీఁకం జింతలపాటి నీలనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్." 1ప. 1ఆ.

ఇది మంగళాశాసనము కాదు. చింతలపాటి నీలాద్రిరాజు కాలి, మసి, కావలెనని కసితో కూడిన "శాపనార్థము". తిట్టు. చింతలపాటి నీలాద్రిరాజును చీమలకొండ సింహాద్రి రాజని, వేంకటశాస్త్రిని సంకరమనీషి అని, వెంకటసానిని కొంకిరిసాని అని మార్చి; అశ్లీల, అసభ్య, జుగుప్సావహవర్ణనలను తొలగించి ప్రకటించినంత మాత్రమున పంకము పన్నీరు కాదు. అట్లు ప్రకటించుటయే అనర్థకము. అంతకంటె ప్రకటింపకుండుట శ్రేయస్కరము. యథాతథముగ ప్రకటనయోగ్యము కాదు.

కృతి రచింపుమని చింతలపాటి నీలాద్రిరాజు రచించిన కృతిని స్వీకరించకపోవుట, అందుకు అణివెళ్ల వేంకటశాస్త్రి కారణమగుట అన్యాయమేకాని, అది భంగ్యంతరముగ న్యాయమే అయినది. జగ్గన "రసికు లౌననిమెచ్చ" రచియించిన జానకీపరిణయము, "కవివ్రాతముల్ పొగడంగ" వచియించిన రాధాకృష్ణదివ్యచరిత్ర, "విద్వచ్చయంబు నుతియింప" ఉద్ధరించిన చాటుప్రబంధములు మొదలైనవి కాలగర్భమునందు కలిసిపోయినవి. ముద్రణభాగ్యమునందినను సుభద్రాపరిణయము మృతప్రాయము-సోమదేవరాజీయము విస్మృతప్రాయము. మఱి చంద్రరేఖావిలాపము సజీవము!

"చెక్కిలి నెక్కుల న్నిమిరి చిక్కని చక్కని శుష్కవక్షముల్
మక్కువ మీఱఁ గాంచి పలుమాఱు ఖరం బటు తన్నినన్ సరే
కుక్కయుఁ బోలె వెంటఁబడి కోడిగ మాడక, భావజార్తిచే
నిక్కడ నిల్వఁగాఁ దరమె యించుకయున్ బెఱమాట లేటికిన్." 80ప. 1ఆ.

ఇది పాత్రపరమైన హాస్యము కాదు; వ్యక్తిపరమైన అపహాస్యము.

"హా! యనుఁ జంచరీకనిచయాంచితకుంచితరోమధామదే
హా! యను దానమానితమహాద్విపపుచ్ఛసముచ్ఛ్రయైకబా
హా! యనుఁ గాకఘూకచరణాయుధకుర్కురదూషితాత్మగే
హా! యనుఁ జంద్రి! తాళ నహహా! యనుఁ బీతశిరోరుహా! యనున్." 121ప. 2ఆ.

ఇది కావ్యపరమైన అధిక్షేపము కాదు; వ్యక్తిపరమైన అధిక్షేపము.

"ముప్పదియాఱేండ్లది, ముం
దెప్పుడు నొక్కరుని నెఱుఁగ; దేలాగున నీ
విప్పుడు దిద్దుకొనియెదో?
మొప్పెతనము మాన్పవలయు ముందు నృపాలా!" 100ప. 3ఆ.

ఇది హాసజనకమైనను, ఇందును వ్యక్తిహేళన ఇమిడియున్నది. ఇందలి షష్ఠ్యంత పద్యములు, ఆశ్వాసాద్యంతపద్యములును వ్యక్తిదూషణములే.

ఇట్లు వ్యక్తిదూషణాత్మకమైన అపహాస్యము హాస్యము కాదు. ' పేరడీ' కాదు. సెటైర్ కాదు. కావ్యసంస్కరణాత్మకము కాదు. సంఘసంస్కరణాత్మకము కాదు. కాఁబట్టి అనుపాదేయమైన అపహాస్యప్రబంధము. అశ్లీలప్రబంధము. వికటప్రబంధము.

**డొంకాడ గోపీనాథము** : ఇతని కృతి విచిత్రరామాయణము. వచనకావ్యము. ఇతడు జయపురసంస్థానాధిపతి రెండవ విశ్వంభరదేవుని (1713-52) దివాను[173]. కాఁబట్టి విచిత్ర రామాయణము రచనాకాలము 1730 ప్రాంతము కావచ్చును.

ఇది ఒడియాభాషలో సారళాదాసు రచించిన విచిత్రరామాయణమునకు తెనుగుసేత[174]. ముద్రితము. కాని దుర్లభము.

**రావూరి సంజీవరాయలు** : ఇతని కృతులు 1. వీరనారాయణశతకము. 2. త్రివిక్రమవిలాసము. అనుపలబ్దము 3. వసుదేవనందనశతకము. 4. భాగవతము-ఏకాదశ, ద్వాదశస్కంధములు. అనుపలబ్దములు. ఇతని కాలము 1780 ప్రాంతమని కలదు[175]. కాని వీరనారాయణశతకమునందు తద్రచనాకాలము ఇట్లు కలదు[176].

"గుణబాణషట్చంద్రగణనతో శాలివా
    హనశకవర్షము లరుగ వర్త
మానవిరోధికృన్మార్గశీర్షాదిమ
    పక్షతృతీయేతభానువార
మునకు సంపూర్ణమై తనరిన యీ కృతి
    యాచంద్రతారార్కమగుత ధరణి "

గుణ=3, బాణ=5, షట్=6, చంద్ర=1 - 1653+78=1731. కాఁబట్టి రచనా కాలములు వీరనారాయణశతకము1732 వ సంవత్సరము, త్రివిక్రమవిలాసము 1735 ప్రాంతము, వసుదేవనందనశతకము 1736 ప్రాంతము, భాగవతము - ఏకాదశ, ద్వాదశ స్కంధములు 1740 ప్రాంతము కావచ్చును.

ఇతడు కొప్పర్తి నరసయామాత్యుని పరిపూర్ణరుక్మిణీపరిణయమనెడు మదనగోపాల చరితమునకు సహాయము చేసినట్లు అందు కలదు. అయినను రుక్మిణీపరిణయము రావూరి సంజీవరాయలు రచించినట్లు ముద్రితము[177]. ఇది కొప్పర్తి నరసయామాత్యుని శీర్షికను ముందు వివరింతును.

**గోకు(గు)లపాటి కూర్మనాథము (కూర్మదాసు)** : ఇతని కృతులు 1. సుందరీమణీ శతకము. 2. విజయరామశతకము. మూడు పద్యములు మాత్రమే లభించినవి. 3. సింహాద్రినారసింహశతకము. 4. మృత్యుంజయవిలాసము. 5. లక్ష్మీనారాయణసంవాదము. ఇతడు విజయనగరసంస్థానాధిపతి పెద విజయరామరాజు (1741-57) ఆస్థానకవి. 1753 వ సంవత్సరము నాటి యవనదండయాత్రాసమయమునందు సింహాద్రినారసింహస్వామికి పెట్టుకొన్న మొఱ సింహాద్రినారసింహశతకము. కాఁబట్టి కృతుల రచనాకాలములు సుందరీమణీశతకము 1745 ప్రాంతము, విజయరామశతకము 1750 ప్రాంతము; సింహాద్రి నారసింహశతకము 1753 వ సంవత్సరము, మృత్యుంజయవిలాసము 1758 ప్రాంతము, లక్ష్మీనారాయణసంవాదము 1760 ప్రాంతము కావచ్చును.

**సుందరీమణీశతకము** : ఇది శృంగారశతకము. "సుందరీమణీ!" అని మకుటము

ఆ సుందరీమణి పెద విజయరామరాజు వేశ్య అని ఒక అభిప్రాయము కలదు. కూర్మ నాథుని వేశ్య అని మఱొక అభిప్రాయము కలదు. శతకము రెండవ అభిప్రాయమునకే అనుగుణము. ఇందు సంభోగశృంగారము, విప్రలంభశృంగారము రెండును కలవు.
విప్రలంభశృంగారము :

"నినుఁ గలనైనఁ జూచుటకు నిద్దుర కంటికి రాదు, చిత్రరం
జనఫలకంబునం గనఁగ సాంద్రతరాశ్రువు లడ్డమౌను భా
వన యొనరింతు నన్నుఁ జెలువా! మది చంచలమౌ నిఁకేమి సే
తు నిముస మొక్క యే డగుచుఁ దోఁచెఁ దలంపఁగ సుందరీమణీ! " 24ప.
"భామిని! నిన్న రే నిదుర పట్టక పట్టక పట్టినంతలో
కాముని కేళిలో మనము కౌతుకమంది పెనంగులాడి యే
మేమొ వినోదముల్ సలుప, నెక్కడి పాపపు కోడి కూసెనో
స్వామి కటాక్ష మట్లలరె స్వప్నమునందును సుందరీమణీ! " 85ప.
"నను నెడబాసి యుండిన దినంబుల లెక్కలు కొంతసేపు, నా
మునుపటి కేళిలో మెలఁగి ముచ్చట లాడుట కొంతసేపు, నా
కనుగుణమైన వస్తువుల నందెడు సందడిఁ గొంతసేపు నా
య్యనఁ బవలెల్ల నోర్చి నిశియం దెటులోర్తువొ సుందరీమణీ! " 91ప.

**విజయరామశతకము** : ఇది భక్తిశతకము. ఉపలబ్ధమైన మూడుపద్యములందు ఒక పద్యమునకు "విజయరామా! రామతీర్థాశ్రయా!" అని, రెండుపద్యములకు "శ్రీవిజయ రామా! రామతీర్థాశ్రయా" అని మకుటములు కలవు. విజయరామ, శ్రీవిజయరామ అను సంబుద్ధి రామతీర్థములోని రామునికి విశేషణము. అంతేకాదు. పెద విజయరామ రాజునకు స్ఫోరకమును అగును.

"స్వామిన్ గన్నది పూట, పుణ్యనది క్రేవం జన్నదే బాట, మీ
ధామం బున్నది పేట, ధర్మసభ సత్యం బన్నదే మాట, యే
సీమన్ వస్తుసమృద్ధిచే భటులచేఁ జెల్వైనదే కోట, పె
న్మామి ళ్లున్నదె తోట శ్రీవిజయరామా! రామతీర్థాశ్రయా! "

**సింహాద్రినారసింహశతకము** : ఇది వ్యాజస్తుతిశతకము. ఇందు యవనసైన్యము బాఱి నుండి ప్రజలను రక్షింపని, సింహాచలక్షేత్రదైవమైన నరసింహస్వామిని నిందించిన పద్యములు అఱువదియేడు కలవు. అవి సవ్యాజములు. అందు వలన వ్యాజస్తుతిశతకము. "వైరిహరరంహ! సింహాద్రినారసింహ! " అని మకుటము.

"యవనేశుధాటికి హడలి సర్వస్వమ్ము
విడిచి, మందిరములు వెడలు వారు
వెడలియుఁ దల దాఁచ వెఱవేమి గానక
నడవుల నిడుమలఁ బడెడు వారుఁ
బడియు నెచ్చట కూడు బట్ట గానక తమ
శిశువులతో వెతఁ జెందు వారుఁ
జెంది డెందము గుందఁ గాందిశీకత నభి
మానార్తులై ఖేద మూను వారు
నైరి యొక్కొక్క భార్యతో నవని ప్రజలు

అష్టమహిషులపై పదియాఱు వేల
సతులతో నీవు వలస కెచ్చటి కరిగెదు
వైరిహరరంహ! సింహాద్రినారసింహ! " 11ప.
"విషవహ్ని ప్రజకెల్ల వెతఁ జేయఁ గాళియ
    పడగలు వడిఁద్రొక్కు పటిమ యేది?
వడిగ బిడౌజుండు పిడుగులు వర్షింప
    శైల మెత్తిన నాఁటి శక్తి యేది?
దుర్యోధనాదులు దొరవించుకొను వేళ
    విశ్వరూపముఁ జూపు వింత యేది?
మురనరకాది ముష్కరదుష్కరాదుల
    మర్దించి చెలఁగు నీ మహిమ యేది?
ఇట్లు ఖలు లేచ దీనుల నెన్నటికిని
గరుణఁ జూచెదు? కలవాఁడు గాదె దీయు
దనుక బీదల ప్రాణముల్ తాళు టెట్లు?" 37ప.

ఇట్లు 67 పద్యములు ఆశువుగ చెప్పుసరికి ఫలితము కనిపించినది! (68ప.)

" కారుణ్య వృత్తిచేఁ గని మమ్ము రక్షింప
    నీరజేక్షణ నేఁడు నీవు పంపఁ
బారసీకుల దండుపైఁ గొండలో నుండి
    గండు తుమ్మెదలు నద్దండలీలఁ
గల్పాంతమున మిన్నుఁ గప్పి భీకరమైన
    కాఱుమేఘంబులు గలసినట్లు
దాఁకి బోరున రక్తధారలు గురియఁగా
    గఱచి నెత్తురు పీల్చి కండలెల్ల
నూడిపడ నుక్కు మూతుల వాడి మెఱసి
చించి చెండాడి వధియించెఁ జిత్రముగను
నొక్కొకని చుట్టు ముట్టి బల్ మిక్కుటముగ" 69ప.

ఇది దైవికము కావచ్చును. యాదృచ్ఛికమును కావచ్చును. దైవ విశ్వాసము కల కూర్మనాథము అపరాధము చేసినట్లు భావించి, సింహాద్రి నారసింహస్వామిని స్తుతించిన పద్యములు కడను 32 సీసపద్యములు. (70-101) 102 వ పద్యము కవి స్వవిషయము. 69, 70 పద్యముల మధ్య తుమ్మెదల మెట్ట స్థలపురాణము కల గీత పద్యము ప్రక్షిప్తము. కాలాంతరసంక్రాంతము. సీసపద్యశతకమునందు గీత పద్యము నిస్సందేహముగ ఆగమప్రాయమే.

**మృత్యుంజయవిలాసము** :- ఇది విష్ణ్వంకితము - దైవాంకితము. ఇదొక విలక్షణమైన కృతి. మృదుతరకావ్యము, యక్షగానము (పుట2) మృదులనాటకము, హరికథ(పుట 151) శృంగారనాటకగేయప్రబంధము (ఆశ్వాసాంతగద్యలు) అని పేర్కొనఁ బడినది. కావ్యసరణి కలదు. యక్షగాన వైఖరి కలదు. హరికధా స్వభావము కలదు. నాటకస్వరూపము లేదు. ఆశ్వాసవిభాగము కలదు. మూడు ఆశ్వాసములు. ఆశ్వాసాద్యంత పద్యగద్యములు కలవు. అవతారికాప్రాయమైన ఉపక్రమణిక కలదు. ఇతివృత్తము

పార్వతీపరిణయము. కాళిదాసు కుమార సంభవమునకు అతిస్వతంత్రమైన అనుసరణము శివుడు "విజయనగరిని శ్రీవేంకటేశ్వరుల బుజగతిఁ గూడ సమృద్ధభాగ్యముల మృత్యుంజయుండని మెఱసె" (పుట 151) అందువలన మృత్యుంజయవిలాసమని గ్రంథనామము.

ఇందు శృంగారము శ్రుతి మించినది (పుటలు 32, 73, 135 - 138) పరమేశ్వరుడు ఎఱుకతగ వచ్చి పార్వతికి సోదె చెప్పుట, పార్వతీపరిణయానంతరము సవతుల కయ్యము - గంగాగౌరీసంవాదము-, భృంగి హాస్యభంగి యక్షగానలక్షణములు. సర్వమంగళావివాహ మంగళకార్యమునకు మేనకాహిమవంతులు "శ్రీమన్నారాయణానుగ్రహంబునం గాని సంఘటింపఁదని గోవిందపదారవిందధ్యానాధీనమానసులై" ఉండుట (పుట82), శ్రీమన్నారాయణప్రేరితులై అరుంధతీసమేతముగ సప్తర్షులు శివుని సన్నిధికి వచ్చుట (పుటలు 83-84), సనకాదిమునుల విష్ణుస్తోత్రము, శ్రీనివాససాక్షాత్కారము, శ్రీహరి వర్ణనము (పుటలు 93-94) సనకాదులు మఱల విష్ణువును స్తుతించుట (పుటలు 95-97) పార్వతీపరిణయోత్సవము చూడ పయనమగుటకు శ్రీభూనీళాదేవుల ప్రణయకోపము (పుటలు 100-103) మొదలైనవి కూర్మదాసవిశేషములు. శివుడైన ఎఱుకత కూడ విష్ణుభక్తురాలు! ఆ విష్ణువుకూడ సింహాద్రినాథుడు, శ్రీకూర్మనాథుడు, నీలాద్రినాథుడు!

"సిమ్మాద్దిరప్ప శ్రీకూర్మనాథ
నల్లని దేవర నా ముద్దులయ్య
తెల్లని నామంబు దిద్దిన సామి
నీకు మ్రొక్కెదనయ్య నీలాద్రినాథ
జోకతో నాకన్నిఁ జొప్పెదఁ దెలుపు" పుట 55

**లక్ష్మీనారాయణీయము** :- ఇది లఘుకృతి రామతీర్థగిరిదైవములైన లక్ష్మీనారాయణుల సంవాదమే లక్ష్మీనారాయణీయము. రామతీర్థగిరిరఘుపతికి అంకితముగ షష్ఠ్యంత పద్యము నుండి కలదు. తత్పూర్వభాగమైన అవతారికలేదు. శిథిలము కావచ్చును. ఇది స్త్రీలపాటలలోని "తలుపు దగ్గఱి పాట" వంటిది.

ఒకసారి నారాయణుడు లక్ష్మితో "స్వారి వేంచేసి వత్తును " అని చెప్పును. లక్ష్మి నారాయణుని విడిచిపెట్టియుండుటకు విచారించును. "తిరువీథులేగి నేనిపుడె వత్తు" నని నారాయణుడు స్వారి వేంచేయును. పురజనులు పువ్వులు చల్లుదురు. కర్పూర హారతులు పట్టుదురు. నైవేద్యములు పెట్టుదురు. మ్రొక్కుదురు. తిరిగివచ్చును. లక్ష్మి శంకించును. తలుపు బిగించును. లక్ష్మీనారాయణుల సంవాదము సాగును.

"వేఁటల కేగినా ననుచు వేమఱుఁ బల్కెదు బూటకంబుఁ బల్
మాటల సంతసిల్లు హనుమన్ముఖసేనలతోడ వేడుకన్
వేటల తోటలందిరుగు వేళల నో లలనామనోజ నీ
కేటికిఁ గల్గెనోయి మెయి నిమ్మెయి నుండిన జారచిహ్నముల్." 15పు
"మించితి వల్కుచే కడు భ్రమియించితినన్ వెఱపించి తీవు కొ
ట్టించితి భక్తులన్ ప్రతిఘటించితి సేవకు రాక వీథిలో
నుంచితి వెల్ల వేల్పుల నయో వినయోచితరీతి నుండు నీ
మంచితనంబు లెందుఁ జని మంచిది మంచిదిలే తలోదరీ!" 15, 16 పు

నారాయణుడు ఏమి చెప్పినను లక్ష్మి నమ్మదు. తలుపు తీయదు. నారాయణుడు తాను జారుడు కాదనుటకు వసిష్ఠుడు, వ్యాసుడు, చంద్రుడు, పంచపాండవులు సాక్షులని చెప్పిన, లక్ష్మి వారిని "సానిదాని కొడుకు, జాలరిదాని కొడుకు, గురుద్రోహి, గుబ్బాలు గోవులు కాచువారు" అని, "మేనత్త వయసును గుత్తగొన్న నీకు తగును" అని నిరసించును. నారాయణుడు బింకము సాగదని గ్రహించి, లక్ష్మిని మూడు పద్యములందు పాగడి బ్రతిమాలును.

"ఆ రీతిన్ మదనాతిరేకమున దైత్యారాతి పల్యంగ ల
క్ష్మీరామామణి తల్పు వే దిగిచి సామీ మన్మనోగామి యొ
య్యారే నేరము లేమి మీకు మిము నిట్లాయాసమొందించు నా
నేరంబుల్ క్షమియించు మంచు తమిఁ జెందెన్ ప్రేమ వాహాంకమున్"

**అడిదము సూరన** :- ఇతని కృతులు 1. కవిజనరంజనము. 2. కవిసంశయ విచ్ఛేదము. ఛందోవ్యాకరణగ్రంథము. 3. చంద్రాలోకము. అలంకారశాస్త్రము. 4. ఆంధ్ర నామశేషము. నిఘంటువు. 5. పాణుగుపాటి వేంకటమంత్రి శతకము. 6. శ్రీరామదం డకము. 7. రామలింగేశశతకము. 8. చాటువులు. ఇతడు విజయనగరసంస్థానాధిపతులు పూసపాటి పెదవిజయరామరాజు (1741-57) చినవిజయరామరాజు (1760-94) ఇద్దఱికాలములందును కలడు. పెద విజయరామరాజు మొదట బాదుల్లాఖానుకు ఓడిపోవుటను ఇతడు గేలి చేసిన చాటుపద్యము కలదు. ఆ ఓటమి సంభవించిన కాలము 1746 వ సంవత్సరము[178]. కాఁబట్టి ఇతని కృతుల రచనాకాలములు- కవిజనరంజనము 1750 ప్రాంతము, కవిసంశయవిచ్ఛేదము 1755 ప్రాంతము, చంద్రాలోకము 1760 ప్రాంతము, ఆంధ్రనామ శేషము 1765 ప్రాంతము, పాణుగుపాటి వేంకటమంత్రి శతకము 1770 ప్రాంతము, శ్రీరామదండకము 1775 ప్రాంతము, రామలింగేశశతకము 1780 ప్రాంతము కావచ్చును.

**కవిజనరంజనము** : ఇది శివాంకితము. దైవాంకితము. ఇందు అవతారిక లేదు. ఆశ్వాసాద్యంతపద్యములు కలవు. అవి శివపరము. ఒక్క షష్ఠ్యంతపద్యము కలదుగాని, అది నాగులూటి శేషనారాధ్యుని పర్వతపురాణములోనిది. (పుట 6) ఇందు "కంఠీరవాఖ్య' ' అని కలదు. ఇందు "కంఠీరవాఢ్య" అని కలదు. అంతే భేదము. అదే పద్యము. అవతారిక తోపాటు అంకితచిహ్నమును లేదని ప్రతిలేఖకుడు చేర్చినది కావచ్చును. కవిజన రంజనమునకు పిల్ల వసుచరిత్రమను పేరు కలదు. కాని, ఇది శ్లేషకావ్యము కాదు. గుణీభూతవ్యంగ్యకావ్యము కాదు. సంగీతసాహిత్యసమ్మేళనము కాదు. ఇతివృత్తము చంద్రమతీహరిశ్చంద్రుల వివాహము. ఇది నామమాత్రము. ఇంచుమించు కథ లేనట్లే. వర్ణనలే అత్యధికము. అందువలన పిల్లవసుచరిత్రమను పేరు వచ్చియుండవచ్చును.

కవిజనరంజనము మూడాశ్వాసముల కావ్యము. ప్రథమాశ్వాసమునందు 68, ద్వితీ యాశ్వాసమునందు 51, తృతీయాశ్వాసమునందు 109 మొత్తము 228 పద్యముల కథాభాగము కలదు. అయోధ్యాపురాధిపతి హరిశ్చంద్రుడు. విజయాస్పదపురాధిపతి ఉశీనరుని కూతురు చంద్రమతి. హరిశ్చంద్రుని చిత్రపటము చూచి చంద్రమతి తనకు తగిన విభుడని, చంద్రమతి చిత్రపటము చూచి హరిశ్చంద్రుడు తనకు తగిన వెలది అని తలంతురు. ఇది ప్రథమాశ్వాసకథాంశము. చంద్రమతి విరహము. ఉశీనరుడు

హరిశ్చంద్రుని తోడ్కొనిరమ్మని దృఢవ్రతుని పంపించును. దృఢవ్రతుని దూత్యము. వివాహనిశ్చయము. ముహూర్తనిర్ణయము. ఇది ద్వితీయాశ్వాసకథాంశము. చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము, దాంపత్యము తృతీయాశ్వాసకథాంశము. కవిజనరంజనము కావించునది కథావిషయము కాదు. వర్ణనము.

కవిజనరంజనమునందు పుర (1-23, 36-38ప. 1ఆ.) నాయక (24-35ప. 1ఆ.) నాయికా (41-66ప. 1ఆ; 46-52ప. 2ఆ.) వసంతర్తు (2-10ప. 2ఆ.) నాయికావిరహ (18-24ప. 2ఆ.) మన్మథాద్యుపాలంభ (25-41ప. 2ఆ.) వివాహ (3-42ప. 3ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (43-70, 92-103ప. 3ఆ.) సంభోగ (71-90ప. 3ఆ.) దాంపత్య (104-109ప. 3ఆ.) వర్ణనలు కలవు. మొత్తము 228 పద్యములందు 209 పద్యములు వర్ణనలే.

చంద్రమతి వ్రేళ్లు పెసరు గాయలు, మడమలు మఱ్ఱికాయలు, వీపు అరటాకు, చిబుకము తాటిగింజ అని కవిసమయేతరమైన స్వతంత్రకల్పనము. (43ప. 1ఆ.)

"అతనుతాపంబు గావింత మనుచుఁ గోరి
సఖులు శైత్యోపచారముల్ సతికిఁ జేయ
దైవ మొండొక యర్థంబు దా గ్రహించి
యతనుతాపంబు గావించె నబ్జముఖికి. " 19ప. 2ఆ.

సఖులు కోరినది తనుతాపము లేని స్థితి. దైవము కావించినది మన్మథతాపము. అతనుశబ్దమునకు అర్థద్వయము. శ్లేషకల్పనము.

"సఖులు ప్రార్థించు తతిని లజ్జాద్రవంతి
పద్మగంధికి మోకాలిబంటి యయ్యెఁ
బడకయిలు సేరు తఱి మొలబంటి యయ్యెఁ
బతిని డాయంగఁ బుక్కిలిబంటి యయ్యె " 78ప. 3ఆ.

ఇది చమత్కారకల్పనము. ఇట్టివి కవిజనులకు రంజనము కలిగించునవి.

శ్రీనాథుడు ప్రవేశపెట్టిన పాణింధమపదబంధము ప్రయుక్తము. "వలపుల పాణింధమములు" (14ప. 1ఆ.) "మలయపవనపాణింధమప్రవర్ధమానశిఖియుతోద్యాన విఖ్యాతి" (22ప. 2ఆ.) పూర్వకవుల ప్రభావము పుష్కలము.

**పొణుగుపాటి వేంకటమంత్రిశతకము** : నలుబది పద్యములు లభించినవి[179]. ఒక్క పద్యమునందు మకుటము లేదు. కడమ పద్యములందు కలదు. "పొణుగుపాటి వేంకట మంత్రి!" అని మకుటము. అతడు సూరన మిత్రుడు. శృంగవరపుకోట జమీందారు శ్రీముఖి కాశీపతిరావు దివాను. అన్నదాత. యశస్వి.

"వెన్నెల వలె కర్పూరపుఁ
దిన్నెల వలె నీదుకీర్తి దిగ్దేశములన్
మిన్నంది వన్నె కెక్కెను
విన్నావా పొణుగుపాటి వేంకటమంత్రీ"

శతకమునందు వివిధాంశములు కలవు. నీతిపద్యములును కలవు.

"చెడఁగొఱుకు చీడపురుఁగొక
పిడికెడు జలకమిడి చెట్టు పెంచునె! చెడు గా

జడివెట్టుఁ గాని దుర్దశ
వెడలించునె పొణుగుపాటి వేంకటమంత్రీ "

**శ్రీరామదండకము** : ఇది సుదీర్ఘమైన, ప్రౌఢమైన దండకము. కేవలము స్తోత్రము కాదు. ఇందు శ్రీరామునిజననము, బాల్యము, తాటకవధ, శివధనుర్భంగము, సీతా కల్యాణము పరశురామగర్వభంగము, శ్రీరామపట్టాభిషేకభంగము, రామవనవాసము సీతాపహరణము, జటాయుసందర్శనము, కబంధవధ, వాలివధ సీతాన్వేషణము, లంకా దహనము, రామరావణయుద్ధము మొదలైన ప్రధానకథాంశములు కలవు.

"-అం దిందిరాజీవరాజీవరాజీవరామోదసంపాదిపంపా
సరస్తీరదేశంబునన్ మైత్రితో మైత్రి గాలించి వాలి న్మ
హా సత్వశాలి న్నముచ్చండకాండహతిం జెండవే . . . .

తెలుగు దండకమునందు సంస్కృతభాషయును కలదు.

"- కల్పాంతవేళారణద్ఘూడపద్ఘూఢక్కాడమత్కార
దిక్కారిఘోరాట్టహాసారహస్యాసై పోల్చి, ద్రావత్సుషేణం
త్రసద్బానుపుత్రం నికృత్తర్షభం భిన్నవక్షోగళాక్షం పరాభూత
నీలాంగదం భీతవాతాత్మనుతం కరిష్యామి సైన్యం రథం చోద
యామ్నాయ రథ్యా త్సూత యంచున్ - "

**రామలింగేశశతకము** :- ఇది అధిక్షేపశతకము. రామచంద్రపురములోని (చీపురుపల్లితాలూకా, విజయనగరము జిల్లా) రామలింగేశస్వామికి అంకితము దైవాంకితము "రామలింగేశ రామచంద్రపురవాస!"అని మకుటము. ఇందు నూటనాలుగు సీసపద్యములు కలవు. సమకాలికసమాచారము సమధికము. రాజులను, రాజ్యాధి కారులను, ఇతరులను అధిక్షేపించిన పద్యములు అనేకము. కతిపయనీతిపద్యములును కలవు.

మూర్ఖుడైన రాజును గంగిరెద్దుతో పోల్చిన పద్యము :

"కడు వింత యగు స్థూలకాయంబు గలుగుట
చిత్రభూషాంబరస్థితి నలరుట
తూర్యనాదంబులతోఁ జనుదెంచుట
వాలవ్యజనసమవ్యాప్తిఁ గనుట
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట
చూపరు ల్బదుగురు చుట్టికొనుట
స్వనియంత వాద్యంబు విని తలయూచుట
మౌనముద్ర వహించు మతముఁ గనుట
గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును
భేద మించుకయును గానిపించ దట్టి
ప్రభువు వేడిన సత్కవిపదవి చెడదె
రామలింగేశ! రామచంద్రపురవాస!" 14ప.

నీతిపద్యము :

"జనులు నిందించిన సామ్రాజ్య మేటికి
నక్కఱ కొదవని యర్థ మేల?

జయము సిద్ధింపని సాహసం బేటికి
　　సిరి లభింపని రాజసేవ యేల?
అక్షరం బెఱుఁగని యధికార మేటికి!?
　　గోర్కి దీఱని సతి కూట మేల?
వినయంబు గల్గని వితరణం బేటికి
　　క్షమ దొలంగిన తపశ్చర్య యేల?
కాంత మందిరమున లేని కలిమి యేల?
పరులనొప్పింప నాశ్రితోద్ధరణమేల?
కవులకీయని దాతృత్వగరిమయేల?
రామలింగేశ! రామచంద్రపురవాస! " **44ప.**

　　సమకాలికసమాచారము :

"అగ్రహారములు నామావశిష్టములయ్యె
　　మాన్యంబు లన్నియు మంట గలిసె
బత్తెంబునకుఁ దొంటి పడికట్టు దప్పెను
　　బుధజనంబుల రాకపోక లుడిగె
పర్వాశనంబులు వఱదపాలైపోయె
　　మలవతోలను ప్రజల్ మాని చనిరి
నశియించిపోయె వొంటరులుఁ దురుష్కులు
　　గజతురంగములు తాకట్టువడియె
ధార్మికస్థానమున కిట్టి తళ్ల పుట్టెఁ
గఠినచిత్తుని రాజ్యాధికారిఁ జేసి
యింత పీడించితివి సత్కవీంద్రకోటి " 88ప.

రాజులు కవులను పీడించిరనియే గాక, ఎవ్వరును కవులకు ఏమియు నిచ్చుట లేదని కూడ ఆవేదన ప్రకటించిన పద్యము లింకను గలవు. "కవుల కీఁగల జాతి యొక్కటి యును లేదు" అని దేవాంగులను, కాపులను, బలిజెలను, గొల్లలను, కోమటులను, శిష్టుకరణాలను మాత్రమేగాక ఘూర్జరులను కూడ నిరసించుట చిత్రము.

కుకవులను కాకులతోను, దుంతలతోను, మోదుగులతోను, వేములతోను, పిశాచములతోను, కొంగలతోను, భృత్యులతోను, కొండికలతోను సాటి తెచ్చినను "వారి వారింపఁ బనిలేదు వరకవులకు అని ఉదాసీనత వెల్లడించుట విశేషము.

**రేకపల్లి సోమనాథము (సోమప్పశాస్త్రి)** : ఇతని కృతి రుక్మవతీపరిణయము. సత్యవరము జమీందారు కాకర్లపూడి గోపాలరాయపాయకరావునకు అంకితము. అడిదము సూరన, రేకపల్లి సోమనాథము సమకాలికులు. స్పర్ధ కల వారు[180].

　　ఘనవృత్తుల్ గుణముల్ గణింపక నలంకారంబులున్ రీతులున్
　　ఘనవాక్యార్థపదార్థసంగతు లెఱుంగ న్నేరకే యూర కిం
　　పునఁ బ్రాబంధికు లైరి కొందఱు కవుల్ "పుణ్యై ర్యశో లభ్యతే"
　　యను వాక్యంబు ప్రమాణమయ్యె నిపు డాహా! చిత్ర మిద్ధారుణిన్. "

అని సోమనాథము అంతర్మథనము. అడిదము సూరన యశస్వియే. కాఁబట్టి రుక్మవతీపరిణయము రచనాకాలము 1750 ప్రాంతము కావచ్చును.

ఇందు మన్మథుడు రుక్మిణీకృష్ణుల తనయుడు ప్రద్యుమ్నునిగ జన్మించుట, శంబ రాసురుడు అపహరించుట, రతిదేవి మాయావతిగా రక్షించుట, ప్రద్యుమ్నుడు శంబ రాసురుని సంహరించుట, రతిప్రద్యుమ్నులు ద్వారకకు వచ్చుట, ప్రద్యుమ్నుడు మేనమామ తనయ రుక్మవతిని వివాహమాడుట ఇతివృత్తము. ఇది హరివంశ, విష్ణుపురాణ, భాగవతము లందు కలదు. హరివంశమునందు రుక్మి తనయ రుక్మవతి కాదు. శుభాంగి. రుక్మవతి రుక్మి పౌత్రి. భాగవతమునందు రుక్మి తనయ. రుక్మవతీపరిణయము విష్ణుపురాణ, భాగవతములకు అనుసరణము. వర్ణనోపేతమే గాని, వర్ణనాభూయిష్ఠము కాదు. అంతేకాదు. అక్షపాద, కణాద, జైమిని, పాణిని, పతంజలిప్రభృతులను స్తుతించిన (13-14ప. 1ఆ.) కవి శాస్త్రపండితుడైనను కావ్యమునందు పాండిత్య ప్రదర్శనము లేకపోవుట విశేషము.

పురవర్ణనమునందు పుష్పలావికావర్ణనముతోపాటు, ఫలదాంగనావర్ణనమును కలదు.

'చెలియ లికుచముల దిట వెంత యని పల్క
    నవి నీకుఁ గొన కోటి కలవి గావు
యలపం డిది కాయ జాలం బమందమౌ
    నిడె పం డనువుగా దిచ్చగింప
సకి తెల్పు మాకు సహకార మది నీకుఁ
    బలుమఱు బేరంపు విలువ పెద్ద
అతివరో నీ వాతె రంటిపంటి కొలంది
    నొక్కమా టిఱఁగింపు నెక్కడనగు
ననుచు రసగర్భయుక్తుల నెనసి తనిసి
మనసిజాయత్తచిత్తసమ్మత్తులైన
విటుల కిటుల హొయ ల్గుల్కు పటిమఁ జెలఁగు
సరసఫలదాంగనల కూర్మి జరగు వీట." 171ప. 1ఆ.

అరుదైన మీల వేఁట వర్ణనము స్వభావోక్తిసుభగము.

"సొరిది వీచీపరంపరల నీదుచు మీన
    సంచారసంగతుల్ గాంచి కాంచి
గాలంబుగా నేటి వేఁటంచు మోచేతి
    వలలెత్తి యందంద వైచి వైచి
నా పేరు పొంతన మీపట్లఁ జేకూడెఁ
    బొమ్మంచు గాలాలఁ జిమ్మి చిమ్మి
యొడఁబడ్డదాని సందడిఁ గొని చేపట్టి
    చిక్కంబులను వేగఁ జిక్కి చిక్కి
వివిధభంగులఁ దెరవుల వేడ్క లలరఁ
జెల్వగు విభేదములఁ బ్రశంసించుకొనుచుఁ
దనివి దీరక లోలోని కొనరఁ జనుచు
నామనిగ మీల వేఁటాడు నప్పు డొకట. " 23ప. 2ఆ.

పాండిత్యము స్ఫురించు పద్యము :

"అతివ యభివృత్తకటిభావ మవనిచక్ర
మగునొ కాదో యనెడు సంశయం బదేల?
మది వితర్కింప నా మీఁది మధ్యసీమ
దగ నభంబైన యదియె బోధకము గాదె " 49ప. 3ఆ.

ఇందలి బోధకము రుక్మవతి సౌందర్యమునకు కంటె కవి తర్కమునకు సాధకము.

వేకువ జామున వెలవెలఁబోవు తారకల వర్ణనము కమనీయము.

"అంత రహి డించెఁ దారక లంబుజారి
యామినీకాంత గదిసి రతాంతవేళ
లలితగతి డిగ్గ గగనతలంబునందు
మిగుల నలఁగిన పువ్వుల మెలపు దోప. " 100ప. 4ఆ.

స్వయంవరఘట్టమునందు శైలీప్రౌఢిమ పరిఢవిల్లినది.

"గంధేభాధిపయాన సర్వధరణీకాంతాగ్రకోటీరసం
బంధోదంచితరత్నదీపకళికాభ్రాజత్పదాబ్జున్ యశ
స్సింధూత్తంసజచంద్రికాకువలయశ్రీనిత్యసంధాయినీ
సింధుక్ష్మారమణీమనోహరుని సుశ్రీకుం గటాక్షింపుమీ. " 51ప. 5ఆ.

ఇది మహాకావ్యము కాదుగాని, అడిదము సూరన కవిజనరంజనము కంటె రసవత్తర కావ్యము.

ఇందు రెండు చరిత్రాంశములు కలవు.

1. "రుస్తుంఖానతనూభవ
మస్తకబలిపూర్వకాత్తమహితఘనశ్రీ
నిస్తులసువిదితనిధిసని
రస్తికాంతనిధిరాజరాజైశ్వర్యా! " 183ప. 1ఆ.

ఇందు రుస్తుంఖాన్ కుమారుని శిరశ్ఛేదము కృతిభర్త కావించినట్లు కలదు.

2. "వార్ధవితరణవిహారా
దుర్దమచతురంగసైన్యధూర్వహదరక
న్నూర్దిహుశేన్ఖానశిరో
మర్దనచణబాహుసార మహితవిచారా " 126ప. 3ఆ.

"మోహనవసుధాదానదు
రూహాతిక్రమణసాహసోద్యమభాగా
జీహుశ్శేనతనూభవ
బాహుశిరశ్ఛేదిచక్రరాజితహస్తా ! " 105ప. 4ఆ.

ఇందలి జీహుశ్శేన్, నూర్దిహుశ్శేన్ తండ్రికొడుకులు కావచ్చును.

**ఘట్టుప్రభువు** : ఇతని కృతులు 1. కుచేలోపాఖ్యానము 2. సురాభాండేశ్వరము. 3. యాజ్ఞవల్క్యచరిత్రము. ఈ మూడు కృతుల ఆశ్వాసాంతగద్యలందును "ఎల్లనామాత్య పుత్త్ర . . . ఘట్టుప్రభునామధేయప్రణీతంబు " అని కలదు. ప్రభువు పేరు. ఘట్టు ఇంటిపేరు. సత్యభామావిజయమను ద్విపదకావ్యమునందు "వీరసత్పుత్త్ర . . . శేషకవీంద్ర. . . . రచితము " అని కలదు. వీరన వ్యవహారనామము ఎల్లన. ప్రభువు పేరు శేషయ్య అనుట విపరీతము. ఎల్లన పుత్త్రుని పేరు ప్రభువు. వీరన్న పుత్త్రుని పేరు శేషయ్య.

తండ్రులు, తనయులు భిన్నులు. కనుక సత్యభామావిజయము ఘట్టుప్రభువు కృతి కాదు. ఘట్టు శేషయ్య కృతియే. ఘట్టుప్రభువు కృతుల ప్రతుల లేఖనకాలములు కలవు[18]. కుచేలోపాఖ్యానము ప్రతుల లేఖనకాలములు 1. సర్వజిత్తునామసంవత్సరపుష్యశుద్ధద్వాదశీశనివారము. 1768 వ సంవత్సరము. 2. వికృతినామసంవత్సరఫాల్గుణబహుళదశమీబుధవారము. 1771 వ సంవత్సరము. సురాభాండేశ్వరము. ప్రతిలేఖనకాలము కాళయుక్తినామసంవత్సరమార్గశిర శుద్ధఅష్టమీ మంగళవారము. 1799 వ సంవత్సరము. యాజ్ఞవల్క్యచరిత్రము ప్రతిలేఖనకాలము శుక్లనామసంవత్సరశుక్లపంచమీగురువారము. 1807 వ సంవత్సరము. కాఁబట్టి కృతులరచనాకాలములు కుచేలోపాఖ్యానము 1750 ప్రాంతము, సురాభాండేశ్వరము 1755 ప్రాంతము, యాజ్ఞవల్క్యచరిత్రము 1760 ప్రాంతము కావచ్చును.

**కుచేలోపాఖ్యానము** : ఇది శ్రీకృష్ణునికి అంకితము. భాగవతములోని కుచేలోపాఖ్యానమునకు ప్రపంచీకరణము. జగములను రక్షింపుమని, జనములకు సంపద లొసగుమని ఇష్టదేవతాస్తుతి చేయుట విశేషము. అవంతీపురవర్ణనము ఒక రగడలోవినా, అన్యవర్ణనములు లేకపోవుట కూడ విశేషమే. భాగవతమునందు కుచేలుడు శాంతుడు ఇందు ముని. అవంతీపురమునకు అనతిదూరమున గల అడవి మధ్య కొండ మీది తాపసపల్లెయందు నివాసము. పోతన భాగవతమునందు కుచేలుని భార్య పేరు లేదు. ఇందు వామాక్షి అని కలదు. (30ప. 1ఆ.) అందు కుచేలుడు భార్య కోరిన వెంటనే, కృష్ణుని దర్శించుటకు బయలుదేరును. ఇందు కోరిక ముందు, కోరిన తర్వాత కూడ కర్మసిద్ధాంతమును వల్లెవేయును మానవప్రయత్నము గుఱించి మాటాడిన తర్వాత బయలుదేరును. కుచేలుడు ద్వారకలోని ద్వారపాలకులను కృష్ణసందర్శనము కలిగింపుడని కోరినపుడు, పార్శ్వజనులు పరిహాసము చేయుదురు. ఇది భాగవతమునందు లేదు. అందు కృష్ణుడు అటుకులు తీసికొన్న తర్వాత కుచేలునికి ఆతిథ్యమిచ్చును. ఇందు ఆతిథ్యమిచ్చిన తర్వాత అటుకులు తీసికొనును. అందు సంపన్నుడైన కుచేలుడు నిరాసక్తముగ నిఖిలభోగములు అనుభవించును. ఇందు భోగవిముఖుడై శ్రీకృష్ణసాక్షాత్కారమును కోరును. శ్రీకృష్ణుడు సాక్షాత్కరించి, ఉపదేశించిన తర్వాత విరక్తుడై భోగము లనుభవించును.

"కమలము నీరున నుండియుఁ
గమలంబున నంటనట్టి కరణిని సంసా
రమునఁ బ్రవర్తించుచు నా
యమలినచిత్తుఁడు విరక్తుఁడై విహరించెన్. " 108ప. 3ఆ.

ఇందు సంస్కృతసూక్తుల తెనుగుసేతల కంటె, సంస్కృతోట్టంకనములు సమధికము.

'మొదల నెప్పుడు 'వేదమూల మిదం బ్రాహ్మ్య'
  మనఁగఁ ద్రయీధర్మ మభ్యసించె
నరయ 'భార్యాసమో నాస్తి శరీరపో
  షణ' యన నొక పుణ్యసతి వరించె
ధృతి 'నపుత్రస్య గతి ర్నాస్తి' యనియెడి

కతన నందనులఁ బెక్కండ్రఁ గనియె
'సతత మేకో నివాసః పట్టణం వా వ
నం వా' యనంగఁ గానలనె యుండె
నతిశయంబు గాఁగ స్మృతి 'న దైవం కేశ
వాత్పర' మ్మనఁగను వారిజాక్షు
పాదపంకజములు బహుసమారాధన
మాచరించె నా మహామహుండు" 29ప. 1ఆ.

పార్శ్వజనుల పరిహాసమునందు ఒక పరమసత్యము కలదు.

"ఎఱుఁగరు దొడ్డకొంచములు నెంతటి మిత్రులనైన నాత్మమం
దిరములు చేరనీరు కనుతెంపునఁ జేసిన మేలు లప్పుడే
మఱతురు తండ్రి నన్నలఁ గుమారులఁ ద్రుంతురు రాజ్యకాంక్షచేఁ
గరుణ యొకింతలేని మహికాంక్షుల రాజుల నమ్మవచ్చునే " 27ప. 2ఆ.

**సురాభాండేశ్వరము** : ఇది కాశీవిశ్వేశ్వరునికి అంకితము. కాశీఖండములోని సురాభాండేశ్వరమునకు తెనుగు సేత (7ప.) ఏకాశ్వాసము. నూట ముప్పది మూడు పద్యగద్యముల లఘుకావ్యము. ఇతివృత్తము "తొల్లి కాశీపట్టణంబున నొక్క సురవిక్రయుని భార్య రూపవతి యగుటంజేసి బ్రమసి యొక్క తపసి, వాఁడు (ఆమె భర్త) లేని తఱి వాని మందిరమునకుం జని సురతాదిభోగంబులఁ బరితృప్తుండై తద్గృహమేధి రాకఁ దెలిసి భయంబున డాగంబోయి వారుణీకలశంబునం ద్రెళ్లి ప్రాణంబులు విడిచి జ్యోతిర్మయలింగంబై సురాభాండేశ్వరుండను నామంబున బ్రహ్మేచ్యుతాదిదేవగణంబుల చేతఁ బూజింపంబడుచున్నవాఁ డయ్యితిహాసంబు." (17వచ.) ఇట తాపసి "భయంబున డాగంబోయి వారుణీకలశంబునం ద్రెళ్లి " నట్లు కలదుగాని, కావ్యమునందు సురవిక్రయుని భార్య సురాభాండమునందు వసింపుమని సూచించినట్లు కలదు.

"ఏ బూమాటలు వచ్చునో యనుచు ము న్నే నన్నియుం జెప్పితిన్
నా బుద్ధుల్ వినవైతి విప్పు డిదె నా నాథుండు వచ్చెంగదా
యే బొంకు ల్గొఱగావు నిక్క మిఁక నీ వెందుం జనంజాలవే
నీ బాన న్వసియింపు వారుణిరసం బేపాటి యిందున్నదో " 119ప.

సురవిక్రయుని భార్య సుగుణవతి. తాపసి "మన్మథసంతాపభరాంగుఁడగుచు . . . . గేహాంతరముఁ జేరిన, మౌనిఁ గాంచి లేచి యడుగులకుఁ బ్రణామ మాచరించి యర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి వినయసంభాషణములఁ గొంతప్రమద మొసఁగి, శాలితండులాజ్యశాకసూపాదులు దెచ్చి యిచ్చి . . . కొంచు నరుగు మనిన " అతడు "దీనవదనుఁడగుచు ",

"నినుఁ జూచినంతనుండియు
మనసిజుఁ డతిశక్తి మెఱసి మార్గణముల నా
తనువు గుఱిఁజేసి వ్రేయం
గను వేఁదుఱుగొంటి నన్ను కరుణింపఁగదే. 73

పానుపు మీఁదికిం దిగిచి పయ్యెద కొం గెడలించి చన్మొనల్
మేనున నూని పై కుఱికి మీనపతాకుని కేళిఁ జూఱఁగా
దేనియ జోరున న్వడియు తియ్యని మోవి యొసంగి నీ కృపా

దీనుని నన్నుఁ బ్రోచి కడు దీవెనఁ జెందగదే తలోదరీ! " 74

అని ఇంకను వదలి, ప్రాణదానము చేయుమని ప్రాధేయపడును. (75, 76) ఆమె తాను పతివ్రతనని, జారిణిని కానని, ధర్మము కాదని వారించుటయేగాక, తన "విభుఁడు మానధన్యాడుఁడు నిన్ను నన్ను గన్న నెఱి వధించుఁ దథ్య మతఁడ వచ్చు తఱి యయ్యె . . . . నిల్లు వెడలు " మనును. (78-84) అతడు,

"పచ్చని వింటివాని సుమబాణమహోన్నతవహ్నికీలలన్
నిచ్చలు వేగనోప ధరణీజనులందఱుఁ జూడ నీకుఁగా
నచ్చపు దావపావకుని కాహుతిఁ జేసెద నా శరీరమున్
ముచ్చట దీరఁ జూచెదవు ముద్దియ నన్ను వరింపకుండినన్. " 89

అని "తెగువం బలికిన", ఆమె బ్రహ్మహత్యాపాతకదోషమునకు భయపడి, ఒడబడును.

"ఓరి వెడంగు మానవుఁడ యోడక కోమలి హింస సేయఁగా
మేరనఁ దా మహేశ్వరుఁడు మేటి ద్విజుండయి వచ్చి ప్రేమతో
మారుని కేళిఁ దేలి మిము మాన్యులఁ జేయఁదలంచి యిప్పుడీ
వారుణికుంభమందు ఘనవైభవ మొప్పఁగ లింగరూపమై " 145

అని భార్యను వధింపఁబోయిన సురవిక్రయునికి అశరీరవాణి తెలుపును. ఇదొక శివలీల.

**యాజ్ఞవల్క్యచరిత్రము** : ఇది లింగామాత్యునికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. యాజ్ఞవల్క్యచరిత్రము స్కాందపురాణములోని ఆఖ్యానమునకు అనుసరణ మని కలదు. (13వచ. 1ఆ.) ఇందు యాజ్ఞవల్క్యుడు మాతృగర్భమునందు అయిదు సంవత్సరము లుండి, విష్ణువు బ్రహ్మజ్ఞానమంత్రోపదేశము కావించిన అనంతరము జన్మించుట, వైశంపాయనుని బ్రహ్మహత్యను వైదొలగించుట, జనకుని ఆస్థానమునందు మంత్రాక్షతలు చల్లి స్తంభములను చిగురింపఁ జేయుట, వైశంపాయనుడు నేర్పిన విద్యను తిరిగి ఇచ్చివేయుట, సూర్యుని యొద్ద శుక్లయజుర్వేదము నేర్చుట, జనకుని యజ్ఞము నందు ప్రథమునిగ సువర్ణగోదానము నందుట, సువర్ణగోవులను సజీవగోవులను చేయుట, గార్గిని వివాహమాడుట, ఉద్దాలకుని ఓడించుట, శాండిల్యుని భస్మము చేసి పునర్జీవితుని చేయుట, గౌతమకశ్యపాదిసంయములకు సమస్కంధుడగుట మొదలైన మహిమాన్వితములైన బహువిషయములు కలవు. కావ్యత్వసిద్ధి కంటె పౌరాణికప్రతిపత్తి అధికము.

**రాపాక లక్ష్మీపతి** : ఇతని కృతులు 1. ఆచార్యవిజయము. 2. శ్రీమదుపాఖ్యానము. 3. నీళావివాహము. 4. శ్రీకృష్ణవిలాసము. 5. భద్రాయురభ్యుదయము. ఇందు మొదటి నాలుగును అముద్రితములు. భద్రాయురభ్యుదయము రాజేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. కృతిప్రేరకుడు దోమకొండ సంస్థానాధిపతి కామినేని రాజన్న - అతని కాలము 1748-57. కాఁబట్టి భద్రాయురభ్యుదయము రచనాకాలము[182] 1750 ప్రాంతము కావచ్చును.

భద్రాయురభ్యుదయములోని ఇతివృత్తము బ్రహ్మోత్తరఖండములోని సుందరుని కథ. సుందరుడను బ్రాహ్మణుడు పింగళ అను వేశ్యతో కాపురము సేయును. ఋషభశి

వయోగిని సత్కరించుట వలన మఱు జన్మమునందు సుమతీవక్రనాభులను రాజదంపతులకు జన్మించును. అతడు, సుమతి వ్యాధిగ్రస్తులై అదేపనిగ రోదించుట వలన, వక్రనాభుడు ఇద్దఱిని అడివిపాలు సేయును. అతడు చనిపోవును. ఋషభశివయోగి బ్రతికించును. భద్రాయువగును. ఒక వైశ్యుడు తల్లి కొడుకులను చేరదీయును. పరరాజునకు ఓడిపోయి బందీకృతుడైన తండ్రిని భద్రాయువు విడిపించును. పింగళ సీమంతినీ చంద్రాంగదులకు కీర్తిమాలిని పేరజన్మించును. ఋషభశివయోగి ఆదేశానుసారము భద్రాయువు కీర్తిమాలినిని వివాహమాడును.

ఇందు ఆశ్వాసవిభాగము బదులు ఉల్లాసవిభాగము కలదు. ప్రథమోల్లాసమెల్ల అవతారికయే. షష్ఠ్యంతపద్యములు ద్వితీయోల్లాసాదిని కలవు. ఋషభశివయోగి ఉపదేశములు పురాణమనిమించును. తృతీయోల్లాసమునందు యుద్ధవర్ణనములు సమధికము సూర్యాస్తమయాదిచంద్రికాపర్యంతవర్ణనమును కలదు. చతుర్థోల్లాసము కీర్తిమాలిని సౌందర్య, విరహ, వనవిహార, శీతలోపచార, మన్మథాద్యుపాలంభవర్ణనలమయము. పంచమోల్లాసమునందు ప్రభాతవర్ణన, మఱల కీర్తిమాలిని విరహావస్థ, వివాహము, విప్రలంభసంభోగవర్ణనలు కలవు.

**బచ్చలి వీరవెంకయ్య** : ఇతని కృతి రఘువంశము. అముద్రితము. విరించిపురమందలి మార్గసహాయేశ్వరునకు అంకితము - దైవాంకితము. ఇతడు 1750-54 నడుమ కర్ణాటకపాలకుడు బాబరల్లీఖాను సన్మానమును అందుకొని, తిరిగివచ్చుచుండగా, ఆర్కాడు సమీపమునందలి విరించిపురములోని మార్గసహాయేశ్వరుడు స్వప్నమునందు సాక్షాత్కారనై రఘువంశమును రచింపుమన్నట్లు వంశీయుని లిఖితకథనము కలదు[183]. కాఁబట్టి రఘువంశము రచనాకాలము 1750 ప్రాంతము కావచ్చును.

**కనపర్తి అబ్బయామాత్యుడు** : ఇతని కృతులు 1. అనిరుద్ధచరిత్రము. 2. కవిరాజమనోరంజనము లేక పురూరవశ్చరిత్రము. మొదటిది మంగళగిరి నరసింహస్వామికి అంకితము. రెండవది గోపాలునికి అంకితము. రెండును దైవాంకితములు. ఇతడు 1750 ప్రాంతము వాడని ఒక అభిప్రాయము కలదు[184]. అనిరుద్ధచరిత్రమునందు "పెంపు మీఱ వసంతఫేషువా హుజూరున" అని కలదు. (19ప. 3ఆ.) వసంతఫేషువా అన వసంతపీష్వా. పీష్వా అనగా మంత్రి. మన్మథుడు పాదుషా. వసంతుడు పీష్వా అని కవిప్రయోగము. పీష్వాశబ్దము బాలాజీబాజీరావు కాలమునందు (1740-61) ప్రసిద్ధము. ఇది 1750 ప్రాంతమగుటకు అంతస్సాక్ష్యమని మఱొక అభిప్రాయము కలదు. కనపర్తి అబ్బనామాత్యుని వంశవృక్షమునుబట్టి కూడ 1750 ప్రాంతమని ఇంకొక అభిప్రాయము కలదు. కాఁబట్టి అనిరుద్ధచరిత్రము రచనాకాలము 1755 ప్రాంతము, కవిరాజమనోరంజనము రచనాకాలము 1760 ప్రాంతము కావచ్చును.

**అనిరుద్ధచరిత్రము** : ఇది ఉషాపరిణయము. చర్వితచర్వణము. ఇందు రుక్మవత్యనిరుద్ధుల పరిణయమును ముందు కలదు. ఉషాస్వప్నవృత్తాంతమునందు ఔచిత్యము లేదు. సంభోగవర్ణనము కలదు. (64ప. 2ఆ.) అంతేకాదు. అది ఉష చిత్రలేఖకు వివరించును. (91ప. 2ఆ.)

"చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరి సొమ్ము గాదు భా

రతి దయ సాధవార్థి కవిరాజులమానసముల్ ఘటంబు, లా
యతము కొలంది లభ్యమగు నయ్యమృతం బటుగాఁ దలంచి య
ద్యతనకవీంద్రులార! కృప దప్పక మత్కృతి నాదరింపుఁడీ " 9ప. 1ఆ.

అని కవి అభ్యర్థనము. అప్పటి కవీంద్రు లాదరించునంత కవిత్వసంపద కలదే.

అనిరుద్ధచరిత్రమునందు పుర (53-73వచ. 1ఆ; 40ప. 3ఆ.) నాయక (77-85ప. 1ఆ.) నాయికా (87-90ప. 1ఆ; 20-34ప. 2ఆ; 62-65ప. 3ఆ.) వివాహ (91-107ప. 1ఆ.) సంభోగశృంగార (109-116, 118-119ప. 1ఆ; 64ప. 2ఆ; 75-83, 94-98ప. 3ఆ; 77ప. 5ఆ.) వసంతర్తు (36-42ప. 2ఆ.) మనకేళి (44-54ప. 2ఆ.) సరోవర (56ప. 2ఆ.) జలకేళి (57ప. 2ఆ.) నాయికావిరహ (67-79, 90-94, 131-141ప. 2ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (4-18ప. 3ఆ; 84-89ప. 3ఆ.) మన్మథపూజా (19ప. 3ఆ.) శిశిరోపచార (22-25ప. 3ఆ.) మన్మథాద్యుపాలంభ (27-35ప. 3ఆ.) గర్భధారణ (99-103ప. 3ఆ.) యుద్ధ (108-114ప.3ఆ; 23-100ప. 4ఆ; 18వచ. 5ఆ.) కుమారాభ్యుదయ (81-101ప. 5ఆ.) వర్ణనలు కలవు.

**కవిరాజమనోరంజనము** : ఇది పురూరవశ్చరిత్రము. ఇందు అవతారిక లేదు. ఇష్టదేవతాస్తుతి, ఆశ్వాసాద్యంతపద్యములు కలవు. విరక్తుడైన పురూరవుడు ఊర్వశియందు అనురక్తుడగుట ఇతివృత్తము. ఇది కాళిదాసు విక్రమోర్వశీయములోని ఇతివృత్తమునకు భిన్నము. పురూరవుని జన్మవృత్తాంతమునకు తారాశశాంకుల వృత్తాంతము, ఇలావతీ బుధుల వృత్తాంతము కలవు. (ద్వి. ఆ.) ఇందు ఇలావతి సుద్యుమ్నుడగుట, సుద్యుమ్నుడు ఇలావతి అగుట ఒక చిత్రమైన సంఘటన. ఊర్వశీపురూరవుల సమావేశమునకు చిత్రపటము మఱొక విచిత్రమైన సంఘటన. ఊర్వశీపురూరవుల వియోగమునకు ఊర్వశి పెంపుడు జోడుతగళ్ళు ఇంకొక మహాచిత్రమైన సంఘటన.

కవిరాజమనోరంజనమునందు పుర (ప్ర. ఆ.) విరహ (తృ.చ.పం.ఆ.) వనకేళి, జలకేళి, మన్మథపూజా, మన్మథాద్యుపాలంభ (తృ.ఆ.) షడృతు (చ.ఆ.) వన (పం.ఆ.) మృగయా (ప్ర.ఆ.) యుద్ధ (తృ.ఆ.) వర్ణనలు కలవు. (సోష్ఠ్యనిరోష్ఠ్యపద్యముల (చ.ఆ.) తోపాటు పురూరవుని విష్ణుస్తుతియందు గోమూత్రికాబంధము, నాగబంధము, ఛత్ర బంధము, అష్టదళపద్మబంధము, చక్రబంధము, సర్వతోభద్రబంధశ్లోకము, ఆంధ్రగీర్వాణ భాషాశ్లేషకందము, కందద్వయరుగ్మవతీకమలవిలసితగర్భక్రౌంచపదవృత్తము; ఆశ్వా సాంతపద్యములందు పుష్పమాలికాబంధము, ఖడ్గబంధము, గోమూత్రికాబంధము (చ.ఆ.) మొదలైన చిత్రగర్భబంధకవిత్వములు కలవు. చక్రబంధమునందు శ్రీగోపాలాంకితం, సుకవి అబ్బెన్న అని కలదు.

విరక్తుడైన పురూరవునికి పుత్త్రులు కూడ శత్రువులు.

"కొడుకులు గల్గు దాఁక నొక కొన్ని దినంబులు చింత నందనుల్
బొడమిన నాయువు న్బలము బుద్ధియు విద్యయుఁ జాలఁ గల్గఁగా
నుడుగని చింత గల్గి తను నోలి భజింపని చింత తండ్రి కె
ప్పుడుఁ గడు చింత సేయుదురు పుత్త్రులు శత్రులు గాక మిత్రులే" ప్ర. ఆ.

అనురక్తుడైన పురూరవునికి అరడజనుమంది పుత్త్రులు!

"అయ్యూర్వసీపురూరవస్సులకు నగ్రసుతుండయి

> జనియించిన యాయువునకు సహోదరులయి క్రమంబున
> శ్రుతాయువును సత్యాయువును జయుండును విజయుండు నన
> నేవురుపుత్త్రు లుదయించిరి తత్కుమారషట్కంబువలన-"

**ధూర్జటి లింగరాజు** : ఇతని కృతులు 1. రమావ్రతచరిత్ర 2. కవేరజామాహాత్మ్యము. 3. మణిమంటపప్రభావము. 4. శతకములు. 5. పెదకాళహస్తిమాహాత్మ్యము. 6. ద్విపదభాగవతము. ఇందు మొదటి నాలుగును నామమాత్రావశిష్టములు. చివటి రెండును అముద్రితములు. మణిమంటపప్రభావము వేంకటగిరి సంస్థానాధిపతి కుమార యాచమనాయని ప్రశంసలందినది[185]. పెదకాళహస్తిమాహాత్మ్యము కాళహస్తి సంస్థానాధిపతి దామరల వేంకటపతినాయనికి అంకితము. అతనికాలము పదునెన్మిదవశతాబ్ది మధ్యభాగము[186]. కావున, కుమారయాచమనాయుడు సర్వజ్ఞకుమారయాచమనాయుడు (1695-1748) కావలయును. లింగరాజు కుమారధూర్జటి కుమారుడు. అతని కృతుల రచనాకాలములు 1705, 1710 అని పూర్వోక్తము. కాఁబట్టి పెదకాళహస్తిమాహాత్మ్యము రచనాకాలము 1750 ప్రాంతము, ద్విపదభాగవతము రచనాకాలము 1755 ప్రాంతము కావచ్చును.

పెద కాళహస్తిమాహాత్మ్యము నేడు కానరాదు.

**పూసపాటి విజయరామరాజు** : ఇతని కృతులు 1. విష్ణుభక్తిసుధాకరము. 2. పారాశరీయహోర. మొదటిది అముద్రితము. రెండవది జ్యోతిశ్శాస్త్రగ్రంథము. విష్ణుభక్తి సుధాకరము రామతీర్థములోని సీతారాములకు అంకితము. దైవాంకితము. ఇతడు విజయ నగరసంస్థానాధిపతి కాడు. రేగులవలస శాఖీయుడు. ఇతని గురువు తిరుమల పెద్దింటి సంపత్కుమారాచార్యులు. అతడు గోగులపాటి కూర్మనాథమునకు కూడ గురువు. కూర్మనాథము కృతుల రచనాకాలము 1745-60 అని పూర్వోక్తము. కాఁబట్టి విష్ణుభక్తి సుధాకరము రచనాకాలము 1760 ప్రాంతము కావచ్చును.

ఇందు కులశేఖరాళ్వారు కూతురు నీలాంశజ శ్రీరంగనాథుని పరిణయమాడుట ఇతివృత్తము[187]. పరమయోగివిలాపములోని కథకు ప్రపంచీకరణము.

**పరశురామపంతుల లింగమూర్తి** : ఇతని కృతులు 1. రతిమన్మథవిలాసము. 2. సీతారామాంజనేయసంవాదము. 3. అధ్యాత్మరామాయణము. 4. మానసశతకము. 5. సాంఖ్యయోగము. 6. సీత పాట. 7. జీవన్ముక్తిప్రకరణము. 8. బ్రహ్మనారదసంవాదము. ఇందు రతిమన్మథవిలాసము కావ్యము. దానికి ఇతని కుమారుడు రామమూర్తి శుద్ధప్రతిని "ప్లవంగనామసంవత్సరజ్యేష్ఠబహుళగురువారము" నాటికి వ్రాసినట్లు కలదు[188]. అది 1760 వ సంవత్సరమగును. కాఁబట్టి రతిమన్మథవిలాసము రచనాకాలము 1760 ప్రాంతము, కడమగ్రంథముల రచనాకాలము తదనంతరము కావచ్చును.

రతిమన్మథవిలాసము శృంగారకావ్యము.

**పోడూరి పెదరామయ్య** : ఇతని కృతి శివరామాభ్యుదయము. అముద్రితము. ఆచంట రామేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. కృతిప్రేరకుడు గురజాల పేరయమంత్రి. అతడు బమ్మెర కేసన, మల్లనల దాక్షాయణీపరిణయము ప్రతిని వ్రాయించుకొన్న కాలము 1756 వ సంవత్సరము. ఇది పూర్వోక్తము. కాఁబట్టి శివరా

మాభ్యుదయము రచనాకాలము 1760 ప్రాంతము కావచ్చును.

శివరామాభ్యుదయము ద్వ్యర్థికావ్యము.

**కొత్ర వేంకటేశ్వర్లు** : (బాలకవి) ఇతని కృతులు 1. విమలాంగీపరిణయము. అసమగ్రముగ లభించినది. అముద్రితము. 2. భల్లాణచరిత్రము. అనుపలబ్ధము. విమలాంగీపరిణయము వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు బొబ్బిలి సంస్థానకవి. కాలము 1730-90 అని కలదు[189]. కాఁబట్టి విమలాంగీపరిణయము రచనా కాలము 1760 ప్రాంతము కావచ్చును.

**రోసనూరి వేంకటపతి** : ఇతని కృతి విష్ణుమాయావిలాసము. పద్యకావ్యము. వేంకట గిరి సంస్థానాధిపతి బంగారుయాచమనాయకునికి అంకితము. అతడు కుమార యాచమనాయకుని కుమారుడు. కుమారయాచమనాయకుని సంస్థానాధిపత్యకాలము[190] 1697-1748. బంగారు యాచమనాయకుని సంస్థానాధిపత్యకాలము[191] 1755-77. ఇద్దఱి కాలము లందును ఇతడు సంస్థానకవి. ఆ కాలము స్థూలముగ 1725-65 కావచ్చును. కాఁబట్టి విష్ణుమాయావిలాసము రచనాకాలము 1760 ప్రాంతము కావచ్చును.

విష్ణుమాయావిలాసమునందు కంకంటిపాపరాజా విష్ణుమాయావిలాసయక్షగానము నకును అనుసరణము కలదు. ఒక నిదర్శనము[192]:

యక్షగానము : శైవుఁడొక్కఁడు బారఁజాచి మోహిని యనుచుఁ
గావరంబున నొకనిఁ గౌఁగిటను జేర్చెన్
జడలు వీడఁగ మహేశ్వరు సేవకుం డొకఁడు
ఎడతెగక శివమెత్తి శివమాడఁ దొడఁగెన్
ప్రమథుఁడొక్కఁడు తమకపడి లేచి చెలి యనుచు
భ్రమసి కంబము పైఁడి ప్రతిమ ముద్దాడెన్
ఒక వీర మాహేశుఁ డొద్ది శిష్యునిఁ జేరి
సకి యేమొ యని వాని జడలు పట్టీడ్చెన్
ప్రమదమున నొక రుద్రభటుఁడు తన కుంచె యని
గమకించి యొకని గడ్డము పట్టి తీసెన్. "

పద్యకావ్యము : "ప్రమథుఁ డొక్కం డొక్క ప్రమథుఁ దర్భామగా
భావించి గడ్డంబు పట్టి తివియు
భ్రమగొని యొక రుద్రభటుఁ డొక్క శివదూతఁ
గాంతగాఁ గనుఁగొని కౌఁగిలించు
మఱి యొక్క శైవుఁ డుమామహేశ్వరుని సేవ
కునిఁ బడంతిగ నెంచి పెనఁగఁ బోవు
భవు భృత్యుఁ డొక్కండు పసిఁడి కంబపు బొమ్మఁ
గొమ్మని ముద్దాడుఁ గోర్కి మెఱయ "

**కాణాదము పెద్దనసోమయాజి** : ఇతని కృతులు 1. యథాశ్లోకతాత్పర్య రామాయణ బాలకాండము. 2. భోజవ్యాఖ్య. చంపూరామాయణవ్యాఖ్యానము. అనుపల బ్దము. 3. శేషశైలేశలీల. అపంచవర్గీయచిత్రకావ్యము. అనుపలబ్ధము. 4. మత్స్యపురాణము. అనుపలబ్ధము. 5. అధ్యాత్మరామాయణము. 6. ముకుందవిలాసము. బాలకాండము,

ముకుందవిలాసము గద్వాలకేశవస్వామికి అంకితములు. మత్స్యపురాణము సురపురము లక్ష్మీరమణునికి అంకితము. మూడును దైవాంకితములు. బాలకాండము రచించుటకు కారకుడైన గద్వాల సంస్థానాధిపతి ముష్టిపల్లి పెద సోమభూపాలుని కాలము 1663-1712 అని పూర్వోక్తము. మత్స్యపురాణము రచించుటకు ప్రేరకుడైన సురపురము సంస్థానాధిపతి బాహిరి పామనృపాలుని కాలము[193] 1752-73. ముకుందవిలాసము రచించుటకు కారకుడైన గద్వాల సంస్థానాధిపతి ముష్టిపల్లి చిన సోమభూపాలుని కాలము[194] 1762-93. కాఁబట్టి కృతుల రచనాకాలములు బాలకాండము 1710 ప్రాంతము, భోజవ్యాఖ్య 1720 ప్రాంతము, శేషశైలలీల 1730 ప్రాంతము, అధ్యాత్మ రామాయణము 1740 ప్రాంతము, మత్స్యపురాణము 1750 ప్రాంతము, ముకుంద విలాసము 1762 ప్రాంతము కావచ్చును.

బాలకాండమునందు పెద్దన సోమయాజి అని కలదు. అధ్యాత్మరామాయణము నందును అట్లు కలదు. ముకుందవిలాసమునందు పెద్దన అనియే కలదు. సోమయాజి అని లేదు. లేకపోవుటకు హేతువు కాకపోవుట అయిన, బాలకాండమునందు, అధ్యాత్మ రామాయణమునందును ఉండుట బాధకము. ముకుందవిలాసమునందు బాలకాండము ప్రసక్తి లేదు. అధ్యాత్మరామాయణము ప్రసక్తి కూడ లేదు. లేకపోవుటకు హేతువు రచింపక పోవుట కాదు. అయిన, బాలకాండము అధ్యాత్మరామాయణము ముందు రచించియుండుట మఱల బాధకము. ముకుందవిలాసమునందు సోమయాజి అని లేకపోవుటకు హేతువు నిర్లిప్తత కావచ్చును. పై గ్రంథపౌర్వాపర్యము నిశ్చితార్థము.

కాఁణాదము పెద్దన జీవితకాలము కృతుల రచనాకాలములనుబట్టి 1680-1765 అగును. అతడు మొదట పెదసోమభూపాలుని ఆస్థానకవి అయి, పెదసోమభూపాలుని అనంతరము బాహిరి పామనృపాలుని ఆస్థానకవి అయి, మఱల చినసోమభూపాలుని ఆస్థానకవి అగును. పెదసోమభూపాలుడు, చినసోమభూపాలుడు తాత మనుమలు. పెదసోమభూపాలుని అనంతరము గద్వాల సంస్థానాధిపతులైన, అతని జ్యేష్ఠపుత్త్రుడు తిరుమలరాయలు, అగ్రమహిషి అమ్మకాంబ, కనిష్ఠపుత్త్రుడు రామరాయలు కవిపోషకులు కారు.

ముకుందవిలాసము : చక్రపాణిపరిణయమని కూడ కవినిర్దేశము. (330ప. 3ఆ.) ఇందు కృష్ణుడు మేనత్త కూతురు భద్రను వివాహమాడుట ఇతివృత్తము. ఇది సంస్కృత భాగవతమునందు ఒక శ్లోకము. (56శ్లో. 58అ. 10స్కం.) పోతన భాగవతము నందు ఒక పద్యము (145ప. 10స్కం. ఉ. భా.) ముకుందవిలాసమునందు ఎనిమిది వందలపద్యగద్యములు కలవు. ప్రథమాశ్వాసమునందు మయుని, ఇంద్రుని వృత్తాంతము లు (160-209ప.) ప్రధానకథకు ప్రయోజనాత్మకములు కావు. వసుదేవుడు తన సోదరి శ్రుతకీర్తి క్షేమ మరయుటకు ప్రియకుమారుడు గదుని పంపుటతో అసలు కథ ఆరంభ మగును. (210ప. 1ఆ.) గదుడు వెళ్లి, వచ్చి, కృష్ణునికి మేనత్త కూతురు భద్ర సౌందర్యమును వివరించును. కృష్ణునికి మోహము కలుగును. ఉద్యానవనమునందు విహరించునెడ ఒక చిలుక సహితము భద్ర సౌందర్యమును విశదీకరించును. కృష్ణుని మోహము పెరుగును. చిలుకను సంధానము చేయుమని కోరును. చిలుక ఱెక్కల

సందున భద్రపఱిచి తెచ్చిన భద్ర చిత్రపటమును ఇచ్చును. కృష్ణుడు ఇచ్చిన పారిజాత పుష్పహారమును భద్రకు ఇచ్చి, చిలుక కృష్ణుని సౌందర్యమును తెలుపును. ద్వారకా నగరమున కృష్ణుని విరహము. కేకయనగరమున భద్ర విరహము. భద్ర తండ్రి ధృష్టకేతువు స్వయంవరము ప్రకటించును. భద్ర స్వయంవరమునందు కృష్ణుని వరించును. ప్రతిఘటించిన రాజులను కృష్ణుడు ఓడించును. భద్రాకృష్ణులవివాహము. శోభనము. భద్రజయుడను కుమారుని జననము. సాధారణమైన కథ అసాధారణమైన కవిత్వము. చిత్రగర్భ బంధకవిత్వములు అదనము.

"కుందవిలాసము తావి ము
కుందవిలాసము సదా ముకుందవిలాసం
బిందువిలాసమును సుధా
బిందువిలాసము హసించు పేశలఫణితిన్." 33ప. 1ఆ.

అని కవి అహంప్రత్యయము. శబ్దార్థచమత్కారములు సమధికము.

"గతి మత్తేభము నాస చంపక మొగిం గైశ్యంబు కందంబు సం
గతవాక్యంబులు మత్తకోకిలలు దృక్పాండిత్య మయ్యుత్పల
ద్యుతి మో మంబురుహంబు దేహరుచి విద్యున్మాలిగా మానినీ
తతవృత్తస్థితి లెన్నఁగాఁ దరమె తద్వాగ్జానికైనం దగన్." 225ప. 1ఆ.

ఇది భద్ర సౌందర్యమునకు వివిధవృత్తనీరాజనము.

"ఒక యేటఁ జిక్కె మీనము
నొక నెలచేఁ జిక్కెఁ బద్మమొక పగటింటన్
వికలతఁ జిక్కెం గుముదము
సకి నయనసమంబు లగునె జడగతు లెపుడున్." 219ప. 1ఆ.

ఇది భద్ర కన్నుల వర్ణన. కన్నులను చేపలతోను, తామరలతోను, కలువలతోను పోల్చుట కవిసమయము. కాని భద్ర కన్నులతో పోల్చదగినవి కావని చమత్కారకల్పనము. చేపలు సమానములు కాలేక నీటిలో ఉండునని, ఏడాదికే కృశించునని అర్థద్వయము. తామరలు సమానములు కాలేక వెన్నెలచేత ముకుళించునని, నెలకే వాడిపోవునని అర్థద్వయము. కలువలు కూడ సమానములు కాలేక పగలు ముకుళించునని, ఒక్కనాటికే వాడిపోవునని అర్థద్వయము. అవి జడగతులు. అనగా జడపదార్థములు. జలచరములని అర్థాంతరము. భద్ర కన్నులు జడగతులు కావు. సచేతనములు చైతన్యచకచ్చకితములు. అంతేకాదు. చేపల ఆయుర్దాయము సంవత్సరము. తామరల వికాసము మాసము. కలువల విలాసము దినము. క్షణికములు. భద్ర కన్నులు నిత్యప్రత్యగ్రములని ధ్వని.

"కందర్పరసమునఁ గలికి కూష్మము హెచ్చె
నష్టమూర్తిహితాప్తి నందరమ్మ
చంద్రోదయమటన్న సతికిఁ గాక యెసంగె
మార్తాండయోగాశ మనుపరమ్మ
నవమాలినీవసంతమున శాంతిల దింతి
మధుసూదననియుక్తి మనుపరమ్మ

శీతప్రభంజనస్థితి లతాంగి చలించె
వాతభంజినిఁ గూర్ప వలవరమ్మ
సతియు భావభవాతంకశంకఁ బూన
స్నేహగతిఁ గాఁచ నెవ్వారిచేత నోపు
నచ్యుతానంద గోవింద యని తలంచి
చేరి భవరోగవైద్యు భజింపరమ్మ. " 95ప. 3ఆ.

ఇందు కందర్పరసము మకరధ్వజము. అష్టమూర్తిహితాప్తి గంధకము. చంద్రోదయము. పూర్ణచంద్రోదయము, మార్తాండయోగము సూర్యావర్తి, నవమాలినీ వసంతము వసంతకుసుమాకరము, మధుసూదనము వైష్ణవీరసము, శీతప్రభం జనము శీతభంజనము, వాతభంజిని అనునవి ఆయుర్వేదౌషధములు కూడ.

ముకుందవిలాసమునందు తిక్కన, పోతన, అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, చేమకూర వేంకటకవి పద్యములకు అనుకరణములు అధికము.

" నేరెటీటి యసల్ తెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన రాపాడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
పీనిఁ గాకున్నఁ గలదె యీ మేని కాంతి. " 36ప. 2ఆ.

అను అల్లసాని పెద్దన పద్యైకదేశమునకు -

" అమృతరసంబులో మిసిమి యాఱని మీఁగడఁ దీసి దానిలో
సమముగ జాళువా మెఱుఁగు సన్నరవల్ సమకూర్చి వెన్నెలం
గమిచి మెఱుంగునన్ మెదిచి కాంచనసూనపరాగపాళిఁ గృ
త్రిమముగ మేళవించి యొనరింపఁగ బోలు విధాత యీ సతిన్. " 95ప. 2ఆ.

అను కాణాదము పెద్దన పద్యము అనుకరణమైనను అమోఘము.

ప్రసిద్ధసంస్కృతశ్లోకముల తెనుగు సేతలును ప్రశంసాపాత్రములు.

"సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాతమధుర మన్యదాలోచనామృతమ్. "

" సరసస్ఫూర్తి సరస్వతీయువతికిన్ సంగీతసాహిత్యముల్
వరవక్షోజయుగంబ నాఁ బఱఁగు విద్వద్భాలవృద్ధిక్రియా
కరసంపజ్జనకంబు లం దొకటి ద్రాక్షాగుచ్ఛమాధుర్యవై
ఖరి వేఱొక్కటి నారికేళఫలపాకవ్యాప్తి సౌఖ్యంబిడున్. " 246ప. 2ఆ.

ఇందు "విద్వద్బాలవృద్ధిక్రియాకరసంపజ్జనకంబులు" అను వివరణ స్పష్టార్థప్రతిపత్తి.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః
సాహిత్యరసమాధుర్యం శంకరో వేత్తి వా న వా. "

" శిశువులకుం బశువులకున్
వశమై సొక్కించు గానవైఖరి మధురా
తిశయము సాహిత్యరుచిన్
భృశగతి సర్వజ్ఞుఁడైన నెఱుఁగం గలఁడే " 247ప. 2ఆ.

ఇందు ఫణి లేదు. సాహిత్యరుచిని సర్వజ్ఞుడును ఎఱుగలేడనుట అత్యుక్తి.

" నైవవ్యాకరణజ్ఞమేతి పితరం న భ్రాతరం తార్కికం
దూరాత్ సంకుచితైవ గచ్ఛతి పున శ్చండాలవ చ్ఛాందసాత్

మీమాంసానిపుణం నపుంసకమితి జ్ఞాత్వా నిరస్యాదరా
కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకాంతా వృణీతే స్వయమ్. "
ఇది బిల్హణచరిత్రములోనిది.

" ఒనరన్ వ్యాకరణజ్ఞుఁ దండ్రి యనుచున్ దర్కజ్ఞునిం భ్రాతయం
చును మీమాంసకుని న్నపుంసకుఁ డటంచున్ వీడి దూరంబునం
గని యస్సృత్యునిఁ బోలె ఛాందసుని వేఢ్యం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరించున్ భావగర్వంబునన్. " 250ప. 2ఆ.

ముకుందవిలాసమునందు అక్షరద్వయకందము (250ప. 1ఆ.) కందద్వయగర్భిత చంపకమాలికావృత్తశేషబంధచిత్రము (290ప. 1ఆ.) ఆశ్వాసపూర్ణనియతశైలబంధ చిత్రకందము (294ప. 1ఆ.) పుష్పగుచ్ఛబంధచిత్రపంచచామరవృత్తము (295ప. 1ఆ.) చక్రబంధచిత్రశార్దూలవృత్తము (279ప. 2ఆ.) ఛత్రబంధచిత్రకందము (280ప. 2ఆ.) గోమూత్రికాబంధచిత్రసుగంధివృత్తము (281ప. 2ఆ.) వృత్తకందగర్భితసీసము (306ప. 3ఆ.) ద్విపదచౌపదిలాలిశోభన మంగళహారతి సువ్వాల ధవళాది వివిధ భేదసీసము (309ప. 3ఆ.) పాదభ్రమకకందము (310ప. 3ఆ.) నిరోష్ఠ్యద్వివిధకందము (311ప. 3ఆ.) అపంచవర్గీయముక్తపదగ్రస్తము (315ప. 3ఆ.) శుద్ధపంచవర్గీయము (316ప. 3ఆ.) అచలజిహ్వక (317ప. 3ఆ.) అక్షరద్వయకందము (318ప. 3ఆ.) కలవు. మొదటి అక్షరద్వయకందము వినా కడమవి ఆశ్వాసాంతపద్యములు, స్తోత్రములు మాత్రమే.

ముకుందవిలాసమునందు పుర (100-134ప. 1ఆ; 45ప. 2ఆ.) నాయక (135-159ప. 1ఆ; 231-235ప. 2ఆ; 19-31ప. 3ఆ.) నాయికా (214-230ప. 1ఆ; 65-83, 89-127, 201-213ప. 2ఆ.) వసంతర్తు (236-251ప. 1ఆ.) నగ (267, 270-276ప. 1ఆ.) వన (278-279ప. 1ఆ.) వనవిహార (282-290ప. 1ఆ.) దశావతార (28-37ప. 2ఆ.) మన్మథ (85ప. 2ఆ.) నాయకవిరహ (261-78ప. 2ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (41-48, 104-108ప. 3ఆ.) నాయికావిరహ (6, 40, 61, 92-93ప. 3ఆ.) మన్మథాద్యుపాలంభ (63-90ప. 3ఆ.) శిశిరోపచార (95-100ప. 3ఆ.) వనకేళి (111-120ప. 3ఆ.) జలకేళి (121-126ప. 3ఆ.) కృష్ణపూజా (130-133ప. 3ఆ.) స్వయంవర (145-271ప. 3ఆ.) యుద్ధ (219-238ప. 3ఆ.) వివాహ (239-284ప. 3ఆ.) శోభన (288-298ప. 3ఆ.) కుమారాభ్యుదయ (299-324ప. 3ఆ.) వర్ణనలు కలవు.

**నంబెరుమాళ్ల (సురపురము) కేశవయ్య :** ఇతని కృతి నిరోష్ఠ్యదాశరథిచరిత్ర. కృష్ణునికి అంకితము. దైవాంకితము. ఇతని కాలము 1760 ప్రాంతమని కలదు[195]. కాఁబట్టి నిరోష్ఠ్యదాశరథిచరిత్ర రచనాకాలము 1765 ప్రాంతము కావచ్చును.

ఇది ఉత్తరరామాయణము. అసమగ్రముగ లభించినది. సీతాపరిత్యాగఘట్టము ముందు వఱకు నాలుగాశ్వాసముల గ్రంథము. ఉత్తరరామాయణము మఱల రచించుటకు హేతువులు 1. తిక్కన ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము నిరోష్ఠ్యగ్రంథములు కాకపోవుట. 2. మతింగంటి సింగరాచార్యుల నిరోష్ఠ్యదశరథ రాజ నందనచరిత్రయందు ఉత్తరరామాయణము లేకపోవుట.

"ఓయి మతిగంటి సింగరాచార్యుండు మున్ను

నలినభవనుతరామాయణంబునందు
నమరు షట్కాండములు నిరోష్ఠములు సేసె
సప్తకాండ మెవ్వరు సేయఁజాలరైరి. 30ప.
క్రమతన్ రెండవ మంత్రమున్ దెలుపు శ్రీరామాయణంబందు ను
త్తమమౌ యుత్తరకాండ మెల్లను లసత్ప్రౌఢిన్ నిరోష్ఠంబుఁ జే
సి మదీశుండగు కృష్ణమూర్తికి యశశ్శ్రీ మించ నర్పింపు హ
ర్షముతో లోకయపుత్త్ర! నీకును బునర్జన్మంబు లేకుండెండిన్." 31ప. 1ఆ.

అని స్వప్నమునందు తండ్రి ఆనతి.

ఇందు మూలానుసరణముతోపాటు తిక్కన, కంకంటి పాపరాజుల ఉత్తరరామాయణముల అనుసరణమును కలదు. ఇతర కవుల పద్యముల అనుకరణమును కలదు.

తిక్కన ఉత్తరరామాయణమునందు వలె, ఇందు పూర్వరామాయణము సంగ్రహముగ కలదు. (77-140ప. 1ఆ.) కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము నందు వలె రంభారావణసంవాదమునందు రావణుని వాదము కలదు.

"చెలియ! ధరిత్రియాగతతిఁ జేసిన తండ్రిని నందనాగ్రణిం
దెలియఁగ దాయి నన్న ననిఁ ద్రెళ్లిన జేతలఁ దద్దితచ్ఛటం
గలియఁగలేదటే! తనయకాంత నటంచిట నేఁ దలంకఁగా
నలరఁగ నేఁగెదేల గణికాంగన లీ క్రియ నన్న లెస్సయే." 329ప. 2ఆ.

చేమకూరవేంకటకవి యమకములకు సమకములు కలవు.

"ఈ నెలంత యలికలీల లేనెలంత
ఈ యనంతధీనిధి కటియే యనంత
ఈ సదాశీతహర నఖశ్రీ సదాశి
ఈ సతీరేఖ రతితిలనాస తీరె." 111ప. 1ఆ.

సీత జలక్రీడానంతరము సఖీజనుల నీడలు నీట గని రామునితో,

"అనఘ! నీ యంఘ్రి నాఁడంటనయ్యె ఱాయి
లలన, యీ సరసిం గల లతల నంట
కాంతలైనారదే కంటె కాంత! యనిన
సతికి నిట్లనె దశకంఠశాసి యలరి. 188ప.
చెలి! యట్ల కా దహిలలన
లల స్త్రీహరణేచ్ఛ గల దశాస్యనరాశిన్
దళియించిన నిన్ గనఁ గాం
క్షల కిట కేతెంచినా రగస్త్రని! గంటే." 189ప. 4ఆ.

ఇది సీతారాముల సరససల్లాపము!

పుర (77-92ప. 1ఆ; 360-361ప. 2ఆ.) రాజ (94-95ప. 1ఆ.) సూర్యాస్తమయాది చంద్రికావిహారపర్యంత (288-301ప. 2ఆ.) శిశిరర్తు (56-64ప. 4ఆ.) వసంతర్తు (99-109ప. 4ఆ.) వనవిహార (110-156ప. 4ఆ.) వారివిహార (159-187ప. 4ఆ.) ప్రభృతి వర్ణనలు కలవు.

ఇందు చిత్రకవిత్వము, బంధకవిత్వము కలదు. ఇందుకు "కర్ణికోపదళాకలితాను లోమశ్లోకగర్భితదళాదిపంక్తి ప్రార్థనాశ్లోకగర్భితరామచంద్రనామకీర్తననిరోష్ఠ షోడశపత్రపద్మ

బంధసీసపద్యము (143ప. 1ఆ.) ప్రముఖనిదర్శనము.

**బాహిరీ పామనృపాలుడు** : ఇతని కృతి భార్గవపురాణము. వాగినగిరిలో వెలసిన వేణుగోపాలస్వామికి అంకితము[196]. ఇతడు సురపురము సంస్థానాధిపతి. కాలము[197] 1752-73. అణ్ణయ్య, చిన్నయ్య అను వైష్ణవసోదరులను 1760-66 మధ్య సురపురము రప్పించి వైష్ణవమును స్వీకరించెనట. కాఁబట్టి భార్గవపురాణము రచనాకాలము 1765 ప్రాంతము కావచ్చును.

భార్గవపురాణము వైష్ణవగ్రంథము[199]. పన్నిద్దరాళ్వారుల చరిత్రము.

**తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు** : ఇతని కృతి అచలాత్మజా పరిణయము. షష్ఠ్యంతపద్యముల నుండి మూడాశ్వాసములు లభించినవి. అసమగ్రము. వేంకటాచలపతికి అంకితము. దైవాంకితము. ఇతని తండ్రి అణ్ణయాచార్యదీక్షితులు. పినతండ్రి, గురువు శ్రీనివాసతాతాచార్యులు. వీరు బాహిరీపామనృపాలుడు సురపురము రప్పించిన అణ్ణయ్య, చిన్నయ్య అగుదురు. ఉభయులు సురపురసంస్థానరాజగురువులు[200]. వారు సురపురము వచ్చిన కాలము 1760-66 మధ్యకాలమని పూర్వోక్తము. కాఁబట్టి అచలాత్మజాపరిణాయము. రచనాకాలము 1770 ప్రాంతము కావచ్చును.

అచలాత్మజాపరిణయము ద్వ్యర్థికావ్యము. గ్రంథనామమునందే అర్థద్వయము కల ద్వ్యర్థికావ్యము. అచలమన పర్వతమని, భూమి అని అర్థద్వయము. పర్వతపుత్త్రి పార్వతీపరిణయము, భూపుత్త్రి సీతాపరిణయము కథాద్వయము. పార్వతీపరిణయము మన్మథ దాహపర్యంతము, సీతాపరిణయము అహల్యాశాపవిమోచనపర్యంతమును ఉప లబ్ధగ్రంథమునందు కలవు.

శౌనకుడు " మనోహర మచలాత్మజాపరిణయంబు నయంబునఁ దెల్పవే" (13ప. 1ఆ.) అనిన, సూతుడు " అది అంబిక పెండ్లియొ? సీత పెండ్లియో? వింతగ రెండు. నొక్కపరి వెల్వడఁజెప్పెద"నని (14ప. 1ఆ.) చెప్పినది అచలాత్మజాపరిణయము. ఇది ఎంత ద్వ్యర్థి కావ్యమో, అంత అనుప్రాసకావ్యము కూడ. వృత్యనుప్రాస :

> "మల్లీవల్లిమతల్లివల్లరులతో నుల్లోపమల్లోపమో
> ద్యల్లీలోల్లరనంబునం బెనఁగుచున్ హల్లోహలోల్లోలమై
> యల్లిం బెల్లిగ నుల్లసిల్లెడి యళుల్ హల్లీసకోల్లాసక
> ద్భల్లీభిల్లికగీతి కెల్లెడ నుతుల్ బెల్లీను నప్పట్టునన్. " 42ప. 1ఆ.

యమకముల గమకములును సమధికము

> "భ్రమరీకదంబసంభ్రమరీణగరుదద
> భ్రమరీచిమలినసత్పంకజంబు
> ప్రవళీభవద్భర్మకదళీమహీజసం
> పదలీనకర్పూరపాండురంబు
> కమలాకరాదర్శవిమలాయితసమస్త
> కమలాకరవ్రాతఖస్థలంబు
> ధవళాయితమృణాలలవలావనక్రియా
> ర్జవలాలసమరాళరాజికంబు
> అంబరశ్రీనితంబబింబావలంబి

పాండుతరపట్టసచయశిఖండవిభ్ర
మభ్రమకరభ్రమదఖండశుభ్రజలద
భాసురం బొప్పె నా శరద్వాపరంబు " 10ప. 2ఆ.

పోతన భాగవతమునందు భావగతమైన "అడుగిడు" అను పద్యమునకు అనుకరణము :

గడగడ వడఁకెను దెసల
ప్పుడు పుడమియు జడిమ నడరె బుడిబుడి నడకన్
గడలుకొనె మెకము లెడనెడ
నడుగడుగున భయము పడుచు నడవుల నడుమన్. " 41ప. 3ఆ.

అచలాత్మజాపరిణయము పాండిత్యప్రకర్షకు నికషోపలము.

**ఉన్నవ యోగానందసూరి** : ఇతని కృతి పద్మినీపరిణయము. రాజగోపాలస్వామికి అంకితము. దైవాంకితము. ఇందు పూర్వకవిస్తుతియందు సంస్కృతకవిస్తుతియేగాని, తెలుగుకవుల ప్రసక్తి లేదు. ఇంత మాత్రమున ఇది నన్నయకు పూర్వకృతి కాదు. ఇతడు 1913 వ సంవత్సరము నాటికి అయిదుతరముల పూర్వుడని, అందువలన మూడు వందల సంవత్సరముల క్రిందటివాడని వంశీయుల కథనము[201]. అయిదు తరముల పూర్వుడగును. మూడు వందల సంవత్సరముల క్రిందటి వాడు కాడు. నూట యేబది సంవత్సరముల క్రిందటి వాడగును. 1913 - 150 = 1763. ఇతని కృతియందు కూచిమంచి తిమ్మన రసికజనమనోభిరామములోని పద్యమునకు అనుకరణము కలదు[202]. కాఁబట్టి పద్మినీపరిణయము రచనాకాలము 1770 ప్రాంతము కావచ్చును.

పద్మినీపరిణయము తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసములోని పద్మినీ పరిణయమునకు ప్రపంచీకరణము. అందు నిచుళానగరము (ఉత్తైయూర్) రాజధాని అయిన చోళరాజు రాయ చౌహత్తమల్లునకు కాసారములోని కాంచనపద్మమునందు పసిబాలిక పద్మిని లభించిన, ఇందు నిచుళానగరమే రాజధాని అయిన గోవిందరాజునకు అటులే పద్మిని లభించును. " రాయ చౌహత్తమల్ల " బిరుదము, గోవిందరాజు పేరుకావచ్చును. గోవిందరాజు పెంచుకొన్న పద్మిని పెరిగి పెద్దదై, శ్రీరంగనాథుని ప్రేమించి, తల్లిదండ్రుల సమ్మతిని పరిణయమాడుట పద్మినీపరిణయములోని ఇతివృత్తము. వర్ణనలతోను, రాయబారముల కల్పనలతోను ఆరువందల పద్యగద్యముల, అయిదాశ్వాసముల ప్రబంధమయ్యినది.

ఇందు పురవర్ణన (57-68ప. 1ఆ.) రాజవర్ణన (69-77ప. 1ఆ.) వర్షర్తువర్ణన (83-91ప. 1ఆ.) శరదృతువర్ణన (92-98ప. 1ఆ.) అరణ్యావర్ణన (109-110ప. 1ఆ.) వేటవర్ణన (111-128ప. 1ఆ.) పురప్రవేశవర్ణన (5-10ప. 2ఆ.) సూర్యాస్తమయవర్ణన (12-17ప. 2ఆ.) సూర్యోదయవర్ణన (18-21ప. 2ఆ.) శ్రీరంగయాత్రావర్ణన (22-32ప. 2ఆ.) శ్రీరంగ పుర వర్ణన (33-41ప. 2ఆ.) ఉత్సవవర్ణన (42ర. 2ఆ. 201పా.) గోవిందరాజు శ్రీరంగనాథ స్తవము (43-59ప. 2ఆ.) దైవదర్శనము (60-68ప. 2ఆ.) నిజపురాభిగమనవర్ణన (69-73ప. 2ఆ.) కాసారవర్ణన (74ప. 2ఆ.) నాయికావర్ణన (3-18ప. 3ఆ.) హేమంతర్తువర్ణన (19-26ప. 3ఆ.) జలకేళీవర్ణన (47-58ప. 3ఆ.) వనకేళీవర్ణన (59-62ప. 3ఆ.) నాయక వర్ణన (82-83ప. 3ఆ.) చిలుకరాయబారము (89-181ప. 3ఆ.) వసంతర్తువర్ణన (3-9ప. 4ఆ.) నాయికావిరహవర్ణన (21-38ప. 4ఆ.) మన్మథ, చంద్ర, మలయమారుత,

శుకపికాద్యుపాలంభవర్ణన (39-64ప. 4ఆ.) ప్రాతఃకాలవర్ణన (65-71ప. 4ఆ.) విప్రసందేశవర్ణన (73-99ప. 4ఆ; 104-114ప. 4ఆ.) సాయంకాలవర్ణన (100-103ప. 4ఆ.) వివాహవర్ణన (2-108ప. 5ఆ.) కలవు.

ఉత్సవరగడయందు పాత్రోచితభాష కలదు. అందు వైదికపుణ్యాంగనల సంభాషణ :

" ఔనష వెంకమ అంకికి నేమో!
కానుపు లుడిగిన కర్మం బేమో!
పిన్న వయసుదది పెనిమిటి జాడఁడు!
చిన్నవాఁడు మును జెప్పినఁ గూడఁడు!
సుబ్బికి సమర్త సోబన మషవే?
అబ్బురమా పదియారేళ్లషవే?
కోనయ రంగికి కొడు కొక్కఁ డషే?
యీనెల తప్పితె యికగలుగు నషే?
సోమి మగఁడు గడు సొంటికాయ గద!
రామిని గూడుక రాడాయం గద!
మొన్నటి లింగికి ముగురు బిడ్డలష!
విన్నావా నే వెఱ్ఱిదాన నష ! " 83-94పా. 42ర.

చిలుక రాయబారమునందు చిత్రమైన స్త్రీవర్ణనము! భారతపరము. ఉభయ కుశలము.

"దుర్యోధనధ్వజతులితమౌ కీల్జడ
కపికేతుశంఖమంగళము గళము
లలి పాండురాజవిలాసంబు హాసంబు
ఘనధార్తరాష్ట్రసంగతులు గతులు
గురుతరగాంగేయకుంభసంభవకళా
సంధాయి బిగి గుబ్బచన్నుదోయి
కర్ణసన్నిధిగతేక్షణము లీక్షణములు
సోమదత్తిప్రభాసఖము ముఖము
ధర్మరాజక్రమంబులు తరుణి బొమలు
ఉభయ భారతయోధుల నొకటి సేయఁ
దలఁచి విధి సృజియింపఁగా వలయుఁజామ్మ
కాక తక్కిన సౌందర్యగరిమ గలదె? " 131ప. 3ఆ.

పద్మినీపరిణయమునందు తెనుగు పూర్వకవిస్తుతి లేదుగాని, తెనుగు పూర్వకవితా చర్వణము కలదు. ఇది కూడ గమనార్హమైన అంశము. భాస్కరరామాయణము, భాగవతము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, వసుచరిత్రము, రసికజనమనోభిరామము మొదలైన కావ్యములలోని పద్యములకు అనుసరణములు కలవు[203]. అందు భాగవత పద్యానుసరణములు అధికము.

"అహములు సన్నము లయ్యెను
దహనము హితమయ్యె దీర్ఘదశలయ్యె నిశల్

బహుశీతోపేతంబై
నుహుహూ యని వడఁకె లోక మూర్వీనాథా! "
- భాగవతము

"దివముల్ కొంచెము లయ్యె రాత్రులు మహాదీర్ఘంబు లయ్యెం గడున్
పవనాప్తుండు మహోష్ణుఁ డయ్యెఁ బ్రజకున్ భానుండు మందాంశుఁడై
దివి నొప్పెన్ దుహినంబు రేలఁ గుతిసెన్ దిక్కోణముల్ నిండఁగా
భువనం బంతయు హూ యటంచు వణఁకెన్ మున్మున్నుగా నచ్చలిన్. "
- పద్మినీపరిణయము

ఇట్లు పూర్వకవితాచర్వణము పుష్కలముగ చేసి, పూర్వకవిస్తుతి చేయకపోవుటకు, ఇది " నన్నెచోడకుమారసంభవము"నకు మార్గదర్శకము వలె కలదు.

**పైడిపాటి వేంకటనరసింహము** : ఇతని కృతులు 1. లక్ష్మీనృసింహవిలాసము. 2. మన్నారుశతకము. 3. రామచంద్రశతకము. మొదటిది మాల్యశైలములోని నరసింహ స్వామికి అంకితము. దైవాంకితము. ఇతని మేనల్లుడు అయ్యలరాజు నారాయణామాత్యు డని ఒక అభిప్రాయము కలదు[204]. అతని హంసవింశతి రచనాకాలము 1790 ప్రాంతము. ఇది ముందు వివరింతును. కాఁబట్టి లక్ష్మీనృసింహవిలాసము రచనాకాలము 1770 ప్రాంతము కావచ్చును.

**కాకరపర్తి తిరుపతిపాత్రుడు** : ఇతని కృతి సత్యభామాకృష్ణసంవాదము. గొడె సంస్థాన వ్యవస్థాపకుడు గొడె పెద జగ్గారాయనికి అంకితము. అతని కాలము[205] 1745-1805. కాఁబట్టి సత్యభామాకృష్ణసంవాదము రచనాకాలము 1785 ప్రాంతము కావచ్చును.

**మొదటి మతింగంటి వేంకట నరసింహాచార్యులు** : ఇతని కృతులు 1. జనకరాజసుతాభ్యుదయము. 2. జాంబవతీకుమారశృంగారనిధానము. 3. నృకంఠీరవాభ్యు దయము. 4. శ్రీకృష్ణతులాభారము. 5. శ్రీరామానుజాభ్యుదయము. 6. విష్వక్సేనప్రభా వము. 7. క్షత్రబంధూపాఖ్యానము. 8. చల్లపిల్లరాయచరిత్రము. 9. గోదావధూటీపరి ణయము. 10. శ్రీకృష్ణశతానందీయము. 11. చిలువపడిగ తేని పేరణము. ఇందు క్షత్ర బంధూపాఖ్యానము గోదావధూటీపరిణయము ముద్రితములు. ఇతడు మతింగంటి సింగరాచార్యుల వంశీయుడు. ఇరువురి నడుమ అయిదు తరములు కలవు. అతడు ఇరువదవయేట రచించిన కృతుల రచనాకాలము 1600 ప్రాంతమని పూర్వోక్తము. కావున, ఇతని కృతుల రచనాకాలము స్థూలముగ 1760-80 మధ్యకాలము, కావలయును. కాఁబట్టి క్షత్రబంధూపాఖ్యానము రచనాకాలము 1770 ప్రాంతము, గోదావధూటీపరిణయ ము రచనాకాలము 1775 ప్రాంతము కావచ్చును.

**క్షత్రబంధూపాఖ్యానము** : ఇది సిరిసెనగండ్ల నరసింహస్వామికి అంకితము. దైవాంకితము. ఇతివృత్తమునకు మూలము భవిష్యోత్తరపురాణములోని క్షత్రబంధు చరితమని ఇందు కలదు.

"ఉత్తమోత్తమమగు భవిషోత్తరాఖ్య
మనుఁ బురాణంబునందుల నలరు క్షత్ర
బంధుచరితంబు నాంధ్రభాషను రచింతు (?)
విబుధవితతికి వీనుల విందు గాఁగ" 15ప. 1ఆ.

ఇది కథామూలమే గాని, కావ్యమూలము కాదు. క్షత్రబంధూపాఖ్యానము భవిష్యోత్తర పురాణాంతర్గతమైన కథ నిమిత్తమాత్రముగ స్వకపోలకల్పనమున ప్రపంచీకరించిన స్వతంత్రకావ్యమగును.

అయోధ్యానగరాధిపతి సురథుని పుత్త్రుడు క్షత్రబంధుడు. ఇతడు అయోధ్యానగరాధిపతి అయిన తర్వాత, ఆటవికులతో వేటకు వేంచేసి, మద్యమాంసములు మరిగి, ప్రతిదినము శశమాంసభక్షణము చేయును. తదభావమున ప్రతిదినము నరమాంస భక్షణము చేయును. రాజ్యము సర్వనాశనమగును. క్షత్రబంధుడు అడవుల పాలగును. ప్రజలు వేడిన మీదట వ్యాసుడు తన శిష్యుడైన పుండరీకుని, క్షత్రబంధుని పూర్వస్థితికి తెచ్చుటకు నియోగించును. పుండరీకుని కొఱకు చేసిన విష్ణ్వాలయప్రదక్షిణముల వలన క్షత్రబంధుని కర్మ పరిపక్వమగును. పుండరీకుడు శ్రీపాదతీర్థ మాతనిపై చల్లి, పాపవిముక్తుని కావించి, యౌవనవంతుని చేయును. ఉభయులు తీర్థయాత్రలు చేయుదురు. పుండరీకుడు క్షేత్రబంధునికి మంత్రోపదేశము చేయనెంచి, విశ్రమించునెడ, విష్ణువు ప్రత్యక్షమై, క్షత్రబంధుని పరీక్షింపకుండ మంత్రోపదేశము చేయవలదని వారించును. పుండరీకుని పరీక్షను క్షత్రబంధుడు దొమ్మరి వాడయందు మాధవుడను పేర మంత్రార్థము నివసించును. చోళరాజు తనయను ఆవహించిన బ్రహ్మరాక్షసుడు నిమిత్తముగ క్షత్రబంధునికి లిఖితమంత్రము లభించును. విష్ణువు ప్రత్యక్షమై, అభయహస్తముతో స్పృశించగా మాధవుడు నూనూగు మీసాల క్షత్రబంధుడగును. చోళరాజు క్షత్రబంధునికి తనయనిచ్చి వివాహము చేయును. క్షత్రబంధుడు అయోధ్యానగరమునకు వచ్చి పాడుపడిన నగరమును చూచి విచారించునెడ, వ్యాసుడు ప్రత్యక్షమై, రాజ్యము యథాపూర్వముగా అభివృద్ధి చెందునని ఆశీర్వదించును.

ఇది క్షత్రబంధుని కథ. ఇందు విష్ణువు, వ్యాసుడు, పుండరీకుడు పురాణపురుషులు. క్షత్రబంధుడు మానవుడైనను దానవుడు. దానవుడైనను మానవుడు. దొమ్మరులు ద్రిమ్మరులు.

దొమ్మరులు ద్రిమ్మరు తీరు :
"దారు వులూఖలాల్ దగు శాగ ముసలముల్
  గడ్డపారలు గడెల్ మడ్డు కత్తి
చిలుకు టల్కుల గడల్ సింగిణీతరకనల్
  వాలుకత్తులు నురుల్ వలలు బోళ్లు
మేకుల గుదులును మోకులు కట్టలు
  చాపల చుట్టలు దీపసుడెలు
చాపసంచులయందు సర్వధాన్యంబుల
  నించి గార్దభనోష్ట్ర నికరములను
మీద గజచర్మనికరముల్ బాదుకొల్పి
బాలవృద్ధుల వాటిపైఁ బఱఁగఁజేర్చి
యామ్యముఖముగ నందఱు నరుగఁదలఁచి
తూర్యయానత దొమ్మరుల్ తూఁగి నడువ." 19ప. 3ఆ.

వైష్ణవభక్తురాలైన దొమ్మరి వనిత భాగవతపఠనవిధానము :

"ప్రత్యక్షపాంచాలబాహాటనటల
ప్రాస యతి చ్ఛేక పాక శయ్య
దేవభాషాగ్రామ్యదేశ్యభ్రంశలఁ
దత్సమాంధ్రోక్తులఁ దప్పకుండ
నవరసాలంకారనానార్థశబ్దముల్
వగ లయ క్రియలను నగుపడంగ
గూఢార్థభావముల్ రూఢిగాఁ దెల్పుచుఁ
బరతత్త్వసిద్ధాంతపటిమ నెరయ
బహుచమత్కారయుక్తవాచాప్రగల్భ్య (?)
స్ఫుటనిరాఘాటపదగుంభపటిమ యొదవు
రీతి, తత్కాలరంజితజాతరాగ
ములను వ్యక్తతఁ జదివెడి జలజముఖికి." 84ప. 3ఆ.

దొమ్మరి వనిత రాచదొర నిండుకొలువున . . . . . వాలుమొనలపై లంబికాయో గంబున నాసీనయై శతావధానవిద్యాచమత్కారంబులఁ" జూపినదట! (278వచ. 3ఆ.)

పుర (110-128ప. 1ఆ.) రాజ (128-132ప. 1ఆ.) కుమారోదయ (135ప. 1ఆ.) నాయక (145-150, 153-163ప. 1ఆ.) దుర్భిక్ష (166-170ప. 1ఆ.) వసంతర్తు (5-10ప. 2ఆ.) మృగయా (18వచ-24వచ. 2ఆ.) వర్షర్తు (25-29ప. 2ఆ.) సూర్యాస్తమయ (255ప. 2ఆ.) సూర్యోదయ (262ప. 3ఆ.) విటీవిట (62-75ప. 3ఆ.) వివాహ (320-360ప. 3ఆ.) వర్ణనలు కలవు.

**కొప్పర్తి నరసయామాత్యుడు :** ఇతని కృతి రుక్మిణీపరిణయము. మదనగోపాల చరిత్రమని మఱొక పేరు. మదనగోపాలపురములోని మదనగోపాలస్వామికి అంకితము. దైవాంకితము. గ్రంథాంతపద్యమునందు రచనాకాలము కలదు.

"శక మజఖర్షీందుసంఖ్యను దగు పరా
భవరాధపూర్ణిమాభానుతిథికిఁ
xxx xxx xxx
జెప్పి యీ కృతి నీకు నర్పించఁ గంటి
---- ---- ----
సరస కొప్పర్తి సోమన్నసచివసుతుఁడ
భువిని నరసింహనామకకవిని నేను. " 258ప. 5ఆ.

అజ=9, ఖ=0, ఋషి=7, ఇందు=1 =1709+78 = 1787. కాఁబట్టి రుక్మిణీపరి ణయము ఉరపు మదనగోపాలచరిత్రము రచనాకాలము 1787 వ సంవత్సరము.

కవి స్వప్నవృత్తాంతమునందు "కోడూ రనియెడు గ్రామంబు దక్షిణజాంగలస్థలం బున నొక్క నీలప్రస్థరాంతరంబున వెలయు ప్రతిమారూపంబుగల " ఆంజనేయస్వామి సాక్షాత్కరించి, "ఒక్క కావ్యప్రబంధంబు మదనగోపాలచరిత్రంబను రుక్మిణీపరిణయ కథానుబంధబంధురంబుగానొక్క మహాకవిసింధురసాహాయ్యానుగ్రహంబున రచి యింపుమనిపలికి"నట్లు కలదు. (21వచ. 1ఆ.) కవి " తదుక్తకావ్యంబు రచింప. సమ కట్టి తత్సాయంబునకొక్క మహాకవి సందర్శనంబపేక్షించియున్న సమయంబునందు నొక్కనాఁడు విరచితబహుకావ్యవీరనారాయణాదిశతకదండక సంస్కృతసరసగేయపదుఁ

డైన (28వచ; 29ప. 1ఆ.) రావూరి సంజీవరాయలు "చనుదెంచి దర్శనంబిచ్చిననతనికి జాంబూనదాంబరాభరణంబు లొసగి బహూకరించి నిలిపి తత్సహాయానుగ్రహంబునఁ బ్రబంధప్రారంభంబుగయికొ"న్నట్లు కలదు. (30వచ. 1ఆ.) ఇది నిమిత్తముగ "సంజీవ రాయకవియే ఈ గ్రంథమును రచియించి కొప్పర్తి నర్సన్న పేరఁ బ్రకటించెనని యొక ప్రతీతి కలదు[206]." అంతేకాదు. రుక్మిణీపరిణయమిది రావూరి సంజీవరాయకృతముగ ముద్రితము[207]. కాని, పయి గ్రంథాంతపద్యమునందు ఇట్లు కలదు.

"భారతరణమందు పార్థున కాప్తుఁడై
కృష్ణదేవుఁడు నిర్వహించినట్లు
రావూరి సంజీవరాయసోభయభాష
ఘనకవి నిర్వాహకంబు సేయ " 258ప. 5ఆ.

ఇది రావూరి సంజీవరాయల నిర్వాహకము సహనిర్వహణమనుటకు సాధకము. అయినను గ్రంథమధ్యమునందు చక్రబంధము కలదు.

"దివ్యశ్రీకరసంకృతిఘ్నునయవాదీసంప్రఖేలత్కృపా
భవ్యాగోపనజీవనోద్ధనయనాపాకఘ్నుశంశత్పదా
నవ్యాపాదికవిత్వమానసధురీణావిక్రమాతిప్రభా
భావ్యావేదిసుతాభవేంద్రనతరూపాముక్తదానోర్విభా. " 123ప. 3ఆ.

ఇట " (ఈ పద్యంబున మూడవ వలయమునందుఁ గృతీశ్వరుని పేరును ఆఱవ వలయమునంచుఁ గవి పేరును నున్నది.) " అని కలదు. కాని, ఆఱవ వలయములోని "సంజీవసంకవి" రావూరి సంజీవరాయ లగునుగాని, మూడవవలయములోని "శ్రీగోపాల శతి" కృతీశ్వరుడు మదనగోపాలుడు కాడు. గోపాలశతి గోపాలశతకమగును. అది వీర నారాయణాదిశతకములందు ఒకటై, తత్కవి రావూరి సంజీవరాయ లగును. పయి చక్రబంధపద్యము రుక్మిణి రాయబారము పంపిన పురోహితుని శ్రీకృష్ణవర్ణనము లోనిది. అది ముప్పది పద్యముల చిత్రగర్భబంధకవిత్వబంధురమైన ఘట్టము. (97-126ప. 3ఆ.) అదియెల్ల రావూరి సంజీవరాయల గోపాలశతకములోని దగును. అంతేకాదు. రావూరి సంజీవరాయలు "జాతకసిద్ధాంతముఖకళాచతురుఁడు." (39ప. 1ఆ.) ఈ రుక్మిణీ పరిణయమునందు గర్గుడు వివాహముహూర్తము నిశ్చయించి, ముహూర్తఫలితములను మూదలించి, లగ్ననిర్ణయము చేసిన ఘట్టము (188-199ప. 1ఆ.) సంజీవరాయకృతము కావచ్చును. ఇట్టివి సాహాయ్యములు. ఇంతమాత్రమున గ్రంథమెల్ల సంజీవరాయలే రచించి, కొప్పర్తి నరసయ పేర ప్రకటించెననుట సాహసము. సంజీవరాయల సాహాయ్యము నరసయ్య చెప్పినదే.

ఇది రెండవ రుక్మిణీపరిణయము. పరిపూర్ణరుక్మిణీపరిణయమని కూడ ఇందు కలదు. (258ప. 5ఆ.) పోతన భాగవతములోని రుక్మిణీపరిణయకథయే. అందు లేని వర్ణనాదికము ఇందు అధికము. విదర్భరాజపత్ని స్వప్నవృత్తాంతము, రుక్మిణిజననము, శైశవము ప్రథమాశ్వాసము. రుక్మిణి బాల్యము యౌవనము, విదర్భరాజా భీష్మకుడు రుక్మిణిని కృష్ణుని కిచ్చి వివాహము చేయుటకు నిశ్చయించుట ద్వితీయాశ్వాసము. రుక్మిణి అగ్రజుడు రుక్మి కృష్ణుని నిరసించి, శిశుపాలుని కిచ్చి వివాహము చేయుటకు నిశ్చ యించుట, రుక్మిణి చింతించుట, పురోహితుని రాయబారము పంపుట, అతడు

రాయబారము నిర్వహించుట, కృష్ణుడు ప్రయాణమగుట, భీష్మకుడు రుక్మిణికి వశుడై, రుక్మిణిని శిశుపాలుని కిచ్చి వివాహము చేయుటకు కల్యాణోత్సవము చేయించుట, శిశుపాలజరాసంధాదుల, బలరామకృష్ణాదుల ఆగమనము తృతీయాశ్వాసము. రుక్మిణి తాపము, నిస్పృహ, దుఃఖము, వితర్కము, విరహము, పురోహితుడు వచ్చి రాయబారము ఫలించెనని చెప్పుట చతుర్థాశ్వాసము. వివాహసన్నాహము, రుక్మిణిని శ్రీకృష్ణుడు అపహరించుట, జరాసంధాదుల ఓటమి, శిశుపాలుని పరాభవము, రుక్మిణీకృష్ణుల ద్వారకా గమనము, వివాహము, నిషేకము పంచమాశ్వాసము. ఇది పరిపూర్ణరుక్మిణీపరిణయము.

ఇందు పుర (131-165ప. 2ఆ; 59-70ప. 3ఆ.) సముద్ర (46-55ప. 3ఆ.) దౌహృద (119-114ప. 1ఆ.) ప్రసూతి (134-168ప. 1ఆ.) నాయికాశైశవ (141-187ప. 3ఆ.) నాయికాబాల్య (3-39ప. 2ఆ.) నాయికాయౌవన (40-96ప. 2ఆ; 150-204ప. 3ఆ.) నాయక (120-126ప. 2ఆ; 166-197ప. 2ఆ; 97-129ప. 3ఆ.) నాయికావిరహ (525ప. 4ఆ.) జలకేళి (27-36ప. 4ఆ.) వనకేళి (38-41ప. 4ఆ.) సూర్యాస్తమయాది చంద్రికావిహారపర్యంత (42-57ప. 4ఆ.) మన్మథపూజా (58-66ప. 4ఆ.) మన్మథస్తుతి (67-68ప. 4ఆ.) చంద్రస్తుతి (67-72ప. 4ఆ.) మన్మథాద్యుపాలంభ (72-109ప. 4ఆ.) సూర్యోదయ (116-120ప. 4ఆ.) వివాహ సన్నాహ (231-235వచ. 3ఆ; 2-18ప. 5ఆ; 43-84ప. 5ఆ.) యుద్ధ (101-109ప. 5ఆ.) వివాహ (201-237ప. 5ఆ.) నిషేక (239-248ప. 5ఆ.) వర్ణనలు కలవు.

శైశవవర్ణనమునందు మంతరసాని (153) సూతిహోమము, శాంతి (168) నామకరణము (169, 170) డోలారోహణము (178) జోలపాటలు (179, 180) అన్నప్రాశనము (183, 184) మొదలైనవి కలవు.

బాల్యవర్ణనమునందు గుజ్జన గూళ్ళు, బొమ్మల పెండ్లి (3), వెన్నెల కుప్పలు (4) బొంగరాలాట (5), చెండు లాట (6), ఓమనగుంటలు(7), చదరంగము (8), అచ్చనగండ్ల (9), పావురాలాట (10), చిలుకనుపెంచుట (11), హంసనుపెంచుట (12), నాలుగు స్తంభాలాట (13), దాగిలి మూతలు (14), నెమళ్లను పెంచుట (15) కొప్పు సవరింపు (16), అలంకరణ (17), ఉయ్యాల లూగుట (19), వీణాగానము (20), శౌరికథాంగమౌ చదువు (21), ద్యూతక్రీడ (22), కేళికావని (23), రంగశాల (24) మొదలైనవి కలవు.

శ్రీకృష్ణవర్ణనమునందు పాదభ్రమరకము (97), నిరోష్ఠ్యగీతము (98), మత్తేభవిక్రీడితావృత్త గర్భగీతచతుర్విధసీసము (99), క్షురికాబంధకందము (100), ఖడ్గబంధము-సుగంధినీవృత్తము (101), అర్ధభ్రమరకందము (102), సర్వభ్రమరకందము (103), గుడికందము (104), ఏకాక్షరకందము (105), ద్వ్యక్షరి (106), తలకట్టు కందము (107), శృంగకందము (108), సాప్తవిభక్తికము (109), ఆంధ్రసాప్తవిభక్తికము (110), గుణితము (111-122), చక్రబంధము (123), నాగబంధము (124), అనుప్రాససీసము - పుష్పమాలికాబంధము (125) ఆంధ్రగీర్వాణభాషైక్యము (126) కలవు.

వృషాకపాయి (82ప. 1ఆ.), ఫాంటము, ఫైరవము వంటి అప్రయుక్తపూర్వ పదప్రయోగములును కలవు.

"ఫాంటంబైన భవన్నియోగమున నేఁ బ్రస్థానినై యేగి యొ

క్కంటన్ విఘ్నము లేక గంచు ఝురముల్ గ్రావంబులున్ గ్రామముల్
ఘోంటారణ్యతటాబ్ధికృత్రిమసృతిన్ లోఁజొచ్చి యమ్మొందటన్
గంటిన్ శ్రీహరిభారకన్ ఘనశుభౌఘప్రేరకన్ ద్వారకన్. " 128ప. 4ఆ.
" భైరవవిద్విషన్మనుజపాలురమధ్యమునన్ గ్రహించెఁ దా
పైరవమధ్యపాళిఁ గల భక్తి నిరర్గళలీలఁ గ్రాలు కం
ఠీరవ మొక్కటం గొనిన రేవఁ గరగ్రహణంబుగా గుణో
దారవధూటి రుక్మిణిని దానవభేది గ్రహించె నయ్యెడన్ - " 97ప. 5ఆ.

**అయ్యలురాజు నారాయణామాత్యుడు** : ఇతని కృతులు 1. హంసవింశతి. 2. దశావతారకథాసంగ్రహము. 3. ఆంజనేయశతకము. మొదటిది ప్రసిద్ధము. కడమ రెండును అనుపలబ్ధములు. హంసవింశతి శ్రీరామాంకితము. దైవాంకితము. ఇందు ఇంగ్లీషు పేటలు, ఇంగ్లీషు కుక్కలు, ఇంగ్లీషు పదము కలవు.

" ఈడము వళంద బందర యింగిలీషు,
కళము మొదలైన పేటల గొరలెల్ల
సొరభద్రవ్యములు బేరసార మాడఁ
బిలువ నంపిరి తమ తమ పేటలకును. " 112ప. 1ఆ.

శుకసప్తతియందు రాచకొలువులందు ఇంగిలీషుముఖాములు కలరని మాత్రమే కలదు. అది పూర్వోక్తము. హంసవింశతియందు ఇంగిలీషుపేటలు కలవు.

"లేఁటి (వేఁడి?) కొదమల వింతయౌ మేటి (నేటి?) పునుగు
పిల్లుల జవాజిపిల్లుల బెట్టు రురుల
ముంగిస సివంగి జోణంగి యింగిలీషు
కుక్క గుంపులఁ గోఁతులఁ గొన్ని గొనియె. " 354ప. 5ఆ.

ఇట్లు 1920 ముద్రణమునందు కలదు. 1938 ముద్రణమునందు "ఇంగిలీషు కుక్క గుంపులఁ గోఁతుల" అనునది "సింగిలీకగుంపు మానిసికోతులు" అని కలదు. (358ప. 5ఆ.) "సింగిలీకలు", "మానిసికోతులు" శుకసప్తతియందును కలవు. విడిగా.

"ఎసఁగ నన్నములోని విసముల నేర్పఱుచు సింగిలీకలు " 222ర. 1ఆ.

సింగిలీక లన కోతులు. అన్నములోని విషములను ఏర్పఱచు కోతులు మానిసి కోతు లగును. "సింగిలీకగుంపు, మానిసికోతులు" ఒకటే. కనుక "ఇంగిలీషు కుక్క గుంపులు " అను పాఠమే కవిపాఠమగును.

"పరపు పరంగిపోషు గల బంగరు మంచముపై వసించి భా
స్కరుఁ డుదయింప నూడిగపుఁగామిని లేపఁగ నిద్ర లేచి త
త్తరకరుఁ డస్తమించు దను కొకానొకరీతి మెలంగి చీఁకటుల్
నెరసిన పిమ్మటన్ నలిననేత్ర మహీపతి మీఁది కోరికన్. " 82/87ప. 5ఆ.

పరంగిశబ్దము మొదట పోర్చుగీసువారికి, తర్వాత ఐరోపాదేశస్థులకు వ్యవహరింప బడినది. పోషుశబ్దము ఇంగ్లీషుపదము. ఎలిగెంట్, ఫేషనబుల్ అని అర్థములు.

పరంగిపోషు అనగా పోర్చుగీసు ఫేషను లేదా ఐరోపా ఫేషను అగును. కావున ఇంగ్లీషు పేటలు, ఇంగ్లీషు కుక్కలు, ఇంగ్లీషు పదము కల హంసవింశతి, శుకసప్తతి కంటె పరమార్వాచీనము కావలయును. అంతేకాదు. కాణాదము పెద్దన సోమయాజి ముకుందవిలాసములోని, కావ్యనామావళిపద్యమునకు అనుకరణము కలదు.

'నెఱిగొప్పు మేఘసందేశంబు కనుదోయి
    యందమౌ కువలయానంద మరయఁ
బొంకపు మోము ప్రబోధచంద్రోదయం
    బధరంబు మణిసార మౌర చూడఁ
జెలువంపుఁ జిఱునవ్వు శృంగారకౌముది
    స్తనయుగంబు రసమంజరి నుతింపఁ
గరరుహంబుల కాంతి కావ్యప్రకాశిక
    ఘననితంబము రసాయనము దలఁపఁ
దను వలంకార మతనుశాస్త్రములు చూపు
లహహ మధ్యంబు నాటకం బవనిలోన
విద్యలకునెల్ల మూల మీ వెలఁదిఁ గనిన
విద్యలు పఠింపఁగా నేల వేఱె బుధులు." 143ప. 2ఆ.

ముకుందవిలాసము రచనాకాలము 1762 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి హంసవింశతి రచనాకాలము 1787 ప్రాంతము కావచ్చును.

హంసవింశతి శుకసప్తతికి సహోదరము. అది చిలుక చెప్పిన డెబ్బది రాత్రుల కథల సంపుటి అయిన, ఇది హంస చెప్పిన ఇరువది రాత్రులకథల సంపుటి. అది ధర్మరాజునకు అతని పురోహితుడు చెప్పిన, ఇది నలమహారాజునకు ఇతని పురోహితుడు ప్రత్యుత్పన్నమతి చెప్పినది. అందు పద్మావతీపురరాజు చిత్రభానునకు, ప్రభావతిగుఱించి కొఱవంజి చెప్పిన, ఇందు ఉజ్జయినీపురరాజు చిత్రభోగునకు హేమావతి గుఱించి సిద్ధురాలు చెప్పును. అందు ప్రభావతి భర్త మదనసేనుడు దేశాంతర మేగినపుడు, పల్లవి దుర్బోధకు లోనైనను, పరకీయశృంగారమునకు పాల్పడకుండ, మదనసేనుడు పెంచిన చిలుక డెబ్బది రాత్రులు కథలు చెప్పి వారించిన, ఇందు హేమావతి భర్త విష్ణుదాసుడు దేశాంతరమేగినపుడు, హేల దుర్బోధకు లోనైనను, పరకీయశృంగారమునకు పాల్పడకుండ, విష్ణుదాసుడు పెంచిన హంస ఇరువది రాత్రులు కథలు చెప్పి వారించును. కథల స్వరూప స్వభావములును సమానము. అంతేకాదు. శుకసప్తతి ప్రభావము హంసవింశతియందు అత్యధికము. అందలి తెలుగు నుడికారములు ఇందు వెలుగు లీనినవి. అందలి ఇరువదవ కథలోని ఎనిమిదవ ఉపకథకు, ఇందలి ఇరువదవకథ సంగ్రహానుకరణము. శుకసప్తతి కంటె హంసవింశతి ప్రత్యేకత విజ్ఞానసర్వస్వప్రాయమైన విషయవిస్తరము.

హంసవింశతియందు ఆహారపదార్థముల (105ప. 1ఆ.) చౌషష్టివిద్యల (155వచ. 1ఆ.) ఆయుధముల (205ప. 1ఆ.) పేరవిహారముల (206వచ. 1ఆ.) ఆయుర్వే దౌషధముల (235వచ. 1ఆ.) అంగడిసరుకుల (228-232ప. 2ఆ.) చిత్తరువులు వ్రాయు పక్షుల (10-12ప. 3ఆ.)బాణవిద్యల, వాద్యవిశేషముల, ముగ్గుల, రత్నముల ద్రావిడ ప్రబంధముల, వివిధజనుల (28వచ. 3ఆ.) వేదపురాణేతిహాసస్మృతి శాస్త్రచ్ఛందోలంకార నిఘంటుగణయతిప్రాసపాకముల (127వచ. 3ఆ.) ఆటల (147ప. 3ఆ; 159ప. 5ఆ.) పంచవింశతితత్త్వముల, యోగశాస్త్రవిషయముల (186వచ. 3ఆ.) వృక్షముల (9, 11వచ. 4ఆ.) మను, మాన, వర్ష, ఖండముల (13ప. 4ఆ.) గణితశాస్త్రాంశముల (27-29ప. 4ఆ.) నక్షత్రరాశిలగ్నచక్రముల (55-58ప. 4ఆ.) సంచారీభావముల (87ప. 4ఆ.)

మంత్రముల (95ప. 4ఆ.) ధాన్యముల (128ప. 4ఆ.) కాయగూరల (129-135ప. 4ఆ.) మత్స్యముల (187ప. 4ఆ.) నదుల (204ప. 4ఆ.) తీర్థముల (206-209ప. 4ఆ.) క్షేత్రముల (214, 215వచ. 4ఆ.) అమ్మవార్ల (220వచ. 4ఆ.) ఆకుల (47, 48ప. 5ఆ.) అలముల (45ప. 5ఆ.) కసవుల (46ప. 5ఆ.) తిట్టుల (117ప. 5ఆ.) అప్సరసల (122ప. 5ఆ.) షోడశవిధనృత్యముల (126ప. 5ఆ.) తాళముల (126ప. 5ఆ.) స్త్రీరాగముల (127ప. 5ఆ.) నపుంసకరాగముల (128ప. 5ఆ.) సప్తస్వరముల (130ప. 5ఆ.) వశ్యౌషధముల (133-135ప. 5ఆ.) పరిమళద్రవ్యముల (144,356ప. 5ఆ.) చౌశీతిబంధముల (155ప. 5ఆ.) క్రతువుల (238వచ. 4ఆ.) డెబ్బదిరెండు వినియోగముల (267వచ. 5ఆ.) గుడారుల (354ప. 5ఆ.) పాత్రల (357వచ. 5ఆ.) జంతువుల (358ప. 5ఆ.) వస్త్రముల (559ప. 5ఆ.) ఆభరణముల (360ర. 5ఆ.) వర్తకకేంద్రముల (368ప. 5ఆ.) వివరములు పట్టికలుగ కలవు. వచనములు సుదీర్ఘములు. పద్యములు సీసమాలికలు. రగడలు దీర్ఘములు.

దేవాలయవివరములు కల పద్యము :

"డంబైన గర్భగృహం బాంతరాళికం
 బును ముఖమంటపంబును జెలంగ
గాలి మంటపము ప్రాకారంబు లోలీలు
 బోదెలు చుట్టులు పొందుపడఁగఁ
గప్పులు చట్టముల్ ఘనగోపురంబులు
 జగతియుఁ జప్పటల్ సొగసు గులుక
గచ్చు గోడలు ఆాతి కంబముల్ పాలసు
 న్నము సువర్ణద్వారసమితి వెలయ
దృష్టిపాత్రపు బొమ్మలు దేజరిల్ల
నుఱుకు సింగంబు లరగూళ్లు మెఱుఁగుఁ దోర
ణములు చిత్తర్వు క్రొంబనుల్ రమణ కెక్క
దేవళము మించె నత్యంతదివ్యమగుచు." 180ప. 1ఆ.

ఇందు "ముఖమంటపంబునకు" అనునెడ "సుగనాసికంబును" అను పాఠాంతరము కలదు. అది శుకనాసిక మగును. అది కూడ ఆలయవిశేషమే. "లోలీలు" అనునెడ "లోపలు" అను పాఠాంతరము కలదు.

వృత్తిపదములు కుప్పపోసిన పద్యము :

కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు
 పరిటె ద్రొక్కుడుపట్టె పలక దోనె
వరిపరి యచ్చులు చరికుండ యూడితె
 చీడు దబ్బలు దండె నాడె క్రోవి
కోఁతి పుల్లలు నాల్క కుడుతరి కొయ్యలుఁ
 బొప్ప యూచలుఁ గోఁత చూఱు కత్తి
కారంపుఁ బడుగులు గండెల కప్పెర
 గోలము లాకలు నీలి కడవ
గంప డొల్ల కళాసంబు కదురు చెమికె

నాలు రాట్నంబు జాలంబు గ్రాలు గోడ
వఱల నా శుభభద్రు నివాసభూమి
యప్పురంబున సంతతం బొప్పుచుండు. " 12ప. 2ఆ.

కవిత్వము హంసవింశతియందు క్వాచిత్కముగ కదను తొక్కినది.

మాటలా యమృతంపుఁ దేటలా కపురాల
మూటలా యని జారకోటు లెన్నఁ
గన్నులా వెలిదమ్మిచెన్నులా మగతేఁటి
యన్నులా యని పల్లవాళు లెన్నఁ
జేతులా సుమలతాజాతులా కిసలయ
ఖ్యాతులా యని యుపకాంతు లెన్న
గుబ్బలా యపరంజి లిబ్బులా రుచి మించు
దిబ్బలా యని పాంథధీరు లెన్న
గోరులా రిక్కసారులా కుఱుకుఁ దళుకు
నవ్వులా జాజిపువ్వులా నాటు నీటు
చూపులా వాఁడి తూఁపులా సొలపుఁ దెలుపు
ననుచు విటులెన్నఁ దగు నింతి యతనుదంతి. " 20ప. 3ఆ.

"బలితంపుఁ బులినంపు కళఁ బెంపు జఘనంపుఁ
బోడి మెన్నఁగ నొక్క నాఁడు పట్టు
విరితమ్ములను గ్రమ్ము సిరిఁ జిమ్ము వదనమ్ము
చెలువ మెంచుట కొక్క నెలయుఁ బట్టు
నిరు లెప్పుడును గుప్పు నెఱికప్పు గల కొప్పుఁ
బ్రణుతింపఁగా మహాబ్దంబు పట్టు
జితజంభకరికుంభతతదంభకుచకుంభ
యుగ మెన్నుటకు నొక్క యుగము పట్టుఁ
జొక్కటపు ఱిక్కగమి నిక్కు టెక్కుఁ జెక్కు
నఖముల నుతింప వేఢదినమ్ము పట్టుఁ
గెంజిగురుసంజకెంజాయపుంజిఁ దెగడు
పదము లెన్నంగ బ్రహ్మకల్పంబు పట్టు. " 74ప. 4ఆ.

**ఎడవల్లి వేంకటపతి** : ఇతని కృతులు 1. రాధామాధవసమాగమము. 2. పతిత పావనచరిత్రము. అముద్రితము. రాధామాధవసమాగమమునందు,

"ఉదయగిరి నాక్రమించి మహోగ్రతేజఁ
డగుచు భూచక్రపాలన మాచరించి
యస్తగిరి నాక్రమించి నద్యద్దినాధి
రాజ రాజాధిరాజపర్యాయమునను. " 116ప. 2ఆ.

అని సూర్యాస్తమయవర్ణనము కలదు. ఇందు ఉదయగిరిదుర్గము. ఉపలక్షణముగ యావదాంధ్రమును జయించి, తమిళకర్ణాటాంధ్రదేశములను పరిపాలించిన శ్రీకృష్ణదేవ రాయల అస్తమయము స్ఫురించును.కనుక తత్కాలమందలి కావ్యమను తలంపు కలుగుట[208] సహజము. కాని రాధామాధవసమాగమమునందు శుకసప్తతి హంసవింశతి

కృతులప్రభావము కలదు. శుకసప్తతి రచనాకాలము 1700 ప్రాంతమని, శుకసప్తతి స్వభావము కల హంసవింశతి రచనాకాలము 1790 ప్రాంతమని పూర్వోక్తము. కాబట్టి శుకసప్తతి ప్రభావము కల రాధామాధవసమాగమము రచనాకాలము 1790 ప్రాంతము, పతితపావనచరిత్రము రచనాకాలము 1795 ప్రాంతము కావచ్చును.

రాధ నందుని తోబుట్టువు. నందుడు శిశువైన కృష్ణుని పెంపకము బాధ్యత రాధకు అప్పగించును. రాధకు బాలకృష్ణుని మీదనే మోహము కలుగును. యువకృష్ణునితో సరసాలాపము లాడును. వివాహమాడఁగోరును. కీరవాణి కథ చెప్పును. కృష్ణునికి రాధ యెడల మోహము కలుగును. వావి కాదని సందేహించును. నందుడు రాధకు బంధు పుత్రునితో వివాహము చేయును. కృష్ణుడు పేదరాలి పెద్దమ్మను రాయబారము పంపును. పేదరాలి పెద్దమ్మ రాధకు జారశృంగారమును ఉపదేశించును. మేనత్త వావి దోషము కాదని ఒక కథ, జారశృంగారమునకు రెండు కథలు చెప్పును. రాధామాధవుల సమాగమము జరుగును. ఇది రాధామాధవసమాగమములోని ఇతివృత్తము. ఇందు రాధ యువకృష్ణునితోడి సరససల్లాపములు అశ్లీలములు. పేదరాలి పెద్దమ్మ జారశృంగారము నకు ఉపదేశించిన రెండు కథలు శుకసప్తతి, హంసవింశతి కథల వంటివి. అందు పరకీయ శృంగారమును తప్పించుట ప్రయోజనము. ఇందు పరకీయశృంగారమును ఒప్పించుట ప్రయోజనము. శుకసప్తతిలో ప్రభావతికి పల్లవి, హంసవింశతిలో హేమావతికి హేల వలె, రాధామాధవసమాగమమునందు రాధకు పేదరాలి పెద్దమ్మ జారశృంగారమును ఉపదేశించును. పేదరాలి పెద్దమ్మ ప్రథమత: శుకసప్తతియందు, తదుపరి హంసవింశతి యందు, తదనంతరము రాధామాధవసమాగమమునందు దర్శనమిచ్చును.

రాధ పూర్వజన్మవృత్తాంతము కొసమెఱుపు. హరికి సేవ సేయవచ్చిన హరిహారిణి అను అప్సరసను, లక్ష్మి "భువిలో మగనాలవగుమటంచు శపించె"ను. (192ప. 3ఆ.) హరి "మగువా! సిరి వాక్యము దప్పరాదు, నీ వెనయఁగ నందునింట జనియింపుము, నేనును గృష్ణమూర్తినై . . నీ కూర్మి నాఁడు దీర్తు"నని అనుగ్రహించును. (194-196ప. 3ఆ.) "ఆ పరమేశ్వరుండు . . . . ఆత్మలీలాపరిణామశీలి." (201ప. 3ఆ.)

రాధ శిశుసంరక్షణమునందు రసగుళికలు :

"దేవుండని చెలికాఁడని<br>
వావిని మేనల్లుఁడని కువలయాక్షి హరిన్<br>
'రావయ్యా' యని పిలుచున్<br>
'రావో'యని పిలుచుఁ బిలుచు 'రారా' యనుచున్." 10ప. 1ఆ.

"అత్తత్తా! యని పిన్ననాఁడనుట తథ్యంబై తగన్ శౌరి త<br>
న్నత్తత్తా! యని యాట ప్రాయమున నాహ్లాదంబునం బిల్వ నే<br>
నత్తన్ నీ కెటులౌదు? మోహనవిలాసాంచద్వత్సంగమా<br>
యత్తన్ న న్నిటు లాడఁబోకుమను నయ్యబ్జాక్షి మోహార్తయై." 14ప. 1ఆ.

ఆంధ్రదేశవర్ణన :

"అండజగామిని! చెప్పెద<br>
రెండవకథ వినుము సరళహృదయంబున; భూ<br>
మండలలక్ష్మికిఁ దలగడ

దిండగు నన నొప్పు నాంధ్రదేశమునందున్. " 26ప. 3ఆ.

రాధామాధవసమాగమమునందు పుర (43-56ప. 1ఆ.) నాయికా (73-93ప. 2ఆ.) సూర్యాస్తమయాదిచంద్రోదయపర్యంత (116-132ప. 2ఆ.) నాయికావిరహ (133-135, 163-174ప. 2ఆ.) మన్మథాద్యుపాలంభ (136-161ప. 2ఆ.) వర్షర్తు (33-37వచ. 3ఆ.) నాయకవిరహ (75-105, 142-148ప. 3ఆ.) సంభోగ (158-181ప. 3ఆ.) గ్రీష్మర్తు (189-190ప. 3ఆ.) వర్ణనలు కలవు. పురవర్ణనము పట్టణవర్ణనము కాదు. పల్లె వర్ణనము. వ్రేపల్లె వర్ణనము.

**దిట్టకవి నారాయణ** : ఇతని కృతి రంగారాయకదనరంగచరిత్రము. మల్రాజు రామనృపాలునికి అంకితము. " ఈ గ్రంథము 1790 వ సంవత్సరప్రాంతమున రచింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. " అని ఒక అభిప్రాయము కలదు[209]. అది సత్యసన్నిహితమగును.

మల్రాజు వంశమునందు ఇద్దఱు రామనృపాలురు కలరు. (29, 43ప. 1ఆ.) ఇద్దఱును కొండలరాయనామధేయుల కుమారులే. (23-27; 32-38ప. 2ఆ.) ఒకడు తాత. మఱొకడు మనుమడు. తాత రామనృపాలుడు, బెల్లపుకొండ ధరాధి రాజు. (29ప. 1ఆ.) మనుమడు రామనృపాలుడు వినుకొండ, బెల్లపుకొండ మండలాధిపతి అగును. (10ప. 1ఆ.) మనుమడు రామనృపాలుని సవతి సోదరుడు వేంకటనరసింహ రాయడు "సైపఖానవజీరభుజావలేపకృద్వీరవిజయ ప్రతాపశాలి. (44ప. 1ఆ.) సైపఖాను సమాచారము మృగ్యము. రంగారాయకదనరంగచరిత్రమునందు వేంకటనరసింహ రాయని తర్వాతి వంశవర్ణనము లేదు. కాని అతని జ్యేష్ఠపుత్త్రుడు పెదగుండారాయణి (1784-1814), ఇతని భార్య రాణీ లక్ష్మమ్మ (1832-33) చరిత్రకు అందిన వ్యక్తులు[210]. వేంకటనర సింహరాయని, అతని సోదరుడు- మనుమడు రామనృపాలుని కాలము పదునెనిమిదవ శతాబ్ది ఉత్తరార్థము, తాత రామనృపాలుని కాలము పదునెనిమిదవ శతాబ్ది పుర్వార్థము అగును.

రంగారాయకదనరంగచరిత్రము రంగారాయచరిత్రమని ముద్రితము. కాని రంగారాయచరిత్రము కాదు. రంగారాయకదనరంగచరిత్రమే. రంగరాయకదనము బొబ్బిలి యుద్ధము. 1757 వ సంవత్సరమునందు జరిగినది. అది రంగారాయకదనరంగ చరిత్రమునందు యథార్థముగ లేదు. కథార్థముగ కలదు. బొబ్బిలి యుద్ధము జరిగిన తరమునందు గాక, తరువాతి తరమునందు రచించుట తన్నిమిత్తమగును.

బొబ్బిలి యుద్ధము ప్రసిద్ధము. బొబ్బిలియుద్ధకథ, పెద బొబ్బిలిమహారాజు కథ అని వీరగాథలు కలవు. అవి 1790 తరువాతి రచనము లగును. 24-1-1757వ తేదీని తెల్లవారు జామున ప్రారంభమైన బొబ్బిలి యుద్ధము చరిత్ర 1790 ప్రాంతము నందలి కావ్యమునందు, 1790 తర్వాతి వీరగాథలందు మార్పులకు చేర్పులకు లోనై నది[211]. కావ్యమునందు, వీరగాథలందు పెద విజయరామరాజును నిద్రించునెడ తాండ్ర పాపారాయుడు హత్య చేసినట్లు కలదు. సమకాలికసమాచారమునందు రంగారావు సైనికులు ఇద్దఱు హత్య చేసినట్లు కలదు. కావ్యమునందు రంగారావు తమ్ముడు వెంగళరావు ప్రాణావశిష్టుడుగా ఉన్నట్లు, అతనికి బూసీ కొత్తపలి సీమ, కొన్ని జాగీరులు,

గజాశ్వములు, మృదులాంబరములు ఇచ్చినట్లు కలదు. (271-273ప. 3ఆ.) వీరగాథ లందు వెంగళరావు ఆత్మహత్య చేసికొన్నట్లు కలదు. చరిత్రయందు వెంగళరావు యుద్ధ రంగము నుండి తప్పించుకొని, బాలుడైన అన్న కుమారుడు వేంకటరంగారావును తీసికొని, భద్రాచలమునకు పాఱిపోయినట్లు కలదు. వేంకటరంగారావును రాయమణి రాణి దాదికి అప్పగించి, కోట వెడలించి బ్రతికించుకొమ్మన్నట్లు శత్రువులు పట్టకొన్నట్లు కావ్యమునందు కలదు. (158, 180ప. 3ఆ.) వీరగాథలందు రాణి మల్లమ్మ వేంకటరంగా రావును దాదిచేత చామల్లకోట పంపించినట్లు, శత్రువులు పట్టుకొన్నట్లు కలదు. కావ్యము నందు మల్లమ్మ పేరే లేదు. (158, 159ప. 3ఆ.).

రంగారాయకదనరంగచరిత్రము స్త్రీ పాత్రలేని కావ్యము. కరుణరసశబలితమైన వీరరసము ప్రధానము-చారిత్రికకావ్యము కతిపయవర్ణనలు కలవుగాని, కథాప్రధానము. నాయకుడు బొబ్బిలి సంస్థానాధిపతి రంగారావు. ప్రతినాయకుడు విజయనగరసంస్థానాధి పతి పెద విజయరామరాజు. వీరికి వైరము.

"మును రాచతఁడు వెల్మబిడ్డఁడును మమ్ముం జాడఁగా వచ్చి వా
రును వారు న్వివదించుచోఁ దగడు మీరు న్నీరు చూపోకుం
డని వైరంబునఁ బోరు పెట్టుకొని యిట్లాడంగ రాదంచు నా
కినుక ల్మానిపి పుచ్చినారము మృదూక్తి న్వారి కత్యంతమున్. " 120ప. 2ఆ.

అని బందరు పట్టణాధిపతి గోరుండొర- రాయవకీలు మద్దాల రెడ్డినాయుడు, వకీలు బంతెన బుచ్చన సందర్శించినపుడు తెలిపిన సంగతి. అయినను, పెద విజయరామరాజు,

"బలవద్విక్రమశాలి నా నృపుని మీ బల్మి న్నివారించి బొ
బ్బిలిలో మ మ్మభిషిక్తుఁ జేసి పిదపం బెంపేది తద్రాజ్యమె
ల్ల లసత్ప్రీతిని మా కొసంగినను లీల న్మీకుఁ బండ్రెండు ల
క్షల రూపాయ లుపాయనంబులుగ రొక్కం బిత్తు నిక్కంబుగన్ " 47ప. 2ఆ.

అని హైదరుజంగును అంగీకరింపఁజేయును. రంగారావు కూడ రాయబారిగ వచ్చిన హసవల్లీఖానుతో ఇట్లనును.

"అది గాదేని యతం డొసంగు ధన మెంతో నంత కే నిబ్బడి
చ్చైద నా రాచకుమారుఁ డేలు పురి తత్సీమాసమేతంబుగా
మదధీనం బొనరింపుఁ డెంతయును ధర్మప్రక్రమంబు- " 224ప. 2ఆ

"అర్థమెంతైన నిచ్చెద మంత మీఁద
నొడఁబడఁడయేని ప్రాణము ల్విడుచువార
మంతయే కాని పౌరుషహాని కొప్పి
వెడల నోపము దీనికి సడలను. . " 241ప. 2ఆ.

బొబ్బిలి కోట విడిచిపొమ్మని హసవల్లీఖాను రాయబారము. కారణము- బొబ్బిలి కోట దురాక్రమణ పెద విజయరామరాజు ధ్యేయము. అనువంశికదురభిమానము రంగారావు లక్ష్యము. బుస్సీ, హైదరుజంగు, పెదవిజయరామరాజుల సైన్యము లక్షదళము. రంగారావు సైన్యము నలుబదివేల దళము,

"లక్షదళ మీద నాల్గువేల్దళముతోడ
కయ్యమున కెక్కు టసమానకక్ష యనుచు

నిష్ఫలపడంగ వలవదు నవ్వు గాదు
దీప మింతైనఁ గొలుపదే తిమిరహ్రుతికి " 233ప. 3ఆ.

అని కవి సమర్థనము. కాని దీపము ఆఱిపోయినది. తిమిరము మీఱిపోయినది. బొబ్బిలి కోట విధ్వంసమైనది- "అవరోధవధూకులకంఠనాళకృంతనము" (150, 151ప. 3ఆ.) జరిగినది. లక్షసైన్యము నిహతమైనది. రంగారావు స్వర్గతుడు. పెదవిజయరామరాజు సంహతుడు.

ఇది నారదుడు ఇంద్రునికి చెప్పినట్లు ఉపక్రమణము (65-88ప. 1ఆ.) నిర్వహణమును.

"అంత నేనును గలహాశి నగుటఁజేసి
కుతుక ముదయించి వచ్చి భారతరణంబు
నాఁడుగాఁ గూటిపేదనై నేఁటి కిందుఁ
గంటినని కుంచె విసరుచునుంటి మింట " 71ప. 3ఆ.

దిట్టకవి కవిత్వమునందు దిట్టతనము కలదు. శైలి సరళము. ప్రౌఢమును. రసోచితము. భాష బహువిధభాసమానము. వ్యాకరణానుసారిపద్యములందు వ్యావహారిక భాషాపదములును కలవు.

"పలికెదవేల యిట్లు పసిబాలురతోడుత మాటలాడి న
వ్వులు పచరించినట్లు చనువు ల్నెరపే వది మంచిమాట గా
దలఘుపరాక్రమాతిశయు నాతని కోట వదల్చు రీతిగాఁ
దెలియఁగ వ్రాయు మిప్పుడని తీవ్రతఁ జూపుచు ఖానుఁ డల్లుటన్. " 169ప. 2ఆ.
"ధనమెంతైన నొసంగువారమని యాథార్థ్యంబుగాఁ గోట యీ
మని నొబత్తు నదల్ప నోపమని యన్యాయంబుచే నెత్తివ
చ్చినఁ బ్రాణంబుల కాసఁ జెందమని నిశ్చింత న్మముం జంపఁజా
చినఁ జచ్చేమని పల్కినా రవల మీ చిత్తం బనం గ్రుద్ధుఁడై. " 245ప. 2ఆ.

అన్యదేశ్యపదములు అసంఖ్యాకము. అందు ఫ్రెంచివికృతులును కలవు[212].

"మూసాశబ్దము పూర్వమందు మెలఁగన్ ముఖ్యల్ సజాతీయులున్
లాసూ, మర్తెను, దొమ్మితీరు విపూలాం, లస్సేను, కుస్లాం కునే
మాసూనాములు వానిఁ జేరి రతి దుర్మార్గుల్ జిరాకూర్పుమి
న్మాసన్నంపు బనాతు పింజరుల సాన్నాపాలకీ లెక్కుచున్. 146
సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సార్జంతుల్, మయూరుల్, కుమం
దములన్ వీరులు సోలుదాదులు సుబేదారుల్ మొదల్గల్గు సై
న్యము లాత్మీయులుఁ గొల్వ నుద్ధతులముల్కాఖ్యామహాఖ్యాతిమ
త్పముదగ్రప్రతిభావిభాసియగు మూసాబూసి యుల్లాసియై. " 147ప. 1ఆ.

ఇందు మూసా Monsieur, మర్తెను Martin, కుస్లాం Conflans, కుముందములు Zee Commandant, సోలుదాదు Soldat, బూసీ Bussy, అను ఫ్రెంచి పదములకు వికృతులు. సార్జంతు Sargeant అను ఇంగ్లీషుపదమునకు సంవదించు ఫ్రెంచి ఉచ్చారణము. మయూరులు Major, అను ఇంగ్లీషుపదమునకు సరియైన ఫ్రెంచిపదము. ఫ్రెంచి ఉచ్చారణమునకు అనుగుణము. Soldat అను ఫ్రెంచిపదమునకు Soldier, అని ఇంగ్లీషుపదము. కుముందము - కుముందాను అని కూడ కలదు. (117ప. 1ఆ.)

**చిత్రకవి సింగరార్యుడు** : ఇతని కృతులు 1. బిల్హణీయము. 2. రాఘవవాసుదేవీయము. ద్వ్యర్థికావ్యము. 3. చిత్రరత్నాకరము. ముద్రితము. దుర్లభము. మొదటిది చెన్నభూపునికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. రెండవది కామినేని బంగారంకభూపాలునికి అంకితము. అతనికి పూర్వుడైన కామినేని ముత్తరాజు శాసనము 1641 వ సంవత్సరమునందు కలదు[213]. ముత్తరాజునకు, బంగారంకభూపాలునికి నడుమ నాలుగు తరములు కలవు. కనుక బంగారంకభూపాలుని కాలము 1771 ప్రాంతమగును. అతనికి కృతిస్వీకారకాలమునందు మనుమలు కలరు. కనుక కృతిస్వీకారకాలము 1795 ప్రాంతము కావచ్చును. చిత్రకవి సింగరార్యునికి ఎనిమిదవతరము వారు ఇప్పుడు కలరు. కనుక సింగరార్యుని కాలము 1785 ప్రాంతమగును. కాబట్టి బిల్హణీయము రచనాకాలము 1790 ప్రాంతము, రాఘవవాసుదేవీయము రచనాకాలము 1795 ప్రాంతము, చిత్రరత్నాకరము రచనాకాలము 1800 ప్రాంతము కావచ్చును.

బిల్హణీయమునందు చిత్రకవి నారసింహార్యుడు పండిపెద్ది కృష్ణస్వామిపండితేంద్రుని "ఒక్క పురాణకథ నాంధ్రప్రబంధంబుగా రచియించి రామాంకితముచేయు"మని కోరినట్లు, పండిపెద్ది కృష్ణస్వామిపండితేంద్రుడు బిల్హణోపాఖ్యానము రచించినట్లు కలదు. (పుటలు2-3) షష్ఠ్యంతపద్యములు, ద్వితీయతృతీయాశ్వాసాదిపద్యములు, తృతీయాశ్వాసాంతపద్యము రామపరముగ కలవు. ప్రథమద్వితీయాశ్వాసాంతప్రథమపద్య మిట్లు కలదు.

> "ధన్యా సింహాభచంద్రకీర్తివరవిద్యాపణ్డితార్యక్రమా
> గణ్యాగర్వధనంజయాదిపదముక్తాకృత్యగంకప్రభా
> జన్యారాజితభూరిశాత్రవసుభృజ్జాతిద్రమావిక్రమా
> మాన్యారాధనత్యాగభోగజయధామా నవ్యభాగోత్తమా " పుట 26.

ఇది చక్రబంధము. ఇందు మూడవ వలయమునందు "సింగరార్యకవి" అని కలదు. ఆరవవలయమునందు "చెంనంభూపకృతి"అని కలదు. అనగా చెన్నభూపకృతి. చిత్రకవి సింగరార్యుడు రచించి, చెన్నభూపునికి అంకితమిచ్చిన బిల్హణీయమును, అతని వంశీయుడగు చిత్రకవి నారసింహార్యుడు పండిపెద్ది కృష్ణస్వామిపండితేంద్రుని పరము చేసినట్లు అనుమేయము. సింగనార్యుడు బిల్హణీయము రచించినట్లు రాఘవవాసుదేవీయమునందును కలదు[214]. పండిపెద్ది కృష్ణస్వామిపండితేంద్రుడు సంపన్నిధానము. పాలితకవీంద్రుడు. (పుట 2.) సంపన్నుడైన సంస్కృతపండితునికి ఇది సత్కారము!

**బిల్హణీయము** : ఇది సంస్కృత బిల్హణచరిత్రమునకు స్వతంత్రాంధ్రీకరణము. అది బిల్హణకవి కృతమని ప్రసిద్ధము. కాని స్వీయచరిత్రము కాదు. సరసమైన, సాహసోపేతమైన సంస్కృతకావ్యము. ప్రప్రథమశ్లోకమే విప్లావకధోరణి. బ్రహ్మవిష్ణుమహేశ్వరులెందుకు స్త్రీల నిండుజవ్వనమునకు నమస్కరింపుమని ప్రబోధము.

> "అలం కమలజన్మనా కమలలోచనే నాప్యలం
> మనోభవవిరోధినా విషమలోచనే నాప్యలమ్,
> ప్రతిక్షణవిజృమ్భణా దుభయబాహుకూలఙ్కష
> స్తనత్రుటితకఞ్చుకం నమత యౌవనం యోషితామ్. " 1శ్లో.

ఇది ఆంధ్రీకరణమునకు అందని ఫలము. ప్రసిద్ధమైన 'నైవవ్యాకరణజ్ఞమేతి

పితరం'' అను శ్లోకమునకు (12) సింగనార్యుని తెనుగుసేత- సీసపద్యము (పుట 14)-
కంటె, పూర్వోదాహృతమైన కాణాదము పెద్దన తెనుగు సేత మెఱుగు.

అతిప్రసిద్ధమైన చంద్రవర్ణనము :

"అజ్కం కేఽ పి శశఙ్కిరే జలనిధేః పఙ్కం పరే మేనిరే
సారఙ్గం కతిచి చ్చ సంజగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే,
ఇన్దౌ యద్దళితేన్ద్రనీలశకలశ్యామం దరీదృశ్యతే
తత్సాన్ద్రం నిశిపీత మన్ధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే." 47శ్లో.

తెనుగుసేత :

"జలనిధిపంకమంచు మహి ఛాయయుఁ జిహ్నము లేడిపిల్ల కం
దళితసురేంద్రనీలమణిధామ మటంచు వచింతు రంద ఱీ
కలువలతేని యందుఁ గల కందును నే ననుకొందు రాత్రియం
దలవడ మ్రింగినట్టి తమ మంతరసంస్థ యటంచు నెంతయున్." పుటలు 39,40

ఇందు అర్థము కిట్టినది. శ్లోకములోని స్ఫూర్తి పద్యమునందు మూర్తి కట్టలేదు.

"క్వ కాణః క్వ కళఙ్కీ చ? కథం వా తస్య వర్ణనమ్?
ఇతః పరం కి మాశ్చర్యం? కథం సంపద్యతా మిదమ్?" 52శ్లో.

"అన్ధో నాయం ధ్రువం సర్వ మేత జ్జనకైతవమ్
వ్రతభఙ్గ యది స్యా ద్వా తం పశ్యామి మహాశయమ్." 53శ్లో.

అను శ్లోకములకు ఆంధ్రీకరణమిది :

"అంధుం డెక్కడ; చంద్రుఁ డెక్కడ, తదీయంబైన యా వర్ణనా
బంధం బెక్కడ? నిట్టి వింత గలదే భావింప నెచ్చోటనై
నం? ధాత్రీంద్రుఁడు మాకు నిర్వరకు నందం బొప్ప నన్యోన్యస
త్సంధానం బగునంచుఁ జేసె నెటులం జర్చింప నేమున్నదే?" పుట 43

ఇందు పూర్వార్ధము మూలవిధేయము. ఉత్తరార్ధము మూలవివరణము.

యామినీపూర్ణతిలకాబిల్హణుల సంసర్గము తెలిసి, యామినీపూర్ణతిలక తండ్రి మదనాభిరామమహారాజు బిల్హణునికి శిరశ్ఛేదశిక్ష విధించును. వధ్యశిలను అధిరోహించిన బిల్హణుడు మందహాసము చేసి, ఖడ్గము ధరించిన రాజభటుని వెంటనే శిరశ్ఛేదము చేయుమని కోరును. రాజభటుడు మందహాసకారణమడుగును. బిల్హణకవి సమాధానము హృదయవిదారకము. అందు- నూటయేబదిరెండు శ్లోకముల బిల్హణచరిత్రమునందు- ఏబదియాఱు శ్లోకములు "అద్యాపి"అని ప్రారంభమగును. అవి అద్యాపిశ్లోకములని అత్యంతప్రసిద్ధము. అద్యాపిశ్లోకముల అనంతరశ్లోకమిది :

"పఞ్చత్వం తను రేతు భూతనివహా స్వాంశా మిళన్తు ధ్రువం
ధాత స్త్వాం ప్రణిపత్య సాదర మిదం యాచే నిబద్ధాఞ్జలిః
తద్వాపీషు పయ స్తదీయముకురే జ్యోతి స్తదీయాఙ్గణే
వ్యోమ స్యా చ్చ తదీయవర్త్మని ధరా తత్తాళవృన్తేఽ నిలః" 146శ్లో.

శరీరము పంచభూతముల కలయిక. అవి మఱల పంచభూతములందు కలియుట మరణము. కనుక యామినీపూర్ణతిలక నడయాడు మార్గములందు పృథివ్యంశము, స్నానమాడు దిగుడు బావులందు వార్యంశము, కనుగొను అద్దమునందు తేజోంశము,

విసురుకొను విసనకఱ్ఱయందు వాయ్వంశము, విహరించు ప్రాంగణములందు ఆకాశాంశము కలుపుమని బిల్హణకవి బ్రహ్మను ప్రార్థించును. అద్యాపిశ్లోకములతోపాటు అనంతరశ్లోక మిది వినగానే రాజభటులు హృదయములు కరిగి, రాజునొద్దకు పరుగెత్తుకొనిపోయి, కవీంద్రుని రక్షింపుమని వేడుకొందురు. రాజు రక్షించును. అంతేకాదు. యామినీపూర్ణతిలకాబిల్హణకవులకు అగ్నిసాక్షిగ సంప్రదాయవివాహము చేయును. ఇది బిల్హణచరిత్రమునందు ప్రముఖఘట్టము. ఆంధ్రీకరణమునందు అద్యాపిశ్లోకముల అనుసరణము కలదుగాని, (పుటలు 75-83) అద్యాపిశబ్దవిశిష్టతలేదు. బిల్హణకవిపద్యములను రాజభటుడు తాళపత్రములందు లిఖించి రాజునకు పంపినట్లు కలదు. అంతేకాదు. అతిముఖ్యమైన అద్యాపిశ్లోకముల అనంతరశ్లోకమునకు తెనుగుసేత. బిల్హణచరి( ) లోని శ్లోకమునకు గాక, భోజచరిత్రములోని చాటుశ్లోకమునకు తెనుగుసేత కలదు.

"భట్టి ర్నష్టో భారవిశ్చాఽ పి నష్టో
భిక్షు ర్నష్టో భీమసేనోఽ పి నష్టః
భుక్కుణ్డోఽ హం భూపతి స్త్వం హి రాజన్
భబ్బావల్యా మన్తకః సన్నివిష్టః " పుట 246

"రవిజాఁడు భాగుణింప విధురంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁ డడంగె దీర్ఘమునఁ బ్రాణముఁ బాసె గుడియ్య భిక్షుఁ డీ
యవనికిఁ దప్పె భీముఁడు దదంతగతి న్మతి కొమ్మువెట్ట ని
క్కువముగ వే భుకుండుఁ డను కొమ్మున దీర్ఘము పెట్టకుండఁ డీ
భువి నతఁ డెన్న నిర్దయుఁడు భూపతి నీవుఁ దలంప భూవరా! " పుట 85శ్లో.

శ్లోకములోని చమత్కారము వక్త భుక్కుణ్డు డగుట వలన సహజసిద్ధము. పద్యములోని చమత్కారము వక్త బిల్హణుడగుట వలన బలవదాకృష్టము. భయజనకము. మదనాభిరామమహారాజునకు అగ్గి మీది గుగ్గిల మగునది. బిల్హణచరిత్రములోని అద్యాపిశ్లోకము కరుణరసనిర్భరము. బిల్హణీయములోని అన్యథాకల్పనము సందర్భోచితము కాదు. అది బిల్హణుడే లిఖించి రాజునకు పంపించుట మఱింత అసందర్భము.

సంస్కృత బిల్హణచరిత్రము 152 శ్లోకముల రసవత్కావ్యము. తెలుగు బిల్హణీయము 714 పద్యగద్యముల బలవత్కావ్యము. ఉన్న వర్ణనల ఉద్ధరణము కాక, లేని వర్ణనల ఉపబృంహణమును కలదు.

బిల్హణీయమునందు అమూలకమైన పుర (3-8పు.) వసంత (27-32పు.) సూర్యాస్తమయాదిచంద్రోదయపర్యంత (33-34పు.) వనవిహార (34-39పు.) సరససల్లాప (57-61పు.) విలాప (71-72పు.) పౌరజనకలాప (72-74పు.) వివాహ (91-97పు.) కుమారోదయ (97-98పు.) వర్ణనలు కలవు.

**రాఘవవాసుదేవీయము:-** ఇది అముద్రితము. రామకృష్ణుల పరముగ ద్వ్యర్థి కావ్యము. "రాఘవపాండవీయము, హరిశ్చంద్రనలోపాఖ్యానముల వలెనీ కావ్యము ప్రౌఢముగా లేదు. కాని ద్వ్యర్థికావ్యరచనమున నీతనిని సమర్థుడనియే చెప్పవచ్చును." అని ఒక అభిప్రాయము[215].

**చింతగుంట కోదండరామయ్య :** ఇతని కృతి సునందాపరిణయము. అముద్రితము. ఇతడు గుంటుపల్లి భాస్కరుని అల్లుడు సర్వన్నకు అయిదవతరములోని అంకన్నకు

దత్తుడు. భాస్కరుడు గుంటుపల్లి ముత్తన్న పుత్త్రుడు. ముత్తన్న చరమకాలము "శరజలనిధి హరిచందనతరుచంద్రసంఖ్య[216]." శర=5, జలనిధి=4, హరిచందనతరు=5, చంద్ర=1 - 1545+ 78=1623. అతనికి, ఇతనికి నడుమ ఏడుతరములు కలవు. తరమునకు ముప్పదిసంవత్సరములు పరిగణించిన, ఇతని చరమకాలము 1623+30×7=210 - 1833 ప్రాంతమగును. జననకాలము 1750 ప్రాంతమగును కాఁబట్టి సునందాపరిణయము రచనాకాలము 1790 ప్రాంతము కావచ్చును.

**ఆతుకూరి పాపయారాధ్యుడు** : ఇతని కృతి లలితాంబోపాఖ్యానము. ధాన్యవాటి అమరేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు ములుగు పాపయారాధ్యుని గురువని ప్రసిద్ధి. అతని కాలము[217] 1778-1852. కనుక ఇతని కాలము 1748-1822 అగును. కాఁబట్టి లలితాంబోపాఖ్యానము రచనాకాలము 1790 ప్రాంతము కావచ్చును.

లలితాంబోపాఖ్యానమునకు మూలము బ్రహ్మాండపురాణము. (20ప. 1ఆ.) ప్రథమాశ్వాసములోని సతీదేవివృత్తాంతము, ద్వితీయాశ్వాసములోని పార్వతీదేవి వృత్తాంతము ప్రసిద్ధములు. మన్మథుని భస్మమగునట్లు సుందోపసుందులు శపించుట ప్రసిద్ధము కాదు. అంతేకాదు. తృతీయాశ్వాసము నుండి అష్టమాశ్వాసమునందును కొనసాగిన లలితాంబో పాఖ్యానము కేవలము బ్రహ్మాండ పురాణప్రోక్తము. అష్టమాశ్వాసములోని పార్వతీపరిణయ వృత్తాంతము ప్రసిద్ధమే కాని, సమకాలికప్రభావసమాక్రాంతము. ప్రధానమైన లలితాంబో పాఖ్యానము పౌరాణికప్రతిపత్తిప్రచురము. మంత్రతంత్రమర్మ గర్భితమైన మహాశంభుని మహాయాగము, మహాశక్తుల మహాయుద్ధము ప్రధానఘట్టములు.

మన్మథుని భస్మము నుండి పండుడను రాక్షసుడు ప్రభవించుట, అతని దురాగతములకు బ్రహ్మ "భండితి భండితి"అనుట వలన భండాసురుడగుట, మన్మథుని భస్మము నుండియే విశుక్రుడు, విషంగుడు, అను రాక్షసులు ప్రభవించుట, ముగ్గురు సోదరులు ముల్లోకములలోని స్త్రీపురుష లందఱిని నిర్వీర్యులను చేయుట, మహాశంభుడు చేసిన మహాయాగమునందు లలితామహాదేవి ఆవిర్భవించుట, కామేశ్వరుని వరించుట, లక్ష్మీనారాయణులను, సరస్వతీచతుర్ముఖులను, సమస్తదేవతలను మఱల సృజించుట, మంత్రనాయిక (వారాహి) దండనాయిక (శ్యామల) సంపత్కరిణి, తిరస్కరిణి, కామేశ్వరి, దుర్గబాల (లలితాంబకూతురు) మొదలైన శక్తులతోగూడి, రాక్షసత్ర యముతో యుద్ధము చేసి సంహరించుట, మన్మథుని పునర్జీవితునిచేసి, పార్వతీపరమేశ్వరులకు మరులు కల్పించుట అసాధారణములైన అంశములు.

పార్వతీపరమేశ్వరముల విరహము పాత్రానుగుణముగ లేదు.

"హా యను నిట్లుసేయఁ దగవా యను నాయెడ నేరమేమి గౌ
రీ యనుఁ గౌఁగిలింపుము మహీధరరాజకుమారికాలలా
మా యను నిన్నుఁ బాసి క్షణమైనను దాళఁగ నోప మంజువా
ణీ యను నన్వరింపు తరుణీ యను నిందుధరుండు ప్రేమతోన్." 104ప. 8ఆ.

"గిరిజాత యయ్యవసరమునఁ బూర్వదృ
ష్టంబైన శివుని రూపంబు దలఁచి
యంతట నుండి మహాదేవుఁ డెన్నండు
తనుఁ బెండ్లియాడునో యనుచు నతని

సౌందర్య మెన్నుచు స్వస్థత నిదురింప
కలరుఁగైదువుజోదు వలకుఁ జిక్కి
యమృతకల్పంబులౌ నాహారముల మీఁద
నరుచి జనింపఁగ నాత్మసఖులఁ
దన యభీష్టంబు సాధింపుఁ డనుచుఁ బ్రార్థ
నంబు సల్పుచు విరహోష్మ నలఁగి బయలు
గౌఁగిలించుచు సొలయుచు క్ష్మాధరేంద్ర
తనయ యిట్టు లేకాదశదశల నెనసె. " 167ప. 8ఆ.

**గోపాలుని సింగయ** : ఇతని కృతి కిరాతార్జునీయము. గరుడాద్రి నరసింహ స్వామికి అంకితము. దైవాంకితము. "ఈ కవి పుత్త్రుఁ డెనుబది సంవత్సరముల క్రిందట జీవించియుండెను. కాబట్టి నూఱు సంవత్సరముల క్రిందటివాఁడు"అని ఒక అభిప్రాయము కలదు[218]. అనగా 1899-80=1819 ప్రాంతమునందు కవి యొక్కపుత్త్రుడు జీవించియున్నాడు. కవికాలము తత్పూర్వమగును. కాఁబట్టి కిరాతార్జునీయము రచనాకాలము 1790 ప్రాంతము కావచ్చును.

కిరాతార్జునీయము భారవి కిరాతార్జునీయమునకు తెనుగు సేత.

"భారవిభట్టు రచించిన
భారవి యను కావ్య మవనిఁ బ్రఖ్యాతిగ నే
నారూఢిం దెనిఁగించెద
ధారుణి నాచంద్రనిత్యతారార్కముగాన్. " 14ప. 1ఆ.

అని కవి ప్రతిపాదనము. ఆంధ్రీకరణము స్వతంత్రాస్వతంత్రపద్ధతి.

"క్రియాసు యుక్తై ర్నృప చారచక్షుష:
స వఞ్చనీయా: ప్రభవోఽ నుజీవిభి:
అతో ర్హసి క్షన్తు మసాధు సాధు వా
హితం మనోహారి చదుర్లభం వచసి 4శ్లో. 1స.
స హి సఖా సాధు న శాస్త్రి యో ధిపం
హితా న్నయస్సంశ్రుణుతే స కిం ప్రభు:
సదానుకూలేషు హి కుర్వతే రతిం
నృపే ష్వమాత్యేషు చ సర్వసంపద: " 5 శ్లో. 1స.

అను శ్లోకములకు సింగయ ఆంధ్రీకరణమిది :

"జననాథ విను ప్రయోజనములందు నియుక్తు
లైనట్టి భృత్యుల కరసి చూడఁ
జారచక్షువులైన జగతీశ్వరునకు వం
చన చేసి మాట దాచంగ రాదు
కానఁ బల్కితిని మీ మానసంబున కది
ప్రియమైనఁ గాని యప్రియము కాని
సైరణ సేయు మో సామి యిదియుఁగాక
యతిహితంబులు మనోహరము లైన
పలుకు లరయంగఁ గడు దుర్లభములు గాక

హితవు వినిపింపకుండు వా రేటి హితులు
హితుల మాటలు వినని తేఁ డేటి రాజు
రాజు మంత్రులుఁ గూడుచోఁ దేజ మగును." 29ప. 1ఆ.

"సహసా విదధీత న క్రియా
మవివేకః పరమాపదాం పదమ్
వృణతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధా స్స్వయమేవ సంపదః. " 30శ్లో. 2స.

"ఆలోచించక క్రియలను
బాలసుఁడై చేయునేని పరమాపదకు
న్మూలమగుఁ దెలిసి చేసినఁ
జాల గుణాశ్రయములైన సంపద లందున్. " 112ప. 1ఆ.

"ధ్వాం నిరుద్ధ దతినీలఘనాభః
ధ్వాన్త ముద్యతకరేణ పురస్తాత్
క్షిప్యమాణ మసితేతరభాసా
శంభునేవ కరిచర్మ చకాశే. " 2శ్లో. 9స.

ఇది శ్రీనాథుని అంధకారవర్ణనములోని "తాండవారంభరభసభంగపతితపరశ్వధ పాణి వికటకంధరారుద్ధగజకృత్తికంథశంక" అను స్వతంత్రకల్పనమునకు (35ప. 2ఆ. భీ.పు.) ప్రేరణము కావచ్చును. ఈ శ్లోకమునకు సింగయ ఆంధ్రీకరణమిది :

"గగనమెల్లఁ గప్పి ఘననీలరుచినొప్పి
శీతభానుకరవిఘాతమాన
పూర్వ మగుచుఁ దమము వొల్చె శంకరో
చ్ఛానగాగచర్మశోభ గలిగి. " 130 ప. 3ఆ.

ఇది యథామూలకము. ఇందు నాగచర్మము శంకరుడు విసిరి వైచినది. అందు తాండవారంభరభసభంగమునకు పడినది. కంధరారుద్ధమైనది.

"లేఖయా విమలవిద్రుమభాసా
సంతతం తిమిర మిన్దు రుదాసే
దంష్ట్రయా కనకటంకపిశఙ్గ్యా
మణ్డలం భువ ఇవాదివరాహః " 22శ్లో. 9స.

ఇది శ్రీనాథుడు పూర్వకవితాచర్వణము చేసినది. ఆపద్యమిది :

"ఆతతలీలఁ గోమలనవాంకుశపాళి మహాంధకారసం
ఘాతము మీటి నద్భుతముగా శశిలాంఛనుఁ డభ్రవీథికిన్
శ్వేతవరాహమూర్తి యగు వెన్నుఁడు ప్రన్నని యొంటికోఱ ధా
త్రీతల మంత యంతయు ధరించిన యట్టి విజృంభణంబునన్." 39ప. 2ఆ. భీ.పు.

ఇందు చంద్రుని స్వచ్ఛమైన పగడము వలె భాసించు కళ అనుట కంటె, కోమల నవాంకుశపాళి అనుట వలన ఆకృతిసామ్యము కలదు. ఆతతలీల కనుక అద్భుతము. శ్వేతవరాహమూర్తి దంష్ట్ర కనకటంకపిశంగమని లేదు. టంకమన శిలాభేదకశస్త్రమని మల్లినాథసూరి. పాషాణదారణమని అమరుడు. పిశంగమన లోహితవర్ణము. అది దంష్ట్రకు సహజము కాదు. శ్వేతవర్ణము సహజము. అందుకు శ్వేతవరాహమూర్తి అని నిష్కర్ష

శ్రీనాథుని తెనుగు సేత స్వతంత్రాంధ్రీకరణము. సింగయ తెనుగు సేత:

"శితకరుఁ డంత విద్రుమరుచిం దనరారెడు నాత్మసత్కళన్
జతురతఁ బాఱఁ దోలె నది సాంద్రతమిస్రము నాదిసూకరం
బతుల సువర్ణటంకరుచిఁ దారుణమై తగు దంష్ట్రచేత వి
శ్రుతముగ భూమి యెుక్కెడకుఁ దోఁచిన వైఖరి మీఱ నత్తఱిన్." 132ప. 3ఆ.

**ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు** : ఇతని కృతులు 1. అధ్యాత్మరామాయణము. 2. ద్విపదోత్తరరామాయణము. 3. పోలేరమ్మ దండకము. 4. శ్రీరామస్తవచూర్ణిక. 5. దీనరక్షామణీశతకము. ఇతడు కార్వేటి సంస్థానకవి. కాలము 1800 ప్రాంతము[219]. కృతుల రచనాకాలములు అధ్యాత్మరామాయణము 1800 ప్రాంతము. ద్విపదోత్తర రామాయణము 1805 ప్రాంతము, పోలేరమ్మదండకము, శ్రీరామస్తవచూర్ణిక 1806 ప్రాంతము, దీనరక్షామణీశతకము 1807 ప్రాంతము కావచ్చును.

**దంతులూరి బాపిరాజు** : ఇతని కృతి మూర్తిత్రయోపాఖ్యానము. శ్రీకృష్ణునికి అంకితము. ఇది బాపిరాజు రచించినట్లు క్రొత్తలంక మృత్యుంజయుడు రచించెనని ఒక అభిప్రాయము కలదు[220]. అందుకు ముఖ్యమైన హేతువులు మూడు కలవు.

i. మూర్తిత్రయోపాఖ్యానమును 1915వ సంవత్సరమునందు ప్రకటించిన వారికి, వారి పూర్వులు చెప్పుట.

ii. మూర్తిత్రయోపాఖ్యానతాళపత్రగ్రంథాంతసీసపద్యమునందు "దంతులూరి మేదినీంద్రుఁ గవిగా నొనర్చి సత్కవిరాజు మృత్యుంజయాఖ్యుఁడు విరచించి"నట్లు ఉండుట.

iii. కామినేని మల్లారెడ్డి రచించినట్లు షట్చక్రవర్తిచరిత్రము, పూసపాటి తమ్మభూపాలుడు రచించినట్లు కృష్ణవిజయము, అల్లూరి అప్పలరాజు రచించినట్లు ధరాత్మజాపరిణయము, రుద్రరాజు తిరుమలరాజు రచించినట్లు నిరోష్ఠ్యనలచరిత్ర మృత్యుంజయుడు రచించెనని జనశ్రుతి ఉండుట.

ఇందు ధరాత్మజాపరిణయము తాళపత్రగ్రంథములందు కొన్ని ఆశ్వాసాంతగద్యలు మృత్యుంజయుడు రచించినట్లు కలవు. కనుక ధరాత్మజాపరిణయము మృత్యుంజయుడు రచించినదగును.

కామినేని కామారెడ్డి, ఎల్లారెడ్డి, మల్లారెడ్డి సోదరులు. కామారెడ్డికి అంకితమైన సూతసంహిత రచనాకాలము 1570 ప్రాంతమని, ఎల్లారెడ్డికి అంకితమైన బ్రహ్మోత్తర ఖండము రచనాకాలము 1578వ సంవత్సరమని, మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్రము రచనా కాలము 1575 ప్రాంతమని, శివధర్మోత్తరము రచనాకాలము 1580 ప్రాంతమని పూర్వోక్తము[221]. ఇందు బ్రహ్మోత్తరఖండము రచనాకాలము 1578వ సంవత్సరమని అందే కలదు[222]. కనుక మల్లారెడ్డి కాలము పదునారవశతాబ్ది ఉత్తరార్ధము, పదునేడవ శతాబ్ది ప్రథమపాదమును అగును. (1575-1623) తదనంతరమగుట దుర్ఘటము. పూసపాటి తమ్మభూపాలుని కృష్ణవిజయము రచనాకాలము 1650 ప్రాంతమని పూర్వోక్తము. కనుక కొత్తలంక మృత్యుంజయుడు 1575 ప్రాంతమున షట్చక్రవర్తి చరిత్రము, 1650 ప్రాంతమున కృష్ణవిజయము రచించుట సుసంగతము కాదు.

అసంగతమే.

మూర్తిత్రయోపాఖ్యానతాళపత్రగ్రంథాంతసీసపద్యమునందు ఇట్లు కలదు.

"మూర్తిత్రయచరిత్ర ముదమొప్ప శాలివా
హనశకవర్షంబు లజగుణాద్రి
చంద్రసంఖ్యనెసఁగ జరగు నీశ్వరశర
త్సహితాదిమానశుద్ధహరిదివస
భృగుదినంబున లిఖియించి పేర్మి మీఱ
దంతులురి పద్మరాజభూకాంతమణికి
నొసఁగె నల్లమరాజవంశోద్భవుండు
రంగధాముడు ముదితాంతరంగుఁ డగుచు."

అజ=9, గుణ=3, అద్రి=7, చంద్ర=1 = 1739+78=1817. అది అల్లమరాజ రంగధాముడు లిఖియించి, "దంతులురి పద్మరాజభూకాంతమణికి" ఇచ్చిన కాలము. అల్లమరాజు రంగధాముడు వట్టి లేఖకుడు కాడు. కవి. అతని నారాయణాచల మాహాత్మ్యము రచనాకాలము 1825 ప్రాంతము. ఇది ముందు వివరింతును. కవియైన రంగధాముడు బాపిరాజును కవిగా చేసి, మృత్యుంజయుడు మూర్తిత్రయోపాఖ్యానము రచించెనని గ్రంథస్థము చేయుట ప్రత్యక్ష ప్రమాణము లేనిది సంభవము కాదు. మృత్యుంజయుడు, రంగధాముడు సమవయస్కులు కాకపోయినను, సమకాలికులు అగుదురు. అంతేకాదు. "పద్మరాజభూకాంతమణి" జాపరాజు జ్యేష్ఠపుత్త్రుడు పద్మనాభుడే (198ప. 1అ.) కావచ్చును. అంతేకాదు. మూర్తిత్రయోపాఖ్యానమునందు ధరణిదేవుల రామయమంత్రి దశావతారచరిత్రము (1650) ప్రభావము మాత్రమేగాక, రాయరఘునాథ తొండమాన్ పార్వతీపరిణయము (1769-89) ప్రభావము కలదు. త్యాగరాజు కీర్తన ప్రభావమును కలదు.

"అతనిచే నున్నట్టి యాషాఢదండంబు
కలికు లాడుచుఁ బట్టి విఱిచె నొకతె
జలపూర్ణమైన యాగమనీయపాత్రంబు
వడిఁ బుచ్చి నేలతో నైచె నొకతె
మత్సరంబున నక్షమాలిక దెగఁదీసి
విరియు పూసలు వెదవిత్తె నొకతె
యంసోపరిన్యస్తమైన కృష్ణాజిన
వసన మంతయుఁ జీరినైచె నొకతె
గొడుగు చెడఁ ద్రొక్కి నొక్కతె కోప మేల
విడువుఁడని యూర్ధ్వపుండ్రంబుఁ దుడిచె నొకతె
జుట్టు పెనుద్రేలితో నులివెట్టె నొకతె
కాఁకఁ దాళక మెయివట్టి నూకె నొకతె." 76ప. 6అ.

"ఎంత వారలైన నింతులఁ జూచిన
మనసు నిలువఁ గలరె మౌను లార!" 70ప. 2అ.

ఇవి అంతస్సాక్ష్యములు. అవి బహిస్సాక్ష్యములు. కాఁబట్టి మూర్తిత్రయోపాఖ్యానము రచనాకాలము 1800 ప్రాంతము కావచ్చును.

మూర్తిత్రయోపాఖ్యానము పరబ్రహ్మము యొక్క మూర్తిత్రయమైన, బ్రహ్మవిష్ణు మహేశ్వరుల చరితము. బ్రహ్మచరితము ద్వితీయాశ్వాసమునందు కలదు. అందు బ్రహ్మజననము, సృష్టి వివరము, సరస్వతి జననము కలవు. బ్రహ్మ, కూతురు సరస్వతిని మోహించుటను, కుమారులు భృగుదక్షక్రతునారదాదులు ఖండింతురు. అయినను,

"ఇప్పుడు నేత్రము లెనిమిది
తప్పక యొనరించెఁ గాని దైవము నాకున్
ముప్పది రెండైనను సఖి
ముప్పదిరెం డవయములు ముదమునఁ జూతున్" 81ప. 2ఆ.

అని పరవశము నందిన బ్రహ్మ చిత్తము మరిలింప వశముగాక, "జనకాపత్యాది సంబంధముల్ తనుధర్మంబులు గాని యాత్మకును భేదం బింతయుం గల్గునే?" (100ప. 2ఆ.) అని, "తనువు విడిచి వేఱె తనువుఁ దాల్చి వాగ్వధూటిఁ గలిసి వర్తించి సుఖియించె' 'నట. (102ప. 2ఆ.)

విష్ణుచరితము తృతీయచతుర్థాశ్వాసములందు కలదు. ఇందు దశావతారచరితము, అందు కృష్ణావతారచరితము ప్రధానము. కృష్ణావతారము ప్రత్యేకము చతుర్థాశ్వాసము.

శివచరితము పంచమషష్ఠాశ్వాసములందు కలదు. పంచమాశ్వాసము దక్షాధ్వర ధ్వంసము. షష్ఠాశ్వాసము పార్వతీపరిణయము.

వస్తువు విస్తృతము. కథనము రథగమనము. కవిత్వము సామాన్యము.

**క్రొత్తలంక మృత్యుంజయుడు** : ఇతని కృతులు 1. మూర్తిత్రయోపాఖ్యానము. 2. ధరాత్మజాపరిణయము. 3. నిరోష్ఠ్యనలచరిత్ర. 4. బృహన్నారదీయము. మొదటి రెండు ముద్రితములు. కడమ రెండు అముద్రితములు. మూర్తిత్రయోపాఖ్యానము దంతులూరి బాపిరాజు పేర వలె, ధరాత్మజాపరిణయము అల్లూరి అప్పలరాజు పేర రచించినది. అప్పలరాజే రచించినట్లు,

"ఎల్ల జగంబులన్ కరుణ నేలెడు వేలుపు నిందిరామనో
వల్లభు నాశ్రయించి యనవద్యతదీయకృపావిభూతి భూ
వల్లభసత్సభావిబుధవర్యకవిత్వనిరూఢిఁ గన్న శ్రీ
యల్లురి వంశసంభవుఁడ నప్పనృపాలకనామధేయుఁడన్"

అని అవతారికయందు కలదు. కాని ఆశ్వాసాంతగద్యను మృత్యుంజయుడు రచించినట్లు కలదు. కాఁబట్టి కృతుల రచనాకాలములు మూర్తిత్రయోపాఖ్యానము 1800 ప్రాంతము, ధరాత్మజాపరిణయము 1805 ప్రాంతము, నిరోష్ఠ్యనలచరిత్ర 1810 ప్రాంతము, బృహన్నారదీయము 1815 ప్రాంతము కావచ్చును.

ధరాత్మజాపరిణయము ద్వ్యర్థికావ్యము

**భట్ల పెనుమర్తి కోదండరామయ్య** : ఇతని కృతి వల్లభాభ్యుదయము. క్షేత్రమాహాత్మ్యకావ్యము. శ్రీకాకుళశ్రీవల్లభునికి అంకితము. దైవాంకితము. ఆశ్వాసాంత గద్యను తిరుమలతాతగురుస్మరణము కలదు. ఏ తిరుమల తాతాచార్యులో అనిశ్చయము. ఇతని స్వప్నవృత్తాంతము (10-13వచ. 1ఆ.) అప్పకవి స్వప్న వృత్తాంతమును అనుకరించినట్లు కలదు. కావున వల్లభాభ్యుదయము రచనాకాలము 1656 తర్వాత కావలయును. అంతేకాదు. కాకతిగణపతిదేవచక్రవర్తి ప్రధాని గజసాహిణి ప్రకటించిన శాసనమునందు

"శ్రీకాకొలనివల్లభున్కి" అని కలదు. అనంతామాత్యుని భోజరాజీయమునందు "ఆంధ్రవల్లభుఁ"డని కలదు. (40ప. 1ఆ.) వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు "తెలుఁగు రాయఁడు" (204ప.) " తెలుఁగుభర్త " (205ప.) అని కలదు. శ్రీకృష్ణదేవరాయల ఆముక్త మాల్యదయందు "ఆంధ్రమధుమథనుఁడు" (11వచ. 1ఆ.) "ఆంధ్రజలజాక్షుఁడు' ' (12ప. 1ఆ.) "తెలుఁగు వల్లభుండు" (15ప. 1ఆ.) అని కలదు. కాసుల పురుషోత్తముని ఆంధ్రనాయకశతకమునందు "ఆంధ్రనాయకుఁడు" అని కలదు. (12ప.) మకుటము నందు "శ్రీకాకుళాంధ్రదేవుఁ"డని కలదు. శతకము పేరు ఆంధ్రనాయకశతకము. వల్లభాభ్యుదయమునందు "ఆంధ్రనాయకచరిత్రం"బని (18ప. 1ఆ.) "ఆంధ్రనాయకుఁ"డని (19ప. 2ఆ.) కలదు. కావున శతకము, క్షేత్రమాహాత్మ్యము సమకాలికములు కావలయును. కాసుల పురుషోత్తము రెండవ అంకినీడు కాలమునందు (1798-1818) చల్లపల్లి సంస్థానకవి[223]. కనుక ఆంధ్రనాయకశతకము రచనాకాలము 1798 ప్రాంతమగును. కాఁబట్టి వల్లభాభ్యుదయము రచనాకాలము 1800 ప్రాంతము కావచ్చును.

కోదండరామకవికి స్వప్నమునందు ఒక దివ్యపురుషుడు సాక్షాత్కరించి, ఒక తాళపత్రగ్రంథమును ఇచ్చి కృతి చమత్కృతిగా రచింపుమనిన, అగ్రాహ్యమని గ్రహింపలేదట! (10వచ. 1ఆ.) మఱి కొన్నాళ్లకు స్వప్నమునందే శ్రీరంగపట్టణరంగనాథుడు విప్రునిగా వచ్చి "పురాతన సంస్కృతశ్రీకోశంబు"ఇచ్చి, "ఇది వ్యత్యస్తంబై యున్నది. యథాక్రమంబుగా నొనరించి సవిస్తరంబు గావింపు"మని గ్రహించి రచించెనట! (10-12వచ. 1ఆ.) ఆశ్వాసాంతగద్యలందు "బ్రహ్మాండపురాణోత్తరఖండంబున వల్లభాభ్యుదయంబనెడి "శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యంబు"అని కలదు. కాని, బ్రహ్మాండపురాణోత్తర ఖండమునందు వల్లభాభ్యుదయము లేదు. "పురాతన సంస్కృతశ్రీకోశంబు"నందు బ్రహ్మాండపురో త్తరఖండమని కలదేమో?

కారుకొలను అనగా అడవిచెఱువు(?) లేక నల్లఁజెఱువు. అదిచక్రతీర్థము. కారుకొలను కాకుళము. శ్రీవిశిష్టమైన శ్రీకాకుళము. కృష్ణానదీతీరమునందలి శ్రీకాకుళక్షేత్రవృత్తాంతములను, మాహాత్మ్యములను, స్థానికవిశేషములను ప్రతిపాదించునది వల్లభాభ్యుదయము.

ప్రథమాశ్వాసమునందు విష్ణువు ఆనతిని బ్రహ్మ గంగాతీరమునుండి కృష్ణాతీరమునకు వచ్చి, తపస్సుచేసి, ప్రత్యక్షమైన విష్ణువు అనుమతిని ఒక మహాపట్టణము కట్టించి, కాకులమని పేరుపెట్టి, విష్ణువును ప్రతిష్ఠించినట్లు కలదు. ఇది పురాణమే.

ద్వితీయాశ్వాసమునందు సుమతి అనురాజు చతురంగసేనాసమేతుడై అచటి మునిపుంగవులు ఆలయగోపురాదులు కట్టించుమని, మాసోత్సవాదికైంకర్యములు ఏర్పాటు చేయుమని కోరిన, అవి చేయించి, ఆరాజు "తన విశాలనగరంబునకుఁ జనియె"నని కలదు. (50వచ. 2ఆ.) అతడు "దిగంతవినుతఖ్యాతుడు" (6ప. 2ఆ.) చరిత్రకు అందినంతవఱకు చతురంగసేనాసమేతుడై వచ్చి, కాకుళక్షేత్రమును ఉద్ధరించి, అనేకగ్రామములు అనేక భూములు నిత్యనైవేద్యములకు, అంగరంగవైభవములకు ధారాపూర్వకముగా సమర్పించి, తన విశాలనగరమునకు (విజయనగరమునకు) వెడలిన రాజు శ్రీకృష్ణదేవరాయలే. ఇందుకు 1518 నాటి శాసనప్రమాణము కలదు[224]. అతడే

సుమతి అగును.

ద్వితీయాశ్వాసమునందు ముక్కంటీశ్వరుడను రాజు అహిచ్ఛత్రపురములోని బ్రాహ్మణులను ఆంధ్రావనికి ఆహ్వానించినట్లు, వారు తరువాత వచ్చెదమన్నట్లు, ముక్కంటీశ్వరుడు తన ధరణివరణనగరమునకు వచ్చినట్లు, ఆ తర్వాత క్షామమువచ్చి, అహిచ్ఛత్రపురబ్రాహ్మణులు ధరణివరణనగరమునకు వచ్చినట్లు, ముక్కంటీశ్వరుడు వారికి గ్రామములు, భూములు ఇచ్చినట్లు , ఆబ్రాహ్మణులను వడిచిపెట్టి ఉండలేక, అహిచ్ఛత్రపురములోని శ్రీవల్లభదేవుడు కూడ ఆంధ్రావనికి వచ్చినట్లు కలదు. ముక్కంటీశ్వరుడు "ముక్కంటి కాడువెట్టి"అను త్రిలోచనపల్లవుడు. ధరణివరణ నగరమన ధరణికోట. ధాన్యకటకము. కాని త్రిలోచనపల్లవుని రాజధాని ధరణికోట కాదు. విజయపురి అగును. అతడు కరికాలచోళుని సమకాలికుడు. కరికాలచోళుని కాలము రెండవ శతాబ్ది[225]. పండ్రెండవ శతాబ్ది కోటకేతరాజు ముక్కంటి కాడువెట్టి గంగాతీరమునుండి వచ్చిన ఏడువందలమందికి ఇచ్చిన అగ్రహారములను స్థిరపఱించినట్లు ఒక శాసనమునందు కలదు[226]. కాని రెండవశతాబ్దిని కాకుళక్షేత్రము లేదు. పదకొండవ శతాబ్దిని కూడ సంశయమే.

తృతీయాశ్వాసమునందు అనంతపాలుని వృత్తాంతము కలదు. అందు అనంగభీముడు కళింగోత్కళవంగరాజ్యాధిపతి అని, అతని కుమారుడు నరసింహుడని; మంత్రి, దండపాలుడు అనంతపాలుడని కలదు. అనంగభీముడను వ్యవహారము అర్వాచీనగంగవంశరాజు రెండవ అనియంక భీమునికి (1190-98) కలదు[227]. కాని అతని కుమారుడు నరసింహుడు కాడు. మంత్రి, దండపాలుడు అనంతపాలుడు కాడు. మూడవ అనియంక భీముని (1211-38) కుమారుడు నరసింహదేవుడు. మూడవ అనియంక భీమునికి కంచికి సంబంధము కలదు[228]. కాని, ఇతని మంత్రి, దండపాలుడు అనంత పాలుడు కాడు. కాకుళదేవాలయప్రమేయము కల మూడవ నరసింహదేవుని కాలము[229] 1326-1353. ఇతని పట్టమహిషి గంగామహాదేవి కాళిదాస, గోవిందసేనాపతుల ద్వారా శ్రీకాకొలని వల్లభరాయనికి పట్టుగొడుగులు, పచ్చపట్లు, వెండిదివ్యకోలలు, పహిండి కాయలతోడి వింజామరలు, గంటలు మొదలైన వస్తువులు పంపించినట్లు 1353వ సంవత్సరమునాటి శాసనమునందు కలదు[230]. అనంతపాలుని ప్రమేయము లేదు.

చతుర్థాశ్వాసమునందు అనంతపాలుడు కంచిలో విజయశాసనము వేయించుటకు వెడలుచు, కాకుళక్షేత్రమునకు వచ్చి, కాకరపాదు క్రింద శ్రీవల్లభదేవుని విగ్రహమున్నదని తెలిసికొని, తెప్పించి, ప్రతిష్ఠించినట్లు కలదు. కాకరపాదు క్రింద శ్రీవల్లభదేవుని విగ్రహము సంగంతి, వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు కలదు.

"కారవేల్లమతల్లికాకల్పవల్లి
కడుపు నిండారగించిన కొడుకుఁగుఱ్ఱ
జారచోరమహాధూర్త చక్రవర్తి
దేవవేశ్యాభుజంగుండు తెలుఁగుభర్త." 205ప.

కారవేల్లమతల్లికాకల్పవల్లి కాకరపాదు. కడుపునిండారగించిన కొడుకుఁ గుఱ్ఱ ఉక్తివైచిత్రి. కాకరపాదు క్రింద విగ్రహము కలదని తాత్పర్యము.

అనంగభీముని మంత్రి, దండపాలుడు అయిన అనంతపాలుడు లేదు గాని,

పశ్చిమచాళుక్యరాజు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని ప్రధాని, దండనాయకుడు అయిన అనంతపాలుడు కలడు. అనంతహాళయరుసు. ఇతడు 1115 ప్రాంతమునందు వేంగీరాజ్యముపై దండయాత్ర సాగించెను. అప్పటికే పశ్చిమచాళుక్యరాజాధికారము కృష్ణానది వఱకు కలదు[231]. అనంతపాలుడు కృష్ణానదిని దాటి, బెజవాడలో యుద్ధముచేసి, మొదటసంధి చేసికొని, పిదప వేంగీరాజ్యమును జయించెను. వేంగిపదునాలుగువేల దేశమును అనంతపాలుడు పరిపాలించుచున్నట్లు, అతని 1118వ సంవత్సరమునాటి కొమ్మూరు శాసనమునందు కలదు[232]. కాఁబట్టి పశ్చిమచాళుక్యరాజు త్రిభువనమల్లవిక్ర మాదిత్యుని ప్రధాని, దండనాయకుడు అయిన అనంతపాలుడు కాకరపాదు క్రింద శ్రీవల్లభదేవుని విగ్రహమున్నదని తెలిసికొని, తెప్పించి 1115, 1118 నడుమ ప్రతిష్ఠించుట చారిత్రికసత్యమగును. కాకుళదేవాలయశాసనములందు ప్రప్రథమశాసనము 1166వ సంవత్సరమునందు కలదు[233]. ఇది చరిత్రాంశము.

ఇట్లు శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించిన చరిత్రాంశము, సుమతి పేర ముందు, అనంతపాలునికి సంబంధించిన చరిత్రాంశము తర్వాత ఉండుట వ్యత్యస్తమే. పశ్చిమ చాళుక్యరాజు ప్రధాని, దండనాయకుడు అయిన అనంతపాలుడు అనంగభీముని మంత్రి, దండనాయకుడు అగుట కూడ వ్యత్యస్తమే.

సోమశర్మ కథ (83-121ప. 2ఆ.) క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునది. ఇంకను మాహాత్మ్యముల నిదర్శనములు కలవు. (56-77ప. 4ఆ.) ఉత్సవవిశేషములును కలవు. (79-124ప. 4ఆ.) ఇందు నగరపురంధ్రుల వర్ణనము (105-113ప. 4ఆ.) శృంగారపరము. లక్ష్మీవల్లభుల సంవాదము (125-184ప. 4ఆ.) సరసమైన ఘట్టము.

"-శ్రీదేవి యిట్లనియె. 132

కైరవబాంధవున్ విడని కౌముది చాడ్పున మేఘయుక్తశ్యం
గారతటిద్విభాతిఁ గుతుకం బలరన్ భవదీయచారువి
స్ఫారభుజాంతరాశ్రయముఁబాయని నన్నిటునిల్పి రాత్రి సం
చారమొనర్పు టేమి కడుజాగుగనిట్లు జనార్దనాహ్వయా. 133

హరియిట్లనియె. 134

సుకరముగా ప్రవేశమగు సూరిజనస్తవనీయుని నన్ను నే
టికి బహుతర్జనంబులఁ గడింది వివర్ణతచూచి దేవతా
ప్రకరయుతంబుగా బయట వాకిట నిల్పి మదీయసేవకా
నికరములెల్ల నించుక గణించక తాపనసేయుదిందిరా! 135

శ్రీదేవి యిట్లనియె. 136

కాముకవృత్తి నింత కనికారము లేక భవత్ప్రసేవక
స్తోమయుతంబుగా రజని దొంగలు ద్రిమ్మరునట్టి ప్రొద్దునం
బామరురీతిగాఁ దిరిగి పాయని కూరిమితోడ వచ్చితా
నేమముగల్గు నీదు కరణీయము తేటపడన్ జనార్దనా. 137

హరి యిట్లనియె. 138

పాతకులన్ వధించి నిరపాయముగా నిట సజ్జనౌఘముం
బ్రీతిఁ దలిర్పఁ బ్రోచి యభివృద్ధిగా ధర్మము నిల్పఁ గోరి వి

ఖ్యాతిగఁ బుట్టెదన్ బ్రతియుగంబున నెప్పుడు దుష్టరాక్షస
వ్రాతముతోడ యుద్ధమొనరన్ బహుకాలవిలంబమయ్యెడిన్. 139

ఇట్లు సాగిన లక్ష్మీవల్లభులసంవాదము వల్లభాభ్యుదయమునకు ముగింపు.

**మంగళగిరి ఆనందయ** : ఇతని కృతులు 1. వేదాంతరసాయనము. 2. విజయనందనవిలాసము. ఇందు మొదటిది బందరు నివాసి నిడుమామిళ్ల దాసయామాత్యునికి అంకితము. రెండవది ధర్మవరము (తూ.గో.జి.) పాలకుడు దాట్ల వేంకటకృష్ణభూపాలునికి అంకితము. దాసయామాత్యుని అన్న రాజయామాత్యుడు లాలి ప్రభువు అధికారమున కొండవీడు ఏలినట్లు, మహమ్మదలీఖాను సత్కారము నంది, పుదుచ్చేరి నివాసి అయినట్లు కలదు. లాలిప్రభువు ఫ్రెంచి గవర్నరు కౌంటు వి లాలీ (1700) కాడు. 1757 ప్రాంతము నాటి లాలీ అను ఫ్రెంచి గవర్నర్ జనరల్ అగును[234]. మహమ్మదలీఖాను కర్ణాటకనవాబు. రాజ్యకాలము[235] 1749-1795. దాట్ల వేంకటకృష్ణభూపాలుడు 1919వ సంవత్సరము నాటికి 70, 80 సంవత్సరముల క్రిందట జీవించియున్నట్లు కలదు[236]. 1919-70=1849; 1919-80=1839. అంతేకాదు. ఇతని తమ్ముడు వేంకటరాజు, పినతాత వేంకటరాజు, అతని మనుమడు వేంకటరాజు ముగ్గురును కుముందానులు. (పుటలు 11, 12, 14, 20 వి.నం.వి.) కుముందాను అను పదము ఫ్రెంచివికృతి. అది దిట్టకవి నారాయణ రంగరాయకదనరంగచరిత్రమునందు ప్రయుక్తము. ఇది పూర్వోక్తము. కుముందాను అన సైనికాధికారి. విజయనగరసంస్థానాధిపతి పెద విజయరామరాజు ఫ్రెంచివారి సహాయమున 1757 వ సంవత్సరమునందు బొబ్బిలి కోటను ముట్టడించిన తర్వాత, విజయనగరసంస్థానము సైనికాధికారులకు కుముందానులు అను వ్యవహారము ఏర్పడినది[237]. కనుక దాట్ల వేంకటకృష్ణభూపాలుని పినతాత వేంకటరాజు 1760 ప్రాంతమున, అతని మనుమడు వేంకటరాజు, వేంకటకృష్ణభూపాలుని తమ్ముడు వేంకటరాజు 1800 ప్రాంతమున విజయనగరము సంస్థానమునందు కుముందానులు అగుదురు. వేంకటకృష్ణభూపాలుడు విజయనగరసంస్థానమునకు విధేయుడే. కాఁబట్టి వేదాంతరసాయనము రచనాకాలము 1800 ప్రాంతము, విజయనందనవిలాసము రచనాకాలము 1805 ప్రాంతము కావచ్చును.

ఆనందయ వేదాంతరసాయనమునందు "సర్వేశ్వరకరుణాకటాక్షవీక్షాలబ్ధసరస సాహితీధౌరే"యుడు. విజయనందనవిలాసమునందు "శ్రీశైలభ్రమరీమల్లికార్జునకరుణా కటాక్ష వీక్షాలబ్ధసరససాహితీధౌరే"యుడు. (ఆశ్వాసాంతగాద్యలు).

**వేదాంతరసాయనము** : ఇది క్రైస్తవగ్రంథము. వేదాంతగ్రంథము కాదు. వేదాంతవిషయము లేక పోలేదు. ప్రాధాన్యవివక్షను ఏసుక్రీస్తు చరిత్రము. కావ్యస్వరూపము తెలుగుకావ్యస్వరూపమే. ఇష్టదేవతాస్తుతి మొదలు షష్ఠ్యంతముల వఱకు అవతారిక కలదు. ఆశ్వాసాద్యంతపద్యగద్యములు కలవు. కథకు ప్రథమవక్త చినబల్లాపురములోని జ్ఞానబోధముని. ప్రథమశ్రోత ఆదేపురములోని మల్లరుసు. ద్వితీయవక్త పర్వతయ్య అను సద్విజుడు. ద్వితీయశ్రోత జ్ఞానభూసురుడు. మల్లరుసు, జ్ఞానబోధమునుల దైవవిషయికసంవాదము (41-154ప.) ప్రథమాశ్వాసములోని ప్రధానవిషయము. క్రైస్తవవేదాంతము. ఆదమ్, ఈవ్ అను ఆదిదంపతుల వృత్తాంతము, జ్ఞానేసనుముని జననవృత్తాంతము,

జేసునాథుని అవతారము, జెరుసలేములోని దేవోత్సవమునకేగుట ద్వితీయాశ్వాసము. జేసునాథుని మహిమలు, జాదులు జేసునాథుని పరిహసించుట, జేసునాథుడు స్లీన్రమాకు మోసికొని పోవుట తృతీయాశ్వాసము. దుర్గురుసమూహము స్లీన్రమాకునకు జేసునాథుని చేర్చి, హస్తాంఘ్రుల మేకులు కొట్టి, కపాలపర్వతము మీద నాటుట, జేసునాథుడు మరణించుట, సమాధిచేయుట, జేసునాథుడు అపోస్తులులకు సాక్షాత్కరించుట, తోమాసుని సందేహములు తీర్చుట, మోక్షారోహణము చేయుట మొదలైనవి చతుర్థాశ్వాసము.

జరికోమార్గమందలి అంధుని మొఱ హృదయవిదారకము.

"చిగురుల కైవడిన్ మృదుతఁ జెల్వగు నీ పదముల్ సకంటకం
బగు వనమార్గయానమున నాశ్రితవత్సల నొచ్చె నేమొ యీఁ
దగునిసుమంత నొత్తెద కృతార్థుఁ డనొటకటంచుఁ జీకు గే
లొగిచి నమస్కరించి తన మోమున విన్నదనంబు గ్రాలఁగన్. 97

ఏనెంత పాపకర్ముఁడ
నో నీకల్యాణమయతనూసౌభాగ్య
శ్రీ వీక్షించి కుతూహల
మానఁగలేనైతి సజ్జనావననిపుణా. 98

పాపములాచరింప నొడఁ బాటొకయించుక లేక నీవ ది
క్కై, పరలోకమిత్తువని యాత్మలనమ్మక నీ పదాబ్జసే
వాపరతన్ శుభావహభవత్తనురూప విభూతిఁ జూడఁగా
నోపిన వారలెంత సుకృతోన్నతులో ధరణీతలంబునన్. 99.

కుజనుఁడ ననన్యగతికుఁడ
సృజనాందతమోనిమగ్నహృదయుండ సుధీ
భజనీయచరిత నను బ్రో
వఁజను భవత్కృప గరంబు వన్నియకెక్కన్. 100

మావంటి యనదవాంధ్రకు
నీ వసుమతి నిదు ప్రాప హీనమనః పీ
డావల్లి నికురుంబబి
దావృతికి దాత్రమగుఁ గదా కృతకృత్యా!" 101ప. 3ఆ.

శిలువ నాటిన జేసునాథుడు ఆర్తిచే సంచలించినను, తత్కారకులైన జాదులను సహించి, సర్వేశ్వరుని ప్రార్థించుట మహోదాత్తము.

"పగతునిచేత స్లీనఁబడి భారపునొప్పి వహించి యాదృశం
బగు దురవస్థ జాదుకులు లజ్జతఁ బొరయించి నారలో
ర్వగఁదగునయ్య తత్తదపరాధములెన్న కొంకింత భక్తిగే
ల్మోగిచి భజింతు నీ చరితముల్మ మజ్జనకా! పరాత్పరా! 7.

అని లోకోద్భవసంస్థితి ప్రళయకార్యావార్యశక్తిక్షమా
ఘనశౌర్యోన్నతు భక్తమండలమనఃకంజాతసంజాతమా
తనమార్వీకరుణీనిమగ్నుఁ గరుణాధారేయు సర్వేశ్వరున్
దన తండ్రిన్ మరియాసుతుండు నియతిం బ్రార్థించె నీచోపునన్. 8ప. 4ఆ.

కావ్యస్వరూపము వలె కవితాస్వభావమును తెలుగు కావ్యస్వభావమేగాని, వర్ణనావ్యామోహము లేకపోవుట విశేషము. ఒక్క పుర (12-20ప. 1ఆ.) వసంతర్తు (12-15ప. 2ఆ.) వర్ణనములు మాత్రమే కలవు. పురవర్ణనము కథాప్రారంభమునకు పునాది. వసంతర్తు వర్ణనము ఆదిదంపతుల శృంగారవిహారమునకు ఉద్దీపనవిభావము.

**విజయనందనవిలాసము** : ఇది మొదటి శశిరేఖాపరిణయకావ్యము. రచనాసందర్భమున (పుట 22), ఆశ్వాసాంతగద్యలందును విజయనందనవిలాసమని కలదు. విజయుడన అర్జునుడు. అతని నందనుడు అభిమన్యుడు. ఇతని విలాసము శశిరేఖాపరిణయమే. ఇది వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన భారతమునందు లేదు. పైలుడు జనమేజయునికి చెప్పిన భారతములోనిదట! (పుట 23)

ఇందు అభిమన్యుని శైశవమునందే, శశిరేఖ నిచ్చి వివాహము చేయుటకు బలరామకృష్ణులు సుభద్రకు మాట ఇత్తురు. యౌవనమునందు ధర్మరాజు రాజసూయము, రాజ్యనష్టము జరుగును. రాజసూయమునందు శిశిపాలవధ లేదు. రాజ్యనష్టమునందు ద్రౌపదీవస్త్రాపహరణము లేదు. సుభద్ర అభిమన్యునితో అరణ్యావాసమున కేగినట్లు, శ్రీకృష్ణుడు ఇద్దఱిని ద్వారకకు తీసికొని వచ్చినట్లును కలదు. అభిమన్యుని వనవిహారము, శశిరేఖ వనవిహారము, వారివిహారముతోపాటు, శశిరేఖ సఖీజనుల మధుపానమును కలదు.

"నిలిచి యచ్చోట వెండిగిన్నియల మున్న
నించి యునిచిన సుమవారుణీరసంబుఁ
దరళమృగశాబకాక్షులు ద్రావి త్రావి
యంతకంతకుఁ దన్మదం బావహిల్ల." పుట 51.

చిలుక రాయబారము, శశిరేఖ విరహము, శీతలోపచారములు, మన్మథపూజ, మన్మథాద్యుపాలంభములు, సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంతప్రకృతి, వసంతర్తు, ద్వారకాపురప్రభృతివర్ణనలు బహుళము. నాయికావర్ణనము ద్విరుక్తము.

ఘటోత్కచుడు శశిరేఖాకృతిని లక్ష్మణునికి బావురుపిల్లి రూపము చూపించిన సమయమునందే, శశిరేఖాభిమన్యులు, "మదనసామ్రాజ్యసంభోగమహిమఁ దన"రినట్లు కలదు. (పుట 108). అనంతరము శశిరేఖాభిమన్యుల వివాహము! ఇది కథాప్రధానము కాదు; వర్ణనాప్రధానము.

**నంబూరి కేశవాచార్యులు** : ఇతని కృతి ఆచార్యసూక్తిముక్తావళి. రామానుజాచార్యులకు స్మృత్యంకితము. ఇందలి రామానుజాచార్యుల వృత్తాంతమునందు ఔరంగజేబు శ్రీరంగవిగ్రహాపరణవిషయము కలదు.

"ఔరంగజేబు ముం దఖిలదైవతవిగ్ర
హములఁ దెప్పించి యీ యాలయమునఁ
జెఱవెట్టినాఁడ యీ చెఱ విడిపింపంగ
నెవ్వఁడు దలఁపలే దింతపట్టు" 88ప. 9ఉ.మ.భా.

ఇది ఔరంగజేబు తర్వాతి ఒకానొక ఢిల్లీసుల్తాను కాలములోని తలపోఁత. ఔరంగజేబు రాజ్యాంతకాలము 1707 వ సంవత్సరమని పూర్వోక్తము. కనుక పయి తలపోత తదనంతరకాలికమగుట తథ్యము. ఆకాలము స్థూలముగ 1750 ప్రాంతము కావచ్చును. అది గ్రంథస్థమగు కాలము తదనంతరకాలికమగును. కాఁబట్టి ఆచార్యసూక్తి ముక్తావళి

రచనాకాలము 1800 ప్రాంతము కావచ్చును.

ఇది ప్రాధాన్యవివక్షను వైష్ణవమతగ్రంథము. ఇందు సాహిత్యసంబంధి విషయములు రెండు కలవు. 1. కృష్ణమాచార్యవృత్తాంతము. 2. సుల్తానుపుత్రిక వృత్తాంతము.

కృష్ణమాచార్యుల వృత్తాంతమునందు, అతని కాలమున రామానుజాచార్యులు సింహాచలము వచ్చినట్లు కలదు. అదే కాలమునందు "మలికినేబనువాఁడు" (మల్కిభరాం) సింహాచలదేవాలయవిమానమును దగ్ధము చేసినట్లు కలదు. అప్పుడే లాంగూల గజపతి మందిరనిర్మాణము కావించినట్లు కలదు. (45-70ప; 59ష. 68ప. 5ఉ.మ.భా.) రామానుజాచార్యుల కాలము స్థూలముగ పది, పదొకండవ శతాబ్దులు కృష్ణమాచార్యుల కాలము పదునాల్గవశతాబ్ది. మల్కిభరాం కాలము పదునాఱవ శతాబ్ది. లాంగూలగజపతి చారిత్రికవ్యక్తి కాడు. అతడు కపిలేంద్రగజపతి అయిన, కాలము పదునైదవ శతాబ్ది. ఇవియెల్ల పరస్పరచరిత్రవిరుద్ధాంశములు. కృష్ణమాచార్యుల వృత్తాంతము కాలక్రమసంక్రాంత మైన జనశ్రుతి అగును.

సుల్తాను పుత్రిక వృత్తాంతము ప్రత్యేకముగ కావ్యమైనది. అది ముందు వివరింతును. యక్షగానములును వెలసినవి.

ఆచార్యసూక్తిముక్తావళియందు కావ్యత్వసిద్ధి క్వాచిత్కము.

# ఇతరకవులు

## పందొమ్మిదవశతాబ్ది

వద్దిపర్తి కోనమరాజు : ఇతని కృతులు 1. జానకీరామశతకము. 2. రేవతీ పరిణయము. 3. వేంకటేశ్వరచరిత్రము. 4. శ్రీమహాలక్ష్మీపరిణయము. ఇందు రెండవది గోడే సంస్థానాధిపతి సూర్యప్రకాశరాయనికి (1788-1841) ఇచ్చిన నష్టమైనదట[238]. మొదటిది మూడవది నేడు నామమాత్రావశిష్టములు. శ్రీమహాలక్ష్మీపరిణయము సింహాచల నృసింహస్వామికి అంకితము. దైవాంకితము. ఇది రచించునాటికి ఇతడు "పుత్రత్రయం బును బుత్రికాషట్కంబు గాంచెను." (పుట 8) ఇతని జీవితకాలము 1754-1834 అని ప్రపౌత్రుడు అందిచ్చిన సమాచారము కలదు[239]. కాఁబట్టి శ్రీమహాలక్ష్మీపరిణయము రచనాకాలము 1804 ప్రాంతము కావచ్చును.

శ్రీమహాలక్ష్మీపరిణయము లక్ష్మీనారాయణుల పరిణయము. అసలు లక్ష్మి ఇంద్రుని సంపదయే. దూర్వాసుని శాపమువలన ఇంద్రుని సంపదతోపాటు సర్వస్వమును సముద్ర మునందు పడిపోయినది. ఇట్లు దేవీభాగావతమునందు కలదు. ఇది శ్రీనాథుని హర విలాసమునందును కలదు. (14-31ప. 6ఆ.) సముద్రమథనము వలన అవతరించిన లక్ష్మిని నారాయణుడు అప్పుడే, అక్కడే పరిణయమాడినట్లు అందు కలదు. "అచ్యు తుఁడు లచ్చి నట పెండ్లియాడి యరిగె నాగరిపు నెక్కి వైకుంఠనగరమునకు" (131ప. 6ఆ.) ఇందు లక్ష్మిని నారాయణుడు తర్వాత, మణిప్రస్థపురమునందు పరిణయమాడి నట్లు కలదు. అదొక ఆశ్వాసము. ఇదొక అయిదాశ్వాసముల ప్రబంధము.

ఇందు వైకుంఠపురవర్ణనము, నారాయణుని కొలువుకూటము వర్ణనము, గ్రీష్మ, వర్షర్తువర్ణనములు, కూర్మావతారకథ, శరదృతువర్ణనము, జ్యేష్ఠాదేవిజననము, మణిప్రస్థ పురవర్ణనము, మణిప్రస్థపురమునందు వనధీశ్వరుడు లక్ష్మిని అల్లారుముద్దుగా పెంచుట, హేమంతవసంతర్తువర్ణనములు, మహాలక్ష్మివనవిహారము, నారదుడు వచ్చి నారాయణుని విరహమును తెలుపుట, లక్ష్మి విచారించుట, పుష్పాపచయము, జలక్రీడలు, మన్మథవిజృం భణము, చెలికత్తెల ప్రార్థన, సూర్యాస్తమయాదిచంద్రికావిహారపర్యంతవర్ణనము, మలయానిలమధుమధుపపికశుకప్రముఖోపాలంభము, సూర్యోదయ, వర్ణనము, లక్ష్మివలపువక్కణ వ్రాసి యిచ్చి, చెలికత్తెలను వైకుంఠమునకు పంపుట, నారాయణుడు ప్రేమలేఖ చదువుట, వివాహనిశ్చయము, బ్రహ్మాదిదేవతల ఆగమనము, నారాయణుడు మణిప్రస్థపురమునకు తరలి వెళ్లుట, శ్రీమహాలక్ష్మిని పరిణయమాడుట పరిణయప్రబంధ ధోరణులు.

మహాలక్ష్మివర్ణనమునందు రెండు పద్యములు మనోజ్ఞములు.

"కమనీయచక్రసంకాశవక్షోరుహ
యనుపమానంతశోభావిలాస
పాంచజన్యసమానపరిపూర్ణకంధర

నవ్యపద్మాయతాననవికాస
శార్ఙ్గచాపమానచంచద్భ్రూలతాయుగ్మ
విశ్వంభరాచక్రవిపులజఘన
నందకాభవైభవోన్నతరోమవల్లరి
నీలాలినీలసన్నీలవేణి
యలఘుకూర్మాంఘ్రిపుండరీకైకనేత్ర
యగుచుఁ దన సుందరాకార మబ్బురముగఁ
బరమవైకుంఠధామరూపంబుఁ బోలఁ
బూజఁ గావించుచుండె నంభోధికన్య." 88పు.
"చారుపదంబు లంబురుహసంభవకాంతి చెలంగ వేణికా
భారము నీలకంఠరుచి వంద్యము గాఁగ ముఖప్రకాశ మా
శారదచంద్రబింబసదృశంబుగ రూపము సర్వమంగళా
కారము గాఁగ నా జలధికన్యక పొల్చెఁ బ్రసిద్ధమూర్తియై." 89పు.

ఇంత ఉదాత్తముగ శ్రీమహాలక్ష్మిని వర్ణించి, ఆమె వ్రాసిన ప్రేమలేఖయందు "పద్య పదపాదసంకేతగర్భ పద్ధతుల"ను చొప్పించుట (106పు.), మహాలక్ష్మిచేత నారాయణుని పేరు అదే పద్ధతిని చెప్పించుట (138పు) చిత్రకవిత్వప్రభావము.

దూర్వాసశ్శాపదుష్పలితమును బ్రహ్మాదిదేవతలు నారాయణునికి మొఱపెట్టు కొందురు. అందు స్వర్లోకవిషయముగ భూలోకవిషయము కలదు. ఆపద్యమిది :

"ఆగడంబున శంకరాలయంబులయందు
గండు మీఱి గుఱాలఁ గట్టువారు
మత్తిల్లి సురయోగిమఠవాటికలు సొచ్చి
కుంజరఘటల డీకొలుపువారు
వాటంపు మేలిదివాణము ల్పసలు గా
వించి నంజాళ్లు వడ్డించువారు
నల్లడఁ జెలరేఁగి నగరిక చేరీలఁ
బొలదిండి హుకుములు నిలుపువారు
బలిమి వెలి మావితోఁపులు పాడు చేసి
కాచి మిన్నేటి రేవులు గాసి చేయు
వారలై వేల్పుమన్నీల బాఱఁదోలి
తిరిగి బలిసేన బలవైరి పురములోన " 34పు.

ఇందలి శివాలయములు, యోగిమఠవాటికలు, దివాణములు, నగరికచేరీలు, మావి తోపులు, ఏటిరేవులు భూలోకములోనివి. దూర్వాసుని శాపము వలన అమరావతి యందు బలిసేన తిరుగలేదుగాని, పదునెన్మిదవశతాబ్దిని, ఆంధ్రావనియందు పాశ్చాత్యసేనలు తిరిగినవి. అవి శివాలయములందు గుఱ్ఱములను కట్టుట, యోగిమఠ వాటికలలోనికి ఏనుగులను డీకొల్పుట, దివాణములందు నంజాళ్లు మెసవుట, నగరికచేరీలందు హుకు ములు జారీసేయుట, మామిడితోటలను పాడుచేయుట, నీలాటిరేవులనుగాసిచేయుట సంభవమే.

శ్రీమహాలక్ష్మీపరిణయము అవతారికయందు "మహాలక్ష్మీపరిణయంబను

శృంగారప్రబంధంబునకు" అని కలదు. (14పు.) ఆశ్వాసాంతగద్యలందును "మహాలక్ష్మీ పరిణయంబనుశృంగారప్రబంధంబునందు అని కలదు. (26, 60, 87, 120, 151 పుటలు). అంతేకాదు. లక్ష్మీనారాయణుల పరిణయవృత్తాంతము శృంగారరసవిషయమే. కాని, ఇందు విప్రలంభశృంగారము వినా సంభోగశృంగారము లేదు. విప్రలంభశృంగారమును శ్రుతి మించిన శృంగారము కాదు. అనుచిత, అశ్లీల, అసభ్యశృంగారమును లేదు. ఇది విశేషమే.

**పెద్దాడ నాగరాజు** : ఇతని కృతి శకుంతలాపరిణయము. కాశీవిశ్వేశ్వరునికి అంకితము. దైవాంకితము. ఇతని కాలము 1760-1825 అని, ఇతడు 1802లో రాజమహేంద్రవరములోని అదాలత్ కోర్టులో న్యాయవాది అని, తరువాత కొంతకాలమునకు మచిలీపట్టణములోని ప్రావెన్షల్ కోర్టులో న్యాయవాది అని వంశీయుని గ్రథనము కలదు[240]. గ్రంథమునందు "సూరిమండలహితముఖ్యకార్యరచనాకుశలాత్ముఁడ" అని కవి స్వవిషయము కలదు. (53ప. 1ఆ.) కాఁబట్టి శకుంతలాపరిణయము రచనాకాలము 1805 ప్రాంతము కావచ్చును.

శకుంతలాపరిణయము చర్వితచర్వణము. ఇది భారతకథానుసారి. అభిజ్ఞాన శాకుంతలములోని అన్యధాకల్పనములు లేవు. అలతి ప్రభావము కలదు. ప్రియంవదానసూయల ముఖత: శకుంతల జన్మవృత్తాంతము గ్రహించిన దుష్యంతుడు,

> "మానుషీషు కథం వా స్యా దస్య రూపస్య సంభవ:
> న ప్రభాతరలజ్యోతి రుదేతి వసుధాతలాత్ " 24శ్లో. 1అం.

అను శ్లోకమును జ్ఞప్తికి తెచ్చు పద్యము, దుష్యంతుని శకుంతలావర్ణనమునందు ముందే కలదు. ఆ పద్యము :

> "మొగులు తెగఁబాసి పుడమికి
> డిగిభాసిలుచున్న యా తటిల్లాళి యనన్
> జిగి మెఱయు నీ తనూలతఁ
> బొగడ నలవి యగునె యెట్టి ప్రోడల కైనన్. " 170ప. 1ఆ.

"శుశ్రూషస్వ గురూన్" అను శ్లోకచతుష్టయములోని శ్లోకమునకును అనుసరణము కలదు. (190ప. 3ఆ.) ఇందు శకుంతలాజన్మవృత్తాంతము శకుంతలయే చెప్పుట భారతకథానుసారమే గాని, భారతమునందు లేని అనౌచిత్యము మిక్కుటముగ కలదు. విశ్వామిత్రుడు "నిలింపగణికాసురతప్రియుఁడయ్యె నుర్వి నె వ్వారల కింద్రియంబు లనివార్యము లుద్ధతముల్ గణింపఁగన్" అని శకుంతల సమర్థించుట (95ప. 2ఆ.) మేనకను చూచి విశ్వామిత్రుడు వివశుడగుటను శకుంతల వివరించుట (139-141, 151-156, 165-171, 192-193ప. 2ఆ.) మేనకావిశ్వామిత్రుల సంభోగశృంగారమును శకుంతల అభివర్ణించుట (201-206ప. 2ఆ.) "నేన తక్క వెలయ రిట నొరుల్ " అని శకుంతల అనినను (186ప. 1ఆ.) అనుచితమే.

> "తతబంధాన్వితమై విముక్తనవముక్తాహారమై యస్ఫుటాం
> చితవాగంకురమై గళత్కటితటీచీనాంబరంబై సమ
> ర్పితబింబాధరమై వినీలకుచభూభృన్మండలాశ్లేషమై
> యతి కంభోజదళాక్షికిన్ సురత ముద్యత్సౌఖ్య మిచ్చెం గడున్. " 205ప. 2ఆ.

ఇట్లు శకుంతల చెప్పినదెల్ల, కణ్వమహర్షి మఱొక మహర్షికి చెప్పినది. అది శకుంతల ఏకసంథను గ్రహించి, ధారణపట్టి, దుష్యంతునికి అప్పగించినది. అటు కణ్వమహర్షికి, ఇటు శకుంతలకు అపకర్షాపాదకము. ఇంత మేర మీఱిన శకుంతలను దుష్యంతుడు,

"తఱిఁ గని తుంటవింటిదొర తామరతూపులఁ దాల్మి కత్తళం
బఱవఱఁజేసి నాదు వల పంగడిఁ బెట్టఁగ నిల్వనోడి నీ
మఱువునఁ జేరితిన్ భువనమాన్యసుధీజనతాభిగణ్య డ
గ్గఱి యభయం బొసంగి నను గ్రక్కున నక్కునఁ జేర్చి కావవే." 263ప. 2ఆ.

అని కోరుట అగతికమే అనిపించును. అంతేకాదు. శకుంతల ముందు తండ్రి ఆనతిని ప్రాణిగ్రహణమని, అంతలోనే ఒక్క వర మొసగిన ఒప్పుకొందుననుట (271, 280ప. 2ఆ.) దుష్యంతుడు వరమిచ్చిన,

"అన విని యింతి యిట్లను నరాధిపవంశలలామ నీ యొసం
గిన వర మశ్మలేఖ యని కేవల మాత్మఁ దలంతుఁగాని యై
నను బరికింప రాజ్యభరణంబునఁ గల్గిన వైభవంబు లా
వున హృదయంబునన్ మఱుతువో యను శంక యొకింత దోఁచెడున్."284ప. 2ఆ.

అనుట శకుంతల 'అతితెలివి'కి నిదర్శనము. అంతేకాదు. దుష్యంతుడు నిష్క్ర మించునెడ "నాకొసంగిన వరమీవు మఱువకుండవలయు. ఇది మది నిల్పుము". అని కూడ శకుంతలముందు జాగరూకత. దుష్యంతుడు నిష్క్రమించిన తర్వాత శకుంతల తండ్రి ఆకాంక్ష గుఱించి తల్లడిల్లి (13-18ప. 3ఆ.)

"ఘనుఁ డా నల్వ తదీయకృత్య మవిలంఘ్యం బేరికిన్ దీని కా
త్మ నెగు ల్పూనఁగ నేల మజ్జనకుఁ డుద్యద్భూరికారుణ్యశా
లి నృపాలుం డధికుండు గావున జను ల్గీర్తింప నన్నాదరిం
చు నిజం బింతయు కాని యేమిటికిఁ దాల్పుం గింక నాతం డెదన్." 19ప. 3ఆ.

అని ధైర్యము వహించి, మఱల పెనగొన్న భయమున (20ప. 3ఆ.) దాగి యుండును.

కణ్వమహర్షి భర్తృసన్నిధికి బయలుదేరుమనిన, శకుంతల కణ్వసన్నిధినే ఉందున నుట (144-157ప. 3ఆ.) చిత్రము.

"కరుణమెయి న్మదీయమగు కష్టపుఁబాటు దొలంగఁద్రోచి భూ
చరఖచరాదులెన్న నను సర్వపదార్థసమృద్ధిఁ బెంపఁగాఁ
బెరిఁగినదానఁ గాన మదభీప్సితమైన దృఢవ్రతంబు నీ
చరణసపర్య నాకపురిశాశ్వతభోగము దానఁ గల్గదే." 153ప. 3ఆ.

ఇది శకుంతల పితృభక్తికి నిదర్శనమేగాని, ఇంకను శకుంతల వాదమిది :

"పవలు మాపును హోమగవిఁ గేల నిమిరి మె
త్తని పూరి మేపి దుగ్ధములు పిదుకఁ
గమ్మకస్తురి నీటఁ గలిపి పర్ణకుటీర
మలికి ముత్తియపు ముగ్గులు రచింపఁ
గ్రీడాసరోవారి కెలనఁ బ్రోదియొనర్చి
యెలమావిమోక బోదెలకు దిద్దఁ
గీరమరాళిమయూరశారీశాబ

మలకు నిష్టాహారములు ఘటింప
నహరహము మీకు దేవపూజానుకూల
ఫలదళాగరుధూపదీపప్రసూన
ముఖపదార్థంబు లాయితములుగఁ జేయ
నెవ్వ రిచ్చోటఁ బతికడ నేనుఁ జనిన.'' 170 ప. 3ఆ

ఇట్లు శకుంతల పాత్ర ఇందు కలదు. శకుంతలాదుష్యంతుల పాత్రచిత్రణముల తోపాటు, మేనకా విశ్వామిత్రుల పాత్రచిత్రణములును అనుదాత్తము.

శకుంతలా పరిణయమునందు పుర (69-90ప. 1ఆ.) నాయక(92-94ప. 1ఆ) వేట (95-140ప. 1ఆ) తపోవన (144, 146-151ప. 1ఆ) నాయిక (155-163ప. 1ఆ, 68-92ప. 2ఆ) నగ(250ప.1ఆ) వసంతర్తు (3-23)ప.2ఆ) వనవిహార(24-35 ప.1ఆ) జలవిహార (36-47 ప. 2ఆ) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (172-190, 207-214ప.2ఆ) గ్రీష్మర్తు(232-238 ప.2ఆ) వర్షర్తు (43-54ప.3ఆ) శరదృతు(106-114ప.3ఆ) వర్ణనలు కలవు.

**ఉరుటూరి వేంకటకృష్ణయ్య** : ఇతని కృతులు 1. రాఘవపాండవయాదవీయము. త్ర్యర్థికావ్యము. అనుపలబ్ధము. 2. ఆకాశరావణసంహారము. యుద్ధకాండము. ఉపలబ్ధము. అముద్రితము. ఆకాశరావణసంహారము కోదండరామస్వామికి అంకితము దైవాంకితము. కృతి ప్రేరకుడు కృష్ణానేని తిరుపతి మాణిక్యరాయలు. అతడు రాచూరి పట్టణాధిపతి. అతని అన్న జంగన్న రేపల్లె జమీందారు.[241] కాలము1779-1811. కనుక తిరుపతి మాణిక్యరాయల కాలము స్థూలముగ 1785-1820 అగును. కాఁబట్టి రాఘవ పాండవయాదవీయము రచనాకాలము 1805 ప్రాంతము, ఆకాశరావణసంహారము రచనాకాలము 1810 ప్రాంతము కావచ్చును.

**పోచిరాజు వీరన్న** : ఇతని కృతులు 1. "పదునాలుగగు నేట" కృష్ణార్జునసంవాదము. 2. "పదునెన్మిదగు నేట" పంచకావ్యములు. 3."ఇరువది రెండగు నేట'' విభూతి మాహాత్మ్యము. 4. "ఇరువదియాఱగు నేట'' మార్కండేయచరిత్రము. 5. "ముప్పదగు నేట" మనువంశపురాణము. 6. "ముప్పదాఱగు నేట" శ్రీముక్తదేవుకథ 7. ఆనందలహరి. 8. సౌందర్యలహరి. 9. సుభాషితరత్నావళి 10. భల్లాణచరిత్రము. 11. భావనాఋషి మాహాత్మ్యము. ఇందు 1. విభూతిమాహాత్మ్యము. 2. మనువంశపురాణము 3. భల్లాణ చరిత్రము 4. భావనాఋషిమాహాత్మ్యము మాత్రమే ఉపలబ్ధములు. విభూతిమాహాత్మ్యము, భల్లాణచరిత్రము, భావనాఋషిమాహాత్మ్యము అముద్రితములు. ఇతడు "నూఱుసంవత్సరముల క్రిందటి వాఁడు'' అని ఒకఅభిప్రాయము[242] కలదు గాని, ఇతడు భారతములోని ఉద్యోగపర్వమును మామిడి వెంకయ్యకు శుక్లనామసంవత్సరమునందు ప్రతి లిఖించి ఇచ్చినట్లు, సత్కవి అని అందు కలదు.[243] కాఁబట్టి కృతుల రచనాకాలములు కృష్ణార్జునసంవాదము 1802 ప్రాంతము, పంచకావ్యములు 1806 ప్రాంతము, విభూతి మాహాత్మ్యము 1810 ప్రాంతము, మార్కండేయచరిత్రము 1814 ప్రాంతము, మనువంశ పురాణము 1818 ప్రాంతము, శ్రీముక్తదేవుకథ 1824 ప్రాంతము, ఆనందలహరి 1825 ప్రాంతము, సౌందర్యలహరి 1826 ప్రాంతము, సుభాషితరత్నావళి 1827 ప్రాంతము,

భల్లాణచరిత్రము 1829 ప్రాంతము, భావనాబుషి మాహాత్మ్యము 1830 ప్రాంతము కావచ్చును.

మనువంశపురాణము తేలీలపురాణము. భావనాబుషిమాహాత్మ్యము పద్మసాలీల పురాణము. భల్లాణచరిత్రము చర్వితచర్వణము.

**తుమురాడ పాపయ్య:** ఇతని కృతులు 1. రామకథాసుధార్ణవము. 2.కాళిందీ పరిణయము. 3. వైరాగ్యదర్పణము. మూడును అముద్రితములు. రామకథాసుథార్ణవము డొంకాడ గోపీనాథము విచిత్ర రామాయణమునకు పద్యకావ్యరూపాంతరము. కృతి ప్రేరకుడు డొంకాడ గోపీనాథము దౌహిత్రుడు కూతురుకొడుకు, ఫక్కి లక్ష్మీనరసింహము.[244] గోపీనాథము కాలము 1713-52 అని పూర్వోక్తము. కనుక ఇతని కాలము స్థూలముగ 1775-1815 అగును. కాళిందీకల్యాణము కృతిప్రేరకుడు సాలూరు సంస్థానాధిపతి కిమ్మూరి సన్న్యాసిరాజా. ఈతని కాలము [245] 1801-30. కాఁబట్టి విచిత్రరామాయణము రచనాకాలము 1810 ప్రాంతము, కాళిందీకల్యాణము రచనాకాలము 1815 ప్రాంతము, వైరాగ్యదర్పణము రచనాకాలము 1820 ప్రాంతము కావచ్చును.

**రేవణూరి వేంకటార్యుడు** : ఇతని కృతులు 1. శ్రీపాదరేణుప్రభావము. 2.శకుంతలా పరిణయము. రెండవది అముద్రితము. రెండును వేంకటేశ్వర స్వామికి అంకితములు. దైవాంకితములు. శ్రీపాదరేణుప్రభావములోని ఆశ్వాసాంత గద్యను, "సంకీర్తనాచార్య దౌహిత్రరేవణూరి తిరుమల కొండయాచార్య సుధీవరపుత్రవేంకటార్య" అని కలదు. శకుంతలాపరిణయమునందు "మదీయమాతామహవంశశిఖారత్నంబగు నన్నమాచార్యునికి"అని కలదు. అంతేకాదు.

"కశ్చిత్ప్రభుండు
" శ్రీవత్సాన్వయరేవణూరికులజున్ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణ్యస్ఫుటకావ్యకల్పకకవిన్ సంకీర్తనాచార్యపు
త్రీవంశోత్తము నందవైదికబుధాదిప్రోక్తవృత్తి స్వయం
భావున్ దిర్మల కొండయార్యసుతు శుంభద్వేంకటాభిఖ్యునిన్

పిలువం బంచి నట్లు కలదు.[246] సంకీర్తనాచార్యుల పుత్రిక వంశమునందు ఉత్తముడన సంకీర్తనాచార్యుల పుత్రిక యొుక్క పుత్త్రుడని అర్థము కాదు. సంకీర్తనాచార్యులపుత్రిక వంశమునందు ఉత్తముడని అర్థము. వంశీయుడని తాత్పర్యము. దౌహిత్రుడన కూతురు కొడుకు మాత్రమేగాక, పౌత్త్రుడు వలె వంశీయుడును కావచ్చును. మఱి శ్రీపాదరేణు ప్రభావమునందు ఇట్లు కలదు.

"శ్రీ లలరంగ మంగమకు శ్రీహరికి న్నటు ధారవోయుచో
తాళులపాకయన్నమయ తాఁ గడిగెన్ బదముల్ ధరిత్రి, మా
తాళులపాక చిన్నన పదంబులుఁ బాడిన నాఁడె సర్వరాట్
శైలవిభుండు తత్పదరజంబును మాకు నొసంగఁ జెల్లదే. " 52ప. 1 ఉ.

ఇందు అన్నమాచార్యులు కన్యాదాత. అలమేలుమంగా వేంకటేశ్వరకల్యాణసంధాత అందు మాతామహ వంశశిఖారత్నము మాత్రమే. పదములు పాడినవాడు చిన్నన్న. పాదరజమును ప్రసాదించినవాడు చిన్నన్న. అని వేంకటార్యుని అభిప్రాయము. అంతే

కాదు. "మా తాళులపాక చిన్నన" అని కూడ ఆత్మ ప్రత్యయము. ఇతని దృష్టిలో సంకీర్తనాచార్యులు చిన్నన్నయే అగును. కాని చిన్నన్న పదకర్త కాదు. ద్విపదకర్త. అయినను చిన్నన్న "పదములు పాడి" నట్లు సమీపకాలికుడు రచించుట సంగతముకాదు. కావున రేవణూరి వేంకటార్యుడు తాళ్లపాక అన్నమాచార్యుల కంటెను మాత్రమేగాక, తాళ్లపాక చిన్నన్న కంటెను పరమార్వాచీనుడు కావలయును. ఇతడు 1899 వ సంవత్సరము నాటికి "నూఱు నూటయేబది సంవత్సరముల క్రిందట నుండి యుండ వచ్చును." అని ఒక అభిప్రాయము కలదు[247]. అది సత్యసన్నిహితమగును. అప్పటికి నూఱు సంవత్సరములకు పూర్వుడైనను, వేంకటార్యుడు 1799 ప్రాంతము వాడగును. కాఁబట్టి శ్రీపాదరేణుప్రభావము, రచనాకాలము 1810 ప్రాంతము, శకుంతలా పరిణయము రచనాకాలము 1815 ప్రాంతము కావచ్చును.

**శ్రీపాదరేణుప్రభావము** : ఇది తిరుపతి వేంకటేశ్వరస్వామి పాదరేణుమాహాత్మ్యమును ప్రతిపాదించు లఘుకావ్యము. సంవాదరూపము. ఇందు నారదమన్మథసంవాదము, తుంబురుదత్త్రిలసంవాదము, పురందరరంభాసంవాదము, సరస్వతీచతుర్ముఖసంవాదము-నాలుగు సంవాదములు కలవు. ఒక్కొక్క సంవాదము ఒక్కొక్క ఉల్లాసము. ప్రతి ఉల్లాసము రసోల్లాసము కలిగించునది. ఒక పద్యమునందే ఇద్దఱి సంభాషణలు కల సంవాదపద్యములు కొన్ని, బహుపద్యములందు సంభాషణలు కల సంవాదపద్యములు కొన్ని కలవు. అందు వచనములు, రగడలు, దండకము, లయగ్రాహిమాలిక, అష్టకములు, తురంగవృత్తములు, ద్విపదలు, ఉత్కళిక, శ్లోకసరణి పద్యములు, సంస్కృతమార్గిక కలవు. ఇందు తురంగవృత్తము గమనార్హమైనది. ఆధునిక మైన ముత్యాలసరమునకు ఆద్యప్రకృతి కందుకూరిరుద్రయ సుగ్రీవవిజయమునందు కలదని పూర్వోక్తము. అందు నాలుగు మాత్రలు తక్కువ. అది త్రిపుట. అంతకంటె తురంగవృత్తము ముత్యాలసరమునకు తులదూగునది. ఇందు రెండు మాత్రలు ఎక్కువ.

"శ్రీల నయ్యలమేలు మంగకు
జాలఁ బుయ్యఁగఁజాలు రేణువు
భూమి పాపటఁ బ్రోమఁ గొల్చిన
కామితార్చితకామధేనువు--" 45ప. 3ఆ.

ఇది ముప్పదిపాదముల తురంగవృత్తము. ఇందు మూడు, నాలుగు, మూడు నాలుగు మాత్రలు కలవు. పేరునకు తగినట్లు తురంగవల్గనము కలదు.

ఒకే పద్యమునందు ఇద్దఱి సంభాషణలు కల సరసములైన సంవాదపద్యములు :

మన్మథ నారదసంవాదము :

"తియ్యని ద్రాక్షపండు రుచి తియ్యనఁ దోఁచెడిఁ గల్కి చొక్కపుం
దియ్యని మోవిచక్కె రదె తియ్యని తీపుగదయ్య నారదా!
కుయ్యకు రోరి శేషగిరికూటవిహారిపదాబ్జరేణువే
తియ్యన కంటెఁ దియ్యనగుఁ దీర్థము తోడుతఁ గ్రోలు మన్మథా! " 11ప. 1ఉ.

దత్త్రిల తుంబురుసంవాదము :

"రంభనటింపఁ గైశ్యభరరంజితపుష్పపరాగపుంజముల్
గుంభితమయ్యె నేమొ దివి ఘుమ్మని వాసన గ్రమ్మె తుంబురా!

కుంభిని శేషశైలపతి గుప్పునఁ గప్రపుఁ గుప్ప తిప్పలన్
జృంభిలుచు న్నటింపఁ బదరేణువు లెల్లను గప్పె దత్తిలా!" 22ప. 2ఉ.

రంభ, పురందరసంవాదము :

"చక్కెరబొమ్మ యెవ్వతయొ చక్కిలిగింతల గోళ్ల నొక్కెనో
చెక్కిట నీకు మిక్కుటపు జీర లవేమిర యో పురందరా!
మ్రొక్కితి వేంకటేశ్వరుని ముద్దుపదంబుల కప్పు డంటి నే
చక్కటి పాదరేణువది చక్కని రంభ! మరాళగామినీ!" 4ప. 3ఉ.

సరస్వతీచతుర్ముఖసంవాదము :

"నాలుకలందు వేదములు నాల్గు పఠింపఁగ, నేను మత్పద
శ్రీల నటింపఁగాఁ గలిగెఁ జెల్వగ నీకును వారిజాసనా!
శ్రీలలనేశు నగ్రసపుసేవమహత్త్వమునన్ మదీయజి
హ్వాలతలందు వేదకుసుమావళు లబ్బెగదే సరస్వతీ!" 2ప. 4ఉ.

**ములుగు పాపయారాధ్యుడు** (వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుడు) : ఇతని కృతులు 1. అహల్యాసంక్రందనవిలాసము. 2. ఇంద్రాత్మజాపరిణయము. 3. ఘూర్జర చరిత్రము. 4. శంతనుచరిత్రము. 5. దేవీభాగవతము. 6. సర్వమధురము. 7. సరసహృదయానందము. 8. వేమనారాధ్యచరిత్రము. 9. కల్యాణచంపువు. 10. ఏకాదశీవ్రత చంపువు. 11. ఆర్యాశతీశివస్తోత్రము. ఇందు ఒకటి. ఎనిమిది అముద్రితములు. రెండు, మూడు, నాలుగు, ఏడు అలభ్యములు. తొమ్మిది, పది, పదకొండు సంస్కృతకృతులు. ఇతడు అమరావతీసంస్థానాధిపతి వాసిరెడ్డి వేంకటాద్రినాయని (1778-1816) అతని దత్తుడు జగన్నాథనాయని (1816-1825) ఆస్థానకవి[248]. ఇతని జీవితకాలము 1778-1852 అని పూర్వోక్తము. కాబట్టి కృతుల రచనాకాలములు అహల్యాసంక్రందనవిలాసము 1810 ప్రాంతము, ఇంద్రాత్మజాపరిణయము 1812 ప్రాంతము, ఘూర్జరచరిత్రము 1815 ప్రాంతము, శంతనుచరిత్రము 1817 ప్రాంతము, దేవీభాగవతము 1820 ప్రాంతము, సర్వమధురము 1825 ప్రాంతము, సరసహృదయానందము 1830 ప్రాంతము, వేమనా రాధ్యచరిత్రము 1835 ప్రాంతము, కల్యాణచంపువు 1840 ప్రాంతము, ఏకాదశీవ్రత చంపువు 1845 ప్రాంతము, ఆర్యాశతీశివస్తోత్రము 1850 ప్రాంతము కావచ్చును.

**దేవీభాగవతము** :- ఇది దేవీభాగవతము తెనుగు సేతలందు మొట్టమొదటిది. దేవీభాగవతము అష్టాదశపురాణములలోని భాగవతమని, శ్రీమద్భాగవతము కాదని వాదప్రతివాదములు పూర్వము నుండి కలవు. అయినను కాకపోయినను ఇది పురాణమే. ఇందు పరాశక్తి మాహాత్మ్యము ప్రతిపాదితము. ఇందుకు భారతభాగవతరామాయణ కథలును వినియుక్తములైనవి. తెనుగు సేతను పూర్వకవుల ప్రభావము కలదు.

"రాజరాజేశ్వరీదేవి పూజ సేయు
వారు సిరిసంపదలు గల వార లెపుడు
రాజరాజేశ్వరీదేవి పూజ నీడు
వారు సిరిసంపదలు లేని వార లెపుడు. 296.
అఖిలాండజనని నిత్యార్చన చేనట్టి
కొంప గాదది కోళ్ల గంప గాని

త్రిపురసుందరిఁ దృష్టి దీర్పని యన్నిచు
సిరులు గా వవి కొండచరులు గాని
ఆదిశక్తినిఁ గూర్చి యర్చ సల్పని వాని
కేలు గా దది బండికీలు గాని
అంబిక నెన్నఁడు నభినుతింపని వాని
నోరు గా దది కట్టె వేరు గాని
భగవతి కొసంగలేని దుర్భగుఁడు గూర్చు
ధనము గా దది నరకసాధనముగాని
ధారుణీశ్వర! తెలియంగలేరు జనులు
తల్లి జగదంబ నతకల్పవల్లి సుమ్ము. " 297ప. 3స్కం.

కుంతీవిలాసము (258-266ప. 2స్కం.) కరుణరసనిర్భరము.

"పున్నమచందురున్ దెగడి పొల్పగు నీ నగుమోముఁ జూచి యో
యన్న ముదమ్ముఁ గాంచుటకు నాలయమై సుఖమందనైతి నే
నెన్నఁడు తొల్లి దేవిని భజించిన దానను గానొ యట్టులై
న న్నినుఁబాయఁజేయునె యనారతదుఃఖమయాబ్ధి ముంచునే." 263.

ఈ కుంతిభోజుని యింటిలోన వసించి
నియతిచే నమ్మౌని నిలువ నేల
నిలిచెఁబో ముని యొద్ద నిరతనిష్ఠాయుక్తిఁ
జెదరక పరిచర్య చేయ నేల
చేసితిఁబో మౌని సిద్ధోపదేశంబు
చేసి యామంత్రంబు చెప్ప నేల
చెప్పెఁబో నది పరీక్షించెదనని సూర్యుఁ
దలపంగనేల తద్ధ్యానమునను
వచ్చి మరులంది కౌఁగిటఁ గ్రుచ్చి రతుల
నేలఁగా నేల యింతకు నేన మూల
మనుచుఁ దలపోసి కుంతి వంతను దపింప
మందసమునందు నుంచి యాత్మజుని ధాత్రి. " 265ప. 2స్కం.

**సర్వమధురము** :- ఇది అచ్చతెనుగు కబ్బము. మెచ్చఁదగినది. అంతట తీపి కలదని "సర్వమధుర"మను పేరు. "అయోధ్య, శ్రీమతి, అంబరీష, నారద,పర్వత, సర్వమధురంబు లను పలుకులకుం దక్క మొదటి బాస నుడులకుం బలుకులు లేక చెల్లునది" అని మున్నుడి. (26వచ. 1వి.) "ఆశ్వాసము"నకు మఱొక తెలుగుమాట "విన్నపము" తొల్తటి విన్నపము, రెండవ విన్నపము, మూడవ విన్నపము అని మూడు విన్నపములు కలవు. "ఆశ్వాసాంతగద్యము" అచ్చతెనుగు పద్దెమే.

"ఇది యపరంజి సొమ్ముపయి నింపుగఁ గెంపులు చెక్కినట్టు లొ
ప్పిదముగ మింటితెర్వరుల పెద్దల నిద్దర చెప్పు కబ్బమై
మొదవుల పాలతెమ్మలన ముచ్చటలం గల "ముల్గ పాపయా
రదు" లొనరించు సర్వమధురంబనఁ దొల్తటి విన్నపం బగున్. " 112ప. 1వి.

కత "లింగపురాణము"లోనిది. కైత సొంతము. అంబరీషుని కూతురు శ్రీమతి.

అమె వెన్నుని వలచును. ఆమె అందచందములు నారద, పర్వతులను కలచును. ఎవరికి వారు విడిగా అంబరీషుని అడుగుదురు. అతడు కూతురునకు నచ్చిన వాని కిచ్చి పెండ్లి చేయుటకు ఒప్పుకొనును. నారద, పర్వతులు వెన్నునితో మొఱపెట్టుకొందురు. ఎంపిక తఱిని శ్రీమతి ఇద్దఱిని చూచి హడలిపోవును. కడకు వెన్నుని మెడలో పూలదండ వేయును. నారద, పర్వతులు అంబరీషుని తిట్టుదురు. వెన్నుడు వారి తిట్టులను తీసి గట్టుమీద పెట్టును. అంబరీషుడు శ్రీమతికి, వెన్నునికి పెండ్లి చేయును. ఇది కత, మఱి కైత అంతట తీపియే. అచ్చ తెనుగైనను తేట తెల్లము. ఎంపికతీరు ముచ్చట గొలుపును. ఒక్కెడ అంబరీషుడు అప్పటి జమీందారే అనిపించును.

"కట్టించె నూరూరఁ గఱివేల్పు కోవెలల్
ధట్టించె నోర్వని కట్టడులను
పెట్టించె నోరెంబు పేర్మిఁ బాఱుల కెల్ల
దట్టించె నెమ్మదిఁ దాల్మి యూట
మట్టించె దోసమన్మాటపుట్టఁగ నీక
గొట్టించె నానఁ గైకొనని వారి
నెట్టించె పెఱవేల్పు బెట్టు దెల్పెడి వారి
రెట్టించెఁ దొల్లిటి ఱేండ్ల సిరులు
మట్టు మీఱిన బత్తిచే గట్టుదారి
గట్టుమదిఁగాంచి తములచే గట్టువడక
పట్టు సడలంగనీక లోఁబుట్టు నెఱుక
పుట్టువుల మట్టు మల్లాడెఁ బుడమి ఱేఁడు. " 55న, 1వ.

శ్రీమతి వెన్నుని మీది విరాళి మిన్ను ముట్టినది.

"ఆ నవలావిరాళి మొలకై చిగురై ననయై తనంతఁ బె
న్మ్రానయి కొండయై కడలిమట్టున నిల్వక నింగియై నిజం
బై నెఱయంగ డెందమున నంతకునంతకు నెక్కువై యొరుల్
దానని వే తెఱుంగని వెతన్ జగమొల్లక యోరసింపఁగాన్. " 45ప. 2వ.

ఎంపిక తఱిని నారద, పర్వతులను చూచిన శ్రీమతి నడవడి :

కెవ్వున కేక వేసి కనుక్రేవల ఝల్లున సోన జాఱ తేఁ
డవ్వయుఁబట్టిన న్నిలక హా యనుచుంబరువెత్తి తోడ చిల్
చివ్వున వచ్చు నచ్చెలులఁ జేరకయుండఁగఁ దల్పు మూసి య
జ్జవ్వని కొను దూలఁజెడ సందర తందరఁ జేరి యార్చుచున్. 75

వలిగాలిఁ గదలు తీవియ
పొలుపున మేనెల్ల వడఁకఁ బొలఁతులఁ బిలువం
బలుకక తలుపుఁ దెఱవక
సొలపున నటమటముఁ జెంది సొగయుచుమదిలోన్." 76ప. 3వ.

తల్లిదండ్రులు బ్రతిమాలగా తలుపు తీసి, వెఱపునకు తెలిపిన కతము :

"అయ్యో! జడలయ్యల నొక
యయ్యకు విరిదండ వేయుమంటివి యది సి
గ్గయ్యెడు నేలానో రే
ముయ్యఁగఁబలె క్రోతి కొండ్రముచ్చులు సుమ్మీ. 103

గద్దతి సేఁత పైదుమికి కజ్యఁగఁ జూచెడు మిట్ట గ్రుడ్డులన్
దొడ్డువెవుల్ చిటుల్పెమలు దొడ్డమెడ ల్కడు సొగకోరలున్
పెద్ద గనంబడం బడుచు బెల్కురి యూరుపు దాచు పందనై
తద్దయుఁ దందరం బయలు దారితిఁ బిల్చినఁ బల్కు నల్కునన్." 104ప. 3ఆ.

నారద, పర్వతులు కోతి, కొండముచ్చుల వలె కనిపించుటకు కతములు నారద, పర్వతుల కోరికలే. వెన్నునితో మొఱ పెట్టుకొన్నప్పుడు నారదుడు,

"ఏ తెరవుఁబట్టి పోవుదు
నే తెఱఁగున నోర్చువాఁడ నింతికి నెదురన్
క్రోతి వలె నుండఁజేయవె
యాతని నని యడ్డుపడియె నడుగుల దండన్." 142ప. 2వి.

"కావున నన్నుఁ గావ మది గల్గినయేని పడంతి యిర్వురన్
తీవిగ నించి యొక్కని కడింది మగంటిమి మెచ్చి చేకొనం
గా వలపూను నప్పు డల కయ్యపుఁ దిండిని గొండముచ్చు గా
నీ వొనరించితేనిఁ బనులెల్లను దీఱుఁ దఁలంపు మట్లుగన్." 52ప. 2వి.

అని పర్వతుడు కోరెను. ఇద్దఱి కోరికలను వెన్నుడు తీర్చెను. శ్రీమతి,

"అన్నా! యేటి కలంత వందురిల యెందైనం గను నెన్నఁ గూఁ
తు న్నా యట్టుల రోఁతసేఁతలకుఁ దోడ్తో లోను గావింతు రే
మన్నం జాలదె యింట నీ కగుచు నే మాటాడఁ జాలన్ బళా
కన్నా కైతివి రాగుమి ంబొగడు పోగా యిట్టివా పెండిలుల్." 17

కావున నీకేఁ దెల్పెద
నా విన్నప మాలకింపు నగుటకు నిరవౌ
యీ వెడఁగుల తగులములకుఁ
దేవలవదు నన్నుఁగూర్చెదే విను మెల్లన్. 128

ఈ యడవిఁ దిరుగుడుల నడు
మై యొడయుం డొకఁడు గలఁడు మరుఁగన్న యటుల్
పాయము తగియున్నది నే
నాయనకుం బూవుదండ యప్పన సేతున్." 129ప. 3వి.

అని ముమ్మాఱు పలికి (130-132ప. 3వి.) వెన్నుని మెడలో విరిదండ వేయును. ప్రోలి, తేని, విరాళి, సంజ, చందమామ రాక, వేకువ, పెండ్లిసందడి, పెండ్లి వైనములు కొలదిగ కలవు.

మదినె సుభద్రమ్మ : ఈమె కృతులు 1. శ్రీరామదండకము. 2. కోదండరామ శతకము. 3. హరిరమేశశతకము. 4. రంగేశ్వరశతకము. 5. సింహాచలాధీశ్వరశతకము. 7. వేంకటేశశతకము. 8. కృష్ణశతకము. 9. సింహగిరిశతకము. 10. రాఘవరామశతకము. 11. కేశవశతకము. ఇందు కోదండరామ, రంగేశ్వర, సింహాచలాధీశ్వర, వేంకటేశ, సింహగిరి శతకములు అసమగ్రముగ లభించినవి[249]. ఈమె గొడే సూర్యప్రకాశరాయని తోబుట్టువు. 1781 వ సంవత్సరమునందు జన్మించినట్లు వంశీయుని గ్రథనము కలదు[250]. 1894 వ సంవత్సరమునాటికి తొంబది సంవత్సరములకు పూర్వము ఈమె కృతులు రచించినట్లు ఒక అభిప్రాయము కలదు[251]. అప్పటికి ఈమె వయస్సు 23 సంవత్సరములు. ఆ

తర్వాత రచించుటయే సంభవము. కాఁబట్టి ఈమె కృతుల రచనాకాలము 1810-30 కావచ్చును.

శ్రీరామదండకము భక్తిదండకము. కోదండరామశతకము సీసపద్యశతకము. "చారువైశాఖపురధామ జగ్గరాయ దాస హృదయాబ్జసోమ కోదండరామ" అని మకుటము. రంగేశ్వరశతకము శార్దూలమత్తేభవిక్రీడితవృత్తశతకము. "రంగేశ్వరా"అని మకుటము. సింహాచలాధీశ్వరశతకమును శార్దూలమత్తేభవిక్రీడితవృత్తశతకమే. "సింహాచలాధీశ్వరా" అని మకుటము. రఘునాయకశతకము చంపకోత్పలమాలాశతకము "రఘునాయకదీనపోషకా"అని మకుటము. వేంకటేశశతకము మఱల సీసపద్యశతకము. "దురిత భవనాశ వైశాఖపురనివాస వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ" అని మకుటము. కృష్ణశతకము. కందపద్యశతకము. "కృష్ణా" అని మకుటము. సింహగిరి శతకము మఱల సీసపద్య శతకము. "సింహగిరిభూష నిర్మలాంచితమనీష మధురసంభాష హర్యక్షమనుషవేష" అని మకుటము. రాఘవరామశతకము మఱల కందపద్యశతకము. "రాఘవరామా" అని మకుటము. ఇవి యెల్ల భక్తిశతకములు[252].

కేశవశతకము మఱల చంపకోత్పలమాలాశతకము. "కేశవా" అని మకుటము. అది కేవలము భక్తిశతకము కాదు; కేవలము నీతిశతకమును కాదు. భక్తిపద్యముల కంటె నీతిపద్యములు అధికము[253].

"ఈమె రచించిన శతకము లన్నిటిలోనికి కేశవశతకము ప్రశస్తమై యున్నది. అని విమర్శకాభిప్రాయము[254].

అసలు కవయిత్రులు అరుదు. ఇన్ని శతకములు రచించిన కవయిత్రి మఱొకతె లేదు.

**తరిగొండ వెంగమాంబ** : ఈమె కృతులు 1. నృసింహశతకము. 2. నృసింహ విలాసకథ. యక్షగానము? అనుపలబ్ధము. 3. శివనాటకము. యక్షగానము. అముద్రితము. 4. రాజయోగసారము. వేదాంతగ్రంథము. 5. కృష్ణనాటకము. యక్షగానము. అముద్రితము 6. పారిజాతాపహరణము. విష్ణుపారిజాతమని ముద్రితము. యక్షగానము. 7. రమాపరిణయము. ద్విపదకావ్యము. 8. చెంచునాటకము. యక్షగానము. 9. కృష్ణ మంజరి. ద్విపదశతకము. 10. రుక్మిణీనాటకము. యక్షగానము. అనుపలబ్ధము. 11. గోపికానాటకము. యక్షగానము. అనుపలబ్ధము. 12. భాగవతము ద్విపదకావ్యము. అముద్రితము. 13. ముక్తికాంతావిలాసము. యక్షగానము. దుర్లభము. 14. వాసిష్ఠరామాయణము. వేదాంతగ్రంథము. 15. వేంకటాచలమాహాత్మ్యము క్షేత్రమాహాత్మ్యకావ్యము. నృసింహశతకము తరిగొండలోని నృసింహస్వామికి అంకితము-తక్కినవి తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితములు. ఈమెకు నృసింహస్వామి, వేంకటేశ్వరస్వామి, కృష్ణుడు ఒకడే. అన్ని కృతులు దైవాంకితములు. ఈమె 1840 వ సంవత్సరము నాటికి లబ్ధప్రతిష్ఠురాలైనట్లు ఒక ఆధారము కలదు[255]. ఎనుబది సంవత్సరములుపైగా జీవించి కలియుగమున ఎనుబది రెండవ ఈశ్వరనామ సంవత్సరమున 1877 శ్రావణబహుళషష్ఠితిథిని పరమపదించినట్లు ఒక సమాచారము కలదు[256]. కనుక జీవితకాలము 1790-1877 అగును. కాఁబట్టి కృతుల రచనాకాలము 1815-1870 కావచ్చును.

**1. నృసింహశతకము** :- ఇది తరిగొండలోని నృసింహస్వామి పరముగ రచించినది. తరిగొండ-వెంగమాంబ జన్మస్థలము. పుట్టిన ఇంటిపేరు కానాల. మెట్టిన ఇంటి పేరు ఇంజేటి. ఇందు "ఎలమిని సొంపు పెంపొదవ నింజెటివంశజుఁడైనవేంకటాచలపతి నామధేయుని నిజాంగన వెంగమ"అని కలదు. భాగవతమునందు "వరుసగా నుంజేటి వంశభూషణుఁడు" అని కలదు. నృసింహశతకమునందు యతిమైత్రిఘటితము-కనుక నిర్ధారకప్రయోగము. "నుంజేటి" లేఖకదోషమగును. శతకమునందు యోగముద్రార హస్యములు కలవు . . . . అశ్లీలపదప్రయోగములు మెండుగానున్నవి."అని ఒక అభిప్రాయము[257].

**3. శివనాటకము** :- దీనికి శివపారిజాతమను లేఖకవ్యవహారము కలదు. కాని, ఇందు పారిజాతములేదు. దాని వలె రత్నహారము కలదు. పారిజాతాపహరణమునందు సవతుల సంవాదము వలె ఇందును సవతుల సంవాదము కలదు. ఈమె పారిజాతాప హరణము విష్ణుపరము. ఇది శివపరము. కథాసాదృశ్యమునుబట్టి శివపారిజాతమని వ్యవహృతము. "ఇందు లక్ష్మి కొఱవంజియై గంగ కెఱుక చెప్పుట, నారాయణుడు సింగ డగుట, సింగి సింగల్ల ప్రసంగము, సవతుల సంవాదము హృదయంగమముగా సాగి నవి"అని ఒక అభిప్రాయము[258].

**4. రాజయోగసారము** :- ఇది రాజయోగసారామృతమని కూడ ప్రకరణాంతము లందు కలదు. భాగవతములోని తృతీయస్కంధమునందలి కపిలదేవహూతిసంవాద రూపమైన సాంఖ్యయోగశాస్త్రవిషయమునకు తెనుగుసేత[259].

**5. కృష్ణనాటకము** :- ఇది బాలకృష్ణనాటకమని కలదు. కాని యువకృష్ణనాటకము. ఇందు "గోపికాకృష్ణసంవాదము:- కృష్ణు డదృశ్యుడగుట- గోపికల యన్వేషణ. అతఁడు ప్రసన్నుఁడై వారితో జలక్రీడ లాడుట, అంతలో రాధ చెలికత్తెను బుత్తెంచుట- గోపిక లా రాధాసఖిపైఁ గోపించుట- కృష్ణుడు రాధను బ్రసన్నఁ జేసికొనుట" విషయము[260].

**6. పారిజాతాపహరణము** :- ఇది "పారిజాతాపహరణమనెడు సత్కృతి" అని కలదు. సత్కృతియే. కేవలము పారిజాతాపహరణకథ కాదు. తన్మధ్యకల్పితకథ అధికము. శ్రీకృష్ణుడు పారిజాతవృక్షమును తెచ్చియిచ్చెద"నని సత్యభామను సంతసింపఁజేసిన తర్వాత కల్పితకథ ప్రారంభమగును. పారిజాతవృక్షము తెచ్చియిచ్చిన తర్వాత కూడ కల్పితకథ కలదు. శ్రీకృష్ణుని రుక్మిణ్యాదులతోడి విహారమునకు సత్యభామ నిష్ఠురము లాడిన, శ్రీకృష్ణుడు కోపగించును. సత్యభామ ప్రేమలేఖ వ్రాసినను, ప్రార్థించినను, ప్రాధేయ పడినను అధిక్షేపించినను శ్రీకృష్ణుడు ప్రసన్నుడు కాడు. సరస్వతి కొరవంజిగ వచ్చి, ఉపదేశించిన కృష్ణమంత్రమును జపించిన ప్రసన్నుడగును. సరస్వతి సింగి, బ్రహ్మసింగడు అగుట మాత్రమేగాక సింగిసింగల్ల సంవాదమును కలదు. రుక్మిణివినా, రాధ, జాంబవ త్యాదులు తమకును పారిజాతవృక్షములు కావలయునని పట్టుబట్టుదురు. రుక్మిణి వారిని శాంతింపఁ జేయును. శ్రీకృష్ణుడు సత్యభామకు పారిజాతవృక్షము తెచ్చియిచ్చిన తర్వాత సవతుల కయ్యము సాగును. జాంబవత్యాదులు "సత్యభామను దొమ్మిచేసి మెడఁబట్టి నెట్టు" దురు. శ్రీకృష్ణుడు రప్పించిన రుక్మిణి- సత్యభామ కృష్ణమంత్రజపము చేసినదని సవతులను శాంతింపఁజేయును. శ్రీకృష్ణుడు సత్యభామచేత రుక్మిణ్యాదులకు

చందన తాంబూలములతో పారిజాతపుష్పములు ఇప్పించును. ఇది పారిజాతాపహరణము లోని కల్పితేతివృత్తము.

సత్యభామ శ్రీకృష్ణుని అధిక్షేపించుట పండ్రెండు సీసపద్యములందు, శ్రీకృష్ణుడు సమాధానమిచ్చుట పండ్రెండు సీసపద్యములందు కలదు.

అందొకటి. సత్యభామ అధిక్షేపము :

"కులగోత్రములు లేని గుణహీనుఁడవు నీవు
కడపట బుద్ధిశూన్యుఁడవు నీవు
మాయావివైయై మారు మసలుచుండుదు వీవు
ఘనతరాహంకారఖనివి నీవు
బహురూపి యగుచు దబ్బరలాడుదువు నీవు
ప్రకటమహేంద్రజాలకుఁడ వీవు
మానావమానముల్ లేనివాడవు నీవు
కడలేని యప్రమాణుడవు నీవు
కనుక నిన్నొక్క మానవు డనగ రాదు
యేడనైనను నీ మోము జూడరాదు
కలయవిధమెట్లు శేషాద్రినలయ వైరి
వారగజసింహ తరిగొండ నారసింహ " పు 102.

ఇది పండ్రెండవ అధిక్షేపసీసపద్యము. శేషాద్రినిలయుడు, తరిగొండ నారసింహుడు కృష్ణుడే. ఇందుకు కృష్ణుని సమాధానమిది :

"అద్వయబ్రహ్మమైనటువంటి నాకును
కులగోత్రగణమితుల్ కొన్ని గలవె
వస్వంతరము లేని వానికి మానావ
మానబుద్ధులు వేరె కానబడునె
మొనసి మాయావినై ఘనతరాహంకార
ఖనిని నే గాకుంటె కలదె జగము
బహురూపినగుచు దబ్బరలాడి యింద్రజా
లము జేతునదియె లీలావిభూతి
కలికి నీవింత భావంబు తెలియలేక
నింద జేసితి వవి మంచి నిక్కమయ్యె
నింతయే మేలు నీ చెంత కేను రాను
చాలు నిక పోవె నీ ప్రేమ సత్యభామ" పు 102-3.

ప్రసన్నుడైన శ్రీకృష్ణుడు "వేవేగ కౌగిలీవే ముద్దుగుమ్మా"అని "నెయ్యంబు మీర నెత్తి కౌగిట జేర్ప" సత్యభామ ప్రగల్భమిది :

"స్వామి శ్రీకృష్ణ నీ జపమహత్వమున కామాదిశత్రువర్గమును గెల్చితిని
యిహసౌఖ్యవిషయభోగేచ్ఛల కెపుడు మహిని నాయంత పామరురాలు లేదు
కాన సకామనై ఘనతరజపము పూని జేసితి నదిప్పుడు ఫలియించె
గ్రక్కున నన్ను నిష్కామగా జేసి నిక్కంబు నెరిగించె నీ దయ వలన
నన్నిభోగములు ము న్ననుభవాలయ్యె నెన్నాళ్లు చాలింకనేమి నేనొల్ల

యవిరళభోగము లాసించి నేను సవతులతో వాదు సల్పగా నేల
నేను రారమ్మని నిను బిల్వనేల పూని రానని నీవు పోరాడ నేల
నను జూచి నీ సతుల్ నవ్వగా నేల చెనటి చందమున నే చింతింపనేల
కామంబు గల్గగా గద యున్ని గలిగె కామంబు విడచిన కల్గునే యున్ని
కావున వైరాగ్యకలితాత్మ నగుచు దేవ నీ పదములందే బుద్ధి నుంచి
మదనతంత్రసుఖంబు మానితి నన్ను కదియ వలదు. " పు 111.

ఇట్లు రచన సరసము. సరళము. సత్యభామాశ్రీకృష్ణులు శృంగారరసమునకు, వక్రభాషిణీవక్రభాషణులు హాస్యరసమునకు ఆలంబనవిభావములు.

**7. రమాపరిణయము** : ఇది అలమేలుమంగావేంకటేశ్వరుల కల్యాణమును వివరించు పాట. ఇందు "సుమారు ఐదువందల ద్విపదలు కలవు. . . బువ్వపుబంతి ఘట్టము విపులముగను ప్రసాదహాస్యమిళితముగను ఉన్నది. నీరజోదరుడును, నీల కంఠుడు బావమఱదుల పరియాచక మాడుకొందురు. ఈఘట్టము ముచ్చటగఁ జదువదగి యున్నది"అని ఒక అభిప్రాయము[261].

**8. చెంచునాటకము** :- ఇది చెంచులక్ష్మి చెల్లెలి కథ. ఆమె భర్తను వెదకికొనుచు తరిగొండ నృసింహస్వామి ఆలయమునకు వచ్చును. ఆలయద్వారపాలకులు అడిగిన మీదట తమ వృత్తాంతమును వివరించును. ఆమె భర్త వచ్చును. ఇద్దఱు వాదు లాడు కొందురు. తర్వాత వారి బుడుతని పులి ఎత్తుకొనిపోవును.

చెంచెత ఏడ్చి ఏడ్చి తిరుపతి వేంకటేశ్వరస్వామికి మ్రొక్కుకొనును. బుడుతడు చెంతకు వచ్చును. కథ సుఖాంతము. చెంచుల ఆచారవ్యవహారములు విశేషము[262].

చెంచెత తరిగొండ నృసింహస్వామి ఆలయము కడకు వచ్చినది. తిరుపతి వేంకటేశ్వరస్వామికి మ్రొక్కినది. కారణము? వేంగమాంబ మొదట తరిగొండ నృసింహస్వామి భక్తురాలు. తరువాత తిరుపతి వేంకటేశ్వరస్వామి భక్తురాలు. తరిగొండను వదలి తిరుపతి యందు స్థిరపడినది. ఆ సంధికాలమునందు రచించినది చెంచునాటకము కావచ్చును. ఇద్దఱు వేంగమాంబకు ఇష్టదైవములే ఇద్దఱును ఏకదైవమే.

**9. కృష్ణమంజరి** :- ఇది నూట ముప్పది యొక్క ద్విపదల మంజరి. ద్విపదలు మంజరీద్విపదలు కూడ. మంగళము రెండు ద్విపదలు, కృతిసమర్పణాదికము ఆరున్నర ద్విపదలు, ఫలశ్రుతి మూడు ద్విపదలు అదనము. మొదటి నూటముప్పది యొక్క ద్విపదలందును ప్రతిద్విపద చివఱ కృష్ణ అను సంబుద్ధి కలదు. అది మకుటము. అంతేకాదు. ప్రతిద్విపదయందును ఆత్మనివేదనము కలదు. శతకప్రాయమైన రచన. ద్విపదశతక మనవచ్చును.

వేంగమాంబ కృష్ణుని విశ్వరూపమును చూపుమని కోరిన ద్విపదలు ముప్పది కలవు. (13-42) శరణాగతి (45) శేషశేషిభావము (48) ద్వయమంత్రము (76,77) మొదలైన విశిష్టాద్వైతవిశేషములు కలవు. లక్ష్యము మోక్షము (104, 122) స్వీయలోపములు కూడ వేంగమాంబ ప్రకటించినది. (55-62)

"అనిశంబు పెద్దపిన్నంతరము లేక
తెగువ నెవ్వరినైన తిట్టుదు కృష్ణ ." 57

వేంగమాంబ పతితపావనబిరుదు కూడ చేపట్టినది. (63-68)

"అజ్ఞాని నపరాధి నగు నేను పతిత
పావనబిరుదు చేపట్టితి కృష్ణ " 63

అవ్యయమైన, అపునరావృత్తియైన ఉన్నతపదవియే (104) వేంగమాంబ ధ్యేయము. సగుణనిర్గుణసారస్యభావమును (120) వేంగమాంబకు సాపేక్ష్యము.

"అవ్యయబ్రహ్మమైనట్టి నీలోన
పొందక నా జాలి పోదింక కృష్ణ " 124

అని వేంగమాంబ ఆత్మనివేదనము.

**12. భాగవతము** :- ఇది ముద్రణభాగ్యము నందకపోయినను సమీక్షాభాగ్యము నందినది. సారాంశమిది[263]: "పండ్రెండు స్కంధములను ద్విపదకావ్యముగా రచించినది. చిన్నికృష్ణుని ఆదేశానుసారము తత్త్వార్థములను సంక్షేపించినది. పోతన భావములు చాలవఱకు అనుసరించినది. కొన్ని తావులందు కొద్దిగా మెఱుగు పెట్టినది. సొంత భావములును సంతరించినది. సంస్కృతభాగవతమును సంప్రదించినది."

పోతన భావముల అనుసరణమునకు ఒక ఉదాహరణము.

"హరినామకథనదావానలజ్వాలచేఁ
గాలవే ఘోరాఘకాననములు
వైకుంఠదర్శనవాయుసంఘంబుచేఁ
దొలఁగవే భవదుఃఖతోయదములు
కమలనాభధ్యానకంఠీరవంబుచేఁ
గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ
దీఱవే షడ్వర్గతిమిరతతులు
నలిననయనభక్తినావచేఁ గాక సం
సారజలధి దాటి చనఁగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబుఁ
దెలుపవయ్య సూత! దీనమేత! " 50ప. 1ఆ.

"హరినామకథనదావాగ్నిచే ఘోర
తరపాపవిపినాళి దగ్ధంబు గాదె?
వనజాక్షుదర్శనవాయువుచేతఁ
జనవె దుస్తరదుఃఖజలదమాలికలు?
నడర విష్ణుధ్యానహర్యక్షపటిమ
మడియవె సంతాపమదగజేంద్రములు?
వరకృష్ణలీలాశ్రవణభానుదీప్తి
నరుగదె ఘోరమాయాంధకారంబు?
నరహరిపదభక్తినావచే విపుల
తరభవాంభోనిధిఁ దరియింపరాదె? "

**13. ముక్తికాంతావిలాసము** :- ఇందు "జగదీశ్వరుఁడు మాయను వీడి ముక్తికాంతను బొంద గౌరి యామె మందిరమునకు వచ్చుట, జ్ఞానకాంత తలుపులు మూయించుట, నాయికానాయకుల ఉత్తరప్రత్యుత్తరములు, మాయాశక్తి వైరాగ్యజ్ఞానశక్తులతో

వాదించుట విషయము." అని ఒక అభిప్రాయము. ఉత్తరప్రత్యుత్తరముల వివరము లివి[264]: జ్ఞాన కాంత జగదీశ్వరునికి (తరిగొండ నృసింహస్వామికి) ముక్తికాంత పేరిట ఉత్తరము వ్రాసి, శ్రద్ధ అను శక్తిచేత పంపించును. అది జగదీశ్వరుని చెంతఁజేరి చదువును. జగదీశ్వరుడు ఇచ్ఛాశక్తిచేత ప్రత్యుత్తరము వ్రాయించి పంపించును. అది ముక్తికాంత చెంతనున్న జ్ఞానకాంత చదువును. దానికి ప్రత్యుత్తరము వ్రాయించి, మఱల శ్రద్ధ అను శక్తిచేత పంపించును. జగదీశ్వరుడు మఱల ప్రత్యుత్తరము వ్రాయించి, పంపించును. అప్పుడు ముక్తికాంత తలుపులు తెఱిపించును. ఈవిధమైన ఉత్తరప్రత్యుత్తరముల ద్వారా కథానిర్వహణము నూతనవిశేషము.

ఇది ప్రబోధచంద్రోదయమునకు మానసపుత్రికయే. అంతేకాదు. వేదాంతజ్ఞాన బోధిని అను నామాంతరము సార్థకము.

**14. వాసిష్ఠరామాయణము** :- ఇది సంస్కృతజ్ఞానవాసిష్ఠము లేక యోగవాసిష్ఠము నకు తెనుగుసేత. ఇంతకు ముందు మడికి సింగన తెనుగుసేత కలదు. అది పద్యగద్యో భయము. ఇది ద్విపదమయము. మూలము ముప్పది రెండు వేల గ్రంథసంఖ్య కలదని, ఇది నాలుగు వేల గ్రంథసంఖ్య కలదని ఇందు కలదు[265].

**15. వేంకటాచలమాహాత్మ్యము** :- ఇది ఒక్క కావ్యము కాదు. మూడు కావ్యముల సంపుటి. మూడు అవతారికలు కలవు. ప్రథమాశ్వాసమునందు ఒక అవతారిక. చతుర్థా శ్వాసమునందు మఱొక అవతారిక షష్ఠాశ్వాసమునందు ఇంకొక అవతారిక. మూడు అవతారికలందును ఆదిని శ్లోకములు కలవు. కావ్యోపక్రమణములు కలవు. అంతేకాదు. మూడు కావ్యములకు మూడు మూలములు కలవు. మొదటి మూడు ఆశ్వాసాంతగద్యము లందు "వేంకటాచలమాహాత్మ్యంబను వరాహపురాణంబునందు"అని, నాలుగైదు ఆశ్వా సాంతగద్యములందు "వేంకటాచలమాహాత్మ్యంబను భవిష్యోత్తరపురాణంబునందు"అని, షష్ఠాశ్వాసాంతగద్యమునందు "శ్రీవీరలక్ష్మీవిలాసంబును వేంకటాచలమాహాత్మ్యం బును"అని కలదు. షష్ఠాశ్వాసములోని అవతారికయందు మూలము గుఱించి ఇట్లు కలదు.

> ". . . . . . . . . . పద్మపురాణ
> మందు వింతగు వేంకటాద్రివిభుఁడు
> సిరిని గూరిచి తపమును జేసినట్టి
> చరితములు కొన్ని లభియింప సంగ్రహముగ
> సరవి నాశ్వాసమున కవి చాలవనుచు
> వేఱ కల్పన కొంత గావింపవలసె. " 3.
> "ఈ కృతికిఁ దగు నభిధాన మేదియనిన
> శ్రీకరంబగు వీరలక్ష్మీవిలాస
> మనెడు నామంబు పెద్దల యనుమతమున
> నిర్ణయించితి నన్ను మన్నింపవలయు. " 5ప. 6ఆ.

మొదటి మూడు ఆశ్వాసముల మొదటి కావ్యము క్షేత్రమాహాత్మ్యము. నాలుగైదు ఆశ్వాసముల రెండవ కావ్యము శ్రీనివాసకల్యాణము. ఆఱవ ఆశ్వాసమైన మూడవకావ్యము వీరలక్ష్మీవిలాసము. క్షేత్రమాహాత్మ్యమునకు, శ్రీనివాసకల్యాణమునకు అనుబంధము

కలదు. శ్రీనివాసకల్యాణమునకు, వీరలక్ష్మీవిలాసమునకు అనుక్రమణిక కలదు.

మొదటి కావ్యమునందు కావ్యసరణి కంటె పురాణధోరణి అధికము. ధర్మరాజు ఒక్క సంవత్సరము, రాముడు ఒక్క దినము వేంకటాద్రియందు వసించుట, బ్రహ్మేంద్రాదులు సూతశౌనకాదిమహామునులు వేంకటాద్రికి వచ్చుట, యోగశాస్త్రవిశేషములు మొదలైనవి వరాహపురాణవరప్రసాదములు. లక్ష్మీనారాయణులు వేశ్యావిటరూపములు ధరించి యజ్ఞశాలలకు వచ్చిన ఘట్టము కావ్యసరణి. విష్ణువు విటరూపవర్ణనమిది :

"మేఘంబుపైఁ జెల్లు మెఱుపుఁదీఁగలు వలెఁ
దగిన బంగరుజన్నిదములు మెఱయ
నుంగరంబుల కాంతు లొప్పెడు కుడిచేత
నొక లీలగాఁ గత్తి యొఱపు నెగడ
శరణాగతత్రాణబిరుదంబు లనఁదగు
నందియ ల్పాదంబులందు మొఱయ
వామహస్తంబున వరరత్నమయచాప
మొగిఁ దళుకొత్తంగ నుల్ల మలర
విటుని వలె హరి సొగసుగ వేసమొసఁగఁ
దాల్చి విటకత్తె వలె నుండు తరుణిఁ గూడి
పాదుకల మెట్టికొంచు నా ప్రథితయజ్ఞ
వాటిఁ జేరంగఁ జూచుచు వచ్చుచుండె." 136ప. 1ఆ.

రెండవ కావ్యము సుప్రసిద్ధమైన శ్రీనివాసకల్యాణము ఇందు విష్ణువు కుఱవంజిగ వచ్చి, ధరణీదేవి-ఆకాశరాజుల కూతురు పద్మావతి గుఱించి చెప్పిన ఎఱుక పాత్రోచితముగ వ్యావహారికభాషయందు వ్రాయుట విశేషము.

"అవ్వోయవ్వ. నీ తలంచిన తలంపు మేలౌతాదంట. దేవుళ్లు పలుకుతుండారు. తలంచిన తలంపే మంటివా విను ........ ఆడబిడ్డ కడుగుతుండావే, అవ్వో యవ్వ. ఆ యాడబిడ్డ కొక సింత కలిగుండాది ఆ సింత యేమంటావా నిన్నటి దినము నీ బిడ్డ సవారేగినాది. ఆడ తురగారూఢుండైన నల్లనయ్యను జూచి మోహించియుండాది ........ వాడు నీబిడ్డను బెండ్లాడవలె నని యుండాడె. వాని నీ బిడ్డ పెండ్లాడ నెంచి యుండాదె. కాఁబట్టి నీ పుత్త్రికను ఆసామి కిచ్చి పెండ్లి చేసి కన్నులార సూడుము తల్లీ సుకంగా నుంటాది. లేకుంటె కష్టాలు రాబోతుండాదె యమ్మ" 31 వచ. 5ఆ.

పద్మావతిని పరిణయ మాడుటకు శ్రీనివాసుడు, కుబేరుని యొద్ద అప్పు తీసికొని, ఋణపత్రము వ్రాసియిచ్చుట మఱొక విశేషము.

"శ్రీకరలీల స్వస్తిశ్రీజయాభ్యుద
యాష్టాదశద్వాపరాంతమందుఁ
గల కలి నాది వేంకటనాయకుఁడు ధన
పతి కొసంగిన వడ్డి పత్ర మెట్ల
యనిన నా వైవాహమునకు నీచే నప్పు
గొనిన టెంకీలును గోటి సంఖ్య

లలిని చతుర్దశలక్షలందుకు వడ్డి
ప్రతివత్సరంబును బరఁగ నిత్తు
కలియుగాంతమునందునఁ గాసు వీస
ముంచ కొగిఁ దీర్చివేయుదు మొనసి దీని
కజుఁడు శంభుఁడు మఱియు హిమాంశుఁ డినుఁడు
సాక్షులు నిజంబు వృక్షరాజంబు సాక్షి." 160 ప. 5ఆ.

ఇందు సాక్షులు నలుగురు వ్యక్తులు. ఒక వృక్షము. వృక్షసాక్ష్యము నాటి ప్రమాణ మగును. ఈ ఋణపత్రమునకు కాలదోషము లేదు. కలియుగాంతము వఱకు గడువు కలదు.

మూడవకావ్యము వీరలక్ష్మీవిలాసము. ఇందు లక్ష్మి వీరనారియే. పద్మావతీ పరిణయసమయమునందు తిరస్కరించిన విష్ణువు పద్మావతీపరిణయానంతరము ప్రసన్నుడై, తన కొఱకు తానున్న కొల్లాపురమునకు రాదలచుట గ్రహించి, విష్ణువునకు కనిపించరాదని పాతాళమున కేగి కపిలమహర్షి ఆశ్రమమునందుండును. లక్ష్మి కొఱకు విష్ణువు తపించి, కడకు తపస్సు చేయును. అదిగ్రహించి లక్ష్మి అచటకు వచ్చును. అయినను లక్ష్మినారాయణుల పునస్సమావేశము పట్టుగ సాగినది. అది లక్ష్మిపరముగ వీరోచితము. విష్ణువు పరముగ ధీరోచితము.

"అప్పు డా గోవిందుఁ డళికియు నలుకక
ధీరుఁడై శ్రీరమాదేవి తొలుతఁ
దనుఁజూచి మాటాడినను దాను మాటాడ
వలె నంచు శిరమును వాంచియుండె
హరి పిల్చినపుడు మాటాడు దంచును లక్ష్మి
కమలంబుపై నిల్చి కదలకుండె" 118ప. 6ఆ.

బ్రహ్మరుద్రాదులు ప్రత్యక్షమై ప్రార్థించినను విజయలక్ష్మి పలుకదు బ్రహ్మ లక్ష్మీ నారాయణుల ఎడబాటునకు నిమిత్తమైన భృగు మహర్షి వంక చూచెను.

"అపుడు భృగు ముని సిరి పాలి కరిగి మ్రొక్కి
మాతృదేవత నా తప్పు మఱచి యిప్పు
డైన నే నీకుఁ బుత్త్రుఁడ నంచు నెంచి
హరి యురంబునఁ జేరు మా యమ్మ యనుచు" 122 ప. 6ఆ.

బహువిధముల వినుతించిన, లక్ష్మి అతనిని మన్నించి, "చక్రి కార్యంబు లన్ని తలఁప నతని పను లన్ని చూడఁగ నతని కెఱుక" అని (125) బ్రహ్మ "విభుం డెత్తి యురంబున నిడుకొను నత్తఱి నని తలఁచి" కదలకుండును. (127) బ్రహ్మరుద్రులు "సాగర కన్యక నెత్తి వక్షమందొనరఁగ నుంచు కొమ్ము హరి! యో జగదీశ!" అనిన (128) విష్ణువు "వనధిజ కెల్లకాలము నివాసముగాఁ దగినట్టి నాయురంబున నిఁకనైన నిల్వుమని పొందుగఁ జెప్పుడు మీరలు" అనును. (129) వారు "దేవి! నీ ప్రాణవిభుని వక్షమునఁ జేరి యుండఁగ వలయు నిపుడు మంచి లగ్నంబు గనుక నెమ్మదిగఁ జేరు" మనిన, లక్ష్మి విష్ణువు చెంతకు వచ్చి, వక్షస్స్థలమునకు చందన మలదును. (138) విష్ణువు లక్ష్మిహస్తమును పట్టుకొని వక్షస్స్థలమునందు చేర్చుకొనును. (139)

లక్ష్మి విష్ణువు చెంతకు వచ్చిన విధము రెండు సీసపద్యములందు చక్కగ వర్ణింపబడినది. రెండవ సీసపద్యములోని ఎత్తుగీతమిది :

"హంసగతి నొప్పు నుదధిదుగ్ధాబ్ధి నుండి
వెడలి మునువచ్చి హరిఁ జేరు విధముగాను
రమ్యతరమైన పద్మసరస్సు వెడలి
శ్రీరమాసతి పతి చెంతఁ జేరి నిలచి" 132 ప. 6ఆ.

ఇందలి ఉపమానము నిరుపమానము. ఇట్లు వీరలక్ష్మీవిలాసము కవితావిలాసము.

అనంతరకథ స్వతంత్రకల్పన మగును విష్ణువు అప్పు చేయుటకు హేతువు, అప్పుడు లక్ష్మి లేకపోవుటయే. ఇప్పుడు లక్ష్మి కలిగి అప్పు తీర్చుమనిన విష్ణువు సమాధానమిది.

"ఇపుడు కుబేరుని కీ యర్థ మీనేల
  నానాఁటి వడ్డి నిర్ణయముగాను
గ్రమముగ నిచ్చుచుఁ గలియుగాంతంబునం
  దంతయుఁ దీర్చి విశ్రాంతి నొంది
వైకుంఠపురిఁ జేరవచ్చు నంతకు శేష
  శైలమందుండి భూజనుల నెల్లఁ
బాలనము చేసి వారి పాపముల నింకఁ
బరిహరింపుచు రక్షింపవలయు నెలమిఁ
గాన నయ్యప్పు తలఁప శీఘ్రంబ యీయ
వలదు ... ... ... ..." 143 ప. 6ఆ.

ఇందు మానవనైజము కలదు. మానవశ్రేయమును కలదు.

ఇట్లు లోకజ్ఞత, కావ్యజ్ఞత, శాస్త్రజ్ఞత, ముప్పిరిగొన్న, ప్రక్రియావైవిధ్యము ప్రత్యేకత అయిన తరిగొండ వెంగమాంబ అరుదైన కవయిత్రి.

శ్రీధరమల్లె వేంకట రామయ : ఇతని కృతి బ్రహ్మోత్తరఖండము. సిద్దవటము దగ్గఱి అంబాపురములోని పార్థివేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము గ్రంథాంతము నందు ఇట్లు కలదు.

"శకవర్షగణనంబు శైలరామమునీందు
  పరిమితంబైన ధాత్రిఁ బరఁగు
యువనామసంవత్సరోపేత కార్తిక
  మాసరాజిత పౌర్ణిమాసియందు
ధన్యులు విష్ణువర్ధనసగోత్రులు జ్యోతి
  సుబ్బన్న పుత్త్రులు సుగుణమణులు
రామన్న లక్ష్మినారాయణ చెంగల్వ
  రాయఁడు నన మువ్వు రమలమతులు
చిత్తమున భక్తి వెలయ బ్రహ్మోత్తరాఖ్య
ఖండ మాంధ్రప్రబంధంబుగా ఘటించి
యెలమి నంబాపురపుఁ బార్థివేశ్వరునకు
భాసురముగ సమర్పణ చేసి రపుడు." పుట 190

శైల=7, రామ=3, ముని=7, ఇందు=1 ---- 1737 +78 = 1815. కాఁబట్టి

బ్రహ్మోత్తరఖండము రచనా కాలము 1815 ప్రాంతము.

బ్రహ్మోత్తరఖండము స్కాందపురాణ సంహితాషట్కమునందు ఒకటైన బ్రహ్మ సంహిత ఉత్తరభాగము. ఇది తనకు పూర్వము ఎవ్వరును తెనిగింప లేదని ఇతని అభిప్రాయము.

"ఉత్తములైన పూర్వ కవు లొక్కరు నాంధ్రకృతుల్ రచింపుచు
న్నిత్తఱి మన్మహాసుకృత మెట్టిదొ మున్ దెనిఁగింపరైరి బ్ర
హ్మోత్తరఖండ మిప్పుడది యొప్పుగఁ జెప్పెదఁ బద్యకావ్యమున్
జిత్తమునందు సమ్మదముఁ జెందఁగ జన్మము సార్థకంబుగన్" పుట9

ఇది యథార్థము కాదు. ఇంతకు శతాబ్దిపూర్వమే బ్రహ్మోత్తర ఖండము తెనిఁగింపఁ బడినది. అంతేకాదు ఇందలి సీమంతినీకల్యాణము, భద్రాయురభ్యుదయము ప్రత్యేక ప్రబంధములైనవి. అవి పూర్వోక్తములు.

అక్కినేపల్లి నృసింహము : ఇతని కృతి ఓఘవతీ పరిణయము అముద్రితము. గొడే సంస్థానాధిపతి గొడే సూర్య ప్రకాశరాయనికి అంకితము అతని కాలము 1788 - 1841 అని పూర్వోక్తము గ్రంథాంతపద్యమునందు కృతి సమర్పణ కాలము [266] కలదు.

"శాలివాహనశకసంవత్సరంబు ల
జాగ్నిభూధరతుషారాంకుఁడైన
యీశ్వరాబ్దంబున నెసఁగు వైశాఖమా
సంబున శుక్లపక్షమున మూర్తి
శశిసంఖ్యభౌమవాసరమున శుభవేళ
నక్కినేపలి నృసింహకవి యోఘ
వతి పెండ్లి కథ సమున్నతి మీఱెడి గొడె జ
గ్గారాయసూర్యప్రకాశరాయ
మణికి రాజ్యాయురారోగ్యమహితపుత్ర
పౌత్రనికరాభివృద్ధిగా భవ్యబుద్ధిఁ
గృతి యొసంగెను దద్యశం బతిశయిల్లి
జగతి నాచంద్రతారార్కముగఁ జెలంగ"

అజ=9, అగ్ని=3, భూధర=7, తుషారాంక=1 ---- 1739+ 1817. కాబట్టి ఓఘవతీపరిణయము రచనాకాలము 1817 ప్రాంతము కావచ్చును.

సత్యవోలు భగవాన్రాజు (భగవత్కవి) : ఇతని కృతులు 1. శతశతకములు 2. తారావళులు. 3. దశావతారావళులు. 4. ఉదాహరణములు. 5. దండకములు (16ప. 1అ.రు.ప.) 6. రుక్మిణీపరిణయము. ఇందు రుక్మిణీపరిణయము మాత్రమే ఉపలబ్ధము. అది తిరుపతి వేంకటేశ్వరునికి అంకితము. దైవాంకితము. ఇతడు ఏనుగు లక్ష్మణకవికి సమకాలికుడని ఒక అభిప్రాయము కలదు[267]. కాని యథార్థము కాదు. ఇతని తాత భగవాన్రాజు ఏనుగు లక్ష్మణకవికి సమకాలికుడగును. అతడు అనంతరాజు కుమారుడు. ఇతడు జనార్దనమంత్రి కుమారుడు. ఇతని వంశవృక్షము కలదు[268]. ఇతనికి, 1924 వ సంవత్సరము జననకాలమైన శేషగిరిరావునకు నడుమ అయిదు తరములు కలవు. తరమునకు ముప్పది సంవత్సరములు పరిగణించిన, ఇతని జననకాలము 1924-150=

1774=1770 ప్రాంతమగును. కాఁబట్టి రుక్మిణీపరిణయము రచనాకాలము 1820 ప్రాంతము కావచ్చును.

ఇది మూడవ రుక్మిణీపరిణయము. ఇందు షష్ఠ్యంతపద్యములు పదకొండు కలవు. అయిదు షష్ఠ్యంతపద్యము లుండుట అతిసాధారణము. కాలక్రమమున ఎనిమిది షష్ఠ్యంత పద్యములుండుట క్వాచిత్కము. పదకొండు షష్ఠ్యంతపద్యములుండుట విశేషము. అంతే కాదు. అందు పది పద్యములు పది అవతారముల ప్రశంసలు. పదకొండవ పద్యము పది అవతారముల ప్రశంస.

> "శ్రీశునకు మత్స్యకూర్మకి
> రీశనృసింహవటుభార్గవేశరఘుకులా
> ధీశబలబుద్ధకలికా
> ఖ్యాశేషవిశేషవేంకటాద్రీశునకున్." 30ప. 1ఆ.

కథాప్రారంభమునందు రామాయణసారము కలదు. (41-72ప. 1ఆ.) కుమార పంచకము కల భీష్మకుడు సాలంకృతకన్యాదానఫలము కాంక్షించి, భార్యచేత లక్ష్మీవ్రతము చేయించిన లక్ష్మీదేవి రుక్మిణిగా జన్మించినట్లు కలదు. ఇది భాగవతకథాంశమునకు హేతుకల్పనము.

> "హరి మాయఁదగిలి రుక్మిణి
> సిరి దా నను మాట మఱచె సిరి కూఁతురుగా
> వరమందిన రాజవధూ
> వరులు న్నఱిచిరి తనూజ వార్ధిజ యగుటన్." 152ప. 1ఆ.

అని కూడ కలదు. ఇది అనంతరకథాగతికి ఆవశ్యకము.

రుక్మిణి తండ్రి గేహమునకు వచ్చి అతిథుల వలన కృష్ణుని రూపబలగుణాదులు విని, తనకు కృష్ణుడు తగిన విభుడని తలఁచినట్లు భాగవతమునందు కలదు. ఇందు శ్రీరంగము నుండి బలరాముని వివాహమునకు ద్వారకకు వెడలి, తిరుగుప్రయాణమున కుండిననగరమునకు వచ్చి, భీష్మకుని సందర్శించిన పండితకవులలోని సత్యవ్రతుడు కృష్ణుని చరితము సంగ్రహముగ చెప్పుటవలన, భీష్మకుడు రుక్మిణికి తగిన వరుడని, రుక్మిణి తనకు తగిన విభుడని తలచినట్లు కలదు. వసుదేవుని పండితకవిసత్కారము, భీష్మకుని పండితకవిసత్కారము సమకాలికసమాచారము.

రుక్మిణి ఆప్తుడైన అగ్నిద్యోతనుడను బ్రాహ్మణుని కృష్ణుని కడకు పంపినట్లు భాగ వతమునందు కలదు. ఇందు పరమదరిద్రుడైన ఒక బ్రాహ్మణుని పంపినట్లు కలదు. ఈ బ్రాహ్మణుని వృత్తాంతము కుచేలోపాఖ్యానము.

> "అని మఱి కొన్ని మిక్కిలి రహస్యపు మాటలు చెప్పి గుప్పునం
> బని వినుమన్న మన్ననకుఁ బాఱుఁడు సంవిదపారుఁ డుబ్బుచున్
> జనునెడ బిడ్డ లాఁకటికి సైపరు దాపరమేల బాలతో
> ననియెద నన్నఁ జిన్నఁదన మంచుఁ దలంచె విరక్తచిత్తుఁడై. 198
> వెసవెస కొంత దవ్వ చను వేమఱుఁ బామరు రీతి నాతిపై
> నిసువులపైఁ దలంపునిడి నెవ్వకు నెవ్వగ నొందు నందులోఁ
> బస పొసఁగించి రాజసుత ప్రావున నేవున సంచరించినం

గసరక పెంచునంచుఁ జనుఁ గ్రమ్మఱ ముమ్మరమైన వేడుకన్. " 199ప. 2ఆ.

ద్వారక నుండి వచ్చి, శుభవార్త తెలిపి, రుక్మిణి "దారసుతాదుల నాదరించిరేపు రమ్మని మ్రొ"క్కిన, అతడు

"అనుమానించుచు నింటి కేఁగునెడఁ గన్యారత్న మేమిాక పా
మ్మనె నా లేమ యెఱుంగ నే నుడువరా దన్యోపదేశంబు కా
ర్యనిరూఢం బదిగాక రేపు నను రమ్మంచుం బ్రియంబారఁ బ
ల్కెను గాన న్మనుఁ బిల్చినట్టి యల కల్కిం జేరి వక్కాణించెదన్. 347
ఆదియుంగాక దరిద్రతాన్వితుఁడు సర్వాయాసవాసుండు స
ర్వదయాదూరుఁడు సర్వగర్వితుఁడు సర్వద్వేషసంపాదనా
స్పదుఁ డాతం డెపు డెట్టి వారికడ నెబ్బంగిం బ్రవర్తించినన్
దుద మేలొందదు నిక్కమైన నది గాంతు న్రేపు నేనియ్యెడన్. 348ప. 2ఆ.

అని ఇంటి కేగును సర్వాభరణభూషితురాలైన భార్య పూజించిన,

"ధనికనివాసమో నృపతిధామమొ దైవికమాయయో కనుం
గొన వెఱఁగయ్యె నిట్టి యనుఁగుం జెలులుం బహుదాసదాసికా
జనమణిహేమగోతురగసాధనువస్తువులెల్లఁ గల్గని
వ్వనజదళాక్షి భాగ్య మనవద్య మిదే గుణధుర్య భార్యయో" 349ప. 2ఆ.

అని తలంచును, ఆమె,

"ఏ వేల్పుఁ గొలిచినారో
యా వేల్పు కటాక్షదృష్టి నరనిమిషములో
శ్రీవిలసితమై సదనం
బీవైభవమునఁ దనర్చె నే నిటులుంటిన్ " 354ప. 2ఆ.

అని తెలుపును. ఇది అతడు "కావున నద్దేవునకు దేవేరివి గమ్మ నాదుదీవన తో"అని దీవించినపుడు, రుక్మిణి "విష్ణుమాయ వాయఁగ శ్రీవెలయఁగ" అతని చేడియను దయతో చూచుట వలన (343ప. 2ఆ.) జరిగినది.

ఇందు పుర (74-91ప. 1ఆ.) నాయికా (3-40ప. 2ఆ.) వర్షాదివసంతర్తు (41-68ప. 2ఆ.) వనవిహార, వారివిహార, మధుపాన (69-124ప. 2ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (234-269ప. 2ఆ.) నాయికావిషాద, సఖీజనానునయ (273-294ప. 2ఆ.) మన్మథాద్యుపాలంభ (294-334ప. 2ఆ.) స్వయంవర (2-48ప. 3ఆ.) శివపూజాదిక (49-73ప. 3ఆ.) యుద్ధ (88-140ప. 3ఆ.) వివాహ (15-71ప. 4ఆ.) సంభోగ (73-94ప. 4ఆ.) కుమారోదయ (127-131ప. 4ఆ.) ప్రభృతి వర్ణనలతోపాటు, లక్ష్మీనారాయణస్తుతి (101-111) లక్ష్మీదండకము (113) మొదలైనవి కలవు. నాయికా వర్ణనమునందు పాత్రానౌచిత్యము లేదుగాని, ఇంతి మధ్యము పరబ్రహ్మము!

"నీవీకాంచిక లుంట నుండుటకు సందేహంబు లేదంచు మి
థ్యావాదంబని యన్నఁ గన్పడదె యం చా సింహమధ్యాభ్రసా
మ్యావిష్కారము సేయఁగాఁ దగదు భావాభావమధ్యంబుగా
భావింపందగు నాతిమధ్యము పరబ్రహ్మంబు చందంబునన్. " 24ప. 1ఆ.

**వెన్నెలకంటి వేంకటాచలము** : ఇతని కృతి కృష్ణవిలాసము. దుర్లభము. ఇతడు వెన్నెలకంటి వెంగనమంత్రి మునిమనుమడు. అతడు తెట్టు సంస్థానాధిపతులు వేజెళ్ల

సర్వాజునకు, వేజెళ్ల కృష్ణమరాజునకు మంత్రి.

"ఘనులు నేగురిలోపల గంగరాజు
అతని పుత్త్రుఁడు వెంగన యనిన వాఁడు
సరసుఁడైనట్టి వేజెళ్ల సర్వఘనుని
మంత్రియై యొప్పె రాజసన్మానమునను."

"వేజెళ్ల సర్వాజు విభవాధిపత్యంబు
పూనిన సర్వజ్ఞపుణ్యమూర్తి
పాలుపొంద నా కృష్ణభూపాలబాలుని
దొరఁజేసికొని కార్య మరసి నడపె
శ్రీరంగరాయలచే నొప్పు గొనితెచ్చి
పంచవన్నెల డాలు పరగఁజేసె
కొండవీటి సరద్దు గుడ్లూరు దనుకను
ఏలించె కృష్ణభూపాలు నెమ్మి
సకలప్రజ్ఞానుదక్షుఁడై జనులఁ బ్రోచె
రాజసమ్మానముల చేతఁ దేజమలరె
బంధుజనముల సకలసంపదలఁ దనిపె
మహితయశుఁడు వెంగనమంత్రియపుడు"

వెంగనమంత్రికి అయిదుగురు కొడుకులు. 1. సూరపరాజు 2. రామన్న 3. గంగయ్య 4. ఉదయ 5. వెంకన్న. ఇందలి రామన్నయే మర్యాదరామన్న.

"రామన్న మరియాదరామన్న వేజెళ్ల
నారాయణేంద్రుండు గారవమునఁ
జనవీయ నాయన సంస్థానకర్తయై
పాలించెఁ బ్రజల సంపదలఁ బొదల
గోలకొండ వజీర్లఁగూడి దుర్గాలపై
ముత్తిక హత్తించి మొత్తి మొత్తి
కడు మన్నె సరదార్ల వడిసెడఁగాఁ గొట్టి
రాజుచే మెప్పులు రమణ నొందె
పాదిలె రంగన్నతోఁగూడి భూము లెల్లఁ
గొట్టి విప్రుల కన్నంబుఁ బెట్టి మించెఁ
గలియుగంబున వెన్నెలకంటి రామ
మంత్రికిని నీడు లేరని మహికి నెక్కె"

ఇందలి నారాయణేంద్రుడు కృష్ణమరాజు తర్వాత తెట్టు సంస్థానాధిపతి అయిన నారాయణరాజు. కృష్ణమరాజు సంస్థానాధిపత్యకాలము[269] 1730-50. అతడు సంస్థానాధిపతి అగు సరికి బాలుడని పయి రెండవ పద్యమునందు కలదు. "బాలుని దొరఁజేసికొని కార్య మరసి నడిపి"న సర్వాజు కాలమును 1730-50. అతని మంత్రి అయిన వెన్నెలకంటి వెంగన కాలమును అదే. నారాయణరాజు సంస్థానాధిపత్యకాలము స్థూలముగ 1750-70. అతని మంత్రి రామన్న కాలమును అదే. వెంగనకు రామన్న ద్వితీయపుత్త్రుడు కనుక సుసంగతము. వెంగన కొడుకులు అయిదుగురును వేజెళ్ల వారి మంత్రులే. కనుక

వెంగన జ్యేష్ఠపుత్రుడు సూరపరాజు మంత్రి అగు కాలము 1750-70 అగును. అతని మనుమడు వేంకటాచలము కవి అగు కాలము 1810-30 అగును. కాఁబట్టి కృష్ణవిలాసము రచనాకాలము 1820 ప్రాంతము కావచ్చును.

కథాభాగమునుండి ఉదాహృతములైన పద్యములు రెండు కలవు. ఒకటి కామ శాస్త్రానుసారము. మఱొకటి చంద్రికావిహారము. రెండవది జక్కన విక్రమార్కచరిత్రము లోని పద్యమునకు అనుకరణము. ఈ మూడు పద్యములకును అనుకరణములైన రెండు పద్యములు "నన్నెచోడుని కుమారసంభవము"నందు కలవు[270]. ఇది గమనార్హమైన విశేషము. కృష్ణవిలాసములోని పద్యములివి :

"నిజరూపరేఖల నెలఁతల వలపించు
    చాతురి గల భద్రజాతివిటులు
వలసిన ధనము లర్వారిగా నొసఁగుచుఁ
    దరుణులఁ గరఁగించు దత్తవిటులు
మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచు
    మగటిమి గల కూచిమారవిటులు
వలరాజ కళలుండు నెలవుల భేదించి
    సతులఁ దేలించు పాంచాలవిటులు
వరుస నందఱు తమ జాతివారి వారి
జాతవదనలఁ గూడి సంజాతమదన
కదనకేళివిహారసంపదలఁ బొదలి
మెదలుదురు పీట నధికసమ్మదము లొదవ. "

"ఆకాశనదియని యనిమిషాంగనలెల్ల
    వేడుకతో జలక్రీడ సలుపఁ
బాల మున్నీరని పంకజనాభుండు
    ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ
బాదరసంబని మోదించి సిద్ధులు
    మించి ఘటంబుల నించికొనఁగ
నమృతంబు సొనని యఖిలామరశ్రేణి
    చెలఁగి పానంబులు సేయుచుండ
వెల్లి విరియుచు నుబ్బుచు విశదకాంతిఁ
బొదలుచును దివ్యమగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చ వెన్నెల విమలమై పెచ్చు పెరిగె. "

మొదటి పద్యమునకు భద్రజాతివిటులు శంఖినీజాతిస్త్రీలను, దత్తజాతివిటులు హస్తినీజాతిస్త్రీలను, కూచిమారజాతివిటులు చిత్తినీజాతిస్త్రీలను, పాంచాలజాతివిటులు పద్మినీజాతిస్త్రీలను కూడిరని తాత్పర్యము.

రెండవ పద్యమునందు జక్కన పద్యములోని "పరమేశు విశ్వరూపం బని బ్రహ్మాదు లమర దండప్రణామంబు లాచరించి" అను సంభావనమునకు బదులు "పాదరసంబని మోదించి సిద్ధులు మించి నించుకొనఁగ" అను సంభావనము కలదు. అందుకు హేతు

వులు కలవు. 1. అది హరవిలాసము. ఇది కృష్ణవిలాసము. 2. కృష్ణుని విశ్వరూపము అచ్చవెన్నెలకు అనుగుణము కాదు. 3. వెన్నెలకంటివారు విష్ణుభక్తివిలసితులు. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము గుఱించి పూర్వోక్తము.

**తాతంభట్టుగురుమూర్తిశాస్త్రి** : ఇతని కృతి కృష్ణామాహాత్మ్యము. ముక్తీశ్వరపురములోని భవానీముక్తీశ్వరస్వామికి అంకితము. కృతిప్రేరకుడు ముక్త్యాల సంస్థానాధిపతి వాసిరెడ్డి చిన వేంకటాద్రినాయుడు. అతని సంస్థానాధిపత్యకాలము[271] 1816-1828. కాఁబట్టి కృష్ణామాహాత్మ్యము రచనాకాలము 1820 ప్రాంతము కావచ్చును.

కవికి ఒక నాడు రాత్రి భవానీసమేతముగ ముక్తీశ్వరుడు స్వప్నమునందు సాక్షాత్కరించి, కృష్ణానది "మహత్త్వ మొక కావ్యముగా రచియించి నా కీవలయున్ "అని కోరును. (24,25ప. 1ఆ.) ఆ మఱునాడు, ఉదయమే చినవేంకటాద్రినాయుడు ఇతనిని రప్పించి, కృష్ణానది "విశ్వాతిపూజ్యంబు కామదమున్ గానఁ దెనుంగుఁగబ్బముగ . . . . ఒక ప్రబంధంబు రచియించి . . . . మక్తీశ్వరునకు నర్పణము సేయుమని"చెప్పును. (36,37ప. 1ఆ.) కవి మూడు ఆశ్వాసముల గ్రంథము రచించెను. ఇది కావ్యము కాదు. ప్రబంధము కాదు. పురాణము. పుక్కిటి పురాణము. ఇందు నారదుడు మునులకు ఇట్లు తెలుపును.

"విలసన్నిర్మలకృష్ణవేణిజలముల్ విశ్వాతిపూజ్యంబు లీ
యిలలో నే నరుఁడైనఁ గ్రావఁ దనదౌ హీనోగ్రదుర్బుద్ధిచిం
తలఁ బాయం గలఁ డా మహామహుని చెంతం జేరఁగా నెంచియున్
మలినాఘౌఘము సోకఁగా వెఱచు షణ్మాసంబు లెంతేనియున్. " 179ప. 2ఆ.

ఇందు కృష్ణానది మహిమలు, తదుపనదుల మహిమలు, తీర్థముల మహిమలు బహు ళములు. శ్రీశైలక్షేత్రమహిమతోపాటు ముక్తీశ్వరక్షేత్రమహిమయును కలదు.

శ్రీకరంబుగ వాసిరెడ్డికులాంభోధి
రాకాహిమాంశుఁడై రహి వహించు
వీరపనేఁడను విశ్వంభరాధీశు
చే వినిర్మితమునై శ్రీ వహించి
ప్రాసాదమధ్య విభ్రాజిత దివ్యసిం
హాసనంబున నుండి యఖిలలోక
ములను సంరక్షించు ముక్తిలింగేశ్వరుఁ
గలియుగం బందునఁ గాంచెనేని
జనుఁడు ముక్తినిఁ జెందు సంశయము లేదు
పద్మసంభవబలిభూమిపతులచేత
సుప్రతిష్ఠితలింగముల్ శోభమాన
ములగుచుండు ముక్తీశ్వరాఖ్యలను దనరి. " 67ప. 3ఆ.

ఇది నారదుడు మునులకు తెలిపినది. క్షేత్రమాహాత్మ్యకావ్యముల మాహాత్మ్యములకు శృంగగ్రాహిక.

**రాయుడప్ప రంగారావు** : ఇతని కృతి సంకల్ప సూర్యోదయము. ఇలవేల్పు కోదండరామస్వామికి అంకితము. దైవాంకితము. ఇతడు బొబ్బిలి సంస్థానాధిపతి. జీవిత కాలము 1790-1830; సంస్థానాధిపత్యకాలము[272] 1802-30. కాఁబట్టి సంకల్పసూర్యో




దయరచనాకాలము 1820 ప్రాంతము కావచ్చును.

సంకల్పసూర్యోదయము వేదాంతదేశికుని సంకల్పసూర్యోదయమునకు తెనుగు సేత. అది దృశ్యకావ్యము. ఇది శ్రవ్యకావ్యము. కావ్యరచనమునకు గరిమెళ్ల సుబ్బయ్య తోడుగా నుండెనట!

**కొటికెలపూడి వేంకటకృష్ణసోమయాజి** : ఇతని కృతులు 1. రఘువంశము. 2. కుమారసంభవము. 3. మేఘసందేశము. 4. దిలీపచరిత్రము. 5. శ్వేతాచలమహత్యము. 6. ప్రబోధచంద్రోదయము. 7. విజ్ఞానేశ్వరము. 8. తారకబ్రహ్మము. ఇందు మొదటి రెండును నామమాత్రావశిష్టములు. ఇతడు బొబ్బిలి సంస్థానాధిపతి రాయుడప్ప రంగా రావు (1802-30) ఆస్థానకవి. ఇతని జీవితకాలము 1765-1838. సోమయాజి అయిన కాలము[273] 1810 వ సంవత్సరము. దిలీపచరిత్రమునందు సోమయాజి అని లేదు. "వేంకటకృష్ణనామధేయప్రణీతం" బనియే కలదు. రాయుడప్ప రంగారావు సంకల్పసూర్యోదయము తెనిగించిన తర్వాత, ఇతడు ప్రబోధచంద్రోదయమును తెనిగించి నట్లు కలదు[274]. కాబట్టి కృతుల రచనాకాలములు రఘువంశము 1795 ప్రాంతము, కుమార సంభవము 1800 ప్రాంతము, మేఘసందేశము 1805 ప్రాంతము, దిలీపచరిత్రము 1810 ప్రాంతము, శ్వేతాచలమహత్యము 1815 ప్రాంతము, ప్రబోధచంద్రోదయము 1820 ప్రాంతము, విజ్ఞానేశ్వరము 1825 ప్రాంతము, తారకబ్రహ్మము 1830 ప్రాంతము కావచ్చును.

**దిలీపచరిత్రము** : ఇది నాలుగాశ్వాసముల స్వతంత్రకావ్యము. ప్రథమాశ్వాసము నందు అయోధ్యాపురవర్ణనము (53-92), దిలీపుని పరిచయము (93), శరదృతువర్ణనము (94-117), దిలీపుని కొలువుకూటము, జైత్రయాత్రానిర్ణయము (118-137), చంద్రాస్తమయాదిసూర్యోదయపర్యంతవర్ణనము (138-147), వందిమాగధకైవారము (148-149), దిలీపుని దినచర్య (153-166) ప్రయాణభేరీప్రకటనము (167) కలవు. ద్వితీయాశ్వాసమునందు దిలీపుని దిగ్విజయయాత్రలు (2-43; 59-159; 201-207), తీర్థయాత్ర (160-200), నర్మసచివుని సముద్రవర్ణన (46-57) నగవర్ణన (211-222) మగధదేశాధిపతి రాజధాని పుష్పపురమునకు దిలీపుని ప్రయాణము (225-237) కలవు. తృతీయాశ్వాసమునందు వసంతర్తువర్ణన (3-25), మగధరాజు తనయ సుదక్షిణ వనకేళి (26-44), జలకేళి (45-68), వీణావాదనము (68), నర్మసచివుడు సుదక్షిణను చూచి దిలీపునికి తెలుపుట (68-77), నర్మసచివుని నాయికావర్ణన (78-113), కర్ణపర్వమైన దిలీపునికి నేత్రపర్వము (114-158) సుదక్షిణచూపులవర్ణన (160-167) సుదక్షిణనాయక వర్ణన (168-188), నాయికానాయకుల పరస్పరవీక్షణవర్ణన (193-195), నర్మసచివుడు సుదక్షిణ ప్రియసఖి సుభాషిణికి దిలీపుని గురించి తెలుపుట (196-201), చెలికత్తెల "చిత్రకలహము" (203-205) దిలీపుని విరహము (210-224), సుదక్షిణ విరహము (225-296) కలవు. చతుర్థాశ్వాసమునందు సూర్యాస్తమయాదిచంద్రికావిహార వర్ణన (4-31) సుదక్షిణవిరహము (32-34), శీతలోపచారములు (34-39), చంద్రమన్మథాద్యు పాలంభములు (40-43), సుభాషిణి రాయబారమునకు బయలు దేరుట (64-65), చెలికత్తెల అనునయము (66-69) సూర్యోదయవర్ణన (70-82), నర్మసచివుని దౌత్యము

అంతర్గతమైన సుభాషిణి దౌత్యము (83-132), సుదక్షిణాదిలీపుల వివాహము (133-196) సమాగమము (197-222) వనవిహారము (223-225) దౌహృదవర్ణన (226-228) కుమారాభ్యుదయము (230-256) రాజ్యాభిషేకము (257) రాజనీత్యుపదేశము (257-318) సుదక్షిణాదిలీపుల వానప్రస్థాశ్రమస్వీకారము (319-320)

సగటు ప్రబంధము. రచన ప్రౌఢము. సరసమైన పద్యము :

"ఆ రాజన్యున కపుడం
భోరుహరాగోపహారములు చొక్కపుఁ గ
ర్పూరపునీరాజనములుఁ
గైరవతోరణములయ్యెఁ గామిని చూపుల్." 162ప. 3ఆ.

**ముప్పిరాల సుబ్బరాయలు** : ఇతని కృతులు 1. ప్రద్యుమ్నచరిత్రము. 2. సావిత్రి చరిత్రము. ద్విపదకావ్యము. అనుపలబ్ధము. 3. భద్రాద్రిరామభద్రశతకము. అనుపలబ్ధము. 4. కృష్ణాభ్యుదయము. అముద్రితము. ప్రద్యుమ్నచరిత్రము హయగ్రీవునికి అంకితము. దైవాంకితము. కృష్ణాభ్యుదయము చక్కిలాల శేషయ్యకు అంకితము. ప్రద్యుమ్నచరిత్రము కృష్ణాభ్యుదయము ప్రతులు చక్కిలాల వేంకటేశయ్య(ం) వ్రాసినట్లు, ఈ గ్రంథాంతములందు కలదు[275].

"శార్వరినామసం॥రం మాఘనెల తే ౧౪ దీల వర్కు
చక్కిలాల వేంకటేశయ వ్రాశ్ని ప్రద్యుమ్నచరిత్ర సంపూర్ణం."
"వికృతినామసం॥ మార్గశిరశుద్ధపంచమీలు వరకు
ముప్పిరాల సుబ్బరాయలు వ్రాసిన కృష్ణాభ్యుదయప్రబంధానకు
వారే శార్వరి నామసం॥ తయినెల ౪ వ తేదీని వేంకటేశయ్య
చేత వ్రాయించినారు. "

ఇందు కృష్ణాభ్యుదయము రచనాకాలము వికృతినామసంవత్సర మార్గశిరశుద్ధ పంచమి అని కలదు. వారము లేదు. పయి లేఖనకాలములందు, కృష్ణాభ్యుదయము తృతీయాశ్వాసము తుదిని కల లేఖనకాలమునందును తేదీల వ్యవహారము కలదు. ఈ వ్యవహారము పందొమ్మిదవ శతాబ్దిని సూచించును. పందొమ్మిదశతాబ్దిని వికృతినామ సంవత్సరము 1830. శార్వరినామసంవత్సరము 1841. కావున కృష్ణాభ్యుదయము రచనాకాలము 1830 వ సంవత్సరము కావలయును. కాఁబట్టి కృతుల రచనాకాలము ప్రద్యుమ్న చరిత్రము 1820 ప్రాంతము, సావిత్రిచరిత్రము, 1825 ప్రాంతము, భద్రాద్రిరామభద్ర శతకము 1827 ప్రాంతము, కృష్ణాభ్యుదయము 1830 వ సంవత్సరము కావచ్చును.

ప్రద్యుమ్నచరిత్రములోని గ్రీష్మర్తువర్ణనపద్యమిది :

"దాక్షిణ్యంబు దొలంగి వాయువు జగత్ప్రాణాఖ్యుఁడై యుండియుం
బ్రక్షోభింపఁగఁజేసె జీవవితతిన్ బాశ్చాత్యసంయుక్తిచే
వీక్షింపన్ ఖలసంగతిన్ సుజనుఁ డుర్విన్ దుష్టుఁడౌనంట ప్ర
త్యక్షంబయ్యె నటంచు వేసవి జనుల్ తర్కింతు రెంతేనియున్. " 61ప. 2ఆ.

చల్లదనమునకు దక్షిణానిలము, వెచ్చదనమునకు పడమటిగాడ్పు ప్రసిద్ధములు. వాయువు జగత్తునకు ప్రాణమను పేరు కలిగియుండియు, దక్షిణదిశాసంబంధము వదలి, పశ్చిమదిశాసంబంధము కలిగి జీవరాశులను మిక్కిలి క్షోభింపఁ జేయుట గ్రీష్మర్తు

లక్షణము. తత్ సమర్థమునందు వాయువు సుజనుడు. పాశ్చాత్య సంయుక్తి ఖలసంగతి. కనుక దుష్టుడు. ఇది సుజనుడైన రాజు పాశ్చాత్యునితో కూడి దాక్షిణ్యము విడిచిపెట్టి ప్రజలను మిక్కిలి క్షోభింపఁజేసిన ఒకానొక చరిత్రాంశమును స్ఫురింపఁజేయును. అది బొబ్బిలియుద్ధమగును. 1757 వ సంవత్సరమునందు జరిగినది. 1795 ప్రాంతమునందు కావ్యమైనది. రంగరాయకదనరంగచరిత్రము. తత్ప్రభావము ప్రద్యుమ్నచరిత్రము రచనా కాలము 1820 ప్రాంతమగుటకు ఆంతరంగిక సాక్ష్యము.

ప్రద్యుమ్నచరిత్రము కృత్యాదిపద్యమునకు (ఇష్టదేవతాస్తుతి) ముందు క్రింది పద్యము కలదు.

> "శ్రీకరముప్పిరాలకులసింధుసుధాకర మిత్రపాకహా
> నోకహ సుబ్బరాయకృతనూత్నసుపద్యబిసప్రసూనజా
> స్తోకమరందబిందువులు సూరిజనాళులు! తృప్తి మీఱఁగా
> నాకలి తీరఁ గ్రోలుఁడు సురావళి మున్ సుధఁ గొన్న కైవడిన్."

ఇది ముప్పిరాల సుబ్బరాయల పద్యము కాకపోవచ్చును. మిత్రపాకహానోకహమన మిత్రుల కల్పతరువు. తాను మిత్రుల కల్పతరువునని తానే చాటుకొనుట కంటె, మిత్రుడు ప్రశంసించుట సహజము. అంతేకాదు. సూరిజనాళిని సంబోధించి, సురలు మున్ను సుధను వలె, సుబ్బరాయల కృతిలోని మరందబిందువులు క్రోలుడని సుబ్బరాయలే ప్రకటించుట కంటె, మిత్రుడు ప్రకటించుటయే సహజము. ఇది బహుశః ప్రతివిలేఖకుడు చక్కిలాల వేంకటేశయ్య పద్యము కావచ్చును.

ప్రద్యుమ్నచరిత్రము రుక్మవతీపరిణయమే. వైశంపాయనుడు జనమేజయునికి చెప్పిన హరివంశకథగా కలదుగాని (24ప. 1ఆ.), ప్రాధాన్యవివక్షను భాగవతకథయే. ఇందు పూర్వకవుల పదపద్యానుసరణములు కలవు. అందు అల్లసాని పెద్దన మనుచరిత్ర పద్యానుసరణము అగ్రేసరము. అది మాయావతి తాను రతిదేవినని మన్మథుడైన ప్రద్యుమ్నునికి ఎఱిగించుకొను సందర్భములోనిది.

> "ఆ రామామణి యొక్కనాఁడు నవపుల్లాంభోజనేత్రాత్మజాం
> డారామస్థలి నొంటి నుండఁ గని మారాస్త్రానలజ్వాలికా
> వారంబుల్ పయిఁగ్రమ్మ సైపకను శేవం గౌంగిలింపంగ "హా
> శ్రీరామా" యని త్రోచి సైచి పలికెం జిత్తంబునన్ రోయుచున్. " 42ప. 2ఆ.

ప్రద్యుమ్నచరిత్రము వర్ణనాభూయిష్ఠము.

పుర (28-47ప. 1ఆ; 3ప. 4ఆ.) శ్రీకృష్ణ (48-53ప. 1ఆ.) విష్ణు (11వ. 4ఆ.) కుమారోదయ (54-61ప. 1ఆ.) వసంతర్తు (3-24ప. 2ఆ.) నాయక (25-35ప. 2ఆ.) విరహ (36-41ప. 2ఆ; 89-104ప. 4ఆ.) గ్రీష్మర్తు (51-72వచ. 2ఆ.) యుద్ధ (78-95. 2ఆ.) నదీ (3-8ప. 3ఆ.) సముద్ర (9-14ప. 3ఆ.) నగ (15-20ప. 3ఆ.) పౌరాంగనావిలోకన (25-31ప. 3ఆ.) వర్షర్తు (61-82ప. 3ఆ.) శరదృతు (84-100వచ. 3ఆ.) దశావతార (14-24ప. 4ఆ.) నాయికాజనన (28-30ప. 4ఆ.) నాయికాసౌందర్య (31-57ప. 4ఆ.) హేమంతర్తు (71-88ప. 4ఆ.) వన (111ప. 4ఆ.) వనవిహార (112-118ప. 4ఆ.) పుష్పాపచయ (119ర. 4ఆ.) సరోవర (122-123ప. 4ఆ.) జలవిహార (124-138ప. 4ఆ.) మన్మథపూజా (140ప. 4ఆ.) శిశిరోపచార (142-144ప. 4ఆ.)

సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (3-24; 82-98ప. 5ఆ.) స్వయంవర (3-21ప. 6ఆ.) వివాహసన్నాహ (22వచ-44వచ. 6ఆ.) వివాహ (45-65ప. 6ఆ.) ప్రయాణ (46-74వచ. 6ఆ.) శోభన (75-81ప. 6ఆ.)సంభోగ (82ప. 6ఆ.) వర్ణనలు కలవు.

**కాకరపర్తి కృష్ణయ** : ఇతని కృతులు 1. ముఖలింగక్షేత్రమాహాత్మ్యము. 2. తారావళి. 3. శశిరేఖాపరిణయము. మొదటిది ముఖలింగేశ్వరునికి అంకితము. రెండవది స్తోత్రము. నిరంకితము. మూడవది శ్రీరామాంకితము. దైవాంకితములు. ఇతడు కాకరపర్తి తిరుపతిపాత్రుని కుమారుడు. అతని సత్యభామాకృష్ణసంవాదము రచనాకాలము 1785 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి ముఖలింగక్షేత్రమాహాత్మ్యము, తారావళి రచనాకాలము 1820 ప్రాంతము, శశిరేఖాపరిణయము రచనాకాలము 1825 ప్రాంతము కావచ్చును.

**ముఖలింగక్షేత్రమాహాత్మ్యము** : ముఖలింగక్షేత్రమునకు జయంతి క్షేత్రమని నామాంతరము. తన్మాహాత్మ్యమును ప్రతిపాదించు ముఖలింగక్షేత్రమాహాత్మ్యమునకు మూలము స్కందపురాణోత్తరఖండమని కలదు. (3పుట.) స్కందపురాణోత్తరఖండము బ్రహ్మోత్తరఖండమని పూర్వోక్తము. అందు ముఖలింగక్షేత్రమాహాత్మ్యము లేదు. అసలు ముఖలింగక్షేత్రము వంశధారనదీతీరమునందు మధుకవృక్షమయమైన అరణ్యము. మధుక వృక్షమునందు వెలసిన మహేశ్వరుడు మధుకేశ్వరుడు. అచట వెలసిన అనేక శివలింగము లందు మధుకేశ్వరలింగము ముఖ్యలింగము. కనుక ముఖలింగము. మధుకవృక్షము నందు మహేశ్వరుడు వెలయుటకు నిమిత్తమాత్రులు చిత్రి, చిత్కళ, చిత్రకాయకులు. చిత్రిచిత్రకాయకులు శబరదంపతులు. చిత్రకాయకుని ద్వితీయకళత్రమైన చిత్కళ శ్రీశైలమునందు జన్మించిన జంగమురాలు. శబరులు శప్తగంధర్వు లగుట పురాణమహిమ.

శ్రీశైలమునందు జన్మించి, శీలము తప్పని చిత్కళ కాశీయాత్రకు బయలుదేరి, దారి తప్పి, చిత్రకాయకునితో శ్రీశైలము గుఱించి తెలిపిన విశేషమిది:

"శబరనాయక! వినుము శ్రీశైలమనఁగ
నలరు సుక్షేత్ర మొక్కటి యచట నున్న
స్త్రీపురుషు లంచితాద్వైతచిత్తు లగుచు
వెలయుచుందురు కామాదివిషయములను." పుట 21

శబరులకు అధిపతి, "ధర్మవంతుడు"ను అయిన చిత్రకాయకుడు ఆమెను చూడగానే మరులుకొని అభివర్ణించిన ఒక అపూర్వాంశమిది :

"తరళాక్షి! నీదు నిద్దంపు పెన్నెరిగుంపు
నీలాచలంబయి నెగడుచుండు
సరసిజానన! నీ విశాలాక్షియుగ్మ మా
శ్రితపుండరీకమై చెన్ను మీరు
మగువ! నీ మహనీయమధురాధరం బాత్మ
నరయ ద్రాక్షారామమై చెలంగు
తరుణి! నీదు మహోన్నతపయోధరంబులు
మేరుహిమాద్రులై మీరుచుండు
చెలువ! నీ మధ్య మనుగతసింహగోత్ర
మింతి! నీ యూరు కాశియౌ నిట్టు లగుచు

వచ్చు వారల కెల్లను వలసినట్లు
క్షేత్రమగు నీకు వేఱొక్క క్షేత్రమేల? " 22పు.

కడకు చిత్కళ కాశీయాత్రకు స్వస్తి చెప్పి, చిత్రకాయకునికి ద్వితీయకళత్రమగును. చిత్తి నిమిత్తముగ, చిత్రకాయకుడు చెఱిసగము పంచిన మధుకవృక్షమును నఱుకఁ బోయిన మహేశ్వరుడు ప్రత్యక్షమగును. విశ్వకర్మదేవాలయాదికములను నిర్మించును. పురము వెలయును. ఆ దేవాలయాదికములు "కలియుగంబు ప్రవేశింప భూగతంబు"లయిన (67పు.) "కటకపురాధీశ్వరుడు గంగాన్వయపావనుడు" మఱల కట్టించునని కలదు. (67-68ప.) అంతేకాదు. "తదనంతరంబున తదీయాన్వయసంజాతులగు భూపతులు పర్లాకిమిడె యను పురంబు తమకు రాజధానియై తనర" ప్రకాశింపఁజేతురని కూడ కలదు. (96పు.) ఇవి చరిత్రాంశములు.

**తారావళి** : ఇది ముఖలింగేశ్వరస్తోత్రము. ఇరువది యేడు కందపద్యములు కలవు. కనుక తారావళి. ప్రతిపద్యమునకు "శ్రీముఖలింగా" అను సంబుద్ధి కలదు. ఇరువది యేడు పద్యములందును ఇరువది యేడు నక్షత్రముల పేరులును వరుసను ఇమిడింపఁబడినవి.

"శ్రీసురుచిరసుర్శైలశ
రాసననిగమాశ్వినిర్జరాధిపచిత్తో
పాసితసదసదమృతల
క్ష్మీసదనదయాంతరంగ శ్రీముఖలింగా" ౧
"తావకపాదధ్యానము
రేవతివిపదంబుధిం దరింపనవుగదా
దేవేంద్రాదులకైనను
సేవకహృదయాబ్జభృంగ శ్రీముఖలింగా"

**శశిరేఖాపరిణయము** :- ఇది కృతికర్త కృతిభర్తకు, చెప్పినట్లు కలదు. ప్రథమాశ్వాసమునందు వైశంపాయనుడు జనమేజయునికి చెప్పిన భారతములోని సభాపర్వము దిఙ్మాత్రముగ కలదు. (పు.3-13) అది ప్రధానకథకు అతిమాత్రము. ప్రధానకథ ప్రారంభము సహజసుందరము. (పు. 13-15) ఒకనాడు దేవకి, యశోద, రేవతి, రుక్మిణ్యాదులు, సుభద్ర మేడమీద వీణ వాయించు శశిరేఖను చూతురు. దేవకి,

"బాలికామణి నరయంగ బరిణయార్హ
కాల మగుటను ధరణిపై గలుగు రాజ
తనయవరులందు దీనికి తగిన వరుని
మీర లూహింపు డందరు నారులార"
అని, తానే-
"అన్యుని వెదకంగ నేటికి
మాన్యుడు శతమన్యు కూర్మి మనుమ డఖిలరా
జన్యశిఖామణి మన యభి
మన్యుడు సామాన్యుడే సమస్తగుణములన్"

అని వివరించును. అందఱు సమర్థింతురు. సుభద్ర సంతసించును. అంతలో

బలరాముడు వచ్చి, వారి సల్లాపములను తెలుపుడని అడుగును. రుక్మిణ్యాదులు తొలగినను, ఉన్న దేవకి, యశోద, రేవతి మాటాడరు. సుభద్రయే తెలిపి, బలరాముని అభిప్రాయమును కోరును. బలరాముడు పాండవులను నిరసించి,

"నా తనయ నిపుడు దయచే
నీ తనయునికి నొసగితె వని న్వారలతో
కూతురు నల్లుడు నిడుమల
చేత గృశించుటయే గాక సిరి నలరుదురే "

అని, ఆ తలంపు విడిచిపెట్టుమని వెడలిపోవును. సుభద్ర దుఃఖించును. "మీ పై నమ్మాధవు కృప గల"దని దేవకి ఓదార్చును.

ద్వితీయాశ్వాసమునందు శశిరేఖ చిలుక వేట, అభిమన్యుని రాకపోకలు, శశిరేఖ విరహము కలవు. కేవలము శృంగారఘట్టము. "శృంగారప్రబంధంబు నిర్మింపం బూని"నందుకు సార్థకము. (పు. 2.) ముఖలింగక్షేత్రమాహాత్మ్యములోని స్త్రీవర్ణనమును మించిన స్త్రీవర్ణనము కలదు. ఒక సదృశాంశము :

"ఈ భామ ఘనవేణికాభారమును జూచు
    సరసాళులకు నీలశైల మేల
ఈ యింతి కుచముల నీక్షించు వారల
    కరయంగ శీతశైలాదు లేల
ఈ రామ రమణీయరోమరాజిని జూడ
    నాశించు వారికి కాశి యేల
ఈ కొమ్మ వళుల నాలోకించు వారికి
    గంగాతరంగప్రసంగమేల
దీని జఘనంబు జూచిన మానవులకు
లోలతను భూప్రదక్షిణమేల దీని
మృదులతాంచత్పదాగ్రముల్ వదల కెపుడు
కూర్మి గనువారలకు వేరె కూర్మమేల "  22పు.

ఇది శశిరేఖను అభిమన్యుడు అభివర్ణించిన తీరు. అంతేకాదు. "వేత్రధరసంఘము పార్శ్వములందు గొల్వగా" వచ్చిన అభిమన్యుడు

"అలికులవేణి యిట్టి సమయం బిపు డెన్నడు నెంచి చూడగా
గలుగదుసుమ్ము నా పలుకు గట్టిగ నెమ్మదియందు నమ్మి నీ
చెలులిట రాకమున్నె దయచే మరుకేళికి సమ్మతించినన్
వలసినయట్లు వర్తిలగ వచ్చును గాదె సరోజలోచనా "

అని ఒంటరిగా వచ్చిన శశిరేఖను అడుగును. ఒకటి రెండు అశ్లీలతాస్ఫోరకమైన పద్యములును కలవు. శశిరేఖ ఇంచుమించు తెల్లవాఱు వఱకును సఖీజనుల సమక్షమున మహావిరహావస్థ నందును.

చతుర్థాశ్వాసమునందు ప్రధానకథయే కలదు. లక్ష్మణుని తోడి వివాహమునకు గౌరీపూజ సేయు శశిరేఖను చూచి సుభద్ర,

"ఘనమగు తద్విభవము గను
గొనగా జూదమున నోడి కుంతీతనయుల్

వని కేగు నాటి వగ కం
టెను మిక్కిలియై సుభద్ర డెందము గలచన్.
కినుక నవు డచట నుండక
తనయుండును తాను సాంద్రతావళవనికిన్" పు 40

చనినట్లు కలదు.

పుణ్యాంగనలు శశిరేఖను "గౌరీతపంబునకు తండులయుక్తపిటకంబున నధివసింప జేసిన"ట్లు కలదు. (పు. 40) అంతేకాదు. ఘటోత్కచుడు శశిరేఖాకృతి గైకొని పిటకము నందు కూర్చుండినట్లు, అబల లెత్త బుట్ట బరువయినట్లు, వారు బలరామునికి తెలిపి నట్లు, బలరాముని మాటలకు ఘటోత్కచుడు తనకపటవృత్తి నెరిగిన వచ్చిన పని చెడునని లఘుత వహించినట్లు కలదు. (పు. 43) ఈ పిటకవ్యవహారము క్షత్రియవివాహవిధము కాదు.

వివాహవేదిక మీద వధువు బెబ్బులి వలె, భూతము వలె, రాక్షసి వలె, మర్కటము వలె, భల్లూకాదిబహుజంతువుల వలె కనిపించుటవలన, లక్ష్మణుని వివాహమునకు విఘ్నమేగాక, దుర్యోధనాదులకు యుద్ధమును సిద్ధమై వెడలిపోవుదురు. శ్రీకృష్ణుడు శశిరేఖను అభిమన్యుని కిచ్చి, వివాహము చేయుటకు బలరాముని ఒప్పించును. శశిరేఖా భిమన్యుల వివాహమునకు ఇంద్రాదులతోను, సోదరులతోను ధర్మరాజా సమయభంగ సంశయము లేకుండ వచ్చును. (పు 47-51)

ఇందు పుర (పు. 3-5) సూర్యాస్తమయ, వసంతర్తు (పు 16-17) నాయికాసౌందర్య (పు. 47-51) నాయికావిరహ (పు. 25-34) సూర్యోదయ (పు. 58-59) ప్రభృతివివాహేతర కతిపయవర్ణనలు కలవు.

శైలి సరళము. సహజత్వము సక్సన్మాత్రము. శృంగారప్రధానము

**అల్లమరాజు రంగధాముడు** : ఇతని కృతి నారాయణాచలమాహాత్మ్యము. అముద్రితము. ఎనుముల చిన బాపనదొరకు అంకితము. అతడు 1822 వ సంవత్సరము నందు ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వమునకు ఒక విజ్ఞాపనపత్రము పంపినట్లు కలదు[276]. ఇతడు దంతులూరి బాపిరాజు మూర్తిత్రయోపాఖ్యానమునకు 1817 వ సంవత్సరము నందు ప్రతి లిఖించి ఇచ్చినట్లు పూర్వోక్తము. ఇతని కుమారుడు అల్లమరాజు సుబ్రహ్మ ణ్యము మాడుగుల సంస్థానాధిపతి కృష్ణభూపతి (1853-75) ఆస్థానకవి. ఇది ముందు వివరింతును. కాబట్టి నారాయణాచలమాహాత్మ్యము రచనాకాలము 1825 ప్రాంతము కావచ్చును.

నారాయణాచలము తోటపల్లి సంస్థానములోనిది. అచటి దైవము శ్రీవేంకటేశ్వర స్వామి. ఆ క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించు క్షేత్రమాహాత్మ్యకావ్యము నారాయణాచల మాహాత్మ్యము.

**చాటరాతి లక్ష్మీనరుసు** : ఇతని కృతులు 1. విజయరామచరిత్రము లేక విజయరామయశోభూషణము. అనుపలబ్దము. 2. ఈశ్వరీపరిణయము. అనుపలబ్దము. 3. విశేషాంధ్రము. నిఘంటువు. 4. భండనారాతిభీమశతకము. మొదటిది అనుపలబ్దమే. కాని, ఉపలబ్ధమైన కర్తృనిర్దేశము లేని ఒక ఆశ్వాసము, అందులోని భాగము కావచ్చును.

ఇందు ఆశ్వాసాదిపద్యము కలదు. అందు "పూసపాటి నారాయణగజపతీంద్రనరనాథేంద్రా"అను సంబుద్ధి కలదు. "అవధరింపు" మను వచనము లేదు. ఆశ్వాసాంతపద్యము కలదు. అందు రాజసంబుద్ధి కలదు. రాజనామము లేదు. నారాయణగజపతియే అగును. ఆశ్వాసాంతపద్యములకు ముందు, "తదనంతరక. . . . రేంద్రునకు దేవర్షి పుంగవుండిట్లనియె" అని కలదు. (303వచ.) "తదనంతరక . . . " తదనంతరకథ అగును. ". . . . రేంద్రునకు" సురేంద్రునకు అగును. దేవర్షిపుంగవుడు నారదుడు. దిట్టకవి నారాయణ రంగారాయకదనరంగచరిత్రము వలె, చాటరాతి లక్ష్మీనరుసు విజయరామ చరిత్రము లేక విజయరామయశోభూషణము నారదుడు ఇంద్రునికి చెప్పినదగును. ఆశ్వాసాది పద్యము మాత్రమే కలది సాధారణముగ ప్రథమాశ్వాసము కాదు. తదనంతరకథ కలది అంతిమాశ్వాసము కాదు.రంగారాయకదనరంగచరిత్రము వలె విజయరామ చరిత్రము లేక విజయరామయశోభూషణము మూడాశ్వాసముల కావ్యమగును. ఇది కూడ కదనరంగ చరిత్రమే. కనుక ఉపలబ్ధమైన ఒక ఆశ్వాసము విజయరామచరిత్రము లేక విజయరామయ శోభూషణములోని ద్వితీయాశ్వాసమగును. అది ముద్రితమైన పద్మనాభ యుద్ధము. ఆశ్వాసాదిపద్యమునుబట్టి విజయరామచరిత్రము లేక విజయరామయశోభూ షణము విజయరామగజపతి (1749-1794) కుమారుడైన నారాయణగజపతికి అంకితము.

పద్మనాభయుద్ధము 1794 వ సంవత్సరమునందు జరిగినది[277]. అప్పటికి నారాయణగజపతి వయస్సు ఎనిమిదేండ్లు. కావ్యమునందు "నారాయణబాబు"ను "బాలుండవు"అని విజయరామరాజు అనినట్లు కలదు. (77, 91ప.) కాని, విజయ రామరాజు మరణించిన వెంటనే, అతడు శత్రువులను సంహరింతునని శపథము చేసినట్లు (297, 298ప.) మఱునాడు "యుద్ధసన్నద్ధుండై . . . . . . పరాపహరణవాక్యప్రౌఢిఁగావింపుచున్ " కొలువు చేసినట్లు కావ్యమునందు కలదు. (302ప.) ఇది వయోవిరుద్ధమే కాదు; చరిత్రవిరుద్ధము కూడ, నారాయణబాబు కుటుంబము సపరివారముగ పలాయనము చిత్తగించి, పరిశ్రయణము పడసినట్లు పూసపాటి కైఫియతులందు కలదు[278]. కనుక యుద్ధకాలమునకు కావ్యము సమీపకాలికము కాదు. అంతేకాదు. నారాయణగజపతి సంస్థానాధిపతి అయిన కాలము 1802-45 అయినను, అతడు 1817-22, 1827-45 నడుమ సంస్థానమును ఈస్టిండియాకంపెనీ ప్రభుత్వమునకు అప్పగించి, కాశీ నగరమునందు నివసించెను. కాఁబట్టి కృతుల రచనాకాలములు విజయరామచరిత్రము లేక విజయరామయశోభూషణము-పద్మనాభయుద్ధము-1825 ప్రాంతము. ఈశ్వరీపరిణయము 1830 ప్రాంతము, విశేషాంధ్రము 1835 ప్రాంతము, భండనారాతి భీమశతకము 1840 ప్రాంతము కావచ్చును.

**పద్మనాభయుద్ధము** : పద్మనాభము అను ప్రదేశమునందు జరిగిన యుద్ధము పద్మనాభయుద్ధము. అది విజయనగరసంస్థానమునకు, ఈస్టిండియా కంపెనీకి మధ్య జరిగిన యుద్ధము. కారణము జమాబందీ వంకను ఈస్టిండియా కంపెనీ సామ్రాజ్యకాంక్ష. విజయనగరసంస్థానము తరపున వివిధసంస్థానములును పాల్గొనుట విశేషము. అవి:

"సాలూరు మక్కువ పాలేరు బొబ్బిలి
బస్తరు గొల్కొండ పాలకొండ

మేరంగి కురపాము వీరఘొట్టా మాంద్ర
మాడుగుల్ రాంపెల్లి తేడకవిశె
పోరాము వడ్డాది పారాది గుణుపూరు
కాశీపురంబు శృంగావరకోట
ప్రజల నారాయణపట్టంబు చీకటి
చామర్లకోటయు జయపురంబు" 64పు. 1ఆ.

అయినను "కుంఫినీ" ఫిరంగి కాల్పులకు వీరాధివీరులు ఎందఱెందఱో వీరస్వర్గము లలంకరించిరి. విజయరామరాజు కూడ వక్షమునందు ఫిరంగి గుండు చొరబడి వీరస్వర్గ మలంకరించెను. ఇది చారిత్రికసంఘటన. ఇందుకు విజయరామరాజు స్వప్నవృత్తాంతము, విష్ణుసాయుజ్యవృత్తాంతము విశ్వాసపూర్వకములైన కల్పనములు. దేవతలు ఆకాశము నందుండి యుద్ధమును వీక్షించుట సంప్రదాయవర్ణనము.

ఇది వీరరసప్రధానము. ఇందు హవాలుదారులు (14) నేజాలు (28) ఝుడా (44) కుంపిణీ (61) షతురు (64) ఫిరంగులు (125) హెలుదారులు (130) తుకిడీలు (159) మిార్బకిషీలు (165) చెకుముకీబారులు (202) తుపాకులు (208) ఘటాబులు (274) మొదలైన అన్యదేశ్యములు అనేకము. అంతేకాదు. ఇంగ్లీషుపదములును అధికము అవి[279] : కుంపినీ, కుంపుణీ (company), లయను (Loion), ఫయరు (Fire), ఆప్సరులు (Officers), కెప్తాను (Captain), కర్నేలు (Cornal), మేస్తరుకలకటేరి (Mr. Collector), కంసలేరి (Council), రసీదు (Receipt), మొదలైనవి.

**కాళ్లకూరి గౌరీకాంతము** : ఇతని కృతి ధర్మనందనవిలాసము. వెలిచేరి గురురాయ మూర్తికి అంకితము. అతడు విజయనగరసంస్థానాధిపతి నారాయణ గజపతి (1794-1845) దండనాయకుడు. కాఁబట్టి ధర్మనందనవిలాసము రచనాకాలము 1825 ప్రాంతము కావచ్చును.

ధర్మనందనవిలాసము మూఁడాశ్వాసముల శృంగారకావ్యము. ధర్మరాజు, జనకరాజు తనయ కళావతిని వివాహమాడుట ఇతివృత్తము. ఇంద్రప్రస్థపురాధిపతి ధర్మరాజు వర్ణన ము. మిథిలానగరాధిపతి జనకరాజు వర్ణనము, ఇతడు సంతానము కొఱకు శివుని గుఱించి తపస్సు చేయుట, శివుడు ప్రత్యక్షమై వరమొసగుట ప్రథమాశ్వాసము. కళావతి జననాదిక వర్ణనము, కళావతీధర్మరాజుల పరస్పరానురాగము, యోగానందుని రాయ బారము, విరహము, స్వయంవరము ద్వితీయాశ్వాసము. వివాహసన్నాహము, ప్రయా ణము, శ్రీకృష్ణ దర్శనము, వివాహము, పురప్రవేశము, శోభనము, కుమారోదయము తృతీయాశ్వాసము. ఇది భారతప్రోక్తము కాదు. ప్రసిద్ధమును కాదు. కల్పితము. సగటు ప్రబంధము సరణి

"ఓంకారపంజరశుకీ
ముపనిషదుద్యానకేళికలకంఠీమ్
ఆగమవిపినమయూరీ
మార్యామంత ర్విభావయే గౌరీమ్."

అను ప్రసిద్ధమైన శ్లోకమునకు ఆంధ్రీకరణమిది:

"వందనం బుపనిషద్భృందోపవనపాళి

కాకేళికానీలకంఠి కిపుడు
వందనం బోంకారవరరత్నపంజరాం
తరనిరంతరముదాదరణశుకికి" 131ప. 2ఆ.

పుర (1, 141ప. 1ఆ.) నాయక (120-140ప. 1ఆ.) నగ (146-150ప. 3ఆ.) హేమంతర్తు (152, 153ప. 1ఆ.) గ్రీష్మర్తు (155-161ప. 1ఆ.) సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంత (89-99; 131-135ప. 2ఆ.) నాయికావిరహ (100-109; 113,114ప. 2ఆ.) ప్రయాణ (144,145ప. 2ఆ.) వివాహ (9-56ప. 3ఆ.) సంభోగ (86-96ప. 2ఆ.) కుమారోదయ (98,99ప. 3ఆ.) వర్ణనలు కలవు.

**నడిమింటి రామయోగి** : ఇతని కృతులు 1. ఉషాపరిణయము లేక బాణాసుర యుద్ధము గేయప్రబంధము. 2. కల్యాణదండకము. ఇతడు విజయనగరసంస్థానాధిపతి నారాయణగజపతి భార్య రాణి కొండమాంబకు గురువు. నారాయణగజపతి కాలము[280] 1794-1845. కాఁబట్టి ఉషాపరిణయము లేక బాణాసురయుద్ధము రచనాకాలము 1825 ప్రాంతము, కల్యాణదండకము రచనాకాలము 1830 ప్రాంతము కావచ్చును.

**చెళ్లపిళ్ల నరసయ** : ఇతని కృతులు 1. ఏకప్రాసకందగోపాలశతకము. 2. అహల్యా సంక్రందనవిలాసము. యక్షగానము. 3. ఏకాంతసేవాకలాపము. యక్షగానము. 4. యామినీపూర్ణతిలకావిలాసము. 5. వేంకటేశ్వరవిలాసము. ఇందు మొదటి మూడును అనుపలబ్ధములు. చివఱి రెండును శ్రీరామాంకితములు. దైవాంకితములు. ఇతడు పిఠాపురసంస్థానాధిపతి రావు వేంకటనీలాద్రి రాయనిచే సత్కారమునంది, ప్రసిద్ధుడైనట్లు యామినీపూర్ణతిలకావిలాసమునందు కలదు. (20ప. 1ఆ.) అతనికాలము 1795-1840. ఇతడు "1780 వ సంవత్సరమున జన్మించియుండును. . . . 54 సంవత్సరములు జీవించెను. . . . . 1835 వ సంవత్సరమున జీవించియుండుననుట ధ్రువము."అని ఇతని మునిమనుమని అభిప్రాయము[281]. కాఁబట్టి కృతుల రచనాకాలములు ఏకప్రాసకంద గోపాలశతకము 1815 ప్రాంతము, అహల్యాసంక్రదనవిలాసము 1820 ప్రాంతము, ఏకాంతసేవాకలాపము 1825 ప్రాంతము, యామినీపూర్ణతిలకావిలాసము 1830 ప్రాంత ము, వేంకటేశ్వరవిలాసము 1835 ప్రాంతము కావచ్చును.

**యామినీపూర్ణతిలకావిలాసము** : ఇది బిల్హణచరిత్రమునకు అతిస్వతంత్ర మైన, అతివిస్తరమైన అనుసరణము. నూట యేబది యొకటి శ్లోకముల సంస్కృతకథ, తొమ్మిది వందల యేడు పద్యగద్యముల తెలుగుగాథ అయినది. ఆఱింతలు గ్రంథము పెరిగినది. నూఱింతలు గంధము తరిగినది. అనుప్రాసముల అట్టహాసములు అసంఖ్యాకము.

"ఒక పాలి ఒక బాలికకు జాలి మదిఁ జిల్కఁ
జిల్కల గమికి రాఁ బల్కుఁ బల్కు
ఒక మాటనక తేట నకలాట లిడు నెమ్మి
నెమ్మి కొమ్మల కాదరమ్ముఁ గ్రమ్మ
నొక వేళ నొక పాళముకు మేళముగఁ గోరి
గోరికలకు పాటఁ గూర్చు నేర్చు
నొక సారి సుకుమారి బకదారి మూఁకల
కలరవంబులఁ దీర్చుఁ గనుచు మనుచు

నెనరు టంచకు గతుల పొందికలు గూర్చి
సరసములు నేర్చి సరసవైఖరులఁ జేర్చి
భావములు దార్చి మదిని వైభవముఁ జేర్చి
యలరుఁగన్నియ కన్నె ప్రాయంబునందు " 103ప. 1ఆ.

యమకముల గమకములు సమధికము.

"ఘనకబరీస్తనాకృతులు కందరమై దరమై రమైక్యమై
జను మది కంఠవక్త్రములు సాదరమౌ దరమౌ రమాకమౌ
దినుసుగ వాక్సితాంగములు తేనెలతో నెలతో లతోక్తితో
నెనయగు నాభిజంఘగతి హేమకరి న్మకరిన్ గరిన్నగున్. " 68ప. 2ఆ.

యామినీపూర్ణతిలక సఖీసమేతముగ సలిపిన వనకేళి, పుష్పాపచయము, జలకేళి, మన్మథపూజ, దురోదరక్రీడ మొదలైనవి కథకు ప్రయోజనకరములు కావు. మన్మథపూజ యందు,

"కళలు చిగుర్ప పూర్ణతిలకామణి కస్తురిచే సహస్రకో
మలదళపద్మ మేర్పఱిచి మధ్యమునన్ రతిమన్మథాకృతుల్
దలఁచి లిఖించి నిల్పె తదుదారమనోహరరూపయౌవనో
జ్జ్వలగురువల్లభున్ గదిసి చక్కఁగ దా నటులుండు టేర్పడన్. " 120ప. 3ఆ.

అని కలదు. ఇంతవఱకు యామినీపూర్ణతిలక గురువల్లభుడు బిల్హణుని ముఖము చూడలేదు. జాత్యంధుడని విశ్వసించినది. అయినను కవి ఆశంసనము!

పూర్వోదాహృతమైన, ప్రసిద్ధమైన "అఙ్కం కేఽ పి శశఙ్కిరే" అను శ్లోకమునకు ఆంధ్రీకరణమిది:

"అంకముగాఁగ కొంద అమృతాంబుధిపంకము గాఁగఁ గొంద తే
ణాంకము గాఁగఁ గొంద అచలాసితకాంతిగఁ గొంద తెన్నుచున్
శంకలు పల్కుచుందురు శశాంక భవజ్జఠరాంతరాళనీ
లాంకముఁ జూచి రాత్రికబళాంధతమం బని నేఁ దలంచెదన్." 65ప. 4ఆ.

ఇందు "భూచ్ఛాయ మైచ్ఛన్ పరే" అనునది లేదు. దళితేంద్రనీలశకలశ్యామ సామ్యమును లేదు. "నిశిపీతమంధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే" అనునది అటు నిటు అయినది.

యామినీ పూర్ణతిలకాబిల్హణుల రహఃకేళి వర్ణనము కామశాస్త్రమునకు ప్రయోగశాల. చుంబన భేదములు, బంధనభేదములు ప్రదర్శితములు.

అతిప్రసిద్ధమైన అద్యాపిశ్లోకముల అనుసరణము కలదుగాని, అస్థానపతితము. బిల్హణుడు శ్మశానమునందు తన్ను వధించుటకు ఖడ్గము పట్టిన కోటిపాలుని చూచి మందహాసము చేయును. కోటిపాలుడు తత్కారణ మడుగును. యామినీపూర్ణతిలక అను దేవతను స్మరించుట వలన తనకు భయములేదని, బిల్హణుడు అద్యాపిశ్లోకములు ఏబదియాఱు ఆశువుగ చెప్పి,

"పఞ్చత్వం తను రేతు భూతనివహా స్వాంశా మిళన్తు ధ్రువం
ధాత స్త్వాం ప్రణిపత్య సాదరమిదం యాచే నిబద్ధాఞ్జలిం
తద్వాపీషు పయ స్తదీయముకురే జ్యోతి స్తదీయాఙ్గణే
వ్యోమ స్యాచ్చ తదీయవర్త్మని ధరా తత్తాళవృన్తేఽ నిలః"

(తనువు పంచత్వమును పొందుగాక! పంచభూతముల (పృథివ్యప్తేజోవాయ్వాకాశములు) సమూహమునందు తమ తమ భాగములు తప్పనిసరిగా కలియునుగాక! ఓ బ్రహ్మ! నీకు బద్ధాంజలి ఘటించి, నమస్కరించి, ఆదరము కల నిన్ను అర్థించు చున్నాను. ఆమె దిగుడు బావియందు నీరు, ఆమె చేతి అద్దమునందు తేజస్సు, ఆమె సన్నిధిని ఆకాశము, ఆమె నడయాడుమార్గమునందు భూమి, ఆమె చేతి విసనకఱ్ఱయందు వాయువు (పంచభూతాంశములు) కలియునుగాక!)

అను శ్లోకమును పలికిన, యామినీపూర్ణతిలకాబిల్హణులు అపారప్రేమానుబంధము నకు రాజభటు లందఱును సానుభూతి కలిగి, రాజధానికి పరుగెత్తుకొనిపోయి, కవీంద్రుని కాపాడుమని కోరగా, రాజు ప్రసన్నుడై, బిల్హణుని రప్పించి, యామినీపూర్ణతిలక నిచ్చి వివాహము చేసినట్లు బిల్హణచరితమునందు కలదు. అద్యాపిశ్లోకముల ఘట్టము కరుణ రసశబలితము. సన్నివేశసుభగము. అట్టిది బిల్హణుడు రాజభటులతో నేగు దారిలోనే, అతని స్వగతముగ యామినీపూర్ణతిలకావిలాసమునందు కలదు. మంత్రి, రాణి కావించిన ప్రబోధమున రాజు ప్రసన్నుడైనట్లు అన్యథాకల్పనము! మూలమునందలి జిగిబిగి అనుసరణమునందు గజిబిజి అయినది.

"పదలక్షణసంజ్ఞాన్వయ<br>
పదగుణవృద్ధిప్రయత్నపరరూపనవా<br>
స్పదభావతద్ధితక్రియ<br>
లొదవఁగ చెలి శబ్దశాస్త్రమా యన నుండెన్" 6ప. 2ఆ.

"లలితవదనము నల మని పలుకఁదగును<br>
కలికి గోరులు భగణవైఖరుల నలరు<br>
ప్రచురనగవృత్తి నెసఁగుఁ దత్కుచయుగము<br>
నమరపతిహితలక్షణాగ్రమణి రమణి" 16ప. 2ఆ.

అను పద్యములందు పాండిత్యప్రకర్ష ప్రకాశించును.

"ఉగ్రకరుఁడైన యినునితో నిగ్రహించి<br>
జనులకెల్లను గడు చల్లఁదనము చూపు<br>
రాజునకు నెదురేగెడి ప్రాణు లనఁగ<br>
నిడుపు లిడసాగె తొలు దెస నీడ లపుడు. " 4ప. 4ఆ.

అను పద్యమునందు భావుకత భాసించును. ఇట్టి పద్యములు అరుదు.

వేంకటేశ్వరవిలాసము : ఇందు వేంకటేశ్వరస్వామి భూదేవి అవతారమైన చెంచు కన్నెను వివాహమాడుట ప్రధానేతివృత్తము. ఆదిని హరిణీపార్వతుల వృత్తాంతము, అంతమున అలమేలుమంగ, చెంచుకన్నెల సవతికయ్యము ఔపచారికేతివృత్తములు. సవతికయ్యము సమగ్రము కాదు. ఇందును అనుప్రాసముల అట్టహాసములు, యమక ముల గమకములు అధికము. శృంగారము శృంగాగ్రము నందినది. ఇందుకు గాఢతపోని మగ్నుడైన పర్వతుడు, తపోభంగము సేయుటకు ఇంద్రుడు పంపిన హరిణిని చూచి, మరులు పూని, "పరమసుజ్ఞానయోగప్రపంచమొల్ల" హరిణీపరముగ వర్ణించిన తీరు ప్రము ఖోదాహరణము.

"విపులవిభ్రమనారదవేణి, పుండ

రీకలోచన శుకవాణి భృగునితంబ
దివ్యమాతంగగమన యాత్రేయవదన
కలితశాండిల్యకుచ యా జగన్నుతాంగి."
"రమణి మధ్యనితంబదృగ్గమనమహిమ
సరణి హరిభృగురామలక్ష్మణవిలాస
మమరి భారతభాగవతాదికావ్య
మైన రామాయణపురాణ మౌట యరుదె "
శ్రీరంగధామ మీ చెలువ ముద్దుమొగంబు
    తరళాక్షి నాభి కేదారగరిమ
మానినీమణి పల్కు మధురామృతముఁ జిల్కు
    నతివ పాలిండ్లు భద్రాద్రిమహిమ
చంచలాక్షి పిఱుదుల్ కాంచీప్రకాశంబు
    వనిత సన్నపుఁగౌను వారణాసి
రమణి ప్రపదసుందరంబు శ్రీకూర్మంబు
    సఖి రోమరాజి శేషాచలంబు
గాఁగ సుక్షేత్రమహిమచే ఘనత మీఱి
వెలయు నీ యింతిఁ గలిసిన విమలపుణ్య
పరుఁడు పరమచిదానందవార్ధిఁ దేలి
బహుళసంసిద్ధి శుద్ధబ్రహ్మంబు గాఁడె " పుట 35

ఇందు నారదాదులు హరిణి అవయవాదులు! భారతభాగవతరామాయణములు ఆమె మధ్యనితంబదృగ్గమనములు! పుణ్యక్షేత్రములు పణ్యక్షేత్రములు! ఆమె రతి పరమ చిదానందము! అతని స్థితి శుద్ధబ్రహ్మము! ఇది" వేంకటేశ్వరవిలాసము"!

రెండు కృతులందును భాషాదోషములు కలవు. శైలి సరళము, ధార ధారాళము.

**కొటికెలపూడి కోదండరామయ్య** : ఇతని కృతులు 1. ప్రపదనపారిజాతము. 2. నృసింహపురాణము. 3. తారకబ్రహ్మమాహాత్మ్యము. 4-12 శతకములు 13. గణిత శాస్త్రము. ఇతడు బొబ్బిలి సంస్థానాధిపతి శ్వేతాచలపతిరంగారావు (1830-62) సహాధ్యాయి[282]. కాఁబట్టి కృతుల రచనాకాలములు ప్రపదనపారిజాతము 1830 ప్రాంతము, నృసింహపురాణము 1835 ప్రాంతము, తారకబ్రహ్మమాహాత్మ్యము 1840 ప్రాంతము, తక్కిన కృతులు తదనంతరకాలికములు కావచ్చును.

**సారంగపాణి** : ఇతని కృతులు పదములు. కీర్తనలు. సారంగపాణిపదములని ప్రసిద్ధము. ఇతడు కార్వేటినగరము సంస్థానాధిపతి "మాకరాజు కార్వేటిరాజు ఆస్థానకవి యఁట" అని, పోలిపెద్ది వేంకటరాయని (1800-1875) వేణుగోపాలశతకము సారంగపాణియే రచించినదని కొందఱి విశ్వాసమని, అతనితోపాటు ఇతడు మాకరాజు వేంకటపెరుమాళ్లురాజు (1802-1884) అష్టదిగ్గజకవులలో ఒకడని ఒక అభిప్రాయము కలదు[283]. సారంగపాణి పదములందు మాకరాజు కార్వేటిరాజుపరముగ మూడు పదములు కలవు. 1. "శ్రీసాళువమాకరాజ కార్వేటిరాజేంద్రా" 2. "మాకరాట్కార్వేటి రాజా." 3. "శ్రీమాకరాట్కార్వేటి వీరరాజేంద్ర" (60,61,62 ప్ర.భా.) సారంగపాణి

మాకరాజు కార్వేటిరాజునకు, మాకరాజు వేంకటపెరుమాళ్ళురాజునకు ఆస్థానకవి అగును. అయిన కాలము 1800-1875 అగును. కాఁబట్టి సారంగపాణిపదముల రచనాకాలము 1830-60 ప్రాంతము కావచ్చును.

సారంగపాణిపదములు నాలుగు భాగములుగ ముద్రింపఁబడినవి. ప్రథమభాగము శృంగారము, ద్వితీయభాగము దేశీయము, తృతీయభాగము జాతీయము అని కలదుగాని, మొదటి రెండు భాగములును రక్తిపదములే మూడవ భాగమునందును రక్తిపదములే అధికము. విరక్తిపదములు విరళము. చతుర్థభాగము మాత్రము భక్తి, విరక్తిపదములు. ప్రథమభాగమునందు డెబ్బది యైదు, ద్వితీయభాగమునందు అఱువది యాఱు, తృతీయభాగమునందు పదియాఱు, చతుర్థభాగమునందు నలుబది నాలుగు పదములు కలవు. మొత్తము 75+66+16+44=201. చతుర్థభాగములోని ఒక పదము రక్తిపదము. సంఖ్యలేని చరమపదము వేణుగోపాలసోదరి అరుణాద్రిపురి వెలయు నగరాజకుమారి పరము. ప్రథమభాగములోని మూడు పదములు అన్నూణ సరసేతటి నెలకొన్న ప్రసన్న వేంకటశౌరి పరము. (71, 72,73) మఱొక పదము చెంగల్వరాయని పరము. (74) ఇంకొక పదము కల్యాణవేంకటేశ్వరునిపరము (75) ఇతరపదములెల్ల కార్వేటినగరవేణు గోపాలస్వామిపరము. కార్వేటి నగరప్రసక్తి పదునాల్గు పదములందు కలదు. (19, 34, 35, 36, 48, 55, 66 ప్ర.భా; 48, 55, ద్వి.భా; 6, 20, 29, 30, 40, 41, 41-42నడుమ చ.భా.) పెక్కు పదములందు వేణుగోపాలస్వామి ప్రసక్తి కలదు. తృతీయభాగములోని పదియాఱు పదములును పామరభాషయందు కలవు. అందు ఏనుగోపాలుడు, ఏణు గోపాలుడు అని కలదు. రాజపరమైన మూడు, అన్యదైవపరమైన ఆరు కాక, మిగిలిన 201-9=192 పదములును కార్వేటినగరవేణుగోపాలస్వామిపరములే.

రక్తిపదములందు అక్కడక్కడ అశ్లీలము కలదు. భక్తిపదములందు అత్యధికముగ పారవశ్యము కలదు. వైరాగ్యము కలదు. సమాజసమీక్ష కలదు. రక్తిపదములందు రాగముల, మందుల, మానుల, ఔషధముల, ఆభరణముల పేరులు ఇమిడించిన పదములును కలవు.

ప్ర. భా. "గౌళిపంతురాగము - జంపె తాళము
పల్లవి : వరకన్యాతిలకము వనిత పేరు దీని
అనుపల్లవి : పరికించ వేణుగోపాల నా సామి ॥ వర ॥
౧ పాలంతి నెమ్మోము సం - పూర్ణ చంద్రోదయము
ఆలకాళి రుచి వినో - దాంజనంబు
౨ దాని మృదుమధురోక్తి - ద్రాక్షాదిరస మెంచ-
మానవతి చూపు మ - న్మథబాణసమము ॥ వర ॥
౩ చెలియ దాని గుణంబు - చింతామణి స్ఫూర్తి
అలరించు పాట శ్రుతి - కానందరసము ॥ వర ॥
౪ సరసాంగి పొక్కిలి వ - సంతకుసుమాకరము
అరయుగా చనులు బి - ల్వాది నిరసించు ॥ వర ॥
౫ తరుణి సర్వాంగసుం - దరరసము రతి నేలు

కరుణ రాజమృగాంక - కలయు మిక రతిని ॥ వర ॥

పామరభాషలోని పరమవైరాగ్యపదము :

తృ. భా. " ౯- నాదనామక్రియరాగము - చాపు తాళము

పల్లవి : మనుషా ణమ్మ బాకే - యీ డ్రేగాము కళేభారం
మనుషా నమ్మబాకే

అనుపల్లవి : మనుషా యీ డ్రేగాము - మట్టి సట్టెంటిది
పని శేటిలో నుండె - పరమాత్కు డెల్లంటె ॥ మను ॥

౧ : త్రొమ్మిది సారం సూళ - తోళే నరమాశిగ
బెమ్మ గాయించిది బెస్టకారి కట్టె ॥ మను ॥

౨ : ఎన్నెంటా యెంకేలు - యెంక ముంగ లెంటి కేలు
కన్న యాదుల బుట్ట - గడకుంటె గల్బు ॥ మను ॥

౩ : పయి యెన్నె లడుగున - పరమశాండలము
: మయిదు ఈసృుడు శేశి - మబ్బి గప్పించాడు ॥ మను ॥

౪ : తన వోషాణశేత్తె - ధరమధాణం శేశి
: యినవలెరా మేండెం - కన మోచృము ॥ మను ॥

౫ : యెంటన గీటి రావు - యేను గోపాలుని
బంట్టె పాదకవళం - బట్టాలే ఘట్టిగా ॥ మను ॥

వైరాగ్యమునకు నైరాశ్యము తోడై, సమాజమును సమీక్షించిన పదము :

చ.భా. " : 3 - గౌళిపంతురాగము - ఆదితాళము

పల్లవి : పాపాత్ముల కెక్కడి దీ కాలము పారమార్థికము - వేణు

అనుపల్లవి : గోపాలా దోవ గాచి దొంగలు గొట్టరా సన్యాసులనైన ॥ పా ॥

౧ : కులకాంతల వ్రతము భంగము జేతురు - బలిపీఠము గొట్టేమని
లేతురు పిలువ నంపి నెత్తిన పలి వేతురు - పులి దాసల్లకు బెట్టిన కథగా॥ పా ॥

౨ : శంకించక పనులు పరగదోతురు - శంబరమాయలు కల్పన జేతురు
జంకక లంచానికి చై సాతురు - రంకుమగడు కడుపునొప్పి జూచున ॥ పా ॥

౩ పెద్దల సొమ్మపహరింపజూతురు - సద్దు లేక నడిగితె తలయూతురు
రద్దీ జేసి రచ్చలోకి దీతురు - యెద్దుపుండు కాకికి ముద్దౌనా ॥ పా ॥

౪ తప్పులోని దండగ దెమ్మందురు - తమ ప్రజ్ఞ తామె పొగడుకొందురు
అప్పటముగ సొంట్లు వెతుకుచుందురు - కుప్పలు గాలిచి పేలాలు తినే ॥ పా ॥

౫ ఇరుగు పొరుగు వారిని వేధింతురు - యెగరవేసి మాట్లాడి జయింతురు
వురగము వలెనే పగ సాధింతురు - గురువుకు పంగనామము బెట్టే ॥ పా ॥

౬ పోటి జేసి యొకరి కూడు దీతురు - పొంచులుండి విని జాబులు వ్రాతురు
పీట మీద పెండ్లి వారగదోతురు - మోటు గాలి కెందైనా వెరచున ॥ పా ॥

౭ కన్నతల్లి యనుచు జేరవత్తురు - కల్ల పసిడి జూపి హేస మెత్తురు
చిన్న చిన్న పనులకు రోజౌత్తురు - తిన్న యింటికే రెండు దలంచె ॥ పా ॥

౮ మగనికి పెండ్లానికి పగజేతురు - తగులు కొంటిరని కేకలు వేతురు

తగవు దీర్పుకొమ్మని వెలిదోతురు - యిరుగు బొడిచి నెత్తురు ద్రావేటి ॥ పా ॥
౯ వండి వండి తోడితే కబళింతురు - వచ్చి వచ్చి వాసాలే యెంతురు
పుండు వలెనె ప్రజలను బాధింతురు - యెండిన నోటికి నీళ్ళు లేవనే ॥ పా ॥
౧౦. పిలువని విందుకు బిరబిర లేతురు - బిచ్చగాండ్ల దరిమి తలుపు మూతురు
చలువ పాగ జుట్టి చికిలి జేతురు - చలిపందిలి కుండ బగలగొట్టే ॥ పా ॥
౧౧. కుటిలభావ మొకనాటికి మానరు - కుంభీపాకమున బడుట గానరు
యెటు జూచిన సత్క్రియలకు బూనరు - యిట్లు రమ్మంటే యిల్లు జేకొనే ॥పా॥
౧౨ వాసి దెలసి విహితము నడిపించరు - డాసి వేడుకొన్నా మన్నించరు
చేసిన మేలొక్కటి మది నెంచరు - కోసిన వ్రేలికి సున్నము బెట్టరు ॥ పా ॥
౧౩ ఒట్టు పెట్టుకొని మోసము జేతురు - వంచనచే కొంప ముంప జూతురు
జుట్టు చేత చిక్కెననుచు యేతురు - నట్టేటికి దీసి పుట్టి ముంచే ॥ పా ॥
౧౪ చిట్టెలు గట్టుక యోచన జేతురు - వందనచే కొంప ముంప జూతురు
గుట్టు బైట వేసి సిగ్గు దీతురు - చెట్టు కెక్కమని నిచ్చెన దీసె ॥ పా ॥
౧౫ సుడిగాటికి పన్ను దీసికొందురు - గుడిమేర రాశి నిలుపమందురు
తడయక బ్రాహ్మణులఁ బోరుచుందురు - తడిబట్టలతో గొంతులు గోసే ॥పా॥
౧౬ రట్టు బడితిమని మదిలో దట్టరు - రవలేశము దాక్షిణ్యము బుట్టదు
చుట్టు పట్టు లొకరి మేలు గిట్టదు - పుట్టిన బుద్ధులు పుడకలతో సరి ॥ పా ॥

సారంగపాణి పదములందు సమకాలికసమాచారమును కలదు. అందు మట్లవారి సీమ చీర (15ప్ర. భా.) వారపప్పళి చీర (29 ప్ర.భా.) కరకంచు చీర (65 ప్ర.భా.) లగ్గల పని చీర (71 ప్ర.భా.) మైజారు చీర (25 ద్వి.భా.) సరిగె బుటేదారి చీర (39 ద్వి.భా.) నారాయణ వనము చీర (46 ద్వి.భా.) సరిగ చీర (58 ద్వి.భా.) బందరు చీటి (25ప్ర. భా.) చీటి తానులు (35ప్ర. భా.) చీనాఅద్దము (37, 45.ప్ర. భా.) బందరు కమ్మలు (51 ప్ర.భా.) అత్తరు (38, 45 ప్ర.భా.) మైసూరి కంబడి (34 ద్వి.భా.) పాగ చుట్టలు (54 ద్వి. భా.) అర్జీలు, పంచాయితులు (50 చ.భా.) సారాయి (2 తృ.భా.) మొదలైనవి. కలవు.

సంగీతసభారంజకములైనవి సారంగపాణి పదములు.

**తూము రామచంద్రారెడ్డి** : ఇతని కృతి అలమేలు మంగాపరిణయము. శ్రీరామ చంద్రునికి అంకితము. దైవాంకితము. ఇతడు రాజా చందూలాల్ సమకాలికుడు. అతడు నిజాంపాలకులు సికిందర్ జా కు (1803 - 1829), ఆతని కుమారుడు నాల్గవ అసఫ్ జా కు (1829 - 1857) 1808 వ సంవత్సరము నుండి దివాను[284]. కనుక రాజా చందూలాల్ దివాను అయిన కాలము 1808-1857 అగును. అతని సమకాలికుడైన రామచంద్రారెడ్డి కాలమును అదే కాఁబట్టి అలమేలుమంగాపరిణయము రచనాకాలము 1830 ప్రాంతము కావచ్చును.

ఇది సగటు ప్రబంధము కాదు. వెగటు ప్రబంధమును కాదు. కొంత క్రొత్త దనము పగటు ప్రబంధము. కవి పెద తండ్రి, మహబూబు నగర్ జిల్లాలోని మానాజీపేట (మానవతీపురము) జమిందారు తూము రామభూపాలుడు వేంకటేశ్వరాలయము కట్టించి,

అతని అక్కరామమ్మచే గోపురము కట్టింపఁజేసి, అలమేలుమంగావేంకటరమణుల అర్చావిగ్రహములకు పరిణయమహోత్సవము చేయుట ప్రధానవిషయము. ఇందుకు లక్ష్మీనారాయణుల వియోగము, సంయోగము ప్రధానకథ. అందుకు హంసయో, చిలుకయో, చెలికాడో, చెలికత్తియో కాక, తూము రామభూపాలుడే రాయబారము సేయుట క్రొత్తవిశేషము. కవిత్వము కథాక్రమమునందు సరళము. సహజము. వర్ణన స్థలములందు ప్రౌఢము. జటిలము.

శివుడు నారదునికి చెప్పిన కథను, సూతుడు శౌనకాదిమహామునులకు చెప్పును. తూము రామభూపాలుని గానకళాప్రావీణ్యము గూర్చి శివుడు, నారదునికి చెప్పిన విషయమిది :

"నీతో డాయన గానము
నీతోడనె సమము వచ్చు నిశ్చయము సుమీ!
నీతోడ నైనను సమమే
నీ తోడ నబద్ధమాడ నిర్మలచరితా! " 6ప. 2ఆ.

శ్రీమన్నారాయణుడు రామభూపాలునకు దర్శన మొసగుటకు, లక్ష్మితో "నన్ను పరుషవాక్యంబు లాడెద"వని నెపము కల్పించుకొని

"మగువా! నన్నిటు లాడన్
దగునా? యిఁక నిందు ఉండఁదగదని హరి తా
జిగి బంగరు దుప్పటిఁ జ
క్కఁగఁ దాలిచి పాన్పు డిగ్గి కడుకోపముతోన్." 26ప. 2ఆ.

ఆమె ఎంత ప్రార్థించినను ఆగక, అంజనాచలమునకు వచ్చి, ఒక గుహలో ప్రవేశించును. గుహలోని నారాయణుని చూచిన గొల్లవారు, రామభూపాలుని కొలువునకు వచ్చి తెలుపుదురు.

"సామి! యీ యూరి యుత్తరభూమికైన
కూఁత పెట్టునఁ గాటుక కొండ గలదు
దాన మేఁకల మేప మా వాని తోడఁ
బోయి కంటిని మనసు కబ్బురము దోఁప" 10ప. 3 ఆ.
"బొలిబొల్లి నామాలు గల మేను గలవాఁడు
సంకు సక్రాల బుజాల వాఁడు
తెల్లని ముత్యాల డొల్లుఁబోగుల వాఁడు
ఎదమీఁద నెసఁగు జన్నిదము వాఁడు
జలతారు వొదిగిన తలకుల్ల గలవాఁడు
వలిపంపు తగటు దువ్వలువ వాఁడు
రతనాలు దాపిన పతకంబు గలవాఁడు
సక్కని నీలాల సాయవాఁడు
ఎవ్వఁ డో కాని మా బడు నవ్వుకుంట
కాల్ల పాకోల్లు మెట్లపైఁ బెల్లు మనఁగ
నల్ల కాటుక కొండను మెల్ల నెక్కి
పెద్ద గైకొనఁ జొచ్చె నీ పాద్దె రాజ!" 13ప. 3ఆ.

రామభూపాలుడు మానాజీపేట సమీపములోని అంజనాద్రిగుహలో నారాయణుని చూచును. నారాయణుడు రామభూపాలుని భూలోకమునకు వచ్చియుండు లక్ష్మిని వెదకి రాయబారము సేయుమనును. రామభూపాలుడు ఆ సమీపమునకే సఖీసమేత ముగా వచ్చియున్న లక్ష్మిని చూచి రాయబారము సేయును. రామభూపాలుని రాయ బారము రసవంతము.

"అన్నా! రామనరేంద్ర చంద్ర! హరి యేమన్నాఁడొకా! నన్ను ర
మ్మన్నాఁడా? దయతోడఁ దెల్పఁ గదవయ్యా! వేఁడెదన్ నిన్ను నా
యన్నా! నీవు యశోధురంధరుఁడవై యత్రాంత మీ భూమి శ్రీ
మన్నారాయణపాదభక్తి ఘనసామ్రాజ్యుండవై యుండుమా! 103

రమ్మనెనా? నాదే నే
రమ్మనెనా? తనకు నాకు రమణుం డిఁక దూ
రమ్మనెనా? నను మణిహా
రమ్మని హరి తన భుజాంతరమ్మునఁ గొనునా?" 104ప. 3ఆ.

అని అడిగిన లక్ష్మి, రామభూపాలుడు "అమ్మా! నిన్నునే రమ్మనె నమ్మా! యా మాధవుఁడు ............ రావమ్మా పోవుదమిఁక" అనిన, (106-107ప. 3ఆ.)

"వనమాలి "నాకు వనపా
యినివి నినున్ బాసియుండ నిది నిక్కముగా
మనమున నమ్ము "మటని ననుఁ
దనయెదఁ జేర్చుకొని మాట తప్పిన మీఁదన్. 109

ఏమి వత్తును? నేనిఁక రామభూప!
దైవ మింతైన దయ లేక తప్పు లేక
మాట చేపట్టి నన్నొంటిపాటు విడిచి
చనియె నిఁక నేను వచ్చినఁ జక్కనగునె?" 110ప. 3ఆ

అని, రామభూపాలుడు ఏమి చెప్పినను రానని, భీష్మించును. రామ భూపాలుడు నారాయణుని లక్ష్మి యొద్దకు రమ్మనిన,

"హసనాంచన్ముఖుఁ డౌచు దైత్యమథనుం డాహ్లాదియై యిట్లు నే
నసమాస్త్రాంబకు బాధ కోర్వక నితాంతాసక్తిమై వత్తు నే
నసమానోజ్జ్వలబుద్ధిధుర్య! వినవయ్యా! యీ ధరామండలిన్
రసికుల్ విన్నను రామ రామ! నగరా రామావనీపాలకా!"

అటు గనుక నీవె చని యా
కటిలాలకతో "మహోగ్రకుసుమాయుధదు
ర్ఘటపటుశరపీడిత హృ
త్పుట మిఁక నెటులౌనో చూచి పొమ్మనె ననుమా" రాప. 4ఆ.

అనిన రామభూపాలుడు లక్ష్మి యొద్ద కేఁగి

" . . . . జననీ! నీ విటు
లనఁ దగునా! దాసజనుని నచ్యుతు నా వే
దన యేమని చెప్పుదు "రా
నని యిందిర"యనిన మూర్ఛ నప్పుడె చెందెన్ " 12ప. 4ఆ.

"మూర్ఛఁ దేరి . . . . . కంతు నిశితేషువితాననితాంతతాపసంక్రాంతహృదబ్జ

మెట్లో దయ గల్గినఁ గన్నులఁ జూచి పొమ్మనెన్" అని రమ్మనిన, లక్ష్మి హరి మాయలు తెలుపును. (17-20ప. 4ఆ.) రామభూపాలుడు,

"లేదమ్మా!" హరి మిథ్యా
వాదుండును గాఁడు సత్యవాక్యుం డనుచున్
వేదంబులు పలుకును మీ
పాదంబుల తోడు పిలువఁ బనిచెను నిన్నున్. 21

ననుఁ జాలన్ బ్రియవాక్కులన్ బిలిచి శ్రీనాథుండు 'నా యన్న నా
వనితన్ దోడుక రమ్ముపో"మ్మనిన నవ్వా! వచ్చితిన్, నీవు "రా"
ననుచున్ నన్ను నిరాకరించినను నే నచ్చోటి కే చందమున్
జనుదున్? " నన్ దయఁ జూచిర"మ్మని నమస్కారంబు గావించినన్" 22ప. 4ఆ.

లక్ష్మి రామభూపాలుని వెంబడి శ్రీమన్నారాయణుని సన్నిధికి వచ్చును. రామభూపాలుడు- నారాయణుడు లక్ష్మిని పరిణయమాడుట చూడ వేడుకగా నున్నదనిన, నారాయణుడు అర్చావిగ్రహములు కల్పించుకొని సంకల్పము నీడేర్చుకొనుమని చెప్పును. అందుకు రామభూపాలుడు వేంకటేశ్వరాలయము నిర్మించి అలమేలుమంగావేంకట రమణుల విగ్రహములకు పరిణయమహోత్సవము సేయును. ఇది ఈ అలమేలుమంగా పరిణయము.

ఇందు పుర (86-98ప. 1ఆ.) గ్రీష్మర్తు (61-63ప. 2ఆ.) వర్షర్తు (64-66ప. 2ఆ.) శరదృతు (67-70ప. 2ఆ.) హేమంతర్తు (71-75ప. 2ఆ.) వసంతర్తు (76-77ప. 2ఆ.) నాయకవిరహ (34-40ప. 2ఆ.) సాయంకాల (87-88ప. 2ఆ.) నక్షత్ర (89ప. 2ఆ.) చంద్రోదయ (90-110ప. 2ఆ.) సూర్యోదయ (3-6ప. 4ఆ.) పరిణయోత్సవ (63-116ప. 4ఆ.) వర్ణనలు కలవు.

**వేల్పూరి వేంకటేశ్వర్లు** : ఇతని కృతులు 1. నిర్వచనవిచిత్రరామాయణము. 2. గౌరీశంకరవిలాసము. 3. రామలీల 4. గోవ్యాఘ్రకథ 5. రామకథలు 6. జానకీరామ శతకము. 7. కోలంకమదనగోపాలశతకము. 8. శివశతకము ఇతడు "1851 వ సంవత్సరమున స్వర్గస్థుఁడయి"నట్లు కలదు[285]. సమీపకాలికసమాచారము. సత్యసన్నిహిత మగును. కాఁబట్టి నిర్వచనవిచిత్రరామాయణము రచనాకాలము 1830 ప్రాంతము, గౌరీశంకరవిలాసము రచనాకాలము 1835 ప్రాంతము కావచ్చును. రెండును దుర్లభములు.

నిర్వచనవిచిత్రరామాయణము డొంకాడ గోపినాథము విచిత్రరామాయణమునకు పద్యకావ్యరూపాంతరము.

**ములుపాక బుచ్చయ్యశాస్త్రి** : ఇతని కృతి వేంకటేశ్వరమాహాత్మ్యము. అముద్రితము. "ఇతఁడు నూఱు సంవత్సరముల క్రితము వాఁడు". అనగా 1899-100=1799[286] అని కలదుగాని, ఇతడు సి.పి. బ్రౌన్ పండితవర్గములోని వాడు. బ్రౌన్ వాఙ్మయసేవాకాలము స్థూలముగ 1825-1855. కాఁబట్టి వేంకటేశ్వర మాహాత్మ్యము రచనాకాలము 1835 ప్రాంతము కావచ్చును.

**దామరాజు లక్ష్మీనారాయణ** : ఇతని కృతి బృందావనవిహారము. "ఇతఁడఱువది

సంవత్సరముల క్రిందట నుండిన వాఁడు" అని కలదు[287]. అనగా 1899-60=1839 ప్రాంతము సమీపకాలికసమాచారము. సత్యసన్నిహితమగును. కాఁబట్టి బృందావన విహారము రచనాకాలము 1835 ప్రాంతము కావచ్చును.

ఇది " భాగవతశేష" మని ఇందు కలదు. బృందావృత్తాంతము, రాధాకృష్ణ వృత్తాంతము, రంభాపరిరంభము వినా, కృష్ణుని బాల్యక్రీడలు, గోపికావస్త్రా పహరణము, గోపికావిరహవేదనలు భాగవతములోనివే. బృందావనమును "పూర్వకవులుం। గర్ణములను వినలేదాకొ। వర్ణింపరు నాదు భాగ్యవశమునఁ గృతులన్" అని, ఒక వచనమునందు వర్ణించెను గాని (పుట 30) ఆ భాగ్యము పండ లేదు. భాషాదోషములు బహుళము. యకారాదిశబ్దములను (యమున, యశోద) ఎకారాదిశబ్దములుగ (ఎమున, ఎశోద") సంధిచేయుట చ్యుతసంస్కారము. కవిత్వమును కమనీయము కాదు. పోతన ప్రసిద్ధమైన "నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు" అను పద్యమునకు పేలవమైన అనుకరణము కలదు.

> "నల్లని వాఁడు మంచి చిఱునవ్వుల వాఁడు ముఖంబునందు జా
> బిల్లిని గేరు వాఁడు కడు పింఛపు దండల వాఁడు నేత్రముల్
> పుల్లసరోజయుగ్మమును బోలెడు వాఁడొక చిన్నవాఁడు మీ
> రెల్లెడఁ జూడలేదు గద యేమిటి చెప్పరె యంచు దీనతన్." పు. 26

**అల్లమరాజు రామకృష్ణయ్య** : ఇతని కృతులు 1. వైనతేయవిజయము. 2. సత్యభామావిలాసము. 3. గౌతమీమాహాత్మ్యము. 4. ద్రౌపదీపరిణయము. 5. సుశోభా వివాహము 6. హనుమదాఖ్యానము. 7. సుకవిమనోరంజనము. 8. కవిచకోర చంద్రోదయము. 9. మదాలసాపరిణయము. 10. శంతనువిలాసము. 11. అధ్యాత్మ రామాయణము 12. అచ్చతెలుగు భాగవతము. 13. రామకృష్ణీయము. (ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యానము.) ఇందు కవిచకోరచంద్రోదయము మాత్రమే ఉపలబ్ధకావ్యము. అది దక్షారామభీమేశ్వరునికి అంకితము. దైవాంకితము. కావ్యాంతరమునందు రచనా కాలము కలదు.

> "అవనిలో శాలివాహనశకాబ్దంబులు
> నద్రిశరాద్రిసోమాఖ్య మెఱయ
> మన్మథాబ్దజ్యేష్ఠమాసశుక్లాష్టమీ
> గురువాసరంబునన్ సరసగరిమ
> మీఱంగను కవిచకోరచంద్రోదయం
> బను నీ ప్రబంధ మత్యంతభక్తి
> రచియించి నీకు నర్పణఁ జేసితిని వేడ్క
> గైకొమ్ము భోగికంకణ మహేశ - " 55 పుట

అద్రి=7, శర=5, అద్రి=7, సోమ=1=1757+78=1835. కాఁబట్టి కవిచకోరచంద్రోదయము రచనాకాలము 1835 వ సంవత్సరము.

మన్మథాబ్దజ్యేష్ఠమాసశుక్లాష్టమీగురువారము

కవిచకోరచంద్రోదయము అత్యంతభక్తికావ్యము కాదు. అత్యంతరక్తికావ్యము. సుశీలారుక్మాంగదుల శృంగారము శ్రుతి మించినది (17-48పుటలు) రుక్మాంగదుడు

జరాభారపీడితుడై, గతమోహుడై, సుశీల కులీన కాదని తెలిసి బాధపడునపుడు- వసిష్ఠుడు వచ్చి భక్తియోగజ్ఞానమార్గములు తెలిపి, శ్రీరామమంత్రోపదేశము సేయునెడ, శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై, సుశీలారుక్మాంగదులకు మోక్ష మొసగుట ముగింపు. (51-54పుటలు)

దక్షారామభీమేశ్వరుడు స్వప్నమునందు సాక్షాత్కరించి, "ధ్వనులు శ్లేషోక్తు లుపమ లింపెనయఁ గూర్చి రామమంత్రప్రభావవర్ణనము నేత్రదర్పణముగా నొనర్పు మదర్ప ణముగ"అనిన (3 పుటలు) శృంగారము శ్రుతిమించినది!

**ఏనుగుల వీరాస్వామయ్య** : ఇతని కృతి కాశీయాత్రచరిత్ర. ఇతడు 1830-31 నడుమ (18-5-1830-3-2-1831) కాశీయాత్ర చేసి, తన మిత్రుడు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లెకు వ్రాసిన యాత్రావిశేషముల లేఖలను అతడు ప్రథమతః 1838 వ సంవత్సరమునందు గ్రంథముగ ముద్రించినది కాశీయాత్రచరిత్ర[288]. ఇది కావ్యముకాదు. యాత్రాచరిత్రగ్రంథమే.

ఇందు పాతిక ప్రకరణములు కలవు. భాష విలక్షణము. కేవలము వ్యావహారికము కాదు. కేవలము వ్యాకరణయుక్తము కాదు. వ్యావహారిక, గ్రాంథికభాషలు రెండును కలిసి మెలిసియున్నవి. అది నాటి శిష్టవ్యావహారికభాష అగునేమో కాని, నేటి శిష్టవ్యావహారిక భాష కాదు. శైలి అతి సరళము. విషయము నాటి మత సాంఘిక రాజకీయస్థానికచారి త్రికాద్యనేకవిశేషముల తోడి యాత్రావివరము. కతిపయోదాహరణములు :

> "అర్చకులకు మనసు వచ్చినప్పుడు దీపారాధన, నైవేద్య ములు స్వామికి (శ్రీశైలమల్లికార్జునస్వామికి) చేయబడుచున్నవి గాని నిత్యనియమము లేదు. బ్రాహ్మణులు స్వేచ్ఛగా లింగమును తాకి అభిషేకనివేదనలు చేయవచ్చును. భ్రమరాంబాదేవికి మాత్రము మిరాశీ అర్చకుల తరపున నొకడు నియమముగా గుడిలో కాపుర ముండి అర్చన చేయుచున్నాడు. "పుట 19.
>
> "హైదరాబాదునకు ఇవతల నుండే మల్లుపేట అనే ఊరి వరకు బ్రాంహ్మణయిండ్లు వుండి స్థలము దొరుకుచు వచ్చినందున బ్రాంహ్మణయిండ్లు వినహాగా యితరము లయిన చావిళ్లు మొద లయినవి అనేకజాతులకు ఉపయోగించేవి గనుక ఆ బాహ్య ప్రదేశములలో దిగడానికి నాతో కూడా వచ్చిన మూఢభక్తి యాచా రముల వల్ల కడతేరవలసిన స్త్రీలకు యెంతమాత్రము సమ్మతి లేకపోయినవి." పుటలు 96-97.

"బంగాళా గౌరన్‌మెంటువారు పినాంన్సు కమిటీ అనే సెలవులు తగ్గించే సమూహము వారి తాత్పర్యము మీద అక్కడక్కడ ఉండే కష్టం హవుసులనే సాయరు చావిళ్ల యెత్తివేసి చెన్నపట్టణము వలెనే కష్టం అనే సుంకమును యిజారాకు యివ్వవలెనని యత్నము చేసినారు." పుట 140.

"ఈ కాశీమహాక్షేత్రములో అథర్వణవేదమును కొందరు ఘూర్జరులు అధ్యయనము చేసియున్నారు. ఆ వేదస్వరము ఋగ్వేద స్వరమునకు సమీపముగానున్ను, ఉద్ధృతముగానున్ను యున్నది. యజుర్వేదములో మాధ్యందినశాఖయని శుక్లయజుశ్శాఖ యని ప్రథమశాఖ యని తైత్తిరీయశాఖ యని స్వరభేదములతో అధ్యయనము చేయు

చున్నారు. ఇక్కడ సామగులు నాటిదాకా యున్నా స్వరము దక్షిణదేశమునకు బహుభేద ముగా నున్నది. గానసౌష్ఠవము విస్తారము లేదు. పంచద్రావిళ్లల్లో పంచగౌడులలోనున్ను ఒకటి రెండు శాస్త్రాలు చదివిన పండితులు వెయిమంది దాకా ఈ కాశీలోయున్నారు. " పుట 163.

"యీ వూళ్లో (బరంపురము) కొద్ది దినాలకు ముందు సర్వతోముఖమనే క్రతువు నడిచి ఆ క్రతువు నిమిత్తము నన్ను నే నెరిగిన గోదావరీతీరపు బ్రాహ్మణమండలి నాటికి దాకా యిక్కడ వచ్చి వున్నది. ఆ బ్రాహ్మణు లందరున్ను శ్రౌతవిషయము బాగా తెలిసిన వారు గనుక అధర్వణవేదము మూలమా లేక కడమ మూడు వేదాల మంత్రసంగ్రహమా అని నాకు బహుశః వున్న సందేహము వారివల్ల తీరునని వారిని విచారించినంతలో నంగ్రహమేనని తేలినది. అందుకు ఆకరము సర్వతోముఖయాగములో కడమ మూడు వేదాలకు వలెనే అధర్వణానకు ప్రత్యేకార్యము లేదు. పయిగా లోకప్రకటనకు భారద్వాజులు మూడు వేదాలే తెచ్చి యీ మూడింటిలో నుంచి అస్త్రప్రయోగ నిమిత్తము మంత్రసంగ్రహము చేసి క్షత్రియులకు అధర్వణమని పేరు పెట్టి వొక వేదము చేసి యిచ్చినారు. పంచగౌడులలో గాని పంచద్రావిళ్లలో గాని మేము అధర్వణుల మని చెప్పేవారు యెవరున్ను లేరు. ' ' 320.

ఇట్లు కాశీయాత్రచరిత్ర బహువిషయసంభరితము.

**ఫక్కి వేంకటనరసయ్య** : ఇతని కృతులు 1. శకుంతలాపరిణయము 2. మదన సాయకావిలాసము. 3. నారాయణస్తవము. 4. కుమారీశతకము. 5. అమరపదకల్ప ద్రుమము (నిఘంటువు) 6. కవిదర్పణచ్ఛందము (ఛంద్రోగ్రంథము). ఇందు శకుంతలా పరిణయము "1836 వ సంవత్సరమునందు ముగించి"నట్లు కలదు[289]. కాఁబట్టి శకుంత లాపరిణయము రచనాకాలము 1836 ప్రాంతము, మదనసాయకావిలాసము రచనా కాలము 1840 ప్రాంతము, కుమారీశతకము రచనాకాలము 1845 ప్రాంతము కావ చ్చును. కుమారీశతకము ముద్రితము.

**కుమారీశతకము:** ఇది నీతిపద్యశతకము. కందపద్యశతకము కూడ "కూమా రీ!" అని మకుటము. బాలికలకు, మహిళలకు నీతులు పరిమితము.

"ధర ఫక్కికులుఁడు వేంకట
నరసింహకవీంద్రుఁ డిట్టి నడతలు ధరపై
తెరవల తెరువు లటంచును
జిరతరసత్కీర్తి వెలయఁ జెప్పెఁ గుమారీ!"

కుమారీశతకము లోగడ సుమతీశతకము వలె సుప్రసిద్ధమే కాని, ఇప్పుడు పెక్కునీతులకు కాలదోషము పట్టినది. అందొకటి :

నవ్వంగ రాదు పలుమఱు
నవ్విన చిఱునవ్వు గాని నగరా దెపుడున్
గవ్వల వలె దంతంబులు
జవ్వనఁ గానఁగఁబడెడి జాడఁ గుమారీ!

కాలదోషము పట్టని కతిపయనీతిపద్యములును కలవు.

"అత్తపయిన్ మఱదలిపయి

నత్తిన కోపమున బిడ్డ నేడ్పించుటకై
మొత్తినఁ దనకే కీడగుఁ
జిత్తములో దీనిఁ జింతసేయుఁ గుమారీ!" 28ప.
ఇద్దఱు గూడుక యొకచో
నొద్దిక మాటాడుచుండ నొదిగి యొదిగి యా
యొద్దికిఁ జనఁగూడదు తన
పెద్దతనంబెల్ల మాగఁ బెట్టుఁ గుమారీ!" 90ప.

**మాడభూషి నరసింహాచార్యులు** : ఇతని కృతి వల్లీపల్లవోల్లాసము. ఆకిరిపల్లి లోని నృసింహస్వామికి అంకితము. నూజివీడు సంస్థానాధిపతి శోభనాద్రి-అప్పారావు కృతి ప్రేరకుడు. అతని సంస్థానాధిపత్యకాలము[290] 1830-68. కాఁబట్టి వల్లీపల్లవోల్లాసము రచనాకాలము 1840 ప్రాంతము కావచ్చును.

వల్లీపల్లవోల్లాసమన సత్యాపరిణయము. సత్య అన సత్యభామ కాదు. నగ్నజిత్తనయ నాగ్నజితి. ఆమె నారదుని శ్రీకృష్ణసౌందర్యాతిశయవర్ణనమును ఆలకించి, శ్రీకృష్ణుని ప్రేమించును. స్వయంవరపణముగ ఏడాఁబోతులను బంధించి శ్రీకృష్ణుడు వివాహ మాడును. రాజహంసి రాయబారము; అర్జునుని రాయబారము, యుద్ధము; కతిపయ వర్ణనములు కలవు. నాటి వేటగాండ్రు "తుపాకులు" ధరించుట విశేషము! (43ప. 3ఆ.) అన్నిటికంటె అపూర్వమైన విశేషము శ్రీకృష్ణుని మీసము! బవిరి గడ్డము!!

"బవిరి గడ్డము మీసంబుఁ బరిఢవిల్ల
శౌరి వదనంబు విలసిల్లె సరసముగను
మబ్బుతునియల మాటున మసలు చుండి
డంబు మీఱిన చంద్రబింబంబు పగిది. " 41ప. 2ఆ.

**వేంకటకవి** : ఇతని కృతి కార్తికమాహాత్మ్యము అముద్రితము. మార్కొండ ఆదియామాత్యునికి అంకితము. అతడు మేరంగి సంస్థానాధిపతులు చంద్రశేఖరరాజా (1798-1833) జగన్నాథరాజా - తండ్రి, కొడుకు- ఇద్దఱికిని మంత్రి. జగన్నాథరాజా సంస్థానాధిపత్యకాలము[291] 1835-64. కాఁబట్టి కార్తికమాహాత్మ్యము రచనాకాలము 1840 ప్రాంతము కావచ్చును.

కార్తికమాహాత్మ్యము స్కాందపురాణాంతర్గతము. చర్వితచర్వణము.

**మండవేముల వేంకటరామయ్య** : ఇతని కృతి క్రియాయోగసారము. బొబ్బిలి సంస్థానాధిపతి బంధువు ఇనుగంటి రామరాయలు కృతిప్రేరకుడు. అతని కాలము[292] 1810-70. కాఁబట్టి క్రియాయోగసారము రచనాకాలము 1840 ప్రాంతము కావచ్చును.

క్రియాయోగసారము పద్మపురాణోత్తరఖండాంతర్గతము. పురాణము.

**మండపాక కామయ్య** : ఇతని కృతులు. 1. కార్తికమాహాత్మ్యము. 2. బలరామక్షేత్రమాహాత్మ్యము. 3. బ్రహ్మోత్తరఖండము. 4-6 శతకములు 7. అష్టకములు 8. దండకములు. ఇతని కాలము 1810-72 అనికలదు[293]. అయిన కృతుల రచనాకాలములు కార్తికమాహాత్మ్యము 1840 ప్రాంతము, బలరామక్షేత్రమాహాత్మ్యము 1845 ప్రాంతము, బ్రహ్మోత్తరఖండము 1850 ప్రాంతము, తక్కిన కృతులు తదనంతరకాలికములు

కావచ్చును.

**మిక్కిలి మల్లికార్జునుడు** : ఇతని కృతులు 1. విక్రమార్కచరిత్రము. 2. భేతాళపంచ వింశతి. 3. రామచంద్రచరిత్రము 4. భగవద్గీత. 5. నాచికేతూపాఖ్యానము. 6. రాఘవ శతకము. ఇందు రామచంద్రచరిత్రము అసమగ్రముగ లభించినది. నాచికేతూపాఖ్యానము ముద్రితము. ఇతడు అల్లమరాజు సుబ్రహ్మణ్యము (1853-78) వెలివెలసోమన (?) మాఢభూషి నరసింహాచార్యులు (1840) అను కవులకు సమకాలికుడు. (నాచి. పీఠిక. పుట 4) నాచికేతూపాఖ్యానము వాడ్రేవు (వాడరేవు) వేంకటరాయనికి అంకితము. అతని జ్యేష్ఠపుత్త్రుడు వేంకటాచలపతి ఉరవు చలమయ్య జననకాలము 1846 వ సంవత్సరము. (నాచి. పీఠిక. పుటలు2-3) కనుక వేంకటరాయని జననకాలము స్థూలముగ 1825 అగును. కావున కృతిస్వీకారకాలము 1855 ప్రాంతము కావలయును. కాఁబట్టి మల్లికార్జునుని కృతుల రచనాకాలములు విక్రమార్కచరిత్రము 1835 ప్రాంతము, బేతాళపంచవింశతి 1840 ప్రాంతము, రామచంద్రచరిత్రము 1845 ప్రాంతము, భగవద్గీత 1850 ప్రాంతము, నాచికేతూపాఖ్యానము 1855 ప్రాంతము, రాఘవశతకము 1860 ప్రాంతము కావచ్చును.

నాచికేతూపాఖ్యానములోని ఇతివృత్తము, దగ్గుబల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానము లోని ఇతివృత్త్రమే. రెండును సంస్కృతనాసికేతోపాఖ్యానమునకు సన్నిహితములు. దుగ్గన నాసికేతోపాఖ్యానమునందు యమలోకవర్ణనము కల తృతీయాశ్వాసము అసమగ్రముగ లభించినది. అది కూడ అక్కడక్కడ శిథిలమైనది. మల్లికార్జునుని నాచికేతోపాఖ్యానము నందు యమలోకవర్ణము కల తృతీయాశ్వాసము సమగ్రముగ లభించినది. ఎక్కడను శిథిలము కాలేదు. ఇందు ఉద్దాలక బ్రహ్మసంవాదము ప్రథమాశ్వాసము. రఘుపతి అను రాజు తనయ చంద్రమతి గంగాస్నానము, గర్భధారణము, దేశబహిష్కరణము, తృణ బంధుసంరక్షణము, నాచికేతుజననము, నాచికేతుని ఉద్దాలకాశ్రమ ప్రవేశము, చంద్రమతి నాచికేతుని కనుగొనుట, ఉద్దాలకుడు చంద్రమతి గుఱించి నాచికేతుని ద్వారా తెలిసి కొనుట, రఘుపతిని కోరి చంద్రమతిని వివాహమాడుట ద్వితీయాశ్వాసము. నాచికేతుని యమలోకప్రవేశము, పర్యటనము, పునరాగమనము, మునులకు యమలోకము గుఱించి వివరించుట, దుష్కృతుల నరకయాతనలు, దుష్కృతుల సుకృతుల మార్గములు, బ్రహ్మ నారదసంవాదము మొదలైనవి తృతీయాశ్వాసము. ఇతివృత్తమునందు శృంగారరసము నకు అవకాశము లేకపోయినను, ఇందు తృణబిందుమునీశ్వరుడు చంద్రమతిని పలుక రించిన విధమునందు పాత్రానుచితముగ ప్రతిఫలించినది.

"ఊర్వశివొ మేనకవొ గం
ధర్వసతీమణివొ యక్షనాగాంగనవో
పర్వేందువదన నీ కీ
యుర్విం గల చెలులు సామ్యమొందుదురటవే. 75పు.

విరిఁబోణి నీ మేను విద్యుదాకారంబు
కలికి నీ పదములు జలరుహములు
లలన నీ జఘనస్థలంబు భూసామ్యంబు
వనిత నీ నాభి యావర్తసమము

కాంత నీ కుచములు ఘనభూధరంబులు
  సకియ నీ నెమ్మోము చంద్రబింబ
మతివ నీ ముంగురు లళిసమూహంబులు
  తరుణి నీ రమ్యకంధరము దరము
చెలియ నీ రూపసంపద జలజభవుఁడు
సావధానమనస్కుఁడై భావమునఁ ద
లంచి మనమున దా సృజియించెనొక్కొ!
కాక యీ రూపు కలదె లోకముల యందు " 75, 76పు.

ఇది కాల ప్రభావము. ఇందు వర్ణనా ప్రలోభము లేకపోవుట విశేషము. ఆశ్రమ (46, 47పు.) పుర (54-58పు.) నాయిక (59-65పు.) జలకేళి (66-68పు.) వర్ణనలు కలవు.

**తిరుమల బుక్కపట్టణము చిన తాతాచార్యులు** : ఇతని కృతి విశ్వగుణాదర్శము. కృతిప్రేరకుడు వడ్లమన్నాటి వెంకన్నసోమయాజులు. అతడు చరిత్రకు అందని వ్యక్తి. "ఇతఁడు యేఁబది యేండ్ల క్రిందట నుండినవాఁడు" అని కలదు[294]. అనగా 1899-50=1849 ప్రాంతము. సమీపకాలికసమాచారము. సత్యసన్నిహితమగును. కాఁబట్టి విశ్వగుణాదర్శము. రచనాకాలము 1840 ప్రాంతము కావచ్చును.

**శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి** : ఇతని కృతులు 1. వేంకటాచలమాహాత్మ్యము (1820) 2. దీక్షారణ్యమాహాత్మ్యము (1830) 3. హనుమచ్ఛతకము (1835). 4. సర్వకామదాపరిణయము. (1840). 5. స్త్రీనీతిశాస్త్రము (1845). 6. పంచతంత్రము (1847). 7. కంకణబంధము (1850). 8. యక్షోల్లాసము. సంస్కృతము. ఉత్తరమేఘము. (1851). 9. మదనాభిరామము. (1852). 10. వల్లీపల్లవోల్లాసము (1853). 11. హరికారికలు. సంస్కృతము. కూటసృష్టి. (1855). 12. వసుచరిత్రవ్యాఖ్యానము. (1860). 13. నీలశైలనాథీయము. సంస్కృతము. (1867). 14. అశ్వశాస్త్రము. కూటసృష్టి (1869). 15. రామచరితమానససరోవరము-అయోధ్యాకాండము, అరణ్యకాండములో కొంత (1865).

**సర్వకామదాపరిణయము** : ఇందు అవతారిక లేదు. ద్వితీయాశ్వాసాదిపద్యము వినా ఆశ్వాసాద్యంతపద్యములు లేవు. ఇది రామచంద్రపురము (తూ.గో.జి.) సంస్థానాధిపతి కాకర్లపూడి రామచంద్రరాజా సోదరులలో ఒకడైన పద్మనాభరాజానకు అంకితము. కవి రామచంద్రపురమునందున్న కాలము[295] 1835-40. కాఁబట్టి సర్వకామదాపరిణయము రచనాకాలము 1840 ప్రాంతము కావచ్చును.

ఇది పరిణయప్రబంధమైనను, ఇతరపరిణయప్రబంధముల కంటె ఇంచుక భిన్నము. విజయనగరములోని రామలింగక్షేత్రమునకు సంబంధించిన ఇతివృత్తము. రామలింగశంకరుని కోరికను పార్వతి మఱల హిమవంతునికి జన్మించును. ఆమె పేరు సర్వకామద. ఆమె యౌవనవతి కాఁగానే దేవతలు ఆమె సౌందర్యమును వర్ణించి, రామలింగశంకరునితో "నీ కాంత యగుట కనుగుణ"మనిన, రామలింగశంకరుడు సప్తర్షులను రాయబారము పంపును. హిమవంతుడు సమ్మతించి కుబేరుని రాయబారము పంపును. సర్వకామదారామలింగశంకరుల వివాహము జరుగును. వివాహముతో కావ్యము సమాప్త

మగును. వివాహానంతరవిశేషము లేకపోవుట విశేషము.

సప్తర్షులు హిమాలయమును సమీపించునెడ, అసలు శంకరుడు వారికి కనిపించి, రామలింగక్షేత్రమాహాత్మ్యమును వివరించును. రామలింగక్షేత్రముతోపాటు సింహాచల క్షేత్రము, శ్రీకూర్మక్షేత్రము దర్శన మిచ్చును. సప్తర్షుల ప్రయాణమున జగన్నాథ, కాశీక్షేత్రములు సాక్షాత్కారమగును.

శైలి జటిలము. శబ్దాలంకారములతోపాటు శ్లేషాలంకారమును అధికము.

**ముద్దు లక్ష్మీనారాయణ** : ఇతని కృతి సహస్రకంధరరామాయణము. అముద్రితము. ఇతడు మండపాక కామయ్య శిష్యుడు. కాఁబట్టి సహస్రకంధరరామాయణము రచనా కాలము 1850 ప్రాంతము కావచ్చును.

**కాకరపర్తి బుచ్చిపాత్రుడు** : ఇతని కృతి సత్యవతీపరిణయము. అముద్రితము. ఇతడు కాకరపర్తి కృష్ణయ పుత్త్రుడు. అతని కృతుల రచనాకాలములు 1820, 1827 అని పూర్వోక్తము. కాఁబట్టి సత్యవతీపరిణయము రచనాకాలము 1850 ప్రాంతము కావచ్చును.

**కోటమరాజు నాగయ** : ఇతని కృతి అధ్యాత్మరామాయణము. "ఇతఁడు ముప్పది నలుబది సంవత్సరముల క్రిందట నుండినవాఁడు" అని కలదు[296]. అనగా 1899-30=1869 లేక 1899-40=1859. సమీపకాలికసమాచారము. సత్యసన్నిహితమగును. కాఁబట్టి అధ్యాత్మరామాయణము రచనాకాలము 1850 ప్రాంతము కావచ్చును.

**నడకుదుటి రామయ్య** : ఇతని కృతులు 1. ప్రభులింగలీల. 2. హరిమీడేస్తవము. 3. అధ్యాత్మకవివేకచూడామణి. అముద్రితములు. "ఈ కవి 1821 వ సంవత్సరమునందు జననమొంది 1887 వ సంవత్సరమునందు దివంగతుఁడయ్యెను." అని కలదు[297]. సమీప కాలికసమాచారము తోపాటు సమకాలిక సమాచారము. సత్యసన్నిహితమగును. కాఁబట్టి కృతుల రచనాకాలములు ప్రభులింగలీల 1850 ప్రాంతము, హరిమీడేస్తవము 1855 ప్రాంతము, అధ్యాత్మవివేకచూడామణి 1860 ప్రాంతము కావచ్చును.

**నల్లాని నృసింహాచార్యులు** : ఇతని కృతి పద్మినీపరిణయము. అముద్రితము. మర్లపూడినివాసి కాకర్లపూడి గోపాలరాజునకు అంకితము. ఇందు "రాయసం సుబ్బయ్య కాకర్లపూడి గోపాలరాజుగారికి ప్రమాదీచ సంవత్సరకార్తీకశుక్త గురువారం ఉదయమైన రెండు ఝాములకు"వ్రాసి ఇచ్చినట్లు కలదు[298]. అది 3-11-1853 వ తేదీ. కాబట్టి పద్మినీపరిణయము రచనాకాలము 1853 వ సంవత్సరము.

**అల్లమరాజు సుబ్రహ్మణ్యము** : ఇతని కృతులు 1. ప్రత్యక్షరశ్లేషపద్యావళి 2. శ్రీకృష్ణభూపతిలలామశతకము. 3. శేషధర్మములు. 4. పాపయమంత్రి శతకము. 5. ఆత్మబోధము 6. మణిధ్వజచరిత్రము. అనుపలబ్ధము. 7. సింహాద్రిరామాధిపశతకము. 8. భద్రాపరిణయము. 9. శ్రీకృష్ణకల్యాణము. ఇతడు అల్లమరాజు రామకృష్ణయ సవతి తమ్ముడు. ఇతని కృతుల రచనాకాలములు[299] శ్రీకృష్ణభూపతిలలామశతకము 1853 వ సంవత్సరము. శేషధర్మములు 1867 వ సంవత్సరము. పాపయమంత్రి శతకము 1865 లేక 1870 వ సంవత్సరము. ఆత్మబోధము 1875 వ సంవత్సరము. సింహాద్రి

రామాధిపశతకము 1876 వ సంవత్సరము. భద్రాపరిణయము 1878 వ సంవత్సరము. శ్రీకృష్ణకల్యాణము ప్రారంభము 1875 వ సంవత్సరము. ప్రత్యక్షరశ్లేషపద్యావళి 1853 వ సంవత్సరమగును. ఇది కృష్ణభూపతికి అంకితము. కృష్ణభూపతి మాడుగుల సంస్థానాధిపతి. కృష్ణభూపతిలలామశతకమును కృష్ణభూపతికి అంకితము. ఇతనికి మాడుగుల సంస్థానమునందు 1853 నుండి 1869 వఱకు వార్షికములు కలవు[300].

శేషధర్మములు చర్వితచర్వణము. ఆత్మబోధము వేదాంతగ్రంథము. శతకములు, పద్యావళి స్తుతులు. శ్రీకృష్ణకల్యాణము, భద్రాపరిణయము 1875 తరువాతి కావ్యములు.

భద్రాపరిణయము కాణాదము పెద్దన సోమయాజి ముకుందవిలాసమునకు ప్రతిబింబప్రాయము.

**స్వామినీన ముద్దునరసింహము నాయిడు (Naidu):** ఇతని కృతి హితసూచని. రచనాకాలము[301] 1853 ప్రాంతము. ప్రథమముద్రణము 1862 వ సంవత్సరము.

ఇది కావ్యము కాదు. వ్యాససంపుటి. సాహిత్యవ్యాససంపుటి కాదు. విజ్ఞానవ్యాససంపుటి. ఇందు ఆధునికయుగములోని మూఢవిశ్వాసనిరాసనమునకు, వ్యావహారికభాషావాదమునకు, హేతువాదమునకు బీజావాపనము కలదు. అందువలన అవశ్యపరిశీలనార్హము.

ఇందు ఎనిమిది ప్రమేయములు కలవు. 1. విద్యాప్రమేయము. 2. వైద్యప్రమేయము. 3. సువర్ణప్రమేయము. 4. మనుష్యేతరజంతుసంజ్ఞాప్రమేయము. 5. రక్షఃప్రభృతి ప్రమేయము. 6. మంత్రప్రమేయము. 7. పరోక్షాదిజ్ఞానప్రమేయము. 8. వివాహ ప్రమేయము. ప్రమేయ మన ప్రమాణింపఁదగినవిషయము. అనుమానము - అనుమేయము వలె, ప్రమాణము - ప్రమేయము. ద్రోణాచార్యకృతముగ కల ధనుర్విద్యా శాస్త్రమునందు ప్రమేయములను పరిగణనము కలదు. (చూడు. సంస్కృతాంధ్ర వాచస్పత్యములు) అందు జ్యారోహణప్రకరణము, ముష్టిప్రకరణము అను ప్రమేయములును కలవు. కావున ప్రమేయము ప్రకరణము కావచ్చును. ఇందు ఒక్కొక్క ప్రమేయము ఒక్కొక్క ప్రకరణముగ కలదు. (Chapter) ఒక్కొక్క ప్రకరణము ఒక్కొక్క వ్యాసముగ కలదు. (Essay) కాఁబట్టి వ్యాససంపుటి. తెలుగులో మొట్టమొదటి వ్యాస సంపుటి.

వైద్యప్రమేయమునందు "దయ్యములు మొదలైన వాటి వల్లను మంత్రప్రయోగములచేతను ఇంకా కొన్ని హేతువులచేతను వ్యాధులు కలుగుచున్నవనిన్ని మంత్రములు పూజనములు మొదలైన వాటి చేత అవి నివారింపబడతవనిన్ని కొందరు నమ్ముతున్నారు, ఇది వాస్తవమును పట్టి కలిగిన నమ్మకము కాదు."అని కలదు (పు. 20) సువర్ణప్రమేయమునందు "సువర్ణము చేసే విద్య యొకటి యున్నదని కొందరు నమ్ముతున్నారు. (పు. 31) అసలు లోహములలో నొక దాన్ని మరియొకటిగా చేయడ మెవరికిన్ని సాధ్యమైన పనికాదు. (పు. 33) స్పర్శవేది యనే పేరు గల వస్తువు ఒకటి యున్నప్పటికిన్ని దాని స్పర్శ వల్ల ఇనుము బంగార మయ్యేటట్టు నమ్మడమునకు తగిన సబబులు ఏమిన్ని కనపడలేదు. (పు. 35) శంకరాచార్యులవారు "ఉపదేశించిరన్న సువర్ణముఖి యనే విద్య క్రియారూప'మైన "బంగారము కానేరదు. . . . ." "మంత్రరూప మైన విద్య" యైన "కల్పితమైనదిగా నెంచతగియున్న"ది. (పు. 35-36) అని కలదు. రక్షఃప్రభృతిప్రమేయమునందు"

"చనిపోయిన వారు కొందరు రక్షస్సులును- పిశాచములున్ను- భూతములున్ను- దయ్యములున్నువి- జీవించియున్నవారిలో కొందరికి పూర్వస్వరూపములతో దర్శన మిచ్చి మాటలున్ను చెప్పుతున్నారని ఏలాగున నమ్మను. . . . ఇటువంటివి సంభవించడమునకు వారి వారి మనోవికారములై యుంటున్నవి." అని కలదు. (పు 57-80) మంత్రప్రమేయము నందు తేలు, పాము, దేవతల "మంత్రములయందు ప్రత్యక్షఫలమేమీ లేదు." (పు 160) అను వివరణము కలదు. (పు 73-147). శంకరాచార్యస్వాముల వారి సంగతి తోపాటు పరకాయప్రవేశవృత్తాంతములు కల్పితములని కలదు. (పు 81-128) మహాభారతములోని తక్షకవృత్తాంతము నీతిబోధకమేగాని, "శృంగియొక్క తిట్టు వల్ల సదరు విరుద్ధసంగతులు జరిగినట్టు ఎంచే వల్ల లేదు."అని కలదు. (పు. 128-147) పరోక్షాదిజ్ఞాన ప్రమేయమునందు దివ్యదృష్టి, దేవతోపాసనాలబ్ధి యథార్థము కాదని, జ్యోతిశ్శాస్త్రసాముద్రికశాస్త్రఫలితములు "ఖరాగా సంభవిస్తవని నమ్మదగినవి కావు." అని కలదు. (పు. 148-158) ఇవియెల్ల మూఢవిశ్వాసనిరాసమును మూదలించునవి.

వివాహప్రమేయము విలక్షణమైనది. స్వజనులకు సంకల్పించినది. సర్వజనులకు సంబంధించినది. స్వజనులకు వ్రాసిన ఉత్తరములోని అంశములు, వారు వ్రాసిన ప్రత్యుత్తరములోని అంశములు, మఱల వ్రాసిన ఉత్తరములోని అంశతములు, వారి మౌనము, వీరి పునరుద్ఘాటనము వివాహప్రమేయమునందు కలవు. ప్రతిపాదనమునందు "వివాహమునకు మూడు సంగతులు ఆవశ్యకములై యున్నవి." అని కలదు. (పు 63) అవి : 1. "చిన్నదానియొక్క చిన్నవానియొక్క పరస్పరేచ్ఛ." 2. "ఆవశ్యకులైన వారు కూడి వధూవరులు కావడమునకు ఆ చిన్నదానికి చిన్నవానికి ఉండే ఇచ్ఛను రూఢి పరచదగిన కార్యమనగా పాణిగ్రహణము. 3. విస్తారమైన వ్రయము జరూరు లేదు. ఇందు వధూవరుల పరస్పరేచ్ఛ బాల్యవివాహమునకు బాధకము. రజస్వలానంతర వివాహమునకు సాధకము. కనుక బాల్యవివాహపరామర్శ ఇట్లు కలదు.

> "యుక్తవయస్సు రాని బాలికలకే వివాహము చేసే లాగున
> ఏర్పరుచుకున్న ఆచారము ద్రవ్యము పుచ్చుకుని బాలికలను వివాహమున
> కిచ్చే మర్యాదను కూడా కలుగ చేసింది. ఇది మిక్కిలి దురాచారమయి
> నటువంటిన్ని సహింపశక్యము కానటువంటిన్ని పద్ధతిగా నున్నది. . . .
> ఈ ప్రకారము వివాహమునకు ఇవ్వబడ్డ చాలామంది బాలికలు యౌవనము
> వచ్చిన నాట నుంచి చాలా దైన్యములను దుఃఖములను అపకీర్తులను
> పొందడమునకు హేతువులు కలుగుచున్నవి. . . . . . దుర్నయములకు
> లోబడే మనుష్యులయొక్క యత్నములకు ఆతంకము ఏమిన్నిలేకుండా
> నున్న పక్షమందు అవి ప్రబలముగా వ్యాపించగలవు - ద్రవ్యము పుచ్చు
> కుని బాలికలను వివాహమునకు ఇచ్చేవారిని మాంసవిక్రయికులని
> కొందరు వాడిక చేస్తున్నారు- కాని వారెవరున్ను ఆ దుర్నయమయిన
> ఆచారమునకు ఆతంకము చెయ్యజాలకుండా నున్నారుగనుక సదరు
> ఆచారము క్రమేణ ప్రబలిస్తూ ఉన్నది. . . . . . " (పు. 216-217)

ఇది దురాచారనిరాసనము. దురాచారనిర్మూలనము కాదు. ఇట్లు హితసూచనిలోని ఎనిమిది ప్రమేయములును హేతువాదము మూలభూతములైనవి. ప్రమేయములందు

గాక పీఠికయందు వ్యావహారికభాషావాదబీజన్యాసము కలదు. ఆ విషయమిది :

"ఆంధ్రభాషయందు కొన్ని పదములలో నొకానొక యక్షరము నకు అర్ధానుస్వార చేరి యుండడము జరూరైనట్టు లక్షణగ్రంథముల యందు చెప్పబడియున్నది కాని అటువంటి చాలా పదములు ఇప్పట్లో అర్ధానుస్వార లేకుండానే సాధారణమైన భాషయందు వాడిక చెయ్య బడుచున్నవి - పదవ్యాపారమందు హద్దులు ఏర్పరచడమునకు దేశము యొక్క వాడిక యున్ను నీతియున్ను ఆధారములై యుండవలసినది గనుకనున్ను వాఁడు వీఁడు అనే పదములు ఉచ్చారణయందున్ను వాక్య గ్రంథముల లిపియందున్ను వాడు వీడు అని వాడిక చెయ్యబడుచున్నవి గనుకనున్ను ఈ వాడిక ఉచ్చారణకున్ను లిపికిన్ని సులభముగా నున్నది గనుకనున్ను - అటువంటి పదములు వాడికను అనుగుణము గానే యీ పుస్తకమందు వ్రాయబడుచున్నవి - శకటరేభ యనే యక్షరము కొన్ని పదములలో చేరియుండవలసినట్టు కూడా లక్షణ గ్రంథములలో చెప్పబడియున్నది. కాని అటువంటి పదములలో రేఫను చేర్చినా శకటరేఫను చేర్చినా అర్థము ఒకటే ఐయుంటున్నది కనుకనున్ను రేభ శకటరేభలకు ఉచ్చారణయందు భేద మేమీ కనపడడము లేదు గనుకనున్ను అటువంటి చాలా పదములు వాక్య గ్రంథములయందు ఇప్పట్లో శకటరేభ లేకుండా రేభను చేర్చి వ్రాయబడుచున్నవి గనుకనున్ను అందఱు- కొందఱు- బొఱ్ఱ- గుఱ్ఱము అనే పదములు ఈ ప్రకారము శకటరేభతో వ్రాయడము కంటె అందరు- కొందరు- బొర్ర- గుర్రము అని రేభతోనే వ్రాయడము లిపికి సులభముగా నున్నది గనుకనున్ను ఏకరీతిగా పలుకవలసిన పలుకులలో నొకదానికి ఒక యక్షరమున్ను మరియొకదానికి ఇంకొక యక్షరమున్ను వ్రాయవలసియుండడము అధికమైన చికాకు కలుగడమునకు కారణ మౌచున్నది గనుకనున్ను రేభశకటరేభలలో రేభయనే వర్ణమే ఉచ్చా రణ గల అన్ని పలుకులకున్ను చిహ్నమయి యుండతగియున్నది గనుకనున్ను ఈ పుస్తకములో అటువంటి పలుకు లన్నీ రేభతోనే వ్రాయబడుచున్నవి. . . . . . . . . భాషయందు వాడికలోనున్న గ్రామ్యపదములు చాలా మట్టుకు సరసమయిన వాక్యరచనలో అంగీకరించతగినవిగా నేను ఎంచుకుంటున్నాను." (పు. 3-5.)

ఇట్లు వ్యావహారికభాషావిలాసము, హేతువాదము మూలభూతమైన మూఢవిశ్వాస నిరాసము మూర్తీభవించిన హితసూచని ఆధునికయుగమునకు అరుణోదయము. అయినను, 1862 వ సంవత్సరమునందు ముద్రితమైనను, 1937 వ సంవత్సరము వఱకు స్మరింపకపోవుటకు హేతువు దురవగాహము. అంతేకాదు. వ్యావహారిక భాషా వాదులు సహితము ప్రముఖవ్యావహారికభాషావచనగ్రంథముగ ప్రకటింపకపోవుటకు హేతువు కూడ దురవగాహము.

**వారణాసి అచ్యుతరామయ్య** : ఇతని కృతి సురతాణీపరిణయము. మరిగంటి రామానుజాచార్యులకు అంకితము. గుర్వంకితము. కావ్యాంతమునందు,

"విరచింపంబడె నీ ప్రబంధము జగద్విఖ్యాతిగా రామచం
ద్రరమేట్ప్రత్యపు శాలివాహనశకాబ్దాలిన్ రసాగక్షమా
ధరచంద్రాంచిత సంఖ్య కాంతరలసన్మానోన్నతానందవ
త్సరసత్కార్తికశుక్లసప్తమిని భాస్వత్పౌరవారంబునన్." పుట 330.

అను పద్యము కలదు. రస=6, అగ=7, క్షమాధర=7, చంద్ర=1 - 1776+78= 1854. కాబట్టి సురతాణీపరిణయము రచనాకాలము 1854 వ సంవత్సరము.

"అరయఁగ నది సురతాణీ
పరిణయమన యక్షగానపద్ధతిగా ము
న్విరచింపఁబడె నీవును
విరచింపుము గద్యపద్యవిత్రుతకృతిగాన్." పుట 6.

అని గుర్వాజ్ఞ. గురువు రామానుజాచార్యులు కూడ కవియే. అయినను ఇతనిని రచింపుమనుటకు హేతువు శిష్యవాత్సల్యము.

"ఎనయఁగా నిట్లు పలుకుట యే రచింప
నేరకయుఁగాదు నీకృతి నేర్పుమీర
దెలియుటకు ఁగాని నరసింహదేవుకరుణ
నెనయఁగా నిమ్ము గురుకట్నమిదియె నాకు. " పుట 6.

ఇది అక్షరమైన గురుదక్షిణ. ఇందలి నరసింహదేవుడు "కిరినరహరి" (పుట 6.) సింహాచలక్షేత్రదైవము.

రామానుజాచార్యుల మతొక శిష్యుడు "దరువూరి యప్పలార్యుని ఘనసాహితీ మహిమ యొప్పుగఁ దోడ్పడ "అచ్యుతరామయ్య రచించినట్లు కలదు. (పుట 7) వీరి జంట కవిత్వము లక్ష్మీనారాయణవిలాసమను యక్షగానము మాత్రమే[302].

సురతాణీకల్యాణము అని కర్తృకాలములు తెలియని ఒక యక్షగానము కలదు[303]. అది సురతాణీపరిణయకావ్యమునకు కారణమైన యక్షగాన మగునో కాదో నిర్ధరించుట దుర్ఘటము. ముడుంబై అలమేల్మంగాతాయారమ్మ రచించిన సుల్తానీకల్యాణమను యక్ష గానము మతొకటి కలదు. ఇది ఆధునికము[304].

సురతాణీపరిణయ మన బీబీనాంచారురంగనాథుల పరిణయము. ఇది రామానుజా చార్యుల కాలమునందు జరిగినట్లు ఆచార్యసూక్తిముక్తావళియందు కలదు. పరమయోగి విలాసమునందు లేదు. ఆ కాలమునందు ఈ వృత్తాంతము నిరవకాశము. ఆచార్యసూక్తి ముక్తావళిలోని వృత్తాంతము యక్షగానమైనది. ఆ యక్షగానపద్ధతిని ఈ కావ్యము రచింపఁ బడినది. యక్షగానపద్ధతి అనగా యక్షగానప్రక్రియాపద్ధతి కాదు. యక్షగానకథాపద్ధతి కావచ్చును. ఈ కావ్యము కవి ఆశించినట్లు "అపూర్వరమణీయంబును శ్రీమన్నారాయణ కథాసుధారసపానలోలకవిసార్వభౌమజేగీయమానంబును వినూతనానల్పకల్పనా జల్పం బు". (పుట 4) అయినను, ముద్రితమైనను (1932) ప్రసిద్ధము కాలేదు. ముద్రణ మును సుష్ఠుకృతము కాలేదు. కవి యశస్వి కాలేదు. "పుణ్యై ర్యశో లభ్యతే."

సురతాణీపరిణయకావ్యమునందు కథనము, కవనము కమనీయము రచనము రమణీయము. రసపోషణము మణిభూషణము. పాత్రచిత్రణము పరమౌచిత్యవిలసితము. ధార ధారాళము. శైలి సరళము. జాతివార్తాచమత్కారములు జాళువా పసిఁడి మెఱుంగులు.

కాలానుగుణముగ కథానుగతమైన కతిపయవర్ణనాతిశయము కలదుగాని వాస్తవికతా స్ఫోరకము.

ఢిల్లీ పురవర్ణనము (17-23 పు) సాధారణపురవర్ణనము. పురాధిపతి "సేకుముఖ మ్లేచ్ఛకులనిసర్గధర్మపరిపాలకుఁడు సురతాణుఁడు" (23 పు.) అతని కొలువుకూటమునకు అరుదెంచిన ఎఱుక అరణ్యవర్ణనమునందు అపూర్వభావము.

"భూవర! కంటివే వనినిఁ బుట్టిన యీ విపరీతమెల్ల దం
తావళసింహముఖ్యమృగనైజవిరోధము లే దొకింతయున్
భావివినాశహేతువు గనంబడి యుండుటచే "వినాశకా
లేవిపరీతబుద్ధి" యని లేదె మునున్ స్మృతి నెందుఁ జూచినన్. " 25పు.

ఎఱుక రాక వలన వేట. వేట వర్ణన తర్వాత సూర్యాతపవర్ణన. సచివుని సరోవర వర్ణన. సురతాణుడు సరోవరమునందు స్నానము చేసి, ఒక పద్యమును చూచి, సచివుని చేత తెప్పించి, దళములు విచ్చి, అందొక పసిబాలికను అరసి ఇట్లు తలపోయును.

"కాఁబోలుఁ గమల యిక్కమలాస్య గాకున్నఁ
పంకజావాసయై పరఁగు నెట్లు?
కాఁబోలు వాణి యీ ఘనవేణి గాకున్నఁ
గమలాసనాసక్తి గలుగు టెట్లు?
కాఁబోలు గౌరి యీ ఘనగౌరి గాకున్నఁ
బుష్కరమూర్ధాప్తిఁ బొలుచు టెట్లు?
కాఁబోలు రతి యీ సుగజగతి గాకున్న
నలినాంబకావాప్తి నలరు టెట్లు?
కావున నుదారమగు నిది కమలనయన
కమలసంభూత ప్రవిలసత్కమలపాణి
కమలబాణాంగనాంశసంకలితజన్మ
కానిచో నిట్టి సౌందర్యకలిత యగునె?" 36-37 పుట

పసిబాలికను తీసికొనిపోయి అల్లారు ముద్దుగా పెంచును. ఆ పసిబాలికయే సురతాణి. సురతాణి జన్మవృత్తాంతమిది ఆచార్యసూక్తిముక్తావళియందు లేదు. పరమ యోగివిలాసములోని పద్మినీజన్మవృత్తాంతమునకు అనుసరణమగును. సురతాణి డోలారోహణమహోత్సవము, బాల్యచేష్టలు సహజత్వ ముట్టిపడు వర్ణనలు. జాతి రత్నములు. అందొకటి :

"అమ్మ సురతాణి ము ద్దిమ్మటంచు నొరులు
పలుకరించినఁ గేరి కేకలిడి నవ్వుఁ
దనర "నత్తత్త యవ్వవ్వ తాత తాత"
యొనర "నుగ్గుగ్గు" అని పొంగి యూసులాడు." 40పు.

సురతాణి బాల్యక్రీడలు, విద్యాభ్యాసము వాస్తవికతాముద్రితములు. యౌవన వర్ణనము నఖశిఖపర్యంతవర్ణనము. సురతాణి బొమ్మల పెండ్లి చేయఁదలఁచి, చెలికత్తెలు తెచ్చిన బొమ్మలు నచ్చక, సురతాణుడు చెఱఁబెట్టిన బొమ్మ నొకటి కోరును. సురతాణుడు విగ్రహములను గైకొన్న దండయాత్రలను వివరించి అనుమతించును. సురతాణికి విగ్రహాలయము వివాహాలయముగ కనిపించును. (62 పు.) నీలగిరినాథుని, అనంతపద్మ

నాభుని, కరిగిరీశుని, కుంభకోణనిలయుని శ్వేతనగవాసుని విగ్రహములను చూచి సంతోషించి, రంగనాథుని విగ్రహమును చూచి పులకించును. సురతాణిని చూచి రంగనాథుడు పరవశించును. "చెఱనుంచిన సురతాణుఁడు పరికింప మహోపకారి" అని కూడ భావించును. (68 పు) సురతాణి రంగనాథుని విగ్రహమును "ముద్దులు పెట్టుచు నక్కునఁ జేర్చుచు" కాంచనమణిజాలసౌధమునకు తెచ్చును. తాను జలకమాడి, అలంకరించుకొని; రంగనాథునికి మజ్జన మాచరించి అలకంరించి పడకింట పవ్వళింపఁజేయును.

"పగడాల పలుకోళ్లఁ బన్ను నీలంపుఁ గం
 బములపై దంతపుఁ బందిరి దగ
దంతపుఁ బందిరి తళుకుల మెలఁపులఁ
 గెంబట్టు చందువా డంబు మీఱఁ
గెంబట్టు చందువా క్రేవలఁ గట్టాణి
 ముత్తెంపు జాలారు మురువుఁ జూప
ముత్తెంపు జాలారు మురువుఁ దేటలు గ్రమ్మ
 హొంబట్టు పరుపు మేల్ హొయలుఁ జూప
నమరఁ బందిరి మహాలు మంచమునఁ బవ్వ
ళించె శ్రీరంగవిభునితో మించుబోడి
బొమ్మ యని నెమ్మితోఁ గాని బమ్మఁ గన్న
తండ్రియను మాట నెమ్మదిఁ దలఁపు లేక" 84-85 పు.

నిదురించు సురతాణి సోయగము చూచి, రంగనాథుడు మదనుని ధాటికి చిక్కి, చొక్కి, పల్దెర నొక్కినంత, సురతాణి కళవళమంది లేచి ప్రత్యక్షమైన రంగనాథుని పరికించును.

"వలపుఁజెమట వెల్లువలై
లలనామణి మేనఁ బొలిచె లక్ష్మీసుతుఁ డొ
జ్జలగుచుఁ గాఁగల పెండ్లికి
లలిఁ దొలుతం గూర్చు మంగళస్నాన మనన్." 87 పు.

విభ్రమ చెందిన సురతాణికి రంగవిభుడు తన రంగవైభవమును తెలిపి, వలపు ప్రకటించును. సురతాణి భయము, ధైర్యము, దయ, ఆశ, సిగ్గు కలిగి, తెరచెంత

"నిలిచి మిటారి సారెకును నే ర్పలరారఁగఁ గీరశారికా
వలులను జూచి మీ చతురవాక్కుల మిక్కిలి నెన్ననయ్యె నీ
పలుకుల కేమి మీ రిఁకఁ బ్రబంధములం బరికింపుఁ డంచు న
వ్వొలయఁగఁ బల్కెఁ జారుచతురోక్తుల భావగుంభితంబుగన్." 90 పు

అనిన, రంగనాథుడు "ఔనౌ చెలి కీరశారికల కట్లు ప్రబంధము లభ్యసింపఁగా సూచనఁ జేసి తాఁ గళలు సూపిన నేనును సంతసించెదన్" అని, చిఱునవ్వు నవ్వి "ఒక్క నెపమ్ముఁ జేసి యువ్వనితను జేర్చె సెజ్జపయి" (90 పు.) సురతాణి "పతి చేయు చెయువుల కలరుఁగాని దవిలి ప్రతి సేయనేరదు." (91 పు) రంగనాథుడు సరతాణిని "అబ్జాస్త్రకేళీగతిం దేలించు"ను. అది మొదలు రంగనాథుడు పగలు విగ్రహము. రాత్రి ప్రత్యక్షము.

వసంతర్తువర్ణనము (101-104 పు.) రంగనాథునికి బ్రహ్మోత్సవసమయము వచ్చు

ను. విగ్రహము లేదు. రామానుజాచార్యులు వైష్ణవపరివారముతోను విష్ణువర్ధనుని చతురంగబలముతోను ఢిల్లీ చేరును. సురతాణుడు ప్రణిధుల సూచన ప్రకారము సౌధాగ్రము నుండి "అచ్చా బహద్దరుఁ గని స్వచ్ఛంబునఁ దోఁచు"నని రామానుజాచార్యులను ఆహ్వానించును. రామానుజాచార్యులు విగ్రహమును కోరును. సురతాణుడు విగ్రహములుంచిన చెఱసాల చూపించును. అందు రంగనాథుని విగ్రహము కనిపించక రామానుజాచార్యులు "ఇందు మాసామి యొకఁడు లేఁ డదే"మని అడుగును. సురతాణుడు,

"నే నన్ని విగ్రహంబులఁ
బూనిక నిందుంచి తొకటి పోవుట యెఱుఁగన్
మీ నమ్మిక సామైతే
వానిం బిలిచికొని పొమ్ము వైష్ణవతిలకా! " 115 పు.

అని చెప్పును. రామానుజాచార్యులు రంగనాథుని ప్రార్థించును. అది విని, సురతాణితో కేళిభవనమునందు పవళించిన రంగనాథుడు "డోలాయితస్వాంతుఁడై" (119 పు.) "నిద్దురచే నలరెడు నా ముద్దుంగన్నియకుఁ దెల్పఁబోక కలికి మేల్ నిద్దపుటద్దము చెక్కులు ముద్దిడు కొనుచున్ పాన్పు డిగ్గి మునుకొని" అతికష్టము మీద (120-122 పు.) విగ్రహవైఖరి ధరించి, రామానుజాచార్యుల అంకతలమున ఆసీనుడగును. పారిషదులు ఆశ్చర్యపడుదురు. సురతాణుడు రామానుజాచార్యులను ప్రశంసించి విగ్రహములన్నియును. ఇచ్చివేయును. రంగనాథుడు శ్రీరంగమునందు పునఃప్రతిష్ఠితుడైనను సురతాణిని మఱువలేడు.

"సుదతి నెన్నాళ్లకుఁ జూతునో యిఁక నని
 పలుమాఱు మోము తప్పకను జూచు
నాతికిఁ బువ్వు లెన్నటి కిఁకఁ గూర్తునో
 యంచు గోటను గురు లమరఁ దీర్పుఁ
బల్లవాధరను నెన్నాళ్లకు నిఁకను వ
 రింతునో యని కేల్ ధరించుఁ గేల
నలినాక్షి చూపు లెన్నటి కిఁకఁ బ్రాపించు
 నో యంచు ముద్దు కన్నుఁగవ నుంచుఁ
దలఁగ నూహించు చెలిఁ గాంచి తమి వహించు
జనుల సడి కోడు ధృతి వీడు సరస నాడు
సమదమదనహయార్భటీఝూంకృతులకు
రంగఁ డశ్రాంతచలితాంతరంగుఁ డగుచు" 120 పు.

వచ్చినందున అది సహజమే. ఇక సురతాణి వేకువను మేలుకాంచి "సెజ్జపైని హరిఁ గాంచి లేకున్న భ్రమ వహించి" పలు విధముల తలపోయును. అందొకటి:

"రంగనాయకి కమ్మ వ్రాసి పంపెనొ నిజ
 విరహార్తిచేఁ జాల వేగలేక
ధరణీపురంధ్రి చందనముఁ బంపెనొ వలి
 మలయమారుతమున నిలువలేక
నీలాబ్జముఖియానవాలుఁ బంపెనొ నిజ
 విరహపాండిమముచే నోరయలేక

అల చూడికుడుత పువ్వుల దండఁ బంపెనో
యొగి మరుశరముల కోర్వలేక
కట్టా! యీ పని కెవ్వతె నెట్టుకొనెనొ
తెలియఁ బడదిది నా నోము ఫలము కొలఁది
తొలగి చనె హరి యిది మది దోసమనక
యిందు కేమందు విరహార్తి కేమి మందు" 130 పు.

రంగనాథుడు ప్రమదావనమున కేగె నేమో అని, సురతాణి ప్రమదావనమున కేగి పలువిధముల పరితపించును. చెలికత్తెలు వెదకికొని వత్తురు. సురతాణి చేష్టలు గమనింతురు. మదనమోహిని అను చెలికత్తె అందఱిని పంపించివైచి, రహస్యముగ కారణ మడుగును.

"అనలేము గాని తరుణీ!
వినవే నీ జాడఁ గన్న విభు దంటన్నా
సిన లలన వలెనె యున్నది
గనవుగదా స్వప్నమునను గాంతుని నొకనిన్."

అని " అడిగీ యడుగని లాగున నడిగిన "సురతాణి" తెలిపి తెలుపనట్లు చతుర తన్" దెలుపును. (147పు.) మదనమోహిని ధైర్యము చెప్పును. సురతాణి కల అని చెప్పినదెల్ల నిజమని వివరించును. చెప్పకుండ వెళ్లెనని చింతించును. మదన మోహిని ఓదార్చును.

"ఏఁగిన నేమి మే నచట నిచ్చట నెమ్మది యున్న దమ్మ యే
లాగుననైన వాఁడిదె విలంబము సేయక వచ్చు రానిచో
నేఁగద వానిఁ దెచ్చుటకు నేఁగెద నెమ్మది నమ్మవమ్మ కాం
తా! గుడినున్న దేవుని గనన్ గుడి యెక్కఁగ నేల బేలవై." 162 పు.

సురతాణి మదనమోహినికి చెప్పిన రహస్యమెల్ల, చెలికత్తెలు "పొరువు టిరువులందు పొంచి యాలించి" సమీపించి నర్మోక్తు లాడుదురు. మదనమోహిని వారిని వారించును. సురతాణి "దినదినంబు మదనసంతప్తహృదయయై మరుగుచుండు"ను (165 - 174)

"యాత్రాబంధముచేతనైనఁ జని రంగాధీశు పాదాబ్జము
ల్నేత్రానందము గాఁగఁ జూతు ననిన్ మ్లేచ్ఛాళికిన్ శౌరి దీ
నత్రాణుండని భక్తి లేదు చనఁ జందం బెద్దియున్ లే దహో
పిత్రాదీనకుఁ గల్ల నేర్చునె మనోభీష్టప్రియశ్రేయముల్ " పుట 171.

అని సురతాణి ఆవేదన. మఱల విరహము, వనవిహారము, జలవిహారము, మన్మథపూజ, శిశిరోపచారములు, సౌధప్రవేశము (172-198). సురతాణి రంగనాథుని తీసికొని రమ్మని చెలికత్తెను కోరును. పంజరములోని చిలుక వారి వలన కాదని తాను సిద్ధమగును. సురతాణి కమ్మ వ్రాసి, ముద్రవైచి, "పై విలాసము"ను వ్రాసి ఇచ్చును. (204 పు.) శారిక ఏగును. కమ్మలోని అంశమిది :

"శ్రీరమణీయమూర్తియగు చెల్వునకున్ సురతాణి దా నమ
స్కారముఁ జేసి వ్రాసికొను కమ్మ తెలుంగు రమేశ నన్ను వే
సారి తొలంగి తెందులకు సమ్మతి నాదు మనోధనంబు నీ
వారడిఁ బెట్టికొంటి వది యంపుము క్రమ్మఱ నీకు మ్రొక్కెదన్."

సూర్యాస్తమయాదిచంద్రికావిహారపర్యంతవర్ణన. (209-219పు.) చంద్రమన్మథమారుతశుకపికశిఖిభృంగహంసతతుల ఉపాలంభము. (219-226 పు.)

"హర! హర! యెంతగాఁ గరినుఁ డయ్యెను మారుఁడు రామ! రామ! యీ
పరభృతసంఘ మెంత పగ పాడి యొనర్చెను చక్రి! చక్రి! యీ
హరిణధరప్రభంజనుల కక్కట యెంతటి చుల్కనైతి నం
చారఁగెను రంగ! రంగ! యని యుత్పలలోచన కల్పహాన్పునన్." 226 పు.

శారిక తిరిగి వచ్చి రంగవిభుని "యభిమత మింతిన్ మీఱక యుండుట" విశదీకరించును (228-249 పు.). అందు శ్రీరంగపురములోని విటీవిటవిహారము (223పు.) రతనపు మహలునందు శ్రీభూనీళాగోదాదేవుల సంభాషణమున (234-238పు.) రంగనాథుడు సురతాణి గుఱించి విరహావస్థనందుట శారిక విని, ఆడఁబోయిన తీర్థ మెదురైనట్లు రంగనాథాలయమును చేరి, శేషతల్పము మీద హరిని గానక, మఱొక చోట పవడపు పందిరి పట్టెమంచము మీద వియోగపాండిమను మున్కొను రంగని గాంచును. రంగడు విరహాలాపమున "ఒక బోటినిఁ గమ్మ లిఖించి పంపదే" అనగానే, శారిక-

"కవకవ నవ్వి రంగ! చెలి కమ్మయుఁ బంపదటంచు దూఱఁగాఁ
దివిరెదుగాని దాని ధృతిఁ దెంపునఁ దొల్లనె మ్రుచ్చిలించి యి
ట్లు వెడలు నీదు సేఁత లెదలోఁ దలపోయ వాకించుకైన నౌ
రవుర! వెదుళ్ల పందిరియు రాజుల మాటలు తిన్ననే గదా!" 244 పు.

అని పలుకును. ఈ పలుకు ఏ శారికదో తెలియక రంగడు పశ్చాత్తాపము ప్రకటించి, పాన్పుపై వ్రాలును. శారిక కమ్మను వక్షస్థలము మీద వైచును. రంగడు కమ్మ మీది ముద్రను చూచి మురిసిపోయి,

"చెలి పేరుఁ జదివి మఱి య
వ్వలి పద్ధతిఁ జదువఁ జూడ వారించెను గ
న్నుల నీరు కొంతవడి ని
శ్చలుఁడై గద్గదిక నిట్లు సదివెన్ వెనుకన్." 246 పు.

కమ్మ చదివి కమ్మ ఇచ్చు భాగ్యము గననైతినని పలుక, శారిక సమీపించి, గుర్తు తెలిపిన, రంగనాథుడు "తను విచ్చట మది యచ్చట నున్నదనుము . . . . మాయ లేదు కూరిమి ననుమా" అని పలుకును.

"అన విని నగి చతురానన
జనకుఁడ ఏ వగుట నీకుఁ జతురాననతన్
గను టరుదె మరుని చెలఁబడు
వనజజ నేచెదవొ ప్రోవ వచ్చెదొ చెపుమా"

అని శారిక అడిగిన, రంగనాథుడు అనుకూలవచనములు పలుకును. అంతేకాదు.

"బిత్తఱి వ్రాయు కమ్మఁ గని ప్రేమ మెలర్పఁగ దాని కేను మా
ఱుత్తర మే లిఖింతునని యూహ నొనర్చిన నెంత వ్రాతు నా
యుత్తర మీ వసుంధరయె యొక్క పటంబుగఁ జేసి వ్రాయఁగా
నత్తెఱఁ గంత కేమి కళనైనను జాలదు జాల మేటికిన్" 249పు.

అని, శ్రీభూనీళాగోదాదేవులు గరుడుని పంపదలంచుట వింటివని, నీలాంచిత

ముద్రిక ఇచ్చును. అది శారిక సురతాణికి ఇచ్చును. గరుత్మంతుడు వచ్చు లోపల సురతాణునకు తెలుపవలయునని చెలికత్తెలు నిర్ణయింతురు.

ప్రభాతవర్ణనము. (251-253 పు.) సురతాణి విషయము మదనమోహిని సురతాణి తల్లికి చెప్పును. ఆమె, సురతాణునకు తెల్పును. సురతాణి లభించినపుడు దైవజ్ఞులు చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చి సురతాణుడు సమ్మతించును.

గరుడాగమనము మొదలు సురతాణీరంగనాథుల పరిణయము వఱకు ప్రత్యేక మొక సుదీర్ఘమైన ఘట్టము. (262-329) కొంత విసుగు కలిగించినను వింత వివాహము. పరమతసహనమునకు పరమపదసోపానము.

**కోలా శేషాచలము** : ఇతని కృతి నీలగిరియాత్ర. వచనకావ్యమని ఇతని నిర్దేశము. (పుట 76). ఇతడు కవియేగాని, నీలగిరియాత్ర కావ్యము కాదు. యాత్రాగ్రంథము. "అతిశయోక్త్యాదికావ్యాలంకారంబులను దొఱంగి రచియించి"నను, కవి అగుట వలన అక్కడక్కడ కవిత్వచ్ఛాయలు కలవు. ప్రకరణాంతపద్యములందు చిత్రగర్భబంధ కవిత్వములు కలవు. అవి కృతిభర్తకు, కృతికర్తకును సంబంధించినవి. జమీందారు గొడే వేంకటజగ్గారావునకు (1817-1856) అంకితము. ఇతని నీలగిరియాత్రాకాలము 12-5-1846-13-1-1847. (పుటలు 1, 71) నీలగిరియాత్ర రచనాకాలము గుఱించి క్రైస్తుశకమున నొకవేయి శతము లెన్మిది పదు లయిదును మఱి నాల్గు హాయనములు నడుచు వర్షంబునను. . . . తేర్చినాఁడ నీలగిరియాత్ర" అని గ్రంథాంతమునందు కలదు. (పు 76) కాఁబట్టి నీలగిరియాత్రరచనాకాలము 1854 వ సంవత్సరము.

ఇది చిన్నయసూరి నీతిచంద్రిక కంటె పూర్వగ్రంథము కాదు. నీతిచంద్రిక ప్రథమ ముద్రణసంవత్సరము 1853. కాఁబట్టి రచనాకాలము తత్పూర్వమగుటతథ్యము. అంతేకాదు. ఇందు చిన్నయసూరి వచనరచనాప్రణాళికలోని ఆంతర్యమును గ్రహింపని అనుకరణము కలదు. నీతిచంద్రికలోని రీతిలాలిత్యము నీలగిరియాత్రయందు లేదు. సహజత్వము సకృత్తు. కృతకత్వము సమృద్ధి.

చిన్నయసూరి బాలవ్యాకరణమునందు. బాలవ్యాకరణము కంటె పూర్వము రచించిన ఆంధ్రశబ్దశాసమునందును ఒక అపూర్వమైన అచ్ఛికశబ్దము కలదు.

" ఊయెల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు
యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు. " 2 సూ. ప్ర. ప. బా. వ్యా.
"ద్వితీయంబునకు ఋగ్వ్యక్రతమజఝశషలు
ద్రిక్క నగు" 5సూ. సంజ్ఞాపరిచ్ఛేదము. ఆం.శ.శా
"అవ్యయసుప్తిఙ్ఞలిం దనుకరణంబు
ద్రిక్కం బ్రయోగింపఁ జనదు." 64సూ. సంజ్ఞాపరిచ్ఛేదము. ఆం. శ.శా.

ఇందు త్రిక్కశబ్దము కలదు. ఇది నిఘంటుసంఘటితము. ఈ శబ్దమునకు ఉన్మాదమని ఒక అర్థము. వినా అని మఱొక అర్థము. మొదటి అర్థము వ్యవహారప్రసిద్ధము. నాటి త్రిక్క, తలత్రిక్క శబ్దములే నేటి తిక్క, తలతిక్క శబ్దములు. రేఫలోపము శబ్దవిపరిణామము. "త్రిక్క యనంగ . . . . వెఱ్ఱి యనంగ నున్మాద మనఁగ నున్మాదసంజ్ఞ" అని ఆంధ్రభాషార్ణవమునందు కలదు. (136ప. 1ఆ.) రెండవ అర్థము వ్యవహారప్రసిద్ధము కాదు. "త్రిక్క ననఁ దక్క నన వినార్థముగను రాజిల్లు" అని కూడ ఆంధ్రభాషార్ణవము

నందు కలదు. (69ప. 3ఆ.) ఈ అర్థమున పూర్వకవిప్రయోగము మృగ్యము.

"దోషరహితంబున కప్రయుక్తత్వదోషంబు
లేదని యథర్వణాచార్యు లంద్రు." 73సూ. సంజ్ఞాపరిచ్ఛేదము.

అని చిన్నయసూరి ఆంధ్రశబ్దశాసనములోని అనుశాసనము. నిఘంటుకారుడు, మహావైయాకరణి అయిన చిన్నయసూరి ముందు ప్రయోగించిన త్రిక్కశబ్దము నీలగిరి యాత్రయందు బహుధా కలదు.

"కొన్నియెడలఁ ద్రిక్కఁ దక్కునెడలఁ గొన్ని యడుగులైన నడువ
నలవడదు." పుట15
"పార్వతీయులగు వీరికి కన్నడంబు ద్రిక్క లాఁతి భాషం బరిచయంబు
గలుగదు." పుట 30
వడ్లద్రిక్కఁ దక్కుగల ధాన్యంబులు . . . . . . ." పుట 35
"గరుడపక్షు లొకండు రెండు ద్రిక్క మిగుల లేవు." పుట 37
"రెండు తేజులు ద్రిక్క నొండు తటి . . . . . . . ." పుట 46

ఇది యెల్ల చిన్నయసూరి సమకాలికప్రభావమునకు ప్రబలనిదర్శనము.

నీలగిరియాత్రయందు చెన్నపట్టణములోని చింతాద్రిపేటనుండి బయలుదేరి నీలగిరి చేరువఱకు యాత్రాక్రమము కలదు. ఆ యా గ్రామములలోని ఆలయములు, ఆహారపదార్థములు, ధర్మసత్రములు, ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వోద్యోగులు, ఎంగిలీసు బాటసారుల విడిది గృహములు మొదలైన వాని వివరములు కలవు. ధర్మపురి లోని హరిహరనాథాలయము, అదవాన్ కోటలోని ధర్మరాజా ఆలయము గమనింపఁ దగినవి. (పుటలు 14, 15) పల్లికొండ, అవినాశిక్షేత్రముల మాహాత్మ్యములు కలవు. (పుటలు 19-20; 23-24) అవినాశిక్షేత్రమాహాత్మ్యమునందు సుందరుడు తన పేరిటి నాలుగేండ్ల బాలుడు మొసలికి ఆహారమైన, మూడేళ్ల తర్వాత ఏడేళ్లబాలునిగా పునర్జీవితుని చేయుట, ఒడయనంబివిలాసమునందు ఒడయనంబి తన పేరిటి బాలుడు నక్రహతుడైన, ఏడేళ్లకు పునర్జీవితుని చేసిన కథయే. సుందరుడు సుందరమూర్తినయనార్. ఒడయనంబి జడ నయనార్ తనయుడు.

రెండవ ప్రకరణమునందు నీలగిరి స్థానికవిశేషము లనేకములు కలవు. అందు "పార్వతీయులు - ఒడగర్, ఊరాజ్జి, తొడువర్, కోత్తర్, కుడుంబర్ లేక ముళ్లకుడుంబర్ జాతుల భాషలు, ఆచారవ్యవహారములు గమనార్హములైనవి. ఒడగరుల భాష కర్ణాటా భాసము. వివాహములు విలక్షణములు- వధువులు ముందే వరులను సంసర్గమున పరీక్షించి, సమ్మతమైననే వివాహమాడుదురు. అందువలన అంతర్వత్నులకు, సంతానవతులకును వివాహములు జరుగును. తొడవరుల భాష ఉచ్చారణమున ఇంగ్లీసు భాషను పోలునట! వివాహములు విచిత్రములు. ఉమ్మడికుటుంబములందు అగ్రజుని భార్యయే అనుజుల భార్య. జ్యేష్ఠుడు జీవించియుండగా కనిష్ఠులు వివాహము చేసికొనరు. వివాహాపేక్ష కలదేని వేఱు కాపురము పెట్టుకొనవలయును. కురుంబరులు లేక ముళ్ల కురుంబలకు ప్రత్యేక మొక భాష లేదు. వీరు మంత్రశక్తి, మూలికాశక్తి కలవారు. ఏవంవిధమైన పార్వతీయుల జీవనవిధానముల సేకరణ, వివరణ (పుటలు 39-42.)- ఆధునిక యుగములోని గిరిజనజీవనవిధానపరిశోధనకు ఆద్యప్రకృతి. ఈ విషయమున నీలగిరి

యాత్ర ప్రశంసాపాత్రము.

మూడవ ప్రకరణమునందు తిరుగు ప్రయాణము కలదు. అందు మొదటి ప్రకరణమునందు లేని తిరుప్పుల్కాడి గ్రామసమాచారము రామాయణమునకు సంబంధించినది. భారతమునకు సంబంధించినది నీలగిరియందే కలదు. అది బకాసురుని గుహ. ఇది జటాయువు గుడి. బకాసురుని గుహ కారణముగ భారతము లేదుగాని, జటాయువు గుడి కారణముగ రామాయణము అతిసంగ్రహముగ కలదు. (పుట 70).

నీలగిరియాత్రయందు ఇంగ్లీషు పదములతోపాటు తెలుగు అర్థములు కలవు. అందు పెన్షన్‌కు అనుజీవిక (పుట 4) కంకరరోడ్డుకు గులకరాయి ఘట్టితంబగు ఘంటాపథంబు (పుట 13) గ్లోవ్స్‌కు చేతొడుగులు, స్టాకింగ్స్‌కు కాలి తొడుగులు (పుట 45) కోల్డ్‌క్రీమ్‌కు నవనీతకృతౌషధంబు (పుట 49) థర్మామీటర్‌కు ఉష్ణమాతృకయంత్రంబు (పుట 52) వంటి తెనుగుసేతలు కలవు. భాష కంటె కవిత్వము కంటె విషయము ప్రధానమైన నీలగిరియాత్ర పందొమ్మిదవశతాబ్ది నీలగిరియాత్రకు నిలువుటద్దము; సాంఘికచరిత్రకు కంచుటద్దము.

**మంత్రిప్రగడ సూర్యప్రకాశము** : ఇతని కృతులు 1. కృష్ణార్జునచరిత్రము. ద్వ్యర్థి కావ్యము. 2. సీతారామచరిత్రము. 3. శ్రీమద్భాగవతము. 4. భీమలింగశతకము. కృష్ణార్జునచరిత్రము ముద్రితము. సీతారామచరిత్రము ప్రథమాశ్వాసము ముద్రితము[305]. ఇది కృష్ణభూపాలుని ఆదేశమున, "మాత్స్యపట్టణపదశ్రీభీమలింగేశు"నకు అంకితము. దైవాంకితము. కృష్ణభూపాలుడు మాడుగుల సంస్థానాధిపతి[306]. (1853-75) కాఁబట్టి కృతుల రచనాకాలములు కృష్ణార్జున చరిత్రము 1855 ప్రాంతము, సీతారామచరిత్రము 1860 ప్రాంతము, శ్రీమద్భాగవతము 1865 ప్రాంతము, భీమలింగేశ్వరశతకము 1870 ప్రాంతము కావచ్చును.

సీతారామచరిత్రము మఱొక రామాయణము. అవతారికాశ్వాసాంతపద్యములు కాక, ప్రథమాశ్వాసమునందు సుమారు తొమ్మిది వందల పాతిక పద్యములు కలవు. అవి యెల్ల బాలకాండము, నారదుడు వాల్మీకికి చెప్పిన సీతారాముల కల్యాణ పర్యంత చరిత్రము! విశ్వామిత్రుని చరిత్రము విస్తృతమైనది.

ఇందు రాముడు తాటక కరయుగమును ఖండింప, లక్ష్మణుడు కర్ణనాసికలు ఖండించినట్లు కలదు.

". . . . లక్ష్మణుఁ డధికశరాలి నసుర
కామినీకరణనాసికాగ్రములఁ ద్రుంచె" 482ప. 1ఆ.

శివధనుర్భంగఘోష బ్రహ్మండభాండమెల్ల నిండినట్లు కలదు.

"ఖండేందుధరుని కోదండంబు నడిమికి
ఖండించి తనదైన గండుఁ జూపు
చుండఁ గార్ముకమహోద్దండనిర్ఘోషంబు
మెండుగా బ్రహ్మండభాండమెల్ల
నిండంగ నిద్దరామండలంబు వడంకెఁ
గొండలు గదలె నక్కుండలపతి
బెండుపడె దేవదైత్యుల గుండె లవిసెఁ

గాండనిధులు గలంగె మార్తాండసోమ
మండలము లధ్వముల్ దప్పియుండె బుక్ష
కాండములు రాలె వడగళ్ల పిండులట్ల" 841ప. 1అ.

**కరాలపాటి రంగయ** : ఇతని కృతులు 1. కవిజనమనోహరము 2. భూతపురీమాహాత్మ్యము. (అసంపూర్తి). " ఇతఁడు 1814 వ సంవత్సరమున జననమొంది 1863వ సంవత్సరమునందు పరమపదము నొందెను."అని కలదు[307]. సమీపకాలికసమాచారము. సత్యసన్నిహిత మగును. కాఁబట్టి కవిజనమనోహరము రచనాకాలము 1855 ప్రాంతము, భూతపురీమాహాత్మ్యము రచనాకాలము 1863 ప్రాంతము కావచ్చును.

**త్యాగరాయముదలి** : ఇతని కృతులు 1. కావ్యలక్షణకదంబము. ఇది కావ్యయుగము. 2. నైషధము. 3. నీతిచరిత్రము. 4. అభిమన్యుజన్మము. 5. భరతోదయము. 6. నవనస్యవిలాసము. 7. సుబ్రహ్మణ్యవిజయ మను విద్వత్కర్ణామృతము. ఇందు మొదటి ఆఱును నామమాత్రావశిష్టములు. ఏడవది కాశీవిశ్వేశ్వరాంకితము. ద్వైవాంకితము. 1859 వ సంవత్సరమునందు ముద్రితము. రచనాకాలము 1858 ప్రాంతము కావచ్చును.

సుబ్రహ్మణ్యవిజయమునకు విద్వత్కర్ణామృతమను వివక్షయేగాక, ఇంద్రసేనా పరిణయ మను నామాంతరమును కలదు. కుమారస్వామి విజయములతోపాటు ఇంద్రసేనాకుమారస్వాముల వివాహము కథావిషయము. కావ్యము సంగీతసాహిత్యసమ్మేళనము లేని, సుకుమారశ్లేషాశ్లేషము లేని, వర్ణనావైదగ్ధ్యము లేని పిల్లవసుచరిత్రము వలె కలదు. వసుచరిత్రమును మించునది శబ్దాడంబరము. చిత్రగర్భబంధకవిత్వములు అదనము. కృతిభర్త విశ్వేశ్వరుని వర్ణనము "చిత్రగర్భితవచనము"నందు కలదు ఒక్క వచనమునందు సమభాగము, శ్లేషగర్భితభాగము, నిరోష్ఠ్యభాగము, అపంచవర్గభాగము అని నాలుగు భాగములు నిర్దేశింపఁబడినవి. (4-5 పు.) చక్రబంధ, పుష్పమాలికాబంధ (31-32 పు.) పాదగోపన (183 పు.) పద్యములును కలవు. ఇట్టివి విద్వత్కర్ణామృతమనుటకు నిమిత్తములు కావచ్చును.

ఇంద్రసేనాకుమారస్వాముల వివాహవృత్తాంతము, వసుచరిత్రములోని గిరికావసు రాజుల వివాహవృత్తాంతమునకు అనుకరణము. అంతేకాదు. వసుచరిత్రము లోని పద్యములకు ప్రతిబింబప్రాయములైన పద్యములు బహుళము. వసుచరిత్రములోని సుప్రసిద్ధమైన "స్వైరవిహారధీరలగు" అను పద్యమునకు అనుకరణమిది :

"స్వైరవిహారలై మెలఁగు సారసలోచన లుండ వారికిన్
నీరస భంగవృత్తి నెద నించుట గూడ దటంచు నెంచి క
న్నారఁగఁ జూచు కోరిక నుదంచితకాంచనచూతపూగకాం
తారనితాంతజాలకకదంబము నొయ్యనఁ జేరి యయ్యెడన్." 18 పు.

**గోపీనాథము (ధుని) వేంకటకవి (వేంకటశాస్త్రి , వేంకయ్యశాస్త్రి)** : ఇతని కృతులు 1. రామాయణము. 2. కృష్ణజన్మఖండము. 3. భగవద్గీత. 4. బ్రహ్మానందశతకము. 5. రామానుజచరిత్రము. వచనగ్రంథము. అనుపలబ్ధము. 6. శిశుపాలవధ. 7. రాధికా పరిణయము. అనుపలబ్ధము. కొంత భాగము రత్నాకరము అను పత్రికయందు ప్రకటితము[308]. బ్రహ్మవైవర్తపురాణము కృష్ణజన్మఖండమే. ఆదిత్యహృదయము రామాయణము

లోనిదే అగును. రామాయణము కృష్ణాంకితము. దైవాంకితము. వేంకటగిరి సంస్థానాధిపతి సర్వజ్ఞకుమారయాచమనాయుడు (1848-1878) ప్రాచుర్యప్రదాత. అతని 1863 నాటి కాశీయాత్రాదికము[309] కృష్ణజన్మఖండమునందు ప్రసక్తము. (పుటలు 2-3) అతని పరముగ భగవద్గీతయందు ఆద్యంతపద్యములు కలవు[310]. కృష్ణజన్మఖండము రామాంకితము. దైవాంకితము. శిశుపాలవధ వేంకటగిరి సంస్థానాధిపతి రాజగోపాలయాచమనాయనికి (1878-1916) అంకితము. కవి జీవితకాలము 1813-1892. రామాయణమును సర్వజ్ఞకుమారయాచమనాయనికి అందఁజేసిన కాలము[311] 13-8-1859. అది మొదలు వేకంటగిరి సంస్థానకవి. శిశుపాలవధయందు రచనాకాలము కలదు.

"శాలివాహనశకమందు శశివసుగగ
నాష్టసంఖ్యలు గల పార్థివాబ్దమందుఁ
బ్రకటితంబుగ వేంకటసుకవిచేత
నీ కృతి రచింపఁజేసె నీ లోకవిభుఁడు." 57ప. 1ఆ.

ఇందు "అంకానాం వామతో గతిః" అను స్థితి లేదు. శశి=1, వసు=8, గగన=0, అష్ట=8, 1808+78=1886. కాఁబట్టి కృతుల రచనాకాలములు రామాయణము 1858 ప్రాంతము, కృష్ణజన్మఖండము 1864 ప్రాంతము, భగవద్గీత 1870 ప్రాంతము, బ్రహ్మానందశతకము 1875 ప్రాంతము, రామానుజచరిత్రము 1880 ప్రాంతము, శిశుపాలవధ 1886 వ సంవత్సరము, రాధికాపరిణయము 1890 ప్రాంతము కావచ్చును.

రామాయణము, కృష్ణజన్మఖండము, బ్రహ్మానందశతకము మాత్రమే ఈ యుగము లోని కృతులు.

**రామాయణము** : ఇది గోపీనాథరామాయణము. ఈ రామాయణమునకు పూర్వము శతాధికముగ ఆంధ్రరామాయణములు వెలువడినవి. అయినను "గీర్వాణంబున కన్యూనాతిరిక్తంబుగాఁ జేసి"న రామాయణము లేదని ఒక అభిప్రాయము కలదు. (68వచ.బా. కాం.గో.రా.) "ఏ నిక్కావ్యంబు గీర్వాణంబున కనురూపంబుగాఁ బద్యప్రబంధంబు గావించి"తినని కవి అభిప్రాయము. (68వచ.బా.కాం.) అన్యూనాతిరిక్తమన హెచ్చుతగ్గులు లేనిది. యథామూలము. అనురూపము మూలమునకు సదృశమైనది. మూలవిధేయము. అవాల్మీకవృత్తాంతములు లేనిది. గోపీనాథరామాయణము అన్యూనాతిరిక్తము కాదు. అనురూపమే. వాల్మీకిరామాయణముతోపాటు మహేశ్వరతీర్థీయ, గోవిందరాజీయ వ్యాఖ్యానములను అనుసరించినది[312].

ఇందు యుద్ధకాండమునందు హితబోధ చేసిన విభీషణుని రావణుడు తన్ని, క్రింద పడవైచి, కత్తితో తల నఱుకఁబోవుట, ప్రహస్తుడు నివారించుట, విభీషణుడు తల్లితో మొఱఁబెట్టుకొనుట, ఆమె శ్రీరాముని ఆశ్రయించుమని చెప్పుట కలదు. ఇది ముద్రితములైన వాల్మీకిరామాయణము గ్రంథములందు లేదు[313]. అంతేకాదు. ఇందు కాలనేమివృత్తాంతమును కలదు. ఇది అవాల్మీకవృత్తాంతముగ ప్రసిద్ధము. కాని, వాల్మీకిరామాయణములు కల తాళపత్రగ్రంథప్రత్యంతరములందు కలదు[314]. ఈ రెండు వృత్తాంతములు కల తాళపత్రగ్రంథము గోపీనాథరామాయణమునకు ఆధారము కావచ్చును.

అనురూపమైనను గోపీనాథరామాయణమునందు స్వతంత్రాంధ్రీకరణమును కలదు. ఇందుకు అహల్యాశాపవృత్తాంతము ఒక నిదర్శనము.

మునివేషధారియైన ఇంద్రుని మాటలకు, అహల్య అతడు ఇంద్రుడని గ్రహించినట్లు మూలమునందు కలదు. (19శ్లో. 48స.బా.కాం.)

"అనిన న మ్మాయతపసి వాక్యముల పటిమ
మొగముఁ జాయయుఁ గాంచి నా మగని కింత
సరస మేడది శక్రుఁ డిక్కరణి నాదు
వలని మోహంబుచే నిట వచ్చె ననుచు" 942స.బా.కాం.

అహల్య "తలంచి"నట్లు స్వతంత్రాంధ్రీకరణము. ఇందు "నా మగని కింత సరస మేడది" అని అహల్య తలంచుట అమూలకము. అనుచితము కూడ.

సీత తాను గూడ అరణ్యమునకు వచ్చెదననిన, సమ్మతించక రాముడు ఎంత సముదాయించినను, ఎట్లైనను భర్తతో అరణ్యమునకు వెగవలయునని, సీత రామునితో నిష్ఠురముగ మాటాడినట్లు వాల్మీకిరామాయణమునందు ఎనిమిది శ్లోకములు కలవు. (3-9శ్లో. 30స. అయో.కాం.) అందు మొదటి శ్లోకమునకు నాలుగు విధముల ఆంధ్రీకరణము గోపీనాథరామాయణమునందు కలదు.

"కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్" 3శ్లో.

"రామ! నా తండ్రి విదేహరాజ్యాధిపతి, మిథిలానగరాధిపతి పురుషవిగ్రహమైన స్త్రీని నిన్ను అల్లునిగా పొందెను కాబోలు!" అని తాత్పర్యము.

"విను మిథిలాధినాథుఁ డతివిశ్రుతకీర్తి విదేహుఁడైన మ
జ్జనకుఁడు పత్నినైన నను సమ్మతిఁ బ్రోవఁగఁ జాల కొంటినై
వనమున కేఁగు నిన్ను విని వారక లోపల స్త్రీత్వమున్ వెలిన్
ఘనపురుషార్థరూపమును గల్గిన యల్లునిగాఁ దలంపఁడే. 654
రామ మా తండ్రి జనకుండు రమణతోడ
రూపమాత్రంబుచేతఁ బురుషుఁడవైన
నిన్ను స్త్రీనిఁగా నెఱుఁగక నన్నొసంగె
నెఱిఁగియుండినఁ గని కని యేల యిచ్చు 655
అనఘ మాయయ్య జనకుండు నిను మహాత్ము
నల్లునిగఁ గొని భువనత్రయంబునందుఁ
గలుగు భవదన్యపురుషవిగ్రహము సర్వ
మాత్మలో నెంచె స్త్రీయని యనుదినంబు. 656.
కాంత మా తండ్రి పురుషవిగ్రహుఁడ వనుచు
రామ జామాత వనుచుఁ గరంబు నిన్నుఁ
గాంచి యుభయలోకసుఖంబుఁ గరము తుచ్ఛ
ముగఁ దలంచుచు నానందపూర్ణుఁడయ్యె" 659. అ.కాం.

ఒక్క శ్లోకమునకు నాలుగుపద్యములును అన్యూనాతిరిక్తములు కావు. అంతేకాదు.

"ఆతతబుద్ధి విదేహ
జ్యాతలనాథుండు మాత యగు కేకయభూ

నేతసుత వలనఁ గలహం
బీ తఱిఁ బుట్టునని యెఱుఁగ కిచ్చె న్ననున్నన్." 657

"అధిప వంశపరంపరాభ్యాగతయును
భర్తృయోగ్యయు సతియును భద్రదయును
లలితకౌమారయును నగు రాజ్యలక్ష్మి
నకట భరతాదుల కొసంగు టర్హ మగునె" 666.

అను పద్యములకు మూలభూతమైన శ్లోకములు మృగ్యము.

శ్రీరామపట్టాభిషేకమునకు ముందు సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతవర్ణన (3295-3336ప.యు.కాం.) కలదు. ఇది భాస్కరరామాయణమునకు అనుసరణము. సూర్యోదయవర్ణనము (3319-3324ప.) శ్రీనాథుని కాశీఖండములోని సూర్యశతకశ్లో కాంధ్రీకరణమునకు[315] అనుసరణము. "చిఱుసానఁబట్టించి" అను పద్యమునకు అను పల్లవి:

"గగనకాసారోడుకైరవంబులు గోయఁ
బ్రాచి సాఁచిన హస్తపల్లవంబు
నెఱసిన బలితంపు నిబిడాంధకారకాం
తారసీమకు బృహద్భానుహేతి
ప్రబలవిభావరీప్రతతిఁ ద్రుంపఁగ సానఁ
బట్టించి యెత్తిన పరశుధార
జలజాతవనవాటికలఁ గట్టు జాడ్యంబు
పరిహసింపంగఁ బాల్పడ్డ మందు
పయనములు వేకువం బోవు పథికతతికి
దారిఁ జూపెడు తెరువరి దంపతులకుఁ
బంచశరజన్యవిరతిఁ బుట్టించు చతురుఁ
డరుణుఁ డుదయించెఁ బ్రాక్పర్వతాగ్రమందు" 3320 ప.యు.కాం.

ఇట్లు గోపీనాథరామాయణము వాల్మీకి రామాయణమునకు అన్యూనాతిరిక్తము కాదు. అనురూపము- యథామూలము కాదు. మూలవిధేయము.

**కృష్ణజన్మఖండము** : ఇది బ్రహ్మవైవర్తపురాణములోని చతుర్థఖండము. అది అష్టాదశపురాణములందు ఒకటి. అందు బ్రహ్మ, ప్రకృతి, గణేశ, కృష్ణజన్మఖండములు నాలుగు కలవు. కృష్ణజన్మఖండమునందు ప్రధానేతివృత్తము కృష్ణచరిత్రము. అది హరివం శము నందు, భాగవతమునందు ఉన్నను, అందు లేనిది ఇందు కలది రాధాకృష్ణచరిత్రము. గోలోకములోని రాధాకృష్ణులు భూలోకములోని రాధాకృష్ణులుగ అవతరింతురు. ప్రధానేతి వృత్తము రాధాకృష్ణతత్త్వప్రతిపాదకము- పార్వతీకల్యాణము, తారాశశాంకవృత్తాంతము, ఉషాపరిణయము మొదలైనవి అనుషంగికములు.

పురాణఖండమైన కృష్ణజన్మఖండము తెనుగుసేత మూలానుసారము. "కౌముదీ రుచిరకావ్యముగా నొనరింపఁబూనితిన్"అని ఉపక్రమించినను (పుట3) కావ్యత్వసిద్ధి కాదాచిత్కము. కారణము పురాణ మగుటయే. రాధాకృష్ణుల సంభోగశృంగారము శ్రుతి మించినది.

"చెలువుగఁ జెయ్యిఁబట్టి యెదఁజేరిచి నీవి వదల్చి పయ్యెద

న్దొలఁగఁగఁ బెట్టి కంచుకము తోడనె విచ్చి కరంబునన్ సము
జ్జ్వలగతి మర్మము ల్దడివి బల్గిలిగింతలు సల్పి వేడ్కతో
నెలమిగఁ గౌఁగలించి రచియించెఁ జతుర్విచుంబనంబులన్-" పు 75.

"అంగము నంగముచేఁ బ్ర
త్యంగముఁ బ్రత్యంగకమున నంచితముగఁ బ్రే
మం గదియించి జగత్పతి
శృంగారము సల్పెఁ గామసిద్ధాంతగతిన్." పు 75.

"విభుఁడు రాధిక కొప్పు విచ్చినఁ దోడనే
వల్లభు సిగ విచ్చె వనజగంధి
వరుఁడు పద్మాక్షి వివస్త్రను గావింప
వనిత శ్రీకృష్ణు వివస్త్రుఁ జేసె
సొలయక హరి కాంత సొమ్ములు గైకొన్న
లలన ప్రాణేశు సొమ్ములు గ్రహించె
మురవైరి సతి చేతి ముకురంబు గైకొన్నఁ
దరుణి మాధవు చేతి మురళి గొనియెఁ
బతియు సతి చిత్తము హరింప సతియఁ బ్రియుని
చిత్తము హరించె నిట్లు చేసిన పనులకు
బదులు సేయుచు గాఢసమ్మద మెలర్ప
నసమశరయుద్ధ మొనరించి రద్భుతముగ." పుట 76

కామశాస్త్రానుసారమైన అసమశరయుద్ధసమయమునందును రాధ ముకురమును, కృష్ణుడు మురళిని విడిచిపెట్టకపోవుట విచిత్రము. రాధాకృష్ణుల పరస్పరవివస్త్రీకరణ ప్రకటనము విశృంఖలము.

రాధ యశోదకు తెలిపిన స్వీయవృత్తాంతమిది :

"దేవీ! యేను నిక్కంబుగా రాధికం గాను. ఛాయారాధికను.
రాశబ్దంబు మహావిష్ణురోమకూపంబులం గల విశ్వంబులందు వర్తించు.
ధాశబ్దంబు మాతృవాచకం బేను విశ్వంబుల కెల్లఁ దల్లిని. మూలప్రకృతి
నగుటం జేసి హరిచేత బుధులచేత రాధ యని సమాఖ్యాతనైతి. నేను
శ్రీదామశాపంబున నిప్పుడు వృషభానునకుఁ బుత్రికనై జన్మించితి.
నాకును కృష్ణునకు శతవర్షంబులు వియోగంబు గలుగు- మజ్జనకుండు
వృషభానుండు హరిపార్షదప్రవతుండు. మజ్జనయిత్రి యగు కళావతి
పితృమానసకన్యక. యే నా కళావతి కయోనిజనై భారతవర్షంబునం
బుట్టితి గ్రమ్మఱ మిమ్ముం గూడి హరిపదంబునకుం జనియెద నిది
మదీయవృత్తాంతంబు" పుట 371

ఇందు రాధ ప్రకృతి అని కలదు. పురుషుడు కృష్ణుడు. ప్రకృతిపురుషసంబంధము రాధాకృష్ణుతత్త్వము. పురుషు డన పరబ్రహ్మము.

కృష్ణజన్మఖండములోని తారాశశాంకవృత్తాంతము పురాణేతరప్రసిద్ధమైన తారాశ శాంకవృత్తాంతము కాదు. ఇందు తార శశాంకుని మోహించదు. బృహస్పతి ఇల్లు విడిచిపెట్టి నది లేదు. తార గంగాస్నానము చేసి, పార్వతీపూజ సల్పి, గృహోన్ముఖురాలైన, చంద్రుడు

ఆమె రూపసౌష్ఠవము చూచి అపహరించును. ఆమె "పతివ్రతను. గురుపత్నిని, నీవు నాకు సుతుడవు, నేను నీకు తల్లిని విడువు"మని బహువిధముల నిందించినను, అతడు బలవంతముగ మానభంగము సేయును.

**బ్రహ్మానందశతకము** : ఇదొక అసాధారణమైన శతకము. ఇందు అవతారిక కలదు. ఇతివృత్తము కలదు. రతిశాస్త్రరహస్యములు కలవు. మధురానగరిలో శ్రీకృష్ణుని వియోగశృంగారము, వ్రేపల్లెలోని గోపికలకు సందేశము, గోపికల ప్రతిసందేశము, అష్టమహిషీ కల్యాణము, దుష్టశిక్షణము, రాధాసమేతముగ బృందావనప్రవేశము ఇతివృత్త విశేషములు. కృష్ణుని వియోగశృంగారవివరణమునందు రతిశాస్త్రరహస్యములు కలవు. అవి కవి పోషకుడు, కృతిప్రేరకుడు అయిన వేంకటగిరిసంస్థానాధిపతి సర్వజ్ఞకుమార యాచమ నాయడు అనేకకామశాస్త్రగ్రంథములను పరిశీలించి, వ్రాసియిచ్చిన వచనరచనములకు పద్యరూపములని సోదాహరణనిరూపణము కలదు[316].

శతకమునందు నూట ముప్పది సీసపద్యములు కలవు. పెక్కు సీసపద్యములందు అధికపాదములు కలవు. ప్రతి సీసపద్యమునకు "బ్రహ్మానంద మదియ కాదె" అను మకుటము కలదు. ఒక ఉదాహరణము :

"శుకతుండసందష్టసుందరబింబంబు
　　పోలిక నున్న కెమ్మోవి తోడ
కరరుహపరిలూనకరమర్దనమ్లాన
　　ఘనమంజరులఁ బోలు చనుల తోడ
గందేభవిహరణకలుషీకృతసరోవ
　　రాభపుష్పస్రగ్గేహంబు తోడ
భానుమయూఖసంపర్కపరిక్లాంత
　　లతికోపమానగాత్రంబు తోడ
వితతనిశ్వాసమారుతమలినీకృత
　　ముకురంబు క్రియ నొప్పు మోము తోడ
కాంతసురతాంతతాంతయై కనులు దేల
నైచుచుమదంపవిన్నస్తబాహుయుగళ
యగుచుఁ దొడలపైఁ బవళించినట్టి హొయలు
మదిఁ దలంప బ్రహ్మానంద మదియ కాదె" 115 ప.

**క్రాలేటి లక్ష్మీనృసింహము** : ఇతని కృతి పంక్తిరథోపాఖ్యానము. శివాంకితము. దైవాంకితము. ఇతని తృతీయపుత్త్రుని కుమారుడు లక్ష్మీనరసింహము 1957 వ సంవత్సరము నాటికి ఎనుబది సంవత్సరముల వాడని కలదు[317]. కనుక అతని జననకాలము 1957-80=1877 వ సంవత్సరమగును. అతని తండ్రి జననకాలము 1850 ప్రాంతము, తాత జననకాలము 1820 ప్రాంతమును అగును. కాఁబట్టి పంక్తి రథోపాఖ్యానము రచనాకాలము 1860 ప్రాంతము కావచ్చును.

ఇది పేరునకు ఉపాఖ్యానము. తీరునకు పరిణయప్రబంధము. ఇందు అయోధ్యా పురవర్ణనము సుదీర్ఘము. రఘువంశవర్ణనము సంగ్రహము. దశరథుని జనన, బాల్య, యౌవనవర్ణనముల తర్వాత ఇందుమతీనిర్యాణము, అజమహారాజునకు తృణబిందుని

శాపానుగ్రహములు కలవు. దశరథుడు రాజ్యపాలనము సేయునెడ కౌసల్య ప్రేమించును. కౌసల్యాదశరథుల పరస్పరప్రేమ కనుకలి ప్రేమ కాదు వినుకలి ప్రేమ. దశరథుని ఆనతిని ఒక భూసురుడు కౌసల్యకు దశరథుని గుఱించి తెలుపును. అతడే దశరథునికి కౌసల్య సౌందర్యమును వివరించును. దశరథుని విరహము రేఖామాత్రము. కౌసల్యవిరహము శాఖాప్రాయము. ఇందుకు వసంతర్తు, వనకేళీ, జలకేళీ, చంద్రాద్యుపాలంభములు శిశిరోపచారములు సయిదోడులు. సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంతవర్ణనమును కలదు. వసిష్ఠాదిమహామునుల సంబంధనిశ్చయము, కౌసల్యాదశరథుల వివాహము పర్యవసానము.

"గాహము లేని విప్రుఁ డవగాహము లేని గభీరకూపమున్
వాహము లేని తేరు పరివాహము లేని తటాకరేఖ ని
ర్వాహము లేని తావును ప్రవాహము లేని స్రవంతి యోషిదు
ర్వాహము లేని పూరుషుఁడు ధాత్రి వృథాకద ధర్మకోవిదా!" 241ప. 1ఆ.

అని ధర్మకోవిదుడైన దశరథునికి వసిష్ఠాదిమునుల ఉపదేశము. భూసురుడు దశరథునికి కౌసల్య సౌందర్యమును వివరించిన పద్ధతి ప్రబంధసరణి నాయికా వర్ణనమే.

రఘువంశవర్ణనము, ఇందుమతినిర్యాణము, తృణబిందుని శాపము కాళిదాసు రఘువంశమునకు సంగ్రహానుసరణము. కౌసల్యాదశరథులపరిణయము స్వతంత్ర కల్పనము. మొత్తముఁ మీద పంక్తిరథోపాఖ్యానము సగటు ప్రబంధము.

**వేముల రామాభట్టు** : ఇతని కృతి గౌరీవిలాసము. అముద్రితము. కృతిప్రేరకుడు తూము పరశురామరెడ్డి. అతడు అలమేలుమంగాపరిణయమును రచించిన తూము రామచంద్రారెడ్డి కుమారుడు. రామచంద్రారెడ్డి కాలము 1807-1857 అని, అలమేలు మంగాపరిణయము రచనాకాలము 1830 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి గౌరీ విలాసము రచనాకాలము 1860 ప్రాంతము కావచ్చును.

అముద్రితమైన గౌరీవిలాసము గుఱించి వెలుగునకు వచ్చిన సమాచారము కలదు[318]. ప్రణయకలహము కారణముగ పార్వతీపరమేశ్వరులు కైలాసమునుండి, ఒకరి తర్వాత ఒకరు వచ్చి, మహబూబునగర్ జిల్లాలోని మానాజీపేట జమీందారు తూము రామచంద్రారెడ్డి కట్టించిన శివాలయమునందు ప్రతిష్ఠితులగుట మొదటి అయిదాశ్వాసముల కథ. రామచంద్రారెడ్డి అనంతరము పరశురామరెడ్డి పరిపాలించుట, శివకేశవాలయములను పునఃప్రతిష్ఠించుట ఆఱవ ఆశ్వాసము కథ. కవిత ప్రౌఢము. పూర్వకవితా చర్వణము, అర్వాచీనకవితాస్వాదనము, వర్ణనాతిశయము, సమకాలికసమాచారము కలవు.

మన్మథుని చైత్రయాత్ర జమీందారు చైత్రయాత్ర వలె కలదు.

"పచ్చపిట్ట పఠాన్ సిపాయిల్ సవారి బే
షాబాసు వహవా పసం దనంగ
మొకము లెత్తుకొని శారికవందిమాగధుల్
బహుపరా గ్పొర భళాభళి యనంగ
రభసంపు నెమ్మి వీరభటాళి ఝుళిపించు
ఉక్కుకత్తులును తళు క్కనంగ
తీతువు పిట్ట బంట్రౌతు తుపాకి చ

పృళ్ల ఢమిల్లు ఢమిల్లు మనఁగ
అంచ లిరువంక చోపుదార్లె గడంగి
జరుగకుడు ఖబడ్దార్ బరాబరి యనంగ
మారుఁ డ్వేళ వనికై సవారి వెడల
తన బలంబుతో శృంగారవనముఁ జేరె." 64ప. 4ఆ.

**మండపాక పార్వతీశ్వరశాస్త్రి** : ఇతని కృతులు శతాధికము. బహుశః ఇతడు ప్రథమ శతాధికగ్రంథకర్త అగును. ప్రసిద్ధమైన కృతులు 1. రాధాకృష్ణసంవాదము 2. కృష్ణాభ్యుదయము. ఏకాశ్వాసప్రబంధము. రాధాకృష్ణసంవాదమునందు వేంకటగిరి సంస్థానాధిపతి రాజగోపాలకృష్ణయాచేంద్రుని (1878-1916) పట్టాభిషేకోత్సవము వర్ణింపఁబడినది. కాఁబట్టి రాధాకృష్ణసంవాదము రచనాకాలము 1880 ప్రాంతము కావచ్చును. ఇందు ప్రసక్త మైన ఇతరకృతులు పెక్కులు 1875 కంటె పూర్వరచనలగును. అవి :

"బ్రహ్మేశ్వరస్తుతి పరమశివస్తుతి
సూర్యనారాయణస్తుతియుఁ విశ్వ
నాయకస్తుతి, విశ్వనాథస్తుతియుఁ జిత్రి
శతి, వేంకటేశత్రిశతియు నహహా!
ప్రాస మొక్కటి గాఁగఁ బచరించినాఁడవు
బంధగర్భకవిత్వబంధురముగ
విశ్వనాథస్తుతి వేటొక్కటియు శర
త్తారాళిగ వరాహనారసింహ
సంస్తుతియు, రామమానసార్చాస్తుతియును
రుచిరజీవేశసంవాదరూపఫణితి
యగు జగద్రక్షనుతి, పరమాత్మ నుతియు
నింక నొక సూర్యనుతి రచియించి తౌరా!" 58ప. 1ఆ. రా.కృసం.

ఇంకను శతకము (39ప. 1ఆ.) జగదంబాదండకము (60, 62ప. 1ఆ.) ఏకప్రాస పార్థివలింగశతకము, ఏకప్రాసకాశీనాథశతకము (64ప. 1ఆ.) బీజాక్షరస్తుతి. సంస్కృతము (65ప. 1ఆ.) కాంచీపురమాహాత్మ్యము (66ప. 1ఆ.) కలవు.

ఇందు కాంచీపురీమాహాత్మ్యము స్కాందపురాణములోని కాంచీపురీమాహాత్మ్యమునకు తనుగుసేత. అముద్రితము. ముద్రితములైన రాధాకృష్ణసంవాదము, కృష్ణాభ్యుదయము, త్రైపదేంద్రగురుచంద్రచరిత్రము, సుజనామోదిని, సావిత్రీచరిత్ర, సావిత్రీసత్యవంతము 1875 తర్వాతి కృతులు. తత్పూర్వకృతులందుస్తోత్రములు, శతకములును అధికము.

**కొప్పరాజు నరసింహము** : ఇతని కృతులు 1. త్రికూటాచలమాహాత్మ్యము. 2. సూతసంహిత. 3. మల్హణసూక్తిసంగ్రహము. 4. పుష్పరదోదితస్తవము. (పుష్పదంతుని మహిమ్నస్తవము.) 5. ప్రదోషపూజామాహాత్మ్యము. ఇందు మొదటిదే ఉపలబ్ధము. శ్రీశైల మల్లికార్జునస్వామికి అంకితము. ఇది రచించుటకు హేతువు, ఇతని ఎల్లమందాద్రితీర్థయాత్ర. అది "శాలివాహనశకాఖ్యసంవత్సరంబులు వేదాద్రిగిరిశశివిదితసంఖ్య గల విరోధికృదబ్దకలిత మాఘాసితవరచతుర్దశిశివవాసరమున" జరిగినది. (58ప. 1ఆ.) వేద=4,

అద్రి=7, గిరి=7, శశి=1 = 1774+78=1862. కాఁబట్టి త్రికూటాచలమాహాత్మ్యము రచనాకాలము 1862 వ సంవత్సరము.

ఇది కోటప్ప కొండ క్షేత్రమామాత్మ్యము. కోటప్ప కొండకు మూడు కూటములు అనగా శిఖరములు కలవు. రుద్రశిఖరము, బ్రహ్మశిఖరము, విష్ణుశిఖరము. మూడు శిఖరములందును మూడు శివలింగములు కలవు. కనుక కోటప్ప కొండ త్రికూటాచలము. త్రికూటాచలమాహాత్మ్యమును ప్రతిపాదించునది త్రికూటాచలమాహాత్మ్యము. ఇది "చిదంబరనటనతంత్రోక్తప్రకారంబున" రచించినదని కలదు. (61వచ. 1ఆ.) అది తృతీయాశ్వాసమే.

"అవధరింపుము దేవ చిదంబరాఖ్య
నటనతంత్రంబులోన విస్ఫుటము గాఁగ
చెప్పఁబడిన త్రికూటాఖ్యశిఖరమహిమ
మాంధ్రకృతిఁ జేసితిని నీకు నర్పణముగ. " 2ప. 3ఆ.

ఇట్లు ప్రథమ, ద్వితీయాశ్వాసములందు లేవు. ప్రథమాశ్వాసములోని దక్షయజ్ఞము కాశీఖండములోని దక్షేశ్వరలింగప్రాదుర్భావవృత్తాంతమునకు అనుసరణము. ఇందు కాశికాపురి ప్రసక్తియును కలదు. (140వచ. 1ఆ.) ద్వితీయాశ్వాసములోని త్రికూటాచల మాహాత్మ్యము, ఓంకారనదీవృత్తాంతము స్థలపురాణములు. శిబిచక్రవర్తి వృత్తాంతము పురాణప్రసిద్ధము. తృతీయాశ్వాసములోని సాలంకుని కథ, ఆనందవల్లి కథ చిదంబరనటన తంత్రములోనివగును.

దక్షయజ్ఞమునందు దక్షుడు సతీదేవిని నిందించును. అందుకు సతీదేవి దేహత్యాగము సేయును.

"తరుణి మాకు విరోధి నీ ధవుఁ డతండు
ప్రేతభూతపిశాచసత్ప్రియసఖుండు
యజ్ఞభూమికి నరుదేర నర్హుఁ డగునె
యతని సతివౌట నీవు ననర్హ విపుడు. 116.
అనిన విని దక్షుని తోడుత
వనజేక్షణ పలికె నీదు వలన జనించెన్
తనువిది దీని విసర్జన
మొనరించి హిమాద్రి కేను బుట్టెద సుతనై." 117ప. 1ఆ.

కోటప్ప కొండ వర్ణన ఒక పద్యమునందు శబ్దసుందరము. మఱొక పద్యమునందు అర్థసుందరము.

"ఫలితరసాలసాలతరుబంధురబంధురమావిలాసమై
కలితసుమేరుమేరునగకాంతసుకేసరకేసరాఢ్యమై
లలితసువర్ణవర్ణిసుమరాజికదంబకదంబవాసమై
యలరు నగంబుడంబు గొనియాడఁగఁ జూడఁగవింత యెంతయున్."71ప. 1ఆ

"శిఖరాగ్రగైరికాశేషధాతుప్రభా
చ్ఛన్నలతావళుల్ జడలు గాఁగ
నిఖిలశృంగోద్భూతనిర రవాహినుల్
రమణీయసర్పహారములు గాఁగ

ఘననితంబాభోగకాదంబినీశ్రేణి
కటితటి గజచర్మపటము గాఁగ
శశికాంతవిస్ఫుటస్ఫటికచ్ఛవివ్యాప్తి
పూసిన సితభూతి పూఁత గాఁగ
మౌనిసేవితమగుచును మౌనముద్ర
దనరఁగా దక్షిణామూర్తి యనఁగ నొప్పు
నమ్మహీధ్రంబు తన చుట్టు నర్థిఁ దిరుగు
జనములకు వేగ భోగమోక్షము లొసంగు" 71ప. 2ఆ.

ఇందు కోటప్ప కొండయే కోటీశ్వరుడు. శివుని నృత్యమును ఇట్లు కలదు.

విరియఁబోసిన జటావివరంబు కెంజాయ
సాంధ్యరాగప్రభాసరణి గాఁగ
నీలనీలాంబుజనీలకంధరకాంతి
లలితాంధకారసంకలన గాఁగ
నాట్యవేగవిలోలనాకాపగావళీ
శీకరంబులు నుడుశ్రేణి గాఁగ
నతిసంభ్రమోద్భూతవితతాట్టహాసంబు
కమనీయచంద్రికాకాంతి గాఁగ
తన ప్రదోషతాండవకేళి తగఁ బ్రదోష
కాలసామ్యతఁ బూని లోకాళిఁ బ్రోవ
నృత్త మొనరించు సంధ్యల చిత్రజారి
య మ్మహాశైలకూటత్రయంబునందు." 129ప. 2ఆ.

సాలంకుడు ఎల్లమందలోని కట్టె లమ్ముకొనువాడు. కోటేశ్వరుని భక్తుడు. ఇతడు రుద్రశిఖరము మీద శివుని పూజించునెడ ఒక జంగముడు ప్రత్యక్షమగును. జంగముని శివునిగా భావించి, ఇంటికి తీసికొని వచ్చి సేవించును. అతడు కొంతకాలమునకు అంత ర్ధానమగును. ఇతడు చింతాక్రాంతు డగును. ఆనందవల్లి కొండదటి కుందరీసునందుల కూతురు. కోటీశ్వరుని భక్తురాలు. ఆమెకు జంగముడు దర్శన మిచ్చును. అది తెలిసి ఆమె ద్వారా జంగముని దర్శించుటకు ప్రయత్నించును. జంగముడు ఆనందవల్లిని భక్తిమార్గము నుండి తప్పించుటకు ప్రయత్నించి విఫలు డగును. జంగముని పరీక్షకు ఆనందవల్లి విఫల అగును. జంగముడు బిలప్రవేశము చేయును. ఆనందవల్లి శివైక్యము నందును. సాలంకునికి జంగముడు కనిపించును. అతని ఆదేశానుసారము సాలంకుడు గుడి కట్టించి, నూతనకోటీశ్వరుని ప్రతిష్ఠించును. శిలాభవనము నిర్మించి ఉమాదేవిని ప్రతిష్ఠించును. శివరాత్రిమహోత్సవము జరుగును. సాలంకుడు, అతని ముగ్గురు తమ్ములు లింగమూర్తు లగుదురు. ఇది చిదంబరనటనతంత్రమునకు తెనుగుసేత.

ఇందు కోటీశ్వరుడు, గణనాథుడు, సాలంకేశ్వరుడు, సంతానకోటీశ్వరుడు, మార్కం డేయేశ్వరుడు, రామలింగేశ్వరుడు, ఆనందవల్లి, లింగత్రయము, మహాలింగము, దుర్గ, భైరవుడు, ద్వారపాలకులు, లింగమూర్తులు ఉన్న స్థలముల నిర్దేశము కలదు. (5-18ప. 3ఆ.) అష్టోత్తరశతనామములు కలవు. (162-182శ్లో. 3ఆ.) శివరాత్రిమహోత్సవము

(253-261వ. 3ఆ.) ప్రభలు (275,276ప. 280వచ. 3ఆ.) కలవు. అంతేకాదు. ఛందో వైవిధ్యము కలదు. అందు శ్రీ అను ఏకాక్షరపద్యము అపూర్వవిశేషము. అది :

" శ్రీ
కో
టీ
శా! " 139ప. 2ఆ.

**మతుకుపల్లి నరసింహశాస్త్రి** : ఇతని కృతులు 1. అజచరిత్రము. 2. చెన్నపురీ విలాసము 3. మేఘదూతము. ఇతడు వల్లూరు సంస్థానాధిపతి బొమ్మదేవర నాగరాజా ఆస్థానకవి[319]. అతడు "శాలివాహనమహాశకవత్సరంబులు భుజగజమునిచంద్రపూర్ణ సంఖ్యఁ బరగు సిద్దార్థిసంవత్సరంబున మాఘబహుళతృతీయార్యవాసరమున" కొప్పాక పురములోని వేణుగోపాలస్వామి ఆలయమునందు ధ్వజస్తంభప్రతిష్ఠ సలిపినట్లు కలదు. (10ప. 1ప. చె.వి.) భుజ=2, గజ=8, ముని=7, చంద్ర=1 = 1782+78=1860. ఇతనికి "శాలివాహనమహాశకవత్సరంబులు గుణవారణమునీందుగణన గల్గు రౌద్రినామవత్సరమున నాశ్వయుజీయబహుళపంచమిమందవారమున" బంగారు బాహుపురి, జోడు కాశ్మీరశాలువలు బహూకరించినట్లును కలదు. (9ప. 1ప.చె.వి.) గుణ=3, వారణ=8, ముని=7, ఇందు=1 =1783+78=1861 చెన్నపురీవిలాసము 1943 వ సంవత్సరము నాటికి ఎనుబది సంవత్సరముల క్రితము మొట్టమొదట ముద్రింపఁబడినట్లు కలదు[320]. 1943-80=1863. కాఁబట్టి కృతుల రచనాకాలములు అజచరిత్రము 1860 ప్రాంతము, చెన్నపురీవిలాసము 1862 ప్రాంతము, మేఘదూతము 1865 ప్రాంతము కావచ్చును.

అజచరిత్రము కాళిదాసు రఘువంశములోని అజచరిత్రమునకు తెనుగుసేత. మేఘదూతము కాళిదాసు మేఘసందేశమునకు తెనుగుసేత. రెండును దుర్లభములు.

చెన్నపురీవిలాసము నూతనస్వతంత్రకావ్యము. చెన్నపురివర్ణనము. వేశ్యావర్ణనము, పుష్పలావికావర్ణనమును ఉన్నను, సాధారణపురవర్ణనము కాదు. సాధారణకావ్యమును కాదు. చెన్న "పురవికస్వరచారువిలాసవర్ణస్ఫురణం బొనర్పు"నది. (3ప. 3ప్ర. 1ప.) అభినవమైన "పౌరాణవైభవముల"కు అతిస్వచ్ఛమైన దర్పణము. (12ప. 26ప్ర. 6ప.) "మృదుపాకము" కాదు. ముదురుపాకము- స్వరూపమునందు, స్వభావమునందు నూతనము. ఇందు ఆశ్వాసవిభాగము లేదు. పద్ధతివిభాగము కలదు. ఆఱు పద్ధతులు. ప్రతిపద్ధతియందును ప్రకరణ విభాగము కలదు. 1. స్వరూప పద్ధతి. పదమూడు ప్రకరణములు- 2. పూర్వపద్ధతి. ఏడు ప్రకరణములు. 3. దక్షిణపద్ధతి. ఎనిమిది ప్రకరణములు- 4. పశ్చిమపద్ధతి. ఎనిమిది ప్రకరణములు. 5. ఉత్తరపద్ధతి. ఆఱు ప్రకరణములు. 6. అంతరాళపద్ధతి. ఇరువదియాఱు ప్రకరణములు. మొత్తము అఱువది నాలుగు ప్రకరణములు- స్వరూపపద్ధతిలోని మంగళ, కృతినాయక, కృతిప్రకరణములు, అంతరాళపద్ధతిలోని దశావతారప్రకరణములు, పద్ధతుల ఆద్యంత పద్యములు వదలిన, అఱువది ప్రకరణములు. నూట అఱువది తొమ్మిది పద్యగద్యములు. అఱువది శీర్షికల కావ్యఖండికల సంపుటి అనవచ్చును. ఆధునికయుగములోని ఖండకావ్యములకు ఆద్యప్రకృతి వలె కలదు.

ఇది 1862 నాటి మదరాసునగరమునకు కవితాఛాయాచిత్రము. గుడులు, అంగడులు మొదలైన అనేకవిశేషములతోపాటు, హూణవైభవములు అనగా పాశ్చాత్యుల వలన పొడుకొనిన నూతనవిశేషములు కలవు. అప్పటివారికి అవి ఆశ్చర్యము కలిగించినవి.

దొరలు, దొరసానులు గంధర్వాప్సరఃకిన్నరులు.

"లలితాకారవిచిత్రవేషరుచిరాలంకారశృంగారమూ
ర్తులు యూరోప్దొరసానులున్ దొరలు దోడ్తో సారటు ల్మెట్టి ద్యో
స్థ్సలి నారూఢవిమానులై తిరుగు గంధర్వాప్సరః కిన్నరు
ల్పలె క్రీడింతురు వీట వార్ధి కడ లీలారథ్యలన్ సంధ్యలన్." 5ప. 13ప్ర. 1ప.

'లైట్ హౌస్' వింత.

"పురదుర్గంబుల మధ్యభాగమున నంభోరాశితీరంబునన్
బరపై యొప్పు శిలావితర్దిపయి నుద్భాసించు నెల్లప్డు సా
గరధావత్తరికోటికి న్నిశల మార్గంబు బ్రదర్శింప భా
స్వరదీపం బిడు గచ్చుఁ గంబ మొక డాశ్చర్యాతిదీర్ఘాకృతిన్." 1ప. 6ప్ర. 2ప.

రైలుపట్టాల మీద పై వంతెనలు విడ్డూరము.

"అచట నొక్క మహాద్భుతం బైన వింత
వంతెన దనర్చు దానిపై సంతతంబు
ప్రజ నడచుఁ గ్రింది తూముల రైలు బండ్లు
పఱచు నది చూడ నద్భుతావహము గాదె. 3ప. 2ప్ర. 5ప.

టెలిగ్రాము మహాచిత్రము

"అమరు ల్మానులు మున్ దపోగరిమ నుద్యద్దూరవార్తాగ్రహో
రుమహత్త్వంబును గాంచి రబ్రముగ నూరోపను లా ప్రోల నో
లి మహాచిత్రముగా ఘటించి రది టెల్లెగ్రావునా దాన ని
క్కముగా దూరపు దీవి వార్తల నెఱుంగన్వచ్చు నేకక్షణిన్." 4ప. 1ప్ర. 5ప.

అప్పటికి టెలిఫోను వచ్చినట్లు లేదు. ధూమశకటములు "నిర్నిరోధవార్షికాంబుదమాలికావళుల మాడ్కి" పరుగు లెత్తునట (5ప. 2ప్ర. 5ప.) ముద్రాక్షరశాలలందు వావిళ్ల రామస్వామి ఆదిసరస్వతీనిలయము కలదు. (6ప. 1ప్ర. 6ప.) బొమ్మదేవర నాగరాజా సహాయము కలదు.

"శ్రీమత్పావనబొమ్మదేవరకులక్షీరాబ్ధిరాకాసుధా
ధామశ్రీ యగు నాగభూపతి జగత్ప్రఖ్యాతిగా వీట నా
రామస్వామిమనీషిచే నిఖిలసద్గ్రంథాళి ముద్రింప లో
కామోదం బగు నట్లొనర్చె దన సాహాయ్యంబు వాటించుచున్." 1ప. 2ప్ర. 6ప.

ఎలక్ట్రిక్‌షాక్ గుఱించి మూడు పద్యములు :

"కందురీఁగెల యొక కోటి గఱచినట్లు
కూడి వెయి మండ్రగప్పలు కుట్టినట్లు
దాక మ్రోచేతికిని దెబ్బ దాఁకినట్లు
తల్లడిలు ప్రాణములు తంత్రిఁ దాఁకినంత. 5
తేలు కుట్టిన వెత కొంత దేహమంద
జనుల బెదరించు కైవడి ఝూంకరించు

తంత్రి నంటిన మాత్రఁ జిత్రంబు గాఁగ
జలజలన దేహ మందెల్ల జలదరించు. 6.
ఎక్కుడగు వింటిచే దూది యేకినట్లు
గులగులన రక్తమాంసము ల్కుదురు గదలఁ
బల్లటిలుఁ బ్రాణములు మేను జల్లు రనఁగఁ
దీఁగెదోయి కరద్వయి లాఁగు నపుడు." 7ప. 4ప్ర. 6ప.

ఇందు ప్రభుత్వరంగమునకు సంబంధించిన ఉద్యోగములు ఇంగ్లీషులోనే కలవు.

"ఘనతఁ గమిస్పెరీదొరల గొర్నరుగార్లను సెక్రిటేరులన్
గనఁగఁ గమిస్పెరీజెనలుగారు శిఫారసు సేయ మెచ్చి నె
మ్మనమున కూర్మి నా నృపతిమౌళికి గొర్నరుమెంటువారు భూ
జను లలరారఁగా హెుకు మొసంగిరి క్రమ్మఱ రాజ్య మియ్యఁగన్." 15ప. 2ప్ర.1ప.
"గ్రసదాశేశ్వరసంసదుద్యమము లిన్కంటా క్సపిస్మెంటు టా
క్సు సదర్కోర్టును హేడ్డు పోలిసును నా సాంపారు నాఫీసు లిం
పెసఁగన్ దత్పురి దక్షిణంపు దెస లోకైకార్థధర్మంబు మే
లొసఁగన్ జాతిదొరల్ ఘటింపఁదగి బాహ్యోద్యానభాగంబులన్." 1ప. 6ప్ర. 3ప.

ఇట్లు కోటలు, పేటలు, క్రయవిక్రయశాలలు, పెట్టె బండ్లు, పుస్తకసౌధము, ఫిరంగులు, జంతుప్రదర్శనశాల, టంకశాల మొదలైన బహువిషయములు ఇందు కలవు.

**గరుడాద్రి సుబ్రహ్మణ్యము** : ఇతని కృతి శత్రుఘ్నవిజయము. అముద్రితము. కార్వేటి సంస్థానాధిపతి మొదటి కుమారవేంకటపెరుమాళ్లరాజా సవతి తమ్ముడు తిరుమలరాజానకు అంకితము. శత్రుఘ్నవిజయము రచనాకాలము 1864 వ సంవత్సరమని[321] కలదు.

**మండ కామయ** (నరహరి కామయ, చిట్టి కామశాస్త్రి, కామేశ్వరము) : ఇతని కృతులు 1. రామచరితమానససరోవరము. 2. ఆంధ్రమార్కండేయపురాణము. 3. రామకథాసారసంగ్రహము. 4. ఆంధ్రకూర్మపురాణము. ఇతడు విజయనగరసంస్థాన కవి. సంస్థానాధిపతి విజయరామగజపతి (1826-1879). రామచరితమానససరోవరకృతి ప్రేరకుడు. అతని భార్య అలకరాజేశ్వరీదేవికి ఆంధ్రమార్కండేయపురాణము అంకితము. రాజబంధువు భూపతిరాజా వేంకటపతిరాజానకు రామకథాసారసంగ్రహము అంకితము. విజయరామగజపతి కుమారుడు ఆనందగజపతి (1879-1897) ఆదేశానుసారము ఆంధ్రకూర్మపురాణము విజయరామగజపతికి అంకితము.

రామకథాసారసంగ్రహమునందు ఇట్లు కలదు[322].

"శ్రీమ న్మహారాజశేఖరు లిట మున్ను రామలీలాగ్రంథ
రచనఁ జేయ మము నియోగించి రా ఘనతరగ్రంథంబు
లయతాళకృతి సమన్వయము గాఁగ నఖిలపురాణేతిహాసోక్త
రామకథావిశేషంబుల దీవి గూర్చి మును తులసీదాసుం డను మహా
కవిచేత కాశీస్థభాషాప్రకారఫణితిఁ గూర్పఁబడిన రామాయణ
గుంభితార్థ మట్లుఁ జేసితిని." పుటలు 13, 14

ఆంధ్రకూర్మపురాణమునందు ఇట్లు కలదు.

"మును తులసీరామాయణమును దెనుఁ గొనరించి వారి

(విజయరామగజపతికి) మోహింపఁజేసి గౌరవము గాంచిన"

ఇవి రామచరితమానససరోవరము మండకామయ కృతమనుటకు నిర్ధారక సాధనములు. అయినను మఱి అయోధ్యాకాండము పూర్తిగాను, అరణ్యాకాండము కొంత శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి రచించినట్లు వ్రాతప్రతియందు[323] కలదు. అతడు 1866-67 మధ్య విజయనగరసంస్థానమునందు సన్మానము నందినట్లు కలదు[324]. ఇతడు అయోధ్యాకాండము, అరణ్యకాండము కొంత రచించుటకు అతడు అవకాశము కలిగించియుండ వచ్చును. కాఁబట్టి రామచరిత మానససరోవరము రచనాకాలము 1865 ప్రాంతము, ఆంధ్రమార్కండేయపురాణము రచనాకాలము 1870 ప్రాంతము, రామకథాసార సంగ్రహము రచనాకాలము 1875 ప్రాంతము, ఆంధ్రకూర్మపురాణము రచనాకాలము 1880 ప్రాంతము కావచ్చును.

**రామచరితమానససరోవరము** : సుందరకాండము మాత్రమే ముద్రితము. అది కూడ "ఆంధ్రతులసీరామాయణము (సుందరకాండము), తులసీదాసు రామచరిత మానస్ తెనుగుసేత శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి" అని ముద్రితము. (1984). బాల, అరణ్య (కొంతకాదు,) కిష్కింధా, సుందర, యుద్ధకాండముల తెనుగుసేత మండకామయ కృతము. తులసీదాసు రామచరితమానస్ మాత్రాఛందస్సులో కలదు. రామచరితమానస సరోవరము కూడ మాత్రాఛందస్సులోనే కలదు. అంతేకాదు. తులసీదాసు మాత్రా ఛందస్సులలోనే కలదు[325]. ఇది విశేషము. తులసీదాసు మాత్రాఛందస్సు చౌపాయి, దోహా. అయిదు చౌపాయిలు ఒక దోహా క్రమము. చౌపాయిల సంఖ్య అయిదు కంటె ఎక్కువ, తక్కువ ఉన్న సందర్భములును కలదు. అంతేకాదు. అక్కడక్కడ ఛంద్ అను పేర గణచ్ఛందస్సులును కలవు.

చౌపాయి- దోహాపద్ధతి : త్రిజటస్వప్నవృత్తాంతము :

చౌ. అంత త్రిజట యను నాసురి సీతా
కాంతభక్త మేల్కని తమితో తా
నెంతయు నట గల యింతుల గాంచుచు
వింత స్వప్నమును వే వినిపించుచు ॥ 76
నారులారా! మన్ననతో సీతన్
మీరక గొలువుడు మేలగు గాతన్
వారక విను డిట వానరు డొంటిన్
జేరి రాక్షసుల జీరుట గంటిన్ ॥ 77
ఖరము నెక్కి నగ్నత్వము తోడన్
యిరువది కరములు శిరములు నూడన్
పరేతరాడ్దిక్పథమున నొంటిన్
సరవి రావణుడు చనగా గంటిన్ ॥ 78
అల(రి) విభీషణు డా రామాజ్ఞన్
వెలుగు పురమునను నిలచెను ప్రజ్ఞన్
లలన సీత శ్రీరాముల తోడన్
గలయగ నిటు కలగంటిని జూడన్ ॥ 79
దినములు నాలుగు దీరకయున్నన్

ఘనమగు నిది నిక్కం బగు నన్నన్
విని యా రాక్షసవనితలు భీతిన్
గొని సీతకు మ్రొక్కుచు నయరీతిన్ ॥ 80

ద్వి. జని రట నట రాక్షసవనిత
లనఘ సీత మదిలోన
పనవెను మానము జనకులుడు
దునుమునొ యని భయ మూన ॥ 81

ఇందు అక్షరమైత్రులు, ప్రాసలు, అంత్యప్రాసలు కలవు.

గణచ్ఛందస్సు :

చం. "శేషుండు భూభర మెక్కుడైన గ్రహించి
మూర్చ మునుంగగా
ఘోషింపుచును నిజపీఠమున ధర కూర్మ
నాథుడు మోయగా
భాషాపతిప్రముఖుల్ సురల్ రఘువర్యు
గమనము గాంచుచున్
తోషించి రెంతయు దుఃఖముల కిది తుది
గదా యని యెంచుచున్ " 247

ఇందు అయిదు, నాలుగు, అయిదు, అయిదు, నాలుగు, అయిదు మాత్రల గణములు ప్రతిపాదమునందు కలవు. ప్రాస కలదు. యతిమైత్రి కలదు.

**రామకథాసారసంగ్రహము :** ఇది రామచరితమానససరోవరమునకే సంగ్రహమైన రూపాంతరము. "గద్యపద్యరచనావిశేషంబు పరిఢవిల్ల "రచించినది. అది హిందీకావ్య సరణి. ఇది తెలుగు కావ్యము సరణి.

**గురురాజు :** ఇతని కృతి శేషధర్మము. అముద్రితము. బళ్లారిమండలములోని జోహరామతాధిపతి సంజీవరెడ్డికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. "అతఁడిఱువది ముప్పది సంవత్సరముల క్రిందట నుండినవాఁడు" అని కలదు[326]. సమకాలిక సమాచారము. కాఁబట్టి శేషధర్మము రచనాకాలము 1870 ప్రాంతము కావచ్చును.

శేషధర్మము చర్విత చర్వణము.

**రత్నాకరము అప్పప్ప :** ఇతని కృతులు 1. శశిరేఖాపరిణయము. 2. సౌగంధిక ప్రసూన సంగ్రహము. మొదటిది కృష్ణాంకితము. రెండవది శివాంకితము. ద్వైవాంకితములు. రెండవది రత్నాకరము గోపాలరాజా సౌగంధికప్రసవాపహరణ మను ద్విపదకావ్యమునకు పద్యకావ్యము. ద్విపదకావ్యము రావిళ్ల లింగరాజానకు అంకితము[327]. అతడు గోలకొండ సులతాను అబ్దుల్లా కుత్బ్‌షాను జయించినట్లు కలదు[328]. జయించిన కాలము 1650 ప్రాంతము కావచ్చును. అది గోపాలరాజా కాలము. అతని వంశీయుడు అప్పప్ప. కాని వంశవృక్షము కానరాదు. ఇతడు సౌంగధికప్రసూనసంగ్రహమును ప్రచురణకర్తకు "అచ్చు వేయించి యమ్ముకొమ్మని యొసంగె"నని గ్రంథాంత సీసపద్యమునందు కలదు. అచ్చు వేసిన కాలము 1911 వ సంవత్సరము. ఒసగిన కాలము అప్పప్ప చరమకాలమగును- జీవితకాలము 1835-1910 కావచ్చును. కాఁబట్టి శశిరేఖాపరిణయము రచనాకాలము

1870 ప్రాంతము, సౌగంధికప్రసూనసంగ్రహము రచనాకాలము 1875 ప్రాంతము కావచ్చును.

**శశిరేఖాపరిణయము** : ఇది మూడవ శశిరేఖాపరిణయకావ్యము. వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినట్లు కలదు. ఇందు శశిరేఖాపరిణయప్రసంగముతోనే కథ ప్రారంభమగును. దేవకీదేవి కోడండ్రు కొలువ సంతసమున ఉన్న సమయమునందు, అచటికి వచ్చిన అల్లారు ముద్దుగా పెంచిన శశిరేఖను ముద్దాడును. అదే సమయమునందు బలరామకృష్ణులును అచటికి వత్తురు. వారిని చూచి దేవకీదేవి.

"బాలామణి శశిరేఖను
బాలుం డభిమన్యుఁ డింద్రపౌత్రున కెలమిన్
మేలమునఁ బెండ్లి సేయుం
డీ లాగున జాగు సే సేలా మేలా" 76ప. 1ఆ.

అని ప్రతిపాదించును. బలరామకృష్ణులు "నీ యాజ్ఞ మాకు ముఖ్యం" బని శిరసా వహింతురు. అనంతరము సుభద్ర అభిమన్యునితో పుట్టినింటికి వచ్చినపుడు కృష్ణుని సమక్షమున అడిగిన, బలరాముడు

"అమ్మా యెంతటి బేలవె
కమ్మని విలుకాని సాటి ఘనుఁ డల్లునకున్
కొమ్మ నొసంగెద నీవున్
నెమ్మదిగా నుండుమమ్మ నీరజనేత్రీ" 103ప. 1ఆ.

అని చెప్పును. సుభద్ర "అన్న యీ మాట నిజమని హస్తమందు హస్తమిడు" మన్న, బలరాముడు అట్లు చేసి,

"మగువ నీ ప్రాణవిభుఁడైన మఘవసుతుని
వియ్యమున కంటె మా కిఁక వేఱె కలదె
తరుణి నీ వింతగా దీనిఁ దరుచనేల
విశదముగ నీవు పార్థుతో విన్నవింపు" 105ప. 1ఆ.

మని పునరుద్ఘాటించును. రేవతి ఆనందించును. సుభద్ర "నీ వచనమె వరము నాకు"అని, అత్తింటి కేగినపుడు తెలుప అందఱు సంతోషింతురు. అర్జునుడు పరమానంద భరితు డగును.

తదనంతరము "దుర్యోధనుండు కపటజూదంబునను రాజ్య మపహరించి" పాండవులను "అడవులకుఁ బంపె"నట్లు ఒక్క పంక్తి కలదు. (123ప. 1ఆ.) సభాపర్వసంగ్రహము లేదు. కృష్ణుడు ద్వైతవనమున కేగి, పాండవులను అనునయించి సుభద్రాభిమన్యులను ద్వారకకు తీసికొని వచ్చినట్లు కలదు. (126ప. 1ఆ.)

"అంతిపురంబులో నింతులతోఁ గూడి
చదరంగ మాడెడు సమయమందు
నచటికి సౌభద్రుఁ డరిగిన శశిరేఖ
తెప్ప వేయక వాని రీతిఁ జూచి
యాత్మలోఁ బలుమారు నతని రూపము మెచ్చి
చిత్తజుఁ బోలు మేనత్త కొడుకు

చిత్ర మెట్లున్నదో బొత్తిగాఁ దెలియరా
    దెవరిఁ బెండ్లాడునో యింద్రపౌత్రు
చక్కదనమెల్ల ముల్లెగా సంతరించి
అతిశయంబుగ నిర్మించినట్టి యజాని
మెచ్చవలె నని మదిలోన మీననేత్ర
దర్పకాకారు సౌభద్రుఁ దలఁచి మఱియు" 137ప. 1ఆ.

"తన మనంబున మగనిగాఁ దలఁచి తలఁచి" (140ప. 1ఆ.) వలచినది. అభిమన్యుడు శశిరేఖను చూచి "దిగ్భ్రమనొంది మారుని బారికిఁ జిక్కును." (142ప. 1ఆ.) పూలతోట కరుగును. శశిరేఖ కూడ సఖులతో వెడలును. పెంపుడు చిలుక నిమిత్తముగ శశిరేఖాభిమన్యులకు ఏకాంతసమావేశము కలుగును. అభిమన్యుడు శశిరేఖ సౌందర్యము ను మనస్సులో అభివర్ణించుకొనును. బావ, మఱదలి సరససల్లాపము సాగును. అభిమన్యుడు "ననుఁ గాము బాణములకున్ లోఁజేయకే వేఁడెదన్" అనిన, శశిరేఖ "సంతసించి" కూడ "చిల్క నీయవే" అని అడుగును. (179-181ప. 1ఆ.) అభిమన్యుడు "కాము బాధ కోర్వ నింకేమిసేతు మామ కూఁతురిట్లు మాటలాడు" (189ప. 1ఆ.), "ఇంక ముచ్చటలేలా" (189ప. 1ఆ.) అని మనస్సులో

"ఈ తరుణి పల్కు పల్కులు
నీతిపథం బగుచుఁ దోఁచె నే నాడినవే
నీతికి బాహిరమైనవి
నాతికి బాణంబు లగుచు నాటక యున్నే" 187ప. 1ఆ.

అని తలంచును. అంతేకాదు. శశిరేఖను "మనసు మర్మంబు దెలియక మంద బుద్ధి నగుచుఁ బల్కిన పల్కు లాత్మ నిడకు"మని కోరును. (201ప. 1ఆ.) అయినను, గాంధర్వవివాహమును ప్రతిపాదించును.

"వెడవింటివాని బాధకుఁ
దడ వోర్వఁగలే నటంచుఁ దత్తరపడుటన్
గడుఁ బరమాన్నము నార్వక
నుడుకుడుకుది జుఱ్ఱునట్టు లున్నది చూడన్" 209ప. 1ఆ.

అని, చిలుక నిచ్చిన పోయెద నన్న శశిరేఖను, ఇచ్చెదనని కరము పట్టుకొని అభిమన్యుడు "నన్నుఁ బ్రేమంబున నేలవే"అని ప్రాధేయపడును. (209-213ప. 1ఆ.) అభిమన్యుని తత్తఱపాటు చూచి బిత్తఱపోయిన శశిరేఖ ఉపాయ మాలోచించి, "అదే నా సఖు లరుదెంచిరి వదులు కరం" బనిన, అభిమన్యుడు వదలును. శశిరేఖ వెడలును. (215ప. 1ఆ.) అభిమన్యుడు నిట్టూర్చి తన మందిరము కేగును. సఖులను చేరిన శశిరేఖ విరహము నందును (220-258ప. 1ఆ.) ఇది ప్రథమాశ్వాసము.

కలహభోజనుడు నారదుడు కారణముగ, బలరాముడు శశిరేఖను దుర్యోధనుని కుమారుడు లక్ష్మణునికి ఇచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించును. అది తెలిసి సుభద్ర కృష్ణునికి విన్నవించును. కృష్ణుడు సుభద్రతో బలరాముని విడిది కేగి, "అన్నా నీకిదిధర్మ మౌనె" అని (28ప. 2ఆ.) అడుగును. "మేనల్లుఁడుండ నొరులకు మానిని నీరాదు"అని (29ప. 2ఆ.) తెలుపును. బలరాముడు కృష్ణుని "పాండవపక్షపాతి"వని (30-33ప. 2ఆ.)

నిరసించును. కోపము వచ్చిన కృష్ణుడు బలరామునితో "కవ్వడియు భీముఁ డిర్వురుఁ గదిసినపుడు కౌరవులు నీవు పడుపాటు కలదుగాక" అని, సుభద్రతో "తాలాం కుండు పల్కిన పల్కుల స్వారస్యంబు దెలిసెగదా నీకు దిక్కు గల చోటి కరుగుమని దిగ్గున లేచి" తన మందిరమున కరుగును. (34-36ప. 2ఆ.) సుభద్ర బలరామునికే విన్నపము సేయును. (27-45ప. 2ఆ.) అందు రెండు అనర్ఘరత్నములు :

"మగువ నిచ్చెదనని చెప్పి మఱచి నేఁడు
పరుని కిచ్చెద నని పల్క భవ్య మగునె
సిరియు లేమియు వెన్నెల చీఁక టరయ
సీరసాధన కరుణించి చేడె నిమ్ము." 37ప. 2ఆ.

"సిరి గల వారికిఁ జేడెల
నరయుచు నెవరైన నిత్తు రది ఘన మగునే
నిరుపేద కిచ్చి చేసిన
సరసాగ్రణి కిహముఁ బరము సౌఖ్యము లబ్బున్." 44ప. 2ఆ.

దేవకీవసుదేవులు చెప్పినను, బలరాముడు పెడచెవిని పెట్టును. సుభద్రను కూడు, కోక లేక కొంప పట్టితివనిన, సుభద్ర రోషము కొలది పలుకును. అందు రెండు ఆణి ముత్యములు :

"కడుపు కూటికి నీ కొంపఁ గాచియున్న
నీతి మాలిన మాటలు నీవు పలుకఁ
జెల్లెలను గాన బలరామ చెల్లెఁ గాక
పాండవులు విన్న నా యాన బ్రదుకనీరు" 62.

"కొడుకు లేప్పై యున్నఁ గోడ లెందుకు రాదు
నీ పుత్రి నీ కున్న నిలువఁ బోదు
గంతకుఁ దగినట్టి బొంత లోకమునందు
గల్పించె మొదటనే కమలభవుఁడు
నుదుట వ్రాసిన వ్రాలు పదపడి తప్పింప
నీవెవరు నేవెవరు నీతిరహిత (?)
సదయాత్ముఁడని నిన్ను మదిలోన నమ్మితి
కఠినహృదయుఁ డంచుఁ గాననైతిఁ
గలిమి నాశించి యన్నతంబు ఁ బలికితీవుఁ
గౌరవులు నేకమై మమ్ముఁ గాన కనిపి
రామరాజ్యముగా మీరె రాజ్య మేలుఁ
డనుచు నేడ్చుచు నరిగె నయ్యంబుజాక్షి." 64ప. 2ఆ.

సాత్యకి సహితము బలరామునికి హితము చెప్పును. బలరాముడు వినడు. ప్రత్యుత్తర మీయడు.

సుభద్ర జరిగిన సంగతి అభిమన్యునికి తెలుపును. అందొక సార్వజనీనమైన, సార్వకాలికమైన సత్యము :

"కలిమి గల వారి పక్షమె
పలుకుదు రెవరైనఁ గాని భావింపంగా

నిలలోఁ బేదల పక్షము
కలలోనం బలుక రనుచు ఘను లన విందున్." 82ప. 2ఆ.

అభిమన్యుడు అభిమానధనుడై బలరామునితో యుద్ధము సేయుటకు సిద్ధమైన, సుభద్ర తనకు అపనింద వచ్చునని వారించును. "మీ య న్నాడే తప్పుడు కూతల కోర్చుచు నిప్పురమందు నుండనమ్మ" అని (100ప. 2ఆ.) అభిమన్యుడు అరణ్యవాసము నకు బయలుదేరును. సుభద్ర అనుసరించును. రాత్రి బయలుదేరి మూడవనాటి సాయంకాలమునకు ఘటోత్కచుని వనము చేరుదురు. అచట ఘటోత్కచాభిమన్యులకు యుద్ధము జరుగును. (126-151ప. 2ఆ.) వేదవ్యాసుడు వచ్చి, "ఇరువురు నన్న దమ్మ"లని తెలుపును. హిడింబాసుభద్రలు, ఘటోత్కచాభిమన్యులు ఏక మగుదురు. బలరాముడు శశిరేఖను అభిమన్యునికి ఇచ్చునట్లు చేసెదనని ఘటోత్కచుడు ప్రకటిం చును. ఇది ద్వితీయాశ్వాసము.

సుభద్ర అభిమన్యునితో అడవి కేగుట విని, కృష్ణుని అష్టమహిషులు రేవతిని ఆడి పోసుకొందురు. "ఎఱిఁగి యెఱిఁగి యిట్లేల దూరెదరమ్మ"అని రేవతి కన్నీరు పెట్టును. అందఱు కలిసి బలరామునికి చెప్పుదురు. అతడు విననట్లుండును. నిజసఖులు తెలుప శశిరేఖ ప్రాణ్యత్యాగమునకు సిద్ధపడును. నారదుడు వచ్చి శశిరేఖాభిమన్యులు దంపతు లగుట బ్రహ్మలిఖితమని వారించును. భీష్మద్రోణులు వినా, కౌరవులు లక్ష్మణవివాహము నకు తరలి వత్తురు. ఘటోత్కచుడు శశిరేఖను సుభద్రాభిమన్యులకు అప్పగించును. శశిరేఖ సుభద్రకు పాదాభివందనము చేసి,

"బొత్తిగ బాల్యంబున నా
చిత్తము నీ సుతునియందుఁ జేర్చిన దానన్
చిత్తము లేదెవ్వరిపై
నత్తా యిది నిశ్చయంబు హరి తోడనినన్" 125ప. 3ఆ.

సుభద్ర సంతోషించును. ఘటోత్కచుడు మఱల ద్వారకకు వచ్చి, శశిరేఖాకృతిదా ల్చును. కృష్ణుడు ఘటోత్కచుని ఘనకార్యము నెఱిగి, సంతసించి, బలరామునికి చెప్పకుం డును. సాత్యకిని శాంతింపఁజేయును. సఖీజనులు మాయాశశిరేఖను వివాహవేదిక యొద్ద కు తోడ్కొని వత్తురు. బలరాముడు కన్యాదానము సేయును. పురోహితులు తెర వంచుచు, ఒకరి నొకరి చూడు డనగానే,

"చూడ లక్ష్మణున కా సుదతి కుందేలుగా
గంతులు వైచుచుఁ గానఁ బడియె
వెంబడి నతఁ డాత్మ వెఱగంది చూడఁగా
పిండి బొక్కుచు గండుపిల్లి యయ్యె
వగచుచు తెర వంచి వాఁడు వీక్షింపఁగాఁ
గొక్కిరింపుచు పండుక్రోఁతి యయ్యె
నిది చిత్రమని యెంచి పదిలంబుగాఁ జూడ
రోమముల్ పెరిగి భల్లూక మయ్యె
మదిని భ్రమఁ జెందితినో యంచు మఱియుఁ జూడ
మినుకు కోరల సర్పమై మీఁది కెగసె

నపుడు భయమున రెప్ప లల్లార్చుకొనుచుఁ
బండ్ల నిగిలించి విలపించెఁ బెండ్లికొడుకు." 177ప. 3ఆ.

పెండ్లి కూతురు "తక్కిన జనుల కెల్ల ముద్దుమొగంబుతో ముసిముసినగవులో. . . . మరుని రాచిల్క విధముగా తోఁచె"ను. (180ప. 3ఆ.) "లలనామణులు నవ్వలక్ష్మణుఁ డొక్కింత ధీరత్వమునఁ జాడ . . . . నత్యుగ్రశార్దూలమగుచుఁ దోచె"ను. లక్ష్మణుడు "అబ్బబ్బ యిది గండు బెబ్బులి యగుఁగాని సిన్నది కాదు నా కన్ను లాన"అని (182ప. 3ఆ.) ఎంత గోల పెట్టినను; కర్ణుడు, శకుని కూడ "మానిని గాదు వ్యాఘ్రమని మాటికిఁ బల్కెద వేమి చేటురా ఛీ నినుఁగూడి మాకుఁ గడు సిగ్గును గల్గెను బంధురాజిలోన్" అని ఛీత్కారము సేయుదురు. (191ప. 3ఆ.) అంతేకాదు.

"ఇంకొక్కసారి నీ వీక్షింపుమని వాని
కన్నులు నీటితోఁ దిన్నగాను
దుడిచి లక్ష్మణుఁ బట్టి పడఁతి వంకకుఁ ద్రిప్ప
నందుని విధముగా నాతఁ డున్న
బంధువులెల్ల నిర్బంధంబు సేయఁగాఁ
గడు భీతి మూసిన కనులు దెఱచి
గడగడ వడఁకుచు గ్రక్కునఁ జూడఁగా
దనుజనాథుఁడు ఘోరదంష్ట్ర లొప్ప
జడలు దాల్చుచుఁ కనుబొమల్ ముడిగొనంగ
వదనగహ్వరమున నిప్పు లదిరిపడఁగ
శూల మొక చేతఁ బూని యాభీలమైన
భూతమై తోఁచెఁ గురుపతిపుత్రునకును." 196ప. 3ఆ.

లక్ష్మణుడు మూర్ఛ వోవును. తెలివి వచ్చి తన వారిని విసుగుకొని, స్త్రీల మాటున చేరును. అయినను రాక్షసభూతము అనుసరించును. లక్ష్మణుడు బలరాముని పలుమాఱు తిట్టును. ఘటోత్కచుడు సర్పములను సృజించును. ప్రేక్షకులు కకావిక లగుదురు. మాయాశశిరేఖ మాయ మగును. ఘటోత్కచుని మాయలు సముత్కట మగును. అవి నివారించు శక్తి కలిగియు, కౌరవులకు గర్వభంగము కావలయునని కృష్ణుడు మౌనము వహించును. దుర్యోధనుడు రథగజతురగపదాతిదళములను యుద్ధమునకు సిద్ధము చేయును. వివాహ మాగిపోవును. ఇది తృతీయాశ్వాసము.

యుద్ధమునందు ఘటోత్కచుడు గోచరాగోచరుడై కౌరవులను, బలరాముని హడలెత్తించును. బలరాముడు కృష్ణునియొద్ద వాపోవును. కృష్ణుడు పకపక నవ్వి, "తోడఁ బుట్టువు నిలువెల్ల దోలినట్టి చేటు వాటిల్లె"నని (63ప. 4ఆ.) "అబ్జరేఖను యివ్వలేనంటిఁ గాని యిల్లు నెడఁబాసి పొమ్మని యెవ్వరనిరి" అని పలుకును. కృష్ణుడు,

"చెల్లెలి దక్రమం బనుచుఁ జెప్పెద వించుక నీతి లేక యీ
కల్లలు పల్కినన్ జనులు కాపురుషుం డనఁ బోరె రేవతీ
వల్లభ కూటికై గృహము వాకిలిఁ గాచితి వంచు దూరుటన్
యిల్లును వెల్లి పొమ్మనుట యించుక భేదము లేదు చూడఁగన్." 77ప. 4ఆ.

అని మందలించును. జను లందఱు "బలుఁడ నీవల్ల మాకింత బాధ కలిగె"

ననిన (94ప. 4ఆ.) బలరాముడు తలవంచును. ఘటోత్కచుడు కనిపించకుండ "నీ భావమునఁ దలఁచు కార్యము గావింప వశమె నీకుఁ గౌరవపతికిన్" అని హెచ్చరించును. (99ప. 4ఆ.) కృష్ణుడు బలరామునికి శశిరేఖను అభిమన్యుని కిచ్చి వివాహము చేయుమని హితబోధ చేసి, ఘటోత్కచుని శాంతింపఁజేయును.

సుభద్రాభిమన్యులను తోడ్కొని వచ్చుటకు బలరామకృష్ణులు, బంధువులు, అంతఃపురాంగనలు వత్తురు. కృష్ణుడు సుభద్రకు చెప్పును. సుభద్ర "చేతులుమోడ్చి", తన పడిన పాట్లు తెలిపి,

"ఈ భీమనందనుఁ డింతిఁ దెచ్చిన దాక
యెగ్గుగాఁ దోఁచిన నితనిఁ బ్రోవఁ
డీ శశిరేఖాఖ్య యిభరాజగామిని
మీరు తోడ్కొని పొండు మేము పొండు
తనయులు విహరించు వనముకేగెదము నా
సుతున కెచ్చటనైన సుదతి దొరకు
భాగ్యవంతుల పుత్రి బడుగుల కేలబ్బు
ధనవంతు లగు సుయోధనుని పట్టి
కొనఁగి చేసిన సమవియ్య మొప్పు-" 193ప. 4ఆ.

అని "న్యాయనిష్ఠురవాక్యముల్" పలికిన, బలరాముడు "దైవము బొంకించిన బుద్ధి లేక బొంకితి నను బొంకును మనంబున నిల్పవల"దని (192-193ప. 4ఆ.) విలపించిన, సుభద్ర ఏడ్చును. అది చూచి అంతఃపురాంగనలును దుఃఖింతురు. బంధువులును విచారింతురు. కృష్ణుడు,

"చెల్లెల నీవు నీ పగిదిఁ జింత వహింపఁగ నీరసాదనుం
డుల్లమునందు పెన్వగవు నూర్జితమై పెనుపొందు వేదనన్
జల్లగఁ గంట నీరిడియె సారసలోచన యా మహాత్ముఁడున్
దొల్లి వచించు వాక్యముల దోషము లెంచకు మమ్మ వేఁడెదన్" 196ప. 4ఆ.

అనిన, సుభద్ర

"మాధవ నీ వాక్యమధురామృతంబున
మదినున్న తాపంబు మాని నాకు
బలభద్రు పుత్రి యీ జలజారిరేఖను
నిచ్చిన మతియు మీ రివ్వకున్న
మేనమామలు మీరు మేనల్లుఁ డభిమన్యుఁ
డన్నలు మీరు నే ననుజను-" 197ప. 4ఆ.

అని కరయుగము ముకుళించి, స్తుతించి, బలరాముని తన నేరములు మన్నింపుమని కోరును. బలరాముడు తప్పు తనదని, ద్వారకకు వచ్చెదనని కృష్ణుడు వినగా వరమిమ్మని కోరును. రేవతి, రుక్మిణ్యాదులు కూడ కోరుదురు. శశిరేఖ వచ్చి రేవతీబలరాములకు, అభిమన్యుడు వచ్చి బలరామకృష్ణులకు పాదాభివందనములు చేయుదురు. అందఱు ద్వారకకు బయలుదేరుదురు. ఇది చతుర్థాశ్వాసము.

నారదుడు దేవలోకమున కేగి, అర్జునునితో ఏకసింహాసనమందున్న ఇంద్రునికి జరిగిన వృత్తాంతమును తెలుపును. సమయభంగమగునని సంశయము కలిగియు,

"కుమారుని వివాహంబు వీక్షించువాఁడై యోజించుచున్న" అర్జునుని ఇంద్రుడు ద్వారకకు తీసికొని వచ్చును. శశిరేఖాభిమన్యుల వివాహము జరుగును. వివాహానంతరము అర్జునుడు అమరావతి కేగును. ఘటోత్కచుడు ద్వైతవనమున కేగి, ద్వారకాపుర వృత్తాంతము తెలుపును. ధర్మరాజాదులు సంతసించి, ఘటోత్కచుని పరాక్రమమును ప్రశంసించి, అర్జునుని రాకకు నిరీక్షింతురు. ఇది పంచమాశ్వాసము.

ఇందు రసవిషయము భంగ్యంతరముగ ఇట్లు కలదు.

"ముందుగాఁ దనపత్ని నిందించెనని చెప్ప
రాజితంబై దోఁచె రౌద్రరసము
కొడుకుతో నిశశేఁగడవికేఁగె నటన్న
గణ్యమై తోఁచెఁ గారుణ్యరసము
అభిమన్యుఁడసురేంద్రుఁ డని చేసిరని చెప్ప
బహుచిత్రముగఁ దోఁచె భయదరసము
అసురేంద్రుఁడంగనాకృతినుండెనని చెప్ప
దుర్యమై తోఁచె నాశ్చర్యరసము
ఇంతిఁగని లక్ష్మణుఁడు గంతులేసెననిన
నా కిరీటికిఁ దోఁచెంబో హాస్యరసము
మెచ్చిరాముఁడు నను జఁ దోడ్తెచ్చెననిన
సలలితంబుగఁ దోఁచెను శాంతరసము." 14ప. 5ఆ.

ఇది అర్జునుని రసానుభూతి. సహృదయుని రసానుభూతి కూడ ఇదే. ఇంతేకాదు. శశిరేఖాభిమన్యుల సరససల్లాపము, విరహము, వివాహము శృంగారసము. ఘటోత్కచాభిమన్యుల యుద్ధము వీరరసము కూడ. ఘటోత్కచుని కౌరవ, బలరాముల తోడి యుద్ధమునందు వీరరసము తోపాటు బీభత్సరసమును కలదు. మొత్తము మీద శశిరేఖా పరిణయకావ్యమిది నవరసభరితము.

శైలి సరళాతిసరళము. సన్నివేశకల్పనము సహజాతిసహజము. పాత్రచిత్రణము. పరమౌచిత్యవిలసితము. కావ్యము కథాప్రధానము. వర్ణనా ప్రధానము కాదు. వర్ణనాభూయిష్ఠమును కాదు. కథావశ్యకములైన పుర, నాయికా, నాయక, సూర్యోదయ, సూర్యాస్తమయ, అరణ్యవర్ణనములు కతిపయపద్యములందే కలవు. అంతేకాదు. సుభద్ర తెనుగు ఆడపడుచుగా, శశిరేఖ తెనుగుమేనగోడలిగా, అభిమన్యుడు తెనుగుమేనల్లునిగా, తెనుగుమేనరికము తేజరిల్ల కథనము, తెనుగునుడికారము తేనెలూరు కవనము రాశీభూతమైన రసవత్కావ్యము.

సౌగంధికప్రసూనసంగ్రహము : ఇది మహాభారతములోని ఇతిహాసమే గాని, ఇతోధికముగ కథ సాగదీసినది. అందు భీముడు సరోవరరక్షకులైన యక్షరాక్షసులతో యుద్ధము చేసిన, "కుబేరుండును బాంచాలీప్రియకరంబైన పవనతనయు పరాక్రమంబు విని మెచ్చి వాని నుపేక్షించె"నని కలదు. (168వచ. 3ఆ. ఆర. ప.) ఇందు కుబేరుడు క్రుద్ధుడై యుద్ధము నపేక్షించును. ముందు నలకూబరుని యుద్ధమునందు పాండవులకు కౌరవులు సహాయపడుదురు. అందుకు కౌరవులకు అంతఃకలహమును జరుగును. కుబేరుని తోడి యుద్ధమునందు పాండవులకు కృష్ణుడు, గంధర్వులకు శివుడు సహాయ

పడుదురు. రెండు యుద్ధములందును ఘటోత్కచుడు ప్రముఖపాత్ర వహించును. ఈ యుద్ధములకు సూత్రధారి నారదుడు. కడకు కృష్ణుడు చక్రమును, శివుడు త్రిశూలమును ప్రయోగించుటకు సిద్ధపడుదురు. బ్రహ్మ వారించును. భీమాంజనేయుల సమావేశమునందు పండు సంఘటన అదనము. హనుమ,

"అక్షీణబాహువిక్రమ
వీక్షింపుమ యొక్క పండు వృక్షాగ్రమునన్
చక్షులకుఁ దోఁచుచున్నది
భక్షించెద తెచ్చియిమ్ము పాండుకుమారా!" పుట 22

అని కోరిన, భీముడు,

"ఇది యొక పెద్దకార్యమని యెందుకుఁ జింతిల వానరేంద్ర! నీ
మది ముద మందఁగా నిపుడె మ్రానినె పండిన పండు రాల్చి నీ
యెదుటను బెట్టి నా పనికి నేఁగెద నంచుఁ దలంచి భూతముల్
బెదరఁగ సింహనాదమును భీముఁడు సేసెను కాననంబునన్ " పుట 22

సింహనాదము చేసి, హనుమంతునిఁ చూచి మఱల,

"తలుపులు మ్రింగెడు వానికిఁ
జెలు వలరంగ నప్పళములు సెప్పఁగ నేలా
ఫలమును నిమిషార్ధములో
సులభముగఁ దీసి యిత్తు చూడుము నన్నున్ " పుట 22

అని భీముడు ఎన్ని బాణము లేసినను అన్నియు వ్యర్థమగును. ఖడ్గము విసిరిన గాలిలో కలిసి పోవును. విసిరిన విల్లును నిష్ఫల మగును. భీముడు చింతించును. హనుమంతుడు పరిహసించును. భీముడు క్రుద్ధుడై "ఈ గదాదండము చూడు"మని సింహనాదము చేసి గద త్రిప్పివైచిన పండును తాకి పైకి పోవును. రెండును భూమి మీద పడకుండ గగనపథము నందు నిలుచును. ఇది ఏ జానపదగాథనుండియో గ్రహించిన దగును.

భీమాంజనేయుల పరస్పరదూషణము పాత్రానుగుణము కాదు.

కౌరవుల అంతః కలహమునందు కర్ణుడు, భీష్ముని నిరసించిన తీరు :

"అందఱికిఁ దాతవని మే
మందఱము పెద్దఁ జేసి నందుకు నీకున్
కుందేటి వెఱ్ఱి పట్టెను
బృందారకనదితనూజ పొగలకు మింకన్." పుట 39.

కర్ణాశ్వత్థామలు కత్తులు దూయుదురు.

"అని పల్కి కానీనుఁ డడిదము ఝళిపించి
జవమున ద్రౌణిపై గవిసె నపుడు
గురుపుత్త్రుఁ డొరదీసి కరవాల మంకించి
రవిపుత్త్రుపై కేఁగె రథము దుమికి" పుట 40

పాండవులకు సహాయపడవలయునని హితోపదేశము చేసిన ద్రోణుని కర్ణుడు నిందించిన విధము :

"కుడిచి కట్టుట యెల్ల కురునరేంద్రుని యింట

మైత్రిభావము పాండుపుత్త్రు నింట
కాంతియుక్తములైన కాయంబు లిచ్చోట
హృదయము ల్పాండవు ల్మెదలు చోట
చిత్తంబులో వీరు చెడిపోదురను కోర్కి
ఘనసంపదల వారు మనుట కోర్కి
దుష్టాత్ము లని వీరి దూషింతు రెప్పుడు
ధర్మాత్ము లని వారిఁ దలఁతు రెపుడు
నీవు భీష్ముఁడు కృపుఁడును నీ తనూజుఁ
డరయ . . . . దుష్టచతుష్టయంబు లగుట
మనువు పతిఁ జంపఁ గోరుట మానవైతి
రేల మాటలు మీతోన చాలు చాలు." పుట 40.

ఇది యెల్ల భట్టనారాయణుని వేణీసంహారనాటకము ప్రభావము.

నారదుడు సందర్శించినపుడు శివుడు కొలువున్న తీరు మనోజ్ఞము.

"వీరభద్రకుమారవిఘ్నేశ్వరులు గూడి
సామవేదంబులు సదువుచుండ
వామభాగంబున హైమవతీదేవి
తారకమంత్రంబు తగఁ బఠింప
జాహ్నవి ముదముతో జడలపై వసియింప
శివయోగు లందఱుఁ జేరి కొలువ
పరమపావనులైన ప్రమథగణేశ్వరుల్
శివకవచ మెలమిఁ జెప్పుచుండ
నవ్యమణిమయసింహాసనంబు మీఁద
దేవదేవుఁడు కొలువున్న దేవమౌని
వచ్చె వచ్చిన నెదురేఁగి వామదేవుఁ
డుచితసింహాసనంబున నుంచి పలికె." పుట 73

సౌగంధిక ప్రసూన సంగ్రహము యుద్ధవర్ణనలు వినా నాటకీయ పద్ధతిని కలదు. ప్రథమాశ్వాసములోని ప్రథమసన్నివేశమే ప్రథమోదాహరణము- మహాభారతములోని "పవమాననందనుఁడు ద్రోవదియున్" గంధమాదనపర్వతసానువులందు "విహరించు చున్నచో" అను పంక్తి ఆధారముగ రూపొందినది. భీముడు ధర్మరాజును "వనమ్ముల కేఁగి పక్వఫలాళిఁ గొంచువత్తు" ననిన, ధర్మరాజు అనుమతించును. అది విని ద్రౌపది ధర్మరాజును భీముని వెంట పంపించుమని కోరును. ధర్మరాజు నిరాకరించును. నకులసహదేవులు, ధౌమ్యుడు పంపించుమందురు. ధర్మరాజు సమ్మతించును. అంతేకాదు. ద్రౌపది "వెంబడిఁ బోవుట" భీమునికి "పోరు లభించు"నని పలుకును. అది నాటకీయ ధ్వని.

యుద్ధవర్ణనలు మహాభారతములోని యుద్ధవర్ణనలను తలపించును.

**రెండవ మఠీంగంటి వేంకటనరసింహాచార్యులు** : ఇతని కృతులు 1. తాలాంక నందినీపరిణయము. 2. ఇందిరాల భాగవతము. యక్షగానము. అముద్రితము. తాలాంక నందినీపరిణయము శేషాచలపతికి అంకితము. దైవాంకితము. రెండు తాళపత్ర

గ్రంథముల తుదిని ఇట్లు కలదు[329].

"కలియుగశాలివాహనశకంబులు వేదరసాచలేందుసం
ఖ్యలు సన నందు నాంగిరసహాయనభాద్రపదాసితాష్టమిం
గలితమ్మృదూక్తి నీ సరసకావ్యము పూర్ణముగా రచించె న
త్యలఘుఁడు శేషశైలశిఖరాగ్రవిహారి..కృపామతిన్."

వేద=4, రస=9, అచల=7, ఇందు=1 = 1794+78=1872. అంగిరససంవత్సరమే. కాఁబట్టి తాలాంకనందినీపరిణయము రచనాకాలము 1872 వ సంవత్సరము.

తరముల పరిగణనమున 1867 అని కలదు[330]. గాని, అంతకంటె తాళపత్రగ్రంథ లిఖితాధారము ప్రమాణము.

తాలాంకనందినీపరిణయ మన శశిరేఖాపరిణయమే. గ్రంథనామమే గ్రంథస్థితికి నిదర్శనము. ఇది పైలుడు జనమేజయునికి చెప్పినట్లు కలదు. మొదటి, రెండు శశిరేఖా పరిణయకావ్యములు మూడాశ్వాసముల కావ్యములు. మూడవ శశిరేఖాపరిణయ కావ్యము అయి దాశ్వాసముల కావ్యము. ఈ నాలుగవ శశిరేఖాపరిణయకావ్యము ఆఱు ఆశ్వాసముల కావ్యము. ఇది కథాప్రధానము కాదు. వర్ణనాభూయిష్ఠము. అంతేకాదు. అనావశ్యకవిషయములు అధికము.

ప్రథమాశ్వాసమునందు తొంబది పద్యముల ద్వారకానగరవర్ణనము (36-126ప. 1ఆ.) శ్రీకృష్ణవైభవము (126-142ప. 1ఆ.) రేవతీబలరాముల వివాహము (143-150ప. 1ఆ.) సుభద్రాపరిణయము (14-252ప. 1ఆ.) అభిమన్యుజననవృత్తాంతము (253-256ప. 1ఆ.) శైశవవర్ణనము (257-270ప. 1ఆ.) పాండవుల రాజసూయము మొదలు అరణ్యావాసము వఱకు సభాపర్వసంగ్రహము (271-319ప. 1ఆ.) కలవు. ఇందు పాండవుల అరణ్యావాసము కారణముగ సుభద్ర ద్వారకానగరమునకు వచ్చుట మాత్రమే శశిరేఖాపరిణయమునకు ఆవశ్యకము. సుమారు రెండు వందల పద్యగద్యముల పూర్వ రంగము కథాప్రయోజనాత్మకము కాదు. ప్రధానకథాప్రారంభమునకు ప్రతిబంధకము.

ఇక ద్వితీయాశ్వాసము - సుభద్ర ద్వారకానివాసము (3-10ప. 2ఆ.) అభిమన్యుని బాల్యవర్ణనము (11-15ప. 2ఆ.) శశిరేఖ జన్మవృత్తాంతము (16-38ప. 2ఆ.) శశిరేఖాభిమన్యుల బాల్యవర్ణనము (39-47ప. 2ఆ.) ముందు కలవు. ఇందు ఒక విశేషము కలదు. అది శశిరేఖ అయిదేళ్ల వయస్సులోనే, అభిమన్యుని మీద మన్మథుడు అయిదు బాణములు ప్రయోగించెనట! అభిమన్యుని వయస్సు ఏడేండ్లు!

"పంచాబ్దమ్ముల రేవతీతనయకుం బ్రాయంబు సంధిల్ల భ
వ్యాంచత్సప్తశరత్సమాన్వితుఁడునై యప్పార్థసూనుండు య
త్కించిద్భేదము లేక శైశవశుభక్రీడావిహారంబుల
న్మించెన్ బంచశరప్రభాగరిమఁ బేర్మిం జెంద నానాఁటికిన్." 39ప. 2ఆ.

తర్వాత అభిమన్యుని విద్యాభ్యాసము (52-58) యౌవనము (60-71) శశిరేఖ యౌవనము (72-109) విరహము (113-118, 263-79) అభిమన్యుని విరహము (120-135, 145-148, 168-171, 213-215) వర్షర్తువర్ణనము (149-158) మేఘసందేశము (161-167, 181-182, 194-197) వర్షర్తు వర్ణనము (149-158) హంససందేశము (184-186, 191-192) హేమంతర్తువర్ణనము (188-190, 199-200) వసంతర్తువర్ణనము (201-

208) పవనాదిసందేశము (210-212) నర్మసఖునికి విరహనివేదనము (216-235) నర్మసఖుని అనునయము (237-255) వనవిహారము (256-60) శశిరేఖకు సఖుల అనునయము (280-289) కలవు. అంతయు వర్ణనాభూయిష్ఠము. బలరాముడు శశిరేఖ ను రాణివాసము నందుంచుట మాత్రమే కథాంశము. శశిరేఖ ప్రబంధసుందరి. అభి మన్యుడు ప్రబంధనాయకుడు.

మఱి తృతీయాశ్వాసము. మఱల శశిరేఖ విరహము. (3-13) సఖుల అనునయము (15-31) వనవిహారము (32-57) జలవిహారము (58-75) మన్మథపూజ (76-87) సూర్యాస్తమయాదిచంద్రోదయపర్యంతవర్ణనము (88-111) మన్మథవీరవిహారము (112-123) మూర్ఛ (125) సఖుల కలవరము (126-129) శిశిరోపచారములు (30-136) విలాపము (137-139) మన్మథాద్యుపాలంభము (141-164) సూర్యోదయవర్ణనము (166-173) ఆశ్వాసము సమాప్తము. కథాంశము పూర్ణానుస్వారము.

అసలు కథ చతుర్థాశ్వాసమునందు ఆరంభమగును. సుభద్ర బలభద్రుని సూటిగా అడుగదు. కృష్ణుడు చెప్పును. సాత్యకి అడుగును. సుభద్ర బలరాముడు నిందించినట్లు అభిమన్యునికి చెప్పును. అభిమన్యుడు వీరాలాపము లాడును. శశిరేఖ గుఱించి విల పించును. శశిరేఖ ఆత్మహత్యకు సిద్దపడిన, నారదుడు వారించుటకు బదులు, శశిరేఖ ఆత్మహత్య చేసికొందునని అభిమన్యుని కడకు చిలుకను రాయబారము పంపునట్లు చేయును. ఘటోత్కచాభిమన్యులు సోదరులని వేదవ్యాసుడు కాక నారదుడు చెప్పును. ఘటోత్కచుని ప్రతిజ్ఞతో ఆశ్వాసాంతము.

ఘటోత్కచుని ప్రతిజ్ఞానిర్వహణము పంచమాశ్వాసము. కథావిషయము. షష్ఠా శ్వాసము శశిరేఖాభిమన్యుల వివాహము. నిషేకము. వర్ణనాతిశయము. వివాహవర్ణనము శతాధికపద్యగద్యములందు కలదు. (3-180) నిషేకవర్ణనము అర్ధశతపద్యగద్యములందు కలదు. (181-230)

అప్పప్పకవి శశిరేఖాపరిణయము ఎంత తేటయో, నరసింహాచార్యుల తాలాంక నందినీపరిణయము అంత జిడ్డు. భాషాదోషములందు కాసంత సామ్యము. తాలాంక నందినీపరిణయమునందు చిత్ర, బంధకవిత్వములు అధికము. అంతేకాదు. ముకుంద విలాసమునందు, హంసవింశతియందు వలె కావ్యౌషధనామపద్యములును కలవు. (109ప. 2ఆ; 134ప. 3ఆ.) వర్ణచ్యుతిపద్యము (88ప. 2ఆ.) నిరోష్ఠ్యపద్యము (322ప. 1ఆ.) సోష్ఠ్యనిరోష్ఠ్యపద్యము (17ప. 3ఆ.) సోష్ఠ్యత్ర్యక్షరపద్యము (352ప. 4ఆ.) పతాకబంధము (320ప. 1ఆ.) ఖడ్గబంధము (321ప. 1ఆ.) నాగబంధము (293ప. 2ఆ.) కుసుమగుచ్ఛ బంధము (330ప. 5ఆ.) ఇందు గర్భకవిత్వము లేకపోవుట విచిత్రము.

అభిమన్యుడు కూడ కవితలు నేర్చుట విశేషము.

"చారుతరార్థబోధనల శయ్యల రీతుల శబ్దవృత్త్యలం
కారములన్ రసస్ఫురణకల్పనలన్ మృదునర్మగర్భగం
భీరతరధ్వనిస్ఫురణభేదములం గుణదోషసూక్ష్మవి
స్తారములం గ్రహించి కవితల్ రచియించఁగ నేర్చె నెంతయున్." 54ప. 2ఆ.

అలంకారశాస్త్రపారాయణము క్షీణదక్షిణాంధ్రయుగకవులకు అభ్యస్తవిద్య.

**శశిరేఖ పాన్పు పందొమ్మిదవశతాబ్ది పట్టిమంచము**

"పగడా ల్దిద్దిన కోళ్ల దోమతెర జాళ్వా పట్టిమంచంబుపై
జిగి జల్తారు మెఱుంగు చాందిని సిరుల్ జిల్కుం బుటీదారు మేల్
తగటుం జిల్కు టొరుంగు తక్కియల నిద్రాపాన్పునం దర్పకా
శుగపాతాహతచేతయై దొరలు లేచున్ వంతలం జింతిలన్." 264ప. 2ఆ.

# కాలము తెలియని కవులు

**కొడిచెర్ల శ్రీనివాసుడు** : ఇతని కృతి శేషధర్మము. అముద్రితము. ఇతఁ డిన్నూఱు సంవత్సరములకు ముందుండిన వాఁడు. ఇతఁ డొకవేళ పదునేడవశతాబ్ది మధ్యమునం దుండి మధ్యకవులలోఁ జేరిన వాఁడేమో" అని ఒక అభిప్రాయము కలదు[331]. అనగా 1899-200=1699 లేక 1650. అధారము లేదు. ఊహామాత్రశరణ్యాము.

**వేంకటాచార్యులు** : ఇతని కృతి ముక్తిచింతామణి. క్షేత్రమాహాత్మ్యకావ్యము. అముద్రితము. పూరీజగన్నాథస్వామికి అంకితము. దైవాంకితము. "రాజమహేంద్రవరాధ్యక్ష పద్మనాయకాగ్రేసరకోనతిమ్మరాయకృతకనకాంబరాభరణానులేపకపూర్వకసమర్ప నప్రేరితుండనై"అని కవి వ్రాసికొనుటను బట్టి . . . . . ఈ గ్రంథమిన్నూఱు సంవత్సరము లకు ముందే వ్రాయఁబడినదేమో" అని ఒక అభిప్రాయము కలదు[332]. అనగా 1899-200= 1699 ప్రాంతము. కోన తిమ్మరాయడు చరిత్రకు అందని వ్యక్తి. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యాము.

ముక్తిచింతామణి జగన్నాథక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించునది.

**అంగర నరసింహము** : ఇతని కృతి రాజరాజాభిషేకము. దుర్లభము. కొప్పుల మల్లభూవరునికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. "ఇతఁ డేకాలపు వాఁడో నిశ్చయముగాఁ దెలియరాలేదు. . . . . . . స్పష్టముగాఁ దెలియువఱకు పదునాఱువందల యేఁబదికిఁ దరువాతి కాల మనుకొందము." అని ఒక అభిప్రాయము కలదు[333]. 1650 కి పూర్వు డనుటకైన, తర్వాతి వాడనుటకైన ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యాము.

రాజరాజాభిషేకమునందు "పనివడి చెప్పనేల శిశుపాలుని విక్రమచేష్టితంబు"లని ఒక పద్యము కలదు[334]. శిశిపాలుని ప్రసక్తిని బట్టి రాజరాజా దుర్యోధనుడగును. కావున రాజరాజాభిషేకము దుర్యోధనపట్టాభిషేకము కావలయును.

**మర్దయ** : ఇతని కృతి సీతావిజయము. శతకంఠరామాయణ మని ముద్రితము. అసలు రామాయణమునందు రాముడు దశకంఠుని సంహరించిన, ఈ వృద్ధిరామా యణమునందు సీత శతకంఠుని సంహరించును. కనుక సీతావిజయ మను గ్రంథనా మము సార్థకము.

ఇది 1904 వ సంవత్సరమునందు, 1954 వ సంవత్సరమునందును ముద్రితము. ద్వితీయముద్రణయమునకు ఆధారములైన వ్రతులు మూడు కలవు[325]. 1. ప్రథమముద్రణప్రతి. 2. కాకినాడఆంధ్రసాహిత్యపరిషత్కా ర్యాలయములోని కాగితపు ప్రతి. లేఖనకాలము 1904 వ సంవత్సరము. 3. తాళపత్రప్రతి. లేఖనకాలము హేవిళంబి ఫాల్గుణబహుళచతుర్దశి నుండి, విళంబిచైత్రశుద్ధద్వాదశి వఱకు. వారము లేదు. సంవత్స రము 1838, 1778, 1718 కావచ్చును. తాళపత్రప్రతియందు మర్దయప్రణీతమని కలదు. అంతేకాదు. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని మఱొక ప్రతి యందును మర్దయప్రణీతమని కలదు[336]. వేఱొక రెండు కాగితపు ప్రతు లందు లింగకవి, రంగకవి అని కలదు[337]. లింగకవి మొదటి మూడు ఆశ్వాసములు రచించి, పోచనృపాలు నికి, రంగకవి నాల్గవ ఆశ్వాసమును రచించి, భోగనృపాలునికి అంకితములు చేసిరని

ఒక అభిప్రాయము కలదు[338].

1904 వ సంవత్సరము నాటి లిఖితప్రతికి, ముద్రితప్రతికి కతిపయభేదములు కలవు. ముద్రితప్రతిలోని వచనములకు పద్యములు, పద్యములకు పద్యాంతరములు కలవు. అవి 1954 వ సంవత్సరము నాటి ముద్రితగ్రంథమునందు చూపబడినవి. ఇందు అవతారిక లేదు. ప్రథమ, ద్వితీయాశ్వాసాంతపద్యములు శ్రీరామపరము. ద్వితీయాశ్వాసాది; తృతీయ, చతుర్థాశ్వాసాద్యంతపద్యములు పోచమనృపాలపరము. తృతీయాశ్వాసాదిపద్యాంతరము ధర్మనృపాలపరము. ధర్మనృపాలుడు, భోగనృపాలుడు పోచమనృపాలుడే అగును. శ్రీరామపరమైన పద్యములు శ్రీరామాంకితచిహ్నములు. నృపాలపరమైన పద్యములు పోచమనృపాలాంకితచిహ్నములు. ఒకటి దైవాంకితము. మఱొకటి నరాంకితము. రెండు శతకంఠరామాయణములు కలవని అనుమేయము. అంతేకాదు. లింగకవి శతకంఠరామాయణము మఱొకటి ద్విపదకావ్యము కూడ కలదు[339]. అముద్రితము. రెండు పద్యకావ్యములు సంకీర్ణమైనట్లు. కతిపయబేధములను బట్టి కరతలామలకము. మర్ధయనామధేయప్రణీతమైన సీతావిజయము రచనాకాలము 1700 ప్రాంతము కావచ్చును. ఇది ఊహామాత్రమే.

ఇది చిత్రమైన కథ. రామాయణానంతరకథ. రాముడు సీతతోను, కుశలవులతోను రాజ్యమును పాలించునప్పటి కథ! జానపదకథామూలకము కావచ్చును.

రావణుని పినతండ్రి అశ్రముడు. అతని తనయుడు శతకంఠుడు. రావణుని రాజ్యము సముద్రమధ్యమునందలి లంక. శతకంఠుని రాజ్యము చతుస్సముద్రముల ఆవలి ప్రతాపలంక. రావణునికి పదితలలు, ఇరువది చేతులు కలవు. శతకంఠునికి వంద తలలు, రెండు వందలచేతులు కలవు. రావణసంహారము విని, తపస్సు చేసి, వరములు పడసి, రాముని సాధించుటకు మునులను బాధించును. మునులు రామునికి మొఱపెట్టుకొందురు. రాముడు అభయహస్త మిచ్చును అనంతరము తన బలము చాలదని వగచును. లక్ష్మణుడు ధైర్యము చెప్పును. విభీషణుడు శతకంఠుని వివరములు చెప్పును. హనుమంతుడు సకలమనుజదనుజవనచరబలములను రప్పించును. సీత తన్ను యుద్ధరంగమునకు తీసికొనివెళ్లుమని రాముని కోరును. వసిష్ఠుని ఆదేశమున రాముడు సమ్మతించును. అందఱు దండయాత్రకు బయలుదేరుదురు. అందఱిని హనుమంతుడు తన వాలమున చతుస్సముద్రములు దాటించును. శతకంఠుని కోట లగ్గ పట్టుదురు. రాముడు హనుమంతుని రాయబారిగ పంపును. శతకంఠుడు రాముని నిందించును. హనుమంతుడు శతకంఠుని సొమ్మసిల్లజేయును. శతకంఠుని తల్లి చిత్రగంధి సంధి చేసికొమ్మని బోధించును. శతకంఠుడు యుద్ధమునకు సిద్ధమగును. మహాయుద్ధము జరుగును. సీత, రాముడు, హనుమంతుడు వినా రాముని పక్షములోని అందఱును మరణింతురు. రామునికి, శతకంఠునికి ద్వంద్వయుద్ధము జరుగును. రాముడు అలసట చెందును. సీత విల్లందుకొనును. శతకంఠుడు పలాయనము చిత్తగించును. మఱునాడు సీతకు, శతకంఠునికి మఱల యుద్ధము. విభీషణుడు రావణుని మరణరహస్యము చెప్పినట్లు, నారదుడు శతకంఠుని మరణరహస్యమును రామునికి చెప్పును. రాముడు సీతకు చెప్పును. సీత శతకంఠుని సంహరించును. అంతేకాదు.

బ్రహ్మచేత విగతజీవులైన రాముని పక్షములోని అందఱిని పునర్జీవితులను చేయించును. శతకంఠుని తల్లి చిత్రగంధి, భార్య యయాతి విలపింతురు. రాముడు శతకంఠుని కుమారుడు నీలకంఠుని ప్రతాపలంకారాజ్యమునకు పట్టాభిషిక్తుని చేయును. హనుమంతుడు మఱల అందఱిని వాలమున చతుస్సముద్రములు దాటించును. అయోధ్యకు వచ్చి రాముడు తల్లులకు సీత పరాక్రమము తెలుపును. ఇది సీతావిజయము.

ఇందు రాముడు పాలించు కాలమునందు వాణిజ్యసరణి ఇట్లు కలదు.

"గట్టి ధాన్యంబు పోకకుఁ బుట్టెఁడేసి
యట్టి పోఁకకు రూకలు నవికెఁడేసి
యట్టి రూకలు మాడకు నఱువదేసి
యట్టి మాడలు నింటింట నగణితములు." 18ప. 1ఆ.

ఇది అతిశయోక్తివిలసితమైనను, పోకకు పుట్టెడేసి కాకపోయినను బుట్టెడేసి అయినను రామరాజ్యలక్షణమగును.

సీత యుద్ధరంగమునకు తీసికొని వెళ్లుమని కోరినప్పుడు, రాముని సమాధానము పోతన భాగవతములోని నరకాసురవృత్తాంతమునందు సత్యభామ యుద్ధరంగమునకు తీసికొని వెళ్లుమని కోరినప్పుడు కృష్ణుని సమాధానమునకు ద్విగుణీభూతము.

"చిలుక పల్కులు విని యులుకు కోమలిని దు
ర్నిమితార్భటంబులు వినఁగఁ గలవె
ఎదు రెవ్వరాడిన మదిఁ గుందు సుగుణవు
ప్రత్యర్థిభాషలు పడఁగఁ గలవె
వెన్నెల కాకకు వెఱచెడి యబల వ
త్యుగ్ర బాణాగ్నికి నోర్వఁ గలవె
స్ఫటికంపు సోపానపంక్తుల నొంటిమై
నిల లేవు రథముపై నిలువఁ గలవె
వీల పలికితి నీ బుద్ధి యెట్లు పుట్టెఁ
గలహగతులేడ నీ వేడ గమనమేడ
శతముఖునిఁ జంపి వాని దేశమునఁ గలుగు
వస్తువులు నీకుఁ గొనితెత్తు వలవ దుడుగు. 93
ఆరూఢమధురవీణారవంబులు గావు
ప్రతిభటాభీలహుంకృతులు గాని
కల్యాణసమయసత్కాంతావ్రజము గాదు
భయదరాక్షసకదంబములు గాని
కొలఁది వాసించు కుంకుమగంధమది గాదు
మతి రక్తజంబాలమయము గాని
పర్యంకమల్లికాప్రసవమార్గము గాదు
చండభల్లప్రపంచంబు గాని
తలఁప సుఖకేళి గాదు యుద్ధంబు గాని
మురియుటలు గావు ఘనమృత్యుముఖము గాని
నాతి మున్నిట్లు చని మోసపోతిఁ గాదె
రాక కూడదు వికచనాళీకనయన." 94ప. 2ఆ.

ఇట్లు పలికిన రాముడు, సీత ప్రథమదివసయుద్ధమును పరికించి, మనస్సులో తలపోసిన విధమిది :

"పుష్పంబు లఱచేతఁ బూన నేరని చెలి
యిషుపరంపరఁ బూన నెట్లు నేర్చెఁ
జిల్క పల్కులకు బిట్టులుకు కోమలి యిల
యెల్ల భీతిల నార్వ నెట్లు నేర్చె
నేఁ దక్క నన్యుల నీక్షింప నేరని
యింతి సేనలఁ గూల్ప నెట్లు నేర్చె
విసవిస నడువంగ నసియాడు కొమ్మ నేఁ
డెడసి యుద్ధము సేయ నెట్లు నేర్చె" 99ప. 4ఆ.

సీత ద్వితీయదివసయుద్ధమునందు ఇట్లు కలదు.

"బ్రహ్మాస్త్రం బరివోసి దిక్కటము లభ్రంబున్ వెస న్నిండఁగన్
బ్రహ్మండంబు వణంక నద్రులు చలింపంగా విరుల్ మీఱ నా
బ్రహ్మేంద్రాదులు దల్లడిల్ల శివుఁడోపంజాల నంచుం బర
బ్రహ్మంబున్ వినుతింప సీత బలశుంభద్వృత్తి మై నార్చుచున్." 155ప. 4ఆ.

ఇందు శివుడు "ఓపం జాల నంచుం బరబ్రహ్మంబున్ వినుతిం"చుట, శివుడు పార్వతికి చెప్పిన సీతావిజయమునందు ప్రక్రమభంగము.

రామాయణమునందు రావణుని భార్య మండోదరి వలె, సీతావిజయమునందు శతకంఠుని తల్లి చిత్రగంధి రాక్షసపక్షమున సత్పాత్ర. కాని సీతను పాపాత్మురాలని (171వచ. 4ఆ.) విభీషణుని అపూజ్యుడని (179ప. 4ఆ.) నిందించుట విపరీతము.

మొత్తము మీద సీతావిజయము వీరరసప్రధానము.

సిరిప్రగడ ధర్మయ (ధర్మన, ధర్మపురి ): ఇతని కృతి నలచరిత్రము, తిరుపతి వేంకటేశ్వరునికి అంకితము. దైవాంకితము. "ఈతని కాలమేదియో నిర్ణయించుటకుఁ బుస్తకమునం దాధారము లేవియుఁ గానరాలేదు. ఇతఁ డాధునికుఁడయి యిన్నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండును." అని ఒక అభిప్రాయము కలదు[340]. "ఇన్నూఱు సంవత్సరముల క్రిందట" అనగా 1899-200=1699 పూర్వము. కాని, ఇందలి "తాలపుచెయ్యి" (112ప. 2ఆ.) కోయదొరల "తుపాకులు" (13ప. 2ఆ; 37ప. 3ఆ.) ఫిరంగిగుండ్లు (67ప. 5ఆ.) మన్మథుని "తురాయి" మాత్రమేగాక, "కభాయి" (204ప. 3ఆ.) వంటి అన్యదేశ్యములు; "ప్రావీణ్యుఁడు" (159ప. 3ఆ.) "అఘాత్యము" (3ప. 4ఆ.) "ఉపగుహనము" (13ప. 4ఆ.) "నిష్కారుణ్యుడు" (169ప. 5ఆ.) వరహాములు (116ప. 5ఆ.) వంటి అపశబ్దములు ఇంకను అర్వాచీన మనిపించును. పదునెన్మిదవ లేక పందొమ్మిదవశతాబ్ది కావచ్చును.

ఇది పద్యకావ్యము. అది విశేషము. ఇందు ప్రథమాశ్వాసములోని నలుని దండ యాత్ర- రఘునాథనాయకుని నలచరిత్రద్విపదకావ్యములోని

". . . . . . . భూపాలగణముల చేత
బాల్యంబునందె కప్పములు గైకొనియె" 272-75పం. 1ఆ.

అను పంక్తుల ప్రభావము. ద్వితీయాశ్వాసములోని వేటవర్ణనము వర్ణనావ్యామోహ

స్వభావము. అందువలన నలునికి హంస ఉద్యానవనమునందుగాక, అరణ్యసరోవరము నందు పట్టువడినది! నలదమయంతుల పరిణయపర్యంతకత, శ్రీనాథుని శృంగార నైషధమునకు పేలవమైన అనుసరణము. పరిణయానంతరకథ నన్నయ నలోపాఖ్యానము నకు, రఘునాథనాయకుని నలచరిత్రద్విపదకావ్యమునకు మాత్రమేగాక, చక్రపురి రాఘవా చార్యుని నలచరిత్రద్విపదకావ్యమునకును అనుసరణము. రాఘవాచార్యుని నలచరిత్రము నందు వలె అంతట విష్ణుచక్రమహిమ లేదుగాని, విష్ణుసాక్షాత్కారము (79వచ. 6ఆ.) విష్ణుస్తోత్రము (80దండ. 6ఆ.) కలవు. కలిపురుషుడు నిషధపురమునందు ప్రవేశింపలేక పోవుటకు, భయపడిపోవుటకు హేతువు వైష్ణవమాహాత్మ్యమే. (59-60; 63-69ప. 5ఆ.)

రాఘవాచార్యుని నలచరిత్రమునందు నలదమయంతులకు వియోగము కలిగించు టకు, కలిపురుషుడు విప్రరూపమున దారులు తెలిపినట్లు కలదు.

"ఇదిగొ నాలుగు త్రోవ లేర్పడి యున్న
వది విదర్భపురికి నరుగుచునుండు
నది బుఱుతుపర్ణు పురాధ్వంబు గాన
నది సుబాహుని పురి కరుగుచునుండు" 1125-30పం. 3ఆ.

ధర్మయ నలచరిత్రమునందు నలుడే దమయంతికి పుట్టినింటి కేగుటకు దారులు చెప్పును.

"కొసలకు తోవ యిది చూడు కమలవదన
దక్షిణాపథమున కిది దారి తరుణి
యుజ్జయిని కిది మార్గమె యుత్పలాక్షి
కుండినమ్మునకు తెరువిది కోమలాంగి" 200ప. 5ఆ.

నారదుడు కలహభోజనుడైనను, అతడు కావించిన సత్కార్యములు కలవు. అవి ధర్మయ అభివర్ణించుట అపూర్వము.

"ఏ మౌని పాట కహిస్వామి ఫణు లెత్తె
శౌరికి గొడుగుల తీరు గాఁగ
నే దివ్యముని బుద్ధి బాదరాయణుఁడు భా
గవతముఁ జేసె జగద్ధితముగ
నే క్షాంతినిధిచేత దక్షుండు దనప్రజా
పాలనం బొనరించు ప్రౌఢి నేర్చె
నే తపోధనుఁడు చెప్పించె వాల్మీకిచే
రామాయణము బుధప్రస్తుతముగ
నట్టి నారదుఁడు (ధర) భీమావనీశ
నందనాసంవరణకారణమునఁ గలహ
మబ్బ కుండుటఁజేసి తానపుడు నాక
మందు దొరకునో యను నాస నచటి కరిగె." 15ప. 4ఆ.

రాఘవాచార్యుని నలచరిత్రమునందు కంటె, ఇందు సామెతలు సమధికము.

**అనంతరాజు జన్నయ** : ఇతని కృతి రామకథాభిరామము. అముద్రితము. "ఇతఁడే కాలమునందుండిన వాఁడో తెలియ రాలేదుగాని నూట యేఁబది యేండ్ల

క్రిందటి వాఁడయి యుండవచ్చును. అని ఒక అభిప్రాయము కలదు[341]. అనగా 1899-150=1749 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**గుడారు వేంకటదాసు** : ఇతని కృతి ప్రబంధరాజశిరోభూషణప్రకష్టబలరామ చరిత్రము. "ఇతఁ డాధునికకవియే యయినను, కాలనిర్ణయము చేయుట కాధారము లేవియుఁ గానరాలేదు. ఇతఁడు నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండె నేమో" అని ఒక అభిప్రాయము కలదు[342]. అనగా 1899-150=1749 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము. కావ్యనామధేయము గణవరపు వేంకటపతి ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమునకు ప్రతిద్వంద్విప్రాయముగ కలదు. తద్రచనా కాలము 1680 ప్రాంతమని పూర్వోక్తము. ఇది తదనంతరకాలిక మగుట తథ్యము. అది నిర్ధరించుట దుర్ఘటము.

**కామనూరి కృష్ణయ్య** : ఇతని కృతి ఇందుమతీపరిణయము. అముద్రితము. "ఇతఁడు నూట యేఁబది సంవత్సరముల నాఁటి వాఁడయి యుండునేమో" అని ఒక అభిప్రాయము కలదు[343]. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**వేంకటార్యుడు** : ఇతని కృతి భద్రరాజపుత్త్రచరిత్రము. అముద్రితము. "ఇతఁడు నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండిన వాఁడయినట్లు చెప్పుచున్నారు."అని ఒక అభిప్రాయము కలదు[344]. అనగా 1899-150=1749 ప్రాంతము. అది జనశ్రుతి అగును. నిర్ధారకసాధనము కాదు.

"కళాపూర్ణోదయమునందు వలెనె యిందలి కథలును నూతనముగాఁ గల్పింపఁ బడినవి. కాని కవిత్వ మంత ప్రౌఢమయినది కాదు[345]."

**మల్లంపల్లి నాగభూషణము** : ఇతని కృతి బసవవిజయము. అముద్రితము. "ఇతఁడు నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది.' ' అని ఒక అభిప్రాయము కలదు[346]. అది జనశ్రుతి అగును. నిర్ధారకసాధనము కాదు.

**అవుడూరి కిచ్చయ్య** : ఇతని కృతులు 1. రఘువంశము 2. మాధవాభ్యుదయము. అముద్రితము. "ఇతఁడు నూఱు నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నది."అని ఒక అభిప్రాయము కలదు[347]. అనగా 1899-100=1799 లేదా 1899-150=1749. జనశ్రుతి అగును. నిర్ధారకసాధనము కాదు.

**కానాల నరసింహము** : ఇతని కృతి శేషధర్మము. అముద్రితము. తటికొండ నృసింహ స్వామికి అంకితము. దైవాంకితము. "ఇతఁ డించుమించుగా నూఱు నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండి యుండవచ్చును." అని ఒక అభిప్రాయము కలదు[348]. అనగా 1899-100=1799 లేదా 1899-150=1749 ప్రాంతము. ఆధారము లేదు. ఊహా మాత్రశరణ్యము.

**తక్కెళ్లపాటి లింగన్న** : ఇతని కృతులు 1. మదనమోహినీవిలాసము. 2. సూర్య తనయాపరిణయము. 3. విద్యుత్ప్రభావిలాసము. యక్షగానము. 4. ఉత్తరహరిశ్చంద్ర కథ. మొదటి రెండును అముద్రితములు. మూడవది అనుపలబ్ధము. మొదటిది వేంకటే శ్వరస్వామికి, రెండవది శ్రీరామచంద్రునికి, నాల్గవది శ్రీకృష్ణునికి అంకితములు. మూడును

దైవాంకితములు. "ఆధునికుడైన యీ కవి కాల మెప్పుడో నిశ్చయముగాఁ దెలియదుగాని, యితఁ డించుమించుగా నూఱు నూట యేఁబది సంవత్సరముల క్రిందట నుండిన ట్లూహింపవలసియున్నది." అని ఒక అభిప్రాయము కలదు[349]. అనగా 1899-100=1799 లేదా 1899-150=1749 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

మదనమోహినీవిలాసము మదనమోహినీనలకూబరుల వివాహము. సూర్యతనయా పరిణయము కాళిందీశ్రీకృష్ణుల వివాహము. ఉత్తరహరిశ్చంద్రకథ మాత్రము చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహానంతరమునుండి విశ్వామిత్రుని ప్రతిజ్ఞవఱకుఁ గల హరిశ్చంద్రుని కథ[350].

**చదువుల సోమలింగము** : ఇతని కృతి మదనసాయకవిలాసము. అముద్రితము. శ్రీశైలమల్లికార్జునస్వామికి అంకితము. దైవాంకితము. "ఇతఁడించుమించుగా నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండును." అని ఒక అభిప్రాయము కలదు[351]. అనగా 1899-100=1799 ప్రాంతమగును. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

మదనసాయకవిలాసము తుంబురుని తనయ మదనసాయక, ఋతుధ్వజాల వివాహము.

**వీణెము లక్ష్మీపతి** : ఇతని కృతి అభిమన్యుపరిణయము. "ఇతఁ డెప్పుడెక్కడ నున్నవాఁడో తెలియరాలేదు. దాదాపుగా నితఁడు నూఱు సంవత్సరముల క్రిందటివాఁ డయియుండును." అని ఒక అభిప్రాయము కలదు[352]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**కైప మాయన**: ఇతని కృతి ఉషాకల్యాణము. అముద్రితము. "ఈ కవి నూఱు సంవత్సరములకుఁ బూర్వము వాఁడనుటకు సందేహము లేదు." అని ఒక అభిప్రాయము కలదు[353]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

**కొండమడుగు పురుషోత్తము** : ఇతని కృతి సానందగణేశ్వరము. అముద్రితము. దీబగుంట వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము. "ఇతని కాలము సరిగా తెలయదు. నూఱు సంవత్సరముల క్రిందటి వాఁడయి యుండును." అని ఒక అభిప్రాయము కలదు[354]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**గూళికల్లు వేంకటరమణ** : ఇతని కృతి కనకరంజితశిఖామణిపరిణయము. అముద్రితము. "ఈ వేంకటరమణకవి నూఱు సంవత్సరముల క్రిందట నుండిన వాఁడు" అని ఒక అభిప్రాయము కలదు[355]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారములేదు. ఊహామాత్రశరణ్యము.

**వల్లూరి నరసింహము** : ఇతని కృతి నాగ్నజిత్త్రీపరిణయము. అముద్రితము. "ఇతఁడు నూఱు సంవత్సరముల క్రిందట నుండినవాఁడని తోఁచుచున్నది."అని ఒక అభిప్రాయము కలదు[356]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**గొంతేటి సూరన్న** : ఇతని కృతి కృష్ణాభ్యుదయము. అముద్రితము. బొల్లా ప్రెగడ రామమంత్రికి అంకితము. అతడు చరిత్రకు అందనివ్యక్తి. "ఇతఁడు నూఱు సంవత్సరముల క్రిందట నుండినవాఁడు" అని ఒక అభిప్రాయము కలదు[357]. అనగా 1899-100= 1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**బసవరాజు నాగేంద్రుడు** : ఇతని కృతి ఆనందసుందరీమాధుర్యవిలాసము. అముద్రితము. "ఇతఁడు సుమారు నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండును." అని ఒక అభిప్రాయము కలదు[358]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**మాచవరపు పాపన్న** : ఇతని కృతి నందవరీకచరిత్రము. శాఖాభేదచరితము. "ఇతఁడు నూఱు సంవత్సరముల క్రిందట వాఁడేమో" అని ఒక అభిప్రాయము కలదు[359]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**అయ్యగారి వీరభద్రుడు** : ఇతని కృతి రాఘవయాదవపాండవీయము. త్ర్యర్థి కావ్యము. అముద్రితము. "ఇతఁ డే కాలమునం దుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియరాదు. ఇతఁడు సుమారు నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండ వచ్చును." అని ఒక అభిప్రాయము కలదు[360]. ఆధారము లేదు ఊహామాత్రశరణ్యము.

**ప్రయాగకామేశ్వరము** : ఇతని కృతి గోపాలలీలావిలాససుధాలహరి. అముద్రితము "ఇతఁడు నూఱు సంవత్సరముల క్రిందట నుండినవాఁడు" అని ఒక అభిప్రాయము కలదు[361]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

**బేతపూడి కృష్ణయ్య** : ఇతని కృతి జానకీరాఘవపండితమనోభిరామము. అముద్రితము. "ఇతఁడు నూఱు సంవత్సరముల క్రిందటివాఁడయి యుండును"అని ఒక అభిప్రాయము కలదు[362]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

**అనుమగుర్తి రంగయ్య** : ఇతని కృతి యాదవగిరిమాహాత్మ్యము. అముద్రితము. రావూరి వేంగామాత్యునికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. "కవి యెప్పటి వాఁడో తెలియదుగాని నూఱు సంవత్సరములకుఁ బూర్వపు వాడనుటకు సందేహము లేదు."అని ఒక అభిప్రాయము కలదు[363]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

**రామనామాత్యుడు** : ఇతని కృతి గయోపాఖ్యానము. శ్రీకృష్ణార్జునసంవాదమని నామాంతరము. రెండాశ్వాసముల కావ్యము. ఇందు అవతారిక లేదు. ఆశ్వాసాద్యంతపద్య గద్యములు కలవు. అహోబలనృసింహస్వామికి అంకితము. దైవాంకితము. "ఈతఁడు నూఱు సంవత్సరముల క్రిందటి వాఁడయి యుండవచ్చును." అని ఒక అభిప్రాయము కలదు[364]. అనగా 1899-100=1799 ప్రాంతము. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

ఇది నాదిండ్ల గోపమంత్రి కృష్ణార్జునసంవాదము ద్విపదకావ్యమునకు పద్యకావ్య

రూపాంతరీకరణము. అతిస్వతంత్రమైన అనుసరణము. అందు లేనిది, ఇందు ఆదిని శ్రీకృష్ణుని శృంగారవిలాసము కలదు. అంతేకాదు. ఇందు శ్రీకృష్ణుడు తీవ్రకోపస్వభావుడు. అంజలిపుటమునందు నిష్ఠీవనము పడినంతనే, "దహన విధంబున నుగ్రుండై" చూచును. నిష్ఠీవనము గయుని కృతమని జలదేవత చెప్పినంతనే, "ఘనకోపాటోపంబున బలభద్రసాత్యకులతో" గయుని చంపెదనని చాటును. అందు "గయుని పోవిడఁజాచిన నన్ను నవ్వరే", "గయాహ్వాయుని దర్పమణంచకయున్న ప్రజ్ఞయే", గయుని "ద్రుంపక యున్నను ధారుణి దేవకికి ప్రేమతనయుఁడనె దగన్" అనుట ఉదాత్తముగ లేదు. ఒక ఉదాహరణము :

"వారిధిఁ జొచ్చి డాఁగినను వారిజగర్భుఁడు వచ్చి కాచినన్
ధారుణి క్రింది కేఁగినను తారపదంబులయందు డాఁగినన్
మారువిరోధి గాచినను మానక దిక్పతులెల్ల వచ్చినన్
పోర వధింతు నా గయుని పోవిడఁజాచిన నన్ను నవ్వరే." 6 పుట.

వేగవంతుని రాయబారము విఫలమైన, కృష్ణుడు "అరుణాయమాననేత్రాంచలుఁడగుచు" అర్జునుని నిందించును. ఆ పద్యమిది :

"మదము కన్నుల దొట్టి పొదలుచునున్నాఁడు
యెదురు త న్నెఱుఁగక పదరినాఁడు
కడు క్రొవ్వి మేఘంబు గట్టుతో నెదిరించి
దాఁకినట్టుగ వీఁడు దలఁచినాఁడు
వీని బలం బెంత వీఁ డనఁగా నెంత
వీని శౌర్యం బెంత విస్తరింప
కేసరితో దంతి కెరలి పోరిన రీతి
పులివంక కుందేలు పొడచినట్లు
గర్వమును బొంది యెఱుఁగక కడఁగి నేఁడు
మాకు నెదురాడుచున్నాఁడు మత్తుఁ డగుచు
నద్రి పరమాణు వంతయు నరసి చూడ
మత్తకరి దోమ వాసియ మాకుఁ దనకు" 19 పుట

అక్రూరుని రాయబారమును విఫలమైన, కృష్ణుడు "దందహ్యా (మాన) మానసుండై చటులకోపస్ఫూర్తి నిగుడ భ్రుకుటీకృతనిటలుండై సుభద్రను రావించి" ఇట్లనును.

"రమ్మి వినుము సుభద్ర నీరజదళాక్షి
నీ పతికిఁ దెలియఁజెప్పుము నీతి మెఱయఁ
గాక యున్నను మన బంధుకలహ మిపుడు
పుట్టు బెట్టుగాను. . . . పుణ్య చరిత" 20 పుట

సుభద్ర రాయబారము కూడ విఫలమై, సుభద్ర -

"ధారుణిలో నర్జునుఁడను
భూరుహమును బెంచినావు భూమిని విలస
త్కారుణ్యామృతరసమున
నారాయణ దునిమివైవ న్యాయమె నీకున్" 26పుట

అని పలికిన, కృష్ణుడు -

"చాలు నోయమ్మ నీ పతి సాహసంబు
యేమి చెప్పెద విక్కడ వింతగాను
నభయభయముల నొకకొన్ని నాకుఁ జెప్పి
ధవుని ప్రతినయ చెల్లింపఁ దలఁచినావు" 26పుట

అని ఎగతాళి చేసి, యుద్ధమునకు సిద్ధమగును. అంతేకాదు యుద్ధసమయము నందు అర్జునుని అధిక్షేపించును.

"గరళంబుఁ బెట్టించెఁ గౌరవాధీశుండు
    వాయుసూనున కతికపటముననను (?)
పాముల చేతను పావని గఱిపించె
    క్రోధియై మిక్కిలి కురువిభుండు
లక్కయింటను మిమ్ము లయము చేసెదనంచు
    నింగలముఁ బెట్టించె నీర్ష్యముననను (?)
చలమునఁ బాంచాలి సభలోన రారాజా
    కోకలు విడిపంచెఁ గుత్సితమున
అట్టి యా పగల్లెను మట్టు బెట్టి
కాచి రక్షించినాఁడను క్రమముతోడ
నేను నవియెల్లఁ దలఁపక నీవు నిపుడు
కత్తి గట్టితి నా మీఁదఁ గయ్యమునకు " 42పుట

ఇందుకు అర్జునుడు తిరిగి కృష్ణుని అధిక్షేపించుట ఇందు లేదు. కృష్ణుని "వినుతించి", "కమలాక్ష! వినవయ్య గంధర్వపతి నీకు నెగ్గు సేయు టెఱుఁగ నీశు నాన", "గయుఁడు దైత్యుఁడు గాఁడు గంధర్వపతిగాని యతనిఁ జంపఁగ నేల యంబుజాక్ష! . . . . కరుణతో గయుఁ గావుము పరమపురుష" అని మాత్రమే వేడుకొనును (42-43పుటలు)

వనకేళి, జలకేళి, సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతప్రకృతి, (పుటలు 2-5), స్త్రీ, (పుటలు 21-22) ధూత్య (పుటలు 17-18; 19-20; 23-26) యుద్ధ (పుటలు 28-44) వర్ణనలు కలవు.

**కృష్ణయ్య :** ఇతని కృతి పార్వతీపరమేశ్వరపరిణయము. అముద్రితము. "ఈతఁ డుండిన కాలమేదియో తెలియరాదుగాని యితఁ డేఁబది యఱువది యేండ్ల క్రిందట నుండినట్లూహింపవలసియున్నది". అని ఒక అభిప్రాయము కలదు[365]. ఊహామాత్ర శరణ్యము.

**చెన్నూరి శోభనాద్రి :** ఇతని కృతి శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము. అముద్రితము. గుమ్మడపు పాపనృపతికి అంకితము. "కృతిపతి గాని కృతికర్త గాని యెప్పు డుండినవారో తెలిసినదికాదు". అని ఒక అభిప్రాయము కలదు[366].

**వెణుతుర్ల వడ్డియ్య :** ఇతని కృతి శృంగారరసాలవాలము అముద్రితము. ((ఈతని కాలమేదియో తెలియరాలేదు" అని ఒక అభిప్రాయము కలదు[367].

**కృష్ణదాసు :** ఇతని కృతి రాధాకృష్ణవిలాసము అముద్రితము. కాలము గుఱించి లేదు[368]. ఇది "జయదేవుని గీతగోవిందమునకు తెనుగుసేత" అని ఒక అభిప్రాయము

కలదు[369].

**పెనుపల్లి బాపన్న** : ఇతని కృతి సీతావిజయము. అముద్రితము. కాలము గుఱించి లేదు[370].

**పోచన** : ఇతని కృతి చంద్రాభ్యుదయము. అముద్రితము. కాలము గుఱించి లేదు[371].

**జయంతి రామభట్టు** : ఇతని కృతి ఉత్తరరామాయణశేషము. ఏకాశ్వాసము. అముద్రితము. ఇతనికి ఆశ్వాసాంతగద్యను "భద్రాద్రిరామవరప్రసాదకవిత" అను విశేషణము కలదు[372]. భద్రాద్రిరామాలయనిర్మాణకాలము రామదాసు కాలము (1655-1680) కాఁబట్టి ఉత్తరరామాయణశేషము రచనాకాలము పదునెనిమిదవశతాబ్ది లేక పందొమ్మిదవ శతాబ్ది కావచ్చును.

ఇది "తిక్కనసోమయాజి మును దెల్గున నుత్తరకాండ చెప్పియుం దొక్కటి చెప్పఁడయ్యె"నని, "చక్కని దేవళంబు పయి స్వర్ణఘటం బిడు పోల్కి దోఁపఁగన్" రచించినది. ఇందు "శ్రీరాముఁడు కుశలవులకు విద్యాభ్యాసంబు చేయించుటయు, అతిరాత్రపౌండరీకవాజపేయంబు లాదిగా శతక్రతువులు గావించుటయు, నారాయణాఖ్యం బ్రవర్తిల్లి పూర్వరీతిం వైకుంఠపురంబు" ప్రవేశించుటయు "నను కథలు" కలవు[373]. ఇవి తిక్కన ఉత్తరరామాయణమునందు లేవు. కారణము దురవగాహము.

**తెనాల రామలింగము** : ఇతని కృతి రాజధీరజనమనోవిరాజితము. ఏకాశ్వాసలఘుకావ్యము. నూట యెనుబది మూడు పద్యములు మాత్రమే కలవు. అవతారిక లేదు. ఉపక్రమణిక ఉన్నది. ఆశ్వాసాంతపద్యము మల్లికార్జునలింగపరము. కనుక మల్లికార్జునాంకితము. దైవాంకితము. ఇందలి కథ అగ్రజాడు అక్కనకు, అనుజాడు మాదన చెప్పినట్లు కలదు. కనుక రామలింగము కాలము "250 సం॥ల క్రిందట" (1934-250=1684) అని ఒక అభిప్రాయము కలదు[374]. "పదునెన్మిదవశతాబ్దివాఁడైయుండు' 'నని మఱొక అభిప్రాయము కలదు[375]. అక్కన, మాదనలు చారిత్రికవ్యక్తులు. వారి కాలము 1626-1687 అని పూర్వోక్తము. కాని, వారు కథకులు, శ్రోతలు కారు. అయినను మాదన చెప్పినది కథ అగునుగాని, కావ్యము కాదు. కావ్యరచనాకాలము పదునెన్మిదవ శతాబ్ది కావచ్చును. పందొమ్మిదవశతాబ్ది కూడ కావచ్చును. కృతి ప్రథమముద్రణము విరోధి సంవత్సరమని మాత్రము ద్వితీయముద్రణమునందు కలదు. ద్వితీయముద్రణము 1894 వ సంవత్సరము. తత్పూర్వము విరోధిసంవత్సరము 1889 గాని, 1829 గాని అగును. 1829 వ సంవత్సరమునందు ముద్రణసౌకర్యము లేదు. ప్రథమముద్రణము 1889 వ సంవత్సరమగును. కాఁబట్టి రాజధీరజనమనోవిరాజితము రచనాకాలము 1875 కంటె పూర్వము కావచ్చును.

పీఠికయందు ఇట్లు కలదు.

"ఈ రాజధీరజనమనోవిరాజితము విశ్వబ్రాహ్మణులకు
బలవద్విరోధియై నీచనామప్రకటనాదికములు చేసిన
అమరునికి వీరివలననైన పరాభవము తెలుపు గ్రంథము."

గ్రంథమునందు,

"అమరుం డంత సహింపలేక మును దా నార్యప్రమోదంబుగా
నమరం బేర్పడఁ జెప్పుచుండి భవదీయఖ్యాతి లోకంబునం
దమరం జేసెద సంతసం బొదవ నా కా పేర్మి పిసద్వయం
బమలం బౌ కనకం బొసంగుఁ డనఁగా హుంకారచిత్తాఢ్యులై. 49

నను( గనుఁగొని రథకారులు
పెనఁగొన క్రోధంబుతోడ బెదిరించిరి నీ
వొనరించుటేమి మా కుల
ఘన మిల జనులను సృజించు ఘనులము కామే. 50

అని యిట్లు న న్నీసడించిన . . . . . . పంచాననసంభవుల మదం బడంచెద"
నని తలపోసినట్లు కలదు. (51 వచ.)

అమరసింహుడు రచించిన అమరకోశము లేక నామలింగానుశాసనమునందు నీచనామప్రకటనాదికము చేసినట్లు కానరాదు.

" కారు శ్శిల్పీ "
నాడింధమ స్స్వర్ణకార: కలాదో రుక్మకారక:"
అని కలదు. ఇందు రథకారశబ్దము లేదు. ప్రకరణాంతరమునందు కలదు.
రథకారస్తు మాహిస్యారణ్యాం యస్య సంభవ:"

కరణస్త్రీయందు మాహిష్యపురుషునికి జన్మించినవాడు రథకారుడని అర్థము. స్వర్ణకారుడను అర్థము నామలింగానుశాసనమునందు లేదు. రాజధీరజనమనోవిరాజితము నందు బహుధా కలదు. రథకారశబ్దార్థమును బట్టి అమరసింహుని దుష్టమంత్రిగ చిత్రించుట చింత్యము.

రాజధీరజనమనోవిరాజితమునందు కథారంగము ఫణీంద్రపురము. రాజా చోళ రాజా. యువరాజా కర్పకుడు. మంత్రి అమరుడు. చోళరాజా పేరు లేదు. ఏ చోళరాజును ఔత్తరాహుడు కాడు. దాక్షిణాత్యుడే. అమరసింహుడు దాక్షిణాత్యుడు కాడు. ఔత్త రాహుడు. అంతేకాదు. మంత్రికాడు. బౌద్ధుడు. కథ అతుకుల బొంత అయినను, స్వర్ణ కారుల బొమ్మలాట రామాయణము చిత్రమైన సంఘటన. కళింగగంగు కథను జ్ఞప్తికి తెచ్చును. స్వర్ణకారులు బొమ్మలాట ప్రదర్శించు నెపమున, రామవిగ్రహమునందు ప్రవేశ పెట్టిన చోళరాజుచేత తమ్ము చంపదలచిన కర్పకునికి శిరఃఖండనము చేయించి, తాము కర్పకుని మంత్రి అమరునికి శిరఃఖండనము చేయుట, రాజైన చోళరాజునకు, ధీరజనులైన స్వర్ణకారులకు మనోవిరాజితము.

వందలాది తప్పులు కల ప్రథమముద్రణమును పరిష్కరించిన ద్వితీయ ముద్రణ మునందును తప్పులు కలవు.

**అత్తలూరి పాపయామాత్యుడు** : ఇతని కృతులు 1. చెన్నబసవపురాణము. 2. శ్రీశైలఖండము అముద్రితము. 3. శివలీల. అనుపలబ్ధము. 4. శరభాదిశతకములు. అనుపలబ్ధములు. మొదటిది కందుకూరి అమృతలింగమునకు, రెండవది కందుకూరి మూర్తిరాజునకు, మూడవది కందుకూరి బసవనకు అంకితములు[376]. ముగ్గురును చరిత్రకు అందని వ్యక్తులు. 1875 కంటె పూర్వులు కావచ్చును.

ఇది పాలకుఱికి సోమనాథుని బసవపురాణము వంటిది. అది ద్విపదకావ్యము.

ఇది పద్యకావ్యము. అందు బసవేశ్వరుని, శివభక్తుల వృత్తాంతములు కలవు. ఇందు చెన్న బసవేశ్వరుని శివభక్తుల వృత్తాంతములు కలవు. ఇతని పూర్వకవిస్తుతియందు పాలకుఱికి సోమనాథుని స్తుతి కలదు.

బసవేశ్వరుని మేనల్లుడు చెన్న బసవేశ్వరుడు, బసవేశ్వరుడు నంది అవతారము. చెన్న బసవేశ్వరుడు కుమారస్వామి అవతారము. ప్రథమాశ్వాసమునందు చెన్న బసవేశ్వరుని అవతారగాథ ప్రధాన విషయము. ద్వితీయాశ్వాసమునందు గంధర్వుని కథ, బండంగి కథ, విభూతి, రుద్రాక్ష, పంచాక్షరీమహిమలు; వేదపితామహ, బిల్లమరాజుల కథలు కలవు. తృతీయాశ్వాసమునందు సిద్ధ రామయ్య, మైథున రామయ్య మడివాలు మాచయ్య, హాలే మారన్న, కమలవ్వ, టంగుటూరి మాచయ్య, అనిమిషుని, పగల్తాండారి, ఘటాలయ్య, అంబిక చౌడయ్య, ఆత్మదేవుల కథలు కలవు. చతుర్థాశ్వాసమునందు మాడద మారయ్య, వీర సంగాంబ, చక్కి మాచయ్య, రౌద్ర సత్తక్క, చోడరాజు, రక్కసి బ్రహ్మయ్య, శాంత సత్తక్క, కేతయ్య, నారదబ్రహ్మయ్య, ఘ్రాణదబ్రహ్మయ్య, మారట శంభుమూర్తుల కథలు కలవు. పంచమాశ్వాసమునందు మల్లయ్య బ్రహ్మయ్య, మల్లయ మధుపయ్య, వీర సంగమయ్య, బెట్టిద వేదరసు, గిలకద మారయ్య, ఈయడ లింగ పెద్దయ్య, ఈంద్రగ మారయ్య, గుణేంద్రుని, మీమాంసుని, కూలి చమరయ్యల కథలు కలవు.

మైథున రామయ్య కథ ముగ్ధభక్తికి ముకురము. శ్రీశైలభ్రమరాంబామల్లికార్జున దేవులను అక్క, బావలని విశ్వసించును. శ్రీశైలమున కేగి, వారిని దీపావళి పండుగకు తమ ఇంటికి రమ్మని మారాము చేసిన మైథునరాముని అమాయకత్వము ముగ్ధమనోహరము ఒక పద్యము :

"ప్రొద్దునఁ జద్దిబువ్వ దిని పుస్తకముల్ పడకింటఁ జాటుగా
మిద్దియ మీఁద డాఁచి కడిమిన్ బడి కేఁగక యొక్కరుండ నే
నిద్దెస కేఁగుఁదెంచితి నిఁకేమియుఁ బల్కక యప్ప నీవు నన్
ముద్దొనరించి రం డిపుడు మోదముతోడుత మల్లికార్జునా!" 143ప. 3ఆ.

వీర సంగయ్య కథలోని వీరశృంగారరసపోషణము ఔచిత్యవిలసితము. కావ్యమునందు కతిపయశబ్దచమత్కారములు కలవు. (59ప. 1ఆ; 94ప. 5ఆ.) మొత్తము మీద చెన్నబసవపురాణము కవితామాధురీధురీణము.

**సింగరాచార్యులు** : ఇతని కృతి యామునాచార్యచరిత్రము. ప్రథమాశ్వాసము మాత్రమే లభించినది. అది 1893 వ సంవత్సరమునందు ముద్రితము. కాఁబట్టి యామునాచార్యచరిత్రము రచనాకాలము 1875 పూర్వము కావచ్చును.

యామునాచార్యుడు - చోళరాజు పురోహితుడైన విద్వజ్జనకోలాహలుని ఓడించుట, శ్రీరామమిశ్రుని హితబోధను శ్రీరంగనాథుని సేవించుట ప్రథమాశ్వాసమునందు కథా ప్రధానముగ కలదు.

"నీవు గాదను వాక్యంబు లెల్ల నేను
పరగ నౌనంచుఁ బలికెద బాల నేఁపు
మఱియు నీ విపు డౌనన్న మాట లన్ని
గాదనుచుఁ బల్కుచుండుదు ఘనులు పొగడ"

అనిన విద్వజ్జనకోలాహలునితో యామునాచార్యుడు అనిన మాటలివి :

"ధరణిలోపల నీ రాజు ధర్మశాలి
యతని దేవి పతివ్రత యతిగుణాఢ్య
యనఘ నినుఁ గన్న తల్లి గొడ్రాలు గాదు
పుత్రవతి యంచుఁ బల్కె విచిత్రముగను."

**వేంకటకృష్ణమాచార్యులు** : ఇతని కృతి యామునవిజయవిలాసము శ్రీరామునికి అంకితము. ఇతడు " కేవల మప్రాచీనుఁడుగా భావింపఁదగియున్నాఁడు" అని ఒక అభిప్రాయము కలదు[377]. కాఁబట్టి యామునవిజయవిలాసము రచనాకాలము 1875 ప్రాంతము కావచ్చును.

ఇది అయిదాశ్వాసముల గ్రంథము. ఇందు యామునాచార్యుడు విద్వజ్జనకోలాహలుని ఓడించి, అతనికి చోళరాజునకు రాణికి చక్రాంకితములు చేసి, అర్ధరాజ్యము గ్రహించువఱకు మాత్రమే కలదు. అందు విష్ణుచిత్తుని వృత్తాంతమును కలదు. పంచమాశ్వాసము తుదిని గ్రంథపాతము కలదుగాని, పంచమాశ్వాసపరిమితమే అగును.

విద్వజ్జనకోలాహలుడు యామనాచార్యుని అధిక్షేపించిన ఒక పద్యఁబు :

"భష భష యామునేయుఁడష ; ప్రాణము గొన్నష ; రామ రామ మా
ఝషభష లేమి సాగవష ; శాస్త్రవిదుండష ; సంధ్యముక్కలున్
మృష మృష గానె వచ్చునష ; మించష వజ్జల ముందఱన్; మహా
ఘోష ఘోష జన్నువాఁడష ; సఖుల్ సభవారిషు జాస్సునారషే " 54ప. 5ఆ.

ఇందు పుర, నదీ, విరహ, సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతవర్ణనలు కలవు.

**నేమాని భైరవావధాని** : ఇతని కృతి హరివంశము. ఉత్తరభాగము. వేంకటేశ్వర స్వామికి అంకితము. దైవాంకితము. కృతిప్రేరకుడు కోటగిరి శ్రీనివాసభూవరుడు. అతడు చరిత్రకు అందని వ్యక్తి. 1875 వ సంవత్సరము కంటె పూర్వుడు కావచ్చును.

ఇది ఎఱ్ఱన హరివంశమునందు లేని, సంస్కృతహరివంశప్రత్యంతరములందు కల పారిజాతాపహరణ, ప్రభావతీప్రద్యుమ్నకథలకు తెనుగుసేత, పారిజాతాపహరణకథ పంచమాశ్వాసము. ప్రభావతీప్రద్యుమ్నకథలు షష్ఠ, సప్తమాశ్వాసములు. పారిజాతాప హరణకథ ఎఱ్ఱన హరివంశము - ఉత్తరభాగములోని చతుర్థాశ్వాసమునకు అనుక్రమణిక అగును. ప్రభావతీప్రద్యుమ్నకథ భైరవావధాని హరివంశము- ఉత్తరభాగములోని పంచమా శ్వాసమునకు మాత్రమే అనుక్రమణిక. పురాణప్రాయము.

**కోటీశ్వరుడు** : ఇతని కృతి భోజసుతాపరిణయము. మదనగోపాలునికి అంకితము. దైవాంకితము. 1909 వ సంవత్సరమునందు ముద్రితము. కాఁబట్టి 1875 వ సంవత్సరము కంటె పూర్వము కావచ్చును.

భోజసుతాపరిణయము రుక్మిణీపరిణయము. నాల్గవరుక్మిణీపరిణయము.

ఇది పరిష్కర్త- తండ్రి పర్యవేక్షణమున, పాఠకుల అభిరుచికి అనుగుణముగ కొన్ని పద్యములు తీసివైచి, మఱి కొన్ని పద్యములు మార్చివైచి ప్రకటించినది[378].

**ఏదుట్ల శేషాచలము** : ఇతని కృతి జగన్నాటకము. అముద్రితము. శ్రీరామస్వామికి అంకితము. దైవాంకితము. కాలము తెలియదు. 1875 వ సంవత్సరము కంటె పూర్వము కావచ్చును.

జగన్నాటకము భరతశాస్త్ర, అధ్యాత్మశాస్త్రములు సమ్మిళితమైన విలక్షణకృతి. అంతే కాదు. ప్రభోదచంద్రోదయమునకు మానసపుత్రిక. ప్రథమాశ్వాసవిషయానుక్రమణిక [379]:

> "సత్త్వరూపుడైన పరబ్రహ్మయందు జీవప్రకృత్యాదిజననంబును,
> నతండు వినోదార్థంబుగా భరతశాస్త్రానురూపాధ్యాత్మవిద్యానుసారంబుగా
> ప్రపంచనాటకం బారంభించుటయు తద్భరతంబునందు త్రివిధాండంబులు
> బుట్టి వికసించిన తద్భూతత్రిశక్తిమూర్తు లన్యోన్యపరిగ్రహసామర్థ్యంబున
> నాట్యసామాజికసంపత్తి నా పరబ్రహ్మనిదేశంబున నిరూపితులై నిలుచుటయు
> తత్పరమేశ్వరుండు సభాసదనంబు గల్పించి పేరోలగంబు (న్న) సమయంబున
> మార్దంగికాదిసామాజికజనంబు నతనిం బ్రశంసించుటయు బుద్ధివిదూషకుండు
> మనసూత్రధారి యనుమతంబున విప్రమాతృకాగమనసూచనంబు సేయుటయు"

**పరశురామపంతుల అనంతరామయ్య** : ఇతని కృతి హనుమద్విజయము. అసమగ్రముగ లభించినది. అముద్రితము. ఇతని కాలము "1830 ప్రాంతము." అని కలదు[380]. ఆధారము లేదు. కాని, పరశురామపంతుల లింగమూర్తి వంశీయులలో ఒక అనంతరామయ్య కలడు[381]. అతడే ఇతడైన, కాలము 1860 ప్రాంతమగును. లింగమూర్తి కి, అనంతరామయ్యకు నడుమ నాలుగు తరములు కలవు[382].లింగమూర్తి రతిమన్మథ విలాసము రచనాకాలము 1760 వ సంవత్సరమని పూర్వోక్తము. తరమునకు పాతిక సంవత్సరములు పరిగణించు పద్ధతియును కలదు. కాఁబట్టి హనుమద్విజయము రచనాకాలము 1860 ప్రాంతమగును. అతడే ఇతడగునో కాడో ఇంకను పరిశోధ నీయము.

**వలంతిఘలు అప్పలాచార్యులు** : ఇతని కృతి ధరాసాగరేశ్వరచరిత్రము. అముద్రి తము. ఇతడు " 100 సం॥లు క్రింద "టివాడని కలదు[383]. అనగా 1934-100=1834 క్రిందట. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**అర్చకం అయ్యమాచార్యులు** : ఇతని కృతులు 1. చెన్నకేశవవిలాసము. పెద్దమం దడిలోని చెన్నకేశవస్వామికి సంబంధించినది. అముద్రితము. 2. చెన్నకేశవశతకము. గద్వాలలోని చెన్నకేశవస్వామికి సంబంధించినది. 3. రామేశ్వరవిజయము. ఇతడు " 100 సం॥లు క్రింద"టి వాడని కలదు[384]. అనగా 1934-100=1834 క్రిందట. "1820 ప్రాంతము" అని కూడా కలదు[385]. రెండింటికిని ఆధారములు లేవు. ఊహామాత్రశరణ్య ములు.

**తడకమళ్ల కృష్ణారావు** : ఇతని కృతులు 1. కంబుకంధరచరిత్రము. 2. రామావతార కాలనిర్ణయము 3. చిత్రకథావివరణము. 4. లీలావతీగణితము- ఇతని కాలము "1850"అని కలదు[386]. ఆధారము లేదు. అంతేకాదు. రామావతారకాల నిర్ణయము గత శతాబ్దిగ్రంథము వలె లేదు. ఇంకను పరిశోధనీయము.

**చిత్తారుగంగాధరము** : ఇతని కృతులు 1. కొలిపాకమాహాత్మ్యము (ద్విపద కావ్యము) 2. శృంగారభల్లాణచరిత్రము. 3. శృంగారసిరియాళచరిత్రము. 4. శుకసప్తతి (వచన కావ్యము). ఇతని కాలము "1823 ప్రాంతము"అని కలదు[387]. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

భల్లాణచరిత్రము శృంగారవిశేషము కలది. సిరియాళచరిత్రము భక్తివిశేషము కలది. అయినను సిరియాళచరిత్రమును శృంగారవిశిష్టము చేయుట విశేషము.

**కందావజ్ఝల గోపాలకృష్ణయ్య** : ఇతని కృతి కృష్ణజన్మఖండము. అముద్రితము. ఇతడు "120 సం॥లు క్రింద"టి వాడని కలదు[388]. అనగా 1934-120=1814 క్రిందట. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**చెన్న కృష్ణయ్య** : ఇతని కృతి యాదవభారతీయము. ద్వ్యర్థికావ్యము. అముద్రితము ఇతడు "200 సం॥లు క్రింద"టివాడని కలదు[389]. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

**నెల్లుట్ల నారాయణ** : ఇతని కృతి వజ్రాభ్యుదయము. రెండాశ్వాసములు మాత్రము ప్రకటితము. ఇతని కాలము "1600 ప్రాంతము" అని కలదు[390]. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**ఫణికుండలుడు** : ఇతని కృతి సీమంతినీకల్యాణము. ఇతడు "80సం॥లు క్రింద"టివాడని కలదు[391]. అనగా 1934-80=1864. ఆధారము లేదు. ఊహామాత్ర శరణ్యము.

**మఠం మడివ్యాళయ్య** : ఇతని కృతి శారదరామాయణము. అముద్రితము. ఇతడు "150 సం॥లు క్రింద"టి వాడని కలదు[392]. అనగా 1934-150=1784 క్రిందట. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**చెన్నూరి రామన్న** : ఇతని కృతి రామాయణము. ఇతడు "100 సం॥లు క్రింద' 'టివాడని కలదు[393]. అనగా 1934-100=1834 క్రిందట. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**శ్రీనాథుని వేంకటరామయ్య** : ఇతని కృతి శ్రీరామపట్టాభిషేకము ఉరపు అశ్వారాయచరిత్రము. ఇతని కాలము "1700 ప్రాంతము." అని కలదు[394]. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**ముడుంబ వేంకటాచార్యులు** : ఇతని కృతులు. 1. దేవహూతిచరిత్రము. అముద్రితము. 2. రసదీపిక. ఇతని కాలము. "1700ప్రాంతము" అని కలదు[395]. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**వాడాల శేషాచార్యులు** : ఇతని కృతి మైథిలీపరిణయము. అముద్రితము. ఇతడు "100-120 సం॥లు క్రింద"టి వాడని కలదు[396]. అనగా 1934-100=1834, 1934-120=1814 క్రిందట. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**వాత్స్య శ్రీరంగాచార్యులు** : ఇతని కృతి శాల్మలీకందనందనవిలాసము. ఇతడు "200 సం॥లు క్రింద"టి వాడని కలదు[397]. అనగా 1934-200=1734 క్రిందట. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

**రేమెల వేంకటరాయడు** : ఇతని కృతి ఉత్తరాపరిణయము. అముద్రితము. ఇతడు "1820 ప్రాంతమున జన్మించెను." అని కలదు[398]. ఆధారము లేదు.

**కార్మంచి సుబ్బారాయనాయుడు** : ఇతని కృతి దశావతారచరిత్రసంగ్రహము. "1861 వ సంవత్సరమునందు ముద్రితమైనదట" అని కలదు[399]. దుర్లభము. రచనా కాలము తెలియదు.

**రాజవేలు సుబ్బరాయడు** : ఇతని కృతులు 1. చిత్రాంగదాపరిణయము. 2. గరుడాంజనేయవాగ్వాదము. 3. సుదంతావివాహము. ద్విపదకావ్యము. 4. కృష్ణార్జున సంవాదము. 5. జయవిజయాభ్యుదయము. ఇందు అయిదవది మాత్రమే ఉపలబ్ధము. అది కూడ అముద్రితము. తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితము. దైవాంకితము.

> "ఘనుఁ డా పింగళిసూరనాఖ్యకవిలోకశ్రేష్ఠుఁ డెంతో రహి
> న్మను జెప్పె న్విదితాంధ్రభాషను గళాపూర్ణోదయగ్రంథము
> న్వనవీథిన్ గజబృందము ల్చనిన త్రోవం జీమ లిచ్చారతిం
> జను నేతద్గతి నేనొనర్తుఁ గృతి శేషాద్రీశు కారుణ్యతన్"

అని అతని అభిప్రాయము. "కథాకల్పనమునందును నామముల నుంచుటలోను గళాపూర్ణోదయము ననుకరించినాఁడు. కాని కవితాచాతుర్యముననను నితివృత్తకల్పనము లోను నీతని కావ్యము పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయమునకు సరిరాదు." అని ఒకరి అభిప్రాయము[400].

# సంఖ్యాసూచిక

1. A History of South India 1984. pp 298-300
2. Ibid. pp. 300-301.
3. Ibid. p. 302.
4. Ibid
5. Ibid. pp. 303-305
6. తెలుగు విజ్ఞానసర్వస్వము. మూడవ సంపుటము. 1959. పుట 429.
7. పైది. పుట 430.
8. పైది. పుట 431.
9. పైది. పుట 432.
10. ఆంధ్రసంస్థానములు - సాహిత్యపోషణము. 1987.
11. ఆఱు వలె. పుట 432.
12. పైది. పుట 434.
13. పైది.
14. పైది. పుట 435.
15. పైది. పుట 451.
16. శాసనపద్యమంజరి. ప్రథమభాగము. 1930. పుటలు 108-110.
17. తెలుగు సాహిత్యచరిత్ర. ద్వితీయభాగము. 1992. పుటలు 164-165.
18. కకుత్స్థవిజయము. 1980. పీఠిక. పుటలు 49-50.
19. క్షేత్రయ్య పదములు. 1950 పీఠిక పుట 8.
20. పైది. పుటలు 18-19.
21. పైది. పుటలు 21-24.
22. పైది. పుట 4.
23. పైది. పుటలు 4,5 నడుమ ఛాయాచిత్రము.
24. పైది. పుట 8.
25. తెలుఁగు వాఙ్మయము - సంగ్రహచరిత్ర. 1960. పుట 102.
26. పందొమ్మిది వలె.
27. క్షేత్రయ్య వర్ధంతి సంచిక. Extracts from letters written in 1950. p. II.
28. పందొమ్మిది వలె. పుట 59.
29. పైది. పుటలు 24, 25.
30. పైది. పుటలు 221-260.
31. పైది. పుటలు 69-70.

32. పైది. పుటలు 12-13.
33. ఆంధ్రకవితరంగిణి. పదకొండవ సంపుటము. 1954. పుట 157.
34. పైది. పుట 158.
35. పైది. పుటలు 135, 136.
36. పైది. పుట 147.
37. నాథయోగి మన వేమన 1987. పుటలు 140-141, 152, 193-194.
38. పైది. పుటలు 201-241.
39. ముప్పది మూడు వలె. పదకొండవ సంపుటము. 1954. పుట 147.
40. పైది. పుటలు 138-139.
41. ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర. 1961. ద్వితీయభాగము. పుట 13.
42. చాటుపద్యమణిమంజరి. ద్వితీయభాగము. 1952. పుట. 127.
43. పైది.
44. శతకత్రయము. 1983. పీఠిక. పుట 9.
45. సమీరకుమారవిజయము. 1929. ఉపోద్ఘాతము. పుటలు 12-15.
46. సమగ్ర ఆంధ్రసాహిత్యం. పదవసంపుటం 1966. పుటలు 157-158.
47. పూర్వగాథాలహరి. 1971. పుట 3.
48. పైది. పుటలు 495-496.
49. ముప్పది మూడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 63.
50. పైది
51. నలుబది యాఱు వలె. పుట 159.
52. ముప్పది మూడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 63.
53. నలుబదియాఱు వలె. పుట 160.
54. నలుబది నాలుగు వలె. పీఠిక. పుట 4.
55. ఆఱు వలె. పుట 430.
56. పైది.
57. దశావతారచరిత్రము. 1926. పీఠిక. పుట 3.
58. శతకకవుల చరిత్రము. 1924. పుటలు 218-219.
59. ఆంధ్రవాగ్గేయకారచరిత్రము. ద్వితీయముద్రణము. 1975. పుట 200.
60. పైది.
61. పైది. పుట 199.
62. ముప్పది యేడు వలె. పుట 140.
63. ఆంధ్రకౌముది. 1935. గ్రంథప్రశంస. పుట 1.
64. ముప్పది మూడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుటలు 241, 292.

65. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. సాహిత్యలక్షణచిత్రకవిత్వాను శీలనము. పి.హెచ్.డి. థీసిస్. లిఖితప్రతి. ఢిల్లీ విశ్వవిద్యాలయము.
66. పిఠాపురసంస్థానము - కవిపండితపోషణ. 1973. పుట 25.
67. పైది. పుట 29.
68. పైది. పుట 28.
69. పది వలె. పుట 273.
70. లలితవాగ్ధుర్యుడు - లక్ష్మణకవివర్యుడు. 1989. పుటలు 82-85.
71. క. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము. 24. సంచిక 4. పుటలు 225-228.
    చ. చిన్నయసూరి జీవితము. 1968. పుట 100.
72. బాలవ్యాకరణము. 1940. పీఠిక పుట 1.
73. కవిత్వతత్త్వవిచారము. 1947. పుట 195.
74. నీతిచంద్రిక. 1932. ప్రస్తావన. పుట 16.
75. ముప్పది మూఁడు వలె - తొమ్మిదవ సంపుటము. 1952. పుటలు. 176-177.
76. పదియేడు వలె. తృతీయభాగము. 1994. పుటలు 175, 178.
77. ముప్పది మూఁడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 156.
78. పైది. పుట 160.
79. పైది.
80. పదియేడు వలె. ద్వితీయభాగము. 1992. పుటలు 164-165.
81. నలుబది యాఱు వలె. పుట. 18.
82. నలుబది యొకటి వలె. పుట 14.
83. పదియేడు వలె. తృతీయభాగము. 1994. పుట 486.
84. ద్విపదభారతము. 1943. పీఠిక. పుట 8.
85. ముప్పది మూఁడు వలె. పదమూఁడవ సంపుటము. 1969. పుట 14.
86. పదియేడు వలె. తృతీయభాగము. 1994. పుట 460.
87. ముప్పది మూఁడువలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 86.
88. As 1. p. 298.
89. ముప్పది మూఁడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 100.
90. పైది. తొమ్మిదవ సంపుటము. 1952 పుట 60.
91. పైది. పుట 70.
92. పైది పదకొండవ సంపుటము. 1954. పుట 216.
93. పైది. తొమ్మిదవ సంపుటము. 1952. పుట 239.
94. పైది.

95. వెలుగోటి వారి వంశావళి. 1938. Introduction. pp. 51-60.
96. ముప్పది మూడు వలె. పదకొండవ సంపుటము. 1954 పుటలు 132-134.
97. చరిత్ర కెక్కని చరితార్థులు. 1985. పుటలు 105-111.
98. ముప్పది మూఁడు వలె. ఎనిమిదవ సంపుటము. 1972. పుట 97.
99. అఱు వలె. పుట 415.
100. Raghunathanayakabhyudayamu and Raghunadhabhyudayamu. 1951. Introduction. p. 28.
101. ముప్పది మూఁడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 91.
102. పదియేడు వలె. తృతీయభాగము. 1994. పుట 303.
103. రాజవాహనవిజయము. 1937. పీఠిక. పుట 14.
104. ముప్పది మూఁడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 13.
105. విష్ణుమాయావిలాసము. 1970. పీఠిక. పుట 13.
106. పైది.
107. Antiquariam Remains in Madras Precidency. d. II. p. 183.
108. పదియేడు వలె. తృతీయభాగము. పుట 479.
109. ముప్పది మూఁడు వలె. పంద్రెండవ సంపుటము. 1958. పుట 163.
110. పైది. పుట 170.
111. చారుచంద్రోదయము. 1987. ప్రథమప్రకరణము. పుటలు 14-15.
112. ధనాభిరామము. 1950. పీఠిక పుటలు 4-6.
113. విశాఖపట్నం జిల్లా వృత్తాంతసంగ్రహము. 1869. పుట 501.
114. తొంబదియేడు వలె. పుట 26.
115. ముప్పది మూఁడు వలె. పదునాల్గవ సంపుటము. 1971. పుటలు 185-188.
116. పైది. పదకొండవ సంపుటము. 1954. పుటలు 221-222.
117. సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయసంపుటము. 1961. పుటలు 354-365.
118. మధురవాణీవిలాసము. 1995. అధ్యయనము. పుటలు 61-89.
119. పైది పుట 97-101.
120. పైది. పుటలు 207-210.
121. మరుగుపడిన మాణిక్యాలు. 1961. పుట 102.
122. ముప్పది యేడు వలె. పుటలు 42-44.
123. పదియేడు వలె. ద్వితీయభాగము. 1992. పుట 180.
124. పైది. తృతీయభాగము. 1994. పుట 263.
125. పైది. చతుర్థభాగము. 1996. పుట 16.
126. ముప్పది మూడు వలె. తొమ్మిదవ సంపుటము. 1952. పుట 251.

127. శ్రీవాసవీకన్యకాసాహిత్యపరిశీలనము. పి.హెచ్.డి. థీసిస్. టైపు ప్రతి. ఆంధ్రవిశ్వకళాపరిషత్. పుటలు 12-40.
128. As 1 p. 353.
129. Ibid. p. 355.
130. Ibid. p. 357.
131. ఆఱు వలె. పుటలు 202, 208, 211.
132. శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక. 1922. పుట 148.
133. పైది.
134. భారతి. ఫిబ్రవరి, 1983. పుట 45.
135. పైది. జూన్, 1983. పుటలు 65-69.
136. Indian Ephimeris.
137. భారతి. 1945 పార్థివ, మాఘము. పుట 114.
138. A Discriptive Catalogue of the Telugu Manuscripts in the Tanjore Maharaja Sorfoji's Saraswati Mahal Library. 1933. p. 41.
139. Ibid. p. 240.
140. ముప్పది మూడు వలె. ఎనిమిదవ సంపుటము. 1972. పుటలు 186-187.
141. పైది. పుట 185.
142. పది వలె. పుట 316.
143. అరువది యాఱు వలె. పుటలు 54-58.
144. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుటలు 6-7.
145. పండితారాధ్యచరిత్ర. 1939. పీఠిక. పుటలు 140-141.
146. తొంబది యేడు వలె. పుటలు 260-263.
147. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుటలు 2-4.
148. ముప్పది మూడు వలె. పండ్రెండవ సంపుటము. 1958. పుట 216.
149. అనర్ఘరాఘవము. 1977. ఉన్మేషము. పుట 16.
150. ముకుందవిలాసము. 1985. ఆముఖం. పుట 2.
151. పైది.
152. పది వలె. పుట 119.
153. పైది. పుట 120.
154. పైది. పుట 124.
155. సాహిత్యసంపద. 1989. పుటలు 238-241.
156. ఆంధ్రకవుల చరిత్రము. తృతీయభాగము. 1899. పుట 285.
157. ముప్పది మూడు వలె. పదకొండవ సంపుటము. 1954. పుట 190.

158. పైది. పదమూడవ సంపుటము. 1968. పుటలు 21-22.
159. పైది. పంద్రెండవ సంపుటము. 1958. పుట 250.
160. పైది.
161. పదియేడు వలె. తృతీయభాగము. 1994. పుట 9.
162. పది వలె. పుట 414.
163. పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం రచనలు పరిశీలన. 1983. పుటలు 8-16.
164. పైది. 16,17 పుటలు మధ్య.
165. పైది. పుట 18.
166. కృష్ణరాయవిజయము. 1981. ఉపోద్ఘాతము. పుటలు XVii -XViii.
167. పైది. పుటలు XX - XXi.
168. పదియేడు వలె. తృతీయభాగము. 1994. పుటలు 486-488.
169. అహోబలపండితీయము. 1965. ఉపక్రమణిక. పుటలు 29-30.
170. ముప్పది మూడు వలె. పదమూడవ సంపుటము. 1969. పుటలు 140-141.
171. పది వలె. పుటలు 265-66.
172. చంద్రరేఖావిలాపం. తొలి వికటప్రబంధం. 1990. పుటలు 72, 83.
173. ఒడియా సాహిత్యచరిత్ర. 1980. పుట 19.
174. పైది.
175. గోలకొండ కవుల సంచిక. 1935. పూర్వకవిపరిచయము. పుట 414.
176. ఏబది యెనిమిది వలె. పుట 273.
177. రుక్మిణీపరిణయము. ప్రథమముద్రణము.
178. అడిదము సూరకవి లఘుకృతులు. 1988. పుటలు 9-10.
179. పైది. పుటలు 93-95.
180. రుక్మవతీపరిణయము. 1940. పీఠిక. పుట 11.
181. యాజ్ఞవల్క్యచరిత్రము. 1955. గ్రంథపరిచయము. పుటలు 7-8.
182. పది వలె. పుట 179.
183. ముప్పది మూడు వలె. పదమూడవ సంపుటము. 1969. పుటలు 57-58.
184. నూట యేబది యాఱు వలె. పుట 115.
185. పది వలె. పుట 458.
186. పైది. పుట 96.
187. పైది. పుట 438.
188. ముప్పది మూడు వలె. పదునాల్గవ సంపుటము. 1971. పుట 112.
189. పది వలె. పుట 301.
190. పైది. పుట 456.

191. పైది.
192. నూట అయిదు వలె. పీఠిక. పుటలు 24-27.
193. పది వలె. పుట 517.
194. పైది. పుట 118.
195. పైది. పుట 35.
196. తొంబది యేడు వలె. పుట 2.
197. పది వలె. పుట 517.
198. పైది. పుట 514.
199. తొంబది యేడు వలె. పుట 2.
200. పైది.
201. పద్మినీపరిణయము. 1913. ఉపోద్ఘాతము. పుట 2.
202. పైది. పుటలు 2-3.
203. పైది. పుటలు 16-17, 22-35.
204. ఏబది యెనిమిది వలె. పుట 200.
205. పది వలె. పుట 145.
206. ముప్పది మూడు వలె. పదునాల్గవ సంపుటము. 1971. పుట 165.
207. పైది. పుట 64.
208. రాధామాధవసమాగమము. తొలిపలుకు. పుట 96. Bulletin of the Madras Government Oriental Manuscripts Library Madras. Volume XXi. 1976.
209. నూట యేబది యాఱు వలె. పుట 474.
210. పది వలె. పుటలు 191,192.
211. బొబ్బిలియుద్ధకథ - 1956. పీఠిక. పుట 50.
212. తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము. 1986. పుటలు 42-45.
213. ముప్పది మూడు వలె. పదునాలుగవ సంపుటము. 1971. పుటలు 142-144.
214. పైది పుట. 133.
215. పైది పుట. 187.
216. నలుబది రెండు వలె. పుట 108.
217. విజ్ఞానసర్వస్వము. తెలుగు సంస్కృతి. 1988. పుట 365.
218. నూట యేబది యాఱు వలె. పుట 540.
219. పది వలె. పుట 88.
220. మూర్తిత్రయోపాఖ్యానము. 1981. పీఠిక. పుటలు 15-17.
221. పదియేడు వలె. తృతీయభాగము 1994. పుట 463.
222. పైది.

223. పది వలె. పుట 158.
224. పదియేడు వలె. పుట 101.
225. As 1. p. 124.
226. వల్లభాభ్యుదయము. 1940. పీఠిక. పుట 13.
227. ఆఱు వలె. పుట 250.
228. పైది. పుట 254.
229. పైది. పుట 265.
230. పైది. పుట 266.
231. పైది. పుట 201.
232. పైది. పుట 202.
233. South Indian Inscriptions Volume - IV
234. రెండు వందల పండ్రెండు వలె. పుట 34.
235. ఆఱు వలె. పుటలు 443, 449.
236. విజయనందనవిలాసము. 1919. పీఠిక. పుట 1.
237. రెండు వందల పండ్రెండు వలె. పుట 44.
238. శ్రీమహాలక్ష్మీపరిణయము. 1917. వడ్డిపర్తి కోనకవి చరిత్రము. పుట 1.
239. పైది. పుట 2.
240. శకుంతలాపరిణయము. 1900. పీఠిక. పుటలు iii-iv
241. పది వలె. పుట 163.
242. నూట యేబది యాఱు వలె. పుటలు 526-527.
243. ముప్పది మూడు వలె. పదునాలుగవ సంపుటము. పుటలు 130-131.
244. నలుబదియాఱు వలె. పండ్రెండవసంపుటము. పుట 321.
245. పది వలె. పుట 498.
246. ముప్పది మూడు వలె. ఎనిమిదవ సంపుటము. 1972. పుట 171.
247. నూట యేబది యాఱు వలె. పుట
248. పది వలె. పుట 441.
249. ఆంధ్రవిదుషీమణులు. 1995. పుట 431.
250. పైది. పుట 430.
251. పైది. పుట 431.
252. పైది. పుటలు 432-440.
253. పైది. పుటలు 440-444.
254. పైది. పుట 440.
255. పైది. పుట 377.

256. పైది.
257. పైది. పుట 381.
258. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుటలు 112-113.
259. రెండు వందల పంద్రెండు వలె. పుటలు 384-387.
260. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుట 113.
261. రెండు వందల పంద్రెండు వలె. పుటలు 388-391.
262. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుటలు 114-115.
263. రెండు వందల పంద్రెండు వలె. పుటలు 393-406.
264. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుటలు 115-116.
265. రెండు వందల పంద్రెండు వలె. పుటలు 406-408.
266. పది వలె. పుట 143.
267. నూట యేబది యాఱు వలె. పుట 344.
268. త్రివిద్యానగరము. 1988. పుటలు 5-7 ప. 15-26.
269. పది వలె. పుట 174.
270. నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?! పుటలు 63-64; 208-310.
271. కృష్ణామాహాత్మ్యము. 1917. పీఠిక. పుట 1.
272. పది వలె. పుట 299.
273. దిలీపచరిత్రము. 1902. పీఠిక. పుటలు 1-3.
274. పైది. పుట 2.
275. ప్రద్యుమ్నచరిత్రము. 1974. పరిచయము. పుట Xiii.
276. ముప్పది మూడు వలె. పదునాల్గవ సంపుటము. 1971. పుట 105.
277. పద్మనాభయుద్ధము. 1930. అవతారిక. పుటలు 15,17.
278. పది వలె. పుటలు 407-408.
279. రెండు వందల పంద్రెండు వలె. పుటలు 77-84.
280. పది వలె. పుటలు 407-408.
281. వేంకటేశ్వరవిలాసము. 1900. పీఠిక. పుట ii.
282. పద పలె. పుట 299.
283. పైది. పుటలు 86, 88, 89.
284. ఆఱు వలె. పుట 437.
285. నూట యేబది యాఱు వలె. పుట 600.
286. పైది. పుట 601.
287. పైది. పుట 606.
288. కాశీయాత్రచరిత్ర. 1991. అంతర్ముఖపత్రము నకలు; పుటలు 1, 368.

289. నూట యేబది యాఱు వలె. పుట 599.
290. పది వలె. పుట 201.
291. పైది. పుట 335.
292. పైది. పుట 309.
293. పైది. పుట 308.
294. నూట యేబది యాఱు వలె. పుట 602.
295. సర్వకామదాపరిణయము. 1925. ఉపోద్ఘాతము. పుట 2.
296. నూట యేబది యాఱు వలె. పుట 603.
297. పైది. పుట 610.
298. ముప్పది మూడు వలె. పదకొండవ సంపుటము. 1971. పుట 87.
299. భద్రాపరిణయము. 1912. ఉపోద్ఘాతము. పుటలు 24-25.
300. పది వలె. పుట 327.
301. హితసూచని. 1986. ప్రవేశిక. పుటలు iii, Xiii - XiV.
302. నలుబది యొకటి వలె. ద్వితీయభాగము. పుటలు 127-128.
303. పైది. పుట 456
304. పైది. పుట 236.
305. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సం. 22. సం. 23; సం 23- సం. 6; సం. 29 సం. 2-6.
306. పది వలె. పుట 323.
307. నూట యేబది యాఱు వలె. పుట 605.
308. గోపీనాథవెంకటకవి - వెంకటగిరిసంస్థానపు ఇతరకవులు పి.హెచ్.డి. థీసిస్. టైపుప్రతి. ఉస్మానియావిశ్వవిద్యాలయము. 1970. పుట 186.
309. పైది. పుట 184.
310. పైది. పుట 224.
311. పైది. పుట 183.
312. గోపీనాథరామాయణము. 1987. పీఠిక. పుటలు iXiX - iXVV.
313. పైది. పుటలు iXXVi - iXXVii.
314. రంగనాథరామాయణము. 1957. పీఠిక. పుటలు 17-36.
315. నూట యేబది యైదు వలె. పుటలు 106-130.
316. మూడు వందల యెనిమిది వలె. పుటలు 267-279.
317. పంక్తిరథోపాఖ్యానము. 1957. ఉపోద్ఘాతము. పుటలు 1-2.
318. తొంబది యేడు వలె. పుటలు 133-143.
319. చెన్నపురీవిలాసము. 1941. పీఠిక. పుట 1.
320. పైది. పుట 2.

321. పది వలె. పుట 88.
322. పైది. పుటలు 422-423.
323. ఆంధ్రతులసీరామాయణము. 1984. పరిచయం పుట X.
324. రెండు వందల తొంబది యైదు వలె. ఉపోద్ఘాతము. పుట 5.
325. మూడు వందల యిరువది మూడు వలె. పరిచయం. పుటలు Xi - Xii.
326. నూట యేబది యాఱు వలె. పుట 606.
327. ద్విపదసాహిత్యచరిత్ర. 1979. పీఠిక. పుట 16.
328. ఆఱు వలె. పుట 430.
329. తాలాంకనందినీపరిణయము. 1980. పీఠిక. పుట 16.
330. పైది. పుట 17.
331. నూట యేబది యాఱు వలె. పుట 413.
332. పైది. పుటలు 504-505.
333. పైది. పుటలు 506-508.
334. పైది.
335. శతకంఠరామాయణము. 1954. పీఠిక. పుట 1.
336. పైది.
337. An Alphabetical Index of Telugu Manuscripts in the Government oriental Nanuscripts leibrary, Madras 1932. p. 147.
338. నూట యేబది యాఱు వలె. పుటలు 505-506.
339. ఆంధ్రవాఙ్మయసూచిక. 1929. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారము. పుట ౧.
340. నూట యేబది యాఱు వలె. పుట 510.
341. పైది. పుట 464.
342. పైది. పుట 518.
343. పైది.
344. పైది. పుట 519.
345. పైది.
346. పైది. పుట 520.
347. పైది. పుట 495.
348. పైది. పుట 568.
349. పైది. పుట 496.
350. ముప్పది మూడు వలె. పదునాలుగవ సంపుటము. 1971. పుటలు 52-54.
351. నూట యేబది యాఱు వలె. పుట 341.
352. పైది. పుట 536.

